# విష్ణుమాయా విలాస కావ్యాలు
# కావ్యానుశీలన

డా. పట్టపు శివకుమార్

శ్రీ శాంతి ప్రచురణలు

డిసెంబరు - 2017

VISHNU MAYA VILASA KAVYALU - KAVYANUSEELANA
by Dr. P. Sivakumar

**విష్ణుమాయా విలాస కావ్యాలు కావ్యానుశీలన**

డా. పట్టపు శివకుమార్

First Edition : December, 2017

Copies : 500

Price : 110/-



For Copies : Sri Santhi Publishers
Dr. Pattapu. Sivakumar,
S/o Srinivasulu,
Narasapuram (Village & Post),
Indukurupeta (Mandalam),
SPSR NELLORE (District),
Andhra Pradesh - 524313

ISBN: 978-93-5291-559-2

## కృతజ్ఞతలు

నా చదువులోను, అందుకున్న ప్రతివిజయంలోను వెన్నుదన్నుగా ఉన్న అమ్మానాన్నలకు కృతజ్ఞతలు చెప్పుకునే అవకాశం కలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను. గ్రంథ రచనలో పాటించవలసిన విషయాల పట్ల అవగాహన తోపాటుగా ఎన్నో విలువైన సూచనలు అందించిన ఆచార్య నడుపల్లి శ్రీరామరాజు గారికి, విష్ణుమాయా విలాసకావ్యాలను నాకు అందించినవారు కీ॥శే॥ వజ్ఝల వేంకట సుబ్రహ్మణ్యశర్మగారికి నా కృతజ్ఞతలు. ఈ గ్రంథ రచనకు ఎంతగానో సహకరించిన నా శ్రీమతి శాంతికుమారికి ప్రత్యేకమైన కృతజ్ఞతలు. చివరగా ఈ రచనలో నాకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారు ఎందరో మహానుభావులు. అందరికి పేరు పేరునా కృతజ్ఞతలు తెలుపుతూ ...

మీ

**పట్టపు శివకుమార్**

## ప్రస్తావన

తెలుగు సాహిత్యంలో ప్రబంధ రచనాకాలం స్వర్ణయుగంగా ప్రసిద్ధమైంది. ఆ ప్రబంధాల ప్రభావంతో దక్షిణాంధ్రయుగపు సాహిత్యం వైవిధ్యభరితంగా వెలసింది. దక్షిణాంధ్రయుగపు సాహిత్యలోని యక్షగానం, ద్విపద, ఉదాహరణకావ్యం మొదలైన వాటిపై ప్రబంధాల ప్రభావం ఉన్నదని వాటిలోని ప్రబంధ రచనాశైలి వెల్లడిస్తుంది. ప్రబంధాలలో తర్వాత కాలపు కవులు అనుసరించిన గ్రంథంగా చింతలపూడి ఎల్లనార్యుని 'విష్ణుమాయా నాటకము' పేర్కొనదగినది. ఎల్లనార్యుడు తన రచనను నాటకమని పేర్కొనడం ఒక విశేషమైతే, దీన్ని అనుసరించి ఆ సమీపకాలంలోనే ఒక యక్షగానం, ద్విపద ప్రబంధం, మరో రెండు చంపూ ప్రబంధాలు వెలువడటం మరొక విశేషంగా చెప్పుకోవచ్చు.

ఈ విష్ణుమాయా విలాసాలన్నీ వేటికవే ప్రత్యేకమైనవి. అయినప్పటికీ ఇతివృత్తి సంబంధమైన ఏకీభావం వీటన్నింటిలోనూ కనిపిస్తున్నది. ఎల్లన 'విష్ణుమాయా నాటకము'లోని శివదర్పభంగం కథ ఆధారంగా కంకంటి పాపరాజు 'విష్ణుమాయా విలాసము' అనే పేరుతో యక్షగానం రచించాడు. ఆ తర్వాత ఎల్లన కావ్యాన్ని అనుసరించే కంకంటి నారసింహకవి 'విష్ణుమాయా విలాసము' అనే పేరుతో ద్విపద ప్రబంధం రచించాడు. శివదర్పభంగం కథనే గ్రహించి రోసనూరి వేంకటపతి 'శ్రీవిష్ణుమాయా విలాసము' అనే పేరుతో చంపూప్రబంధం రచించాడు. ఎల్లనకావ్యాన్ని అనుసరించి, భాగవతకథ ఆధారంగా ఎఱగుడిపాటి వేంకటకవి 'విష్ణుమాయా విలాసము' అనే చంపూ ప్రబంధాన్ని రచించాడు. విష్ణుమాయా మహిమలను వర్ణించే ఈ ఐదు కావ్యాలు, 'విష్ణుమాయా విలాస కావ్యములు – కావ్యానుశీలనము' అనే ఈ గ్రంథంలో పరామర్శించబడతాయి.



# విషయసూచిక





# 1. విష్ణుమాయా విలాసకావ్యాలు - పరిచయం

తెలుగు సాహిత్యంలో విష్ణుమాయా విలాసమనే పేరుతో ఐదుకావ్యాలు కనిపిస్తున్నాయి. ఈ ఐదు కావ్యాలకు నామసామ్యం తోపాటు కొంత ఇతివృత్తసామ్యం కూడా ఉంది. ఈ విష్ణుమాయా విలాసకావ్యాలలో మొదటిది, మిగతా కావ్యాలకు మార్గదర్శకమైనది చింతలపూడి ఎల్లనార్యుని (క్రీ.శ.1500-1560) 'విష్ణుమాయా నాటకము' అనే ప్రబంధం. దీనిని అనుసరించే తర్వాత కాలంలో కంకంటి పాపరాజు (క్రీ.శ.1575-1632) 'విష్ణుమాయా విలాసము' అనే యక్షగానం, కంకంటి నారసింహకవి (క్రీ.శ 17వ శతాబ్దం) 'విష్ణుమాయా విలాసము' అనే (ద్విపద) ప్రబంధం, రోసనూరి వేంకటపతి (క్రీ.శ.1700-1760) 'శ్రీ విష్ణుమాయా విలాసము' అనే ప్రబంధం, ఎఱగుడిపాటి వేంకటకవి (క్రీ.శ1750) 'విష్ణుమాయా విలాసము' అనే ప్రబంధం రచించారు. చింతలపూడి ఎల్లనార్యుని కావ్యాన్ని పరిశీలించే ముందుగా ప్రబంధం, దాని నేపథ్యం, లక్షణాలు, ఆధునిక పండిత విమర్శకుల అభిప్రాయాలు మొదలైన అంశాలను గురించిన పరామర్శ ఇందులో చేయబడుంది.

## 1.1. ప్రబంధం

ప్రాచీన ఆలంకారికులు కావ్యాన్ని నిబద్ధం, అనిబద్ధం అని రెండు రకాలుగా పేర్కొన్నారు. 'కథాకూర్పు' కలిగినది నిబద్ధకావ్యం. కథారహితమైనది అనిబద్ధకావ్యం. ఇతిహాసం, పురాణం, ప్రబంధం మొదలైనవి నిబద్ధకావ్యాలు. శతకం, దండకం, చాటువులు మొదలైనవి అనిబద్ధకావ్యాలు. 'ప్రకృష్టమైన బంధము కలిగినది ప్రబంధం' అని పింగళి లక్ష్మీకాంతం గారు పేర్కొన్నారు. (లక్ష్మీకాంతం, పింగళి. 2005.371) ప్రకృష్టం అనే మాటకు 'అతిశయం', 'మేలు' అనే అర్థాలు నిఘంటువులో కనిపిస్తున్నాయి. (సీతారామాచార్యులు, బహుజనపల్లి, 2010.634) బంధం అంటే 'కూర్పు' లేదా 'నిర్మాణము' అనే అర్థాలు ఉన్నాయి. ప్రబంధం అంటే మేలైన లేదా శ్రేష్ఠమైన కూర్పు కలిగినదని చెప్పుకోవచ్చు. ప్రబంధాలపై మొదటగా పరిశోధన చేసిన కె.వి.ఆర్. నరసింహం గారు "కథైక్యమును నష్టాదశ వర్ణనలును గలిగి, శృంగారరస ప్రధానమై యర్థాతిశాయియైన శబ్దమును గ్రహించి, యాలంకారిక సాంకేతికములకు విధేయమై యనతి విస్తృతి గల యితివృత్తములతో భాషాంకరీకరణము గాక స్వతంత్ర రచనయేయైన తెలుగు కావ్యము ప్రబంధము" (నరసింహం, కె.వి.ఆర్. 1965.13) అని ప్రబంధం గురించి చెప్పారు.

### 1.1.1. ప్రబంధ రచనకు నేపథ్యం

తెలుగులో ప్రసిద్ధమైన ప్రబంధాలు క్రీ.శ.16వ శతాబ్దంలోనే ఎక్కువగా వెలువడినాయి. కందుకూరి వీరేశలింగం గారు, "కేవల భాషాంతరీకరణములు గాక

రాజాదరణము వలన నూతన కల్పనలతో ప్రబంధరాజములు పుట్టనారంభమయిన యీ కాలమును ప్రబంధయుగమని చెప్పవచ్చును" (వీరేశలింగం, కందుకూరి 1917.XII) అని ప్రబంధ కాలాన్ని గురించి పేర్కొన్నారు. తెలుగు ప్రబంధం క్రీ.శ.16వ శతాబ్దంలో ఒక్కసారిగా ఆవిర్భవించలేదు. దానికి పూర్వపు క్రమపరిణామం ఉన్నదని గుర్తించాలి. తెలుగు ప్రబంధ రచనకు గల నేపథ్యం గురించి పింగళి లక్ష్మీకాంతం గారు, "భారతములో బీజప్రాయముగా, ఎఱ్ఱనలో అంకుర ప్రాయముగ, సోమన్నలో మొలకగ పొడిసూపిన ప్రబంధలత శ్రీనాథుని చేతిలో కొనలుసాగి, చిగిర్చి మూరాకు వేసినది. అది పుష్ప ఫలసమన్వితమగుట రాయల కాలములో మనుచరిత్రయే ఆలత పూచిన తొలిపూవు పండిన తొలి ఫలము" (లక్ష్మీకాంతం, పింగళి.1974.608) అని వివరించారు.

### 1.1.2. ప్రబంధ లక్షణాలు

ప్రాచీన ఆలంకారికులు చెప్పిన ప్రబంధ లక్షణాలను విశ్లేషించి, ఆధునిక పండిత విమర్శకులైన పింగళి లక్ష్మీకాంతం గారు ప్రబంధ లక్షణాలను ఈ విధంగా పేర్కొన్నారు. "ఆలంకారిక మతమున ప్రబంధమనగా

1. అష్టాదశ వర్ణనా భూయిష్టము
2. ఉదాత్తేతి వృత్తము, నుత్తమ నాయకాశ్రితము,
3. ఏక నాయకాశ్రయము. ఇది ప్రబంధమును పురాణేతిహాసముల నుండియు నిబద్ధకావ్యముల నుండియు వేఱుచేయును.
4. రస ప్రాధాన్యము
5. నాటకము నందు వలె ముఖము నుండి నిర్వహణ సంధి వఱకు వికాసము సక్రమముగా జరుగవలయును.
6. ఆశ్వాసములుగా విభాగించవలెను" (లక్ష్మీకాంతం, పింగళి.2005.371)

ఆలంకారికుల మతానుసారంగా ప్రబంధ లక్షణాలు పై విధంగా కనిపిస్తున్నాయి. ఆధునిక విమర్శకులలో కోరాడ రామకృష్ణయ్యగారు 'పరతత్త్వ రసాయనము' నకు రాసిన పీఠికలో ప్రబంధ లక్షణాలను ఈ విధంగా పేర్కొన్నారు. "పురాణేతి హాసములలో నొక కథా భాగమును స్వీకరించి వీరశృంగార రసములలో నొకదానిని ప్రధానముగాను మిగిలిన రసములను గౌణముగాను గ్రహించి సంస్కృత మహాకావ్యములలో నుండదగిన పురవర్ణనాద్యష్టాదశ వర్ణనలలో కొన్నిటినైనను ముఖ్యముగా జేర్చి రస సంపూర్ణముగ రచించిన కృతులను బ్రబంధములని విశేషాఖ్యతో వ్యవహరించుట యాంధ్రకవి సంప్రదాయ సిద్ధము".(దుర్గయ్య, పల్లా.1971.83) ఆలంకారికులు చెప్పిన ప్రబంధలక్షణాలు, రామకృష్ణయ్యగారు పేర్కొన్న లక్షణాలూ చెప్పిన తీరులో భిన్నంగా ఉన్నాయి. కాని రెండు అభిప్రాయాల సారాంశం ఒకటిగానే కనిపిస్తున్నది.

ప్రబంధ వాఙ్మయ వికాసం అనే అంశం మీద విశేష పరిశోధన చేసిన పల్లా దుర్గయ్యగారు ప్రబంధ లక్షణాలను గురించి ఈ విధంగా చెప్పారు. "పురాణాదులలోని 'ఏకదేశకథ' ఇతివృత్తమై దివ్యాదివ్యనాయకమై సద్యపరనిర్వృత్తి సాధారణ ఫలమును, మోక్షసిద్ధియు పరమ ప్రయోజనమై, భక్తి శృంగారము (వీరము) లలో నొకటి ప్రధానమై దృశ్యాదృశ్య కావ్యలక్షణ సమ్మితమై యష్టాదశ వర్ణనాలంకృతముగ దత్సమశైలిలో గాని యచ్చ తెలుగులోగాని చంపూపద్ధతిని నాతి విస్తరతముగ కూర్పబడిన మిశ్రబంధము ప్రబంధమన దగును" (దుర్గయ్య, పల్లా. 1971.86)

దుర్గయ్యగారు పేర్కొన్న ఈ లక్షణాలు తెలుగు ప్రబంధాలు అన్నింటిలోనూ ప్రముఖంగా కనిపించే లక్షణాలుగా ఉన్నాయి. ఏ ఒక్క ప్రబంధాన్ని విడువక అన్ని ప్రబంధాలకూ అన్వయించేటట్లుగా ఈ లక్షణాలు కనిపిస్తున్నాయి. ప్రాయికంగా ప్రబంధాలు అన్నీ శృంగార రసాన్ని వర్ణించినవే. భక్తిరసాన్ని గురించి ప్రస్తావించటం 'ఆముక్తమాల్యద' వంటి ప్రబంధాలను దృష్టిలో ఉంచుకొనే అని తెలుస్తున్నది. అచ్చతెలుగును గురించి ప్రస్తావించటం 'యయాతి చరిత్ర' ను దృష్టిలో ఉంచుకొని మాత్రమే అని చెప్పవచ్చు. అయితే పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పిన ప్రబంధ లక్షణాలు స్పష్టంగా ఉన్నాయి.

1. స్వతంత్ర రచనలు, భాషాంతరీకరణలు కావు
2. పురాణాంతర్గత ఉపాఖ్యానములను నిమిత్తముగా గైకొని యాయస్థి పంజరములను మాంసలముగా సర్వావయవ సుందరముగా నుల్మీతములు చేసిన స్వతంత్ర చిత్రణములు భాషాంతరీకరణముగాని స్వతంత్ర రచనయే యీ ప్రబంధమున కాయువుపట్టు.
3. ఆలంకారికశైలి, అర్థాతిశాయియైన శబ్దము, ప్రాయికముగా శృంగారరస ప్రాధాన్యము నితరాలంకారిక ప్రబంధ లక్షణములు"

(లక్ష్మీకాంతం, పింగళి. 2005.372)

లక్ష్మీకాంతం గారు చెప్పిన ప్రబంధ లక్షణాలలో భాషాంతరీకరణ కాని స్వతంత్ర రచన అనేది ప్రధానమైనది. అది ప్రబంధానికి ప్రత్యేకమైన ప్రక్రియా గౌరవాన్ని కలిగిస్తున్నది. ఇంతవరకూ ఆధునిక పండిత విమర్శకులు చెప్పిన ప్రబంధలక్షణాలను గమనిస్తే వాటి సారాంశం మనకు కింది విధంగా కనిపిస్తుంది.

1. ప్రబంధంలోని ఇతివృత్తం పురాణాలలోని ఉపాఖ్యానాల నుంచి గ్రహించిందై ఉండాలి. దేనికీ అనువాదంకానిదై, చతుర్విధ పురుషార్థ సాధన కలిగి, ఉదాత్తమైనదై ఉండాలి.

2. ఏకనాయకాశ్రయమై, ఉత్తమ క్షత్రియుడుగాని, దివ్యుడుగాని నాయకుడుగా ఉండాలి. నాయకుడు ధీరోదాత్తుడై, నాయిక స్వీయ అయి ఉండాలి.

3. శృంగార వీర రసాలు ప్రధానంగా, తక్కినవి సందర్భోచితంగా పోషించాలి.

4. అష్టాదశ వర్ణనలు రమణీయంగా వర్ణించాలి. అందులో ఏకొన్ని లోపించినా ఆకావ్య మహత్వానికి లోపం కలుగదు.

5. వస్త్వైక్యం కలిగి ఉండాలి. ఇతివృత్త కల్పన కార్యకారణ సంబంధం కలిగి ఉండాలి.

6. ఆలంకారికశైలి ప్రధానంగా ఉండాలి.

7. నాటకంలో ఉన్నట్లుగా ముఖసంధి నుంచి నిర్వహణసంధి వరకు క్రమ వికాసం ఉండాలి.

8. ఆశ్వాస విభజన కలిగి ఉండాలి.

ఈ విధంగా తెలుగు ప్రబంధాలలో కనిపించే ప్రధాన లక్షణాలను గురించి చెప్పుకోవచ్చు.

1.2. చింతలపూడి ఎల్లనార్యుడు – కావ్యరచనకు నేపథ్యం

“ ‘రాధామాధవ’ మను ప్రబంధమును రచించియద్దాని మూలమున శ్రీకృష్ణదేవరాయల మెప్పువడయ గల్గుటం జేసి యీతనికీ ‘రాధామాధవ’ బిరుద నామము లభించినది” (రామకృష్ణయ్య, కోరాడ. 1933. i) అని కోరాడ రామకృష్ణయ్య గారు చింతలపూడి ఎల్లనార్యుడు రాయల వారిని సందర్శించినట్లుగా పేర్కొన్నారు. ఎల్లనార్యుడు ‘విష్ణుమాయనాటకము’ను రచించడానికి ఈ సందర్శనం ప్రేరణ కలిగించింది. ఎందుకంటే రాయల వారి ప్రోత్సాహంతోనే అల్లసాని పెద్దన ‘మనుచరిత్ర’ ను రచించాడు. స్వయంగా రాయల వారే ‘ఆముక్తమాల్యద’ ను రచించారు. తిమ్మన రాయలవారికి అంకితంగా ‘పారిజాతపహరణము’ను రచించాడు. ఈ ముగ్గురు ప్రబంధకవులకూ శ్రీనాథుని ‘హరవిలాసం’ ప్రేరణ కలిగించింది. ఇది శ్రీనాథుని స్వతంత్రరచన.

“ఈ హరవిలాసమొక సంస్కృత గ్రంథమునకు భాషాంతరీకరణమని చెప్పను వలను పడదు. సంస్కృతమున నాపేరు గల గ్రంథమే లేదు” (రామకృష్ణయ్య, కోరాడ 1933. xi) అని కోరాడ రామకృష్ణయ్యగారు శ్రీనాథుని ‘హరవిలాసము’ స్వతంత్ర కావ్యమని పేర్కొన్నారు. ఈ స్వతంత్ర కావ్యరచనా ప్రభావంతోనే శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రప్రబంధ రచనకు పునాది వేసినాడని తెలుస్తున్నది. ఈ విషయాన్ని సూచిస్తూ కోరాడ రామకృష్ణయ్యగారు, “శ్రీనాథుడు చూపినత్రోవనే పోయి కృష్ణదేవరాయ లాంధ్ర ప్రబంధ నిర్మాణమునకు శంఖుస్థాపనము చేసినాడు” (రామకృష్ణయ్య, కోరాడ 1933. xviii ) అని తెలుగు ప్రబంధరచనకు గల నేపథ్యాన్ని వివరించారు. ఎల్లనార్యుడు విష్ణుమాయా నాటకం అనే ప్రబంధాన్ని రచించడానికి గల నేపథ్యాన్ని గురించి రామకృష్ణయ్యగారు ఈవిధంగా పేర్కొన్నారు. “మన యెల్లనార్యుడు నీరాయల యాస్థానమున జరుగుచున్న స్వతంత్రాంధ్ర ప్రబంధ నిర్మాణ ప్రయత్నములనన్నిటిని గమనించునేయుండెను.. శ్రీనాథుని ‘హరవిలాస’ రచనము కూడ నీతనిదృష్టి

నాకర్షించినది. హరవిలాసముల కంటె విష్ణువిలాసములు మనోహరములు, చిత్త సమ్మోహనములు నగునని యాతడుతలంచెను" (రామకృష్ణయ్య, కోరాడ. 1933. xviii)

రాయల వారికి లాగానే, ఆతని ఆస్థానంలో ఉన్న ఎల్లనార్యునికి కూడా శ్రీనాథుని 'హరవిలాసము' ప్రేరేపకమైనదని పై మాటల వలన తెలుస్తున్నది. విష్ణుమాయా నాటక ప్రబంధంలోని విష్ణుమాయా విలాస కథలకు శ్రీనాథుని హరవిలాస కథలు, ఆముక్తమాల్యదలోని విష్ణుభక్తుల కథలు ప్రేరేపకములు. హరవిలాస కథలను శ్రీనాథుడే చెప్పాడు. కాని ఎల్లనార్యుడు విష్ణుమాయా విలాసకథలను తానే స్వయంగా చెప్పలేదు. ఆ కథల మధ్య ఒకానొక ఏకీభావాన్ని కల్పించాడు. గోవిందశర్మ అనే పాత్రను శ్రీకృష్ణుని నర్మసఖుడుగా కల్పించాడు. గోవిందశర్మ చేత ఈ కథలను చెప్పించాడు. ఎల్లనార్యుడు చేసిన ఈ కల్పనను గురించి కోరాడ రామకృష్ణయ్యగారు,

"విష్ణుని మాయా విలాస కథలకన్నిటికి నొక విధమగు ఏకీభావమును దానును గూర్చుకొనవలసి యున్నది. ఈ సందర్భమున తిమ్మనార్యుని పారిజాతాపహరణ రచన యీతని భావనా శక్తిని ప్రచోదన చేసియుండును. పారిజాతపహరణ కథకావలి కథగా (సీక్వెల్) దీనినెత్తుకొనినచో విష్ణు విలాసకథలను దానికి గుదిగ్రుచ్చవచ్చునని యాతడు తలంచెను" (రామకృష్ణయ్య కోరాడ. 1933. xix) అని ఎల్లనార్యుని ప్రబంధ రచనకు, దానిలోని కల్పనలకూ గల నేపథ్యాన్ని గురించి వివరించారు.

### 1.2.1 పూర్వకవుల ప్రభావం

ఎల్లనార్యుని విష్ణుమాయానాటక ప్రబంధ రచనలలో శ్రీనాథుడు, పోతన, నంది తిమ్మనల ప్రభావం కనిపిస్తున్నది. ఈ విషయాన్ని గురించి చెబుతూ కోరాడ రామకృష్ణయ్యగారు, "రచనా పద్ధతి విషయమున శ్రీనాథుని హరవిలాసము, ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణమునుఁగొంత వఱకీతనిని ప్రోత్సహించి యుండునని తలపదగి యున్నట్లె, ప్రబంధ వస్తు సంగ్రహణ విషయమున భాగవతము ప్రాయశః పోతన కృతము–ఈతనికిఁ గొంత సాయపడినదని తలంపవచ్చును. ప్రధాన వస్తువగు విష్ణులీలాగాథలన్నిటిని గుదిగ్రుచ్చు విషయమున పారిజాతాపహరణ కథాసందర్భ మీతని కుపచరించినది" (రామకృష్ణయ్య, కోరాడ. 1933. xxii) అని తెలిపినారు.

ఎల్లనార్యుడు 'విష్ణుమాయానాటక' ప్రబంధాన్ని రచించడానికి కావలసిన వస్తువును పోతన భాగవతం నుంచి గ్రహించాడు. కాని దానిని ప్రబంధరీతిలో మలచుటకు తిమ్మన 'పారిజాతపహరణము' ఉపకరించినదని పై మాటల వలనే తెలుస్తున్నది. రచనా పద్ధతిలో శ్రీనాథుని 'హరవిలాసము' ఉపకరించిందని కూడా తెలుస్తున్నది. శుకయోగి వలన అచ్యుత క్రీడలన్నిటినీ వినిన తర్వాత పరీక్షిత్తుమహారాజుకు కలిగిన సందేహంతోనూ, దాని మూలకమగు ప్రశ్నతోనూ విష్ణుమాయానాటక ప్రబంధం

ప్రారంభమవుతున్నది. అందుచేత ఈ ప్రబంధంలోని కథ భాగవతకథకు తర్వాత జరిగినట్లుగా తెలుస్తున్నది. ఈ విధంగా ఎల్లనార్యునికి అతనికంటే పూర్వపు కవులైన శ్రీనాథుడు, పోతనల రచనలు మార్గదర్శకాలుగా దోహదపడినవని చెప్పవచ్చును.

1.2.2. నామౌచిత్యం

'విష్ణుమాయా నాటకము' అనే ప్రబంధం ఎల్లనార్యుని స్వతంత్ర రచన. ఎల్లనార్యుడు దీనిని పురాణ ప్రసిద్ధములైన కథలను కూర్చి రచించాడు. ఈ ప్రబంధ నామం నాటకమని ఉండుటకు గల కారణాన్ని గురించి కోరాడ రామకృష్ణయ్యగారు ఈ విధంగా అభిప్రాయపడ్డారు. 'విష్ణుమాయానాటక' మనబరగునది యైదాశ్వాసములు గల చక్కని ప్రబంధము. పేరునకు నాటకమే కాని వాస్తవముగానిది దృశ్య ప్రబంధము కాదు. విష్ణుని మాయాప్రభావ ప్రదర్శనరీతులను వర్ణించునది గావున నిది విష్ణుమాయా నాటకమైనది" (రామకృష్ణయ్య, కోరాడ. 1933. i) ఎల్లనార్యుడు తన కావ్యానికి నాటకమని పేరు పెట్టినప్పటికీ ఇది దృశ్యకావ్యం కాదని రామకృష్ణయ్యగారి మాటల వలన తెలుస్తున్నది. విష్ణు మహిమల ప్రదర్శనను వర్ణించేది కాబట్టి ఇది నాటకమైనదని వీరి అభిప్రాయంగా కనిపిస్తున్నది. 'గోవిందశర్మ విష్ణుకథలను కొన్నిటిని గ్రహించి, మాయానాటకమనే పేరుతో ఒక ప్రబంధంగా రచించాడని ఎల్లన కల్పించాడు. ఈ కల్పన నాటకమనే తన కావ్యనామాన్ని సమర్థించుకోవటానికి చేసిందే అని రామకృష్ణయ్యగారు పేర్కొన్నారు. అంతేకాకుండా ఎల్లన తన రచన ప్రబంధం అని చెప్పడానికే ద్వితీయాశ్వాసాన్ని పురవర్ణనతో ప్రారంభించినాడని రామకృష్ణయ్యగారు భావించారు. (రామకృష్ణయ్య,కోరాడ 1933. xviii)

"శ్రీయుతమై విష్ణు మహా, మాయానాటకమునాగ మహివెలసె, మహీ
నాయక తత్కథలన్నియు, నాయతగతినొక ప్రబంధమై నాచేతన్" (2-6.38)

అనే పద్యాన్ని గోవిందశర్మ మాటలకు నిదర్శనంగా కోరాడవారు ఉదాహరించారు. ఎల్లనార్యుని 'విష్ణుమాయా నాటకము' పేరుకి మాత్రమే నాటకమని రచనా రీతినిబట్టి అది ప్రబంధమే అవుతుందని పైన పేర్కొన్న కోరాడవారి మాటల వలన తెలుస్తున్నది. అయితే నాటకమని అనడంలో కవి అంతరార్థాన్ని గమనిస్తే, ఈ ప్రబంధంలో అక్కడక్కడా దృశ్యకావ్య లక్షణాలు కూడా ప్రతిఫలిస్తున్నాయి. ప్రథమాశ్వాసంలో ధర్మరాజు వ్యాసుడు మొదలైన మునులతో హస్తినాపురంలో కొలువుతీరి ఉండగా, ద్వారక నుండి గోవిందశర్మ అక్కడికి ఆకాశమార్గాన ప్రయాణించి రావటం సభాసదులందరికీ విస్మయాన్ని కలిగించింది. గోవిందశర్మను అర్జునుడు సభలోనివారికి పరిచయం చేయటం నాటకంలోని పాత్ర పరిచయం వలె కనిపిస్తుంది.

"...నివ్వటుండు ద్వారకా నగరంబువాడు, కృష్ణుని యంతఃపుర స్త్రీలకు రుక్మిణ్యాదులకు నుబుసుపోవఁగథలు చెప్పు గోవిందశర్మ యనువాడు" ( 1-111.22)

సత్యభామ పారిజాతపుష్పాలను ఇచ్చిపంపిన పరిచారిక రుక్మిణీదేవి అంతఃపురంలోకి ప్రవేశించునప్పటి చెలికత్తెల సంభాషణ నాటకంలోని మిశ్రవిష్కంభాన్ని గుర్తుకు తెస్తుంది. "..మా సత్యభామ మీరుక్మిణికిఁ బువ్వులిచ్చి రమ్మని పంపినది. ఈపువ్వులిచ్చి పోయెదఁ బోవనిమ్మని పలుకు సమయమ్మున వారిద్దఱి సంవాదంబు నాలకించి" (1-156.29) అదేవిధంగా శ్రీమహావిష్ణువు మహాలక్ష్మితో పాచికలాడు సన్నివేశం (2-11,15.39), బ్రహ్మ, మార్కండేయుల సంవాదం (3-53.83) నారదుడు కైలాసంలో పరమేశ్వరుని దర్శించుకొన్న సన్నివేశం (4-69.152) మొదలైన అనేక నిదర్శనాలు ఈ ప్రబంధంలోని నాటక లక్షణాలకు ప్రతిబింబాలుగా కనిపిస్తున్నాయి. అందుచేత ఎల్లనార్యుడు 'విష్ణుమాయా నాటకము' అని తన ప్రబంధానికి పేరు పెట్టడం సార్థకంగా ఉన్నదని పైన చూపిన నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు.

1.3. విలాసకావ్యం

'విలాసం' అనే మాటకు నిఘంటువులలో 'క్రీడ' 'ప్రియసందర్శనాదుల చేతనను యానావలోకనాది క్రియా విశేష రూపమైన స్త్రీల యొక్క శృంగార చేష్టా విశేషము' (సీతారామాచార్యులు, బహుజనపల్లి.2010.850) అనే అర్థాలు కనిపిస్తున్నాయి. విలాసమంటే లౌకికార్థంలో శృంగార చేష్టగా భావించబడుతున్నది. నిఘంటువులో కూడా విలాసం శృంగార చేష్టావిశేషంగానే పేర్కొనబడింది. అయితే ఆ విలాసం ప్రియమైన వారిని చూసినపుడు ఎదుటివారు ప్రదర్శించు హావభావ చేష్టా రూపంగా వ్యక్తమవుతుంది. అది నడకలోనూ, మట్లాడటంలోను, చూడటంలోనూ, కూర్చోవటంలో కూడా బహిర్గతమవుతుంది. "ఆ విలాసం నడకలో, ఉనికిలో, కూర్చోవడంలో, మాటలాడడంలో, చూడటంలో ప్రస్ఫుటమవుతుంది. దీనినే ఒయ్యారమనవచ్చు. లౌకిక కావ్యాలలోని విలాసం ఒకరకమైతే భక్తికావ్యాలలో విలాసం లీలావిభూతి రూపంలో వ్యక్తమవుతుంది"(సమాలోకనం.2009.20) ఆచార్య కె. సర్వోత్తమరావుగారు తనకెంతో ఇష్టుడయినవాని చూడగానే కలిగే వికారం 'విలాసం' (సమాలోకనం. 2009.20) అని విలాస శబ్దానికి అర్థాన్ని చెప్పారు.

విష్ణుమాయా నాటక కావ్యంలో శ్రీ మహావిష్ణువు మహిమాతి శయ ప్రకటనమే లీలా విభూతి రూపంలో వర్ణించబడింది. మిగిలిన విష్ణుమాయా విలాసకావ్యాలలో కూడా ఈ వృత్తాంతమే వర్ణితమైంది. భాగవత, విష్ణు పురాణాదులలో ప్రసిద్ధములైన కొన్ని కథలను గ్రహించి, తమ స్వీయ కల్పనా చాతుర్యంతో ప్రబంధీకరించి, రచించినవే ఈ 'విష్ణుమాయా విలాసములు'. ఎల్లనార్యుడు తన విష్ణుమాయా నాటకంలోని ఇతివృత్తాన్ని గురించి గోవిందశర్మ చేత సత్యభామతో పలికించిన ఈ మాటలు గమనించదగినవి. "ఇది యంతయుఁ' గృష్ణుని మాయావిలాసము. తొల్లి శ్రీమహాలక్ష్మి,

ద్రుహిణ రుద్రాదులు నీ విభుని మాయా నాటకంబున భ్రమసి తిరిగిరి." (1-207)
తెలుగు సాహిత్యంలో శ్రీనాథుని హరవిలాసాదులు ఇటువంటివే కాని చేమకూర వేంకటకవి 'విజయ విలాసం' ఈ కోవలోనికి రాదు. హరవిలాస, విష్ణుమాయా విలాసాలు భగవంతుని లీలా విభూతిని వర్ణిస్తే, విజయ విలాసం నరుడైన అర్జునుని శృంగార విలాసాన్ని వర్ణించింది. కావున భగవంతుని లీలావిభూతిని ప్రకటించేటటువంటి విష్ణుమాయా విలాసకావ్యాలు మాత్రమే ఈ గ్రంథంలో పరామర్శించబడతాయి.

1.3.1. విష్ణుమాయా విలాస కావ్యములు - పరిచయం

తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కావ్యాలు, పరిణయకావ్యాలు, విలాసకావ్యాలు మొదలైనవి పరంపరగా కనిపిస్తున్నాయి. విలాస కావ్యాలలో 'విష్ణుమాయా విలాస కావ్యములు' ప్రచురితమైనవి ఐదు లభిస్తున్నాయి.

1. చింతలపూడి ఎల్లనార్యుడు - విష్ణుమాయానాటకము
2. కంకటి పాపరాజు - విష్ణుమాయా విలాసము
3. కంకటి నారసింహకవి - విష్ణుమాయా విలాసము
4. రోసనూరి వేంకటపతి - విష్ణుమాయా విలాసము
5. ఎఱగుడిపాటి వేంకటకవి - విష్ణుమాయా విలాసము

ఇవికాకుండా విష్ణుమాయా విలాసము పేరుతో పంకజలోచన నరసయ్య యక్షగానం, వెలుగోటి వెంకటకవి పద్యకావ్యం రచించినట్లుగాను, సముద్ర మథనం పేరుతో చిలకపాటి సీతాంబరం ప్రబంధం రచించారని తి.తి.దే. వారు ప్రచురించిన విష్ణుమాయా విలాసము (ఎఱగుడిపాటి వేంకటకవి) పీఠికలో పేర్కొన్నారు. అయితే అముద్రిత కావ్యాలను ఈ గ్రంథరచనలో గ్రహించలేదు.

1.3.1.1. చింతలపూడి ఎల్లనార్యుడు - విష్ణుమాయా నాటకము

చింతలపూడి ఎల్లనార్యుడు రచించిన 'విష్ణుమాయానాటకము' ఐదు ఆశ్వాసాలు కలిగిన ప్రబంధం. ఇందులో ఐదు ప్రధాన కథలు, రెండు ఉపాఖ్యానాలూ ఉన్నాయి. ఇందులో ప్రతి ఆశ్వాసం ఒక కొత్త కథతో ప్రారంభమవుతున్నది. అవతారిక లభించని ఈ కావ్యంలోని ఆశ్వాసాంత గద్యంలో శ్రీమదన గోపాలస్వామికి దీనిని అంకితం చేసినట్లుగా తెలుస్తున్నది. 'సర్వం విష్ణుమయం జగత్' (1-43) అనే ఆర్యోక్తికి, 'మమ మాయా దురత్యయా' (1-28) అనేటువంటి గీతా వాక్యానికీ చక్కని నిదర్శనం ఈ ప్రబంధం. దీనికి కథకుడు శుకమహర్షి, శ్రోత జనమేజయుడు. శుకమహర్షి చేత భాగవత సత్కథలను వినిన తర్వాత పరీక్షిత్తు మహారాజుకు కలిగిన సందేహరూపమగు ప్రశ్నతో ఈ ప్రబంధం మొదలవుతున్నది. శ్రీమహావిష్ణువు తన మాయా విలాసకేళితో, పారిజాతవృక్షం తన పెరటిచెట్టు అయిందని సత్యభామకు కలిగిన గర్వాన్ని భంగపరచడానికి రుక్మిణి మొదలగు సపత్నుల ఇళ్ళలో మాయా పారిజాతవృక్షాలు

కల్పించాడు. సకల సంపదలకూ తానే అధిదేవతనని అహంకరించిన మహాలక్ష్మికి ప్రతిగా మాయాలక్ష్మిని కల్పించాడు. సకల సృష్టికీ కర్తనని గర్వించిన బ్రహ్మను మాయాసరస్వతితో భంగపరిచాడు. శివదర్పాన్ని మాయామోహిని రూపంతో భంగం కావించాడు. నారదుడికి కలిగిన గర్వాన్ని మాయా సంసారాన్ని కల్పించి నాశనం చేశాడు.

ఈ విధంగా శ్రీమహావిష్ణువు తన మాయా మహిమతో లోకకళ్యాణ ప్రదమైన రీతిలో విలాసాలను ప్రదర్శించడం ఈ కథలలోని పరమార్థం. ప్రథమాశ్వాసంలో విష్ణుమాయా ప్రశంస, సత్యభామ కథ ఉంది. ద్వితీయాశ్వాసంలో మహాలక్ష్మి, మయాలక్ష్మిల వృత్తాంతం ఉంది. తృతీయాశ్వాసంలో బ్రహ్మకథ, పుండరీకోపాఖ్యానం ఉంది. చతుర్థాశ్వాసంలో శివుని కథ వర్ణించబడింది. పంచమాశ్వాసంలో నారదుని కథ, చండదమనోపాఖ్యానం ఉంది. ఈవిధంగా విష్ణుమాయా నాటకంలో ఐదు ప్రధాన కథలు, రెండు ఉపాఖ్యానాలు వర్ణితమైనాయి.

1.3.1.2. కంకటిపాపరాజు – విష్ణుమాయా విలాసము

కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాస కథలలోని మోహినీ అవతారం లేక శివదర్ప భంగం అనే కథను గ్రహించి యక్షగానంగా రచించాడు. ప్రాచీన తెలుగు యక్షగానాలలో పాపరాజు రచించిన 'విష్ణుమాయా విలాసము' కూడా ప్రసిద్ధమైనది. పాపరాజు తన యక్షగానాన్ని శ్రీ మదనగోపాల దేవునికి అంకితం చేశాడు. క్షీరసాగర మథనం తర్వాత జరిగిన వృత్తాంతంగా ఈ యక్షగానం ప్రారంభమవుతుంది. శివుడు నారదుని ద్వారా విష్ణువు మోహినీ అవతారగాథను విని, మదనాంతకుడైన తాను మోహిని సౌందర్యానికి చలించనని పలకడం, శివుడు నారదుని మీది పంతంతో, వైకుంఠానికి వెళ్ళి, శివుడు మాయామోహినిని చూసి మోహవివశుడై పరితపించటం ఇందులోని ప్రధానాంశం. దేశీయమైన భాషాప్రయోగ వైచిత్రితో, వర్ణనలతో, పాత్రల స్వభావ చిత్రణతో ఈ యక్షగానం పరిపుష్టమైంది. దీనికి కథకుడు శుకమహర్షి, శ్రోత పరీక్షిత్తు మహారాజు.

1.3.1.3. కంకటి నారసింహకవి – విష్ణుమాయా విలాసము

కంకటి నారసింహకవి చింతలపూడి ఎల్లనార్యుని 'విష్ణుమాయా నాటకము'ను అనుసరించి, తన కావ్యాన్ని ద్విపదరీతిలో రచించాడు. ఈ కావ్యం ఐదు ఆశ్వాసాలుగా విభజించబడింది. పూర్వభాగంలో సత్యభామ కథ, ఆదిలక్ష్మి కథ, బ్రహ్మకథ ఉన్నాయి. మూడవ ఆశ్వాసంలోని బ్రహ్మకథలో పుండరీకోపాఖ్యానం ఉంది. ఉత్తరభాగంలో శివుని కథ, నారదుని కథ ఉన్నాయి. నారదుని కథలో చండదమనోపాఖ్యానం ఉంది. నారసింహకవి తన కావ్యాన్ని శ్రీరామచంద్రునికి అంకితం చేశాడు. దీనికి కథకుడు శుకమహర్షి, శ్రోత పరీక్షిత్తు మహారాజు.

### 1.3.1.4. రోసనూరి వేంకటపతి - విష్ణుమాయా విలాసము

వేంకటపతి రచించిన 'విష్ణుమాయా విలాసము' అనేది మూడు ఆశ్వాసాలు కలిగిన శృంగార ప్రబంధం. కంకంటి పాపరాజు రచించిన యక్షగానానికి పద్య రూపంగా వేంకటపతి విష్ణుమాయా విలాస ప్రబంధం కనిపిస్తున్నది. ఇందులో వేంకటపతి కంకంటి పాపారాజు లాగానే శివదర్పభంగ కథను మాత్రమే గ్రంథస్థం చేశాడు. దేవదానవులు క్షీరసాగరాన్ని మథించిన తర్వాత జరిగిన విశేషాలను నారదుడు కైలాసం వెళ్ళి శివునికి వినిపిండం, శివుడు మాయామోహినీ అవతార విశేషాలను నారదుని వలన విని దర్పంతో వైకుంఠానికి వెళ్ళడం, విష్ణువు శివుని దర్పాన్ని అణచటానికి మోహినిగా అవతరించాడు. శివుడు మోహినీరూపాన్ని చూసి మోహంతో పరితపించడం అనేవి ఈ కావ్యంలో ప్రధానంగా వర్ణించబడ్డాయి. వేంకటపతి ఈప్రబంధాన్ని వెంకటగిరి ప్రభువైన బంగారు యాచమ నాయకునికి అంకితం చేశాడు. ఈ ప్రబంధానికి కథకుడు వైశంపాయనుడు, శ్రోత జనమేజయుడు.

### 1.3.1.5. ఎఱగుడిపాటి వేంకటకవి - విష్ణుమాయా విలాసము

విష్ణుమాయా విలాస కావ్యాలలో ఎల్లనార్యుని కావ్యం తర్వాత ఇతివృత్త గ్రహణం, రచనా విధానంలోనూ వైవిధ్యం గలది ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన 'విష్ణుమాయా విలాసము'. ఇందులో ఐదు ఆశ్వాసాలు ఉన్నాయి. ప్రథమాశ్వాసంలో దేవదానవులు క్షీరసాగరాన్ని మథించే కథ వుంది. ద్వితీయాశ్వాసంలో లక్ష్మీనారాయణుల కళ్యాణం, దేవదానవుల సంగ్రామం, మోహినీ అవతార కథ వర్ణితమైనాయి. తృతీయాశ్వాసంలో బ్రహ్మగర్వభంగ కథ ఉంది. చతుర్థ, పంచమాశ్వాసాలలో నారదునిగర్వం, మాయాసంసారం అనే కథలు వర్ణితమైనాయి. వేంకటకవి తన కావ్యాన్ని బిలకూట (బిట్రగుంట) క్షేత్రంలో వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామికి అంకితం చేశాడు. దీనికి సూతమహర్షి కథకుడు, నైమిశారణ్య మునులు శ్రోతలు.

# 2. విష్ణుమాయా విలాసకావ్యాలు - కవి పరిచయాదులు

విష్ణుమాయా విలాసమనే పేరుతో రచించిన ఈ ఐదు కావ్యాలకు రచనాకాలంలో వైవిధ్యం కనిపిస్తున్నది. ఈ కృతికర్తలు ఐదుమంది వేర్వేరు కాలాల్లో జీవించినవారు. రచనా సందర్భ హేతువులు కూడా విభిన్నమైనవి. కాలక్రమాన్ని అనుసరించి వీరిలో మొదటికవి చింతలపూడి ఎల్లనార్యుడు (క్రీ.శ.1500-1560) చివరి కవి ఎఱగుడిపాటి వేంకటకవి (క్రీ.శ.1750) ఈ కవులు జీవించిన కాలం, వారి జీవిత విశేషాలు, చారిత్రక నేపథ్యం, రచనలను గురించిన స్థూలమైన పరిచయం ఇందులో ప్రస్తావించబడుతుంది.

2.1. చింతలపూడి ఎల్లనార్యుడు (క్రీ.శ.1500-1560)

2.1.1. పరిచయం

చింతలపూడి ఎల్లనార్యుడు రాధామాధవ కావ్యాన్ని రచించి శ్రీకృష్ణదేవరాయల వారి వలన 'రాధామాధవకవి' బిరుదును పొందాడు. తన విద్యత్కవితతో రాయలవారిని మెప్పించి అనేక సత్కారాలను, బహుమతులనూ పొందినట్లుగా ఎల్లన రాధామధవ కావ్యంలో పేర్కొన్నాడు.

> "రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పిత
> న్మాధుర్యంబునఁ గృష్ణ రాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి, నా
> నాధాతృ ప్రతి సమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో
> రాధా మాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుడన్"

(ఎల్లనార్యుడు, చింతలపూడి.1933.i పీఠిక) ఎల్లనార్యుడు రచించిన విష్ణుమాయా నాటకానికి అవతారిక లభించుటలేదు. ఆశ్వాసాంతగద్యలో తాను కృష్ణభట్టారకుని పౌత్రుడు, కామనార్యుని కుమారుడనని చెప్పుకొన్నాడు. "ఇది శ్రీమదనగోపాల చరణ కమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారక పౌత్ర చింతలపూడి కామయప్రభు సుపుత్ర" (ఎల్లనార్యుడు, చింతలపూడి.1933.33) 'రాధామాధవము'లో తాను శ్రీవత్స గోత్రుడనని, తల్లి లచ్చమాంబ అనీ చెప్పుకొన్నాడు. దీనివలన ఎల్లనార్యుని ఇంటిపేరు చింతలపూడి వారు అని కూడా తెలుస్తున్నది.

2.1.2. నివాసప్రాంతం

చింతలపూడి ఎల్లనార్యుడు 'చింతలపూడి' అనే గ్రామనివాసి అని అతని ఇంటి పేరును బట్టి తెలుస్తున్నది. ఆంధ్రదేశంలో చింతలపూడి అనేపేరుతో అనేక గ్రామాలు ఉన్నాయి. తూర్పు గోదావరిజిల్లా, అమలాపురం తాలూకాలోని చింతలపూడి గ్రామమే ఎల్లనార్యుని నివాస ప్రాంతమని కోరాడ రామకృష్ణయ్యగారు పేర్కొన్నారు. తృతీయాశ్వాసంలో ఎల్లనార్యుడు చేసిన 'గౌతమీనదీ తీర భూముల' వర్ణన

పంచమాశ్వాసంలోని 'సర్వవరక్షేత్ర' వర్ణనలను అందుకు నిదర్శనంగా పేర్కొన్నారు.

"త్రైలింగ్యమధ్య తలము కృష్ణాగౌత, మీ ప్రవాహంబుల మిగులబందు " (3-190)

"నే దిష్ఠ దక్షిణాశా, ప్రాదుర్భూతార్ధ్వతుల్యభాగాజలజా
మోదభరితమౌ మారుత, మాదైత్యారాతి హృదయమలరంగజేసెన్" (5-39)

అనే పై నిదర్శనాల వలన ఎల్లనార్యుడు అమలాపురం తాలూకాలోని చింతలపూడి గ్రామనివాసి అని భావించవచ్చు.

2.1.3. చారిత్రక నేపథ్యం

రాధామాధవ కావ్యం వలన చింతలపూడి ఎల్లనార్యుడు శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థానాన్ని సందర్శించినట్లుగా తెలుస్తున్నది. ఎల్లనార్యుడు రాయలవారి విద్వత్ సభలో పరీక్షించబడినట్లుగా సాహిత్య చరిత్రల వలన తెలుస్తుందని కోరాడ రామకృష్ణయ్యగారు తెలిపారు. ఎల్లనార్యుని పరీక్షించేందుకు పెద్దనామాత్యుడు నగరు, తగదు, తొగరు, వగరు, అనే పదాలను ప్రాసస్థానంలో ఉంచి రామాయణపరంగా పద్యం చెప్పమన్నాడు. 'నగరు పగాయెనింక విపినంబుల కేగుడు రాజ్యకాంక్షకుం, దగరు కుమారులార..' అని ఎల్లనార్యుడు పద్యాన్ని పూరించి, భారత భాగవతాల పరంగా కూడా పద్యాలు చెప్పి పెద్దనగారిని మెప్పించినాడట. (రామకృష్ణయ్య, కోరాడ. 1933.**iii**) ఎల్లనార్యుడు పెద్దనగారి పరీక్షకు నెగ్గి, రాయలవారి మెప్పును పొందినప్పటికీ అష్టదిగ్గజకవులలో ఒకడిగా గుర్తింపును పొందలేదు. దానికి ఎల్లనార్యుడు రాయలవారి అవసాన కాలంలో ఆస్థానాన్ని దర్శించటం కారణంగా చెప్పవచ్చు.

ఎల్లనార్యుడు తన తారక బ్రహ్మరాజీయ కావ్యాన్ని నంజ తిమ్మయమంత్రి కోరగా శ్రీరామునికి అంకితం చేశాడు. ఈ నంజ తిమ్మయ మంత్రి అచ్యుత దేవరాయల (క్రీ.శ.1530-1542) దగ్గర గ్రంథాసార లేఖకుడుగా ఉండేవాడు. ఎల్లనార్యుడు ఈకావ్యంలో అచ్యుత దేవరాయలను రెండు పద్యాలలో కీర్తించాడు.

"తన మహాదీప్తి ప్రతాప బింబము దా, దీపించు భానుమద్బింబ మనగ"

"పద్మాప్తరుచి మించు పద్మరాగపు రవి, గూర్చిన పతక మక్కున వెలుంగ"

(ఎల్లనార్యుడు, చింతలపూడి. 1933.**iii**)

ఎల్లనార్యుడు తన కవిత్వంతో రాయలవారిని మెప్పించినప్పటికీ రాజాశ్రయాన్ని ఆశించినట్లు మాత్రం కనిపించదు. తనకవిత్వ మనోహరత్వానికి మెచ్చి సరసులు తామె వెదుకుతూ వస్తారని ధీమాగా పలికాడు. నంజ తిమ్మయమంత్రితో బంధు సంభావన పొందినప్పటికీ వినయ విధేయతలు ఆశ్రితునిలాగ చూపలేదు. ఎల్లనార్యుడు తన మూడు కావ్యాలను భగవదంకితం చేశాడు. అందుచేత ఎల్లనార్యుడు పెద్దనాదుల వలె రాజాశ్రయుడు కాకుండా పోతనవలె భగవదాశ్రయుడై ఉండినట్లు తెలుస్తున్నది. అందుచేత ఎల్లనార్యుడు శ్రీకృష్ణదేవరాయల అవసానకాలంలో, అచ్యుతదేవ రాయల

పరిపాలనా కాలం (క్రీ.శ.1530–1542) మధ్యలో కావ్యరచన చేసినాడని చెప్పవచ్చు. "ఈతడు కృష్ణరాయల యవసానకాలముననుు, అచ్యుతరాయల రాజ్యారంభ కాలముననుు గ్రంథ రచనము చేయుచుండి నటులు నిశ్చయింపవచ్చును" (ఎల్లనార్యుడు, చింతలపూడి. 1933. **iii**) అని కోరాడ రామకృష్ణయ్య గారు పేర్కొన్నారు. పై నిదర్శనాల వలన ఎల్లనార్యుడు క్రీ.శ. 1500–1560 మధ్య కాలంలో జీవించినాడని చెప్పవచ్చు.

2.1.4. రచనలు

చింతలపూడి ఎల్లన రచించినవి మూడు గ్రంథాలు లభిస్తున్నాయి. వాటిలో మొదటిది 'రాధామాధవము'. 'తారకబ్రహ్మరాజీయము', 'విష్ణుమాయా నాటకము' లలో రాధామాధవ బిరుదును పేర్కొనుటవలన రాధామాధవమే అతని మొదటి రచన అని చెప్పవచ్చు.

**రాధామాధవము**

ఇది ఐదు ఆశ్వాసాల శృంగార ప్రబంధం. సంస్కృతంలో జయదేవకవి కలితమైన 'రాధామాధవ' కావ్యాన్ని అనుసరించి దీనిని రచించినట్లు కవి చెప్పుకొన్నాడు. ఎల్లనార్యుని కావ్యంలోని రాధ శ్రీకృష్ణుని పరివారజనంలోనిది కాదు. సహస్ర గోపుడనే ఒక రాజు కుమార్తె. సరస్వతీ నారదుల దౌత్యం వలన రాధ శ్రీకృష్ణునిపై మోహాన్ని పొందుతుంది. రాధ స్వయంవరంలో శ్రీకృష్ణుని వరిస్తుంది. రాధ ఈ కావ్యంలో స్వకీయ నాయికగా కనిపిస్తుంది. ఎల్లనార్యుడు దీనిని శ్రీకృష్ణునికి అంకితం చేశాడు.

**తారక బ్రహ్మరాజీయము**

శ్రీరామ తారకమంత్ర మహాత్మ్యమును గూర్చి తెలిపే ఐదు ఆశ్వాసాల ప్రబంధం 'తారకబ్రహ్మరాజీయము'. ప్రయాగక్షేత్ర వాసి అయిన నారాయణాశ్రములు సంస్కృత భాషలో రచించిన కావ్యాన్ని ఎల్లనార్యుడు ఆంధ్రీకరించాడు. నంజ తిమ్మయమంత్రి కోరగా ఎల్లనార్యుడు దీనిని శ్రీరామునికి అంకితం చేశాడు. పరాశరుడు వామదేవునికి తారకబ్రహ్మ మంత్ర ప్రభావాన్ని చెప్పడం, అగస్త్యుడు వాలఖిల్యాది ఋషి సమూహానికి తారక బ్రహ్మమంత్రోపదేశం చేయటం ఇందులోని ప్రధానాంశం. మూడవకృతి 'విష్ణుమాయా నాటకము' అనే ప్రబంధం ప్రస్తుత పరిశీలనా గ్రంథం

2.2. కంకంటి పాపరాజు (క్రీ.శ.1575–1632)

2.2.1. పరిచయం

"శ్రీ వెలయుమున్ను విష్ణుమాయా విలాస
యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తది యాదిగా మేము నీ సుధాను
సారి వాక్కులఁజొక్కియున్నార మనఘ" (వేంకటరమణయ్య, నేలటూరు. 1955. 7 పీఠిక) అని కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణ కావ్య అవతారికలో

అతడి గురించి చెప్పుకొన్నాడు. కంకంటిపాపరాజు ఉత్తర రామాయణ కావ్యకర్తగా సాహిత్యచరిత్రలో సుప్రసిద్ధుడు. పుష్పగిరి తిమ్మనకవి ఇతనికి సమకాలికుడు, మిత్రుడు. కంకంటి నారసింహకవి ఇతనికి తమ్ముడు. కంకంటి పాపరాజు ఆర్వేల నియోగి వంశానికి చెందినవాడు, శ్రీవత్స గోత్రుడు. ఇతని ముత్తాత వల్లభామాత్యుడు. తాత అయ్యన మంత్రి, తల్లిదండ్రులు నరసమాంబ, అప్పయ్యమంత్రి అని,

"...అట్టి యార్వేల వారిలో నలఘుకీర్తి.."

"వరుసమీముత్తాత వల్లభామాత్యుడు, ఘనుడు మీతాతయయ్యన మంత్రిమదనగో
పాల మంత్రోపాస్తిc బ్రతిభ జెందె" (పాపరాజు, కంకంటి. 1955. 3,4)

విష్ణుమాయా విలాస యక్షగానంలోని పై పద్యాల వలన తెలుస్తున్నది.

2.2.2. నివాసప్రాంతం

కంకంటి పాపరాజు నెల్లూరు మండలంలోని ప్రళయకావేరి పట్టణంలో అమీనుగా లౌక్యాధికారంలో ఉన్నాడని వీరేశలింగం పంతులుగారు పేర్కొన్నారు. "కంకంటి పాపరాజు ప్రళయకావేరి పట్టణములో నమీనుగా లౌక్యాధికారము నందుండినవాడు" (వీరేశలింగం, కందుకూరి. 1917. 456) పాపరాజు నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలోని దుగరాజుపట్నంలో ఉండేవాడని ఆరుద్ర పేర్కొన్నాడు. "పాపరాజుగారు మాత్రం క్రీ.శ. 1610 ప్రాంతాలలో నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలోని దుగరాజపట్నంలో చేరారు" (ఆరుద్ర. 1990. 106) ఈ నిదర్శనాల వలన కంకంటి పాపరాజు గూడూరు తాలూకాలోని దుగరాజపట్నం అనే గ్రామంలో నివసించాడని తెలుస్తున్నది.

2.2.3. చారిత్రక నేపథ్యం

కంకంటి పాపరాజు తన ఉత్తర రామాయణ కావ్యంలోనూ, విష్ణుమాయా విలాస యక్షగానంలోనూ పుష్పగిరి తిమ్మనకవిని గురించి ప్రస్తావించినాడు. పాపరాజుకు పుష్పగిరి తిమ్మన మిత్రుడే కాకుండా కృతి రచనలో సహాయం కూడా చేసినట్లు తెలుస్తున్నది. పాపరాజు తన విష్ణుమాయా విలాస యక్షగానంలో తిమ్మన కవిని ఇలా ప్రస్తుతించాడు. "..మదీయహితకార్య ఘటనాది ముఖ్యులైన కవితిమ్మనార్య ప్రముఖులేమని వినుతించుచున్నారు" (పాపరాజు, కంకంటి. 1955. 3) పుష్పగిరి తిమ్మనకవి క్రీ.శ. 1529లో జన్మించి ఉంటాడని ఆరుద్ర భావించాడు. "ఈ వంశావళిలో తరానికి 40 సంవత్సరాల చొప్పున లెక్కపెట్టడం సమంజసమే అని తోస్తుంది. ఆ లెక్కన తిమ్మయ్యగారు క్రీ.శ. 1529లో జన్మించి ఉంటారని భావించవచ్చు"

(ఆరుద్ర. 1990. 111)

అందువలన కంకంటి పాపరాజు కూడా ఈ కాలంలోనే జీవించినాడని తెలుస్తున్నది. కంకంటి పాపరాజు అమీనుగా ఉన్న ప్రళయకావేరి ప్రాంతానికి వ్యాపార

నిమిత్తం వచ్చే విదేశీయులైన డచ్చి, ఆంగ్లేయులకు దుబాషీగా వ్యవహరించేవాడు. పాపరాజు విదేశీయులతో సత్సంబంధాలు కలిగి బాగా సంపన్నుడైనాడు. ఆసమయంలోనే పుష్పగిరి తిమ్మనను ఆదరించి, అతని ద్వారా కావ్యరచనలో సహాయాన్ని పొందినాడు అని ఆరుద్ర అభిప్రాయపడ్డాడు. "పాపరాజు గారు విదేశీయులతో సంబంధాలు పెట్టుకొని బాగా శ్రీమంతులైనట్లుంది. ఆయన స్నేహితుణ్ణి రప్పించుకొని తనవద్ద పెట్టుకొని తన రచనా వ్యాసంగంలో వారి సలహాలు తీసుకొని ఉంటాడు. ఉత్తర రామాయణంలో చాలాపద్యాలు తిమ్మనగారి సహాయం వల్లనే నడిచి ఉంటాయి" (ఆరుద్ర. 1990. 106) పాపరాజు స్నేహితుని సహాయాన్ని మరువకుండా తనరెండు కావ్యాలలో స్మరించుకొని కృతజ్ఞతను చూపాడు. "అనేకాంధ్ర కృతిప్రకల్పన సమర్థుడు నా సహశ్రోత" (ఉ.రా. 1.24) "కిరీటికి శౌరితోడైనట్టు లమ్మహాకవి సాహాయ్య మొనరింప" (ఉ.రా. 1.26)

విష్ణుమాయావిలాసాన్ని పద్యప్రబంధంగా రచించిన రోసనూరి వేంకటపతి తన కావ్యాన్ని వెంకటగిరి ప్రభువైన వెలుగోటి బంగారు యాచమ నాయకునికి అంకితం చేశాడు. ఈ రోసనూరి వేంకటపతి క్రీ.శ. 1700-1760 మధ్య కాలంలో జీవించాడు. రోసనూరి వేంకటపతి కంకటి పాపరాజు యక్షగానాన్ని అనుసరించి తన కావ్యాన్ని రచించాడు. దానికి నిదర్శనాలు వేంకటపతి పద్య కావ్యంలోనే అనేకం కనిపిస్తున్నాయి.

పాపరాజు ".. కినుక రదనములు కిటకిట గీటువారు
మొగమెఱ్ఱఁబాఱ బొమముడి వెట్టువారు"

వెంకటపతి "గిటగిట పండ్లు గీటుచును గ్రిక్కిరియున్మును చుట్టు ముట్టియున్
బెటబెటలైన పల్కులను భీషణ భంగుల..బ్రేలియుగ్రునిన్"
(వేంకటరమణయ్య, నేలటూరు. 1955. 24 పీఠిక)

ఈ విధంగా పాపరాజు పద్యాలను అనుకరించుట వలన రోసనూరి వెంకటపతి కంటే పాపరాజు పూర్వుడు అని తెలుస్తున్నది. అందుచేత కంకటి పాపరాజు క్రీ.శ. 1700కి ముందే జీవించినాడని చెప్పవచ్చు.

మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో గల కంకంటి పాపరాజు ఉత్తర రామాయణ ప్రతులలో ఒకదాని చివర 'ప్రజోత్పత్తి నామ సంవత్సర పుష్య బహుళ ఏకాదశీలు వఱకు మునగాల తిరువెంగలయ్య వ్రాసిన ఉత్తర రామాయణము సంపూర్ణము' అని ఉంది. అది క్రీ.శ. 1632వ సంవత్సరం జనవరి ఏడవ తేదికి సరిపోతున్నదని నేలటూరి వెంకటరమణయ్యగారు అభిప్రాయపడ్డారు. "ఇది శ్రీస్వామి కణ్ణుపిళ్ళై గారి ఇండియన్ ఎఫీమెరిస్ ప్రకారం క్రీ.శ. 1632వ సంవత్సరం జనవరి యేడవ తేదికి సరిపోయినది" (వేంకటరమణయ్య, నేలటూరు. 1955. 31)

కంకంటి పాపరాజు కాలాన్ని ఆచార్య యస్వీ జోగారావుగారు క్రీ.శ. 1575-1632గా నిర్ణయించారు. "ఆచార్య డా॥ యస్వీ జోగారావుగారు బట్టేపాటి తిమ్మయ్య.

క్రీ.శ.1575 ప్రాంతము వాడయి యుండునని చెప్పి, కంకంటి పాపరాజు కాలమును క్రీ.శ.1575-1632 నడుమగా నిర్ణయించుట సమంజసముగా కన్పించుచున్నది" (పాండురంగారావు, యం.1981.324) ఈ పరిశీలన వలన కంకంటి పాపరాజు క్రీ.శ.1575-1632 మధ్యకాలంలో జీవించినాడని చెప్పవచ్చు.

2.2.4. రచనలు

కంకంటి పాపరాజు రచనలుగా విష్ణుమాయావిలాస యక్షగానం, ఉత్తర రామాయణ కావ్యం అనే రెండు గ్రంథాలు లభిస్తున్నాయి.

ఉత్తర రామాయణము

ఇది తిక్కన రచించిన 'నిర్వచనోత్తర రామాయణ' కావ్యాన్ని అనుసరించి రచించిన చంపూకావ్యం. తిక్కనగారి కావ్యం శృంగార ప్రధానమైతే, పాపరాజు కావ్యం కరుణరస ప్రధానంగా సాగింది. పాపరాజు ఉత్తర రామాయణ కావ్యం ద్వారా శ్రీరామచంద్రుని సత్కథను రచించి కవిత్వం సార్థకం చేసుకోవడం తన ఆశయమని ప్రకటించాడు.

"వరుసం దిక్కయజ్వ నిర్వచన కావ్యంబై తగంజేసె ను
త్తర రామాయణమందునన్ మఱి ప్రబంధంబూని నిర్మించుటే
సరసత్వంబని ప్రాజ్ఞులార నిరసించ బోకుడీ రాఘవే
శ్వరు చారిత్రమునెంద రెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే" (పాపరాజు, కంకంటి. 1981.1-14) ఉత్తర రామాయణకథ లోకప్రసిద్ధమైనది. సీతాపరిత్యాగ ఘట్టం రచించి పాపరాజు ప్రసిద్ధి పొందాడు. ఈ కావ్యాన్ని శ్రీ కృష్ణునికి అంకితం చేశాడు. కంకంటి పాపరాజు సకల రాజభోగాలను అనుభవించినవాడని ఉత్తర రామాయణ కావ్యంలోని ఆశ్వాసాంత గద్యం వలన తెలుస్తున్నది. అంతే కాకుండా రాజయోగాభ్యాసం చేసి, యోగశాస్త్రాన్ని గ్రహించినవాడు. పాపరాజు రాజనీతివిద్యా పారంగతుడు, గణితశాస్త్రంలో కూడా ప్రవేశం కలవాడు అని తెలుస్తున్నది.

2.3. కంకంటి నారసింహకవి (క్రీ.శ.17వ శతాబ్దం)

2.3.1. పరిచయం

కంకంటి నారసింహకవి పాపరాజుకు తమ్ముడని విష్ణుమాయా విలాస యక్షగానంలో పాపరాజు పేర్కొన్నాడు.(పాపరాజు, కంకంటి.1955.3) నారసింహకవి తనను గురించి "రామచంద్ర చరణ సరసిజసేవా ధురంధరుండును సుకవిజన మనోహరుండును, సమదకుకవివారణ సింహండగు కంకంటి నారసింహకవి సార్వభౌమ" అని విష్ణుమాయా విలాస ద్విపద ప్రబంధంలో పేర్కొన్నాడు. నారసింహకవి ఆర్వేల నియోగివంశానికి చెందినవాడు. శ్రీవత్సగోత్రుడు. వల్లభామాత్యుడు ఇతనికి ముత్తాత. అయ్యనమంత్రి తాత. నరసమాంబ, అప్పయ్యమంత్రి తల్లిదండ్రులు. కంకంటి

పాపరాజు ఇతనికి అన్న అని తెలుస్తున్నది.

"నార్వేల వంశాబ్ధి హరిణలాంఛనుడు, నరవర్ణ్యు వేంకట నరసింహుగన్న
సరసుండు పాపరాజు ప్రధానుండు" (నారసింహకవి, కంకంటి. 1865. 2)

2.3.2. నివాస ప్రాంతం

కంకంటి నారసింహకవి కూడా పాపరాజు లాగే నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలోని దుగరాజపట్నం నందు నివసించినాడని చెప్పవచ్చు. ఇతడు కూడా పుష్పగిరి తిమ్మన వలన కృతిరచనలో సహాన్ని పొందటం, పాపరాజును గురించి తనకావ్యాలలో కీర్తించటం దానికి నిదర్శనాలుగా చెప్పవచ్చు.

2.3.3. చారిత్రక నేపథ్యం

నారసింహకవి తన అన్నగారైన పాపరాజును గురించి ద్విపద విష్ణుమాయా విలాసంలో ప్రస్తావించాడు. అంతేకాకుండా పంకజాప్త సమప్రభా విహారుడు, సరసుడు అని పాపరాజును కీర్తించినాడు. నారసింహకవి కావ్యరచనకు పూనుకొనే సమయానికే పాపరాజు మరణించినట్లు తెలుస్తున్నది. అందుచేతనే నారసింహకవి పాపరాజు తనకు కలలో కనిపించినట్లుగా చెప్పుకొన్నాడు.

"సరసుండు పాపరాజు ప్రధానుండు, నాకలలో నొక్కనాడు గాన్పించి
యేకతంబున గూర్మి యెసగ నిట్లనియె" (నారసింహకవి, కంకంటి. 1865. 2)

నారసింహకవి తాను రచించబోవు విష్ణుమాయా విలాస ద్విపద కావ్యాన్ని శ్రీరామ చంద్రునికి అంకితం చేయమని పాపరాజు సూచించినాడని చెప్పుకొన్నాడు. నారసింహకవి కృతి రచనలో పూర్వం పాపరాజుకు సహాయం చేసిన పుష్పగిరి తిమ్మన కవిని సాయం కోరమని కూడా అన్నగారు సూచించినట్లు తెలుస్తున్నది. అన్నగారి మటను గౌరవించే నారసింహకవి పుష్పగిరి తిమ్మనను ఆదరించినట్లు తెలుస్తున్నది. అందుకు ప్రతిగా తిమ్మనకవి కృతి రచనలో సహాయం అందించినట్లు కూడా నారసింహకవి పేర్కొన్నాడు.

"ననఘుని పుష్పగిర్యప్పన్న తనయు, ఘన సంస్కృతాంధ్రైక కవనాతిదక్షు
మాయన్న సఖుని తిమ్మనకవి గృతిస, హాయుని బిలిపించి యమ్మేటితోడ"

(నారసింహకవి, కంకంటి. 1865. 3) నేలటూరు వేంకట రమణయ్య గారు కంకంటి నారసింహకవి కాలాన్ని క్రీ. శ. 17వ శతాబ్దం మధ్యకాలంగా పేర్కొన్నారు. "పాపరాజు తమ్ముడును, గ్రంథరచన యందు బుష్పగిరి తిమ్మనార్యుని సాయము నందిన కంకంటి నారసింహరాజును వీరివలెనే క్రీ. శ. 17వ శతాబ్దమధ్యమున వర్థిల్లెననుటకు సంశయింపబనిలేదు కదా" (వేంకటరమణయ్య, నేలటూరు. 1955. 17)

ఈనిదర్శనాల వలన కంకంటి నారసింహకవి తన అన్న పాపరాజు మరణించిన తర్వాత కావ్యరచన చేశాడని తెలుస్తున్నది. పాపరాజుకు కృతి రచనలో సహాయకుడైన

పుష్పగిరి తిమ్మన కవి నారసింహకవికి కూడా సాయం చేశాడు. కంకంటి పాపరాజు (క్రీ.శ. 1575-1632) తర్వాతనే నారసింహకవి కావ్యరచనను ప్రారంభించుట వలన ఈతడు క్రీ.శ. 17వ శతాబ్దం మధ్యకాలంలో జీవించినాడని చెప్పవచ్చు.

2.3.4. రచనలు

కంకంటి నారసింహకవి రచనగా విష్ణుమాయా విలాస ద్విపదకావ్యం ఒక్కటి మాత్రమే లభ్యమవుతున్నది. నారసింహకవి తన ఇతర రచనలుగా వేటినీ ప్రస్తావించలేదు. అందువల్ల ఈ ద్విపద కావ్యం ఒకటి మాత్రమే నారసింహకవి రచనగా తెలుస్తున్నది.

2.4. రోసనూరి వేంకటపతి (క్రీ.శ. 1700-1760)

2.4.1. పరిచయం

రోసనూరి వేంకటపతి శ్రీదత్తాత్రేయ గురుచరణాలను ఆశ్రయించినవాడని, భద్రకాళీ వరప్రసాదిత కవితా చమత్కారం కలవాడననీ చెప్పుకొన్నాడు. వెంకటగిరి ప్రభువైన కుమార యాచమనాయకుడు వేంకటపతిని తిక్కయజ్వ అనే బిరుదుతో గౌరవించినట్లు ఆశ్వాసాంతగద్యంలో పేర్కొన్నాడు. "శ్రీమద్దత్తాత్రేయ గురుచరణా రవింద భద్రకాళీ వరప్రసాదిత కవితా చమత్కార కుమార యాచనృపదత్త తిక్కయజ్వ నామాంతర." (వేంకటపతి, రోసనూరి. 1898. 45) వేంకటపతి నెల్లూరు మండలంలోని వెంకటగిరి సంస్థానంలో ఆస్థానకవిగా వెలుగోటి రాజుల ఆశ్రయాన్ని పొందినట్లు తెలుస్తున్నది. ఇతడు రోసనూరి లింగనామాత్యునికి పౌత్రుడు. గంగనమంత్రి పుత్రుడు, కాశ్యపగోత్రుడు అని మాత్రమే ఆశ్వాసాంత గద్యంవలన తెలుస్తున్నది.

2.4.2. నివాసప్రాంతం

రోసనూరి వేంకటపతి ఇంటిపేరు 'రోసనూరు' అనే గ్రామనామాన్ని తెలియజేస్తున్నది. 'రోసనూరు' అనే పేరుగల గ్రామం వెంకటగిరి సంస్థానానికి చెందిన సగుటూరు సమీపంలో ఉంది. వెంకటగిరి ప్రభువులకు ఆశ్రితుడైన వేంకటపతి ఆ సమీప ప్రాంతంలోని రోసనూరు గ్రామ వాసి అని తెలుస్తున్నది. రోసనూరు వెంకటగిరి సంస్థానానికి చెందిన సగుటూరు సీమలోనిదని నేలటూరు వేంకటరమణయ్యగారు పేర్కొన్నారు. "నెల్లూరు జిల్లా వెంకటగిరి సంస్థానమునకు చెందిన సగుటూరు సీమయందీ గ్రామము గలదు. వెంకటపతియో, యాతని పూర్వీకులలో సదరు గ్రామ వాస్తవ్యులై యుండవలయును" (వేంకటరమణయ్య, నేలటూరు. 1898. 7)

2.4.3. చారిత్రక నేపథ్యం

రోసనూరి వేంకటపతి తన కావ్యంలో వెంకటగిరి ప్రభువులను, వారి దర్బారును విశేషంగా వర్ణించాడు. వేంకటపతి కృతిపతి అయిన బంగారు యాచమనాయకుని తండ్రి కుమార యాచమ నాయకుడు 'తిక్కయజ్వ' అనే బిరుదును ఇచ్చాడని

చెప్పుకొన్నాడు. "నను శ్రీభూపతి లింగపాఠ భజనానందున్ గుమారేచ భూ
జన పాలాగ్రణి తిక్కయజ్వుండనుచున్ జాలంగఁబేరిచి" (1-30)
వేంకటపతి కావ్యానికి కృతిభర్త బంగారు యచమనాయకుడు (క్రీ.శ. 1722-1777) వెంకటగిరి సంస్థాన ప్రభువుల పరంపరలో 24వ రాజు. వేంకటపతి తనకాలం నాటి వెంకటగిరి ప్రభువుల సభామందిరాన్ని, ప్రభువు సింహాసనాన్ని రాజుకొలువు తీరే విధానాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడు. (1-26, 29. 10) వేంకటపతి కాలాన్ని గురించి నేలటూరు వేంకట రమణయ్యగారు విష్ణుమాయా విలాస యక్షగానానికి రాసిన పీఠికలో ప్రస్తావించారు. "సదరు విష్ణుమాయా విలాస కృతిపతియగు బంగరేచమ నాయకుడు శా.శ. 1644 ప్లవంగ (క్రీ.శ. 1722) సంవత్సరములో బట్టాభిషిక్తుడాయెను, శా.శ. 1699 (క్రీ.శ. 1777) సంవత్సరమున మృతి నందెను." (వేంకటరమణయ్య, నేలటూరు. 1955. 23)

వేంకటపతిని బంగారు యాచమనాయకుని కంటే ముందే అతని తండ్రి కుమార యాచమనాయకుడు ఆదరించినాడు. తిక్కయజ్వ బిరుదును కూడా ఇచ్చి గౌరవించినాడు. ఈ కుమార యాచమనాయకుడు క్రీ.శ. 1690లో జన్మించి, 1695లో పట్టాభిషిక్తుడై, 1748లో మరణించినట్లు తెలుస్తున్నది. రోసనూరి వేంకటపతి క్రీ.శ. 1700-1770 మధ్యకాలంలో జీవించినాడని నేలటూరి వేంకట రమణయ్యగారు పేర్కొన్నారు. "కావున రోసనూరి వేంకటపతి క్రీ.శ. 1700-1770ల మధ్య జీవించి యుండెనని చెప్పుట యొప్పగును" (వేంటకరమణయ్య, నేలటూరు. 1955. 24)

దీనివలన రోసనూరి వేంకటపతి తనకాలం నాటి వెంకటగిరి ప్రభువుల ఆస్థానంలో కవిగా ఉండేవాడని తెలుస్తున్నది. రాజదర్బారు, రాజు కొలువు తీరే విధం రాజసభలోని మర్యాదలు, సభామండప నిర్మాణం, రాజ సింహాసనం రూపురేఖలు మొదలైన విషయాలన్నీ స్పష్టంగా ఈతని కావ్యంలో వర్ణితమై కన్పిస్తున్నాయి.

2.4.4. రచనలు

రోసనూరి వేంకటపతి తన 'విష్ణుమాయా విలాసము' అనే ప్రబంధంలో ఇతర రచనలను గురించి ప్రస్తావించలేదు. సాహిత్య చరిత్రకారులు కూడా విష్ణుమాయా విలాసాన్ని మాత్రమే వేంకటపతి రచనగా పేర్కొన్నారు. కాబట్టి వేంకటపతి రచన 'విష్ణుమాయా విలాసము' అనే ప్రబంధం మాత్రమే అని తెలుస్తున్నది.

2.5. ఎఱగుడిపాటి వేంకటకవి (క్రీ.శ. 1750)

2.5.1. పరిచయం

ఎఱగుడిపాటి వేంకటకవి శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ కవిత్వంతో కావ్య రచన చేసినట్లుగా చెప్పుకున్నాడు. వేంకటకవి తాను 'చతురాస్యముఖజాత సద్బ్రహ్మ కులవార్ధి'లో ఆర్వేల నియోగివంశంలో జన్మించినవాడనని, భరద్వాజ గోత్రుడననీ

చెప్పుకొన్నాడు. వేంకట కవి వంశానికి శ్రీగిరిమంత్రి మూలపురుషుడు. వెంగమాంబ, నరసమంత్రి ఈయన తల్లిదండ్రులు. వేంకటకవి తమవంశానికి మూలపురుషుడైన శ్రీగిరిమంత్రి నుంచి తన వరకూ గల వంశక్రమాన్ని పేర్కొన్నారు. అందులో పురుషులతోపాటుగా స్త్రీలను గురించి కూడా పేర్కొనటం విశేషంగా చెప్పుకోవచ్చు. శ్రీగిరిమంత్రికి వేంకటాచార్యుడు, సూరనమంత్రి అని ఇద్దరు కుమారులు. వారిలో సూరనమంత్రికి అంబాంబిక వలన ఇద్దరు కుమారులు కలిగారు. వారిలో బిట్టనమంత్రి అగ్రజుడు. బిట్టనమంత్రికి నరసాంబ వలన ఇద్దరు కుమార్తెలు, వేంకటమంత్రి, రామమంతి అనే ఇద్దరు కుమారులు కలిగారు. వేంకటమంత్రికి అచ్చమాంబ, లచ్చమాంబ అని ఇద్దరు భార్యలు. వారిలో అచ్చమాంబ వలన నరసమంత్రి అనే కుమారుడు కలిగాడు. ఆ నరసమంత్రికి వెంగమాంబ వలన కలిగిన కుమారుడే ఎఱగుడిపాటి వేంకటకవి అని అవతారికలోని 17 నుంచి 41 పద్యాల వలన తెలుస్తున్నది. (వేంకటకవి, ఎఱగుడిపాటి. 2007. 41)

2.5.2. నివాసప్రాంతం

ఎఱగుడిపాటి వేంకటకవి తన కావ్యానికి కృతిభర్త అయిన బిలకూటక్షేత్రం (బిట్రగుంట)లో వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామి చరిత్రను వర్ణించాడు. బిట్రగుంట సమీపప్రాంతాలైన గౌరవరం, కందుకూరు, ఉదయగిరి, నెల్లూరు ప్రాంతాలను ఇందులో విశేషంగా వర్ణించడం కనిపిస్తుంది. బిట్రగుంట వేంకటేశ్వరుని చరిత్రను ఇరవైనాలుగు పద్యాలలో (1.45-69) వర్ణించాడు. గౌరవర గ్రామాన్ని, దాని నిర్మాణాన్ని ముప్పైపద్యాలలో (1.71-101) వర్ణించడం కనిపిస్తుంది. ఈ నిదర్శనాల వలన వేంకటకవి బిట్రగుంట సమీప ప్రాంతంలో జీవించినాడని భావించవచ్చు.

2.5.3. చారిత్రక నేపథ్యం

ఎఱగుడిపాటి వేంకటకవి తన వంశక్రమాన్ని గురించి ప్రస్తావించాడు కాని, తన గురించి ఎక్కడా పేర్కొనలేదు. బిట్రగుంటక్షేత్ర వర్ణన చేస్తూ, దానికి ఉత్తరంగా ఒక తిప్ప సమీపంలో గౌరమాంబ అనే రాజకుమార్తె, 'గౌరవరం' గ్రామాన్ని నిర్మించిందని వర్ణించాడు. ఈ గౌరమాంబ ఉదయగిరి రాజు అయిన నరసింహ గజపతి కుమార్తె. నెల్లూరును నరసింహ గజపతి తన కుమార్తె అయిన గౌరమాంబకు బహూకరించాడని వేంకటకవి,

"జనపతి కొడుకుంగూతును, గనుకొని సంతుష్టినొంది కడుపొంగుచునం
దనునకు కందుకూరును, తనయకు నెల్లూరొసంగె తాత్పర్యమునన్" (1.77)

అనే పద్యంలో వర్ణించాడు. బిట్రగుంట క్షేత్రానికి 'బిలకూటముట్టు' అనే నామాంతరం ఉంది. పూర్వం దానిని పుణ్యపురం అనిపిలిచేవారని, అది బ్రాహ్మణ అగ్రహారమనీ వేంకటకవి వర్ణించాడు.

బిట్రగుంటలోని కేశవస్వామి నారదుడు ప్రతిష్ఠించినదని కూడా ఈ కావ్యంలో వర్ణించబడింది.

"ఆ నారదముని వరుడభి, మానము బిలకూట ముట్టు మహిభృద్వరసం
స్థానమగు నగ్రహారము, నానాటకు బిట్రగుంట నావిలసిల్లెన్ " (1.68)

గౌరవం నిర్మాణం తర్వాత సంభవించిన కుంభవృష్టిని గురించి వేంకటకవి ఇందులో ప్రస్తావించాడు. నెల్లూరు జిల్లావాసులలో ప్రాచీనులకు సుపరిచితమైన 'పెద్ద గాలివాన' గా ఈ సంఘటనను గుర్తించవచ్చు. గౌరమాంబ వలన గౌరవరం నిర్మాణం జరిగిన తర్వాత ఆమె భక్తిని పరీక్షించేందుకు శ్రీవేంకటేశ్వరుడు ఏడు అహోరాత్రులు కుంభవర్షం కురిపించాడు. ఆ మహావృష్టికి స్వర్ణముఖి, పినాకినీ నదులు నిండుగా ప్రవహించాయి. భూభాగమంతా జలమయ మైందని కవి వర్ణించాడు. (1-92)

ఈ విధంగా వేంకటకవి ఉదయగిరి రాజకుమార్తె అయిన గౌరమాంబ చేత నిర్మించబడింది కావున ఆ గ్రామం 'గౌరవరం' అనే పేరుతో పిలువబడిందని పేర్కొన్నారు. అదే విధంగా బిట్రగుంట క్షేత్రంలో కేశవస్వామి ప్రతిష్ఠ నారదుని వలన జరిగిందనే విషయాన్ని ప్రస్తావించాడు. వేంకటకవి ఏడురోజులపాటు కురిసిన కుంబవృష్ఠిని గురించి, అప్పటి జలప్రళయం వంటి పినాకినీ నది వరదల గురించీ ఈ కావ్యంలో వర్ణించడం ఆనాటి పరిస్థితులకు చారిత్రకమైన నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

2.5.4. రచనలు

ఎఱగుడిపాటి వేంకటకవి విష్ణుమాయా విలాస కావ్యంలో ఇతర రచనలు వేటినీ ప్రస్తావించలేదు. అందుచేత వేంకటకవి రచన ఈ విష్ణుమాయా విలాస కావ్యంలో ఒకటి మాత్రమేనని భావించవచ్చు.

# 3. విష్ణుమాయా విలాసకావ్యాలు - ఇతివృత్తం

విష్ణుమాయా విలాస కావ్యాలకు నామసామ్యంతో పాటు ఇతివృత్త సామ్యం కూడా కనిపిస్తుంది. చింతలపూడి ఎల్లనార్యుడు తన 'విష్ణుమాయానాటకము' అనే ప్రబంధంలో ఇతివృత్తాన్ని నిర్వహించిన విధానాన్ని పరిశీలించడం ఈ విభాగంలోని ప్రధానాంశం. దానితోపాటుగా మిగిలిన నలుగురు కవుల ఇతివృత్త నిర్వహణ ఏవిధంగా జరిగిందో కూడా పరిశీలించటం జరుగుతుంది.

3.1. ఇతివృత్తం

కావ్యంలో కవి వర్ణించిన ప్రధాన కథా భాగాన్ని 'ఇతివృత్తం' అని చెప్పవచ్చు. దీనినే 'వస్తువు' అని కూడా అంటారు. ప్రాచీన ఆలంకారికుడైన భరతుడు తన నాట్యశాస్త్రంలో రూపక లక్షణాలను చెబుతూ, ఇతివృత్తమే రూపకానికి శరీరం అన్నాడు. ఇక్కడ రూపకం అంటే కావ్యం అని భావిస్తే, కావ్యానికి ఇతివృత్తమే శరీరమని తెలుస్తున్నది. ఏకావ్యంలో నైనా కవి తాను చెప్పదలచుకున్న ప్రధాన విషయాన్ని పాత్రల చేత, వారి చేష్టాదులను వర్ణించుట ద్వారా పాఠకునికి అవగతం చేయటానికి చేసే ప్రయత్నం అంతా కావ్యేతివృత్తంలో ఇమిడి ఉంటుంది. అని చెప్పవచ్చు.

3.1.1. చింతలపూడి ఎల్లనార్యుడు - ఇతివృత్త నిర్వహణ
పరిచయం

చింతలపూడి ఎల్లనార్యుని 'విష్ణుమాయా నాటకము' అనే ప్రబంధంలోని ఇతివృత్తం ఐదుకథల రూపంలో విస్తరించి ఉంది. మూడవ ఆశ్వాసంలోని 'పుండరీకో పాఖ్యానం' ఐదవ ఆశ్వాసంలోని 'చందదమనుని కథ' అనేవి రెండు ఉపకథలు. భాగవతసత్కధను శుకమహర్షి వలన విన్న తర్వాత పరీక్షిత్తు మహారాజుకు కగిలిన సందేహరూపమైన ప్రశ్నతో ఈ ప్రబంధం ప్రారంభమవుతున్నది. అందుచేత ఎల్లనార్యుడు తన కావ్యానికి మూలకథను భాగవతం నుండి గ్రహించినట్లు తెలుస్తున్నది.

"భాగవతముఖ్యుడగు శుకబ్రహ్మచేత, భాగవత సత్కథాపర బ్రహ్మవిద్య
నెలిమి వినుచుఁ బరీక్షిన్నరేంద్రచంద్రు, డచ్యుతక్రీడ లాత్మకింపారంబలికె" (1-1)

అనేపద్యం దానికి నిదర్శనంగా కనపిస్తున్నది. సకల ప్రపంచమంతా విష్ణుమాయా శక్తి ప్రకల్పితమని, దాన్ని గ్రహించలేక అహంకార ప్రేరేపితులైన బ్రహ్మ, రుద్ర, నారదాది దేవతలు కూడా విష్ణుమాయ చేత పరాభవాన్ని పొందక తప్పదు. సత్వగుణంతో, భక్తితో శ్రీమహావిష్ణువును ఆరాధించినవారు సంసార బంధం నుండి ముక్తిని పొందగలరని చాటడానికే ఎల్లనార్యుడు ఈ ప్రబంధాన్ని రచించాడని తెలుస్తున్నది.

3.1.1.1. ప్రథమాశ్వాసం

భాగవతసత్కథ పరబ్రహ్మ విద్యను శుకమహర్షి వలన వింటున్న పరీక్షిత్తు మహారాజు వేదసిద్ధాంత రహస్యవేదులైన మహామతులుకూడా తద్దివ్య విష్ణుధ్యేయ

తేజోరూపం తుదిముట్ట గాంచి తదాత్మకమును పొందకుండా, త్రివర్గఫల భోగాలను అనుభవించి, అల్పసుఖాను సారులు కావడానికి కారణమేమిటో సంశయవిచ్ఛేదంగా తెలియజెప్పుమని అడిగాడు. దానికి శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు. పూర్వం ధర్మరాజుకు కూడా పరీక్షిత్తు మహారాజుకు కలిగినటువంటి సందేహమే కలిగి, శ్రీకృష్ణుని యాదార్థ్యమును తెలుపమని వ్యాసుని అడిగాడు. వ్యాసుడు శ్రీమహావిష్ణువు అంశమే శ్రీకృష్ణుడని తెలిపాడు. విష్ణుమాయ చేత లోకమంతా ఆవరించబడి ఉంది. విష్ణుమాయను తరించను ఎవరికీ సాధ్యంకాదు. ఆ చతుర్ముఖ కీటకపర్యంత జంతుతతులు విష్ణుమాయలో పరిభ్రమిస్తూ ఉంటాయని వ్యాసుడు శ్రీకృష్ణుని మహిమను వర్ణించాడు. అహంకార పరులైనప్పుడు బ్రహ్మరుద్రాది దేవతలు కూడా విష్ణుమాయాకు చిక్కుకొని మోసపోతారని, విష్ణుమాయా ప్రభావం ముందు తామెంత వారమనీ వ్యాసుడు పలికాడు. ధర్మరాజు కోరగా వ్యాసుడు, బ్రహ్మ, రుద్ర, నారదాదులు విష్ణుమాయకు మోసపోయిన కథలను చెప్పటానికి పూనుకున్నాడు.

అంతలో ద్వారకానగరం నుండి శ్రీకృష్ణుని నర్మసఖుడు గోవిందశర్మ సనక సనందనాది మునులతో కూడి ధర్మరాజు కొలువుకు వచ్చాడు. గోవిందశర్మ తనను శ్రీకృష్ణుడు పంపగా వచ్చానని తెలిపాడు. ధర్మరాజు కోరికమీద సభలోని వారికి గోవిందశర్మ పూర్వం అతడు రచించిన 'విష్ణుమాయా నాటకం' అనే ప్రబంధంలోని కథలను వినిపించడం ప్రారంభించాడు. గోవిందశర్మ ముందుగా సత్యభామాదేవి అనుగ్రహంతో తనకు పారిజాత పుష్పమాలిక లభించిన వృత్తాంతాన్ని వినిపించాడు. శ్రీమహావిష్ణువు అంశ అయిన శ్రీ కృష్ణుడు అష్టమహిషుల ఇళ్లలోను, సహస్ర సంఖ్యలైన గోపాంగనల సమక్షంలోనూ ఏక కాలంలో అన్నిరూపాలు ధరించి దక్షిణ నాయకత్వం వహించి ఉన్నాడు. సత్యభామ, పారిజాతవృక్షం తన పెరటి చెట్టు అయిందని అహంకరించింది. ఆమె పారిజాత పుష్పాలను రుక్మిణీ మొదలైన సపత్నుల అంతఃపురాలకు చెలికత్తెలతో పంపించింది.

సత్యభామ శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ తన మందిరంలోనే ఉంటుండగా రుక్మిణి మొదలైన సపత్నులు ఏ విధంగా అవమాన భారంతో సిగ్గుపడుతున్నారో తెలుసుకోవాలని ఆరాటపడింది. సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుడు సత్యభామ అహంకారాన్ని గ్రహించాడు. అష్టమహిషుల ఇళ్లలో మాయాపారిజాత వృక్షాలు కల్పించాడు. తానుకూడా అన్ని రూపాలతో, అందరి ఇళ్లలో ఏకకాలంలో కనిపించాడు. సత్యభామ తన చెలికత్తె ద్వారా రుక్మిణి అంతఃపురంలో కూడా పారిజాత వృక్షం ఉందని తెలుసుకొని శ్రీకృష్ణుడిని నిందించింది. అంతేకాకుండా ఈర్ష్య వల్ల కలిగిన విషాదంతో దుఃఖించింది. ఆ తర్వాత రోజు గోవిందశర్మ సత్యభామ అంతఃపురానికి వెళ్ళి, జరిగిన కథంతా విని, అది విష్ణుమాయా లీలా విలాసమని ఆమెకు తెలిపాడు. గోవిందశర్మ పూర్వం విష్ణుమాయాకు తగుల్కొని పరాభవానికి గురైన మహాలక్ష్మి, బ్రహ్మ, రుద్ర, నారదాదుల కథలను వినిపించి,

సత్యభామకు దుఃఖం నుంచి ఉపశమనం కలిగించాడు. సత్యభామ దానికి సంతోషించి, శ్రీకృష్ణుని అనుమతితో గోవిందశర్మకు పారిజాత పుష్ప మాలికను బహూకరించింది.
3. 1. 1. 2. ద్వితీయాశ్వాసం

శ్రీమహావిష్ణువు వైకుంఠంలో ఒకనాడు వినోదార్థమై మహాలక్ష్మితో పాచికలాడుతూ తన కౌస్తుభ రత్నాన్ని పందెంగా పెట్టాడు. మహాలక్ష్మి తన చూడామణిని పందెంగా ఉంచింది. మహాలక్ష్మి విష్ణుమాయా ప్రభావంతో ఆటలో ఓడిపోయినందుకు జూదాన్ని, విష్ణువునూ నిందించింది. మహాలక్ష్మి ఈర్ష్యతో వైకుంఠపుర వైభవాన్ని క్షణంలో శూన్యమయంగా చేసింది. విష్ణువు మహాలక్ష్మి అహంకారానికి మనస్సులో కలుషించాడు. ఆమెను ఓదార్చేనెపంతో క్షీరసాగరం తీరంలోని ఉద్యానవనంలో విడిచి అదృశ్యుడైనాడు. విష్ణువు వైకుంఠపుర వైభవాన్ని తిరిగి ప్రకాశింపజేసి, మాయాలక్ష్మిని కల్పించాడు. మహాలక్ష్మి దేవకాంతలతో వనవిహారం చేస్తూ, ఒక కొలనులో మాయాలక్ష్మిని చూసి, ఆమె దీనంగా ఉండటానికి కారణమేమని అడిగింది. మాయాలక్ష్మి తాను లక్ష్మీదేవినని, విష్ణుమహిమను చులకన చేసినందుకు ఆమెకు ఈ రూపం కలిగిందని తెలిపింది. అంతలో పుష్పక విమానంలో బ్రహ్మాది దేవతలు వచ్చి, మాయాలక్ష్మిని వైకుంఠానికి ఆహ్వానించారు. ఆ మాయాలక్ష్మి వైకుంఠానికి వెళుతూ దేవకాంతలను వెంటబెట్టుకొని మహాలక్ష్మి తేజస్సును హరించి వెళ్లింది. మహాలక్ష్మి ఉద్యానవనంలో ఒంటరిగా తిరుగుతూ భర్తతో కలిగిన ఎడబాటును, మాయాలక్ష్మి వైభవాన్ని తలచుకొని పరితపించింది. మహాలక్ష్మి తాను శూన్యం కావించిన వైకుంఠపురం తిరిగి ప్రకాశించడం చూసి ఆశ్చర్యపోయింది. అక్కడ శ్రీమహావిష్ణువు మయాలక్ష్మితో కలిసి ఉన్నాడని తెలుసుకొని దుఃఖించింది. మహాలక్ష్మి పూర్వం మాయాలక్ష్మి తపస్సు చేసిన కొలను చేరుకొని, పశ్చాత్తాపంతో శ్రీమహావిష్ణువును ధ్యానించింది. శ్రీమహావిష్ణువు మహాలక్ష్మి పశ్చాత్తాపానికి సంతుష్టుడై, తిరిగి ఆమెకు వైకుంఠప్రాప్తిని కలిగించాడు.
3. 1. 1. 3. తృతీయాశ్వాసం

బ్రహ్మ శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించి, సృష్టినిర్మాణ కార్యదక్షతను వరంగా పొందినాడు. బ్రహ్మ సృష్టినిర్మాణ క్రమాన్ని ప్రారంభించి సకల చరాచర జగత్తును కల్పించాడు. అందువలన బ్రహ్మదేవుడు లోకంలో తాను తప్ప వేరే దైవం లేదని అహంకరించాడు. మార్కండేయముని బ్రహ్మను అధిక్షేపించాడు. మార్కండేయుడు విష్ణుమహిమను స్తుతించి దురభిమానం విడవమని బ్రహ్మకు హితబోధ చేశాడు. ఆమాటలు విని, బ్రహ్మ దురభిమానంతో విష్ణుమాయను తిరస్కరించి మాట్లాడాడు. మార్కండేయుడు బ్రహ్మకు పుండరీకుని కథను వినిపించాడు.
పుండరీకోపాఖ్యానం

పుండరీకుడు మధురాపురంలో నివసించే పరమ భాగవతోత్తముడు, ఒకనాడు నారదుడు వచ్చి పుండరీకునికి విష్ణుభక్తి ప్రభావాన్ని, తులసీ మహిమను సాలగ్రామ

పూజావిధానాన్ని, హరినామ కీర్తన ప్రభావాన్ని వినిపించాడు. పుండరీకుడు విష్ణుమాయా ప్రభావం లోకమంతా వ్యాపించి ఉందని చెప్పిన నారదుని మాటల్ని సందేహించాడు. పుండరీకుని పరీక్షించేందుకు విష్ణుమాయ బోయకాంత రూపంతో కనిపించింది. విష్ణుమాయా మోహంతో తగుల్కొని పుండరీకుడు ఆ బోయకన్యను వివాహం చేసుకొన్నాడు. పుండరీకుడు పూర్వ జ్ఞానాన్ని మరచి, బోయకాంతతో మాయాసంసారం చేసి సంతానాన్ని పొందాడు. కరువు కాటకాలు బాధించగా పుండరీకుడిడు భార్యతో కలిసి దేశాటన చేస్తూ ఒక అగ్రహారం చేరుకున్నాడు. విష్ణుమాయాప్రభావంతో పుండరీకుడు తన ఇంటికే భిక్షకు వెళ్ళాడు. అది చూసి అతని భార్య శ్రీమహావిష్ణువును ధ్యానించింది. శ్రీమహావిష్ణువు పుండరీకునికి మాయాబంధం నుంచి విముక్తి కలిగించాడు. పుండరీకుడు తన శేషజీవితాన్ని విష్ణుధ్యానంతో గడిపి, వైకుంఠం చేరుకున్నాడు.

మార్కండేయుడు ఈ విధంగా పుండరీకుని కథను వినిపించగా, బ్రహ్మ ఆహితబోధను పెడచెవినబెట్టి, విష్ణువును నిందించాడు. సృష్టినిర్మాణ కార్యాన్ని చాలించి, మందరగిరి గుహలో తపస్సు చేయడానికి వెళ్లిపోయాడు. శ్రీమహావిష్ణువు సృష్టినిర్మాణాన్ని యథాప్రకారం కొనసాగించి మయాసరస్వతిని కల్పించాడు. విష్ణువు ఏకాంతంగా తపస్సు చేయాలని భావించిన బ్రహ్మను మాయాసరస్వతి వల్ల కామాతురునిగా చేశాడు. బ్రహ్మ మాయాసరస్వతితో కామకేళిలో మునిగి ఉండగా, ఒకనాడు ఆమె అదృశ్యమైంది. మందరగిరి గుహ వెలుపలికి వచ్చి, దీనంగా మాయాసరస్వతిని వెతుకుతున్న బ్రహ్మను మార్కండేయుడు చూసి హితబోధ చేశాడు. బ్రహ్మ తన అజ్ఞానాన్ని గ్రహించి, పశ్చాత్తాపంతో శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. శ్రీమహావిష్ణువు బ్రహ్మను అనుగ్రహించాడు.

### 3.1.1.4. చతుర్థాశ్వాసం

శ్రీమహావిష్ణువు అనుమతితో దేవదానవులు అమృతంకోసం క్షీరసాగరాన్ని మథించగా, మొదట గరళమనే విషం పుట్టింది. శివుడు హరికి ప్రీతిగా ఆ గరళాన్ని కంఠాన ధరించి నీలకంఠుడు అయినాడు. ఆ తర్వాత క్షీరసాగరం నుంచి ధన్వంతరి ప్రసాదించిన అమృత కలశాన్ని రాక్షసులు సంగ్రహించారు. దేవతలు రాక్షసులకు భయపడి శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మభ్యపెట్టి, అమృతాన్ని దేవతలకు పంచాడు. దేవదానవుల మధ్య జరిగిన యుద్ధంలో అమృతపానం వల్ల దేవతలు జయించారు. నారదుడు ఈ మాయామోహినీ వృత్తాంతాన్ని శివుడికి వినిపించడానికి కైలాసం వెళ్ళాడు. శివుడిని దర్శించుకొని విష్ణువు మోహినిగా అవతరించి దానవులను మోసగించిన విధానాన్ని వినిపించాడు. ఈ నెపంతో నారదుడు శివుని ముందు మోహినీ సౌందర్యాన్ని అతిశయంగా వర్ణించాడు. నారదుడు మన్మథుడిని జయించిన శివుడు కూడా మోహినీ సౌందర్యానికి దాసుడు కావలసిందేనని పంతంగా

పలికాడు. శివుడు నారదుడిపై పంతంతోను, మోహినీ సౌందర్యాన్ని చూడాలనే కుతూహలంతోనూ వైకుంఠానికి పార్వతీసమేతంగా బయలుదేరాడు. శివపార్వతులను శ్రీమహావిష్ణువు సాదరంగా ఆహ్వానించాడు. విష్ణువు శివుని మనసులోని మాటను విని, మోహినిని చూడవద్దని వారించాడు. శ్రీమహావిష్ణువు కొలువులో శివుడు తన మనోనిగ్రహశక్తిని పొగడుకొని విష్ణుమాయను తిరస్కరించగా, విష్ణువు మాయా మోహినిగా అవతరించాడు. శివుడు మోహినీ సౌందర్యానికి ముగ్ధుడైనాడు. మోహినీకాంత తన శృంగార చేష్టావిలాసాలతో శివునికి చిత్తభ్రమను కలిగించి, అదృశ్యమైంది. శివుడు విరహోన్మత్తుడై మోహిని కనిపించగానే ఆమెను కౌగలించుకొన్నాడు. వెంటనే శివునికి శుక్లపతనమై, అది బంగారు, వెండి ప్రవాహాలుగా భూమిపై ప్రవహించింది. శివునికి పరబ్రహ్మ జ్ఞానం కలిగి, తన చేష్టలకు సిగ్గుపడ్డాడు. విష్ణువు శివుడిని అనునయించాడు. శివుడు విష్ణుమహిమను స్తుతించాడు.

3.1.1.5. పంచమాశ్వాసం

వైకుంఠంలోని శ్రీమహావిష్ణువు సన్నిధికి ఒకనాడు విష్ణుమాయ స్త్రీ రూపాన్ని ధరించి వచ్చి, శ్రీమహావిష్ణువుకు, అతని ప్రియకాంతలైన శ్రీదేవి, భూదేవులకు ఇంద్రజాల విద్యతో వేడుకను కలిగించింది. దానికి శ్రీదేవి, భూదేవి మెచ్చుకొని, ఆమాయాకాంతకు తగిన కానుకలు బహూకరించారు. ఆ సమయంలో అక్కడే ఉన్న నారదుడు విష్ణుమాయను జయించిన తాను ఇలాంటి అల్పమైన ఇంద్రజాల విద్యలకు భ్రమించనని గర్వంతో పలికాడు. నారదుడు ముల్లోకాలలో సంచరిస్తూ, విష్ణుమాయను జయించానని చాటుకొన్నాడు. శ్రీమహావిష్ణువు నారదుడి గర్వాన్ని అణచడానికి భూలోకంలో సర్వవరమనే క్షేత్రంలో ఒక పుణ్యాశ్రమాన్ని కల్పించాడు. ఆ పుణ్యాశ్రమంలో విష్ణువు వృద్ధతాపసిగా కపటరూపంతో ఉన్నాడు. నారదుడు విష్ణుమాయా ప్రేరేపితుడై సర్వవర క్షేత్రానికి వచ్చాడు. నారదుడు ఆశ్రమంలో ఉన్న కపటమునిని చూసి, ముల్లోకాలలో విష్ణుమాయను జయించింది తాను ఒక్కడినే అని గర్వంతో పలికాడు. అంతలో ఆకాశవాణి నారదుడిని వారించి, చండదమనుడనే ముని కథను వినిపించింది.

చండదమనునికథ

పూర్వం చండదమనుడనే ముని మాంధాత మహారాజు అంతఃపురంలోని రాజ్యభోగాలను, చూసి తానుకూడా రాజ్యసుఖాలు అనుభవించాలని కోరుకున్నాడు. చండదమనుడు గంగాతీరంలో బ్రహ్మను గురించి తపస్సు చేస్తుండగా సనత్కుమారుడు వచ్చి, చండదమనుడి విషయవాంఛలను విని వగచాడు. సనత్కుమారుడు విష్ణుమాయ నుంచి తప్పించుకోవడం ఎవరికీ శక్యం కాదని పలికి, చండదమనుడిని బ్రహ్మపద సౌఖ్యం కోసం తపస్సు చేయమని సూచించాడు. చండదమనుడు తపస్సుతో బ్రహ్మను మెప్పించి, మోక్షాన్ని కోరాడు. బ్రహ్మ చండదమనుడు రాజ్యసుఖాలు కోరి తపస్సు

చేసినందువల్ల మొదట వాటిని పొందకుండా అతడికి మోక్షం ఇవ్వడం సాధ్యం కాదని పలికాడు. చండదమనుడు నిర్వేదంతో శివుడిని గురించి తపస్సు చేశాడు. శివుడు కూడా రాజ్యసుఖాలు అనుభవించకుండా మోక్షం పొందడం అసాధ్యమని తెలిపాడు. ఆ తర్వాత చండదమనుడు సూర్యుడిని ప్రార్థించగా అతడు కూడా మోక్షం అనుగ్రహించలేక పోయాడు. అంతలో విష్ణుమాయా ప్రభావంతో చండదమనుడు మహారాజుగా మారి రాజ్యసుఖాలలో మునిగిపోయాడు. సనత్కుమారుడు తిరిగివచ్చి, చండదమనుడికి గతాన్ని గుర్తుచేశాడు. చండదమనుడు విష్ణుమాయా మహిమను గుర్తించి, తన అజ్ఞానాన్ని మన్నించమని శ్రీమహావిష్ణువును ప్రార్థించి మోక్షాన్ని పొందాడు.

ఆకాశవాణి ఈ విధంగా నారదుడికి చండదమనుని కథను వినిపించింది. నారదుడు ఆకాశవాణి మాటలను తిరస్కరించి, విష్ణుమాయ చండదమనుడిలాంటి అల్పమానవులను భ్రమించగలదు కాని తనను కాదని గర్వోక్తులు పలికాడు. కపటముని మాటలు విని నారదుడు కొలనులో మునిగి చంద్రరేఖ అనే పేరుతో స్త్రీ రూపాన్ని పొందాడు. చంద్రరేఖ చంద్రకేతుడనే మహారాజును వివాహం చేసుకొని, నూరుమంది కుమారులను పొందింది. చంద్రకేతుడు, అతని కుమారులు యుద్ధంలో శత్రురాజు చేతిలో మరణించారు. చంద్రరేఖ రూపంలో ఉన్న నారదుడు విష్ణుమాయామోహితుడై యుద్ధరంగంలో విలపించసాగాడు. ఆకలిబాధకు సమీపంలోని మామిడిచెట్టు నుంచి పండును అందుకోవాలని ప్రయత్నించి, విఫలమైనాడు. శ్రీమహావిష్ణువు వృద్ధసన్యాసి వేషంతో వచ్చి, నారదుడిని సమీపంలోని కొలనులో స్నానం చేయమని చెప్పాడు.

చంద్రరేఖ రూపంలోని నారదుడు ఆ కొలనులో మునిగి స్త్రీరూపాన్ని విడిచి, తిరిగి తన యథారూపాన్ని పొందాడు. నారదుడు జరిగిన వృత్తాంతమంతా విష్ణుమాయా కల్పితమని గ్రహించి తన మూర్ఖత్వానికి సిగ్గుపడ్డాడు. నారదుడు తన అజ్ఞానాన్ని మన్నించమని విష్ణువును వేడుకున్నాడు. శ్రీమహావిష్ణువు నారదుడిని అనుగ్రహించాడు. విష్ణుమాయా ప్రభావాన్ని గుర్తించక, శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని తమ స్వీయ ప్రతిభగా భావించిన వారు ఆ మాయ చేతనే వంచించబడతారని పై కథలవలన తెలుస్తున్నది. 'సర్వం విష్ణుమయం జగత్' అని ఈ కథలు ప్రకటిస్తున్నాయి.

3.1.2. కంకంటి పాపరాజు - ఇతివృత్త నిర్వహణ

పరిచయం

విష్ణుమాయావిలాస కథలలో కంకంటి పాపరాజు శివదర్పభంగం కథను గ్రహించి యక్షగానంగా రచించాడు. శుకమహర్షి వలన భాగవత సత్కథలను వింటున్న పరీక్షిత్తు మహారాజు అద్భుత స్వాంతుడైనాడు. కపట నారాయణుని విలాసాలకు ఆనందించి, భువన మోహనుడైన పురుషోత్తముడిని మాయావనితగా చూసి లోకం భ్రమించడం సహజమే కాని! సర్వజ్ఞుడైన హరుడు ఎందుకు భ్రమించినాడో తెలియజెప్పుమని పరీక్షిత్తు

మహారాజు పలికిన మాటలే ఈ కావ్యంలోని కథకు మూలం. శుకమహర్షి విష్ణుమాయకు భ్రమించనివారు ఎవరున్నారు! పురుష రూపంతోనే లోకాలను మరులు కొలిపే విష్ణువు మగువగా మారి భ్రమపెట్టడంలో ఆశ్చర్యమేముందని' పరీక్షితు మహారాజుకు మోహినీ అవతార కథను, తద్వారా శివదర్ప భంగం వృత్తాంతాన్ని వినిపించాడు.

3.1.2.1. శివదర్ప భంగం

నారదుడు తన వెంట తుంబురుడు రాగా, కైలాసంలో పరమేశ్వరుని కొలువుకు వెళ్ళి, శివుడికి నమస్కరించాడు. శివుడు నారదుడిని క్షీరసాగరమథనంలో హాలాహలం తర్వాత ఏమేమి కలిగినవి? అమృతాన్ని దేవదానవులకు ఎవరు పంచారు? అని ప్రశ్నించాడు. నారదుడు శివుడితో క్షీరసాగరం నుంచి లభించిన అమృతాన్ని రాక్షసులు బలవంతంగా అపహరించారు. దేవతల మొరవిని శ్రీమహావిష్ణువు మాయా మోహినిగా అవతరించి, రాక్షసులను మోహంలో ముంచి, అమృతాన్ని దేవతలకు పంచాడు. ఆమోహినీ సౌందర్యానికి రాక్షసులే కాదు, మన్మథుడిని దహించిన శివుడైనా మరులు కొంటాడు. నారదుడు విష్ణుమహిమను శివుడిముందు కీర్తించాడు.

శివుడు నారదుని మాటలకు కోపించి, వైకుంఠానికివెళ్లి మోహినిని చూడాలని పార్వతితో అన్నాడు. పార్వతి వైకుంఠంలో పగవాడైన మన్మథుడు, వగలవాడైన విష్ణువు ఉన్నారని శివుడిని వారించింది. నారదుడు మోహినీ విలాసాన్ని పొగిడి శివుడి నిగ్రహశక్తిని హేళన చేశాడు. ప్రమథులు నారదుని మాటలకు కోపించి, అతడిని నిందించారు. శివుడు పార్వతీ సమేతంగా వైకుంఠానికి బయలు దేరాడు. వైకుంఠంలో శ్రీమహావిష్ణువు శివపార్వతులను సాదరంగా ఆహ్వానించాడు. శివుడు నారదునితో తనకు కలిగిన పంతాన్ని విష్ణువుకు తెలిపి, మోహినీ రూపాన్ని చూపమని కోరాడు. శివుడు విష్ణుమాయా ప్రభావం గొప్పదో, శివుని విరక్తిభావం గొప్పదో లోకాలకు చాటాలని విష్ణువుతో పలికాడు. విష్ణువు శివునిదర్పాన్ని, ప్రమథుల గర్వాన్ని అణచడానికి మోహినిగా ప్రత్యక్షమైనాడు. శివుడు తన ముందు ప్రత్యక్షమైన మోహినీకాంతను సహజకాంతగా భావించాడు.

శివుడు మోహినీ సౌందర్యానికి లోలుడై కౌగిలించుకోవాలని భద్రాసనం దిగాడు. అంతలోనే ఆ సభామందిరం శృంగారవనంగా మారింది. మాయామోహిని తన శృంగార చేష్టా విలాసాలతో శివుడిని మరులు కొలిపింది. శివుడు మట్టుమీరిన మోహంతో మోహినిని కౌగిలించుకోబోయాడు. మోహినిని తాకగానే శివునికి శుక్లపతనమైంది. శివుని తేజం ఏఱులై ప్రవహించగా అది తాకిన నేల బంగారం, వెండిగా మారింది. శివుడు పారవశ్యాన్ని విడిచి, జరిగిన సంఘటనకు సిగ్గుపడ్డాడు. మోహిని విష్ణువుగా మారి, శివునికి విష్ణువుకు భేదంలేదని తెలిపింది. శివుడు శ్రీమహావిష్ణువును స్తుతించి, తిరిగి కైలాసానికి చేరుకున్నాడు.

3.1.3. కంకంటి నారసింహకవి – ఇతివృత్తనిర్వహణ పరిచయం.

కంకంటి నారసింహకవి ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకాన్ని అనుసరించి ద్విపదలో ఐదు ఆశ్వాసాల ప్రబంధాన్ని రచించాడు. ప్రథమాశ్వాసంలో ధర్మరాజు ప్రశంస, విష్ణుమాయా ప్రభావం, గోవిందశర్మ వృత్తాంతం, సత్యభామకథ ఉన్నాయి. ద్వితీయాశ్వాసంలో మహాలక్ష్మికథ, మాయాలక్ష్మి వృత్తాంతం ఉన్నాయి. తృతీయాశ్వాసంలో బ్రహ్మకథ, పుండరీకోపాఖ్యానం ఉన్నాయి. చతుర్థాశ్వాసంలో శివునికథ, మోహినీ అవతారం వర్ణించబడ్డాయి. పంచమాశ్వాసంలో నారదునికథ, చండదమనుని కథ ఉన్నాయి. ఈవిధంగా కావ్యప్రారంభం నుంచి, కథలను నడిపిన వరుసక్రమం వరకూ నారసింహకవి ఎల్లనార్యుని కావ్యాన్ని అనుసరించాడు. ఈ కావ్యంలో కూడా కథాశ్రోత పరీక్షిత్తు మహారాజు, కథకుడు శుకమహర్షి.

3.1.3.1. ప్రథమాశ్వాసం

పరీక్షిత్తు మహారాజు శుకమహర్షి వలన భాగవత సత్కథలను వింటూ, విష్ణుమహిమను, అతడి లీలావిలాసాలనూ స్మరించుకొని పులకితగాత్రుడైనాడు. పరీక్షిత్తు మహారాజు, శుకమహర్షితో, విష్ణువు పరమదైవమని తెలిసిన వేదవేదాంత సిద్ధులైన మహామునులు కూడా మోక్షపథాన్ని పొందకుండా, నిరంతరం త్రివర్గ ఫలభోగాలను అనుభవించుటకు కారణమేమిటని ప్రశ్నించాడు. శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుతో లోకమంతా విష్ణుమాయా కల్పితం, విష్ణుమాయను తరించను ఎవరికీ సాధ్యంకాదు. విష్ణుమాయకు పూర్వం మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుడు కూడా మోసపోయినారని విష్ణుమాయా విలాస కథలను చెప్పడం ప్రారంభించాడు. పూర్వం ధర్మరాజు వ్యాసమహర్షితో శ్రీకృష్ణుని నిజతత్వాన్ని తెలుపమని కోరాడు. వ్యాసుడు శ్రీకృష్ణుని మహిమను, విష్ణుమాయా ప్రభావాన్ని చెప్పి, విష్ణుమాయా విలాస కథలను ధర్మరాజుకు వినిపించడానికి పూనుకొన్నాడు. అంతలో ధర్మరాజు సభకు ద్వారకానగరం నుంచి గోవిందశర్మ అనే శ్రీకృష్ణుని నర్మసఖుడు వచ్చాడు. అతని వెంట సనకసనందనాది మునులు కూడా వచ్చారు. ధర్మరాజు గోవింద శర్మను చూసి, అతనికి పారిజాత పుష్పమాల ఏవిధంగా లభించిందని అడిగాడు. గోవిందశర్మ ధర్మరాజుకు పారిజాతపుష్ప మాలిక ప్రాప్తించిన కథను వినిపించాడు.

సత్యభామకథ

శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా భూలోకంలో అవతరించి, అష్టమహిషులతో కూడి దక్షిణనాయకత్వం వహించి ఉన్నాడు. సత్యభామ స్వర్గంలోని పారిజాత వృక్షం తన ఇంటి పెరటి చెట్టు అయిందని అహంకరించింది. సత్యభామ ప్రియసఖుడైన శ్రీకృష్ణుడు నిరంతరం తన వద్దే ఉండగా, రుక్మిణి మొదలైన సపత్నులు ఎంతగా సిగ్గుపడుతున్నారో తెలుసుకోవాలని భావించింది.

శ్రీకృష్ణుడు సత్యభామ మనసులోని అహంకారాన్ని గ్రహించి, అష్టమహిషుల ఇళ్ళలో పారిజాత వృక్షాలను కల్పించాడు. సత్యభామ తన ఇంటి పారిజాతపుష్పాలను చెలికత్తె ద్వారా రుక్మిణి అంతఃపురానికి కానుకగా పంపింది. ఆ చెలికత్తె వెళ్ళి రుక్మిణి అంతఃపురంలో ఉన్న శ్రీకృష్ణుని చూసి ఆశ్చర్యపోయింది. ఆమె రుక్మిణి ఇచ్చిన పారిజాత పుష్పాలను తీసుకొని తిరిగి సత్యభామ మందిరానికి వచ్చింది. ఆమె సత్యభామతో కలసిఉన్న శ్రీకృష్ణుడిని చూసి, ఆశ్చర్యంతో జరిగిన వృత్తాంతాన్ని అంతా సత్యభామకు వినిపించింది. సత్యభామ చెలికత్తె మాటలు విని రోషంతో శ్రీకృష్ణుని నిందించి, అసూయతో దుఃఖించింది. గోవిందశర్మ సత్యభామ అంతఃపురానికి వెళ్ళగా సత్యభామ తనకు జరిగిన అవమానాన్ని అతనితో చెప్పించింది. గోవిందశర్మ అంతావిని జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని ఆమెకు చెప్పాడు. గోవిందశర్మ సత్యభామకు పూర్వం విష్ణుమాయను తిరస్కరించింది. మహాలక్ష్మి, బ్రహ్మ, రుద్ర, నారదులు ఏవిధంగా మోసపోయినారో కథలుగా చెప్పాడు. సత్యభామ గోవిందశర్మ మాటలకు ఉపశమనాన్ని పొంది, శ్రీకృష్ణుడి అనుమతితో అతడికి పారిజాత పుష్పమాలికను బహూకరించింది.

3.1.3.2. ద్వితీయాశ్వాసం

వైకుంఠంలో శ్రీమహావిష్ణువు వినోదార్థం మహాలక్ష్మితో పాచికలు ఆడటానికి పూనుకున్నాడు. మహాలక్ష్మి పక్షాన దేవకాంతలు, శ్రీమహావిష్ణువు పక్షాన భూదేవి చేరగా, సరస్వతి వారిద్దరి గెలుపునూ కోరుకున్నది. విష్ణువు తన మాయా ప్రభావంతో జూదంలో గెలిచాడు. మహాలక్ష్మి ఓటమి భరించలేక, కోపంతో విష్ణుమాయను నిందించి, తన శక్తిని చూపించటానికి, వైకుంఠపురవైభవాన్ని హరించి, దాన్ని శూన్యమయం కావించింది. విష్ణువు, వైకుంఠపురాన్ని శూన్యం చేసిన మహాలక్ష్మి అహంకారానికి మనసులో కోపగించుకున్నాడు. మహాలక్ష్మిని స్వాంతన పరిచేనెపంతో క్షీరసాగర తీరానికి విహారానికి తీసుకువచ్చి, ఉద్యానవనంలో ఆమెను విడిచి మాయమైనాడు. విష్ణువు వైకుంఠపురాన్ని తిరిగి వైభవోపేతంగా చేసి మాయాలక్ష్మిని కల్పించాడు. మహాలక్ష్మి ఉద్యానవనంలోని కొలనులో కళావిహీనంగా ఉన్న మాయాలక్ష్మిని చూసి, ఆమె గురించి అడిగింది. మాయాలక్ష్మి తాను మహాలక్ష్మినని, శ్రీమహావిష్ణువు శక్తిని చులకన చేసినందుకు ఈ శాపాన్ని పొందానని తెలిపింది. పుష్పక విమానంలో బ్రహ్మమొదలైన దేవతలు రాగా, మాయాలక్ష్మి శాపవిమోచనాన్ని పొంది వైకుంఠానికి వెళుతూ మహాలక్ష్మి తేజస్సును హరించింది.

మహాలక్ష్మి విష్ణువుతో ఎడబాటు కలిగినందుకు, మాయాలక్ష్మి వైభవానికి, తాను ఒంటరిగా అయినందుకూ పరితపించింది. మహాలక్ష్మి తాను శూన్యం చేసిన వైకుంఠం తిరిగి ప్రకాశించడం చూసి ఆశ్చర్యపోయి, విష్ణువు మాయాలక్ష్మితో ఉన్నాడని తెలుసుకొని చింతించింది. మహాలక్ష్మి ఉద్యానవనంలో మాయాలక్ష్మి తపస్సు చేసిన తామరపీఠంపై

కూర్చుని పశ్చాత్తాపంతో శ్రీమహావిష్ణువును ఏకాగ్రచిత్తంతో ధ్యానించింది. మహాలక్ష్మిని ఆవరించిన విష్ణుమాయ తొలగిపోయి ఆమె తిరిగి వైకుంఠంలో యథాప్రకారం శ్రీమహావిష్ణువు సన్నిధికి చేరుకొని, తిరిగి తన పూర్వ వైభవాన్ని పొందింది.

3.1.3.3. తృతీయాశ్వాసం

ప్రళయకాలంలో వటపత్రశాయి అయిన మహావిష్ణువు నాభికమలం నుంచి బ్రహ్మ జన్మించాడు. శ్రీమహావిష్ణువు వరప్రభావంతో బ్రహ్మ సృష్టినిర్మాణ కార్యాన్ని ప్రారంభించి, సకల జీవులనూ సృష్టించాడు. బ్రహ్మ తాను కల్పించిన సృష్టిని చూసుకొని, ముల్లోకాలనూ తానే సృష్టించానని రాజసగుణంతో గర్వించాడు. బ్రహ్మ పద్నాలుగు లోకాలలో తనను మించిన దైవం వేరెవరూ లేరని తన మహత్యాన్ని పొగడుకొన్నాడు. మార్కండేయముని బ్రహ్మను దురహంకారం విడిచి విష్ణువును స్తుతించమని హితవు బోధించాడు. మార్కండేయుడు బ్రహ్మకు పుండరీకుడనే భాగవతుని కథను వినిపించాడు.

పుండరీకోపాఖ్యానం

మధుర అనే పట్టణంలో పుండరీకుడనే పరమ భాగవతుడు నివసించే వాడు. ఒకనాడు నారదుడు వచ్చి, విష్ణుమాయా ప్రభావం లోకమంతా వ్యాపించి ఉందని పుండరీకునికి తెలిపి వెళ్ళాడు. పుండరీకుడు నారదుడు చెప్పిన మాటల్ని సందేహించి, విష్ణుమాయను శంకించాడు. పుండరీకుని పరీక్షించాలని విష్ణుమాయ బోయస్త్రీగా మారి అతని ముందు నిలిచింది. పుండరీకుడు విష్ణుమాయా మోహితుడై ఆ బోయస్త్రీని వివాహమాడి, సంతానాన్ని పొందాడు. పుండరీకుడు మాయా సంసారబంధంలో తగుల్కొని కరువు బారి నుంచి తప్పించుకోవడానికి భార్య, కుమార్తెతో కలిసి గౌతమీ తీర భూములకు వలస వెళ్ళాడు. పుండరీకుడు విష్ణుమాయాప్రభావంతో భిక్షకోసం అతని ఇంటికే వెళ్ళాడు. పుండరీకుడి దీనస్థితిని చూసి, అతడి భార్య శ్రీమహావిష్ణువును ధ్యానించింది. శ్రీమహావిష్ణువు పుండరీకుడికి మాయా బంధం నుంచి విముక్తి కలిగించాడు. పుండరీకుడు శేషజీవితాన్ని విష్ణుధ్యానంతో గడిపి, వైకుంఠం చేరుకున్నాడు.

బ్రహ్మ మార్కండేయుని హితబోధను వినకుండా భూమండలాన్ని అంధకారంలో ముంచి, మందరగిరిపై తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. మార్కండేయముని ప్రార్థించగా, శ్రీమహావిష్ణువు సృష్టి నిర్మాణాన్ని తిరిగి పునరుద్ధరించాడు. బ్రహ్మగర్వాన్ని అణచడానికి మయాసరస్వతిని కల్పించాడు. బ్రహ్మ మయా సరస్వతితో శృంగారకేళిలో మునిగి ఉండగా ఒకనాడు ఆమె అదృశ్యమైంది. బ్రహ్మ మాయా సరస్వతిని వెదుకుతూ మందరగిరిపై ఉండగా మార్కండేయముని చూసి, మాయాసరస్వతి విష్ణుమాయా కల్పితమని బ్రహ్మకు హితబోధ చేశాడు.బ్రహ్మ శ్రీమహావిష్ణువు అనుగ్రహం వలన తిరిగి తన పూర్వపు పదవిని పొంది సుఖించాడు.

3.1.3.4. చతుర్థాశ్వాసం

దేవదానవులు శ్రీమహావిష్ణువు అనుమతితో క్షీరసాగరాన్ని మథించగా, దాని నుంచి హాలాహలం పుట్టింది. లోకాలను కాపాడేందుకు శివుడు హాలాహలాన్ని కంఠంలో భరించాడు. ఆ తర్వాత క్షీరసాగరం నుంచి జన్మించిన వస్తు సమూహాన్ని ఇంద్రుడు గ్రహించాడు. చివరలో ధన్వంతరి తెచ్చిన అమృత కలశాన్ని దానవులు అపహరించారు. దేవతలు ప్రార్థించగా శ్రీమహావిష్ణువు మాయామోహినిగా దానవులను మభ్యపెట్టి, అమృతాన్ని దేవతలకు పంచాడు. రాక్షసులు జరిగిన మోసాన్ని గ్రహించి దేవతలతో యుద్ధంచేసి ఓడిపోయారు. నారదుడు మోహినీ వృత్తాంతాన్ని శివునికి వినిపించేందుకు కైలాసం వెళ్ళి, విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మోసగించిన తీరును వినిపించాడు. నారదుడు మోహినీ సౌందర్యానికి రాక్షసులే కాకుండా మన్మథుడిని జయించిన శివుడు కూడా మరులుకొంటాడని పలికాడు. శివుడు నారదుని మాటలకు మనసులో కోపగించుకొని, వైకుంఠం వెళ్లి మోహినిని చూడాలని పార్వతితో అన్నాడు. పార్వతి శివుడిని వైకుంఠం వెళ్ళవద్దని వారించింది. శివుడు నారదుని మాటలకు పంతం పట్టి, విష్ణుమాయ కంటే శివుని నిగ్రహశక్తి గొప్పదని లోకానికి తెలిపేందుకు వైకుంఠం బయలుదేరాడు.

శ్రీమహావిష్ణువు వైకుంఠంలో శివుడి కోరికను విని, మోహినిని చూడవద్దని చెప్పాడు. శివుడు సభలో తన నిగ్రహశక్తిని పొగడుకొని, విష్ణుమాయను చులకన చేశాడు. విష్ణువు శివుడి ముందు మాయామోహినిగా అవతరించాడు. శివుడు మోహినీ సౌందర్యాన్ని చూసి ముగ్ధుడైనాడు. ఆ మాయా మోహిని తన శృంగార చేష్టలతో శివునికి విరహాన్ని కలిగించింది. శివుడు మోహిని తన ఎదురుగా కనిపించగానే తీవ్రమైన మోహంతో కౌగిలించుకోబోయాడు. మోహినిని తాకగానే శివునికి శుక్లపతనమై, అది బంగారం వెండి ప్రవాహాలుగా మారింది. శివుడు తన చేష్టలకు సిగ్గుపడగా, విష్ణువు అతడిని ఓదార్చాడు. శివుడు శ్రీమహావిష్ణువు మహిమను పొగిడి, తిరిగి కైలాసానికి చేరుకున్నాడు.

3.1.3.5. పంచమాశ్వాసం

శ్రీమహావిష్ణువు వైకుంఠంలో శ్రీదేవి, భూదేవి సమేతంగా కొలువు దీరి ఉన్నాడు. విష్ణుమాయ స్త్రీ రూపాన్ని ధరించి అక్కడికి వచ్చింది. ఆ మాయాకాంత ఇంద్రజాల విద్యను చూసి శ్రీమహావిష్ణువు, అతని ప్రియకాంతలు మెచ్చుకొని ఆమెకు రత్నపారితోషికాలు బహూకరించారు. నారదుడు అదంతా చూసి, అటువంటి మాయలు అబలలు, అల్పులైన వారికి ఆనందాన్ని కలిగిస్తాయి. కాని తనవంటి వారికి కాదని గర్వంతో పలికాడు. విష్ణువు నారదుని మోసపుచ్చాలని భావించాడు. నారదుడు అక్కడి నుంచి బ్రహ్మలోకానికి, కైలాసానికి, దేవలోకానికే వెళ్లి, తాను విష్ణుమాయను

జయించానని ప్రచారం చేశాడు. విష్ణువు నారదుని గర్వాన్ని భంగపరచాలని భూలోకంలో సర్వవరక్షేత్రంలో ఒక పుణ్యాశ్రమాన్ని కల్పించాడు. విష్ణువు కపటమునిగా మారినాడు. విష్ణుమాయా ప్రభావితుడై నారదుడు సర్వవరానికి వచ్చాడు. ఆశ్రమంలోని కపటముని నారదుని ఘనతను పొగిడాడు. నారదుడు ఆ కపటమునితో తాను విష్ణుమాయను జయించానని పలికాడు. అప్పుడు ఆకాశవాణి నారదుడిని వారించి, అతడికి చండదమనుడనే మునికథను చెప్పింది.

3.1.3.5.1. చండదమనుని కథ

చండదమనుడనే ముని మాంధాత మహారాజు లాగ రాజ్యసుఖాలు పొందాలని భావించి, బ్రహ్మను గురించి, తపస్సు చేశాడు. సనత్కుమారుడు వచ్చి మోక్షాన్ని పొందటం ఉత్తమ మార్గమని చండదమనుడికి తెలిపాడు. చండదమనుడు తన తపస్సుతో బ్రహ్మను మెప్పించి, మోక్షాన్ని కోరాడు. బ్రహ్మ మొదట చండదమనుడు రాజ్యసుఖాలును కోరి తపస్సు ప్రారంభించినందువల్ల వాటిని పొందకుండా మోక్షం లభించదని తెలిపాడు. చండదమనుడు విష్ణుమాయకు చిక్కకుండానే, రాజ్యసుఖాలు పొందకుండానే మోక్షాన్ని సాధించాలని శివుడిని గురించి తపస్సుచేశాడు. శివుడు కూడా బ్రహ్మ లాగే పలికాడు. చండదమనుడు తర్వాత సూర్యుడిని ప్రార్థించగా అతడు కూడా తన అశక్తతని వెల్లడించాడు. చండదమనుడు పంతంతో ఏకాగ్రనిష్ఠతో తపస్సు చేస్తుండగా, విష్ణుమాయ అతన్ని ఆవరించింది. చండదమనుడు మహారాజుగా మారి, రాజ్యసుఖాలలో మునిగి తేలుతున్నాడు. అప్పుడు సనత్కుమారుడు వచ్చి, చండదమనుడికి పూర్వ జ్ఞానాన్ని కలిగించాడు. చండదమనుడు తన గతాన్ని తలచుకొని సిగ్గుపడి, విష్ణుమాయా ప్రభావ మహిమను స్తుతించాడు. శ్రీమహావిష్ణువు అనుగ్రహంతో చండదమనుడికి మోక్షం లభించింది.

ఆకాశవాణి ఈ విధంగా నారదునికి చండదమనుడి కథను వినిపించింది. నారదుడు, విష్ణుమాయ చండదమనుడి వంటి మానవులను భ్రమించగలదు కాని తనను కాదని గర్వంతో పలికాడు. కపటముని నారదుడిని పొగిడి ఆ సమీపంలోని కొలనులో స్నానం చేసివచ్చి తన ఆతిథ్యాన్ని స్వీకరించమని కోరాడు. నారదుడు కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారినాడు. చంద్రకేతుడు అనే రాజు చంద్రరేఖను వివాహం చేసుకున్నాడు. చంద్రరేఖ మాయా సంసార బంధంలో చిక్కుకొని నూరు మంది కుమారులను పొందింది. శత్రురాజుతో జరిగిన యుద్ధంలో చంద్రకేతుడు, అతని నూరుమంది కుమారులు మరణించారు. చంద్రరేఖ భర్తను, కుమారులను కోల్పోయి, రణభూమిలో విలపించింది. విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖ ఆకలి బాధ తీర్చుకోవడానికి దగ్గరలోని మామిడిచెట్టు నుంచి పండును కోయబోగా అది అందలేదు. చంద్రరేఖ మామిడిపండు కోసం భర్త, కుమారుల శవాలను మెట్లుగా

పేర్చివాటిపై ఎక్కి అందుకున్నా పండు అందలేదు. అంతలో శ్రీమహావిష్ణువు వృద్ధ బ్రాహ్మణుడుగా మారి చంద్రరేఖను ఆ దగ్గరలోని కొలనులో శుచిగా స్నానం చేసి రమ్మన్నాడు. చంద్రరేఖ కొలను నీటిలో మునిగి నారదుడు పైకి లేచాడు. నారదుడు విష్ణుమాయను నిందించినందుకు పశ్చాత్తాపంతో శ్రీమహావిష్ణువును పలువిధాలుగా ప్రార్థించాడు. తన అజ్ఞానాన్ని మన్నించమని వేడుకొన్నాడు. శ్రీమహావిష్ణువు నారదుని అనుగ్రహించి, తిరిగి పూర్వపు స్థితిని కలిగించాడు.

ఈవిధంగా విష్ణుమహిమను గుర్తించక, తమ స్వీయప్రతిభను చూసుకొని గర్వించిన మహాలక్ష్మి, బ్రహ్మ, రుద్ర నారదులు, ఏవిధంగా విష్ణుమాయ చేత మోసపోయినారో ఈ కథలు తెలుపుతున్నాయి. గోవిందశర్మ వలన ధర్మరాజు సభలో విష్ణుమాయా విలాస కథలు వింటున్న నారదుడు, ఈ వృత్తాంతమంతా నిజమేనని తెలిపాడు. ధర్మరాజు సభాసదులు అందరితో కలిసి ప్రార్థించగా, శ్రీమహావిష్ణువు వారందరికీ దర్శనమిచ్చాడు. ఆ తర్వాత ధర్మరాజు సమస్త రాజ్యవైభవాలను అనుభవిస్తూ సుఖంగా రాజ్యపాలన చేశాడని పరీక్షిత్తుమహారాజుకు శుకమహర్షి తెలిపినాడు.

### 3. 1. 4. రోసనూరి వేంకటపతి - ఇతివృత్త నిర్వహణ

పరిచయం

రోసనూరి వేంకటపతి శివదర్పభంగం ప్రధానంగా మోహినీ అవతార కథను మూడు ఆశ్వాసాలు గల పద్య ప్రబంధంగా రచించాడు. వేంకటపతి 'విష్ణుమాయా విలాస' ప్రబంధానికి కంకంటి పాపరాజు రచించిన 'విష్ణుమాయా విలాస' యక్షగానం మార్గదర్శిగా కనిపిస్తున్నది. వేంకటపతి రచనలో పాపరాజు యక్షగానాన్ని అనుసరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. అయినప్పటికీ ఈ ప్రబంధంలో వేంకటపతి చేసిన స్వతంత్ర కల్పనలు కూడా కావలసినన్ని ఉన్నాయి. ఈ ప్రబంధంలో కథాశ్రోత జనమేజయుడు, కథకుడు వైశంపాయనుడు.

### 3. 1. 4. 1. ప్రథమాశ్వాసం

జనమేజయమహారాజు, శ్రీమహావిష్ణువు కృత్రిమ నారీ రూపంతో దానవులను మోసపుచ్చి అమృతాన్నిదేవతలకు అందించాడు కదా! దానవులు వివేకశూన్యులు కాబట్టి శ్రీహరి మోహినీ రూపాన్ని చూసి భ్రమించారు. ఆ విధంగా ఇంకెవరైనా ఈ ముల్లోకాలలో మోహినీ కాంతను చూసి మోసపోయిన పురుషులు ఉన్నారా అని వైశంపాయడినుని అడిగాడు. వైశంపాయనుడు ఫాలాక్షుడు కూడా విష్ణుమాయాకు భ్రమించవలసిందే అని జనమేజయుకి మోహినీ అవతార కథను వినిపించాడు. పరమేశ్వరుడు సకల భూతస్థావర జంగమ ప్రపంచమంతా తనను సేవించగా కైలాసపర్వతం మీద కొలువుదీరి ఉన్నాడు. నారదుడు తుంబురుడు తన వెంటరాగా కైలాసంలో కొలువుదీరి ఉన్న పరమేశ్వరుని దర్శనం చేసుకున్నాడు. శివుడు నారదుడిని క్షీరసాగరమథనంలో

హాలాహలం తర్వాత ఏమేమి కలిగాయని అడిగాడు. నారదుడు, క్షీరసాగరం నుంచి కలిగిన కల్పవృక్షం, కామధేనువు మొదలైన వస్తుసముదాయాన్ని ఇంద్రుడు గ్రహించాడు. ధన్వంతరి నుంచి అమృతాన్ని దేవతలు అందుకోగా, దానవులు దానిని అపహరించారు. దేవతలు ప్రార్థించగా శ్రీమహావిష్ణువు మోహినిగా మారి, దానవులను మోసపుచ్చి, అమృతాన్ని దేవతలకు పంచాడని చెప్పాడు.. నారదుడు ఆ మోహినీ సౌందర్యానికి దేవదానవులేకాదు శివుడైనా చిత్తభ్రమను పొందుతాడు అని పలికాడు. శివుడు నారదుడి మాటలకు మనసులో కోపగించుకొన్నాడు. శివుడు పార్వతితో వైకుంఠం వెళ్లి, మోహినిని చూసి తనమనోనిగ్రహశక్తిని లోకాలకు ప్రకటించాలని పంతంతో వైకుంఠపురానికి ప్రయాణమైనాడు.

3.1.4.2. ద్వితీయాశ్వాసం

శివుడు పార్వతితో కూడి అలకానగరాన్ని దాటుకుని ప్రయాణించి వైకుంఠపురం చేరుకున్నాడు. శివుడు నందన వనాన్ని, క్షీరసముద్రంలోని విశేషాలను పార్వతికి వర్ణించి చెప్పాడు. శివపార్వతులకు త్రోవ చూపుతూ ముందువెళుతున్న నారదుడు అందరికంటే ముందుగా నగరులోనికి ప్రవేశించాడు. నారదుడు శ్రీమహావిష్ణువును దర్శించుకొని, శివుడు కైలాసంలో విష్ణుమాయను చులకన చేశాడని పలికాడు. శ్రీమహావిష్ణువు ఎదురువెళ్ళి శివపార్వతులకు స్వాగతం పలికి, వారిని ఉచితరీతిగా సన్మానించాడు. శివుడు నారదునితో కలిగిన పంతాన్ని విష్ణువుకు తెలిపి, తనకు మోహినీ కాంతను చూపమన్నాడు. విష్ణువు శివుని తో అతని కోరికను వేరొక ఏకాంత సమయంలో తీర్చగలనని, సభలో మోహినిని చూడవద్దని నచ్చజెప్పాడు. శివుడు తన మహిమను పొగుడుకొని, మోహినిని చూపమని పట్టుబట్టాడు. ప్రమథులు విజృంభించి నారదుడిని విష్ణుసభలోనే నిందించారు. విష్ణువు శివుని అహంకారానికి, ప్రమథులు దుశ్చర్యలకూ  కోపించి, మోహినిగా అవతరించాడు. సభాసదులు మోహాన్ని పొందారు. శివుడు మదనాతురుడయ్యాడు.

3.1.4.3. తృతీయాశ్వాసం

మోహినీకాంత ప్రత్యక్షమవగానే విష్ణువు కొలువుదీరిన సభామందిరం శృంగార వనంగా మారిపోయింది. శివుడు మోహినీ కాంత శృంగార చేష్టలకు విరహోన్మత్తుడైనాడు. శివుడు మోహినిని, పట్టబోయి ఆమె అదృశ్యమవగానే మోహిని తనకు కనిపించలేదని పరితపించాడు. శివుడు తన ముందు మోహిని కనిపించగానే తాళలేని మోహంతో ఆమెను కౌగిలించుకొని పరవశుడయ్యాడు. మోహినిని తాకగానే శివునికి శుక్లపతనమై భూమిపై ప్రవహించింది. ఆ శృంగార వనం తిరిగి సభామందిరంగా మారింది. విష్ణుమాయా ప్రభావానికి నారదుడు, సభాసదులు విష్ణువును అనేక విధాలుగా స్తుతించారు. శివుడు జరిగింది తలచుకొని తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు.

విష్ణువు శివుడిని అనునయించి, శివుడికి, శ్రీహరికీ భేదంలేదని పలికాడు. శిదుని విష్ణుమాయను స్తుతించి, తిరిగి కైలాసం చేరుకున్నాడు. ఈ విధంగా శివదర్పభంగానికి హేతువైన మోహినీ అవతారకథను జనమేజయుడికి వైశంపాయనుడు వినిపించాడు.

3.1.5. ఎఱగుడిపాటి వేంకటకవి - ఇతివృత్త నిర్వహణ

పరిచయం

ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన 'విష్ణుమాయావిలాసం' కథలను నైమిశారణ్యంలోని మునులకు సూతమహర్షి వినిపించాడు. వేంకటకవి ప్రథమాశ్వాసంలో క్షీరసముద్ర మథన కథను వర్ణించాడు. ద్వితీయాశ్వాసంలో లక్ష్మీనారాయణుల కళ్యాణం, మోహినీ అవతారవర్ణన, శివగర్వభంగం కథలను చెప్పాడు. తృతీయాశ్వాసంలో బ్రహ్మకథను వర్ణించాడు. చతుర్థాశ్వాసంలో నారదగర్వాన్ని చెప్పాడు. పంచమాశ్వాసంలో నారదుడు స్త్రీగా మారిన వృత్తాంతాన్ని వర్ణించాడు. చింతలపూడి ఎల్లనార్యుడు చెప్పిన సత్యభామ, మహాలక్ష్మి కథలు ఈ ప్రబంధంలో కనిపించవు.

3.1.5.1. ప్రథమాశ్వాసం

ఇంద్రుడు దుర్వాసముని శాపంవల్ల తనసంపదను, పదవినికోల్పోయి, బలిచక్రవర్తిని సేవిస్తున్నాడు. ఇంద్రుడు బలిచక్రవర్తితో అమృతం తాగితే సమానబలం కలిగి దేవదానవులు కలహం లేకుండా ఉంటారని చెప్పి, బలిచక్రవర్తిని సముద్రమథనానికి అందుకు ఒప్పించాడు. దేవదానవులు క్షీరసాగరాన్ని మథించడానికి కవ్వంగా మందర పర్వతాన్ని తీసుకురావడానికి ప్రయత్నించి విఫలమయ్యారు. శ్రీమహావిష్ణువు అనుమతితో అనంతుడు మందరగిరిని క్షీరసాగర తీరాన ఉంచాడు. విష్ణువు వాసుకిని అల్లెత్రాడుగా చేసి మందరపర్వతాన్ని సముద్రంలో దించగా అది మునిగిపోసాగింది. దేవదానవులు ప్రార్థించగా శ్రీమహావిష్ణువు కమఠరూపంతో మందరగిరిని తన వీపుపై నిలిపాడు. దేవదానవులు విజృంభించి సాగరాన్ని మథించగా, ఆ పర్వత మహాభారాన్ని భరించలేక వాసుకి గరళమనే విషాన్ని సముద్రంలో క్రక్కినాడు. వెంటనే భుగభుగ ధ్వనులతో హాలాహలం పుట్టింది. దేవదానవులు ప్రార్థనవిని పరమేశ్వరుడు ఆ విషాన్ని కంఠంలో ధరించాడు. ఆ తర్వాత క్షీరసముద్రం నుంచి ఉచ్చైశ్రవం, ఐరావతం మొదలైన వస్తువులు కలిగాయి. చివరగా ధన్వంతరి అమృతకలశంతో ప్రత్యక్షమైనాడు. దేవదానవులు తమ కార్యం సఫలమైనందుకు సంతోషించి, మందరగిరిని తిరిగి యథాస్థానంలో ఉంచి వచ్చారు.

3.1.5.2. ద్వితీయాశ్వాసం

బ్రహ్మ పూరోహితుడుగా, ఇంద్రుడు వెళ్లి పెద్దగా వ్యవహరించి, దేవదానవులు కలిసి లక్ష్మీనారాయణుల కళ్యాణాన్ని వైభవంగా జరిపించారు. బ్రహ్మ ఇంద్రునికి ఉచ్చైశ్రవం మొదలైన వస్తుసమూహాన్ని ఇవ్వగా, దానవులు అమృతకలశాన్ని

అపహరించారు. దేవతలు శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, విష్ణువు మాయా మోహినిగా అవతరించాడు. మాయామోహిని తన శృంగార చేష్టలతో దానవులను మభ్యపెట్టి ముందుగా దేవతలకు అమృతాన్ని వడ్డించింది. మోహిని మారు రూపాలతో అమృతాన్ని తాగాలని భావించిన రాహుకేతువులను శిక్షించి, అమృతకలశాన్ని ఇంద్రునికి అప్పగించి అదృశ్యమైంది. రాక్షసులు తమకు జరిగిన పరాభవాన్ని మోసాన్ని గ్రహించి బలి చక్రవర్తి నాయకత్వంతో దేవతల మీదికి దండెత్తివచ్చారు. ఇంద్రుడు ప్రార్థించగా బదరీవనంలో తపస్సు చేసుకుంటున్న నరనారాయణులనే మునులు వచ్చి దేవతలకు యుద్ధంలో సహాయం చేశారు. రాక్షసులు నరనారాయణుల ధాటికి ఓడిపోయి, పారిపోయారు. విష్ణుమాయకు రాక్షసులు మోసపోగా, శ్రీమహావిష్ణువును ఆశ్రయించి ఇంద్రుడు తిరిగి తన పూర్వవైభవాన్ని పొందాడు.

నారదుడు ఈ మాయా మోహినీ వృత్తాంతాన్ని శివుడికి తెలియజేయాలని కైలాసానికి వెళ్ళాడు. శివుడు నారదుడిని క్షేమసమాచారం అడిగి క్షీరసాగర మథనంలో హాలాహలం తర్వాత ఏయే వస్తువులు కలిగాయని అడిగాడు. నారదుడు క్షీరసాగరం నుంచి లభించిన వస్తువుల్ని ఇంద్రుడు తీసుకున్నాడని తెలిపాడు. విష్ణువు మాయా మోహినిగా అవతరించి, రాక్షసులను మోసపుచ్చి, దేవతలకు మాత్రమే అమృతాన్ని పంచాడు. విష్ణుమాయకు రాక్షసులు మోసపోయారు అని నారదుడు శివునిముందు విష్ణు మాయను స్తుతించాడు. శివుడు నారదుని మాటలకు మనస్సులోనే కోపగించుకొని, పూర్వం తాను లింగరూపంతో ఉద్భవించగా, బ్రహ్మవిష్ణువులు దాని ఆద్యంతాలను కనుగొనలేక పోయారని నారదుని ముందు తన మహిమను పొగడుకొన్నాడు. నారదుడు మోహినీ రూపాన్ని చూస్తే ఎంతటి వారికైనా మరులు కలుగుతాయని, దానికి శివుడు కూడా అతీతం కాదని అన్నాడు. నారదుడు శివుని ముందు విష్ణుమాయను స్తుతించాడు.

శివుడు నారదుని మాటలకు కోపించి, మోహినిని చూడాలని పంతంతో సపరివారంగా వైకుంఠానికి బయలుదేరాడు. వైకుంఠంలో శ్రీమహావిష్ణువు ఎదురువచ్చి, పార్వతీ పరమేశ్వరులకు స్వాగతం పలికాడు. శివుడు తన మనస్సులోని కోరికను తెలుపగా విష్ణువు మోహినిని చూడవద్దని పలికాడు. శివుడు విష్ణువు కొలువులో తన మహిమను కీర్తించుకొని, తన నిగ్రహశక్తి ముందు విష్ణుమాయ నిలువదని పంతంతో పలికాడు. విష్ణువు శివుని దర్పాన్ని గ్రహించి, మాయామోహినిగా అవతరించాడు. సభామందిరం శృంగారవనంగా మారిపోయింది. శివుడికి మోహినిని చూడగానే మదన వికారం కలిగి ఆమె వెంట పడ్డాడు. మోహిని శృంగార వనంలో తన విలాసచేష్టలతో శివునికి విరహతాపాన్ని కలిగించింది. శివుడు కందుక క్రీడ ఆడుతూ కోకముడి జారిన మోహినిని చూసి మోహ వివశత్వంతో కౌగిలించుకొన్నాడు. మోహినిని తాకగానే పారవశ్యంతో శివునికి శుక్లపతనమైంది. దానినుండి సద్యోజాతుడై కాలభైరవుడు

జన్మించాడు. శివుడు జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకొని సిగ్గుపడ్డాడు. విష్ణువు శివుడిని ఊరడించి, హరిహరులకు భేదం లేదని తెలిపాడు. శివుడు విష్ణుమహిమను కీర్తించాడు. విష్ణువు తన మాయతో నారదుని కూడా భంగపరుస్తానని శివుడికి మాట ఇచ్చాడు. శివుడు దానికి సంతోషించి, తిరిగి కైలాసానికి చేరుకున్నాడు.

3.1.5.3. తృతీయా శ్వాసం

సరస్వతీ చతుర్ముఖుల సరసకేళిలో, బ్రహ్మ తన ప్రియకాంత పొగడ్తలకు మురిసిపోయి, సకలప్రపంచమంతా తన సృష్టేనని, తాను స్వయంభువునని పేర్కొన్నాడు. బ్రహ్మ తనను మించిన దైవం వేరెవరూ లేరని సరస్వతితో పలికాడు. సరస్వతి బ్రహ్మ మాటలకు నొచ్చుకొని అతనికి విష్ణుమహిమను తెలిపింది. బ్రహ్మ సరస్వతి మాటలకు కోపించి, విష్ణువు నాభీకమలంలో పుట్టడం తన దోషం కాదని అన్నాడు. బ్రహ్మ గర్వంతో సృష్టి నిర్మాణాన్ని విడిచి, గాఢాంధకారమైన శూన్యప్రదేశానికి వెళ్ళి పోయాడు.

సరస్వతి బ్రహ్మతనను విడిచి వెళ్ళేసరికి ఒంటరిగా పరితపించి శ్రీమహావిష్ణువును ప్రార్థించింది. విష్ణువు సరస్వతిని ఓదార్చి, బ్రహ్మకు గర్వభంగాన్ని కలిగించడానికి సృష్టినిర్మాణ కార్యాన్ని తిరిగి పునరుద్ధరించాడు. విష్ణువు మాయా ఆశ్రమాన్ని కల్పించి, తాను మాయామునిగా, విష్ణుమాయను మునికన్యగా కల్పించాడు. బ్రహ్మ తాను లేకుండా లోకాలు ఏ విధంగా తల్లడిల్లుతున్నాయో చూడాలని బయలుదేరాడు. మాయాముని బ్రహ్మకు ఎదురొచ్చి, తనపేరు 'మాయికుడు' అని తెల్పి, అతన్ని ఆశ్రమానికి తీసుకువెళ్లాడు. బ్రహ్మ తాను బ్రహ్మమానస పుత్రుడైన భద్రకుడనని పలికాడు. బ్రహ్మ మాయకుడి ఆశ్రమంలోని మునికన్యను చూసి మోహించాడు. మునికన్య బ్రహ్మతో పూర్వం ఆమె ఒక బ్రహ్మాండాన్ని చూసిందని, అక్కడ త్రిమూర్తులతో పాటుగా సకల చరాచర జగత్తు అంతా ఉందని తెలిపింది. ఆ మునికన్య బ్రహ్మను పుష్పక విమానంలో వేరొక భూమండలానికి తీసుకువెళ్ళింది. బ్రహ్మ అక్కడి సూర్యతాపానికి మూర్ఛపోయాడు. మునికన్య అమృత జలంతో బ్రహ్మను మూర్ఛ నుంచి తేర్చింది.

బ్రహ్మ మునికన్య వెంట సత్యలోకానికి వెళ్ళి అక్కడి అష్టముఖ బ్రహ్మను చూశాడు. బ్రహ్మ అతని ముందు తానొక కీటకం లాగ అల్పుడనని భావించాడు. అష్టముఖ బ్రహ్మ మునికన్య వలన బ్రహ్మ వృత్తాంతం విని, అతడిని నిందించాడు. అష్టముఖబ్రహ్మ విష్ణుమాయను స్తుతించి, పూర్వం అతడు కూడా దుర్నీతి వలన మోసపోయాడని చెప్పాడు. అష్టముఖ బ్రహ్మ సకల భూభారాన్ని తానే భరిస్తున్నానని గర్వించగా, ఆకాశవాణి అతడిని గర్వం విడువమని హెచ్చరించింది. ఆకాశవాణి సూచన ప్రకారం అష్టముఖబ్రహ్మ మేరుపర్వతం మీద ఉన్న భర్ముడు అనే మునిని కలుసుకున్నాడు. అష్టముఖబ్రహ్మ కోరగా భర్ముడు తన పూర్వ వృత్తాంతాన్ని వినిపించాడు. పూర్వం సౌమ్యుడు అనే బ్రాహ్మణుడికి భర్ముడు, ధర్ముడు, అనే ఇద్దరు కుమారులు జన్మించారు.

వారిద్దరూ శోణకుడు అనే మునిని సేవించగా, దానికి శోణకుడు సంతోషించి, శోణకుడు వారిద్దరికీ నారాయణ అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించాడు. ధర్ముడు తన తపస్సుతో విష్ణువును మెప్పించి బ్రహ్మపదవిని పొందాడు. ధర్ముడి సభలో ఒకనాడు శివశర్మ శివుడు అధికుడని వాదించగా, విష్ణుశర్మ విష్ణువే గొప్ప అని వాదించాడు. ధర్ముడు వారిద్దరినీ వారించి, అందరికంటే తానే అధికుడినని గర్వంతో పలికాడు. విష్ణుశర్మ ధర్ముడిమాటలకు కోపించి, భూలోకంలో అతడిని వానరుడిగా జన్మించమని శపించాడు. ధర్ముడు హనుమంతుడుగా జన్మించి, హరిభక్తితో భవిష్యత్తులో తిరిగి బ్రహ్మకాగలడని ధర్ముడు అష్టముఖ బ్రహ్మకు తెలిపాడు.

అష్టముఖ బ్రహ్మ ఆ వృత్తాంతం వలన తాను దురభిమానాన్ని విడిచిపెట్టానని బ్రహ్మతో పలికాడు. అష్టముఖ బ్రహ్మ విష్ణుమహిమను పొగిడి, బ్రహ్మను నిందించాడు. బ్రహ్మ అష్టముఖుడి మాటలకు సిగ్గుపడి తన అహంకారం వల్లనే ఇంతటి భంగపాటు కలిగిందని తెలుసుకున్నాడు. బ్రహ్మ మునికన్య దగ్గరకు వెళ్ళి, తిరిగి తనను సత్యలోకం చేర్చమని వేడుకున్నాడు. మునికన్య బ్రహ్మను పూర్వపు అంధకార ప్రదేశానికి చేర్చింది. బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళి అక్కడ చింతామణి సింహాసనం మీద ఉన్న కపట బ్రహ్మను చూసి సరస్వతిని పరులపాలు చేసుకొన్నారని దుఃఖించాడు. అంతలో సరస్వతి బ్రహ్మను మనసులో తలచుకుంది. విష్ణుమాయ తొలగిపోగా బ్రహ్మ సరస్వతులు జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని తెలుసుకున్నారు. విష్ణువును వారిద్దరూ అనేక విధాలుగా స్తుతించారు.

3.1.5.4. చతుర్థాశ్వాసం

ద్వారకానగరాన్ని శ్రీకృష్ణుడు పరిపాలిస్తున్నాడు. అతడు భూభార నివారణ కారుడై రుక్మిణి, సత్యభామ మొదలైన అష్ట మహిషులతో కూడి ఉన్నాడు. ఒకనాడు నారదుడు ద్వారకానగరానికి వచ్చి, శ్రీకృష్ణుని మహిమను స్తుతించాడు. శ్రీకృష్ణుడు సభలో కొలువుదీరి ఉండగా, రైవతగిరి నుంచి బోయవారు వచ్చి, వనవిహారానికి ఆహ్వానించారు. శ్రీకృష్ణుడు నారదునితో పాటుగా వనవిహారానికి బయలుదేరాడు. రైవతగిరి వనంలో శ్రీకృష్ణుడు నారదునితో కలిసి వనంలో తిరుగుతుండగా, నారదుడు ఆ వనశోభకు కృష్ణుని మాయ కారణమని అన్నాడు. నారదుడు ఆ అడవి మధ్యలోని కొలనును చూసి విష్ణుమాయా ప్రభావితుడై అందులో మునిగి స్త్రీరూపాన్ని పొందాడు. శ్రీకృష్ణుడు మాయకాంతగా మారి స్త్రీగా మారిన నారదుని పేరు చంద్రరేఖ అని, తాను ఆమెకు తల్లిననీ చెప్పింది. సత్యక నగరాన్ని చంద్రకేతుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఒకనాడు ఆరాజు కొలువుకు ఎరుకలవారు వచ్చి, కానుకలు సమర్పించి వేటకు రమ్మని ఆహ్వానించాడు. చంద్రకేతుడు వేటలో ఒక అడవి పందిని తరుముతూ యమునాతీరానికి చేరుకున్నాడు. రాజును మంత్రికూడా అనుసరించాడు.

చంద్రకేతుడు అలసిపోయి యమునాతీరంలో ఉండగా, చంద్రరేఖ మునికన్యల తోకూడి అక్కడికి వనవిహారానికి వచ్చింది. చంద్రకేతుడు ఆమెను చూసి మోహించాడు. చంద్రరేఖ కూడా రాజును చూసి ఇష్టపడింది. మునికన్యలు చంద్రరేఖను ఆశ్రమానికి తీసుకు వెళ్ళగా, వారిద్దరూ విరహాన్ని పొందారు.

3. 1. 5. 5. పంచమాశ్వాసం

మాయకాంత చంద్రరేఖను వెళ్ళి రాజును కలుసుకోమని చెప్పింది. చంద్రరేఖ చంద్రకేతుడు విశ్రమించిన యమునా తీరప్రాంతానికి వచ్చింది. చంద్రరేఖ ఎల్లనార్యుడు, చింతలపూడి. మంత్రిని తన వెంట ఆశ్రమానికి తీసుకువెళ్ళింది. ఆశ్రమంలో మాయకాంత తన కుమార్తెకు చంద్రకేతునికీ వివాహం చేయించమని మంత్రిని కోరింది. మంత్రి ఆమెకు మాట ఇచ్చి, సూర్యోదయం కాగానే రాజును కలుసుకున్నాడు. చంద్రకేతుడు ఏనుగుపై ఆశ్రమానికి రాగా మాయాకాంత చంద్రరేఖను రాజుకు అప్పగించి, తగు జాగ్రత్తలు చెప్పింది. చంద్రరేఖ చంద్రకేతుడిని వివాహం చేసుకుంది. వారికి అరవైమంది కుమారులు కలిగారు. కొంతకాలానికి చంద్రకేతుని మీదికి పృధుబాహుడు అనే శత్రురాజు దండెత్తి వచ్చాడు. యుద్ధంలో చంద్రకేతుడు, అతని అరవైమంది కుమారులు మరణించారు.చంద్రరేఖ రణభూమికి వచ్చి మరణించిన భర్తను, కుమారులను చూసి పొరలి పొరలి ఏడ్చింది. చంద్రరేఖ కొంతసేపటికి ఆకలి బాధకు తాళలేక సమీపంలోని చింతచెట్టు ఆకులు కోసి తినాలని ప్రయత్నించింది. చంద్రరేఖ చేతికి ఆకులు అందక ఆమె దుఃఖిస్తుండగా, ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి, చివైపైధర్మతరువును అంటరాదని, చంద్రరేఖను సమీపంలో సరస్సులోని స్నానం చేసి రమ్మన్నాడు. చంద్రరేఖ ఆ సరస్సులో మునిగి, నారదుడుగా మారింది.నారదుడు తన చేతికి ఉన్న బంగారు కంకణాన్ని చూసి, జరిగిన వృత్తాంతాన్ని గుర్తుచేసుకున్నాడు. నారదుడు శ్రీకృష్ణుని మాయామహిమను స్తుతించాడు. శ్రీకృష్ణుడు నారదునికి మయాతత్త్వం, తన సర్వజ్ఞతను గూర్చి తెలిపాడు.

ఈ విధంగా విష్ణుమాయను గుర్తించక, గర్వంతో విర్రవీగు రాక్షసులైనా, దర్పంతో ప్రవర్తించు పరమేశ్వరుడైనా, అహంకార పరుడైన బ్రహ్మదేవుడైనా, నారదుడైనా మోసపోక తప్పదని ఈ కథలు తెలుపుతున్నాయి.

# 4. విష్ణుమాయా విలాసకావ్యాలు – కథానుశీలన

ప్రబంధంలో కథ పరిమితం, దానిలో వర్ణనలే ప్రధానమని విమర్శకుల అభిప్రాయం. అయితే ఏ వర్ణన చేయాలన్నా కథ అనేది ఆధారంగా ఉండాలని గ్రహించాలి. కథ అనేదే లేనిచోట ఎలాంటి వర్ణనకు కూడా అవకాశం ఉండదని చెప్పవచ్చు. కాబట్టి పరిమితంగానైనా ప్రబంధంలో కథ అనేది అనివార్యమని మనకు తెలుస్తుంది. సాధారణంగా ప్రబంధ కథ పురాణేతిహాసాలలోని ప్రాసంగికాల నుంచి గ్రహించినదై ఉంటుంది. ఆ విధంగా గ్రహించిన ప్రాసంగిక కథలకు తిరిగి ప్రాసంగికాలను కూర్చడం ప్రబంధకవికి గల కథానిర్మాణ నైపుణ్యానికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు. ప్రబంధకవి తాను గ్రహించిన మూలకథను స్వేచ్ఛగా మార్చివేసి, అందులో చిత్ర విచిత్రమైన కల్పనలను స్వతంత్రంగా చేస్తాడు. ఈ స్వతంత్ర కల్పన ద్వారా పురాణేతిహాస సంబంధమైన మూలకథను మరిపించడమే ప్రబంధ రచనలో గల ప్రధాన విశేషం. ప్రబంధాలు రసప్రధానాలు. కాబట్టి ప్రబంధకవి పరిమితమైన కథా భాగాన్ని తన స్వీయ కల్పనా చాతుర్యంతో పరిపుష్టం చేస్తాడు. అందువల్ల ప్రబంధ కథకు మార్పులు, చేర్పులు, స్వీయకల్పనలు అనివార్యమైనాయని చెప్పవచ్చు.

## 4.1. చింతలపూడి ఎల్లనార్యుడు – కథానుశీలన

### 4.1.1. కథామూలం

ఎల్లనార్యుడు రచించిన ఈ విష్ణుమాయానాటకం భాగవత పురాణాదులలో ప్రసిద్ధములైన విష్ణు సంబంధమైన కథలను ఏర్చి, కూర్చి రచించిన స్వతంత్ర గ్రంథం అని చెప్పవచ్చు. ఈ సకల చరాచర జగత్తు అంతా విష్ణుమాయా శక్తి ప్రకల్పితమని, దానిని గ్రహించలేక అహంకార, అభిమాన ప్రేరేపితులైన బ్రహ్మరుద్రాది దేవతలు కూడా ఆ విష్ణుమాయ వలన మోసపోయారని తెలుపుతూ తద్వారా విష్ణుమాయా మహిమను లోకానికి ప్రకటించడమే ఈ విష్ణుమాయావిలాస కథలలోని పరమోద్దేశంగా తెలుస్తున్నది. ఎల్లన తనకావ్యంలో చెప్పిన కథలు శుకమహర్షి వలన భాగవతసత్కథా పరబ్రహ్మ విద్యను వినిత తర్వాత పరీక్షిత్తుమహారాజుకు కలిగిన సందేహంతో ప్రారంభమవుతున్నాయి. అందుచేత ఈ కథలన్నీ భాగవతకథకు తర్వాత జరిగినవని భావించవచ్చు. ఎల్లన తన కావ్యంలోని కథావస్తువును భాగవతంలో ప్రసిద్ధమైన కథాసందర్భం నుంచో లేక సంఘటన నుంచో ప్రేరణపొంది స్వతంత్రంగా కల్పించినాడని చెప్పవచ్చు. ఎల్లన విష్ణుమాయా నాటకంలోని ప్రధాన కథలకు మూలం భాగవతంలో ఏ విధంగా ప్రస్తావించబడిందో ఈ క్రింది నిదర్శనాల ఆధారంగా పరిశీలించవచ్చు.

1. శ్రీకృష్ణుని బహురూపకత్వం
2. బ్రహ్మ సృష్టినిర్మాణం చేయుట

3. మార్కండేయుని వృత్తాంతం
4. క్షీరసముద్రమథన వృత్తాంతం
5. మోహినీ వృత్తాంతం
6. దేవాసురుల యుద్ధం
7. శివదర్పభంగం

4.1.1.1. శ్రీకృష్ణుని బహురూపకత్వం

ఎల్లన కావ్యంలో గోవిందశర్మ పారిజాతమాలికాప్రాప్తి వృత్తాంతాన్ని తెలిపే సందర్భంలో శ్రీకృష్ణుని బహురూపకత్వాన్ని గురించి సత్యభామకు కలిగిన సందేహం మూలంగా వర్ణించాడు. శ్రీకృష్ణుడు అష్టమహిషులపట్ల, పదహారువేల సంఖ్యలైన గోపాంగనల పట్ల సమానభావంతో దక్షిణనాయకత్వం వహించిన తీరు ఇక్కడ ప్రస్తావించబడింది. దీనికి మూలం భాగవతంలో దశమ స్కంధం ఉత్తరభాగంలో 215వ పద్యం నుంచి 221వ పద్యం వరకు ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"హరికేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టెసుం..." (215.568) అనే పద్యం నుంచి, "...హరియాబదాఱు వేవ్వరుతరుణులతో సమాత మనియెఁ దక్షత్వమునన్" (221.569) (పోతన, బమ్మెర. 1994.568–569) అనే పద్యం వరకూ శ్రీకృష్ణుని బహురూపకత్వం గురించి వర్ణించబడింది. నారదుడు శ్రీకృష్ణుడు పదహారువేల మంది గోపాంగనలతో ఎలా కలిసి ఉంటున్నాడో చూడాలని భావించడం, శ్రీకృష్ణుని బహురూపకత్వం అనేవి భాగతవం దశమస్కంధంలోని ఉత్తర భాగంలోనే ఈ విధంగా వర్ణించబడ్డాయి.

"నరవర! యొకనాడు విను నారదసంయమి మాధవుండుదా." (594.626)

"అని హరియిట్లు షోడశసహస్రవధూమణులన్ బ్రియంబునన్." (631.631)

(పోతన, బమ్మెర 1994.626–631)

4.1.1.2. బ్రహ్మ సృష్టినిర్మాణం చేయుట

ఎల్లన కావ్యంలోని బ్రహ్మ శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించి సృష్టి నిర్మాణ క్రమానికి కావలసిన సాధన సామాగ్రిని వరంగా పొందడం, ప్రాణికోటిని సృష్టించడం అనేవి భాగవతంలోని ద్వితీయ స్కంధంలో 225వ పద్యం నుంచి 252వచనం వరకూ క్రింది విదంగా వర్ణించబడ్డాయి.

"హరిపాద భక్తి రహస్యోపదేష్టయు నఖిల దేవతలకు నధివిభుండు." (225.126)

"అవనీశబ్రహ్మాయిట్లంతర్హితుండైన బుండరీకాక్షుని బుద్ధినిలిపి." (253.131)

(పోతన, బమ్మెర. 1994.126–131)

4.1.1.3. మార్కండేయుని వృత్తాంతం

ఎల్లన కావ్యంలో బ్రహ్మాగర్వభంగ కథలో వర్ణించిన మార్కండేయుని వృత్తాంతానికి మూలం భాగవతంలోని ద్వాదశస్కంధంలో 32వ వచనం నుంచి 39వ వచనం

వరకు ఈ క్రింది విధంగా ప్రస్తావించబడింది.

"లోకంబులు కల్పాంత సమయంబునం, గబంధమయంబులై యంధకార బంధురంబులై యున్నయెడ, నేకాకియై చరింపుచుం బాలార్కకోటి తేజుండయిన బాలుని హృదయంబునం బ్రవేశించి" (32), "అనిన, శంకరుండును శాంకరితోఁ గూడ నభంబున నుండి ధరణీ తలంబునకు నేతెంచి" (39)

(పోతన, బమ్మెర. 1994.781-783)

4.1.1.4. క్షీరసముద్ర మథన వృత్తాంతం

ఎల్లన శివదర్ప భంగ కథలో పేర్కొన్న క్షీరసముద్ర మథన వృత్తాంతానికి మూలం భాగవతంలోని అష్టమస్కంధంలో 174వ పద్యం నుంచి 297వ పద్యం వరకూ ఈ విధంగా వర్ణించబడింది.

"అమృతోత్పాదనయత్నము, విమలమతిం జేయుటొప్పు వేల్పులువినుడీ" (174)

"చావులేని మందు చక్కగమనకబ్బె, పూర్ణఘటము పోయెఁబోయె ననుచు"(297)

(పోతన, బమ్మెర. 1994.174-297)

4.1.1.5. మోహినీ వృత్తాంతం

ఎల్లన కావ్యంలో అమృతాన్ని అపహరించిన రాక్షసులను మోసపుచ్చి, దేవతలకు అమృతాన్ని పంచేందుకు మహావిష్ణువు మోహినిగా మారిన వృత్తాంతాంనికి మూలం భాగవతంలోని అష్టమస్కంధంలో 298వ వచనం నుంచి 324వ పద్యం వరకూ ఈక్రింది విధంగా వర్ణించబడింది. "ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని, భృత్యజన కామదుండగు నప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింపవలదు" (298)

"ఒక్క బొట్టు జిక్కకుండగ, సుకరాకృతిఁదాల్చె నసురశూరులు బెగడన్" (325)

(పోతన, బమ్మెర. 1944.123-127)

4.1.1.6. దేవాసురయుద్ధం

ఎల్లన తన కావ్యంలో పేర్కొన్న దేవాసురుల యుద్ధానికి మూలం భాగవతంలోని అష్టమ స్కంధంలో 325వ పద్యం నుంచి 383వ పద్యం వరకూ విస్తారంగా వర్ణించబడింది. ఎఱగుడిపాటి వేంకటకవి భాగవతాన్ని అనుసరించే దేవాసుర యుద్ధాన్ని విస్తారంగా వర్ణించాడని తెలుస్తుంది.

"అమరుల్ రక్కసులుం బ్రయాస జలహేత్వర్థాభిమానుబులన్" (325)

"ఇట్లు నారద వచన నియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి" (383)

(పోతన, బమ్మెర. 1994.127-136)

4.1.1.7. శివదర్పభంగం

ఎల్లన తన కావ్యంలో వర్ణించిన శివదర్పభంగ కథకు మూలం భాగవతంలోని అష్టమస్కంధంలో 384వ పద్యం నుంచి 409వ పద్యం వరకు ఈవిధంగా వర్ణించబడింది.

"కైలాసగిరి మీద ఖండేందు భూషణుం, డొక్కనాడు కొలువుననున్న వేళ" (384)
"ఎలమిన్ దైత్యులనాడు రూపమున మోహించి పీయూషముం..." (409)
(పోతన, బమ్మెర.1944.136-141)

ఎల్లన తన కావ్యంలో ఇంతవరకూ పేర్కొన్న భాగవతంలోని కథా సందర్భాలను గ్రహించి, వాటిని స్వీయ కల్పనలతో పెంచి ప్రబంధోచితమైన వర్ణనలతో పరిపుష్టం చేశాడని చెప్పవచ్చు. ఇవికాకుండా ఎల్లన తన కావ్యంలో వర్ణించిన మహాలక్ష్మితో విష్ణువు మాయాజూదం, మాయాలక్ష్మి వృత్తాంతం, మాయాసరస్వతి వృత్తాంతం, పుండరీక, చండదమనుల కథలు మొదలైనవన్నీ కవి స్వకపోలకల్పితాలే అని చెప్పవచ్చు. నారదుని కథకు మూలం మాత్రం దేవీ భాగవతంలో ప్రస్తావించబడిందని కోరాడ రామకృష్ణయ్యగారు విష్ణుమాయా నాటకానికి రాసిన పీఠికలో పేర్కొన్నారు. "నారదుడు విష్ణుమూర్తిచే వంచింపఁబడి స్త్రీ రూపమును బొందుటను గూర్చిన కథకు భాగవతమున నాధారమేమియుఁగనఁబడదు. కాని వ్యాసరచితమే యగు దేవీభాగవతమున నారదుని గూర్చిన కథలు కొన్ని కలవు" (రామకృష్ణయ్య, కోరాడ.1933.XXVIII) ఎల్లన తన కావ్యంలో వస్తువుగా గ్రహించిన కథలకు భాగవత పురాణంలోని కథాసందర్భాలు ఆదర్శమైనతీరు పై నిదర్శనాల వలన స్పష్టమవుతున్నది. ఈ విధంగా ఎల్లన కావ్యంలోని కథలకు ప్రేరేపకములైన భాగవతంలోని మూలకథలను గురించి చెప్పుకోవచ్చు.

### 4.1.2. కావ్యారంభం

ఎల్లనార్యుడు రచించిన విష్ణుమాయా నాటకంలోని విష్ణుమాయా విలాస కథలకు శ్రోత పరీక్షిత్తు మహారాజు, కథకుడు శుకమహర్షి. భాగవత ముఖ్యుడైన శుకమహర్షి చేత భాగవతసత్కథలను విని, సందేహ నివృత్తి కోసం పరీక్షిత్తుమహారాజు అడిగిన ప్రశ్నతో ఈ కావ్యకథ ప్రారంభమవుతున్నది. పరీక్షిత్తుమహారాజు శ్రీమహావిష్ణువు నిఖిలభువనైక నాయకుడు, పరమపురుషుడు అని ఉపనిషత్తుల వలన తెలుసుకున్న వేదసిద్ధాంత రహస్యవేదులైన మహామునులు కూడా విష్ణుసాయుజ్యం చేరుకోకుండా, త్రివర్గఫలభోగాలు అనుభవించాడనికి కారణమేమిటని శుకమహర్షిని అడిగాడు. శుకమహర్షి, పరీక్షిత్తు మహారాజుకు కలిగిన ఇలాంటి సందేహమే పూర్వం ధర్మరాజుకు కూడా కలిగిందని తెలిపాడు. ధర్మరాజు అతడి సందేహాన్ని తీర్చమని వ్యాసమహర్షిని కోరాడు. వ్యాసుడు విష్ణుమాయను తరించడం బ్రహ్మ రుద్రాదులకు కూడా సాధ్యం కాలేదని, ఇక తనవంటి వారికి ఎలా సాధ్యమవుతుందని ధర్మరాజుతో అన్నాడు. వ్యాసుడు ధర్మరాజుకు విష్ణుమాయా విలాస కథలను చెప్పబోతుండగా, ద్వారకానగరం నుంచి గోవిందశర్మ అనే శ్రీకృష్ణుని నర్మసఖుడు వచ్చాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు సభలో విష్ణుమాయా విలాస కథలను వినిపించమని పంపించగా వచ్చానని గోవిందశర్మ ధర్మరాజుకు తెలిపాడు.

ధర్మరాజు గోవిందశర్మకు పారిజాత పుష్పమాలిక ఏవిధంగా లభించిందని అడిగాడు. గోవిందశర్మ పూర్వం విష్ణుమాయా విలాసకథలను సత్యభామకు వినిపించగా, అందుకు మెచ్చి ఆమె పారిజాత సుమమాలికను బహూకరించిందని ధర్మరాజుకు చెప్పాడు. గోవిందశర్మ విష్ణుమాయావిలాస కథలను సత్యభామకు వినిపించడానికి ముందే ఆ కథలను 'విష్ణుమాయానాటకము' అనే పేరుతో ప్రబంధంగా రచించాడని ఎల్లన తన కావ్యంలో కల్పించాడు. గోవిందశర్మ చెప్పిన విష్ణుమాయా విలాస కథలకు మొదటిశ్రోత సత్యభామ. గోవిందశర్మ ధర్మరాజు సభలో సత్యభామ గర్వభంగకథతో ప్రారంభించి, మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుడు మొదలైన వారి కథలను చెప్పాడు. శుకమహర్షి గోవిందశర్మ ధర్మరాజు కొలువులో చెప్పిన విష్ణుమాయా విలాస కథలనే పరీక్షిత్తు మహారాజుకు వినిపించాడు.

4. 1. 2. 1. సత్యభామ గర్వభంగం కథ

శ్రీకృష్ణుడు పారిజాతవృక్షం ప్రాప్తించిన తర్వాత సత్యభామాదేవి హృదయం ఏవిధంగా ఉంటుందో చూడాలని భావించాడు. శ్రీకృష్ణుడు తన మాయాప్రభావంతో రుక్మిణి మొదలైన అష్టమహిషుల ఇళ్ళలో ఒక్కొక్కటే పారిజాత వృక్షాన్ని కల్పించాడు. సహస్ర సంఖ్యలైన గోపాంగనల ఇళ్ళలోను, అష్టమహిషుల ఇళ్ళలోనూ అందరికి అన్ని రూపాలతో ఏకకాలంలో కనిపించాడు. అష్టమహిషులు, గోపకాంతలు అందరూ ఆ మాయను తెలుసుకోలేక, శ్రీకృష్ణుడికి తన మీదే అనురక్తి అని అందరూ భావించారు. ఆ విధంగా శ్రీకృష్ణుడు అనంతరూపాలతో దక్షిణ నాయకత్వాన్ని వహించి ఉన్నాడు. సత్యభామ రూపయౌవన మదంతో పారిజాతవృక్షం తన పెరటిచెట్టు అయిందని గర్వించింది. సత్యభామ శ్రీకృష్ణుడు నిరంతరం ఆమెను కూడి ఉండగా, మిగిలిన అష్టమహిషులు శ్రీకృష్ణుని ఎడబాటుకు ఎంతగా సిగ్గుపడుతున్నారో తెలుసుకోవాలని కుతూహలపడింది. ఆమె తనకు ఆప్తులైన చెలికత్తెలను పిలిచి, పారిజాత పుష్పాలను దివ్యమాణిక్య పాత్రలలో ఓలి పెట్టించింది.

ఆ పుష్ప పాత్రలను రుక్మిణీదేవికి ఇచ్చి, ఆమె ప్రవర్తన ఎలాఉందో చూసిరమ్మని చెలికత్తెను పంపించింది. ఆ చెలికత్తె పారిజాత పుష్పాలు ఇచ్చే నెపంతో సత్యభామాదేవి ఆమె మహారాజ వైభవాన్ని, శ్రీకృష్ణునితో కూడి అనుభవించే మదన సామ్రాజ్యవైభవాన్ని చూసి రుక్మిణీ మొదలైన వారికి హృదయశల్యం కావాలని కదా తనను పంపింది అని అనుకుంటూ వెళ్ళింది. రుక్మిణీదేవి అంతఃపురంలో ద్వారపాలిక సత్యభామ పంపిన చెలికత్తెను ఆపి, రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో కూడి ఏకాంతంగా ఉన్నదని చెప్పింది. ఆద్వారపాలిక ఈ పూవులు ఎవరు పంపించారు, నీవు ఎవరిదానవు అని సత్యభామ చెలికత్తెను ప్రశ్నించింది. అందుకు సత్యభామ చెలికత్తె, పారిజాతపుష్పాలు భూమిపైన సత్యభామకు తప్ప ఇతరుల దగ్గర ఎక్కడైనా ఉన్నాయా అని అడిగింది. ఆ మాటలకు

ఆ ద్వారపాలిక నవ్వి పారిజాత పుష్పాలు ఏమి అరుదు, మా నగరంలోని ఊడిగెపు వారు కూడా ఇలాంటి పూవులు ధరిస్తారని చెప్పింది. రుక్మిణీదేవి తన మనస్సులో ప్రేమతో పారిజాత వృక్షాన్ని ఇచ్చి, శ్రీకృష్ణుడు అహర్నిశం ఆమె వద్దనే ఉండగా సత్యభామ ఎంతగా బాధ పడుతుందో చూడాలని భావించింది. రుక్మిణి ఒక చతుర సంచారికను పిలిచి, పారిజాత పుష్పాలు బంగారు పళ్ళెంలో నింపింది.

రుక్మీణి ఆ సంచారికతో మాకు ఒక పారిజాత వృక్షాన్ని మా కృష్ణుడు తెచ్చాడు. ఆ పారిజాత పుష్పాలు ఇవి అని ఇచ్చిరమ్మని పంపింది. అంతలో సత్యభామ పంపిన చెలికత్తె వచ్చి రుక్మిణీదేవిని, శ్రీకృష్ణుడిని, పారిజాత పుష్పాలనూ చూసి ఆశ్చర్యపోయింది. ఆ చెలికత్తె తాను తెచ్చిన పారిజాత పుష్పాలు రుక్మిణికి ఇవ్వాలా, వద్దా అని సందేహించింది. చివరకు తాను తెచ్చిన పుష్పాలను రుక్మిణి ముందుంచి, సత్యభామ పంపించిందని చెప్పింది. రుక్మిణీదేవి సత్యభామ పంపిన పూవులను శ్రీకృష్ణుని మౌళిలో తురిమింది. రుక్మిణి తన పారిజాత పుష్పాలను సత్యభామ చెలికత్తెతో పంపుతూ, ఈపారిజాత పుష్పాలు మీ ఇంటి పారిజాతమేమో చూడమని అన్నది. రుక్మిణి తన పారిజాతాలనెత్తావి ఏ పువ్వులలోనూ లేదని సత్యభామతో చెప్పమన్నది. సత్యభామ చెలికత్తె జరిగినదంతా దేవికి తెలపాలని త్వరగా వెళ్ళింది.

హృదయనిర్వేదంతో వెళ్ళిన చెలికత్తెకు అంతఃపురంలో సత్యభామతో కూడి ఉన్న శ్రీకృష్ణుడు కనిపించాడు. చెలికత్తె నివ్వెరపోయి పుష్పపాత్రను సత్యభామ ముందు ఉంచింది. సత్యభామ తన చెలికత్తెను ఏమైందని అడిగి, వింత పువ్వులు ఎక్కడివని ప్రశ్నించింది. ఆ చెలికత్తె సత్యభామతో రుక్మిణీదేవి మందిరంలో జరిగిన వృత్తాంతమంతా చెప్పింది. ఆమె సత్యభామతో, లోకానికి తెలిసేలాగ పారిజాత వృక్షాన్ని సత్యభామకు ఇచ్చిన శ్రీకృష్ణుడు లోలుడై నేడు దానిని రుక్మణికి కూడా ఇచ్చాడని తెలిపింది. సత్యభామ చెలికత్తెల మాటలు విని కోపంతో కంపించిపోయింది. అసూయాజాతమైన రోషంతో సత్యభామ ఏడుస్తూ శ్రీకృష్ణుని నిందించింది. సత్యభామ శ్రీకృష్ణునితో, ఇంద్రుడిని గెలిచి తెచ్చిన పారిజాతవృక్షం తనకు ఇచ్చి, నేడు రుక్మిణికి కూడా ఇవ్వడానికి కారణమేమిటని అడిగింది. సత్యభామ పారిజాతం భూమిపై తన ఇంటిలో తప్ప వేరేచోట ఉండరాదని అన్నది. ఆమె తన ఈ పారిజాత వృక్షాన్ని కూడా శ్రీకృష్ణుడి ఇష్టసఖికి లంచమిచ్చుకోమని అతనిపై పారిజాతపుష్పాలు దిగపారబోయించి, తన కేళీమందిరంలోకి వెళ్ళింది. ఆ రాత్రంతా సత్యభామ ఘటనిహిత క్షుధిత పన్నగాంగన లాగ ఏడ్చింది.

శ్రీకృష్ణుడు సత్యభామ కోపం శమించడానికి ఆ రాత్రంతా అక్కడే విరహభావం వహించి ఉన్నాడు. తెల్లవారగానే శ్రీకృష్ణుడు తన మాయా రూపాలన్నింటినీ ఉపసంహరించాడు. సత్యభామ అంతఃపురానికి వచ్చిన గోవిందశర్మ పరిచారికల

ద్వారా జరిగిన వృత్తాంతమంతా తెలుసుకున్నాడు. శ్రీకృష్ణుడు గోవిందశర్మకు తన మాయాకేళిని తెలిపి, సత్యభామ ఈర్ష్యను విడిపించి, ఆమెకు కోపశాంతిని కలిగించమని చెప్పాడు. సత్యభామ గోవిందశర్మతో ఆమెకు జరిగిన అవమానాన్ని చెప్పింది. గోవిందశర్మ సత్యభామతో, జరిగినదంతా కపట నాయకుడైన శ్రీ కృష్ణుని మాయా నాటకమని చెప్పాడు. అందరి ఇళ్ళల్లోని పారిజాత వృక్షాలు, ప్రతిమందిరంలో శ్రీకృష్ణుని బహురూపకత్వం అంతా అతని ఇంద్రజాలమని తెలిపాడు. గోవిందశర్మ సత్యభామతో, పూర్వం శ్రీమహాలక్ష్మి, బ్రహ్మ, రుద్ర, నారదాదులు కూడా విష్ణుమాయా నాటకానికి భ్రమించినారని చెప్పాడు.

గోవిందశర్మ విష్ణుమాయా నాటక కథలను సత్యభామకు వినిపించాడు. సత్యభామ దానికి సంతోషించి, శ్రీకృష్ణుని అనుమతితో గోవిందశర్మకు పారిజాత పుష్పమాలికను బహూకరించింది. ఈకథ గోవిందశర్మకు పారిజాత పుష్పమాలిక ఏవిధంగా లభించిందనే ధర్మరాజు ప్రశ్నతో ప్రారంభమైంది. ఇక్కడ ధర్మరాజుకు కుతూహలం కలగడానికి కారణం పారిజాత పుష్పమాలిక. అది భూలోకంలో సత్యభామాదేవి అంతఃపురంలో మాత్రమే ఉంది. ఎందుకంటే అప్పటికే పారిజాతాపహరణం జరిగిపోయింది. శ్రీకృష్ణుడు పారిజాతపహరణం చేయడానికి సత్యభామ కారణం. రుక్మిణి మీద సత్యభామకు కలిగిన అసూయ పారిజాతాపహరణానికి ఆమెను ప్రేరేపించింది. నారదుడు భూలోకానికి తెచ్చిన పారిజాత పుష్పాన్ని శ్రీకృష్ణుడు రుక్మిణికి ఇవ్వడం సత్యభామ అసూయకు కారణం. ఈ అసూయచేతనే సత్యభామ ఇంద్రుడిని జయించి పారిజాత వృక్షాన్ని భూమి మీదికి తెచ్చింది. సత్యభామకు సంపద, యౌవనగర్వం ఉంది. వాటికితోడు ఇప్పుడు దేవతలపై విజయం, పారిజాతవృక్షం ప్రాప్తించాయి. సత్యభామ గర్వానికి ఇవన్నీ హేతువులైనాయి.

శ్రీకృష్ణుడు చంచల స్వభావం గల సత్యభామ పారిజాతాపహరణ విజయం తర్వాత ఏవిధంగా ప్రవర్తిస్తుందో తెలుసుకోవాలనే ఈ మాయా కల్పన చేశాడు. అష్టమహిషుల ఇళ్ళలో పారిజాత వృక్షాలు, శ్రీకృష్ణుని బహురూపాలు అతని మాయా విలాసకేళికి నిదర్శనాలు. సత్యభామకు పారిజాత వృక్షం లభించగానే, మొదటగా రుక్మిణికే పారిజాత పుష్పాలు పంపించాలనే ఆలోచన ఆమెకు కలిగింది. సత్యభామకు రుక్మిణిపై గల పూర్వపు అసూయే దానికి ప్రధాన కారణమని చెప్పవచ్చు. సత్యభామ రుక్మిణికి పారిజాతపుష్పాలు చెలికత్తెతో పంపించడంలో తన రాజసాన్ని ప్రదర్శించడం ఒక కారణం, రుక్మిణిని అవమానించాలని భావించడం రెండవ కారణం. ఇంకోమర్మం ఏమిటంటే సేవకుల మాటలు ఎవరినైనా బాగా ప్రభావితం చేస్తాయి కాబట్టి. సత్యభామ రుక్మిణి అంతఃపురంలో కూడా పారిజాతవృక్షం ఉందని తెలిసినప్పుడు తాల్మిలేక ఏడవడం, కోపించడం, కృష్ణుడిని నిందించడం ఇవన్నీ స్త్రీల సహజ స్వభావాన్ని

గుర్తుకుతెస్తాయి. సత్యభామ దుఃఖానికి చెలికత్తె చెప్పిన మాటలు ప్రేరణకాగా, ఆమె విషాదానికి మాత్రం రుక్మిణి మీద గల అసూయే కారణమైందని చెప్పవచ్చు.

శ్రీకృష్ణుని కపటనాటకం వల్ల సత్యభామలోని ఈ అసూయ వెల్లడయ్యింది. సత్యభామకు సపత్నీ విషయ అసూయ వల్ల రోషవిషాదం కలిగింది. ఈ విషాదం ఉపశమించాలంటే దుఃఖం కలగాలి. శ్రీకృష్ణుడు ఆ రాత్రంతా సత్యభామకు కలిగించింది ఈ దుఃఖమే. గోవిందశర్మ తర్వాత రోజు ఉదయకాలంలో వచ్చి, సత్యభామకు ఈర్ష్యను తొలగించి, కోపశాంతిని కలిగించాడు. ఈ రెండు కార్యాలు జరగడానికి ముందు సత్యభామకు విషాదం ఉపశమించాలి. అందుచేతనే సత్యభామ రాత్రంతా ఒంటరిగా దుఃఖించిన తర్వాత, గోవిందశర్మ పాత్ర ప్రవేశించింది. దుఃఖం వల్ల సత్యభామ విషాదం ఉపశమించింది. గోవిందశర్మ మాటలు సత్యభామకు పరిపూర్ణమైన మానసికానందాన్ని కలిగించాయి. సత్యభామ గర్వం నశించింది. దానికి నిదర్శనంగానే ఆమె గోవిందశర్మకు పారిజాత పుష్పమాలికను బహూకరించింది ఈ విధంగా సత్యభామ గర్వభంగం ఈకథలో వర్ణించంబడింది.

4. 1. 2. 2. శ్రీమహాలక్ష్మి గర్వభంగం కథ

క్షీరసముద్రంలోని శ్వేతద్వీపంపై ఉన్న వైకుంఠపురంలో శ్రీమహావిష్ణువు, శ్రీమహాలక్ష్మితో కలిసి జూదమాడాలని భావించాడు. ఒక దివ్యకాంత పగడపు పలక, రత్నపు సారెలు, బంగారు పాచికలు ఏర్పరిచింది. శ్రీమహాలక్ష్మి చూడారత్నాన్ని, శ్రీమహావిష్ణువు కాస్తుభమణిని పందెంగాపెట్టి ఆటను ప్రారంభించారు. శ్రీమహావిష్ణువు గెలవాలని భూదేవి, శ్రీమహాలక్ష్మి గెలవాలని దేవకాంతలు, ఇద్దరూ గెలవాలని సరస్వతి కోరుకొన్నారు. వినోదార్థమై మొదలైన జూదంలో ఆటసగానికి వచ్చే సరికి గెలుపుకోసం ఒకరి మీద మరొకరికి ఆగ్రహం కలిగింది. సప్తమ వ్యసనమైన జూదం వలన ఎంతటి సుజనులకైనా వ్యవహార హాని కలుగుతుంది. జూదం వలన పితృపుత్ర వాత్సల్యం చెడుతుంది. గురుశిష్య భావం హరిస్తుంది. బాంధవ మిత్ర సద్భావం నశిస్తుంది. ధర్మశీలం విడనాడుతుంది. మత్సరం కలుగుతుంది. కీర్తి, ధనకాంక్ష హెచ్చవుతాయి. జూదం కోపకారణ మవుతుంది. జూదం వల్ల ప్రాణహాని కూడా కలుగుతుంది.

ఈ రీతిగా శ్రీమహావిష్ణువు, శ్రీమహాలక్ష్మి పోటీపడి జూదమాడుతుండగా ఆట చివరికి వచ్చింది. విష్ణువు తన ఆట ఓటమికి దగ్గర కాగానే, ఓడిపోతే మహాలక్ష్మి మనస్సు ఏ విధంగా ప్రవర్తిస్తుందో చూడాలని మాయకల్పించాడు విష్ణుమాయా ప్రభావంతో శ్రీమహాలక్ష్మి జూదంలో ఓడిపోయింది. దానిని చూసి భూదేవి నవ్వింది, సరస్వతి మౌనం వహించంది. దేవకాంతలు లజ్జతో తలలు వంచుకున్నారు. విష్ణువు మహాలక్ష్మితో పరిహాసమాడినాడు. శ్రీమహాలక్ష్మికి పరాజయంతో చెమటలు పట్టగా ధర్మదేవతను దూషించింది. ఆమె కొంతసేపటికి పాచికలు చూడగా అవి నాలుగువైపులా

ఒక్కరీతిగా ఉన్నాయి. అదిచూసి శ్రీమహాలక్ష్మి ఆశ్చర్యపడి, కోపంతో విష్ణువును జూదరికాడని నిందించింది. శ్రీమహాలక్ష్మి రత్నాకరుని కుమార్తె అయిన తనకు చూడారత్నమేమీ ప్రియం కాదని, దానికోసం జూదంలో మాయ చేయడం ఎందుకని విష్ణువును నిలదీసింది. శ్రీమహాలక్ష్మి అల్పులైన, మూఢులైన దేవదానవులను, మానవులను వంచించే వెడమాయతో ఆమెను మోసగించలేడని విష్ణువును తూలనాడింది.

శ్రీమహాలక్ష్మి విష్ణుమాయను తిరస్కరించి, తన మాయను పొగడుకున్నది. హరవిరించి పురందరాదులకు, యక్ష గంధర్వ పన్నగ కిన్నరులకు, దైతేయ దానవ సమూహాలు మొదలైన వారికి పదవులు, ఐశ్వర్యములు తన కటాక్షం వల్లనే కలుగుతున్నాయని పలికింది. చంద్రబింబంలోని చంద్రిక, రవిమండలంలోని ప్రభ, అగ్నిలోని దీప్తి, రత్నంలోని రంగు, పద్మవనాలలోని శృంగారవైభవం మొదలైన వన్నీ శ్రీమహాలక్ష్మి కళలే అవి గర్వంగా పలికింది. అంతటితో ఆగకుండా శ్రీమహాలక్ష్మి ఈర్ష్యా జనిత లజ్జా విషాద క్రోధంతో వైకుంఠపుర వైభవాన్ని క్షణమాత్రంలో హరించి శూన్యమయం గావించింది. శ్రీమహాలక్ష్మి చేసిన దుశ్చర్యకు మనస్సులోనే కోపించాడు. జూదంలో ఓడిన కారణంగా ఇంతగా కోపించిన శ్రీమహాలక్ష్మికి దానిఫలం అనుభవింపజేయాలని నిశ్చయించుకున్నాడు. విష్ణువు శ్రీమహాలక్ష్మిని శాంతపరిచి, లోకమాత అయిన ఆమెకు లోకాలపై కోపించడం తగదని పలికాడు. విష్ణువు వినోదార్థమై ఆడిన జూదంవల్లనే ఇంత చేటు కలిగిందని, జరిగిన దాంట్లో శ్రీమహాలక్ష్మీ తప్పేమీ లేదని అన్నాడు. విష్ణువు ఆటలో శ్రీమహాలక్ష్మి గెలిచిందని, ఆమెకు కౌస్తుభమణిని అలంకరించాడు.

అతడు శ్రీమహాలక్ష్మిని చెడు జూదపువ్యసన దోష ఖేదం మరిచిపోవడానికి క్షీరసముద్ర తీరానికి విహారానికి తీసుకువెళ్ళాడు. విష్ణువు శ్రీమహాలక్ష్మికి ఉత్సాహం కలిగేలాగ క్షీరసముద్రంలోని వింతలు, విశేషాలను వర్ణించి చూపించాడు. అక్కడి నుంచి విష్ణువు శ్రీమహాలక్ష్మితో కలిసి ఉద్యానవనంలో విహరించాడు. శ్రీమహాలక్ష్మి ఆ వనంలో భూదేవి, సరస్వతి, దేవకాంతలతో కలిసి పుష్పాపచయక్రీడలతో ఆనందించింది. శ్రీమహావిష్ణువు జూదపు ఆటనెపంగా వైకుంఠపురాన్ని శూన్యమయం కావించిన నిర్దయురాలైన శ్రీమహాలక్ష్మి మోసపుచ్చాలని నిర్ణయించుకున్నాడు. భార్య అయినా, కుమారుడైనా, హితుడైనా గాని మేరతప్పి, గర్వంతో దుష్కృతి చేసినప్పుడు, వారికి తగిన విధంగా బుద్ధి చెప్పాలని భావించాడు. సంపద దుర్మదానికి ఆశ్రయం కాబట్టి, విష్ణువు శ్రీమహాలక్ష్మి దుర్మదగర్వాన్ని మాన్పడానికి మాయాలక్ష్మిని కల్పించాడు. వైకుంఠపుర వైభవాన్ని పూర్వం కంటే అధికంగా ప్రకాశింపజేశాడు. శ్రీమహాలక్ష్మి ఉద్యానవనంలో శోభావిహీనమైన ఒక కొలను మధ్యలో బంగారు తామర కర్ణిక మీద ప్రభాహీనమైన ఒక దేవతను చూసింది.

శ్రీమహాలక్ష్మి ఆ దేవతను చూసి మెచ్చుకొని, శచీదేవికన్నా, భూదేవికన్నా, పార్వతికన్నా, సరస్వతికన్నా, తనకన్నా కూడా ఆ దేవత లోకోత్తరచరిత అని సరస్వతితో పలికింది. శ్రీమహాలక్ష్మి ఆ దేవతకు కలిగిన దురవస్థను చూసి జాలిపడింది. ఆమె కథను తెలుసుకోవాలని అక్కడే ఎదురు చూసింది. మాయాలక్ష్మి బ్రహ్మయోగాన్ని చాలించి, కనులు తెరిచి శ్రీమహాలక్ష్మి మొదలైన దేవకాంతలను చూసింది. మాయలక్ష్మి వారంతా ఎవరని అడిగింది. శ్రీమహాలక్ష్మీ మాయాలక్ష్మిని స్తుతించి, ఆమె వృత్తాంతాన్ని చెప్పమని కోరింది. మాయాలక్ష్మి శ్రీమహాలక్ష్మితో తాను శ్రీమహావిష్ణువుకు ప్రియురాలైన మహాలక్ష్మినని తెలిపింది. మాయాలక్ష్మి శ్రీమహాలక్ష్మితో ఆమె విష్ణుమాయ వలన మోసపోయిన తీరును గురించి చెప్పింది. ఒక కల్పాది కాలంలో భువన నిర్మాణశక్తికోసం బ్రహ్మ, శివుడు పోటీపడి విష్ణువును గురించి తపస్సు చేశారు. విష్ణువు వారి తపస్సును గురించి తెలిసి కూడా ఊరుకున్నాడు. మాయాలక్ష్మి బ్రహ్మ రుద్రులకు వరమిచ్చే శక్తి లేకనే విష్ణువు ఊరుకున్నాడని రాజసదుర్మదంతో భావించింది. మాయాలక్ష్మి విష్ణువును నిర్లక్ష్యం చేసివెళ్లి బ్రహ్మ రుద్రులను కావలసిన వరం కోరుకోమన్నది.

ముందుగా బ్రహ్మ మాయాలక్ష్మితో అతనికి జగత్సృష్టికరణ విద్య, సంపద విద్యను కరుణించమని వేడుకున్నాడు. మాయాలక్ష్మి బ్రహ్మ కోరిన వరాన్ని ఇచ్చింది. శివుడు కూడా అదే వరాన్ని కోరాడు. మాయాలక్ష్మి గర్వంతో వివేకం మరిచి శివుడికి కూడా అదే వరాన్ని అనుగ్రహించింది. మాయలక్ష్మి చేసిన పొరపాటు వల్ల వరప్రసాదితమైన ఆ విద్య, కళ రెండూ బ్రహ్మ వద్ద, శివుడి వద్ద నిలువకుండా చంచలిస్తూ మూర్తివంతులై ఇద్దరివైపూ వెళ్ళసాగారు. ఆ సమయంలో విష్ణుమాయ స్త్రీ రూపాన్ని ధరించి మాయాలక్ష్మి ముందు నిలిచింది. విష్ణుమాయ విష్ణు మహిమను చులకన చేసి, మందబుద్ధితో వరమిచ్చిన మాయాలక్ష్మిని నిందించింది. విష్ణుమాయ మాయాలక్ష్మి రాజసతామస గుణాలతో, దుర్మదంతో ప్రవర్తించినందుకు కోపంతో ఆమెను శపించింది. మాయాలక్ష్మి తపస్సు చేసే వనం కిసలయసుమఫల శుకభ్రమర సంకీర్ణమై కూడా శూన్యమై చిత్రరూపంతో ఉంటుందని, ఆ వనం వికాసాన్ని పొందినప్పుడే శాపం తీరుతుందనీ విష్ణుమాయ తెలిపింది.

మాయాలక్ష్మి శ్రీమహాలక్ష్మితో ఈ రీతిగా తన వృత్తాంతాన్ని చెప్పగానే ఆమెకు శాపవిమోచనం కలిగింది. దేవదుందుభులు మ్రోగాయి, పుష్పవర్షం కురిసింది. పుష్పకవిమానంలో దేవతలు అందరూ వచ్చి మాయాలక్ష్మిని స్తుతించారు. శ్రీమహాలక్ష్మి తనలో, మహాలక్ష్మి అయిన తానుండగా బ్రహ్మాది దేవతలు వచ్చి మాయాలక్ష్మిని స్తుతిస్తున్నారని విస్మయం చెందింది. శ్రీమహాలక్ష్మి విభ్రాంతితో చూస్తుండగానే మాయాలక్ష్మి ఆమె తేజస్సును హరించింది. మాయాలక్ష్మి సరస్వతిని, భూదేవిని, దేవకాంతలను ఆమెతోపాటు తీసుకొని పుష్పకవిమానంలో వైకుంఠానికి వెళ్ళింది. శ్రీమహాలక్ష్మి

తేజోవిహీనగామారి, నిర్వేదంతో ఒంటరిగా ఆ వనంలో తిరగసాగింది. భర్తను హేళన చేసి లెక్కించనందుకు శ్రీమహాలక్ష్మికే ఇంతటి దురవస్థ కలిగింది. శ్రీమహాలక్ష్మి చెలికత్తెలు, తేజస్సు నశించగా చింతాక్రాంత అయింది. విష్ణువు కనిపించక, మహాలక్ష్మి ఒంటరిగా తిరిగి తిరిగి అలిసిపోయింది. మహాలక్ష్మి నిష్ఠురపరుడై తన భర్త ఒంటరిగా అడవిలో విడిచి వెళ్ళాడని చింతించింది. శ్రీమహాలక్ష్మి ఏ విధంగానైనా వైకుంఠపురం చేరి, తన పాట్లన్నీ భర్తకు తెలిపిన తర్వాత తనువు విడిచి పెట్టాలని భావించింది. శ్రీమహాలక్ష్మి మాయాలక్ష్మి వైభవాన్ని, ప్రియసఖులు విడిచిపోవడాన్ని, భర్త ఎడబాటునూ తలచుకొని దుఃఖించింది.

శ్రీమహాలక్ష్మి ప్రయాసపడి నడిచివెళ్ళి వైకుంఠపుర వైభవాన్ని చూసి ఆశ్చర్యపోయింది. శ్రీమహాలక్ష్మి సాగర తీరంలో ముత్యాలు ఏరుతున్న స్త్రీల వలన, విష్ణువు మాయాలక్ష్మితో కూడి ఉన్నాడని తెలుసుకుంది. ఆ మాట విని మహాలక్ష్మి మనస్సులో బాధపడుతూ తిరిగి ఉద్యానవనంలోకి వెళ్ళింది. శ్రీమహాలక్ష్మి ఆప్రభాహీనమైన కొలను చేరుకొని, అందులోని తామర కర్ణికపై పద్మాసనబంధంలో కూర్చుని పశ్చాత్తాపంతో విష్ణువును గూర్చి తపస్సు చేసింది. శ్రీమహావిష్ణువు తన మాయాలక్ష్మీ విలాస కృత్యాలన్నింటినీ ఉప సంహరించాడు. శ్రీమహాలక్ష్మి కన్నులు తెరిచి చూడగా వైకుంఠపురంలో శ్రీమహావిష్ణువు అంకపీఠంపై కూర్చొని ఉంది. పుష్పవర్షం కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. శ్రీమహాలక్ష్మికి జరిగినదంతా కలలాగ అనిపించింది. ఆ విధంగా విష్ణువు మహాలక్ష్మికి గర్వభంగం కావించాడు.

ఈ కథ శ్రీమహావిష్ణువు మహాలక్ష్మితో జూదం ఆడటానికి సన్నద్ధమవడంతో ప్రారంభమవు తున్నది. వినోదార్థమై మొదలుపెట్టిన ఆటకు చూడారత్నాన్ని, కౌస్తుభమణినీ పందెంగా ఉంచారు. అంతవరకూ కలిసి ఉన్న భూదేవి, దేవకాంతలు రెండు పక్షాలుగా విడిపోయారు. ఈ వర్ణన ద్వారా జూదం ఆడటానికి తగిన వాతావరణం ఇక్కడ కల్పించబడిందని తెలుస్తుంది. శ్రీమహాలక్ష్మి జూదంలో ఓడిపోయినందుకన్నా కూడా భూదేవి నవ్వినందుకే అవమానంగా భావించింది. అది సపత్ని విషయంగా శ్రీమహాలక్ష్మికి అసూయను కలిగించింది. ఎందుకంటే శ్రీమహాలక్ష్మి రత్నాకరుని కుమార్తె, సకల సంపదలకూ అధిదేవత. విష్ణువు శ్రీమహాలక్ష్మి సంపదలకు అధిదేవత కాబట్టి, జూదంలో ఓటమి కలిగితే ఆమె మనస్సు ఏవిధంగా ఉంటుందో చూడాలనుకున్నాడు. ఆమె మాయాజూదం వల్ల కలిగిన ఓటమిని భరించలేకపోయింది. శ్రీమహాలక్ష్మి భూదేవి మీద కలిగిన ఈర్ష్యతో, మాయాజూదం వల్ల కలిగిన లజ్జా విషాద క్రోధాలతో విష్ణువును నిందించింది. అంతేకాకుండా అదుపులేని ఆవేశంతో వైకుంఠపుర వైభవాన్ని శూన్యమయం కావించింది. ఇదంతా జూదంలో కలిగిన ఓటమి వల్ల, సంపదగర్వం వల్ల శ్రీమహాలక్ష్మి చేసిన అనర్థానికి నిదర్శనం.

విష్ణువు శ్రీమహాలక్ష్మిని సముద్ర తీరానికి తీసుకువెళ్ళడం, విశేషంగా చేసిన సముద్ర వర్ణన అంతా ఆమెకు కలిగిన గర్వాన్ని ఉత్కర్ష చేయడానికి చేసిందే. శ్రీమహాలక్ష్మి ఉద్యాన వనవిహారం ఆమెకు మాయాలక్ష్మిని చూపించడానికి చేసిన ఏర్పాటు. విష్ణు మాయా కల్పితమైన కొలను, మాయాలక్ష్మి వృత్తాంతం అంతా గర్వోత్సాహంతో ఉన్న శ్రీమహాలక్ష్మికి గర్వభంగం కావించడానికి చేసిన చక్కని కల్పన. మాయాలక్ష్మిని కల్పించడం శ్రీమహా లక్ష్మికి హృదయశల్యం కలిగించడానికేనని భావించవచ్చు. శ్రీమహాలక్ష్మి వైకుంఠపురంలోకి వెళ్ళక ముందే పురకాంతలతో సంభాషణ కల్పించడంలో ఆమె గర్వాన్ని సమూలంగా తొలగించడమే ప్రధానోద్దేశంగా కనిపిస్తుంది. శ్రీమహాలక్ష్మికి పురకాంతలకు మధ్య జరిగిన ఈ స్వల్పమైన సంభాషణ, కథలో ముగింపునకు చక్కని సూచిక వంటిది.

శ్రీమహాలక్ష్మి కొలనులో మాయాలక్ష్మి తపస్సు చేసిన తామరకర్ణిక మీదనే కూర్చొని విష్ణువును ధ్యానించడం ఆమె పశ్చాత్తాపానికి చిహ్నం. విష్ణువు శ్రీమహాలక్ష్మి గర్వాన్ని భంగపరచడానికి ఆమెను ఇంత ప్రయాసపెట్టాలా? అనే సందేహం కలుగుతుంది. విష్ణువు శ్రీమహాలక్ష్మి శూన్యం చేసిన వైకుంఠపురాన్ని క్షణంలో తిరిగి ప్రకాశింపజేశాడు. ఈ ఒక్క చర్యతో శ్రీమహాలక్ష్మి శక్తి కన్నా విష్ణుమాయా ప్రభావం గొప్పదని తెలియజెప్పవచ్చు. కాని శ్రీమహాలక్ష్మికి విష్ణుమాయా ప్రభావంతో పాటుగా, ఆమె అశక్తత కూడా తెలిసిరావాలి. అందుకోసమే విష్ణువు ఇంత మాయానాటకాన్ని నడిపించాల్సి వచ్చిందని గ్రహించాలి. అందుచేత ఈ కథలో విష్ణుమాయా ప్రభావ ప్రకటనతో పాటుగా శ్రీమహాలక్ష్మి అహంకార నాశనం కూడా ప్రధాన ప్రయోజనమని తెలుస్తుంది.

### 4.1.2.3. బ్రహ్మగర్వభంగం కథ

లోకవిహీనమై మున్నీరు ఆకాశాన్ని తాకుతున్న ప్రళయకాలంలో శ్రీమహావిష్ణువు పెనుచీకటిలో ఏకాంతంగా సముద్రంపై పవళించి ఉన్నాడు. కొంతకాలానికి శ్రీమహావిష్ణువు నాభికమలంలోని పుప్పొడి రేణువులో పరమాణు అంశం నుండి బ్రహ్మ జన్మించాడు. అతడు బంగారు వర్ణంతో మెరిసిపోతూ, పూర్వ పుణ్యఫలం వల్ల జగత్పరినిర్మాణ విధేయతతో, నిగమతత్త్వ జ్ఞానంతో జన్మించాడు. బ్రహ్మ శ్రీమహావిష్ణువుకు నమస్కరించి అనేక విధాలుగా స్తుతించాడు. శ్రీమహావిష్ణువు బ్రహ్మకు ప్రసన్నుడై, సృష్టి నిర్మాణ చాతుర్యాన్ని, వాక్సిద్ధిని, కామరూప సంచారాన్ని అనుగ్రహించాడు. ఆవరప్రభావంతో బ్రహ్మదేవుడు హాటకమయమైన బ్రహ్మాండాన్ని కల్పించి, నీటిపై తేలించాడు. తర్వాత ఆకాశాన్ని కల్పించి, ఆకాశం వలన వాయువును, వాయువు వలన అగ్నిని, అగ్ని వలన జలమును, జలము వలన భూమినీ కల్పించాడు. ఆకాశంలో వెలుగునట్లుగా సూర్య చంద్రులను కల్పించాడు. నక్షత్ర మండలాన్ని ఆకాశంలో

నిలిపాడు. బ్రహ్మ లోకాలను పూరించునట్లుగా జంతుకోటులను పుట్టించాడు. బ్రహ్మ అన్నిటికన్నా ఊర్ధ్వలోకాన్ని తన నివాసంగా చేసుకున్నాడు. విష్ణుమాయా పరిభ్రమలో కాలచక్ర విభ్రాంతమవుతూ సకలలోకాలూ నాశనాన్ని, అభివృద్ధినీ సమంగా పొందుతున్నాయి. లోకంలోని ప్రాణులు అన్నీ సత్త్వ రజస్తమోగుణాలతో శమదమ, అహంకార, దుర్మాన మోహమాత్సర్యాలను అనుసరించి ప్రవర్తిస్తున్నాయి.

బ్రహ్మదేవుడు రాజసగుణంతో ప్రభావితుడై ముల్లోకాలను తానే కల్పించినానని గర్వించాడు. అంతేకాకుండా పద్మజాండమును కల్పించినందువల్ల తాను తప్ప ఎవరూ అధికులు లేరని అహంకరించాడు. సత్యలోకంలోని బ్రహ్మ కొలువులో దేవతలు, మునులు, దిక్పాలకులు మొదలైన వారందరూ బ్రహ్మను కీర్తించారు. దానికి సంతోషించిన బ్రహ్మ తనవంటి దైవం పద్నాలుగు లోకాలలో ఎవరూ లేరని పొగడుకొన్నాడు. ఇంద్రియాలను జయించిన తనవంటివాడు వేరెవరూ లోకంలో లేరని పలికాడు. ఈ రీతిగా ఆత్మస్తుతి చేసుకుంటున్న బ్రహ్మ మాటలకు మార్కండేయమహర్షి అడ్డుతగిలాడు. మార్కండేయమహర్షి బ్రహ్మతో భువనైక నాయకుడైన శ్రీమహా విష్ణువును విస్మరించి, ఆత్మస్తుతి చేసుకుంటున్నావని అన్నాడు. మార్కండేయుడు నిన్నగాక మొన్న జన్మించిన బ్రహ్మ అంతలోనే ముల్లోకాలకూ ప్రభువునని గర్వించి, మహాప్రభువైన విష్ణువును మరిచాడని పలికాడు. పూర్వజన్మల సుకృత ఫలవిశేషంగా శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి పుట్టుటను కూడా మరిచాడని మార్కండేయుడు బ్రహ్మకు గతాన్ని గుర్తు చేశాడు.

మార్కండేయుడు సకల జగత్సృష్టికర్త అయిన శ్రీమహావిష్ణును సేవించకుండా, అజ్ఞానంతో తానే దైవమని చెప్పుకోవడం తగదని బ్రహ్మకు హితవు చెప్పాడు. బ్రహ్మదేవుడు మార్కండేయుని మాటలకు కోపించాడు. అతడు శ్రీమహావిష్ణువు పరమాత్మ అయితే అతడే లోకాలను సృష్టించకుండా ఎందుకు ఊరుకున్నాడని అన్నాడు. బ్రహ్మ విష్ణువు నాభికమలంలో జన్మించినంత మాత్రాన తనకు పౌరుషం చెడలేదని పలికాడు. బ్రహ్మ ఉదయాద్రి మీద సూర్యుడు ఉదయించినప్పటికీ, ఆ ఉదయాద్రి కంటే ఎక్కువ తేజంతో కనిపించడా అని బ్రహ్మ తనను సమర్థించుకున్నాడు. మార్కండేయుడు బ్రహ్మ మాటలకు సమాధానంగా, శ్రీమహావిష్ణువుకు బ్రహ్మకు హస్తి మశకాంతరమంత భేదం ఉందన్నాడు. బ్రహ్మపదవి విష్ణువు దాసాను దాసులకు సాటి రాదని అన్నాడు.

మార్కండేయుడు శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి అనేక మంది బ్రహ్మలు జన్మించారని తెలిపాడు. మార్కండేయుడు విష్ణువు నాభికమలం నుంచి జన్మించడం వల్లనే బ్రహ్మకు అంతటి తేజం కలిగిందని అన్నాడు. మార్కండేయుడు విష్ణుమహిమను చెబుతూ, పూర్వం ప్రళయకాలంలో మున్నీరు ఆకాశాన్ని తాకుతున్న సమయంలో అతడు ఒంటరిగా ఈదుతూ, వటపత్రశాయి అయిన శ్రీమహావిష్ణువును చూసినట్లుగా

చెప్పాడు. మార్కండేయుడు ఆశ్చర్యంతో ఆ బాలుడిని సమీపించి, సకలశూన్యమైన ఈ చీకటిలో భయం లేక ఒంటరిగా ఉన్నావు ఎవరు నీవు? అని, చంద్రశేఖరుడు ఎక్కడ ఉన్నాడని అడిగాడు. ఆ బాలుడు తన నోటిని తెరచి, అందులో చూడమన్నాడు. మార్కండేయుడు ఆ నోటిలోకి ప్రవేశించి, అక్కడ పద్నాలుగు లోకాలనూ చూశాడు. పరమశివుడిని దర్శించుకొని, పూజించి వెలుపలికి వచ్చాడు. మార్కండేయుడు రాగానే అక్కడ వైకుంఠపురం, అందులో శ్రీమహావిష్ణువు కనిపించారు. శ్రీమహా విష్ణువు మార్కండేయునితో, మునీంద్రా చంద్రశేఖరుని చుశావా? అని అడిగాడు. మార్కండేయుడు సకల లోకాలనూ చూశానని తెలిపి, శ్రీమహావిష్ణువుకు అంజలి ఘటించాడు. మహావిష్ణువు తన అంశభేదమైన శివుడిని సేవించమని తెలుపగా, మార్కండేయుడు మృత్యుంజయుని సేవించి తాను చిరంజీవి అయినానని బ్రహ్మ సభలో పలికాడు.

మార్కండేయుడు బ్రహ్మకు హితబోధ చేయాలని పుండరీకుని కథను వినిపించాడు. విష్ణుమాయా ప్రభావాన్ని సందేహించినందుకే పరమ భాగవతుడైన పుండరీకుడు మాయా సంసారబంధంలో తగుల్కొని పడరానిపాట్లు అనుభవించాడు. కాబట్టి విష్ణుమాయను చులకన చేయవద్దని మార్కండేయుడు బ్రహ్మకు హితబోధ చేశాడు. బ్రహ్మ మార్కండేయుని మాటలకు అహంకరించి, విష్ణుమాయను తనపైకి పంపమని వాదించాడు. బ్రహ్మ క్రోధంతో విష్ణుమాయను నిందించి, సృష్టినిర్మాణ క్రమాన్ని విడిచిపెట్టి, లోకపాలనను చాలించి తపస్సు చేసుకోవడానికి మందరగిరికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ తేజము నశించి లోకాలన్నీ చీకట్లతో తల్లడిల్లాయి. మార్కండేయముని ప్రార్థించగా విష్ణువు కోటి సూర్యప్రభలతో ప్రత్యక్షమయినాడు. మహావిష్ణువు మార్కండేయునితో లోకాలన్నీ తన మాయానిర్మాణాలు కాబట్టి, బ్రహ్మ చేసిన అపకారం వాటిని బాధించదని తెలిపాడు. మహావిష్ణువు తన మాయా ప్రభావంతో లోకాలకు పూర్వస్థితిని కలిగించాడు. విష్ణువు బ్రహ్మగర్వాన్ని అణచిన తర్వాత లోకాలకు ఆనందాన్ని కలిగిస్తానని పలికి మాయమైనాడు.

బ్రహ్మ తపస్సు చేయడానికి మందరగిరి మీద ఒక గుహను కల్పించాడు. ఆగుహలోపల ఒక సరస్సును, మందార వనాన్ని కల్పించుకొని, బ్రహ్మ ఆ వనంలోనే పదివేల దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకనాడు మహావిష్ణువు తన మాయా ప్రభావంతో ఆ గుహలో మాయాసరస్వతి కల్పించాడు. ఆ మాయాసరస్వతి శృంగార గీతాలు పాడుతూ, తన శృంగార చేష్టా విలాసాలతో బ్రహ్మకు కనిపించింది. బ్రహ్మ మాయాసరస్వతిని చూసి కామమోహితుడైనాడు. ఆమెను సమీపించి, హంస వాహనం, సరస్వతికి ప్రియమైన చిలుక, చేతివీణ కూడా ఉండటాన్ని చూశాడు. బ్రహ్మ తన ఎదురుగా ఉన్నది సరస్వతిగా భ్రమించాడు. బ్రహ్మ కామార్తుడై ఆ మాయాసరస్వతితో

అనేక వేల సంత్సరాలు క్రీడించాడు. అతని గాఢరతులకు ఓర్వలేక మాయాసరస్వతి నూరు రూపాలు ధరించింది. బ్రహ్మ ఆ నూరు రూపాలతో క్రీడించి శతానందుడయ్యాడు. బ్రహ్మ అనేక సంవత్సరాలు సురత సుఖాన్ని అనుభవించిన తర్వాత, మాయాసరస్వతి మాయమైపోయింది.

బ్రహ్మ మాయాసరస్వతిని అనుసరించి గుహ వెలువలికి వచ్చాడు. అక్కడ మాయాసరస్వతి కనిపించక పోయే సరికి దైన్యంతో, సంభోగ చిహ్నాలతో ఉన్న బ్రహ్మను మందరగిరి మునులు చూశారు. బ్రహ్మ మాయాసరస్వతి కనిపించక దిగులుపాటుతో, కంపం, దైన్యం, లజ్జ కలిగి దుఃఖంలో మునిగిపోయాడు. మార్కండేముని బ్రహ్మకు జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని తెలిపాడు. విష్ణుమాయా మహిమను మార్కండేయముని బ్రహ్మకు బోధించాడు. బ్రహ్మదేవుడు మార్కండేయుని హితబోధ వల్ల పశ్చాత్తాపంతో హృదయంలో భక్తిని నిలుపుకొని శ్రీమహావిష్ణును స్తుతించాడు. బ్రహ్మ తన అపరాధమును మన్నించమని విష్ణువును వేడుకున్నాడు. శ్రీమహావిష్ణువు బ్రహ్మకు కలిగిన పశ్చాత్తాపానికి సంతృప్తుడై విరాడ్రూపంతో ప్రత్యక్షమైనాడు. బ్రహ్మ శ్రీమహావిష్ణువును అనేక స్తోత్రాలతో కీర్తించాడు. మహావిష్ణువు బ్రహ్మను అనుగ్రహించి అతడి పదవిని యథావిధిగా కల్పించాడు. ఈ విధంగా బ్రహ్మకు గర్వభంగం కలిగింది.

ఈ కథలో బ్రహ్మ తనకు గల సృష్టినిర్మాణ దక్షతను తలచుకొని గర్వించాడని తెలుస్తుంది. మహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించినప్పుడు బ్రహ్మకు గల వినయ విధేయతలు క్రమంగా అతడు బ్రహ్మాండ నిర్మాణం చేసి, జంతు కోటులను సృష్టించేటప్పటికి కనుమరుగయ్యాయి. బ్రహ్మాండ నిర్మాణం, పద్నాలుగులోకాలను కల్పించడం, సకల జంతు సమూహాలనూ సృష్టించడమనే మహాకార్యాన్ని బ్రహ్మ ఒక్కడే నిర్వహించాడు. బ్రహ్మ తాను కల్పించిన చరాచర జగత్తును చూసుకొని సంతృప్తి చెందాడు. ఒక మహాకార్యాన్ని సాధించిన తర్వాత విజేతకు కలిగేటువంటి సంతృప్తి రూపకమైన గర్వం ఇక్కడ బ్రహ్మకు కూడా కలిగింది. అంతే కాకుండా మహా ప్రళయం తర్వాత బ్రహ్మాండమంతటిలోకీ ప్రథమ సృష్టి తానేనని కూడా బ్రహ్మకు గర్వం కలిగింది. అటువంటి బ్రహ్మతో మార్కండేయముని మాత్రమే వాదించగలిగాడు.

మార్కండేయముని చిరంజీవి, మృత్యుంజయుడు. అతడు బ్రహ్మకంటే పూర్వుడని మార్కండేయుడు చెప్పిన వటపత్రశాయి వృత్తాంతం తెలియజేస్తుంది. మార్కండేయుడు చేసిన హితబోధ, విష్ణుమాయా ప్రశంస అంతా బ్రహ్మ గర్వాన్ని మరింతగా ఉత్కర్ష చేసింది. పుండరీకుని చరిత్రను చెప్పడం ద్వారా మార్కండేయుడు విష్ణుమాయా మహిమను బ్రహ్మకు తెలియజేయాలని భావించాడు. విష్ణుమాయా ప్రభావితుడైన బ్రహ్మ మార్కండేయుని హితబోధకు కోపంతో సృష్టి నిర్మాణకార్యాన్ని చాలించాడు. బ్రహ్మ గర్వాతిశయానికి ఈ సంఘటన నిదర్శనం. బ్రహ్మ మనసులోని దుష్ట స్వభావాన్ని

బహిర్గతం చేయడానికే ఇక్కడ మార్కండేయుడు పుండరీక చరిత్రను విపులంగా చెప్పాడని తెలుస్తుంది. విష్ణుమాయను సందేహించినందుకే పుండరీకుడు పడరాని పాట్లు పడ్డాడు. ఇక విష్ణు మాయను నిందించిన బ్రహ్మగతి ఏమవుతుందో అనే ఉత్కంఠ కలగడానికి ఈ పుండరీక చరిత్ర ఉపకరిస్తున్నది.

మాయాసరస్వతిని కల్పించడంలోని ఉద్దేశం, బ్రహ్మను కామమోహితుడిగా చేయడం కోసమేనని భావించవచ్చు. బ్రహ్మ మొదటగా తాను ఇంద్రియాలను జయించిన యోగినని దేవతల ముందు పొగడుకున్నాడు. కాబట్టి బ్రహ్మకు ఇంద్రియ వ్యామోహం కలిగించడం, దాని ద్వారా అతడి యోగాన్ని భంగపరచడం ఇక్కడ ప్రధానాంశం. అందుచేతనే బ్రహ్మ, మాయాసరస్వతుల రతిని విశేషంగా వర్ణించడం జరిగింది. తపస్సు చేయాలనుకున్న బ్రహ్మ సంకల్పాన్ని కామం వైపు మరల్చి, కామోత్కంఠను కలిగించడం, తద్వారా గర్వభంగం కావించడం అనేది ఈ కథలోని ప్రధానాంశమని తెలుస్తుంది.

4.1.2.4. శివగర్వభంగం కథ

పూర్వం శ్రీమహావిష్ణువు అనుమతితో దేవదానవులు కలిసి అమృతం కోసం క్షీరసాగరాన్ని మథించారు. దాని నుంచి మొదట హాలాహలమనే విషం పుట్టింది. శివుడు శ్రీమహావిష్ణువుకు ప్రీతిగా ఆ విషాన్ని హరించి లోకాలను కాపాడాడు. ఆతర్వాత క్షీరసాగరం నుంచి కల్పవృక్షం మొదలుగా అనేక వస్తు సంచయాలు ఉద్భవించాయి. అవన్నీ ఇంద్రుని పరమైనాయి. క్షీరసాగరం నుంచి జన్మించిన మహాలక్ష్మి మరియు తులసిని మాత్రం శ్రీ మహావిష్ణువు గ్రహించాడు. చివరగా అమృతభాండంతో ధన్వంతరి కనిపించగా, దానిని సంగ్రహించి రాక్షసులు వేరే చోటికి వెళ్ళారు. దేవతలు రాక్షసులకు భయపడి వెలవెల పోయి శ్రీమహావిష్ణువును ప్రార్థించారు. శ్రీమహావిష్ణువు జగన్మోహినిగా నారీ రూపాన్ని పొందాడు. ఆ జగన్మోహిని గజయానంతో నడిచి వచ్చి, దేవదానవుల మధ్య నిలిచింది. మాయామోహిని రూప సౌందర్యానికి దేవదానవులు మోహపరవశు లయ్యారు.

మోహిని వారితో తాను ఇచ్ఛావతినని, భర్త ఎవరూ లేరని చెప్పింది. ఆకాశవాణి వలన దేవదానవులు అమృతకోసం కలహించుకొంటున్నారని విని తాను వచ్చానని చెప్పింది. దయాధర్మ వివాసులైన రాక్షసులు అమృతభాండాన్ని మోహిని చేతికి అందిచ్చారు. మోహిని దేవతలను, రాక్షసులను వేర్వేరు బంతులుగా కూర్చోమని చెప్పింది. తూర్పు దిక్కున కూర్చున్న దేవతలకు అమృతాన్ని వడ్డించడం ప్రారంభించింది. మోహిని దేవతల వరుసలో కపట రూపంతో కూర్చున్న రాహుకేతువులకు కూడా ఏమరుపాటుతో అమృతం వడ్డించింది. మోహిని ఏమరుపాటును సూర్యచంద్రులు సూచించగా, దానికంటే ముందే రాహుకేతువులు అమృతాన్ని ఉపయోగించేలోగా

వారి శిరస్సులు ఖండించింది. అమృతాన్ని దేవతలకు పంచి, అమృత కలశాన్ని ఇంద్రుడికి అందించి, మాయామోహిని శ్రీమహావిష్ణువులో అంతర్ధానమైంది. రాక్షసులు తమకు జరిగిన మోసాన్ని గ్రహించి, ఆగ్రహంతో దేవతలతో పోరుకు తలపడ్డారు. దేవ దానవ సంగ్రామంలో అమృతపానం వల్ల దేవతలు జయించారు.

నారదుడు శ్రీమహావిష్ణువు రాక్షసులను మోసపుచ్చి, దేవతలకు అమృతాన్ని అందించిన విధాన్ని శివుడికి తెలిపి ఆశ్చర్య పరచాలని భావించాడు. నారదుడు కైలాసపర్వతాన్ని చేరుకొని, జగదేక పుజ్యమైన శివుని మందిరంలోకి ప్రవేశించాడు. అక్కడ నారదుడు గంగను ధరించిన మౌళితో, కంఠంలో హాలాహల నీలికాంతితో, నాగాభరణాలు ధరించి, కామకళ ఎడమదిక్కున, బ్రహ్మజ్ఞానం కుడివైపున చేరి కొలువగా యోగసింహాసనం మీద శివుడిని చూశాడు. నారదుడు శివునికి ప్రదక్షిణం చేసి అనేక విధాలుగా స్తుతించాడు. శివుడు ప్రసన్నుడై, హాలాహలాన్ని తాను హరించిన తర్వాత జరిగిన కథను తెలుపమని నారదుడిని కోరాడు. నారదుడు విష్ణువు మాయామోహినిగా వచ్చి రాక్షసులను భ్రమపెట్టి, అమృతాన్ని దేవతలకు పంచిన తీరును గురించి చెప్పాడు.

నారదుడు శివుని ముందు మోహిని సౌందర్యానికి బ్రహ్మాది దేవతా సమూహాలు కూడా మోహవివశులయినారని, అంతటి అతిలోక సౌందర్యాన్ని లోకంలో ఎన్నడూ చూడలేదని అన్నాడు. శివుడు ఆశ్చర్యంతో నారదుడు చెప్పిన మాటల్లో నిజమెంతో తెలుసుకోవాలని, వైకుంఠం వెళ్ళి మోహినీ సౌందర్యాన్ని చూడాలని పార్వతితో అన్నాడు. పార్వతి శివుని మాటలువిని, ముల్లోకాలూ శ్రీమహావిష్ణువు వశమై ఉన్నాయని అన్నది శివుడు మన్మథ వివశుడు కాకుండా తలపు, ధైర్యం పదిలంగా ఉంటే, వెళ్ళి మోహినిని చూడమని చెప్పింది. శివుడు తాను ఇంద్రియ నిగ్రహం గలతాను మనస్సు ఎటువెళితే అటు వెళ్ళనని పార్వతితో అన్నాడు. శివుడు పార్వతితో మోహినిని చూసిన తర్వాత తన జితేంద్రియత్వం ఆమెకు తెలుస్తుందని అన్నాడు. నారదుడు మోహిని సౌందర్య విలాసాన్ని చూస్తే శివుడు కూడా వెర్రిఎత్తి భ్రమసి తిరుగుతాడని రోషమెక్కించాడు.

శివుడు నారదుని మాటలకు రోషంతో నిర్వికారమైన రూపందాల్చి, నిజ పంచాక్షరీ మంత్ర విద్యాబలంతో, దుర్విషయ కలుష ఇంద్రియాలను జయించిన తనను కామినీ జనుల సౌందర్యం భ్రమించలేదని అన్నాడు. ప్రమథులు కూడా నారదుని మాటల్ని లెక్క చేయకుండా విష్ణుమాయ వాళ్ళని కూడా భ్రమించలేదని ప్రగల్భాలు పలికాడు. శివుడు పార్వతితో కలిసి సపరివారంగా వైకుంఠానికి బయలుదేరాడు. నారదుడు ముందు నడువగా, ప్రమథగణాలు ఇరుప్రక్కలాచేరి రాగా వైకుంఠపురానికి ప్రయాణమై శివుడిని చూసి బ్రహ్మాది దేవగణాలు, మునులు, సూర్య చంద్రాదులు కూడా వెంటవెళ్ళారు. శివుడు ఆ విధంగా ప్రయాణించి, సకల సంపదలతో వైభవోపేతంగా విలసిల్లుతున్న వైకుంఠపురాన్ని చేరుకున్నాడు.

నవరత్న ఖచిత మణిమయ సౌధాలతో, పుష్పతోరణాలతో, అనేక గోపురాలతో నిండిన నగరంలో ప్రవేశించి, శివుడు మహావిష్ణువు హజారము దగ్గరకు చేరుకున్నాడు. మహావిష్ణువు వేత్రపాలుర వలన శివుడు పార్వతీ సమేతంగా వచ్చాడని తెలుసుకొని, వారికి ఎదురువెళ్ళాడు. మహావిష్ణుడు శివుడిని కౌగిలించుకొని, పార్వతిని కుశల మడిగాడు. వారిద్దరినీ కొలువులోని ఒక భద్రపీఠంపై కూర్చోబెట్టి గౌరవించాడు. మహాలక్ష్మి వచ్చి పార్వతిని కౌగిలించుకొని, తగువిధంగా పుజించి ఆమె దగ్గరే కూర్చుంది. మహావిష్ణువు కొలువులో నారదుడు విష్ణు మాయామహిమను గానం చేశాడు. శివుడు మాయా మోహిని రూపాన్ని చూపించమని మహావిష్ణువును కోరాడు. శివుడు విష్ణుమాయ నెపంతో నారదుడు తనను తిరస్కరించాడని విష్ణువుతో చెప్పాడు. ప్రమథులు కూడా శివుని పక్షాన మాట్లాడుతూ, అహంకారంతో నారదుడిని నిందించారు. మహావిష్ణువు ఈ మాటలన్నీ విని, వార్తాహరుడైన నారదుడు మోహినీ రూపాన్ని పొగిడినంత మాత్రాన శివుడు అతడిని తిరస్కరించినట్లుగా భావించడం అనుచితమని భావించాడు. మహావిష్ణువు ఆలోచించి, ప్రమథులను శివుడిని తాను ఏవిధంగానైనా మోసపుచ్చి పంపకుంటే నారదుడికి అవమానం తప్పదని గ్రహించాడు.

మహావిష్ణువు శివునితో మోహినీకాంతను చూడాలనే కోరికను మానుకోమని కోరాడు. నారదుడు విష్ణుమాయను పొగుడుతూ, ఎలాగైనా తన పంతాన్ని నెగ్గించమని మహావిష్ణువును వేడుకున్నాడు. శివుడు పంతంతో మోహిని రూపాన్ని చూపించమని మహావిష్ణువును కోరాడు. అప్పుడు మహావిష్ణువు నారదుని పంతాన్ని నెగ్గించడానికి, శివుని అహంకారాన్ని త్రుంచడానికి మాయామోహినిగా మారాడు. విష్ణుమాయా ప్రభావం చేత శివునికి ముందుగానే మన్మథ వికారాలు కలిగాయి. వేయి మన్మథబాణాలు బారులు తీరినట్లుగా, లక్ష పద్మాలు వికసించినట్లుగా, కోటి చంద్రకాంతులతో మోహిని శివుని ముందు నిలిచింది. ఆ మోహినిని చూడగానే శివుడికి సాత్వికోదయమైంది. శివుడు మోహినీకాంత సౌందర్యాన్ని మెచ్చుకొని అనేక విధాలుగా వర్ణించాడు. శివుడు నారదునితో పంతాన్ని మరిచి మోహినీకాంతకు లోలుడయ్యాడు.

విష్ణుమాయా ప్రభావంతో శివుడు చూస్తుండగానే ఆ సభామందిరం శృంగారవనంగా మారిపోయింది. ఆ శృంగారవనంలో ఒంటరిగా ఉన్న మోహినిని పట్టుకోవాలని శివుడు భద్రాసనం దిగి వెళ్ళగానే, మోహిని మాయమైంది. శృంగారవనంలో మోహిని కనిపించలేదని శివుడు విభ్రాంతితో తిరుగుతుండగా, ఆమె తూగుటుయ్యాల మీద ఊగుతూ కనిపించింది. శివుడు ఊయల మీదున్న మోహినిని వెనుకనుంచి పట్టుకోవాలని వెళ్ళగా ఆమె మళ్ళీ మాయమైంది. ఈ విధంగా కనిపిస్తూ, అంతలోనే మాయమవుతున్న మోహినిపై మిక్కిలి మోహంతో శివుడు వనంలో తిరుగసాగాడు. శివుడు జలకాలాడుతున్న మోహినిని చూసి విరహాతిశయంతో

పట్టుకోబోగా మోహిని మాయమైపోయింది. శివుడు మోహిని కనిపించలేదని నిర్వేణుడైనాడు. విరహాతిశయంతో వికలమనస్కుడైన శివుడు పూపొదరింటిలో ఉన్న మోహినిని చూశాడు.

శివుడు విరహభారవిహ్వాల మదనోన్మాదంతో కన్నీరు కారుస్తూ, తనను కౌగిలించుకొని మన్మథుని బారి నుంచి కాపాడుమని మోహినిని వేడుకున్నాడు. శివుడు ఓపలేని విరహాభావంతో మోహిని పయ్యెదను పట్టి కౌగిలించుకున్నాడు. మోహిని స్పర్శతగలగానే శివుడికి పారవశ్యంతో శుక్లపతనమైంది. అది గంగాప్రవాహంలాగ ప్రవహించి బంగారు, వెండి రూపాలు పొందింది. మాయామోహిని మాయమైంది. శృంగారవనం ఆస్థానంగా మారింది. ఆ సంఘటనను చూసి ఆస్థానంలోని వారందరూ ఆశ్చర్యపడ్డారు. మహావిష్ణువు తన మాయను ఉపసంహరించగానే శివుడికి పరబ్రహ్మ జ్ఞానం కలిగింది. శివుడు మాయావనంలో మోహినీ విలాసక్రీడలన్నీ విష్ణుమాయా కల్పితమని గ్రహించి, మహావిష్ణువును ప్రస్తుతించాడు. దేవతలు పుష్పవర్షం కురిపించారు. నారదుడు ఆనందంతో నాట్యం చేశాడు. శివుడు పార్వతితో కూడి తిరిగి కైలాసానికి వెళ్ళాడు. ఈ విధంగా మాయామోహిని వలన శివుడికి గర్వభంగం కలిగింది.

ఈ కథలో శివుని గర్వానికి మహావిష్ణువు ప్రమేయమేదీ కనిపించదు. కాని కలహాశనుడైన నారదుని వల్ల శివునికి గర్వం అతిశయించింది. నారదుడు మోహిని సౌందర్య వర్ణన చేయడానికే కైలాసం వెళ్ళాడు. నారదుడు రాక్షసులు విష్ణుమాయకు భ్రమించిన సంగతిని శివునికి చెప్పాలనే మిషతో వచ్చి, మాయామోహిని జగదేక సౌందర్యాన్ని పొగిడాడు. పరమశివుడు మన్మథుడినే దహించి ఇంద్రియాలను జయించినవాడు. ఈ విజయం శివుడిలో ఏ మార్పును కలిగించిందో తెలుసుకునే ప్రయత్నమే నారదుని కైలాసయాత్రకు నాంది పలికిందని చెప్పవచ్చు. మోహినిది లోకాలనే మరులు కొలిపే అతిలోక సౌందర్యం. శివుడిది మదనుడినే దహించిన ఇంద్రియ నిగ్రహం. పరస్పరం విరుద్ధమైన ప్రవృత్తులు గల వీరిద్దరినీ ఒకచోట కలపడానికి వారధి నారదుడని తెలుస్తుంది.

మనోనిగ్రహపటుత్వం గల శివునికి మోహినిని చూడాలనే కోరిక కలిగేలాగ మోహినీ సౌందర్య వర్ణన చేయడానికి, ఘోటక బ్రహ్మచారి అయిన నారదుడు నియోగించబడ్డాడు. నారదుడు లాంటి బ్రహ్మచారి మోహిని శృంగార విలాసాన్ని వర్ణించడం వల్ల శివునికి కూడా ఆమెను చూడాలనే ఉత్కంఠ కలిగింది. శివుడు విష్ణుమాయను చులకన చేయడానికి, నారదుడు కైలాసంలో పార్వతి, ప్రమథగణాల ముందే విష్ణుమాయను కీర్తించడం ప్రధాన కారణంగా కనిపిస్తుంది. మహావిష్ణువు తన సభామందిరాన్ని శృంగారవనంగా మార్చడం మోహిని మీద శివునికి

కామాతురతను కలిగించడానికేనని తెలుస్తుంది. మన్మథుని దహించడం వల్ల శివునికి కలిగిన దర్పమంతా మోహిని మీద అతడికి కలిగిన విరహానలంలో దహించుకు పోయింది. శివుడు దైన్యంగా మోహినిని బ్రతిమాలడం, ఆమె పయ్యెదను పట్టిలాగడం ఇవన్నీ శివుని కామ వివశత్వానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి. శివుడికి శుక్లపతనం కావడాన్ని వాచ్యం చేయడం వల్ల అతడి దర్పాన్ని కూడా పతనం కావించినట్లు తెలుస్తుంది. శివునికి మన్మథుని దహించడమనే విజయం తర్వాత కలిగిన దర్పాన్ని మహావిష్ణువు మోహినీ అవతారం నెపంగా భంగపరచడం ఈ కథలోని ప్రధానాంశంగా తెలుస్తుంది.

4.1.2.5. నారదగర్వభంగం కథ

శ్వేతద్వీపములోని సాగర తీరమందున్న పారిజాతవృక్షపు నీడలో బంగారు పీఠంపైన శ్రీమహావిష్ణువు శ్రీమహాలక్ష్మి, భూదేవితో కూడి ఉన్నాడు. దివ్యకాంతలు చుట్టూ చేరి సేవిస్తుండగా మహావిష్ణువు సమక్షానికి విష్ణుమాయ స్త్రీ రూపాన్ని ధరించి వచ్చింది. విష్ణుమాయ మహావిష్ణువుకు నమస్కరించగా, అతడు ప్రసన్నంగా చూశాడు. మహావిష్ణువు సభలోని వారికి వేడుక కలిగించడానికి విష్ణుమాయ ఇంద్రజాల విద్యను ప్రదర్శించడానికి పూనుకుంది. ఆ సమయంలో నారదుడు పురాకృతఫల విశేష ప్రభావంతో వైకుంఠానికి వచ్చాడు. విష్ణుమాయ పంచభూత విలాసాలను మించేటువంటి విధంగా ఇంద్రజాలవిద్యను అనేక రీతులుగా ప్రదర్శించింది. మహావిష్ణువు, అతని ప్రియకాంతలు ఆమెకు అందరూ ఆ ఇంద్రజాలానికి సంతుష్టులైనారు. విష్ణుమాయను చేసిన మెచ్చుకొని మహావిష్ణువు ప్రియకాంతలు రత్నపారితోషికాలు ఇచ్చారు. ఇదంతా చూస్తున్న నారదుడు విష్ణుమాయ ఇంద్రజాలాన్ని తిరస్కరించి, ఇలాంటి మాయలు అబలలైన స్త్రీలను మోసపుచ్చుతాయన్నాడు. నారదుడు తన మహిమను పొగడుకొని, విష్ణుమాయ బ్రహ్మ రుద్రులను వంచించినప్పుడు తాను భ్రమించలేదని గర్వంతో పలికాడు. నారదుడు తాను ఒక్కడినే విష్ణుమాయకు భ్రమించని వాడినని మహావిష్ణువుతో అన్నాడు.

మహావిష్ణువు నారదుడు 'అతిపరిచయాదవజ్ఞా'అనే రీతిగా గర్వించాడని గ్రహించాడు. ఏ విధంగానైనా నారదుని మోసపుచ్చి, అతడికి మాయా ప్రభావాన్ని తెలియజేయాలని నిశ్చయించుకున్నాడు. నారదుడు సత్యలోకం వెళ్ళి బ్రహ్మముందు తాను విష్ణుమాయను జయించానని చెప్పుకున్నాడు. అదేవిధంగా కైలాసంలో శివుడి ముందు, స్వర్గంలో ఇంద్రుడు, దిక్పాలకుల సమక్షంలోనూ నారదుడు తన మహిమను పొగడుకొని, విష్ణుమాయను జయించానని చెప్పుకున్నాడు. మహావిష్ణువు నారదుని గర్వాన్ని అణచాలని భావించి, భూలోకంలో సర్వవరమనే ప్రదేశంలో ఒక పుణ్యాశ్రమాన్ని, సరస్సును కల్పించాడు. మహావిష్ణువు మాయామునిగా మారి కృత్రిమ తపస్సు చేయనారంభించాడు.

నారదుడు లోక సంచారం చేస్తూ, విష్ణుమాయా ప్రభావితుడై సర్పవర క్షేత్రానికి వచ్చాడు. నారదుడు మాయాముని అయిన మహావిష్ణువును చూసి, అతని వంటి మునిపుంగవుడిని లోకంలో ఎన్నడూ చూడలేదని కీర్తించాడు. మాయాముని కూడా నారదుని ఘనతను పొగిడి, అతడి రాకవల్ల తపోవనం పావనమైందని అన్నాడు. మాయాముని నారదునితో, ముల్లోకాలలో విష్ణుమాయను జయించిన కీర్తి అతడికి మాత్రమే దక్కిందని పొగిడాడు. నారదుడు కూడా మాయాముని మాటలకు బదులుగా, విష్ణుమాయకు లొంగనిది తానేనని తెలిపాడు. అంతలో ఆకాశవాణి నారదుని మాటలకు అడ్డుతగిలి, ఒక వెడనవ్వు నవ్వింది. విష్ణు మాయకు తగుల్కొన్న బ్రహ్మ రుద్రుల కంటే ఘనుడవా? ఏవిధంగా విష్ణుమాయను గెలిచి ముక్తుడవైనావు? అని నారదుని ప్రశ్నించింది. ఆకాశవాణి నారదునితో, అతని లాగే ప్రజ్ఞలు పలికి విష్ణుమాయ చేత భంగపాటును పొందిన మునులు కూడా ఉన్నారని అన్నది. ఆకాశవాణి నారదునికి చండదమనుడనే ముని విష్ణుమాయను తిరస్కరించి, చివరికి ఏవిధంగా భంగపాటును పొందాడో వినిపించింది.

నారదుడు ఆకాశవాణి చెప్పిన చండదమనుడి కథ విని, క్రోధంతో పసలేని ఇలాంటి కట్టుకథలను నమ్మవద్దని మునులతో చెప్పాడు. నారదుడు మాయామునితో తాను చండదమనుడి వంటి మోహాతురుడిని కాదని పలికాడు. నారదుడు మహావిష్ణువు చేతలన్నీ తనకు తెలుసని మునులతో అన్నాడు. ఈ ప్రపంచపు మోహవికారాలు అతడికి కలుగవని మాయమునితో చెప్పి, నారదుడు ఆకాశవాణిని, అసత్యవాదిగా దూషించాడు. నారదుడు కోపంతో అక్కడి నుంచి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. మాయాముని నారదుడిని పోనీయకుండా ఆపి, తన ఆశ్రమంలో ఆతిథ్యం స్వీకరించమని కోరినాడు. నారదుడు మాయాముని ఆతిథ్యానికి సమ్మతించి, తన చేతి అక్షమాలను, విపంచిని, కుంచెను కొలనుగట్టునున్న రావిచెట్టుకు తగిలించాడు. నారదుడు మనస్సులో అహంకార జనితమైన నిబిడ మోహాంధకారం నిండుకోగా కొలనులోకి దిగాడు. నారదుడు కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారిపోయాడు. చంద్రరేఖ కొలను వెలుపలికి వచ్చి, సమీపంలోని వనంలో తిరుగుతుండగా చంద్రకేతుడనే రాజు చూసి మోహించాడు. చంద్రకేతుడు ఆమెను తన నగరానికి తీసుకుపోయి వివాహం చేసుకున్నాడు.

చంద్రకేతుడు ఆమె వలన నూరుమంది కుమారులను పొందాడు. ఈ విధంగా ఆ చంద్రరేఖ అపరిమిత ఐశ్వర్య విలాసాలతో, సామ్రాజ్య వైభవంతో భర్త, కుమారులతో మాయాసంసారం చేయ సాగింది. కొంతకాలానికి చంద్రకేతుడి మీదికి శత్రురాజు దండెత్తి వచ్చాడు. రణరంగంలో ఇరు పక్షాలూ ఘోరయుద్ధం చేశాయి. ఆ యుద్ధంలో చంద్రకేతుడు, అతని నూరుమంది కుమారులూ మరణించారు. రణభూమిలో

మరణించిన భర్త, నూరుమంది కుమారులనూ చూసి చంద్రరేఖ పొరలి పొరలి ఏడ్చింది. చంద్రరేఖ రణభూమిలో ఒంటరిగా, ఏడుస్తూ, ఎండవేడికి తాళలేక, ఆకలి దప్పికలతో అలమటించింది. విష్ణుమాయ వలన ఆ సమీపంలోనే ఆమెకు ఒక మామిడి చెట్టు కనిపించింది. చంద్రరేఖ ఆ చెట్టుకున్న మామిడి పండును అందుకోడానికి చేయి సాచగా, ఆ పండు అందలేదు. ఆకలి బాధకు తాళలేక చంద్రరేఖ మామిడి పండును అందుకోడానికి మరణించిన తన కుమారులు, భర్త శవాలను గుట్టగా పేర్చింది. చంద్రరేఖ శవాలగుట్టమీదికి ఎక్కి అందుకున్నా మామిడి పండు అందకపోయేసరికి విస్మయంతో ఏడవ సాగింది. మహావిష్ణువు ఒక వృద్ధబ్రాహ్మణుడి రూపంతో ఆచెట్టుకిందికి వచ్చాడు. శవాలగుట్ట మీద నిలుచుకుని దుఃఖిస్తున్న చంద్రరేఖను చూసి, ఏం చేస్తున్నావమ్మా అని అడిగాడు. చంద్రరేఖ ఆ వృద్ధ బ్రాహ్మణునితో తన వృత్తాంతాన్ని చెప్పింది.

ఆ బ్రాహ్మణుడు చంద్రరేఖతో, పూర్వకర్మ వల్లనే ఆమెకు ఈ దురవస్థ కలిగిందని చెప్పాడు. అది శ్రీమహావిష్ణువు తపోవనమని తెలిపి, అక్కడి ధర్మతరువులను అశుచులు తాకరాదని అన్నాడు. వృద్ధ బ్రాహ్మణుడు చంద్రరేఖతో, కుమారులకు దహన సంస్కారాలు చేసి, భర్తతో పాటుగా అగ్నిప్రవేశం చేసి శరీరాన్ని విడిచిపెట్టమని బోధించాడు. దానికంటే ముందు శుచిగా స్నానం చేసి రమ్మని చంద్రరేఖకు కొలనును చూపించాడు. చంద్రరేఖ బ్రాహ్మణుని హితబోధ విని, తనను కాపాడటానికి వచ్చిన సాక్షాత్తు మహావిష్ణువుగా అతడిని భావించింది. ఆ వృద్ధబ్రాహ్మణుని వెంట వెళ్ళి చంద్రరేఖ పావనమైన ఒక కొలనును చూసింది. కపట నాటక సూత్రధారి అయిన మహావిష్ణువు ఆనాడు ఆ కొలనులో మునిగిన నారదుడిని మగువగా మార్చాడు. ఆ మగువను నేడు ఈ కొలనులో తిరిగి నారదునిగా మార్చనున్నాడని తెలిసి దేవ, సిద్ధ, గంధర్వ, విద్యాధరాదులు వచ్చి అంతరిక్షంలో నిలిచారు. ఆ వింతను చూడాలని అప్సరకాంతలు విమానాలపై నిలిచి మందార పుష్పమంజరులతో ఎదురు చూస్తున్నారు.

అప్పుడు చంద్రరేఖ కొలనులో ముఖం కడిగి, చీర విడిచి, నీటిలో దిగి 'నారాయణ, నారాయణ' అంటూ మునిగింది. విష్ణుమాయా ప్రభావంతో తరుణీమణి నీటమునిగి నారదముని లాగ పైకి వచ్చింది. ఆ కొలను పురుషుడిని స్త్రీగా మార్చగా, ఈ కొలను స్త్రీని పురుషుడిని చేసింది. కాబట్టి సర్పవరం క్షేత్రంలోని రెండు కొలనులూ శ్రీకరములు, వాంఛితార్థములు. దివ్యమునులు చేరి కొలువగా శ్రీమహావిష్ణువు నారదునికి ప్రత్యక్షమైనాడు. శ్రీమహావిష్ణువు మీద పుష్పవృష్టి కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులు గానం చేయగా, రంభామొదలైన అప్సరసలు నాట్యం చేశారు. నారదుడు కొలను నుంచి వెలుపలికి వచ్చి, తన వీణను, కుంచెను, జపమాల, కమండలమునూ ధరించాడు. అతడు జరిగిన వృత్తాంతాన్ని తలచుకొని ఆశ్చర్యపడుతూ,

విష్ణువు మహామాయను మెచ్చుకుంటూ, తనలో తాను నవ్వుకుంటూ వచ్చాడు. నారదుడు గరుడ వాహనారూఢుడైన శ్రీమహావిష్ణువుకు వేవేల నుతులొనర్చాడు. శ్రీమహా విష్ణువు నారదుడికి తన నిజదివ్య రూపాన్ని చూడగలిగే దివ్యదృష్టిని అనుగ్రహించాడు. శ్రీమహావిష్ణువు దేవకోటి సమూహాలు చేరి కొలుస్తుండగా, నారదుడు వెంటరాగా శ్వేత ద్వీపానికి వెళ్ళాడు.

గోవిందశర్మ చెప్పిన ఈ వృత్తాంతమంతా నిజమేనని నారదుడు ధర్మరాజు సభలోని వారితో చెప్పాడు. అంతేకాకుండా నారదుడు ధర్మరాజుతో గోవిందశర్మ ఘనతను కూడా ప్రస్తుతించాడు. ధర్మరాజు దేవమునుల అనుమతితో గోవిందశర్మను సన్మానించాడు. ఆతర్వాత ధర్మరాజు గోవిందశర్మ ఉపదేశంతో శ్రీకృష్ణుడిని స్తుతించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు సభలోని వారందరికీ దర్శనమిచ్చి అనుగ్రహించాడు. ఆ తర్వాత ధర్మరాజు వైభవోపేతంగా రాజ్యపాలన చేస్తూ, సుఖంగా ఉన్నాడని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజు చెప్పాడు. ఈ కథలో నారదుని గర్వానికి శ్రీమహావిష్ణువుతో అతడికి గల అతిపరిచయం ప్రధాన కారణంగా కనిపిస్తుంది. దానికి తోడుగా నారదుడు పూర్వకర్మఫలాన్ని కూడా అనుభవించాల్సి ఉంది. ఈ రెండు కారణాల వల్లనే నారదుడు వైకుంఠంలో విష్ణుమాయ ఇంద్రజాలాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు వెళ్ళాడు. నారదుడు విష్ణుమాయ చేత బ్రహ్మ గర్వభంగం పొందటాన్ని చూసినవాడు. శివదర్ప భంగానికి కూడా అతడే ప్రధాన కారకుడు. అందుచేత నారదునికి విష్ణుమాయ చేసిన ఇంద్రజాల ప్రదర్శన, దానికి దేవకాంతలు అందరూ మెచ్చుకోవడం అనేవి అసూయను కలిగించాయి.

నారదుడు విష్ణుమాయా ప్రభావాన్ని చులకన చేసి మాట్లాడటం, మహాలక్ష్మి మొదలైన దేవకాంతలను అబలలు, ముగ్ధలు అంటూ తేలిక చేయడం ఇవన్నీ అతడిలోని అసూయకు నిదర్శనాలు. నారదుడికి అసూయ కలగడానికి మహావిష్ణువు కొలువులో అతడి అస్థిత్వాన్ని, మహిమనూ గుర్తించకుండా, దేవకాంతలు విష్ణుమాయను ప్రస్తుతించడం కారణమని చెప్పవచ్చు. నారదుడు బ్రహ్మచారి, మునివృత్తిని అవలంభించేవాడు. అతడు ముల్లోకాలు తిరిగే వార్తాహరుడు. ముఖ్యంగా నారదుడు కలహప్రియుడుగా కనిపిస్తాడు. నారదుడు ముల్లోకాలలో తాను విష్ణుమాయ జయించానని ప్రచారం చేసుకోవడం అతడి గర్వాతిశయానికి నిదర్శనం. మహావిష్ణువు నారదునికి గర్వభంగం కలిగించాలని భావించాడు. నారదుడు మునివృత్తిని పాటించేవాడు కాబట్టి మహావిష్ణువు కూడా మాయాముని రూపాన్ని ధరించాడు. సర్పవరంలో పుణ్యాశ్రమం, ఉద్యానవనం, కొలనులు ఏర్పరచడం అంతా నారదుడిని ప్రలోభపెట్టడానికి చేసిన ఏర్పాటుగా తెలుస్తుంది. మాయాముని రూపంలో ఉన్న మహావిష్ణువు నారదుడి మహిమను కీర్తించడం కూడా దానికి మరొక నిదర్శనం.

ఆకాశవాణి చేత చండదమనుడికథ చెప్పించడం చేత నారదుని త్రిలోక సంచారత్వం, కలహ ప్రియత్వం పరోక్షంగా వెల్లడవుతున్నాయి. నారదుడు వార్తాహరుడు కాబట్టి ఆకాశవాణి చేత అతడికి హితవు చెప్పించడం జరిగింది. నారదుడు విష్ణుమాయకు తగుల్కొన్నాడని చెప్పడానికి అతడు ఆకాశవాణిని అసత్యవాదిగా నిందించడమే మొదటి నిదర్శనం. నారదుడు పొందిన స్త్రీరూపం, సంతానం, మాయాసంసారం అనేవన్నీ అతడు దేవకాంతలను అబలలని హేళన చేసినందుకు, బ్రహ్మచారి అయినందుకూ కలిగాయని భావించవచ్చు. నారదుడికి దుఃఖాన్ని, ఆకలిబాధనూ కలిగించడం వల్ల అతడిలోని అహంకారాన్ని నశింపజేయడం ప్రధాన కారణంగా కనిపిస్తుంది. నారదుడు వృద్ధ బ్రాహ్మణుడిని ప్రత్యక్ష విష్ణువుగా స్తుతించడం, ఆడజన్మ ఇక వద్దని అనుకోవడం, కొలనులో 'నారాయణ నారాయణ' అంటూ మంత్రోచ్చారణతో మునగడం ఇవన్నీ కూడా అతడిలో కలిగిన పశ్చాత్తాపాన్ని తెలియజేస్తున్నాయి. ఈ విధంగా విష్ణుమాయా ప్రభావితుడైన నారదుడికి గర్వభంగం కలిగిందని చెప్పవచ్చు.

### 4.1.2.6. ఉపకథలు

ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకంలో ప్రధానమైన ఈ ఐదుకథల తోపాటుగా రెండు ఉపకథలు కూడా కనిపిస్తున్నాయి. వాటిలో బ్రహ్మకు విష్ణుమాయా మహిమను చెబుతూ మార్కండేయముని వినిపించిన పుండరీకుని కథ మొదటిది. ఇది తృతీయాశ్వాసంలో ఉంది. పంచమాశ్వాసంలో నారదుడికి ఆకాశవాణి వినిపించిన చండదమనుడి కథ రెండవ ఉపకథ.

#### పుండరీకునికథ

మధురాపురంలో పరమ భాగవతుడైన పుండరీకుడనే విప్రుడు ఉన్నాడు. అతడి భార్య సావిత్రి పరమ సాధ్వి. పుండరీకుడు నిరంతరం హరిభక్తి పరాయణుడై, సాధు బుధసేవ్యమానుడై, యమునాతీరంలో సాలగ్రామ శిలార్చన చేసేవాడు. ఒకనాడు పుండరీకుని వద్దకు నారదముని వచ్చాడు. పుండరీకుని గృహస్థ ధర్మాన్ని సాలగ్రామ పూజావిధినీ చూసి నారదుడు సంతోషించాడు. నారదుడు పుండరీకునితో ఈలోకమంతా విష్ణుమాయా కల్పితమని, ఇక్కడ జీవించడం అంతా భ్రాంతి అని చెప్పాడు. మానసికానందం కోసం సాలగ్రామం నందు నివసించే మహావిష్ణువును నిర్మలభక్తితో, తులసీవన మంజరులతో పూజించమన్నాడు. నారదుడు పుండరీకునితో, తులసీవనంలోనే మహావిష్ణువు కొలువై ఉంటాడని తులసీ మహిమను ప్రశంసించి చెప్పాడు. సాలగ్రామ పూజార్చన అందరికీ సాధ్యంకాదని, సాలగ్రామ శిలార్చన చేసే వారి పితృగణాలు పితృలోకాలకు వెళతారని తెలిపాడు. హరినామ కీర్తినకు ఏకులంవారైనా అర్హులని, హరినామ కీర్తన వలన దుస్తరమైన సంసార సాగరాన్ని తరించవచ్చని చెప్పాడు.

నారదుడు పుండరీకునితో ఈ సంసారమంతా విష్ణుమాయా మోహవిభ్రాంతి అనిచెప్పి వెళ్ళాడు. పుండరీకుడు నారదుని హితబోధ విని, మరింత భక్తి శ్రద్ధలతో మహావిష్ణువును పూజించసాగాడు. అయితే పుండరీకుడు ఈ లోకమంతా విష్ణుమాయా కల్పితమని నారదుడు చెప్పిన మాటలను సందేహించాడు. ఆ సందేహంతో డోలాయమానంగా ఉంటూ పుండరీకుడు మాయను అతడికి చూపించమని విష్ణువును ప్రార్థించసాగాడు. పుండరీకుడు ఒకనాడు పితృకార్యం నిమిత్తంగా బ్రాహ్మణులను పిలిచి, మధ్యాహ్న సమయంలో యమునానదికి స్నానానికి వెళ్ళాడు. పుండరీకుడు నదీతీరంలో కూర్చుని తన మనస్సులోని సందేహ నివృత్తి కోసం మహావిష్ణువును స్మరించాడు. అంతలో పుండరీకుడిని విష్ణుమాయ ఆవరించగా, అతడు పూర్వ జ్ఞానాన్ని మరిచి పోయాడు. విష్ణుమాయా కల్పితమై ఒక బోయపడుచు పుండరీకుని ముందుకు వచ్చింది. పుండరీకుడు మరుని మోహవికారమే స్త్రీ రూపాన్ని పొందినట్లుగా ఉన్న ఆబోయపడుచును చూశాడు.

ఇరువురూ తమకంతో ఒకరినొకరు చూసుకున్నారు. పుండరీకుడు ఆ బోయపడుచును ఆమె ఎవరు, ఒంటరిగా ఎందుకు తిరుగుతుంది, భర్త ఎవరు అని అడిగాడు. బోయపడుచు తనకు పెళ్ళి కాలేదని, తల్లిదండ్రులు ముసలివారని, తాను బోయకులానికి చెందినదాన్నని చెప్పింది. బోయకాంత తన మనసులోని కోరికను తెలిపి, పుండరీకుడిని పెళ్ళి చేసుకోమని కోరింది. పుండరీకుడు ఆమె కులహీనతకు చింతించాడు. అంతలోనే పుండరీకుడు కామోద్రేకం వల్ల కలిగిన ఉన్మాదంతో తనను స్వీకరించమని బోయపడుచుతో అన్నాడు. పుండరీకుడు బోయపడుచుతో రతిసుఖాన్ని అనుభవించి, ఆ తర్వాత ఆమెవెంట వెళ్ళాడు. పుండరీకుడు బోయపడుచుతో కలిసి మాయాసంసారం చేసి ఒక కుమారుడు, ఒక కుమార్తెనూ సంతానంగా పొందాడు.

ఈవిధంగా పుండరీకుడు మాయాసంసార బంధంలో తగుల్కొని ఉండగా ఆకాశంలో ధూమకేతువు కనిపించింది. తూర్పున బుధ, శుక్రుల మధ్య సూర్యుడు ఉదయించాడు. చంద్రుడు రక్తవర్ణమయ మయ్యాడు. అనావృష్టి దోషం ఆవిర్భవించింది. జంతువులను వ్యాధులు బాధించాయి. రాజులు అకారణంగా నేలకూలారు. దొంగలు, బందిపోటులు ఎక్కువయ్యారు. ఎండలు అధికమయ్యి చెఱువులు, బావులు ఎండిపోయాయి. ధాన్యపురాశులు దొంగలపాలు, అగ్నికి ఆహుతి అయ్యాయి. ఈవిధంగా అనావృష్టి కలిగి ఆ ప్రాంతంలో కరువు కాటాకాలు విలయతాండవం చేశాయి. 'మనిషి మనిషిని తినే కఱువు' ప్రబలింది.

ఆ కఱువు కాటకానికి పుండరీకుని అత్తమామలు, కుమార్తె అంతరించారు. ఆబాధతో దుఃఖాక్రాంతుడైన పుండరీకుడు భార్యను చూసి, ఇక తనకు ఆమెకు ఋణానుబంధం తీరిపోయే సమయం ఆసన్నమైందని కన్నీరు కార్చాడు. పుండరీకుడు

భార్య, కుమారుడి మీద గల వాత్సల్యంతో వారిని ఎలాగైనా బ్రతికించుకోవాలని గౌతమీ తీర భూములకు బయలుదేరాడు. పుండరీకుడు కొడుకును చంకలో పెట్టుకొని, ఇల్లాలిని వీపున మోస్తూ, గంజికి ఈగలు ముసిరిన ఉగ్గపు కుండను ఒక చేతితో, విల్లును మరొక చేతిలో ధరించాడు. పిడిబాకును నడుము కట్టుకొని, నెత్తిమీద ఈతాకు చాపను కట్టుకొని శవాలను మోసుకు వెళ్ళే పిశాచరూపంతో బయలుదేరాడు. పుండరీకుడు గౌతమీనది తీరం చేరుకుని, ఆ నదీ ప్రవాహంతో దప్పిక తీర్చుకున్నాడు. కొంత దూరం ప్రయాణించి ఒక అగ్రహారం చేరుకున్నాడు.

పుండరీకుడు సమీపంలోని ఒక మట్టిచెట్టు క్రింద భార్యను, కుమారుడినీ ఉంచి, భిక్షకోసం అగ్రహారంలోకి వెళ్ళాడు. అంతలోనే పుండరీకుని బోయ ఇల్లాలు, కుమారుడూ మాయమయ్యారు. విష్ణుమాయను ఉపసంహరించి పుండరీకునికి మహావిష్ణువు సాక్షాత్కరించడాని సిద్ధపడగా, దేవతా సమూహాలు మబ్బు మాటున నక్షత్ర సమూహంలాగ ఆకాశంలో విమానాలపై వేచి చూస్తున్నారు. ఆ విధంగా భాగవత శ్రేష్ఠుడైన పుండరీకుడు సంసార క్షుధాతాప శాంతికై, వైరాగ్య పాత్రలో ఉపనిషద్వాక్యాల చేత కైవల్యలక్ష్మిని పరమానందామృత భిక్ష అడగకోరిన వానిలాగ ఒక పుణ్య గృహానికి వెళ్ళాడు. పుండరీకుడు ఇంటి ముందు నిలిచి, ఆ ఇల్లాలిని "భిక్షాందేహి" అని అడిగాడు. విష్ణుమాయా ప్రభావంతో ఆ ఇట్ల పుండరీకునిదికాగా ఆ మాటలువిన్న సావిత్రీ, అవి తనభర్త పుండరీకుని మాటలని గ్రహించింది. సావిత్రి తనలో నదీ స్నానానికి వెళ్ళిన భర్త మధ్యాహ్నవేళ దాటినా రాలేదేమని అనుకుంటుండగా, ఇప్పుడు వచ్చి కపటపు మాటలతో భార్యాపిల్లలకోసం భిక్ష అడుగుతున్నాడని వెలుపలికి వచ్చి చూసింది. సావిత్రి పుండరీకుడిని చూసి, నదీ స్నానానికి వెళ్ళి ఇంత ఆలస్యం చేశారు, వేళ తప్పక ముందే బ్రాహ్మణులను అర్చించాలి అని పుండరీకునితో చెప్పింది.

సావిత్రి విష్ణుమాయకు భ్రమించి, ధాతువులు తప్పి, దైన్యంతో తనకు భిక్ష పెట్టమంటున్న భర్తను చూసి భూతం సోకిందేమో అని సందేహించింది. శుద్ధ సాత్వికమూర్తి అయిన పుండరీకునికి అలాంటి దురవస్థ కలిగినందుకు ఆమె విచారించింది. సావిత్రి తాను పాతివ్రత్యం కలిగిన దాన్నయితే శ్రీమన్నారాయణుని ప్రభావంతో పుండరీకునికి ఈ దురవస్థ తొలగిపోవాలని ప్రార్థించింది. పుండరీకుడు విష్ణుమాయా విముక్తుడవగా దేవతలు పూలవాన కురిపించారు. మహావిష్ణువు ప్రత్యక్షం కాగా పుండరీకుడు అనేక విధాలుగా స్తుతించాడు. మహావిష్ణువు పుండరీకునితో అతడికి మోక్షాన్ని అనుగ్రహించాలనే నారదుని చేత మాయా ప్రభావాన్ని చెప్పించి, మాయా సంసారాన్ని కల్పించినట్లుగా తెలిపాడు. విష్ణుమాయను తరించాలంటే రాజస తామస గుణాలు విడిచి, ఉత్తమ సాత్త్విక జ్ఞానంతో తనను ఆరాధించాలని చెప్పాడు. మహావిష్ణువు భూలోకంలో పుండరీకుడు మరికొంతకాలం జీవించి మహాభాగవతుడుగా ప్రసిద్ధి చెంది తుదిని మోక్షాన్ని పొందగలడని వరమిచ్చి, అంతర్ధానమైనాడు.

ఈకథను మార్కండేయముని బ్రహ్మదేవుడికి విష్ణుమాయా మహిమను తెలియజెప్పడం కోసమే వినిపించాడు. పుండరీకుడు పరమ భాగవతుడు, శుద్ధసాత్విక మూర్తి, నిరంతర సాలగ్రామ శిలార్చన తత్పరుడు. అంతటి మహనీయుడికి ఇన్నిపాట్లు కలగడానికి గల కారమేమిటనే సందేహం కలుగుతుంది. దానికి సమాధానం స్వయంగా శ్రీమహావిష్ణువే ఈ కథ చివరలో ఈ విధంగా చెప్పాడు. శ్రీమహావిష్ణువు అహంకార మోహదూషితాలైన రాజస తామస గుణాలను విడిచిపెట్టి ఉత్తమసాత్త్విక జ్ఞానంతో సాలగ్రామ స్వరూపుడైన తనను ఆరాధించిన పుండరీకుడిని మోహింపదలచినాడు. పుండరీకుడికి నారదుడి చేత బ్రహ్మోపదేశం చేయించాడు. శ్రీమహావిష్ణువు పుండరీకుని సందేహాన్ని తీర్చేనెపంతో మాయాసంసార బంధాన్ని కల్పించాడు. పుండరీకునికి మోక్షపదవిని ఇవ్వాలని భావించి అతడి పూర్వ జన్మాంతర కర్మశేషం తొలగునట్లుగా పరీక్షించాడు. అందుచేత ఈ కథలో పుండరీకుడికి కలిగిన కష్టాలన్నీ అతడి పూర్వకర్మ శేషాన్ని తొలగించడానికి మహావిష్ణువు చేత కల్పించబడినవని తెలుస్తుంది. అంతేకాకుండా పుండరీకుడు పడిన ఈతి బాధలన్నీ అతడిని మోక్షపదవికి అర్హుడిని చేశాయని కూడా చెప్పవచ్చు. పరమభక్తుడైనా, శుద్ధ సాత్త్వికమూర్తి అయినా గాని పూర్వజన్మకర్మ శేషాన్ని అనుభవించకుండా మోక్షాన్ని పొందలేరని కూడా ఈ పుండరీకుని కథ వల్ల తెలుస్తుంది. మానవులకు దుర్లభమైన విష్ణుసాయుజ్యం పొందడానికి కఠిన పరీక్షలను ఎదుర్కోవలసి ఉంటుందనే సూచన కూడా ఈ కథలో కనిపిస్తుంది.

చండదమని కథ

దండదమనుడు అనే ముని ఒకసారి అయోధ్యానగరానికి వెళ్ళి, అక్కడ మాంధాత మహారాజు చేత సత్కారాన్ని పొందాడు. చండదమనుడు ఆ మహారాజు నగరంలోని సైన్యసమూహాన్ని, బంగారు సింహాసన్నాన్ని, మణిమయ భూషితమైన ఆభరణాలను, పరిమళ ద్రవ్యాలను, సంపదను, రూప యౌవన విలాసినులైన కన్యలనూ చూసి మెచ్చుకున్నాడు. చందడమనుడు తాను కూడా ఆ మహా రాజులాగ రాజ్యసుఖాలు అనుభవించాలని భావించాడు. అతడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చి, గంగాతీరంలో సంకల్ప పూర్వకంగా బ్రహ్మను గురించి పంచాగ్ని మధ్యంలో నిలిచి ఉగ్రమైన తపస్సు చేయసాగాడు. ఆ సమయంలో చండదమనుడి వద్దకు సనత్కమారుడు వచ్చి, అంత ఉగ్రమైన తపస్సు చేయడానికి గల కారణమేమని అడిగాడు. చ ం డ ద మ ను డ ు సనత్కమారునితో, తన మనసులోని కోరికను చెప్పాడు. అదివిని సనత్కుమారుడు రాజ్యసుఖాలు విష్ణుమాయా మోహమనే సముద్రంలోని కెరటాల వంటివని చెప్పాడు. కోరికలకు అంతులేదని, బ్రహ్మ రుద్రాదులకు కూడా సంసారవాంఛ మీద విరక్తిలేదని అన్నాడు. సనత్కుమారుడు ఇంతకాలం ఎంతో నిగ్రహంతో శీతవాత దహన ఉష్టాలను భరించి చేసిన చండదమనుడి తపస్సు బూడిదలోని హెూమం అయిందని అన్నాడు.

సనత్కుమారుడు చండదమనుడితో బ్రహ్మపద సౌఖ్యంకోరి తపస్సు చేయమని చెప్పి, రాజత్వం వల్ల కలిగే అల్పభోగాలు నరకాన్ని కలిగిస్తాయని బోధించాడు. సనత్కుమారుని బ్రహ్మబోధ వలన చండదమనుడు భూలోక రాజ్యసుఖాలు దుఃఖహేతువులుగా భావించాడు. సంసార సుఖానుభవ సారమైన విష్ణుమాయా వికారానికి తగుల్కోకుండా మోక్షాన్ని పొందడం ఎంతపని అని చండదమనుడు విష్ణుమాయను తిరస్కరించాడు. చండదమనుడు మోక్షం కోరి బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై చండదమనుడిని ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. చండదమనుడు విష్ణుమాయా కృత్యములైన సంసార సుఖాల నుంచి తప్పించి, సత్యమైన మోక్ష పదవిని అనుగ్రహించమని కోరాడు. బ్రహ్మ ఆ వరాన్ని ఇవ్వలేక, చండదమనుడు మొదట సంకల్పించినట్లుగా రాజ్యసుఖాలను అనుభవించక తప్పదని తెలిపాడు. ఆ తర్వాత శుద్ధసాత్త్విక జ్ఞానంతో ప్రవర్తించి, విష్ణు భక్తివలన మోక్షాన్ని పొందగలడని చండదమనుడికి చెప్పాడు.

బ్రహ్మ చెప్పిన మాటలు విని చండదమనుడు నిర్వేదంతో అతడి వరాన్ని తిరస్కరించాడు. చండదమనుడు తర్వాత తన తపస్సుతో శివుడిని మెప్పించి, వరం కోరాడు. శివుడు కూడా ఆ వరాన్ని ఇవ్వలేక, రాజ్యసుఖాలను ముందు పొందమని చెప్పాడు. చండదమనుడు శివుడి వరాన్ని కూడా కాదన్నాడు. చండదమనుడు సూర్యనారాయణుని గురించి తపస్సు చేయగా, అతడు కూడా రాజ్యసుఖాలు అనుభవించమని చెప్పాడు. చండదమనుడు నిర్వేదంతో విష్ణుమాయకు తగుల్కోకుండా మోక్షాన్ని పొంది, హరిహర బ్రహ్మాదులను సిగ్గుపరచాలని భావించాడు. శ్రీమహావిష్ణువు చండదమనుడి గర్వాన్ని గమనించి, అతడిని మాయా మోహితుడిగా చేయడానికి సంకల్పించాడు. మహావిష్ణువు రాజ్యసంపదలు, సుఖాలు తిరస్కరించిన చండదమనుడికి వాటి మీద వ్యామోహాన్ని కలిగించి, ఆ తర్వాత మోక్షాన్ని ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు. విష్ణుమాయా ప్రభావంతో చండదమనుడి ఆశ్రమం గొప్పరాచనగరుగా మారిపోయింది. అందులో అశ్వ,గజ, భటసమూహాలు, మందిరాలు, కనకపు సింహాసనం, ప్రియకామినులూ సకల రాజ్య భోగాలు అమరినాయి. చండదమనుడు కనకభూషణాలు ధరించి, తనను మహారాజుగా భావించుకున్నాడు. చండదమనుడు తను యోగిననే బుద్ధిని మరిచి, మోక్ష లక్ష్మిపై ముడిపడిన మనస్సును రాజ్యలక్ష్మిపైకి మరల్చాడు.

చండదమనుడు మహారాజ వైభవంతో అరిషడ్వర్గాలు మనస్సులో నిలువగా పరుష భాషలు నేర్చాడు. అజ్ఞానంతో కొందరిని ఆదరించడం, మరి కొందరిని శిక్షించడం చేయసాగాడు. చండదమనుడు మత్తగజాల మీద, గుర్రాల మీద ఎక్కి విలాసంగా తిరగసాగాడు. ఉపవనాలలో, గిరికందరాలలో, నాట్యశాలల్లో ప్రియ కాంతలతో విహరించసాగాడు. ఈ విధంగా చండదమనుడు సకల రాజ్యభోగాలను అనుభవిస్తూ విలాసంతో తన తపస్సును, మహామునిత్వాన్ని, సనత్కుమారుడి ఉపదేశాన్ని

మరిచాడు. భోగలాలసుడైన చండదమనుడిని చూసి, విష్ణుమాయ ఎవరికైనా తరించరానిదని బ్రహ్మ రుద్రులు, సూర్యనారాయణుడూ విష్ణుమాయను స్తుతించారు. సనత్కుమారుడు తిరిగివచ్చి రాజ్య భోగలాలసుడైన చండదమనుడికి అతడి గత జీవితాన్ని, పంతాన్ని గురించీ తెలిపాడు. చండదమనుడు బ్రహ్మ, శివుడు, సూర్యుల ఆనతి ప్రకారం శ్రీమహావిష్ణువును ఆశ్రయించి ఉంటే, ఈ నిస్సార సంసారబంధంలో తగుల్కోకుండా ఉండును కదా అన్నాడు సనత్కుమారుడు. ఇకనైనా నిష్కళంక హృదయంతో ఈ రాజ్యభోగాలన్నీ విష్ణుమాయా కల్పితాలని గుర్తించి, మహావిష్ణువును ప్రార్థించి ముక్తిని పొందమని చండదమనుడికి హితవు పలికాడు.

చండదమనుడు సనత్కుమారుని బ్రహ్మోపదేశం ప్రకారం శ్రీమహావిష్ణువును ప్రార్థించి, తనకు సంసార బంధం నుండి విముక్తిని కలిగించమని వేడుకున్నాడు. శ్రీమహావిష్ణువు చండదమనుడిని అనుగ్రహించి, దివ్య మంగళరూపంతో ప్రత్యక్షమైనాడు. చండదమనుడు పూర్వపుముని రూపాన్ని పొందాడు. మహా విష్ణువు చండదమనుడి తామస భావాన్ని తొలగించి, కర్మఫలాన్ని అనుభవింపజేసి, అత్యంత జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఈ విధంగా చండదమనుడి అహంకారం నశించింది. ఈ కథను ఆకాశవాణి నారదుడికి విష్ణుమాయా ప్రభావాన్ని తెలియజేయటానికి వినిపించింది. నారదుడు విష్ణుమాయ బ్రహ్మ రుద్రులను భ్రమించడాన్ని చూసినవాడు. అయినప్పటికీ విష్ణుమాయను తిరస్కరించాడు. చివరికి నారదుడు కూడా విష్ణుమాయా మోహంలో తగుల్కొని పడరాని పాట్లుపడ్డాడు. ఇదంతా నారదుడు పూర్వజన్మ కర్మఫలాన్ని అనుభవించాల్సి ఉన్నందువల్ల అతడికి ప్రాప్తించింది. నారదుడికి చండదమనుడి కథ చెప్పడం వల్ల ఇతడు కూడా పూర్వకర్మఫలాన్ని అనుభవించాల్సి ఉందని సూచిస్తున్నట్లు ఉంది. తపస్సంపన్నుడు అయిన చండదమనుడికి, మాంధాత మహారాజు లాగా భోగాలు అనుభవించాలనే కోరిక కలగడానికి అతడి పూర్వ కర్మ ఫలమే కారణమని చెప్పవచ్చు.

బ్రహ్మ, శివుడు, సూర్యనారాయణులు విష్ణుమాయా మహిమను బోధించినా కూడా చండదమనుడు తపోగర్వంతో దానిని తిరస్కరించాడు. ఇక్కడ చండదమనుడి గర్వానికి అతడి తపశ్శక్తే కారణమని తెలుస్తుంది. చండదమనుడు తన ఉగ్రతపస్సుతో బ్రహ్మ రుద్ర, సూర్యనారాయణులను మెప్పించడం దానికి నిదర్శనం. విష్ణుమాయకు లోబడరాదని చండదమనుడు చేసిన తీవ్రమైన ప్రయత్నమే అతడిని మాయలో తగుల్కొనేలాగ చేసింది. చండదమనుడు విష్ణుమాయను ఎంత తీవ్రంగా వ్యతిరేకించాడో, ఆ మాయ అతడిని అంత త్వరగా ఆవరించింది. చండదమనుడు రాజ్యభోగాలలో లీనమైపోవడానికి అతడి సంకల్పం, విష్ణుమాయా ప్రభావం రెండూ దోహదం చేశాయి. ఈ విధంగా చండదమనుడి వంటి తపోధనులు కూడా విష్ణుమాయకు తగుల్కోకుండా, మోక్షమార్గాన్ని చేరుకోలేరని ఈ కథ వలన తెలుస్తుంది.

### 4.1.3. కల్పనలు

ఎల్లనార్యుడు భాగవతంలో ప్రసిద్ధమైన కథా సందర్భాలను తన కావ్యంలో ఇతి వృత్తంగా గ్రహించాడు. నాతివిస్తరమైన ఈ కథా సందర్భాలకు పరిపుష్టిని కలిగించడానికి ఎల్లనార్యుడు కొన్ని స్వీయ కల్పనలను కూడా చేశాడు. కథానిర్మాణ దృష్టితో ఎల్లనార్యుడు చేసిన ఈ కల్పనలు కథావిస్తృతికి తోడ్పడుతూ, రసాలంకార వర్ణనా భూయిష్టమై కావ్యానికి ఒక నూతనశోభను చేకూర్చుతున్నాయని చెప్పవచ్చు. ఈ కల్పనల వలన కవి ఉద్దేశించిన ప్రయోజనం ఎంతవరకూ సఫలీకృతమైంది అనే విషయాలు ఈ క్రింది నిదర్శనాల ఆధారంగా పరిశీలించబడతాయి. ఎల్లనార్యుడు విష్ణుమాయా నాటకంలో చేసిన కల్పనలు ప్రధానంగా క్రింది విధంగా ఉన్నాయి.

1. వ్యాసుడు, ధర్మరాజుల సంవాదం
2. పారిజాతమాలికా ప్రాప్తి వృత్తాంతం
3. మాయాజూదం
4. మాయాలక్ష్మి వృత్తాంతం
5. బ్రహ్మదేవుని రజోగుణం
6. మాయాసరస్వతి వృత్తాంతం
7. శివుడు, నారదుల సంవాదం
8. విష్ణుమాయా కాంత ఇంద్రజాలం
9. పుండరీకుని వృంత్తాంతం
10. చండదమనుని వృత్తాంతం

#### 4.1.3.1. వ్యాసుడు ధర్మరాజుల సంవాదం

ధర్మరాజు ఒరనాజు కొలువుదీరి ఉండగా, అక్కడికి వ్యాసమహర్షి వచ్చాడు. వ్యాసమహర్షి ధర్మరాజు చేసిన అతిథిసత్కారానికి సంతోషించి, అతడి ఘనతను పొగిడినాడు. వ్యాసుడు శ్రీకృష్ణుడికి ధర్మరాజుపై గల అభిమానాన్ని గుర్తుచేసి, కృష్ణుని మహిమను కీర్తించాడు. వ్యాసమహర్షి మాటలు విన్న ధర్మరాజు శ్రీకృష్ణుని యాథార్థ్యమును తెలుపమని కోరాడు. వ్యాసమహర్షి విష్ణుమహిమను, మాయా ప్రభావాన్ని గురించి ధర్మరాజుకు వివరించాడు. ధర్మరాజు వ్యాసమహర్షితో జ్ఞానదృష్టి కలిగి విష్ణుమాయా ప్రభావాన్ని గ్రహించడంలో కృతకృత్యులైన వ్యాసుని వంటి మునులు కూడా ముక్తిని పొందకుండా ఉండటానికి గల కారణమేమని అడిగాడు. వ్యాసమహర్షి ధర్మరాజుతో విష్ణుసాయుజ్యం దుర్లభమని, పరమ భాగవతులకు తప్ప అన్యులకు అది సిద్ధించదని తెలిపాడు. అహంకారంతో విష్ణుమాయను తిరస్కరించి బ్రహ్మ రుద్ర నారదాదులు కూడా మోసపోయారని వ్యాసమహర్షి ధర్మరాజుకు విష్ణుమాయా విలాసకథలు చెప్పడానికి పూనుకున్నాడు.

అంతలో గోవిందశర్మ అనే శ్రీకృష్ణుని నర్మసఖుడు ద్వారకానగరం నుంచి ఆకాశమార్గాన ధర్మరాజు సభకు వచ్చాడు. వ్యాసమహర్షి ధర్మరాజుతో, "యీగోవిందశర్మ యనువాడు మహాతపస్వి, సకల కథా ప్రవీణుడు. మనముపక్రమించిన విష్ణుమాయా రహస్యంబులన్నియు విశదంబుగాఁ జెప్పనేర్చు, నిక్కడి కథా ప్రసంగంబు తన దివ్యచిత్తుంబున నెఱింగి వాసుదేవుండే పంపినవాడు..." (1-111) అని తెలిపాడు. విష్ణుమాయా విలాసకథలు చెప్పడానికి వ్యాసమహర్షి కంటే గోవిందశర్మ తగినవాడని సాక్షాత్తు శ్రీకృష్ణుడే నిర్ణయించి పంపినట్లుగా వ్యాసమహర్షి మాటల వలన తెలుస్తున్నది. గోవిందశర్మ వెంట వచ్చిన సనత్కుమారుడు ధర్మరాజుతో, బ్రహ్మచారి అయిన ఈగోవిందశర్మ శ్రీకృష్ణునికి ఇష్టఖుడని, సమస్తశాస్త్ర గాథావిదుడని, నిరంతరం రుక్మిణి, సత్యభామా మొదలైన అంతఃపురకాంతలకు బహువిధాలుగా విష్ణుమాయా విలాస కథలు చెబుతుంటాడని అన్నాడు. ఈ మాటలు కూడా గోవిందశర్మకు శ్రీకృష్ణునితో గల సాన్నిహిత్యాన్ని, విష్ణుమాయా విలాసకథలు వినిపించేందుకు అతడికి గల సామర్థ్యాన్ని తెలుపుతున్నాయి. ఇక్కడ వ్యాస ధర్మరాజుల సంవాదం వలన విష్ణుమాయా ప్రభావ వర్ణన, విష్ణుమాయా విలాస కథల ప్రసక్తి కలిగింది. ఆ తర్వాత విష్ణుమాయా విలాస కథలను వినిపించే కథకుడైన గోవిందశర్మ పాత్ర ప్రవేశం కలిగింది. విష్ణుమాయా విలాసాలను కథలుగా మలిచిన గోవిందశర్మ పాత్ర ప్రవేశానికి ఈ సంవాదం మార్గాన్ని కలిగించిందని తెలుస్తుంది.

### 4.1.3.2.పారిజాతమాలికా ప్రాప్తి వృత్తాంతం

ధర్మరాజు తన కొలువుకు వచ్చిన గోవిందశర్మను చూసి, అతడు ధరించిన పారిజాత మాలిక ఏవిధంగా లభించిందని అడిగాడు. భూలోకంలో శ్రీకృష్ణునికి తప్ప అన్యులకు పారిజాత మాలికను ధరించే ప్రాప్తి కలుగదని ధర్మరాజుకు తెలుసు. అందుచేతనే గోవిందశర్మ పారిజాత మాలికను ధరించడం చూసి, ధర్మరాజు కుతూహలంతో పైవిధంగా ప్రశ్నించాడు. గోవిందశర్మ తాను సాందీపని మహర్షి కుమారుడైన ధర్మశీలుని కుమారుడినని తెలిపాడు. గోవిందశర్మ శ్రీకృష్ణునితో తనకు గల సాన్నిహిత్యాన్ని ధర్మరాజుకు చెప్పాడు. స్వర్గంలోని పారిజాతవృక్షాన్ని శ్రీకృష్ణుడు సత్యభామకోసం భూలోకానికి తీసుకురాగా, పారిజాతవృక్షం లభించినందుకు సత్యభామ గర్వించింది. దానిని గ్రహించిన శ్రీకృష్ణుడు అష్టమహిషుల ఇళ్ళలో మాయాపారిజాత వృక్షాలు కల్పించాడు. దాని పర్యవసానంగా రుక్మిణీదేవి పంపించిన పారిజాతపుష్పాలు చూసి సత్యభామ అసూయతో కోపించి శ్రీకృష్ణుని నిందించి తాను దుఃఖించింది.

శ్రీకృష్ణుడు పంపించగా గోవిందశర్మ వచ్చి సత్యభామకు ఉపశమనం కలిగించేదుకు, "యీ సకలంబును నాకపట నాయకుని మాయా నాటకంబు ప్రతి మందిర పారిజాత విలసనంబును బహురూపకత్వంబును హరి యింద్రజాలంబు

యింత ప్రొద్దు నిన్ను భ్రమయించె, తొల్లియు శ్రీమహాలక్ష్మి ద్రుహిణ రుద్రాదులు నీవిభుని మాయానాటకంబున భ్రమసి తిరిగిరి.” (1-207) అని ఆమెకు విష్ణుమాయా విలాసకథలు వినిపించాడు. దానికి సంతోషించి సత్యభామ గోవిందశర్మకు పారిజాతమాలికను బహూకరించింది. ఇక్కడ పారిజాతవృక్షం లభించడం సత్యభామకు గర్వకారణమైతే, దాన్ని తొలగించేందుకు శ్రీకృష్ణుడు మాయాపారిజాత వృక్షాలు కల్పించాడు. ఈ కల్పన వలన సత్యభామకు మొదట అసూయ తర్వాత దుఃఖం కలిగాయి. ఆ దుఃఖాన్ని నివారించేందుకు గోవిందశర్మ విష్ణుమాయా విలాసకథలు వినిపించడానకి అవకాశం కలిగింది. అందుచేత మాయాపారిజాత వృక్షాల కల్పన విష్ణుమాయా విలాస కథలను సత్యభామకు వినిపించేందుకు దోహదకారి అయిందని తెలుస్తుంది. దాని ఫలితంగానే గోవిందశర్మకు పారిజాత మాలిక ప్రాప్తించింది. ఈపారిజాత మాలిక వల్లనే ధర్మరాజుసభలో గోవిందశర్మ వృత్తాంతం, సత్యభామకథ, గోవిందశర్మ రచించిన విష్ణుమాయా నాటకమనే ప్రబంధ ప్రసక్తి వెల్లడయినాయి. ఆవిధంగా ఈ పారిజాత మాలికాప్రాప్తి వృత్తాంతం విష్ణుమాయా విలాస కథల ప్రారంభానికి తొలి నిదర్శనంగా కనిపిస్తుందని చెప్పవచ్చు.

4. 1. 3. 3. మాయాజూదం

శ్రీమహావిష్ణువు మహాలక్ష్మితో వినోదార్థం పాచికలు ఆడాలని భావించాడు. ఆటను ప్రారంభించేముందు విష్ణువు తన కౌస్తుభమణిని, మహాలక్ష్మి చూడారత్నాన్ని పందెంగా ఒడ్డారు. భూదేవి భర్త పక్షం వహించగా, దేవకాంతలు మహాలక్ష్మివైపు నిలిచారు. సరస్వతి ఇరువురి గెలుపునూ కోరుకుంది. జూదంలో ఓడిపోతే మహాలక్ష్మి ఏవిధంగా ప్రవర్తిస్తుందో తెలుసుకోవాలని విష్ణువు మాయోపాయంతో గెలిచాడు. మహాలక్ష్మి గెలువబోయేముందు ఆటలో ఓటమి కలిగినందుకు పరితపించింది. భూదేవి తన ఓటమిని చూసి నవ్వినందుకు మహాలక్ష్మి అవమానంగా భావించింది. ఆ సంఘటన వలన మహాలక్ష్మికి ఈర్ష్యా జనితమైన విషాదం కలిగింది. ఆ తర్వాత తన ఓటమికి విష్ణువు చేసిన కపటమాయ కారణమని తెలిసి రోషంతో కోపించింది.

“జూదరికాని చందములు చూపితి వన్నియు మేలుమేలునీ
గాదిలి భూమిదేవికి వికాసముగా జనులెల్ల నెల్లెడం
జూదము వాద హేతువును చుల్కదనంబును బొంకునంట దాఁ
గాదన రామి నిక్కముగఁ గంటిమి నీవెడ మాయలచ్యుతా” (2-25)

అంటూ మహాలక్ష్మి విష్ణుమాయను, జూదాన్ని నిందించింది. మహాలక్ష్మి విష్ణుమాయ కంటే తన మాయా ప్రభావమే అధికమని పొగడుకుంటూ, హరవిరించి పురందరాదులకు, విష్ణువుకు కూడా పదవులు, సంపదలు ఆమె వల్లనే కలిగాయని పలికింది. అంతటితో ఆగకుండా మహాలక్ష్మి ఈర్ష్యాజనిత లజ్జా విషాద క్రోధాలతో

వైకుంఠపుర వైభవాన్ని క్షణంలో శూన్యమయం చేసింది. ఇక్కడ వినోదం కోసం ప్రారంభించిన జూదం చివరికి వైకుంఠపుర వైభవాన్ని శూన్యం గావించేందుకు కారణమైంది. జూదంలో విష్ణువు చేసిన మాయ వలన మహాలక్ష్మికి ఓటమి, భూదేవి నవ్వడం వలన అవమానం, దాని నుంచి విషాదం కలిగాయి. విష్ణువు చేసిన కపటమాయ వల్లనే ఓటమి కలిగిందని తెలిసినప్పుడు మహాలక్ష్మి విషాదం క్రోధంగా పరిణమించి వైకుంఠపుర వైభవాన్ని శూన్యం గావించింది. ఈ విధంగా విష్ణువు జూదంలో చేసిన మాయ వలన మహాలక్ష్మి గర్వం, విష్ణుమాయా తిరస్కరణ అనేవి వెల్లడైనాయని చెప్పవచ్చు.

4.1.3.4. మాయాలక్ష్మి వృత్తాతం

వైకుంఠపురాన్ని శూన్యం చేసిన మహాలక్ష్మికి గర్వభంగం కలిగించడానికి విష్ణువు మాయాలక్ష్మిని కల్పించాడు. మాయాలక్ష్మి వాడిపోయిన బంగారు తామరకర్ణిక మీద కళావిహీనంగా తపోనిష్ఠలో కూర్చుని మహాలక్ష్మికి కనిపించింది. మహాలక్ష్మి మాయాలక్ష్మి రూపాన్ని చూసి కుతూహలంతో ఆమె తపస్సు చేయడానికి గల కారణమేమని అడిగింది. మాయాలక్ష్మి మహాలక్ష్మితో తాను లక్ష్మినని భర్త అయినందు వలన మహావిష్ణువు ప్రభావాన్ని గుర్తించలేక, విష్ణుమాయను చులకన చేసినందు శాపం కలిగిందని తెలిపింది. అంతలో శాపవిమోచనం కలిగి మాయాలక్ష్మి పుష్పక విమానంలో వైకుంఠానికి వెళుతూ మహాలక్ష్మి తేజస్సును హరించి, దేవకాంతలను తన వెంట తీసుకువెళ్ళింది. మహాలక్ష్మికి మాయాలక్ష్మి తన తేజస్సును హరించినందు వలన దైన్యం కలిగింది. చెలికత్తెలు విడిచి వెళ్ళినందుకు విచారం కలిగింది. మహాలక్ష్మికి మాయాలక్ష్మి వృత్తాంతం వలన భర్తతో ఎడబాటు కలిగినందుకు పశ్చాత్తాపం కలిగింది. మహాలక్ష్మికి కలిగిన ఈ పశ్చాత్తాపం అహంకారాన్ని తొలగించి, విష్ణుమాయా మహిమను గుర్తించేలాగ చేసింది. అందువలన ఈ మాయాలక్ష్మి వృత్తాంత కల్పన మహాలక్ష్మికి గర్వభంగం కలిగించి, విష్ణుమాయా ప్రభావాన్ని లోకానికి వెల్లడించేందుకు తోడ్పడిందని చెప్పవచ్చు.

4.1.3.5. బ్రహ్మరజోగుణం

బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించాడు. అతడు మహావిష్ణువు వలన సృష్టి నిర్మాణ కార్యానికి కావలసిన సాధన సంపత్తిని వరంగా పొందాడు. బ్రహ్మదేవుడు హాటకమయమైన భూమండలాన్ని కల్పించాడు. ఆ తర్వాత ఆకాశాన్ని, సూర్యచంద్రులు, నక్షత్రమండలం మొదలుగా ఊర్ధ్వలోకాలు ఏడింటిని, అధోలోకాలు ఆరింటిని కల్పించి, భూమండలాన్ని పంచభూతాత్మకంగా చేశాడు. ఆతర్వాత మనువులు, ఇంద్రుడు మొదలైన దేవసమూహాలు, రాక్షసులు, మానవులు, పశుపక్ష్యాది జంతుకోటులనూ సృష్టించాడు. బ్రహ్మ సృష్టించిన ప్రాణిగణాలన్నీ

సత్త్వరజస్తమో గుణసంజాతమైన శమదయాహంకార దుర్మాన మోహమాత్సర్యాదులను అనుసరించి ప్రవర్తించసాగాయి. బ్రహ్మదేవుడు తాను కల్పించిన బ్రహ్మాండాన్ని, అందులోని ప్రాణికోటి సమూహాన్ని చూసుకొని రాజసగుణ కలితుడైనాడు. బ్రహ్మదేవుడు అహంకరించి ముల్లోకాలలో తాను తప్ప అన్యదైవం ఎవరూలేరని భావించాడు. బ్రహ్మదేవుడు తన కొలువులో రాజసగుణ ప్రభావితుడై గర్వంతో తన ప్రభావాన్ని పొగుడుకొని, అందరూ అతడినే పరమదైవంగా పూజించాలని ప్రకటించాడు.

ఆకొలువులోనే ఉన్న మార్కండేయముని బ్రహ్మకు అతని పుట్టుకను, విష్ణుమాయా ప్రభావాన్ని వివరించి చెప్పాడు. బ్రహ్మదేవుడు రాజసగుణ ప్రభావితుడై సభలో తనను కాదని విష్ణుమాయను పొగిడినందుకు మార్కండేయమునిని దూషించాడు. బ్రహ్మదేవుడు అహంకారంతో విష్ణువును నిందించి, విష్ణుమాయను హేళన చేసి, తన మహిమను లోకాలకు తెలియజేయాలని సృష్టి నిర్మాణ కార్యాన్ని చాలించినాడు. బ్రహ్మాండాన్ని అంధకారంలో ముంచి బ్రహ్మదేవుడు మందరగిరికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ తన పూర్వ కర్మల పుణ్యఫలం వలన శ్రీమహావిష్ణువు నాభికమలం నందు జన్మించాడు. బ్రహ్మదేవుడు తన వినయ విధేయతలు, భక్తి ప్రపత్తులతో విష్ణువును మెప్పించి సృష్టినిర్మాణ క్రియకు కావలసిన సాధన సామాగ్రిని వరంగా పొందాడు. అటువంటి బ్రహ్మదేవుడు మహావిష్ణువును తిరస్కరించి, విష్ణుమాయను హేళన చేసి, బ్రహ్మాండాన్ని శూన్యం చేసి, సృష్టి నిర్మాణ కార్యాన్ని భంగపరిచి మందరగిరికి వెళ్ళిపోయాడు.

ఈ పరిణామం అంతటికీ సృష్టి నిర్మాణ కార్యాన్ని పూర్తి చేయగానే, తాను సృష్టించిన ప్రాణిగణాలను చూసినప్పుడు బ్రహ్మదేవుడికి కలిగిన రాజసగుణం ప్రధాన కారణమని తెలుస్తుంది. అందువలన బ్రహ్మదేవుడికి రాజసగుణం కలిగిందని కవి చేసిన ఈ కల్పన కథలో ప్రధాన పాత్ర వహిస్తున్నదని చెప్పవచ్చు. ఈ కల్పన లేకపోతే ఆ తర్వాత ఇక కథలేదనే భావన కలుగుతున్నందు వలన ఈ కథలో ఈ కల్పనకు గల ప్రాధాన్యత కూడా వెల్లడవుతున్నది.

### 4.1.3.6. మాయాసరస్వతి వృత్తాంతం

రాజసగుణంతో గర్వించి విష్ణుమాయనే నిందించిన బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి ఈ మాయాసరస్వతి కల్పించబడింది. మాయాసరస్వతి మందరగిరి గుహలో తపోదీక్షలో ఉన్న బ్రహ్మదేవుడి ముందు శృంగార విలాసాలను ప్రదర్శించింది. వీణమీద మీటుతూ మధురమైన కంఠధ్వనితో బ్రహ్మ తపస్సు భంగం అయ్యేలాగ గీతాలాపన చేసింది. బ్రహ్మ కళ్ళుతెరవగానే మాయా సరస్వతి అతనితో తాను సరస్వతినని చెప్పింది. మాయాసరస్వతి తన శృంగార చేష్టలతో బ్రహ్మను తపోదీక్ష నుంచి మరల్చి, రతికార్యోన్ముఖునిగా చేసింది. మాయాసరస్వతి తన శృంగార విలాసంతో బ్రహ్మను కామమోహితునిగా చేసింది. బ్రహ్మదేవుని గాఢరతులకు ఓర్వలేక మాయాసరస్వతి శతరూపాలు ధరించి, అతడిని శతానందుడిని చేసింది. బ్రహ్మ రతిసఖ

పారవశ్యంలో ఉండగానే మాయాసరస్వతి మాయమైపోయింది. మాయాసరస్వతి కనిపించక బ్రహ్మదేవుడు నిర్వేదంతో, దైన్యంతో దుఃఖిస్తూ గుహవెలుపలికి వచ్చి మార్కండేయాది మునులకు కనిపించాడు. మాయా సరస్వతి విష్ణుమాయను తిరస్కరించి గర్వించిన బ్రహ్మను తన శృంగార చేష్టలతో రతిపారవశ్యంలో ముంచి, హఠాత్తుగా అదృశ్యమైపోయింది. ఆ ఎడబాటుకు సహించలేక బ్రహ్మ దైన్యంతో దుఃఖించాడు. ఆతర్వాత మార్కండేయాది మునుల ముందు అవమానంతో నిలుచున్నాడు. మార్కండేయ ముని వలన జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని బ్రహ్మ గ్రహించి, గర్వాని విడిచాడు. కాబట్టి బ్రహ్మ గర్వభంగం అనే కార్యం జరగడానికి ఈమాయాసరస్వతి కల్పన ప్రధాన సాధనమైనదని తెలుస్తున్నది.

4.1.3.7. శివుడు, నారదుల సంవాదం

నారదుడు మాయామోహిని దేవతలకు అమృతాన్ని పంచి, రాక్షసులను మోసపుచ్చిన విధాన్ని శివునికి చెప్పాలని కైలాసానికి వెళ్ళాడు. శివుడు నారదుని కుశలమడిగి, సముద్రమథనంలో హాలా హాలాన్ని తాను గ్రహించి వచ్చిన తర్వాత ఏయే విశేషాలు కలిగాయని అడిగాడు. నారదుడు శివునితో క్షీరసముద్రం నుంచి లభించిన అమృతాన్ని రాక్షసులు అపహరించగా, దాన్ని దేవతలకు అందించడానికి మహావిష్ణువు మాయామోహినిగా అవతరించాడని చెప్పాడు. ఆ మాయామోహిని రాక్షసులను భ్రమపెట్టి దేవతలకు అమృతాన్ని పంచిందని నారదుడు చెప్పగా, శివుడు మోహిని విష్ణువేనని రాక్షసులు గ్రహించలేకపోయారా అని ప్రశ్నించాడు. నారదుడు మాయామోహిని సౌందర్యాన్ని శివుని ముందు వర్ణించాడు. ఆ మాటలు విని శివుడు నారదముని ఎంత మృష పలికాడు అనుకొని, పార్వతితో తాను వైకుంఠానికి వెళ్ళి మాయామోహిని రూపాన్ని చూసివస్తానని అన్నాడు.

పార్వతి విష్ణుమాయా మహిమను గుర్తుచేసి, శివునితో వైకుంఠానికి వెళ్ళవద్దని చెప్పింది. శివుడు ఆమెతో విష్ణుమాయకు తాను భ్రమించనని పలుకగా విని, నారదుడు మాయామోహిని శృంగార విలాసాన్ని చూస్తే శివుడు కూడా వెఱ్ఱి ఎత్తి తిరుగుతాడని రోషమెక్కించాడు. శివుడు నారదుని మాటలకు రోషంతో వైకుంఠానికి వెళ్ళి మోహినిని చూసి, తాను విష్ణుమాయకు లోబడనని లోకానికి చాటుతానని పలికాడు. ఈ విధంగా నారదుడు, శివునికి మధ్య జరిగిన సంవాదం వలన మాయామోహిని వృత్తాంతం తోపాటుగా, శివుని పంతం కూడా ప్రకటించబడింది. మోహినిని చూడాలని శివుడికి కలిగిన ఈ పంతమే అతడి గర్వభంగానికి హేతువు అయింది. కాబట్టి నారదునికి శివునికి మధ్య కల్పించిన ఈ సంవాదం శివదర్పభంగానికి కారణమైందని చెప్పవచ్చు.

4.1.3.8. విష్ణుమాయాకాంత ఇంద్రజాలం

వైకుంఠంలో శ్రీమహావిష్ణువు శ్రీదేవి, భూదేవులతో కొలువుదీరి ఉండగా విష్ణుమాయ స్త్రీ రూపంతోఅక్కడికి వచ్చింది. మాయాకాంత మహావిష్ణువుకు నమస్కరించి,

అతడి అనుమతితో దివ్యకాంతలైన శ్రీదేవి, భూదేవులకు కాలక్షేపం కోసం ఇంద్రజాల విద్యను ప్రదర్శించాలని భావించింది. అంతలో అక్కడికి పురాకృతకర్మ విశేషం వలన నారదముని వచ్చాడు. అప్పుడు మాయాకాంత సృష్టిలో ఆవరించి ఉన్న విష్ణుమాయా ప్రభావాన్ని అనేక విధాలుగా ప్రదర్శించి వైకుంఠపుర కాంతలకు కనువిందును కలిగించింది. మాయాకాంత చేసిన ఆ ఇంద్రజాల ప్రదర్శనకు మెచ్చుకొని శ్రీదేవి, భూదేవులు ఆమెను ప్రస్తుతించి, రత్న పారితోషికాలు కానుకలుగా ఇచ్చారు. అక్కడే ఉండి ఈ తతంగాన్ని అంతటినీ గమనిస్తున్న నారదుడు మాత్రం విష్ణువుతో మాయాకాంత చేసిన ఇంద్రజాలం అబలలు అయిన శ్రీదేవి, భూదేవులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి కాని, తనవంటి వాడిని భ్రమించలేవని తిరస్కరించి పలికాడు. నారదుడు తాను ఒక్కడు తప్ప మిగిలిన చరాచర జగత్తు అంతా విష్ణుమాయకు భ్రమించిందని చెబుతూ, బ్రహ్మ రుద్రాది దివ్యులను భ్రమింపజేసేటప్పుడు చూసినందు వలన విష్ణుమాయకు తాను భ్రమించనని విష్ణువుతో అన్నాడు.

మహావిష్ణువు నారదునికి పురాకృత కర్మశేషం అనుభవించ వలసి ఉన్నందు వలన ఆ రీతిగా గర్వించాడని గ్రహించాడు. నారదుడు తాను విష్ణుమాయను జయించానని సత్యలోకంలో, కైలాసంలో, స్వర్గంలోనూ ప్రకటించుకుంటూ సంచరించసాగాడు. నారదుని గర్వాన్ని భంగపరచాలని భావించిన మహావిష్ణువు సర్వవరమనే క్షేత్రంలో మున్యాశ్రమాన్ని, అందులో ఒక కొలనును కల్పించాడు. విష్ణువు మాయామునిగా మారినాడు. విష్ణుమాయా ప్రేరేపితుడై నారదుడు ఆ సర్వవర క్షేత్రానికి వచ్చి, మాయాముని మాటలు నమ్మి కొలనులో మునిగి స్త్రీ రూపాన్ని పొందాడు. ఆతర్వాత నారదుని మాయాసంసారం, భర్త కుమారుల మరణం, వాటి పర్యవసానంగా కలిగిన దుఃఖం ఇవన్నీ అతడికి గర్వభంగాన్ని కలిగించాయి. అందువలన ఈ కథలో నారదుని గర్వభంగానికి విష్ణువు సమక్షంలో మాయాకాంత చేసిన ఇంద్రజాల ప్రదర్శన ప్రధానకారణమని తెలుస్తుంది. ఈ విధంగా ఎల్లనార్యుడు చేసిన ఈ కల్పన నారదగర్వభంగ కథలో ప్రధానఘట్టంగా ఉన్నదని పై పరిశీలన ఆధారంగా చెప్పవచ్చు.

### 4.1.3.9. పుండరీకుని వృత్తాంతం

రాజసగుణంతో విష్ణుమాయను నిందించిన బ్రహ్మకు మార్కండేయముని ఈపుండరీకుని వృత్తాంతాన్ని వినిపించాడు. పుండరీకుడు పరమ భాగవతుడు అయినప్పటికీ నారదుని బోధను విని విష్ణుమాయను గురించి సందేహించాడు. దాని పర్యవసానంగా విష్ణుమాయ బోయకాంతగా మారి పుండరీకునితో మాయాసంసారాన్ని చేయడం, ఆ తర్వాత కరువు కాటకాలు బాధించడం, పుండరీకుడు మాయాసంసార బంధంలో తగుల్కొని భార్యాకుమారులను కాపాడుకొనేందుకు గౌతమీ తీరానికి వలస వెళ్ళడం, అక్కడ ఒక బ్రాహ్మణాగ్రహారంలో భిక్షకు వెళ్ళగా అది అతని ఇల్లే కావడం, పుండరీకుని దైన్యతను చూసి అతని భార్య మహావిష్ణువును ప్రార్థించగా పుండరీకుని

మోహభ్రాంతి తొలగిపోవడం అనేవి ఈ కథలోని ప్రధానాంశాలు. ఈ ఉపకథను కల్పించడంలో ఎల్లనార్యుడు భావికథా సూచన చేశాడని అనిపిస్తుంది. బ్రహ్మ పుట్టగానే మహావిష్ణువును స్తుతించడం అతని భక్తి విధేయతకు నిదర్శనం. పుండరీకుడు కూడా పరమ విష్ణు భక్తుడు. బ్రహ్మ రాజసగుణంతో విష్ణుమాయను తిరస్కరిస్తే, పుండరీకుడు విష్ణుమాయను సందేహించాడు. పుండరీకుడిని విష్ణుమాయ బోయకాంత రూపంతో వశం చేసుకుంటే, బ్రహ్మను మాయాసరస్వతి వశం చేసుకుంది. మాయాసంసారం, కరువుకాటకాలు వల్ల పుండరీకునికి దైన్యత కలిగితే, రతికేళిలో ముంచి మాయాసరస్వతి హఠాత్తుగా మాయం కావడం వల్ల బ్రహ్మకు కూడా దైన్యత, దుఃఖం కలిగాయని తెలుస్తుంది.

ఈ విధంగా బ్రహ్మ కథలోని పుండరీకోపాఖ్యానం కల్పించుట ద్వారా ఎల్లనార్యుడు భావికథా సూచన చేశాడని పై పరిశీలన ఆధారంగా చెప్పవచ్చు.

4.1.3.10. చండదమనుని వృత్తాంతం

నారదుడు దురహంకారంతో విష్ణుమాయ తనను భ్రమించలేదని పలికినప్పుడు ఆకాశవాణి ఈ చండదమనముని వృత్తాంతాన్ని వినిపించింది. చండదమనుడు గొప్ప తపస్సంపన్నుడైనప్పటికీ మాంధాత మహారాజులాగ తాను కూడా రాజ్యభోగాలను పొందాలని ఆశించాడు. చండదమనుడు రాజ్యసుఖాలు పొందాలని తపస్సు చేస్తుండగా సనత్కుమారుడు వచ్చి నివారించి, అతడికి హితబోధ చేశాడు. చండదమనుడు విష్ణుమాయా ప్రభావానికి తగుల్కోకుండా మోక్షాన్ని పొందాలని తపస్సు చేసి, బ్రహ్మ, రుద్ర, సూర్యనారాయణుల నుంచి ఆ వరాన్ని పొందలేకపోయాడు. చండదమనుడు విష్ణుమాయకు భ్రమించరాదని పంతంతో తపస్సు చేస్తుండగా విష్ణుమాయ అతడిని మహారాజుగాను, అతని ఆశ్రమాన్ని అంతఃపురంగాను కల్పించింది. చండదమనుడు విష్ణుమాయకు తగుల్కొని తనను మహారాజుగా భావించుకొని, రాజ్య భోగాలలో మునిగిపోయాడు. ఆ తర్వాత సనత్కుమారుని బోధ వలన చండదమనుడు తన గతజీవితాన్ని గుర్తు చేసుకొని విచారించి, విష్ణువును ప్రార్థించాడు. మహావిష్ణువు అనుగ్రహం వలన చండదమనుడు తిరిగి తాపసిగా మారాడు.

నారద గర్వభంగ కథలోని ఈ ఉపకథ తర్వాత రాబోవు కథాఘట్టాలను స్ఫురింపజేస్తున్నది. నారదుడు శ్రీమహావిష్ణువుతో అతనికి గల అతిపరిచయం వలన విష్ణుమాయను జయించానని ముల్లోకాలలో ప్రకటించుకున్నాడు. చండదమనుడు తన తపస్సుతో బ్రహ్మ రుద్ర సూర్యనారాయణులను ప్రత్యక్షం చేసుకున్నందు వలన తపశ్శక్తి గర్వంతో విష్ణుమాయను తిరస్కరించి, మోక్షాన్ని పొందాలని భావించాడు. నారదుడు పూర్వకర్మల ఫలాన్ని అనుభవించవలసి ఉన్నందువల్లనే విష్ణుమాయను చులకన చేసి స్త్రీ రూపాన్ని, మాయాసంసార బంధాన్ని పొందాడు. చండదమనుడు కూడా పూర్వకర్మల ఫలాన్ని అనుభవించడానికే విష్ణుమాయను నిందించి, మహారాజు

రూపాన్ని పొంది, రాజ్య భోగాలలో మునిగిపోయాడని తెలుస్తుంది. ఈ విధంగా విష్ణుమాయా నాటకంలో ఎల్లనార్యుడు చేసిన కల్పనలు ఆయా కథలలో ప్రధాన ఘట్టాలుగా పరిణమించి, కథాగతికి ఒక చక్కని మలుపును కలిగిస్తూ, ప్రధానకథకు ఆలంబనగా ఉన్నాయని పైన పేర్కొన్న నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు.

### 4.2. కంకంటి పాపరాజు – కథానుశీలన

#### 4.2.1. కావ్యారంభం

పాపరాజు రచించిన ఈ విష్ణుమాయా విలాస యక్షగానానికి శుకమహర్షి కథకుడు, పరీక్షిత్తు మహారాజు శ్రోత. శుకమహర్షి చేత లలిత పావనములైన విష్ణుమాయా విలాస కథలు వింటున్న పరీక్షిత్తు మహారాజుకు ఒక సందేహం కలిగింది. దాని నివృత్తి కోసం పరీక్షిత్తు మహారాజు శుకమహర్షిని, మహానుభావా! కపటనారాయణుని విలాసాలు మనస్సుకు ఎంతో వేడుక కలిగిస్తున్నాయి. భువన మోహనుడైన పురుషోత్తముడిని మాయవనితగా చూసి లోకాలు భ్రమించడం సహజమే. కాని, సర్వజ్ఞుడైన సామజాసురహరుడు తాను ఎందుకు భ్రమించాడు అని అడిగాడు. దానికి సమాధానంగా శుకమహర్షి, విష్ణుమాయకు భ్రమించనివారు ఎవరున్నారు? మగతనంతోనే లోకాలను మరులు కొలిపే వన్నెకాడు మగువతనంతో భ్రమపెట్టడంతో ఆశ్చర్యమేముందని పలికాడు. శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుతో విష్ణుమాయకు శివుడు కూడా భ్రమించిన మోహినీ అవతార కథను చెప్పడం ప్రారంభించాడు.

##### 4.2.1.1. శివగర్వభంగం కథ

శివుడు ధవళవర్ణంతో వెలుగొందుతూ, ఆరామవాటికలతో, రుద్రకన్యల ఆటపాటలతో వైభవోపేతంగా ఉన్న కైలాసగిరి మీద నివసిస్తున్నాడు. ఒకనాడు శివుడు గంగాపార్వతులతో, రుద్రులు, వీరభద్రులు, సిద్ధులు, మహామునులు, మానువులు, దిక్పాలకులతో కొలువుదీరి ఉన్నాడు. ఆ సమయంలో నారదుడు తన వెంట తుంబురుడు రాగా కైలాసానికి బయలుదేరాడు. అతడు అలకాపురం మీదుగా ప్రయాణించి, కైలాస నగరాన్ని చేరుకున్నాడు. నారదుడు భద్రాసనం మీద కూర్చున్న మహాశివుడికి నమస్కరించి, కీర్తించాడు. శివుడు నారదుడిని కుశల ప్రశ్నలు అడిగి, క్షీరసాగర మథనంలో కాలకూటవిషం కలిగిన తర్వాత ఏవేవి పుట్టాయి? అమృతాన్ని అసురులు, దేవతలు తామే పంచుకున్నారా? ఎవరైనా పెద్దలు పూనుకొని సరిగా పంచిపెట్టారా? అని అడిగాడు. కలహాశనుడైన నారదుడు మహావిష్ణువు లీలలు ప్రమథులు కోపగించుకునే విధంగా శివుడికి చెప్పాలని మనస్సులో భావించాడు.

నారుదుడు శివుడితో, దేవా! విషాన్ని హరించి తమరు లోకాలను కాపాడిన తర్వాత, ధన్వంతరి అమృతకలశంతో ప్రత్యక్షమయ్యాడు. అసురులు బలవంతంగా అమృతాన్ని అపహరించారు. దేవతలు ప్రార్థించగా మహావిష్ణువు మోహినీ అవతారం

ధరించి, అసురులను మోహవివశులను చేశాడు. బలిచక్రవర్తి అందరికీ పంచిపెట్టమని అమృత కలశాన్ని మోహినికి అందించాడు. మాయామోహిని అమృతాన్ని దేవతలకు మాత్రమే పంచింది. అసురులు ఆవిధంగా విష్ణుమాయ చేత వంచింపబడ్డారని తెలిపాడు. నారదుడు మాయామోహిని శృంగార చేష్టలకు అసురులే మన్మథుడిని దహించిన శివుడు కూడా మోహాన్ని పొందగలడని అన్నాడు. నారదుడు శివుడి ముందు మోహిని శృంగార చేష్టా విలాసాలను అనేక విధాలుగా వర్ణించాడు. నారదుడి మాటలకు శివుడు, మహా విష్ణువు మోహినిగా మారితే చూసి లోకాలన్నీ భ్రమించవచ్చు కాని తాను భ్రమించనని అన్నాడు. శివుడు పార్వతితో కలహముని మాటలను నమ్మకుండా, విష్ణువును చూసి నిజమేదో స్వయంగా తెలుసుకుంటానని అన్నాడు. మోహినిని చూసి వలపు చెందకుంటే శివుడి విరతి భావం తెలుస్తుందని పార్వతితో అన్నాడు.

పార్వతి శివుడితో మోహిని రూపానికి భ్రమించినట్లయితే గౌరవం పోయి, నవ్వుల పాలు అవుతావని అన్నది. మన్మథుడు పగవాడు, మహావిష్ణువు కూడా వగలవాడు. కాబట్టి శివుడి మనస్సుకు తోచినట్లుగా చేయమని పార్వతి చెప్పింది. శివుడు పార్వతితో మనస్సు అతని ఆధీనంలో ఉన్నప్పుడు మరులు ఎలా కలుగుతాయని అన్నాడు. నారదుడు మోహినీ విలాసాన్ని చూస్తే శివుడికి కూడా మోహం కలుగుతుందని రెచ్చగొట్టాడు. నారదుడి మాటలకు ప్రమథులు కోపంతో అతడిని నిందించారు. శివుడు ప్రమథులను వారించి, నారదుడితో కలిసి వైకుంఠానికి బయలు దేరాడు. శివుడు పార్వతీ సమేతంగా నిర్వికారమైన రూపంతో వైకుంఠానికి వెళుతుండగా, బ్రహ్మ మొదలైన దేవతలు, మునులు, యతులు, దిక్పాలకులు, శివుడి విరతిని, విష్ణుమాయా ప్రభావాన్ని చూడాలని అనుసరించారు. శివ పార్వతులు వైకుంఠానికి చేరగానే, వారి రాకను ద్వారపాలకుడు వెళ్ళి మహావిష్ణువుకు తెలిపాడు.

మహావిష్ణువు శ్రీదేవి, భూదేవి సమేతంగా ఎదురువచ్చి, ఆ పురాణ దంపతులను ఆహ్వానించి, సముచితంగా సంభావన గావించాడు. శివుడు సభలో బ్రహ్మాది దేవ, ముని సమూహాలు చేరి కొలుస్తుండగా మహావిష్ణువును మోహినీ రూపాన్ని చూపమని కోరాడు. శివుడు నారదుడు తనను ధిక్కరించిన విధాన్ని విష్ణువుకు తెలిపాడు. తన విరక్తి భావం, విష్ణుమాయా ప్రభావం లోకాలకు తెలిసేటట్లుగా విష్ణువును మోహినిగా మార మన్నాడు. శివుడు మరుని సంహరించిన తనకు మరులు ఎలా కలుగుతాయని దర్పంతో పలికాడు. ప్రమథులు కూడా విష్ణుమాయను నిందించి, నారదుడిని దండించ బోయారు. మహావిష్ణువు తన మనస్సులో శివుడి దురహంకారాన్ని, ప్రమథుల అహంకారాన్ని తెలుసుకొని, శివుడిని మోసపుచ్చాలని నిర్ణయించుకున్నాడు. మహావిష్ణువు కలహముని మాటలకు కోపించవద్దని చెప్పి, శివుడికి మరొక ఏకాంత సమయంలో మోహిని రూపాన్ని చూపుతానని చెప్పాడు. శివుడు నారదుడి పంతమో, తన వైరాగ్యమో

తేలకుండా కైలాసం వెళ్ళనని పంతం పట్టాడు. మాన్యుడని స్నేహభావంతో గౌరవిస్తుంటే శివుడు వినిపించుకోలేదని, మహావిష్ణువు అతడిని భ్రమింపజేయడానికి మోహినిగా మారాడు. విష్ణుమాయ వల్ల సభలో సువాసన వ్యాపించగా, మన్మథుని మోహనాస్త్రం లాగ మాయామోహిని శివుడి ముందు నిలిచింది. మోహిని ఎదురుగా నిలవగానే శివుడికి గుండె జలదరించి, దేహమంతా పులకరించింది. శివుడు నివ్వెరపడి మనస్సు నిలుపలేక, తాను వచ్చిన రాకను మరిచిపోయాడు. మోహిని విలాసానికి ప్రమథులు విభ్రాంతులైనారు. శివుడు విష్ణుమాయా మోహవిభ్రాంతుడై మోహినీకాంతను సహజ కాంతగా భ్రమించాడు. శివుడు ఓపలేని మోహంతో కొలువులోని దేవతలు తనను చులకన చేసినా, పార్వతి అలిగినా, ప్రమథులు చిన్నబోయినాగాని, మహావిష్ణువు నవ్వినాగాని బలవంతంగానైనా మోహినిని పట్టుకోవాలని భావించాడు.

శివుడు చూస్తుండగానే ఆ సభామందిరం శృంగారవనంగా మారిపోయింది. అతడికి శరీరం గడగడ వణికింది. అడుగులు తడబడి, స్వేదపుజడి లలాటం మీద నుంచి చెంపల మీదికి జాలువారింది. మోహిని కోసం వెదుకుతూ, ఆమె కనిపించలేదని శివుడు నిర్వేదంతో ఉద్యానవనమంతా తిరిగాడు. మన్మథుడు విజృంభించి పూలబాణాలతో బాధించగా, విరహోన్మాదంతో శివుడు మోహిని కోసం పలవరించాడు. ఏలపాట వినిపించగా అటు వైపు వెళ్ళిన శివుడు ఊయల ఊగుతున్న మోహినిని చూశాడు. శివుడు వెనుకనుంచి కౌగిలించుకోబోగా మోహిని మాయమైంది. మోహినికోసం వెదుకుతూ శివుడు ఉన్మత్తుడై చరాచర ప్రాణులను మోహిని గురించి అడగసాగాడు. మాయామోహిని ఈ విధంగా శివుడికి మరులు కలిగించి, పుష్పాపచయం చేస్తూ కనిపించింది. శివుడు తనను మదనుని బారి నుంచి కాపాడుమని మోహినిని వేడుకున్నాడు. మోహిని శివుడితో, మదనుని గెలిచిన అతడికి మోహం ఎలా పుట్టిందని అడిగింది.

మాయామోహిని శృంగారవనంలో శివుడికి జలకాలాడుతూ కనిపించి, అతడు సమీపించగానే మాయమైంది. మోహిని కనిపించలేదని శివుడు విరహాతిశయంతో కన్నీరు కారుస్తూ, ఆ కొలను తీరంలోని పుప్పొడి కుప్పలపై పొర్లినాడు. శివుడు విరహోన్మాదంతో మన్మథుడిని, చంద్రుడిని, మలయ పవనాన్నీ దూషించాడు. విష్ణుమాయ చిలుక రూపంతో వచ్చి, మోహిని జాడ చెప్పింది. పూపొదరింటిలో ఒంటరిగా ఉన్న మోహిని శివుడిని చూసి లేవబోయింది. శివుడు మోహినిని కుర్చోమని చెప్పి, అతడి విరహాన్ని తీర్చమని అనేక విధాలుగా బతిమాలుకున్నాడు. చివరకు మట్టుమీరిన మోహంతో శివుడు మోహినిని బలవంతంగా కౌగిలించుకున్నాడు. మోహినీ కాంత స్పర్శ తగలగానే శివుడికి సుఖపారవశ్యంతో శుక్ల పతనమైంది. శివుడి శుక్లం భూమి మీద ప్రవహించగా, అది తాకిన నేల బంగారు, వెండిగా మారింది. శివుడికి

మదన పారవశ్యం తొలగింది. మాయామోహిని మహావిష్ణువుగా మారింది. శివుడు జరిగిన వృత్తాంతం అంతా విష్ణుమాయలీలగా గ్రహించాడు. బ్రహ్మాది దేవతలు, నారదుడు మహావిష్ణువును కీర్తించారు. శివుడు విష్ణుమాయా మహిమను స్తుతించాడు. మహావిష్ణువు శివుడితో, శివకేశవుల మధ్య భేదం లేదని అన్నాడు. దేవతలలో మహాదేవుడని ఖ్యాతిని పొందిన శివుడు విష్ణుమాయకు భ్రమించలేదని, మాయామోహిని వింత ఏమిటో తెలుసుకోవడానికే ఆ విధంగా ప్రవర్తించాడని విష్ణువు దేవతలతో అన్నాడు. ఈ విధంగా మాయామోహిని అవతార నిమిత్తంగా శివదర్పభంగం జరిగిన తీరును ఈ కథ తెలుపుతున్నది.

ఈ కథలో శివుడు క్షీరసాగరం నుంచి ఏమి పుట్టాయో తెలుసుకోవాలనే కుతుహలంతో నారదుడిని అడిగాడు. అసురులు, సురలు కలిసి అమృతాన్ని సమంగా పంచుకొని ఉంటారని శివుడు భావించాడు. కాని కలహప్రియుడైన నారదుడు మాత్రం శివుడి ముందు మాయామోహిని రూపు రేఖలను విశేషంగా వర్ణించాడు. మోహిని శృంగార విలాసానికి శివుడికి కూడా మరులు కలుగుతాయని అన్నాడు. కైలాసంలో పార్వతీదేవి సమక్షంలో, ప్రమథగణాలు సేవిస్తుండగా శివుడి ముందు నారదుడు విష్ణుమాయను పొగిడాడు. మోహినీ రూపాన్ని వర్ణించాడు. శివుడి ఘనతను చులకన చేశాడు. నారదుడు చేసిన ఈ దుశ్చర్య శివుడికి ఆవేశాన్ని కలిగించింది. నారదుడు పార్వతి ముందు శివుడి మనోనిగ్రహాన్ని చులకన చేయడం వల్ల శివుడిలోని ఆత్మాభిమానం మేల్కొంది. ప్రమథులు వింటుండగా విష్ణుమాయను స్తుతించి, శివుని మహిమను తేలిక చేయడం వల్ల శివుడిలోని ఆత్మాభిమానం అతిశయించి గర్వంగా మారింది. ఆ గర్వమే శివుడిలో విష్ణుమాయను తిరస్కరించేలాగ పంతాన్ని కలిగించింది.

ఆ పంతం వల్లనే శివుడు మాయామోహిని సౌందర్యానికి దాసుడై శృంగార వనంలో వెర్రిపట్టిన విధంగా తిరిగాడు. మోహినిపై శివుడికి కలిగిన విరహాతిశయం, కామవివశత్వం అనేవన్నీ కూడా ఆత్మాభిమాన మూలకమైన ఆవేశం పంతంగా మారడం వల్లనే కలిగాయి. ఇంద్రియాలను జయించినవాడు, మనోనిగ్రహం కలవాడూ అయిన శివుడు కూడా ఆత్మాభిమానం నెపంగా ఆవేశంతో పంతానికిపోయి భంగపాటును పొందాడు. శివుడికి మోహినీ స్పర్శతో శుక్లపతనం జరిగిన తర్వాత, అతడు తన యోగ ప్రభావంతో లజ్జ, అపవాదు, శంక అనేవి లేనివాడై దేవతలతో పూజలు అందుకున్నాడు. మహావిష్ణువు కూడా శివుడికి తనకి భేదం లేదని తెలిపాడు. అందువల్ల ఆత్మాభిమాన పూర్వకమైన శివుడి దర్పం మాయామోహిని నెపంగా విష్ణుమాయ చేత భంగం కావించబడిందని తెలుస్తుంది. ఈ విధంగా విష్ణుమాయా ప్రభావం నుంచి శివుడు కూడా తప్పించుకోలేడని ఈ వృత్తాంతం తెలుపుతున్నది.

### 4.2.2. కల్పనలు

కంకంటిపాపరాజు తన యక్షగానంలోని ప్రధానేతివృత్తాన్ని నిర్వహించడంలో ఎల్లనార్యుని శివదర్పభంగ కథను అనుసరించాడు. పాపరాజు ప్రధానకథను ఎల్లన కావ్యం నుంచి గ్రహించినప్పటికీ దానికి స్వకీయమైన కొన్ని కల్పనలను చేసినట్లుగా కనిపిస్తుంది. పాపరాజు చేసిన ఈ కల్పనలు అతడి కావ్యాన్ని పరిపుష్టం చేయడానికి ఉపకరించాయని చెప్పడానికి ఈ క్రింది నిదర్శనాలు ఆధారంగా కనిపిస్తున్నాయి. పాపరాజు తన కావ్యంలో చేసిన కల్పనలలో ఈ క్రిందివి ప్రధానమైనవి.

1. సముద్ర మథన వృత్తాంతం
2. ప్రమథుల దురహంకారం
3. శివుడు, మోహినీకాంతల సంభాషణ

### 4.2.2.1. సముద్ర మథన వృత్తాంతం

ఎల్లనార్యుడు తన శివదర్పభంగ కథను క్షీరసముద్ర మథన వర్ణనతో ప్రారంభించాడు. క్షీరసముద్ర మథనం వలన కలిగిన హాలాహలాన్ని శివుడు హరించడం, ఆ తర్వాత క్షీరసముద్రం నుంచి లభించిన అమృతాన్ని రాక్షసులు అపహరించడం, శ్రీమహావిష్ణువు మాయామోహినిగా అవతరించి అమృతాన్ని దేవతలకు పంచడం, ఈవృత్తాంతాన్ని శివునికి తెలపాలని నారదుడు కైలాసానికి బయలు దేరడం అనేవి వరుసగా వర్ణించబడ్డాయి. కంకంటి పాపరాజు ఈ కథాక్రమాన్ని విడిచిపెట్టి, కైలాస పర్వత వర్ణనతో తన యక్షగానాన్ని ప్రారంభించాడు. ఆ తర్వాత పరమేశ్వరుని కొలువును వర్ణించాడు. నారదుడు తుంబురునితో కలిసి కైలాసానికి వెళుతున్న ప్రయాణాన్ని వర్ణించాడు. ఆ తర్వాత కైలాసంలో శివుని కొలువులో నారదుని చేత సముద్ర మథన వృత్తాంతాన్ని చెప్పించాడు. పాపరాజు ఈ మార్పును కల్పించడం వలన సముద్ర మథన వృత్తాంతం, మోహినీ అవతార ప్రస్తావన అనేవి కథా ప్రారంభంలో చెప్పకుండా పరిహరించేందుకు మార్గం సుగమం అయ్యిందని చెప్పవచ్చు. ఎల్లన కథాప్రారంభంలో చేసిన సముద్ర మథన ప్రాస్తావన, మోహినీ అవతార వర్ణన అనేవి తిరిగి కైలాసంలో నారదుని చేత పునరుక్తం చేయబడ్డాయి. ఈ పునరుక్తి ప్రస్తావన కలుగకుండా పాపరాజు తన యక్షగానంలో మొదట కాకుండా, కైలాసంలో నారదుని చేత ఒక్కసారి మాత్రమే ఈ సముద్ర మథన వృత్తాంతాన్ని చెప్పించాడని తెలుస్తున్నది.

### 4.2.2.2. ప్రమథుల దురహంకారం

ఎల్లనార్యుడు కైలాసంలో శివుని ముందు నారదునిచేత మాయామోహిని వృత్తాంతం వినిపించాడు. ఆ సందర్భంలో నారదుని చేత మోహినిని చూస్తే శివుడు కూడా వెర్రివాని లాగ భ్రమించి తిరుగుతాడని అనిపించాడు. దానికి ప్రమథులు విష్ణుమాయను చులకన చేసి, శివుని మహిమను పొగినట్లు గాను, ఆ తర్వాత ప్రమథులు

వైకుంఠంలో నారదుని నిందించినట్లు గాను వర్ణించబడింది. కంకంటి పాపరాజు కూడా శివునికి నారదుని చేతనే మోహినీ వృత్తాంతం వినిపించి, మోహినిని చూస్తే శివుడు కూడా వెర్రివానిలాగ తిరుగుతాడని అనిపించాడు. ఆ మాటలు విన్న ప్రమథులు గిటగిట పండ్లు కొరుకుతూ నారదుని మీదకు దండించేందుకు వెళ్ళగా శివుడు వాళ్ళని వారించినట్లుగా వర్ణించాడు. ఆ తర్వాత వైకుంఠంలో కూడా భృంగిరిటి మొదలైన ప్రమథులు నారదుని విష్ణువుముందే నిందించారని వర్ణితమైంది. కైలాసంలోనే ప్రమథులు నారదుని దండించాలని ప్రయత్నించడానికి వారి దురహంకారం, స్వామిభక్తితో పాటుగా స్థానబలిమి కూడా కారణమని చెప్పవచ్చు. కైలాసంలో నారదుడు శివుని మహిమను చులకన చేసినందుకు ప్రమథులు అతన్ని దండించాలను కోవడంలో వారి స్వామిభక్తి, స్థానబలిమి ప్రధానంగా కనిపిస్తున్నాయి. కాని వైకుంఠంలో విష్ణువుముందు నారదుని నిందించడంలో ప్రమథుల దురహంకారం వెల్లడవుతున్నది.

4.2.2.3. శివుడు, మోహినుల సంభాషణ

ఎల్లనార్యుడు తన కావ్యంలో శృంగారవనంలో మోహిని వెంట తిరుగుతున్న శివుడు అతడి విరహాన్ని ఆమెకు వినిపించినట్లు మాత్రమే వర్ణించాడు. వారిమధ్య సంభాషణను మాత్రం కల్పించలేదు. పూపొదరింటిలో సురతోద్యుక్తరూపంతో ఉన్న మోహినిని శివుడే వెదుకుతూ వెళ్ళి చూశాడని వర్ణించాడు. పాపరాజు తన కావ్యంలో శృంగారవనంలో మాయామోహిని కోసం వెదుకుతున్న శివుని ముందు మోహినిని చిలుక రూపంతో ప్రవేశపెట్టాడు. మోహిని కనిపించలేదని నిర్వేదంతో ఉన్న శివునికి పూపొదరింటిలో ఉన్న మోహిని జాడను ఈ మాయాచిలుక చూపించి మాయమైంది. శివుడు మోహినిని చూసిన సందర్భంలో వారి మధ్య పాపరాజు ఆసక్తికరమైన సంబాషణను కల్పించాడు. శివుడిని చూసి మోహిని పైకి లేవబోతే అతడు వద్దని వారించడం, శివుని వంటి దేవర వస్తే లేవకుండా ఉండగలనా అని మోహిని అంటే తాను దేవుడని ఎఱిగితే ఇంత వెత కలిగిస్తుందా అని శివుడు బదులు పలకడం,

ఈవిధంగా సాగిన ఈ సంభాషణ వలన శివుని విరహం, మోహిని శృంగార విలాసం అనేవి వెల్లవుతూ ఈ కావ్యానికి మరింత వన్నెను కలిగిస్తున్నదని తెలుస్తున్నది. ఎల్లన కావ్యంలో శివుడు మోహినికి అతని విరహాన్ని తెలిపే సందర్భంలో శివుడే మాట్లాడటం వలన మోహినిది అచేతన పాత్రగా కనిపిస్తున్నది. పాపరాజు శివుడు, మోహినుల మధ్య సంభాషణ కల్పించడం వలన ఇద్దరూ చేతన పాత్రలుగా భాసిల్లుతూ, ఈ సన్నివేశానికి ఒక నిండుదనాన్ని కలిగిస్తున్నారని చెప్పవచ్చు. ఈ విధంగా ఎల్లన కావ్యాన్ని అనుసరిస్తూనే పాపరాజు స్వకీయంగా చేసిన ఈ కల్పనలు అతడి కావ్యానికి మరింత వన్నెను కలిగించాయని ఈ నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు.

## 4.3. కంకంటి నారసింహకవి – కథానుశీలన

### 4.3.1. కావ్యారంభం

ఈ కావ్యం భాగవతోత్తముడైన శుకమహర్షి చేత భాగవత సత్కథలను వింటున్న పరీక్షిత్తుమహారాజుకు కలిగిన సందేహ పూర్వకమైన ప్రశ్నతో ప్రారంభమవుతున్నది. పరీక్షిత్తుమహారాజు శుకమహర్షితో, శ్రీ మహావిష్ణువు భువనైకపతి, ఆదిపురుషుడని ఉపనిషత్తులు కీర్తిస్తుండగా తెలిసికూడా, వేదవేదాంతఖనులైన మహామునులు త్రివర్గఫలములు అనుభవించడానికి కారణమేమని ప్రశ్నించాడు. శుకమహర్షి పరీక్షిత్తుమహారాజు వివేకాన్ని మనస్సులో మెచ్చుకొని, భవనైకకర్త, భర్త, హర్త అయిన మహావిష్ణువు మహిమను, రూపాన్ని, తేజాన్ని వేదాలు కూడా తెలుపలేవని అన్నాడు. పరీక్షిత్తు మహారాజుకు కలిగిన సందేహమే పూర్వం అతని తాత అయిన ధర్మరాజుకు కూడా కలిగిందని చెప్పాడు. ధర్మరాజు కూడా ఇలాంటి సందేహాన్నే తీర్చమని వ్యాసమహర్షిని అడిగాడు. వ్యాసుడు ధర్మరాజుకు విష్ణుమహిమను, మాయా ప్రభావాన్ని వివరించాడు. వ్యాసుడు విష్ణుమాయను తరించడానికి బ్రహ్మ, శివుడికి కూడా సాధ్యం కాలేదని, తనవంటి మునులకు కూడా అది అసాధ్యమని తెలిపాడు.

పూర్వం విష్ణుమాయ చేత బ్రహ్మ, శివుడు, నారదుడు మొదలైనవారు కూడా మోసపోయారని, ఆ కథలను చెప్పడానికి పూనుకున్నాడు. అంతలోనే ద్వారకానగరం నుంచి శ్రీకృష్ణుడు పంపించగా, గోవిందశర్మ అనే బ్రహ్మచారి వచ్చాడు. అతని వెంట సనకసనందనాది మునులు కూడా వచ్చారు. గోవిందశర్మ శ్రీకృష్ణునికి అత్యంత ఆప్తుడైన సఖుడు. గోవిందశర్మ తనను శ్రీకృష్ణుడు ధర్మరాజు కొలువులో విష్ణుమాయా విలాస కథలను చెప్పమని పంపించాడని పరిచయం చేసుకున్నాడు. ధర్మరాజు గోవిందశర్మ ధరించిన పారిజాత పుష్పమాల అతడికి ఏ విధంగా ప్రాప్తించిందో తెలుపమని కోరాడు. గోవిందశర్మ పూర్వం తాను విష్ణుమాయా విలాస కథలను సత్యభామాదేవికి వినిపించినప్పుడు ఆమె సంతోషించి పారిజాతమాలికను బహూకరించిందని ధర్మరాజుతో చెప్పాడు.

గోవిందశర్మ విష్ణుమాయ పూర్వం వలన మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుడు, పుండరీకుడు, చండదమనుడు అనేవారు మోసపోయిన విధాన్ని 'విష్ణుమాయానాటకము' అనే ప్రబంధంగా రచించినట్లుగా చెప్పుకున్నాడు. ఆ ప్రబంధంలోని కథలనే గోవిందశర్మ సత్యభామకు వినిపించాడు. అందువల్ల విష్ణుమాయా విలాస కథలకు మొదటి శ్రోత సత్యభామ అని తెలుస్తుంది. గోవిందశర్మ తనకు పారిజాత పుష్పమాలిక ప్రాప్తించడానికి కారణమైన సత్యభామ గర్వభంగం కథను ధర్మరాజు సభలో మొదటగా చెప్పాడు. దాని తర్వాత మిగిలిన విష్ణుమాయా కథలను కూడా ధర్మరాజు సభలో వినిపించాడు. ధర్మరాజు సభలో గోవిందశర్మ చెప్పిన విష్ణుమాయా విలాస కథలనే శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పడం ప్రారంభించాడు.

### 4.3.1.1. సత్యభామ గర్వభంగం కథ

పూర్వం శ్రీకృష్ణుడు సత్యభామకు పారిజాత వృక్షాన్ని ఎంతో ప్రీతితో బహూకరించాడు. పారిజాత వృక్షాన్ని పొందిన తర్వాత సత్యభామ మనస్సు ఏ విధంగా మారిందో తెలుసుకోవాలని భావించాడు. శ్రీకృష్ణుడు తన మాయామహిమతో రుక్మిణి మొదలైన భార్యల ఉద్యానవనాల్లో ఒక్కొక్క పారిజాత వృక్షాన్ని కల్పించాడు. తానుమాత్రం పదహారువేల నూటఎనిమిది రూపాలు ధరించి ఏకకాలంలో తన కాంతలు అందరితో క్రీడించాడు. శ్రీకృష్ణుని విలాసకేళిని గుర్తించలేక అతని ప్రియకాంతలు అందరూ ఎవరికివారు కృష్ణుడు తమకే సొంతమని భావించారు. ఆ విధంగా శ్రీకృష్ణుడు దక్షిణ నాయకత్వం వహించి, అనంతరూపాలతో విలసిల్లుతున్నాడు. సత్యభామకు రూప యౌవన సంపదల తోపాటుగా, పారిజాతవృక్షం పెరటిచెట్టు కావడంతో గర్వం కలిగింది. శ్రీకృష్ణుడు నిరంతరం ఆమెతోనే ఉండటం కూడా సత్యభామకు గర్వకారణమైంది. ఆమె శ్రీకృష్ణుని ఎడబాటును పొంది మిగిలిన సపత్నులు ఏ విధంగా కుమిలిపోతున్నారో తెలుసుకోవాలని కుతూహలపడింది. సత్యభామ తన ఆంతరంగిక చెలికత్తెచేత రుక్మిణికి పారిజాతపుష్పాలు పంపించి, ఆమె మనోభావం ఎలా ఉందో చూసి రమ్మని చెప్పింది. పారిజాతపుష్పాలు ఇచ్చేనెపంతో సత్యభామ తన మహారాజ వైభవం, కృష్ణుడితో కలిసి పొందే రతికేళీ విలాసం రుక్మిణి మొదలైన వారికి హృదయశల్యం కావాలని భావించింది. అక్కడి ద్వారపాలిక అడ్డగించింది. రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో ఏకాంతంగా ఉన్నందువల్ల లోనికి పోవడానికి వీలులేదని చెప్పి, ఈ పూవులు ఎవరు పంపారని అడిగింది.

సత్యభామ చెలికత్తె భూమిపై పారిజాత పుష్పాలు సత్యభామ దగ్గర తప్ప అన్యుల దగ్గర ఎక్కడైనా ఉన్నాయా? అని ద్వారపాలికతో అన్నది. ఆ మాటలు విని ద్వారపాలిక నవ్వి పారిజాత పుష్పాలు వారికి కొత్త కాదని, ఆ నగరంలోని పనివాళ్ళు కూడా తలలో పారిజాత పుష్పాలు ధరిస్తారని చెప్పింది. రుక్మిణీ దేవి తనకు కూడా పారిజాత వృక్షాన్ని కానుకగా ఇచ్చి, శ్రీకృష్ణుడు ఎల్లవేళలా ఆమె అంతఃపురంలోనే ఉండగా, అతని ఎడబాటుతో సత్యభామ ఎలా కుమిలిపోతుందో తెలుసుకోవాలని భావించింది. రుక్మిణి ఒక సంచారికను పిలిచి, పారిజాత పుష్పాలు బంగారు పళ్ళెంలో నింపింది. రుక్మిణి ఆమెతో, కృష్ణుడు మాకు తెచ్చిన పారిజాతవృక్ష పుష్పాలు ఇవి అని సత్యభామకు చెప్పమని పంపించింది. అప్పుడే సత్యభామ పంపిన చెలికత్తె వచ్చి, రుక్మిణి అంతఃపురంలో శ్రీకృష్ణుడిని పారిజాత పుష్పాలనూ చూసి ఆశ్చర్యపోయింది. ఆమె తన వెంట తెచ్చిన పువ్వులు ఇవ్వాలా, వద్దా అనే సందేహంతోనే, ఆ పువ్వుల్ని రుక్మిణి ముందు పెట్టి, సత్యభామదేవి పంపించిందని చెప్పింది.

రుక్మిణిదేవి సత్యభామ పంపించిన పూవులను శ్రీకృష్ణుని సిగలో అలంకరించి, పరిహాసమాడింది. ఆ చెలికత్తెతోనే రుక్మిణి తన పారిజాతపుష్పాలు సత్యభామకు తిరిగి పంపింది. రుక్మిణి ఆ చెలికత్తె వెళ్ళేముందు, తన పారిజాతాల సుగంధం వారి

పారిజాతాలకు ఉందో లేదో చూడమని హేళన చేసింది. జరిగిన ఈ అవమానాన్ని తమదేవికి తెలపాలని సత్యభామ చెలికత్తె వెంటనే అంతఃపురానికి వెళ్ళింది. మనస్సులో ఆందోళనతో భంగపాటుతో నిర్వేదంగా సత్యభామ మందిరంలోకి వెళ్ళిన చెలికత్తెకు శ్రీకృష్ణుడు కనిపించాడు. ఆమె విస్మయంలో రుక్మిణీదేవి పంపిన పుష్పపాత్రను సత్యభామ ముందు పెట్టింది. సత్యభామ చెలికత్తె అవస్థను గమనించి, ఏం జరిగిందని అడిగి, ఈ వింత పూవులు ఎక్కడివని ప్రశ్నించింది. ఆ చెలికత్తె సత్యభామతో రుక్మిణీదేవి మందిరంలో ఆమెకు జరిగిన పరాభవాన్ని తెలిపింది. ఆమె సత్యభామతో శ్రీకృష్ణుడు పారిజాత వృక్షాన్ని రుక్మిణీదేవికి కూడా కానుకగా ఇచ్చాడని చెప్పింది. సత్యభామ ఆ చెలికత్తె మాటల్లోని సత్యాన్ని తెలుసుకోవాలని ఇతర చెలికత్తెలను పంపించగా, వారందరూ తిరిగి వచ్చి అదే వార్తను చెప్పారు.

సత్యభామ చెలికత్తె మాటలు విని కోపంతో తనువు కంపించగా, కన్నులు ఎర్రబడగా శ్రీకృష్ణుడిని దూషించింది. అసూయ వల్ల కలిగిన రోషంతో సత్యభామ దుఃఖించింది. సత్యభామ పూర్వం ఇంద్రుడిని జయించి, పారిజాతవృక్షాన్ని భూలోకానికి తెచ్చిన కృష్ణుడు ప్రేమతో తనకు కానుకగా ఇచ్చాడు. నేడు ఆ ప్రేమను, స్నేహాన్ని మరిచి రుక్మిణీదేవికి కూడా పారిజాతవృక్షాన్ని ఇచ్చి తనను అవమానించాడని నిర్వేదించింది. సత్యభామ రోషంతో, భూమిపై పారిజాతవృక్షం ఆమెఇంట తప్ప వేరేచోట ఉండరాదని పంతంగా పలికింది. సత్యభామ తనకు పారిజాత పుష్పాలు పంపించేవారు లోకంలో ఉన్నప్పుడు, ఈ చెట్టుకూడా తనకెందుకని, శ్రీకృష్ణుని ఇష్టసతికి లంచమిచ్చుకోమని అతన్ని నిందించింది. పారిజాతపుష్పాలను శ్రీకృష్ణుని మీద దిగపారబోయించింది. సత్యభామ తన ఏకాంత మందిరానికి వెళ్ళి, కుండలో బంధించిన పాములాగ శయ్యమీద దొర్లుతూ ఏడ్చింది.

సత్యభామ కోపాన్ని శాంతింప జేయడానికి శ్రీకృష్ణుడు ఆ రాత్రి అంతా ఆమె మందిరంలోనే ఉన్నాడు. మిగిలిన ప్రియకాంతలతోను, గోపాంగనలతోనూ అనంత రూపాలతో ఆ రాత్రి క్రీడించి, తెల్లవారగానే తన మాయారూపాలు అన్నింటినీ ఉపసంహరించాడు. గోవిందశర్మ తెల్లవారగానే సత్యభామాదేవి అంతఃపురానికి వచ్చి, చెలికత్తెల ద్వారా జరిగినదంతా విన్నాడు. గోవిందశర్మ వెళ్ళి శ్రీకృష్ణుడిని దర్శించుకున్నాడు. శ్రీకృష్ణుడు గోవిందశర్మకు తన మాయా విలాసకేళిని తెలిపి, సత్యభామ కోపాన్న ఉపశమింప జేయమని పంపించాడు. గోవిందశర్మ సత్యభామ మందిరానికి వెళ్ళగా, ఆమె తనకు జరిగిన పరాభవాన్ని వినిపించింది. గోవిందశర్మ సత్యభామాదేవికి ఉపశమనం కలిగేలాగ ప్రతి మందిరంలో పారిజాతవృక్షం, శ్రీకృష్ణుని అనంతరూపాలు ఇవన్నీ అతని మాయాకేళిలో భాగంగా కల్పించినవేనని తెలిపాడు. గోవిందశర్మ శ్రీకృష్ణుని కపట నాటకానికి సత్యభామ వంటి ధీరనాయిక భ్రమించవచ్చునా

అని ఆమె మనస్సుకు ఆనందాన్ని కలిగించాడు. విష్ణుమాయా ప్రభావానికి శ్రీమహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుడు కూడా మోసపోయారని, గోవిందశర్మ ఆ కథలను సత్యభామకు వినిపించాడు. సత్యభామ గోవిందశర్మ మాటలకు ఆనందించి, శ్రీకృష్ణుని అనుమతితో అతడికి పారిజాత పుష్పమాలను కానుకగా ఇచ్చింది.

ఈ కథ ధర్మరాజు గోవిందశర్మకు పారిజాత పుష్పమాల ఏ విధంగా ప్రాప్తించిందో తెలుపమని కోరడంతో మొదలయ్యింది. ధర్మరాజుకు కుతూహలాన్ని కలిగించింది పారిజాత పుష్పమాల. పారిజాత పుష్పాన్ని మొదటగా నారదుడు భూలోకానికి తెచ్చి శ్రీకృష్ణుడికి ఇచ్చాడు. దాన్ని అతడు రుక్మిణీదేవికి కానుకగా ఇచ్చాడు. అది తెలిసిన సత్యభామ అసూయతో శ్రీకృష్ణునిచేత పారిజాత వృక్షాన్నే భూమి మీదికి తెచ్చేలా చేసింది. కాబట్టి పారిజాతపుష్పం నెపంగా సత్యభామకు రుక్మిణి మీద అసూయ, ఈర్ష్య కలిగాయి. సత్యభామ సంపద, యౌవనగర్వం కలిగినది. దానికి తోడుగా పారిజాతవృక్షం కూడా లభించింది. దీనివల్ల సత్యభామకు అకారణంగానే గర్వం అతిశయించింది. శ్రీకృష్ణుడు చంచల స్వభావం గల సత్యభామ గర్వాతిశయాన్ని బహిర్గతం చెయ్యాలనే, అష్టమహిషుల ఇళ్ళలో పారిజాతవృక్షాలు కల్పించాడు. తాను అనంతరూపాలతో ప్రియకాంతల మందిరాలలో కనిపించాడు. ఇవన్నీ శ్రీకృష్ణుని మాయాకేళికి నిదర్శనాలు.

సత్యభామ రుక్మిణికి తన చెలికత్తెతో పారిజాతపుష్పాలు పంపించింది. దీని ద్వారా సత్యభామ తన రాజసాన్ని ప్రదర్శించాలనుకుంది. రుక్మిణిని అవమానించడం కూడా ఇందులో దాగిఉంది. రుక్మిణి మందిరంలో పారిజాతవృక్షం ఉందని తెలిసినప్పుడు సత్యభామ కోపించడం, కృష్ణుడిని దూషించడం, తాల్మిలేక ఏడవడం ఇవన్నీ ఆమె చంచల స్వభావాన్ని, అసూయను తెలుపుతున్నాయి. సత్యభామలోని సపత్నీ సంబంధమైన అసూయను తొలగించాలనే శ్రీకృష్ణుడు ఈ మాయానాటకాన్ని కల్పించాడు. విష్ణుమాయా కల్పితమైన పారిజాతపుష్పాలను చూసి సత్యభామలోని అసూయ రోషంగా మారి అది చివరికి విషాదంగా పరిణమించింది. సత్యభామ శ్రీకృష్ణుడిని నిందించడం దీనికి నిదర్శనం. విషాదం తొలగిపోవాలంటే దుఃఖం కలగాలి. అందువల్లనే శ్రీకృష్ణుడు సత్యభామకు ఆ రాత్రంతా దుఃఖాన్ని కల్పించాడు. సత్యభామకు కలిగిన దుఃఖం వల్ల ఆమె విషాదం తొలగింది. ఈ దుఃఖాన్ని ఉపశమింప జేయడానికి గోవిందశర్మ విష్ణుమాయా విలాస కథలు చెప్పాడు. గోవిందశర్మ మాటలు సత్యభామకు మనశ్శాంతిని కలిగించాయనడానికి ఆమె పారిజాత పుష్పమాలను అతడికి బహూకరించడం నిదర్శనంగా చెప్పుకోవచ్చు. ఈ విధంగా సత్యభామకు కలిగిన గర్వాన్ని శ్రీకృష్ణుడు భంగం కావించి, ఆమెకు ఉపశమనం కలిగించిన తీరు ఈ కథలో వర్ణించబడిందని చెప్పవచ్చు.

4. 3. 1. 2. శ్రీమహాలక్ష్మి గర్వభంగం కథ

వైకుంఠపురంలో ఒకనాడు శ్రీమహావిష్ణువు మహాలక్ష్మితో జూదం ఆడాలని అనుకున్నాడు. వారి ఆటకోసం ఒక దివ్యకాంత పగడపు పలక, రత్నాలసారెలు, బంగారు పాచికలు తీసుకువచ్చింది. మహావిష్ణువు తనతో ఆడమని మహాలక్ష్మిని జూదానికి పిలిచాడు. తాను ఓడితే కౌస్తుభమణి ఇస్తానని, ఆమె ఓడితే చూడారత్నాన్ని ఇవ్వాలనే పందెంతో ఆటను ప్రారంభించారు. జూదంలో విష్ణువు గెలవాలని భూదేవి కోరుకుంది. లక్ష్మీదేవి గెలవాలని దివ్యకాంతలు కోరుకున్నారు. సరస్వతి వారిద్దరి గెలుపునూ కోరుకుంది. వినోదం కోసం మొదలుపెట్టిన జూదం సగానికి రాగానే, గెలవాలనే తపనతో ఒకరి మీద మరొకరికి పంతం కలిగింది. జూదం ఎంతటి మంచివారినైనా శత్రువులను చేస్తుంది. జూదం వల్ల తండ్రీకుమారుల మధ్య, గురుశిష్యుల మధ్య కూడా సద్భావం నశిస్తుంది. జూదం వల్ల ధనకాంక్ష, మత్సరం కలిగి కోపకారణ మవుతుంది. ఒక్కోసారి జూదం వల్ల ప్రాణనష్టం కూడా కలుగుతుంది. విష్ణువు జూదంలో ఓడిపోతే లక్ష్మీదేవి మనస్సు ఎలా ఉంటుందో తెలియాలని మాయ చేశాడు.

లక్ష్మీదేవి విష్ణువు చేసిన మాయవల్ల జూదంలో ఓడిపోయింది. భూదేవి లక్ష్మిని చూసి నవ్వింది. దేవకాంతలు తమదేవి ఓటమికి సిగ్గుపడ్డారు. సరస్వతి మౌనంగా ఉండిపోయింది. విష్ణువు పరిహాస మాడినాడు. లక్ష్మీదేవికి ఓటమి వల్ల కలిగిన అవమాన భారంతో ముఖమంతా చెమరించింది. లక్ష్మీదేవి తన ఓటమికి ధర్మదేవతను నిందించింది. తర్వాత లక్ష్మీదేవి పాచికలు తీసి చూడగా, అవి నాలుగు వైపులా విష్ణువు ఆటకు సరిపోయేలాగ ఉన్నాయి. దానికి లక్ష్మీదేవి విస్మయంచెంది, అది విష్ణువు కల్పించిన మాయ అని గ్రహించి కోపంతో అతడిని జూదగాడని దూషించింది. లక్ష్మీదేవి తనను విష్ణువు కపటోపాయంతో ఓడించడాన్ని భరించలేకపోయింది. తన చుడారత్నాన్ని భూదేవికి ఇవ్వాలనే విష్ణువు ఇంత మోసాన్ని కల్పించాడని నిందిస్తూ, రత్నాకరుడి కుమార్తె అయిన తనకు చూడారత్నం ప్రియంకాదని అన్నది. లక్ష్మీదేవి ఆవేశంతో అల్పులు, మూఢులైన దేవతలు, రాక్షసులు, మానవులను వంచించే విష్ణుమాయ ఆమెను భ్రమించలేదని పలికింది.

లక్ష్మీదేవి విష్ణువుతో లోకంలోని అన్ని మాయల కంటే తన మాయే గొప్పదని పలికింది. విష్ణుమాయను చులకన చేసి, బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలకు ఆమె మాయ వల్లనే పదవులు, సంపదలూ కలిగాయని పలికింది. లక్ష్మీదేవికి భూదేవి ముందు కలిగిన ఓటమి వల్ల ఈర్ష్య జనించింది. ఆ ఈర్ష్య నుంచి కలిగిన విషాద క్రోధాలు ప్రేరేపించగా లక్ష్మీదేవి తన మాయను విష్ణువుకు చూపించాలని వైకుంఠపురాన్ని శూన్యంగా మార్చింది. లక్ష్మీదేవి చేసిన ఈ దుశ్చర్యకు విష్ణువు మనస్సులో కోపించినా, దాన్ని పైకి కనిపించనీయకుండా ఆమెను తన మాయతో మోసపుచ్చాలని భావించాడు.

విష్ణువు లక్ష్మీదేవిని అనునయిస్తున్నట్లుగా నటించి, సర్వమంగళాధి దేవత అయిన ఆమె కోపాన్ని లోకాలు భరించలేవని అన్నాడు. వినోదం కోసం ఆడిన ఆట ఇంత చేటును కలిగించిదని పలికి, విష్ణువు లక్ష్మీదేవికి తన కౌస్తుభమణిని అలంకరించాడు. శూన్యమైన వైకుంఠంలో ఉండరాదని విష్ణువు లక్ష్మీదేవిని క్షీరసముద్ర తీరానికి విహారానికి తీసుకువెళ్ళాడు.

అక్కడ లక్ష్మీదేవి భూదేవి, సరస్వతి, దేవకాంతలతో కలిసి విహరిస్తుండగా విష్ణువు మాయమైనాడు. సతి అయినా, సుతుడైనా, హితుడైనా గర్వంతో ప్రవర్తించినప్పుడు వారికి తగిన విధంగా హితవు చెప్పాలని విష్ణువు భావించాడు. దుర్మదానికి ఆశ్రయమైన సంపద చేత లక్ష్మీదేవి గర్వించింది కాబట్టి విష్ణువు మాయాలక్ష్మిని కల్పించాడు. లక్ష్మీదేవి శూన్యం గావించిన వైకుంఠపురాన్ని ప్రకాశింపజేశాడు. విష్ణుమాయా ప్రభావంతో లక్ష్మీదేవి తన దివ్యత్వాన్ని మరిచి, ప్రాకృతకన్య లాగ వనంలో తిరుగుతూ ఒక పాడుబడిన కొలనును చూసింది. లక్ష్మీదేవి ఆ కొలను మధ్యలో వాడిపోయిన ఒక బంగారు తామర కర్ణిక మీద ప్రభమాసిన ఒక దేవతను చూసింది. లక్ష్మీదేవి కొలనులో ఉన్న మాయాలక్ష్మిని చూసింది. ఆమె భూదేవి, పార్వతి, సరస్వతి, శచీదేవిలకన్నా, తనకన్నా కూడా లోకోత్తరమైనదని భావించింది. లక్ష్మీదేవి మాయాలక్ష్మికి కలిగిన దురవస్థకు జాలిపడి, ఆమె వృత్తాంతం తెలుసుకోవాలని వేచి చూసింది. మాయాలక్ష్మి తన యోగాన్ని చాలించి ఎదురుగా ఉన్న దేవకాంతలను చూసి వారంతా ఎవరని అడిగింది.

లక్ష్మీదేవి మాయాలక్ష్మిని పొగిడి, ఆమె వృత్తాంతాన్ని తెలుపమని కోరింది. మాయాలక్ష్మి తాను శ్రీమహావిష్ణువుకు ప్రియకాంత అయిన శ్రీమహాలక్ష్మినని తెలిపింది. విష్ణుమాయను చులకన చేసినందువల్ల ఆమెకు ఈ రూపం కలిగిందని చెప్పింది. విష్ణు మహిమను గుర్తించకుండా 'ఎక్కిన వానికి ఏనుగు గుజ్జు' అనే విధంగా ప్రవర్తించినందువల్ల తనకు ఈ దురవస్థ కలిగిందని మాయలక్ష్మి లక్ష్మీదేవితో చెప్పింది. ఒక కల్పాది కాలంలో సృష్టి నిర్మాణశక్తి కోసం బ్రహ్మ, శివుడు విష్ణువును గురించి తపస్సు చేశారు. విష్ణువు వారిద్దరూ ఒకే వరాన్ని కోరుతున్నారని భావించి ఊరుకున్నాడు. మాయాలక్ష్మి మాత్రం వారిద్దరికీ వరమిచ్చే శక్తి లేకనే విష్ణువు మిన్నకున్నాడని రాజసంతో భావించింది. మాయాలక్ష్మి విష్ణువును చులకన చేసి, అహంకారంతో వెళ్ళి బ్రహ్మ రుద్రులను వరం కోరుకోమన్నది. బ్రహ్మ తనకు సృష్టి నిర్మాణ విద్యను, సంపద విద్యనూ ప్రసాదించమని కోరాడు. మాయాలక్ష్మి ఆ వరాన్ని ఇచ్చింది. తర్వాత శివుడు కూడా అదే వరాన్ని అడిగాడు. మయాలక్ష్మి గర్వంతో అతడికి కూడా వరాన్ని ఇచ్చింది. మాయాలక్ష్మి దుర్మదంతో చేసిన పొరపాటు వల్ల ఆ వరం బ్రహ్మ దగ్గర, శివుడి దగ్గరా ఉండలేక చంచలంగా తిరగసాగింది. విష్ణుమాయ స్త్రీ రూపంతో వచ్చి, దుర్మదంతో వరమిచ్చిన మాయాలక్ష్మిని తులనాడింది. రాజస, తామస గుణాలతో విర్రవీగి, విష్ణు

మహిమను చులకన చేసినందుకు మాయాలక్ష్మిని శపించింది. విష్ణుమాయ మాయాలక్ష్మితో ఫలపుష్పకుసుమ పరాగంతో, శుక భ్రమరాలతో నిండికుండా శిధిలమైన తపోవనంలో తపస్సు చేయమని శాపం ఇచ్చింది. ఆ వనం ఎప్పుడు వికాసాన్ని పొందుతుందో అప్పుడే మాయాలక్ష్మికి విమోచనం కలుగుతుందని తెలిపింది.

ఈ విధంగా మాయలక్ష్మి తన వృత్తాంతాన్ని వినిపించగానే, ఆమెకు శాప విమోచనం కలిగింది. దేవతలు అందరూ వచ్చి, పుష్పకవిమానంలో మాయాలక్ష్మిని వైకుంఠానికి ఆహ్వానించారు. ఈ సంరంభాన్ని అంతా చూస్తున్న లక్ష్మీదేవి తనలో బ్రహ్మాది దేవతలు వచ్చి ఆమె ముందే మాయాలక్ష్మిని కీర్తిస్తున్నారని ఆశ్చర్యపోయింది. తాను కాకుండా మరొక లక్ష్మి, విష్ణువు ఎలా ఉంటారని ఆమె సందేహించింది. లక్ష్మీదేవి విభ్రాంతితో చూస్తుండగానే మాయాలక్ష్మి ఆమె తేజస్సును హరించి, భూదేవి, సరస్వతి, దేవకాంతలను వెంట తీసుకువెళ్ళింది. లక్ష్మీదేవి తన తేజం నశించగా నిర్వేదంతో, ఒంటరిగా ఆ వనంలో తిరిగి తిరిగి అలిసిపోయి భర్త ఎడబాటును తలచుకొని దుఃఖించింది. లక్ష్మీదేవి ఏ విధంగానైనా వైకుంఠపురం చేరుకొని తన కష్టాలన్నీ విష్ణువుకు తెలిపి, ఆ తర్వాత దేహాన్ని వదిలిపెట్టాలని నిర్ణయించుకుంది. లక్ష్మీదేవి విష్ణుమాయా మోహానికి తగుల్కొని విభ్రాంతితో, మాయాలక్ష్మి వైభవాన్ని, దివ్యకాంతలు వదిలివెళ్ళడాన్ని తలచుకొని విచారించింది. వైకుంఠాన్ని సమీపించిన లక్ష్మీదేవి దాని వైభవానికి విస్మయం చెందింది. తాను శూన్యం చేసిన నగరాన్ని ఇంత వైభవోపేతం చేసిన మహానుభావులు ఎవరో అని లక్ష్మీదేవి ఆశ్చర్యపోయింది.

వైకుంఠపురకాంతలు చెప్పగా లక్ష్మీదేవి నగరంలో విష్ణువు మాయాలక్ష్మితో కలిసి ఉన్నాడని తెలుసుకుంది. ఇక విష్ణువు ముందు వెళ్ళడం అసంభవమని భావించి, లక్ష్మీదేవి నిట్టూరుస్తూ తిరిగి ఉద్యానవనంలోనికి వెళ్ళింది. లక్ష్మీదేవి మాయాలక్ష్మి తపస్సు చేసిన శిధిలమైన కొలను చేరుకుని, బంగారు తామర పీఠంపై కూర్చుని మహావిష్ణువును ధ్యానించింది. మహావిష్ణువు లక్ష్మీదేవి పశ్చాత్తాపానికి ప్రసన్నుడై, తన మాయా విలాసాన్ని ఉపసంహరించాడు. శ్రీమహాలక్ష్మి కనులు తెరిచి చూసే సరికి వైకుంఠపురంలో శ్రీమహావిష్ణువు ఒడిలో కూర్చొనిఉంది. దేవతలు పుష్పవర్షం కురిపించగా, లక్ష్మీదేవికి జరిగినదంతా విస్మయాన్ని కలిగించింది. లక్ష్మీదేవి తన తప్పులు మన్నించమని మహావిష్ణువును ప్రార్థించింది. ఈ విధంగా మహాలక్ష్మి విష్ణుమాయ వలన గర్వభంగాన్ని పొందింది.

ఈ కథ శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో వినోదం కోసం జూదమాడటానికి ఉపక్రమించడంతో మొదలవుతున్నది. వినోదార్థంగా మొదలుపెట్టిన ఈ జూదం, లక్ష్మీదేవి ఆవేశంతో వైకుంఠపురాన్ని శూన్యం చేసేంత అనర్థాన్ని కలిగించింది. సప్తమ వ్యసనమైన జూదం ఎంత సజ్జనులనైనా దుర్మార్గులుగా చేస్తుందనడానికి ఈ సంఘటన

ఒక నిదర్శనం. జూదంలో పందెంగా కౌస్తుభ మణిని, చూడారత్నాన్ని ఉంచడం, భూదేవి భర్తవైపు, దేవకాంతలు లక్ష్మివైపు చేరడం ఈ ఆటను వినోదం నుంచి పంతంవైపు తీసుకెళ్ళింది. ఈ పంతమే ఓడిపోయిన లక్ష్మీదేవికి ఆవేశాన్ని కలిగించింది. భూదేవి ముందు ఓడిపోడం లక్ష్మీదేవికి అవమానం కలిగిస్తే, భూదేవి నవ్వడం, విష్ణువు పరిహసించడం వల్ల ఆ అవమానం తీవ్రరూపం దాల్చింది. లక్ష్మీదేవి రత్నాకరుని కూతురు కావడం వల్ల ఆమెకు సంపద గర్వం ఉంది. ఆ గర్వానికి ఈ ఓటమి తోడయ్యింది. లక్ష్మీదేవికి తాను విష్ణుమాయ వల్ల ఓడిపోయానని తెలియగానే ఆమెలోని గర్వం అతిశయించింది. లక్ష్మీదేవి విష్ణువును, అతని మాయనూ నిందించి, లక్ష్మీదేవి తన మాయను పొగుడుకున్నది. అంతటితో ఆగకుండా తన మాయా ప్రభావాన్ని ఆ భర్తకు చూపించాలని వైకుంఠాన్ని శూన్యమయం చేసింది.

విష్ణువు లక్ష్మీదేవిని సముద్ర తీరానికి తీసుకువెళ్లి, అందులోని విశేషాలను చూపించడం, వన విహారం ఇవన్నీ ఆమెను ఏమార్చడానికి చేసిన ప్రయత్నాలు. లక్ష్మీదేవి ఆవేశాన్ని శాంతింపజేసి, ఆమె ఆనందంలో మునిగి ఉన్నప్పుడు మాయామోహంలో తగుల్కొనేలా చేయాలని మహావిష్ణువు భావన. శోభాహీనమైన కొలను, మాయలక్ష్మి కల్పన ఇవన్నీ లక్ష్మీదేవికి గర్వభంగం కలిగించడంలోని అంతర్భాగాలు. లక్ష్మీదేవికి ఆమె అశక్తతను తెలియజేయడానికే మాయలక్ష్మి ఆమె తేజస్సును హరించింది. ఉద్యానవనంలో లక్ష్మీదేవి ఒంటరిగా పడిన అవస్థలు అన్నీ ఆమె అహంకారాన్ని నశింపజేయడానికి కల్పించిన ఏర్పాట్లుగా తెలుస్తుంది. వైకుంఠపురకాంతలతో సంభాషణ లక్ష్మీదేవికి హృదయ శల్యమైంది. మాయాలక్ష్మి తపస్సు చేసిన కొలనులోనే లక్ష్మీదేవి కూడా తపస్సు చేయడం ఆమెలో కలిగిన పశ్చాత్తాపానికి నిదర్శనంగా చెప్పవచ్చు. లక్ష్మీదేవికి సంపదవల్ల కలిగిన అహంకారాన్ని తొలగించడంతోపాటుగా, ఆమెకు విష్ణుమాయా మహిమను తెలియజెప్పడం కూడా ఈ కథలోని పరమార్థంగా మనకు కనిపిస్తుంది.

4.3.1.3. బ్రహ్మ గర్వభంగం కథ

ప్రళయం వల్ల లోకమంతా నీట మునిగి, గాఢాంధకారం నిండిపోయింది. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు లోకాలన్నింటినీ తనలో నిలుపుకొని ఏకాంతంగా మున్నీటిమీద ఆదిశేషుడిపై శయనించి ఉన్నాడు. కొంతకాలం గడిచిన తర్వాత విష్ణువు నాభికమలం నుంచి బంగారుకాంతితో బ్రహ్మదేవుడు జన్మించాడు. బ్రహ్మ శ్రీమహావిష్ణువుకు చేతులు జోడించి వినయ విధేయలు ఉట్టిపడగా అనేక విధాలుగా కీర్తించాడు. బ్రహ్మ భక్తికి మెచ్చి అతడికి విష్ణువు సృష్టినిర్మాణకార్యానికి తగిన సాధన సామాగ్రిని అనుగ్రహించాడు. విష్ణువు ప్రసాదించిన వరం వల్ల బ్రహ్మదేవుడు పద్మజాండాన్ని కల్పించి, దానిని నీటి మీద తేలేలాగ చేశాడు. ఆ తర్వాత ఆకాశం,

వాయువు, అగ్ని, నీరు, భూమి అనే ఐదు పంచభూతాలను ఒకదాని నుంచి మరొకదాన్ని కల్పించాడు. భూమి మొదలుకొని పద్నాలుగు ఊర్ధ్వ, అధోలోకాలను నిర్మించాడు. ఆకాశంలో వెలిగేలాగ సూర్య చంద్రులను కల్పించాడు. ఆకాశంలో నక్షత్రాలను నిలిపాడు. లోకాలన్నింటిలోనూ ప్రాణులను సృష్టించాడు.

విష్ణుమాయా ప్రభావంతో భ్రాంతి చెందుతూ లోకాలన్నీ విలయాన్ని, వృద్ధినీ సమంగా పొందుతున్నాయి. లోకంలోని జీవులన్నీ సత్త్వరజస్తమో గుణాలు కలిగి, అహంకార, మదమాత్సర్యాలతో జీవనం సాగిస్తున్నాయి. బ్రహ్మదేవుడు తన సృష్టిని చూసుకొని రాజసగుణంతో, తనవంటి దైవం ముల్లోకాలలోనే లేడని అహంకరించాడు. దేవతలు, మునులు, దిక్పాలకులు మొదలైన వారందరూ చేరి సత్యలోకంలో బ్రహ్మదేవుడిని స్తుతించగా ప్రమత్తుడై లోకంలో తనను మించిన దైవం లేడని పలికాడు. బ్రహ్మ తనవంటి మనోనిగ్రహం గల దైవం ఎవరూ లేరని, బ్రహ్మాండాన్ని సృష్టించడం అతడికి మాత్రమే సాధ్యమనీ ప్రగల్భాలు పలికాడు. బ్రహ్మ మాటలు వింటున్న మార్కండేయ మహర్షి అతన్ని వారించి, లోకనాయకుడైన విష్ణువును విస్మరించి నిన్నగాక మొన్న జన్మించిన బ్రహ్మ తాను అధికుడని పలకడం అవివేకమని అన్నాడు. బ్రహ్మ చేసుకున్న పూర్వ జన్మ పుణ్యఫలం వల్లనే అతనికి మహావిష్ణువు నాభికమలంలో జన్మించే అదృష్టం కలిగిందని, దానిని మరిచి దురభిమానంతో ప్రవర్తించ వద్దని మార్కండేయమహర్షి హితవు చెప్పాడు.

బ్రహ్మ సభలో తనను మార్కండేయుడు ఎదిరించడాన్ని సహించలేక, మత్సరంతో విష్ణువును నిందించాడు. విష్ణువు సమర్థుడైతే తానే బ్రహ్మాండాన్ని సృష్టించవచ్చు కదా అన్నాడు. బ్రహ్మ దారువు నుంచి పుట్టిన అగ్ని ఆ దారువునే దహించగలిగేంత శక్తి కలిగిందని, తాను కూడా విష్ణువు నాభీకమలం నుంచి జన్మించినంత మాత్రాన పౌరుషం లేని వాడిని కాదని మార్కండేయుడితో వాదించాడు. మార్కండేయుడు విష్ణువుతో బ్రహ్మను పోల్చడం, ఎనుగుకు దోమకూ పోలిక చేయడం వంటిదని అన్నాడు. విష్ణువు నాభికమలం నుంచి అంతకు పూర్వం అనేక మంది బ్రహ్మలు జన్మించి, నశించారని అన్నాడు. మార్కండేయుడు బ్రహ్మకు విష్ణుమాయా మహిమను తెలిపాడు. బ్రహ్మ పుట్టకముందు ప్రళయం సంభవించి లోకాలన్నీ నీటిలో మునిగిపోయాయి. ఆ సమయంలో మార్కండేయుడు ఒక్కడే నీటిలో ఈదుతూ, మునుగుతూ వటపత్ర శాయిగా ఒంటరిగా ఉన్న ఒక బాలుడిని చూసి విస్మయం చెందాడు.

మార్కండేయుడు శివుడు ఎక్కడున్నాడని అడగగా, ఆ బాలుడు తన నోటిలో చూడమన్నాడు. ఆ బాలుని నోటిలోకి ప్రవేశించి మార్కండేయుడు సమస్తలోకాలను చూసి, శివుడిని పూజించి వెలుపలికి వచ్చాడు. అక్కడ మార్కండేయుడికి శ్రీమహావిష్ణువు కనిపించి, శివుని దర్శనం చేసుకున్నావా అని అడిగాడు. మార్కండేయుడు లోకాలన్నిటినీ

చూశానని తెలుపగా, విష్ణువు అతడికి శివుడిని సేవించమని చెప్పాడు. అప్పటి నుంచి మార్కండేయుడు శివుడిని పూజించి మృత్యువును గెలిచినట్లుగా బ్రహ్మసభలోని వారికి తెలిపాడు. మార్కండేయుడు బ్రహ్మకు కనువిప్పు కలిగించాలని పుండరీకుని కథను చెప్పాడు. మహా భక్తుడైన పుండరీకుడు విష్ణుమాయను సందేహించి, విష్ణుమాయ చేత మోసపుచ్చబడినాడని తెలిపాడు. మార్కండేయుడు విష్ణుమాయను అల్పంగా చూడవద్దని బ్రహ్మకు హితవు పలికాడు. రాజసగుణంతో అహంకరించిన బ్రహ్మ మార్కండేయుడి మాటను పెడచెవినపెట్టి విష్ణుమాయను అతనిపైకి మళ్ళించమని చులకనగా మాట్లాడాడు. బ్రహ్మ విష్ణుమాయను నిందించి, సృష్టినిర్మాణ కార్యాన్ని నివారించి, తపస్సు చేయడానికి మందర పర్వతానికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ వెళ్ళగానే లోకాలన్ని అంధకారంతో తల్లడిల్లిపోయాయి. మార్కండేయుడు ప్రార్థించగా విష్ణువు లోకాలకు యథాస్థితిని కల్పించాడు. విష్ణువు బ్రహ్మ గర్వాన్ని భంగపరిచి, ఆ తర్వాత లోకాలకు ఆనందం కలిగిస్తానని మార్కండేయుడితో చెప్పాడు.

బ్రహ్మ మందర పర్వతం మీద ఒక గుహను కల్పించి, దానిలో ఒక సరస్సు, మందార వనాలు ఏర్పరిచాడు. ఏకాంతంగా బ్రహ్మ ఆ వనంలో పదివేల దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. విష్ణువు తన మాయాప్రభావంతో ఆ గుహలో ఒక మేడను కల్పించి, అందులో మాయాసరస్వతిని నిలిపినాడు. బ్రహ్మకు తపోభంగం కలిగించడానికి మాయాసరస్వతి శృంగార చేష్టా విలాసాలను ప్రదర్శించింది. బ్రహ్మ మాయా ప్రభావితుడై ఎదురుగా ఉన్న మాయాసరస్వతిని తన కులపాలికగా భ్రమించాడు. ఆమె శృంగార విలాసానికి బ్రహ్మ కామాతురుడై కొన్ని వేల సంవత్సరాలు మాయాసరస్వతితో సంభోగించాడు. బ్రహ్మ రతి పారవశ్యంలో ఉండగా ఒకనాడు మాయాసరస్వతి మాయమైంది. మాయాసరస్వతిని వెదుకుతూ బ్రహ్మ సంభోగ చిహ్నాలతో దీనుడై గుహ వెలుపలికి వచ్చాడు. అక్కడ మందరగిరి మునులు ఎదురవగా బ్రహ్మ లజ్జ, దైన్యంతో విచారించాడు. మార్కండేయుడు బ్రహ్మతో మాయాసరస్వతి వృత్తాంతమంతా విష్ణుమాయా కల్పితమని చెప్పాడు. మార్కండేయుడు హితబోధ చేయగా, బ్రహ్మ పశ్చాత్తాపంతో అతడి అపరాధాన్ని మన్నించమని విష్ణువును ప్రార్థించాడు. బ్రహ్మ పశ్చాత్తాపానికి, భక్తి తాత్పర్యానికి సంతృప్తుడై విష్ణువు విశ్వరూప దర్శనం కలిగించాడు. బ్రహ్మ మహావిష్ణువును అనేక విధాలుగా కీర్తించాడు. విష్ణువు అనుగ్రహంతో బ్రహ్మ తిరిగి తన పూర్వపు స్థితిని పొందాడు.

ఈ కథలో విష్ణువు అనుగ్రహించిన వర ప్రభావం వల్లనే బ్రహ్మకు గర్వం కలిగిందని తెలుస్తుంది. విష్ణువు నాభీకమలం నుంచి జన్మించినప్పుడు బ్రహ్మలో కనిపించే వినయ విధేయతలు, సృష్టి నిర్మాణాన్ని పూర్తి చేసేటప్పటికి కనుమరుగుయ్యాయి. వాటి స్థానంలో రాజసతామస గుణాలు పుట్టుకొచ్చాయి. సృష్టినిర్మాణాన్ని సమర్థంగా

పూర్తి చేయడమనే లోకైక కార్యసాధన వల్ల బ్రహ్మకు గర్వం కలిగింది. దేవతలు, మునులు చేసిన స్తుతులు ఆ గర్వాన్ని మరింతగా ఉద్దీపింపజేశాయి. ఇలాంటి ప్రమత్త స్థితిలో మార్కండేయుడు చేసిన హితబోధ బ్రహ్మకు గర్వోద్ధతిని కలిగించింది. అందుచేతనే విష్ణువును, విష్ణుమాయను కూడా చులకన చేసి విష్ణునింద చేశాడు. బ్రహ్మ తన మహత్తును మార్కండేయుడికి, లోకానికి చూపించాలనే దుర్మదంతో సృష్టి నిర్మాణాన్ని నిరోధించాడు. మార్కండేయుడి హితబోధ వల్ల బ్రహ్మ అదుపులేని ఆవేశంతో ఈ దుశ్చర్యకు పాల్పడినాడు. సృష్టికర్తనని గర్వించిన బ్రహ్మకు అతని యోగాన్ని, పంతాన్ని మాన్పించి కామాతురుడిగా చేయడానికి మాయాసరస్వతి కల్పించబడింది. మాయాసరస్వతి కల్పన ద్వారా బ్రహ్మకు గర్వభంగం కలిగించడం, అతడి కామానికి కళంకం లేకుండా చేయడం అనేది అంతరార్థంగా కనిపిస్తుంది. బ్రహ్మ కామోన్మాదంతో మాయాసరస్వతి కోసం వెతకడం, దైన్యత, దుఃఖం ఇవన్నీ అతడి భంగపాటుకు చిహ్నాలు. మార్కండేయుని బోధను విని, విష్ణువును ప్రార్థించడం, అతని పశ్చాత్తాపానికి నిదర్శనం. ఈ విధంగా ఈ కథలో బ్రహ్మ గర్వభంగం వర్ణించబడిందని తెలుస్తుంది.

4.3.1.4. శివగర్వ భంగం కథ

దేవతలు, రాక్షసులు కలిసి మహావిష్ణువు అనుమతితో అమృతం కోసమని క్షీరసముద్ర మథనం చేశారు. క్షీరసముద్రం నుంచి మొదట కాలకుట విషం పుట్టింది. దేవతలు, రాక్షసులు ప్రార్థించగా శివుడు ఆ విషాన్ని గ్రహించి, లోకాలను కాపాడాడు. క్షీరసాగర మథనంలో కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం మొదలైన వస్తువులు వెలువడ్డాయి. ఆ వస్తు సంచయంతో పాటుగా జన్మించిన మహాలక్ష్మిని, తులసిని శ్రీమహావిష్ణువు గ్రహించాడు. చివరగా ధన్వంతరి అమృతభాండంతో కనిపించాడు. రాక్షసులు అమృతాన్ని సంగ్రహించి వేరేచోటుకు వెళ్ళిపోయారు. దేవతలు రాక్షసుల భయంవల్ల శ్రీమహావిష్ణును ప్రార్థించారు. రాక్షసులను మోసపుచ్చడానికి విష్ణువు మాయామోహినిగా అవతరించాడు.

మాయా మోహిని తన రూపసౌందర్యంతో రాక్షసులను మోహవివశుల్ని చేసింది. విష్ణుమాయా మోహితులై రాక్షసులు అమృతకలశాన్ని మోహిని చేతికిచ్చారు. మోహిని దేవతలను, రాక్షసులను వేర్వేరు బంతులుగా కూర్చి, ముందుగా దేవతలకు అమృతాన్ని వడ్డించడం మొదలు పెట్టింది. రాక్షసులకు తన శృంగార చేష్టావిలాసాలతో మరులు కలిగించి, ప్రమత్తుల్ని చేసింది. రాహు కేతువులు అనే రాక్షసులు మాయా రూపాలు ధరించి, దేవతల వరుసలో కూర్చుని అమృతాన్ని పొందారు. మోహిని తన ఏమరుపాటును సూర్య చంద్రులు చెప్పక ముందే గ్రహించి, రాహుకేతువుల తలలు చక్రంతో ఖండించింది. అమృత కలశాన్ని ఇంద్రుడికి ఇచ్చి, మోహిని విష్ణువుగా మారి వైకుంఠం చేరుకుంది. రాక్షసులు జరిగిన మోసాన్ని గ్రహించి దేవతలతో యుద్ధానికి తలపడ్డారు.

అమృతపానం వల్ల దేవతలు జయించగా, రాక్షసులు పారిపోయారు. ఈ వృత్తాంతాన్ని వినిపించి శివుడికి ఆశ్చర్యం కలిగించాలని, నారదుడు కైలాసానికి బయలు దేరాడు. శివుడు నారదుడిని చూసి, సముద్ర మథనంలో కాలకూట విషం తర్వాత ఏం జరిగిందని అడిగాడు. కలహ ప్రియుడైన నారదుడు శివునితో విష్ణువు మోహిని రూపంతో, రాక్షసులను మోసపుచ్చి, అమృతాన్ని దేవతలకు పంచాడని చెప్పాడు.

మాయామోహిని సౌందర్యానికి రాక్షసులు, దేవతలు కూడా మోహవివశులయ్యాని చెప్పి, మోహినిని చూస్తే శివునికి కూడా మోహం కలుగుతుందని అన్నాడు. శివుడు నారదుని మాటలకు రోషించి, నిజానిజాలు తెలుసుకోవడానికి వైకుంఠం వెళ్ళాలని పార్వతితో అన్నాడు. పార్వతి శివుడితో ముల్లోకాలూ విష్ణువు ఆధీనంలో ఉన్నాయని, శివుడు మోహినిని చూశాక మదన పరవశం పొందకుండా ఉండగలిగితే వైకుంఠానికి వెళ్ళమని చెప్పింది. శివుడు పార్వతితో ఇంద్రియాలను జయించిన అతడి ఆధీనంలోనే మనస్సు కూడా ఉంటుందని అన్నాడు. నారదుడు శివుడికి రోషం కలిగించాలని, మోహిని శృంగార చేష్టలను చూస్తే శివుడు కూడా వెర్రివానిలాగ తిరుగుతాడని మేలమాడినాడు. శివుడు నారదుడి మాటలు కల్లలు చేయాలని నిర్వికారమైన రూపాన్ని ధరించి, పార్వతితో కలిసి వైకుంఠానికి బయలు దేరాడు. నారదుడు శివుడి ముందు దారి చూపుతుండగా, ప్రమథగణాలు రెండు వైపులా చేరి సేవించారు. శివుడి నిగ్రహశక్తిని, విష్ణుమాయా ప్రభావాన్ని చూడాలని సూర్యచంద్రులు మొదలైన దేవ, ముని సమూహాలు వైకుంఠానికి బయలు దేరాయి.

శివుడు సకల సంపదలతో విరాజిల్లుతున్న వైకుంఠపురాన్ని చేరుకున్నాడు. విష్ణువు ద్వారపాలకుల వలన శివపార్వతులు వచ్చారని తెలిసి, ఎదురు వెళ్ళాడు. ఆ పురాణదంపదులను ఒక భద్రపీఠంపై కూర్చోబెట్టి ఉచితరీతిగా సత్కరించాడు. లక్ష్మీదేవి వచ్చి, పార్వతిని కౌగిలించుకొని, ఆమె సమీపంలోనే కూర్చుంది. శివుడు విష్ణువుతో నారదుడితో తనకు కలిగిన పంతాన్ని చెప్పి, మాయామోహిని రూపాన్ని చూపించమని అడిగాడు. శివుడు విష్ణువుతో తనను నారదుడు చులకన చేసి మాట్లాడిన విషయాన్ని తెలిపాడు. ప్రమథులు అహంకరించి నారదుడిని నిందించి, శివుడి మహిమను పొగిడారు. నారదుడి మాటలకు శివుడు దర్పంతో, ప్రమథులు గర్వంతో పలికిన మాటలు విని విష్ణువు ఎలాగైనా వారిని మోసపుచ్చాలని అనుకున్నాడు. లేకుంటే ప్రమథుల చేత నారదుడికి అవమానం తప్పదని భావించాడు. విష్ణువు నయోక్తులతో శివుడి పంతాన్ని విడిచిపెట్టమని కోరాడు.

మోహినిని వేరొక ఏకాంత సమయంలో చూపుతానని శివుడికి మాట ఇచ్చాడు. నారదుడు విష్ణుమాయను పొగడగా, శివుడు పంతంతో మోహినిని చూపమని కోరాడు. శివుడి దర్పాన్ని భంగ పరచాలని భావించి విష్ణువు మాయా మోహినిగా మారాడు.

శివుడుమోహినిని చూడగానే మదన వికారానికి లోనయ్యాడు. కోటి చంద్రబింబాలు ఒక చోట నిలిచినట్లుగా ఎదురయిన మోహినిని చూసి శివుడికి కామవికారం కలిగింది. శివుడు మోహ విభ్రాంతితో మాయామోహిని అందాన్ని పొగుడుతూ, నారదుడితో కలిగిన పంతాన్ని మరిచాడు. శివుడి ముందే ఆ సభామందిరం శృంగారవనంగా మారింది. శృంగారవనంలో ఒంటరిగా ఉన్న మోహినిని పట్టుకోవాలని శివుడు వెంటపట్టాడు. మోహిని శివుడి కనుల ముందే మాయమైంది. మోహభ్రాంతుడైన శివుడు మోహిని కనిపించలేని శృంగార వనంలో వెర్రివానిలాగ పరిభ్రమించాడు. మాయామోహిని శివుడికి ఊయల ఊగుతూ కనిపించి, అతడు సమీపించగానే మాయమైంది. మోహిని జలకాలాడుతూ శృంగార చేష్టలతో శివుడికి మోహం కలిగించి మళ్ళీ అదృశ్యమైంది. ఈ విధంగా మోహిని శివుడిని తన శృంగార విలాస చేష్టలతో మరులుకొలిపి, విరహోన్మత్తుడిని చేసింది. మోహిని కనిపించలేదని శివుడు నిర్వేదంతో విలపిస్తూ, పొదరింటిలో సురతోద్యుక్త రూపంతో ఉన్న మోహినిని చూశాడు.

శివుడు మోహినితో దీనంగా మన్మథుని బారినుంచి తనను కాపాడుమని వేడుకున్నాడు. మోహినిని చూసి శివుడు మట్టుమీరిన తమకంతో కౌగిలించుకొన్నాడు. శివుడికి సుఖపారవశ్యంతో శుక్లపతనం జరిగి, శివుని తేజం భూమిపై ప్రవహించి బంగారం, వెండిగా మారింది. విష్ణుమాయా ప్రభావం తొలగగానే మోహిని విష్ణువుగా మారింది. శివుడికి పరబ్రహ్మ జ్ఞానం కలిగింది. శివుడు మాయామోహిని విష్ణుమాయా కల్పితమని తెలుసుకొని విష్ణువును కీర్తించాడు. నారదుడు తన పంతం నెగ్గిందని ఆనందంతో నాట్యం చేశాడు. శివుడు పార్వతీ సమేతంగా కైలాసానికి తిరిగి వెళ్ళాడు. ఈ కథలో శివుని దర్పానికి, పంతానికి నారదుడి కలహపు మాటలే కారణమని తెలుస్తుంది. నారదుడు విష్ణువు మోహినీ లీలను శివుడికి కుతూహలం కలిగేలాగ, ప్రమథులకు కోపం కలిగేలాగ చెప్పాలనే ఉద్దేశ్యంతోనే కైలాసానికి వచ్చాడు.

నారదుడు మోహినీ సౌందర్యాన్ని శివుడి ముందు ఉత్కర్ష చేయడంలో, శివుడి ఇంద్రియ నిగ్రహ మహత్వాన్ని లోకానికి వెల్లడి చేయడమే అంతరార్థంగా కనిపిస్తుంది. మన్మథుడినే జయించిన ఇంద్రియ నిగ్రహం గలవాడు శివుడు. లోకాలకే మరులు కొలిపే జగదేక సౌందర్యం కలది మోహిని. విభిన్నమైన మానసిక ప్రవృత్తులు గల శివుడి నిగ్రహాన్ని, మోహిని సౌందర్యాన్ని ఒకచోట కలిపేందుకు నారదుడే కారణమైనాడు. నారదుడి లాంటి బ్రహ్మచారి చేత మోహినీ సౌందర్యాన్ని వర్ణింపజేయం వల్లనే శివుడికి ఉత్కంఠ కలిగింది. ఆ ఉత్కంఠను ఉద్దీంపజేయడానికే నారదుడు పార్వతి, ప్రమథుల సమక్షంలో శివుడి మహిమను చులకన చేశాడు. మోహినిని చూడగానే శివుడికి సాత్త్వికోదయం కలగడం, సభామందిరం శృంగారవనంగా మారడం, శృంగారవనంలో మోహిని విలాస చేష్టలు ఇవన్నీ అతడిని కామాతురుడిని

చేశాయి. శివుడి దర్పమంతా మోహిని వల్ల కలిగిన విరహంతో భంగమైంది. మోహిని కనిపించలేదని శివుడు దైన్యతను పొందడం, విలపించడం ఇవన్నీ శివుడి దర్ప నాశనానికి, కామ వివశతకూ నిదర్శనంగా కనిపిస్తున్నాయి. మోహినీ స్పర్శతో శివుడికి శుక్లపతనం కావడం శివదర్ప భంగానికి పరాకాష్టగా చెప్పుకోవచ్చు. మన్మథ దహనం తర్వాత శివుడికి కలిగిన దర్పాన్ని మోహినీ విలాసంతో భంగపరచడమే ఈ కథలోని పరమార్థంగా తెలుస్తుంది.

4.3.1.5. నారదగర్వభంగకథ

వైకుంఠంలో మహావిష్ణువు శ్రీదేవి, భూదేవులతో కొలువుదీరి ఉండగా, దేవకాంతలు చేరి వారిని సేవిస్తున్నారు. అలాంటి సమయంలో విష్ణుమాయ స్త్రీ రూపంతో మహావిష్ణువు కొలువుకు వచ్చింది. మహావిష్ణువు అనుమతితో విష్ణుమాయ సభలోని విష్ణుకాంతలకు వినోదం కలిగించడానికి ఇంద్రజాలాన్ని ప్రదర్శించడానికి సిద్ధపడింది. అప్పుడే నారదుడు విష్ణుమాయా ప్రభావితుడై, పూర్వ కర్మఫలాన్ని అనుభవించవలసినందు వల్ల వైకుంఠానికి వచ్చాడు. విష్ణుమాయ చేసిన ఇంద్రజాలాన్ని చూసి విష్ణుకాంతలు విస్మయంతో ఆనందించారు. వారు విష్ణుమాయను మెచ్చుకొని వివిధ రత్నాభరణాలను కానుకగా ఇచ్చారు. నారదుడు ఇదంతా చూసి విష్ణుమాయ చేసిన ఇంద్రజాలానికి శ్రీదేవి, భూదేవి వంటి అబలలు, ముగ్ధలు మెచ్చుకుంటారు గాని, ఆ మాయకు తాను భ్రమించనని గర్వంతో పలికాడు. నారదుడు విష్ణుమాయకు బ్రహ్మ, శివుడు కూడా మోసపోయారని, తాను మాత్రం భ్రమించలేదని ముల్లోకాలలో చాటుకున్నాడు. విష్ణువు ఇదంతా గమనించి, తనతో కలిగిన అతి పరిచయం వల్ల నారదుడు ఈ విధంగా గర్వించాడని భావించాడు.

విష్ణువు నారదుడి గర్వాన్ని భంగపరచాలని నిశ్చయించి, భూలోకంలో సర్వవరమనే క్షేత్రంలో ఒక ఆశ్రమాన్ని కల్పించాడు. దానికి సమీపంలో పుణ్యజలాలు గల ఒక సరస్సును ఏర్పరిచాడు. విష్ణువు కపటముని వేషాన్ని ధరించి, ఆశ్రమంలో తపస్సు చేయసాగాడు. నారదుడు విష్ణుమాయను జయించాననే గర్వంతో లోకసంచారం చేస్తూ, విష్ణుమాయా ప్రభావితుడై సర్వవర క్షేత్రానికి చేరుకున్నాడు. నారదుడు ఆశ్రమంలో ఉన్న మాయాముని మహిమను మెచ్చుకుని పొగిడాడు. మాయాముని నారదుడి ఘనతను కీర్తించినాడు. నారదుడు ఆ మాటలకు గర్వించి, విష్ణుమాయను జయించింది తాను ఒక్కడినే అని అన్నాడు. ఆకాశవాణి నారదుడి మాటలను వారించి, విష్ణుమాయకు భ్రమించిన బ్రహ్మ, రుద్రుల కంటే నారదుడు గొప్పవాడా? అని, విష్ణుమాయను అతడు ఏ విధంగా గెలిచాడని అడిగింది. నారదుడి లాగ గర్వించి, విష్ణుమాయచేత గర్వభంగాన్ని పొందిన చండదమనుడనే మునికథను అతడికి వినిపించింది. ఆకాశవాణి చెప్పిన చండదమనుడి కథను విని, నారదుడు కోపంతో ఇలాంటి కట్టుకథలు ఎవరూ

నమ్మరని అన్నాడు. నారదుడు మాయామునితో తాను చండదమనుడిలాగ విష్ణుమాయకు భ్రమించనని పలికాడు. నారదుడు మాయామునితో ఆకాశవాణిని అసత్యవాది అని దూషించాడు. మాయాముని నారదుడిని శాంతింపజేసి, ఆ వేళకు తన ఆశ్రమంలో భిక్ష స్వీకరించమని కోరినాడు. నారదుడు దానికి అంగీకరించి, తన చేతిలోని అక్షమాల, విపంచి, కుంచెలను కొలను ఒడ్డుమీద ఉన్న రావి చెట్టుకు తగిలించాడు.

నారదుడు కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీ రూపాన్ని పొందాడు. ఆ స్త్రీ కొలను సమీపంలోని వనంలో విహరిస్తుండగా, చంద్రకేతుడనే రాజు చూసి మోహించాడు. ఆమెను నగరానికి తీసుకుపోయి చంద్రకేతుడు వివాహం చేసుకున్నాడు. చంద్రరేఖ చంద్రకేతుడి వలన నూరుమంది కుమారులను పొంది, సుఖంగా సంసారం చేస్తున్నది. అంతలో చంద్రకేతుడి మీదికి శత్రురాజు దండెత్తి వచ్చి, యుద్ధంలో చంద్రకేతుడిని, అతని కుమారుల్నీ సంహరించాడు. చంద్రరేఖ మరణించిన తన భర్త, కుమారులను చూసి దుఃఖించింది. చంద్రరేఖ రణభూమిలో ఒంటరిగా ఏడుస్తూ ఎండవేడిమికి తాళలేక, ఆకలిబాధకు తట్టుకోలేక సమీపంలోని మామిడి చెట్టుమీద పండును అందుకోవాలని ప్రయత్నించింది. విష్ణుమాయా కల్పితమైన ఆ మామిడిపండు చేతికి అందలేదని చంద్రరేఖ తన కుమారులు, భర్త శవాన్ని ఎత్తుగా పేరి, వాటిపైకి ఎక్కి అందుకోవాలని ప్రయత్నించింది. మామిడిపండు అందలేదనే ఉక్రోషంతో, ఆకలి బాధతో ఎడుస్తున్న ఆమె దగ్గరకు, విష్ణువు ముసలి బ్రాహ్మణుడి రూపంతో వచ్చాడు.

ఆ బ్రాహ్మణుడు చంద్రరేఖ కథంతా విని, మహావిష్ణువు తపోవనంలోని చెట్లు అశుచులైన వారికి అందవని చెప్పాడు. ముసలి బ్రాహ్మణుడు ఆమెతో శుచిగా స్నానం చేసివచ్చి, కుమారులకు దహన సంస్కారాలు చేసి, భర్తతో పాటుగా అగ్ని ప్రవేశం చేయమని సూచించాడు. బ్రాహ్మణుడు చెప్పిన హితవు మాటలు విని చంద్రరేఖ శుచిగా స్నానం చేయడానికి పావనమైన కొలను దగ్గరకు వెళ్ళింది. మాయా నాటక సూత్రధారి అయిన విష్ణువు ఆనాడు ఆ కొలనులో మునిగిన నారదుడిని స్త్రీగా మార్చాడు. నేడు ఈ కొలనులో మునిగిన స్త్రీని నారదుడిగా మార్చబోతున్నాడని గ్రహించి దేవతాసమూహాలు ఆకాశంలో ఎదురు చూస్తున్నారు. చంద్రరేఖ కొలనులోకి దిగి, నారాయణ మంత్రాన్ని జపిస్తూ నీటిలో మునిగింది. ఆ కొలను నీటిలో నుంచి నారదుడు తన పూర్వంతో వెలుపలికి వచ్చాడు. నారదుడికి ఆ విధంగా గర్వభంగం కాగానే మహావిష్ణువు దర్శనమిచ్చాడు.

దేవతలు పూలవాన కురిపించారు. నారదుడు కొలనుగట్టున ఉన్న తన వీణను, కుంచెను, జపమాల, కమండలాలను తీసుకున్నాడు. జరిగిన వృత్తాంతం అంతా గుర్తుకు రాగా నారదుడు విస్మయంచెంది, విష్ణుమాయను కీర్తించాడు. గరుడవాహనం మీద వచ్చిన మహావిష్ణువును అనేక విధాలుగా స్తుతించాడు. విష్ణువు నారదుడికి

దివ్యదృష్టిని అనుగ్రహించి దర్శనమిచ్చి, తిరిగి వైకుంఠానికి వెళ్ళాడు. ధర్మరాజు సభలో విష్ణుమాయా విలాసకథలు వింటున్న నారదుడు గోవిందశర్మ చెప్పిన వృత్తాంతమంతా నిజమేనని తెలిపాడు. నారదుడు ధర్మరాజుకు గోవిందశర్మ ఘనతను వివరించాడు. ధర్మరాజు గోవిందశర్మను సన్మానించి, అతని ఉపదేశంతో శ్రీకృష్ణుడిని స్తుతించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు సభలోని వారందరికీ తన దర్శనం కలిగించాడు. తర్వాత ధర్మరాజు మహావైభవంతో రాజ్యపాలన చేస్తూ, సుఖంగా జీవించాడని శుకమహర్షి పరీక్షితుమహారాజుకు తెలిపాడు.

ఈ కథలో నారదుడికి విష్ణువుతో గల అతిచనువు అతడికి గర్వం కలగడానికి కారణమైందని తెలుస్తుంది. పూర్వకర్మ ఫలాన్ని అనుభవించాల్సి ఉండటం కూడా నారదుడి గర్వానికి ప్రేరేపకమైందని చెప్పవచ్చు. విష్ణుమాయ చేత బ్రహ్మ, శివుడు, రాక్షసులు కూడా మోసపోవడాన్ని నారదుడు చూసి ఉన్నాడు. అందువల్లనే విష్ణుమాయ చేసిన ఇంద్రజాలం అతడికి అల్పంగా తోచింది. విష్ణువు కొలువులోని దేవకాంతలు ఇంద్రజాలాన్ని మెచ్చుకోవడం వల్ల నారదుడి అహం దెబ్బతిన్నది. అందువల్లనే నారదుడు అసూయ చెంది, విష్ణుమాయ కంటే తన మహిమ గొప్పదని ముల్లోకాలలో చాటుకున్నాడు. నారదుడికి గర్వభంగం కావించడానికి విష్ణువు మాయామునిగా మారాడు. నారదుడు మునివృత్తితో ప్రవర్తిల్లేవాడు కాబట్టి అతడిని మభ్యపెట్టడానికి మాయాముని రూపం, ఆశ్రమం కల్పించినట్లుగా తెలుస్తుంది.

ఆకాశవాణి కథనం నారదుడి వార్తాసంచారాన్ని, కలహప్రియత్వాన్ని సూచిస్తుంది. ఆకాశవాణిని నారదుడు నిందించడమే అతని మాయా ప్రలోభానికి మొదటి నిదర్శనం. విష్ణువు సమక్షంలో శ్రీదేవి, భూదేవులను అబలలని చులకన చేసినందుకు ప్రతిఫలమే నారదుడికి స్త్రీరూపం, మాయా సంసార బంధం కలిగాయని చెప్పవచ్చు. భర్త, కుమారుల మరణంతో నారదుడు పొందిన దుఃఖం అతనిలోని గర్వాన్ని నశింపజేయడానికి చేసిన ఏర్పాటుగా కనిపిస్తుంది. నారదుడు ముసలి బ్రాహ్మణుడిని విష్ణువుగా కీర్తించడం, ఇక అలాంటి ఆడజన్మ వద్దని భావించడం, కొలనులో నారాయణ మంత్రాన్ని స్మరించడం ఇవన్నీ అతడి పశ్చాత్తాపానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి. ఈ విధంగా నారదుడికి కలిగిన గర్వాన్ని విష్ణువు మాయా స్త్రీరూపాన్ని, సంసారబంధాన్ని కలిగించి భంగపరిచాడని చెప్పవచ్చు.

### 4.3.1.6. ఉపకథలు

నారసింహకవి తన కావ్యంలో ఐదు ప్రధాన కథలతో పాటుగా రెండు ఉపకథలను కూడా చెప్పాడు. తృతీయాశ్వాసంలోని బ్రహ్మకథలో మార్కండేయుడు చెప్పిన పుండరీకునికథ అందులో మొదటిది. పంచమాశ్వాసంలో నారదుడికి ఆకాశవాణి చెప్పిన చండమనుడి కథ రెండవది.

పుండరీకుని కథ

పుండరీకుడనే విష్ణు భక్తుడు మధురానగరంలో నివసిస్తున్నాడు. అతడి భార్య పేరు సావిత్రి. ఆమె భర్తకు తగిన ఇల్లాలు. పుండరీకుడు ఎల్లప్పుడు విష్ణుభక్తి తత్పరుడై, యమునానదీ తీరంలో నిత్యం సాలగ్రామశిలార్చన చేసేవాడు. నారదముని పుండరీకుని విష్ణుభక్తిని, గృహస్థ ధర్మాన్నీ మెచ్చుకొని అతడికి లోకమంతా విష్ణుమాయా పరికల్పితమని, చూసేందంతా భ్రాంతి అని చెప్పాడు. ఈ సంసారబంధం అనే మాయ నుంచి తరించడానికి మహావిష్ణువును నిర్మలభక్తితో సేవించమని బోధించాడు. అంతేకాకుండా తులసీ మహిమను, సాలగ్రామ పూజా మహిమను, హరినామ సంకీర్తనా మహిమనూ వివరించాడు. పుండరీకుడు నారదుని ఉపదేశంతో మరింత భక్తి శ్రద్ధలతో విష్ణుపూజను చేయసాగాడు. పుండరీకుడు నారదుడు చెప్పిన లోకమంతా విష్ణుమాయా కల్పితమనే మాటల్ని సందేహించాడు. పుండరీకుడు తన అనుమానాన్ని తీర్చుకోవడానికి విష్ణుమాయను చూపమని విష్ణువును కోరేవాడు. ఒకనాడు పుండరీకుడు పితృకార్యం నిర్వహించేందుకు స్నానం చేయడానికి యమునానదికి వెళ్ళాడు. పుండరీకుడు తన అనుమానాన్ని నివృత్తి చేసుకోవాలని విష్ణువును ప్రార్థించగా, అతన్ని విష్ణుమాయ ఆవరించింది.

పుండరీకుడు విష్ణుమాయా ప్రభావంతో తన పూర్వ జ్ఞానాన్ని మరిచి విభ్రాంతుడయ్యాడు. అంతలో విష్ణుమాయా కల్పితంగా ఒక బోయకాంత పుండరీకుని ముందు నిలిచింది. మన్మథుని మోహమే స్త్రీరూపంతో వచ్చినట్లుగా ఉన్న ఆ బోయకాంతను చూసి పుండరీకుడు మోహాన్ని పొందాడు. పుండరీకుడు ఆమె కులం గురించి తెలుసుకొని విచారించాడు. ఆ బోయకాంత తనను వివాహం చేసుకొని ఏలుకోమని పుండరీకుడిని కోరింది. పుండరీకుడు కామోద్రేకంతో ఆ బోయకాంతతో కలిసి సురతసుఖాలు అను భవించాడు. ఆమె వెంట వెళ్ళి పుండరీకుడు మాయాసంసారాన్ని చేయసాగాడు. పుండరీకుడి వలన ఆ బోయకాంత ఒక కుమారుడు, కుమార్తెనూ పొందింది. అంతలో ఆ ప్రాంతంలో ఆకాశంలో తోక చుక్క పుట్టింది. చంద్రుడు ఎర్రబడ్డాడు. అనావృష్టి దోషంతో కరువు కాటకాలు చెలరేగాయి. ఆ కరువు తీవ్రతకి పుండరీకుని అత్తమామలు, కుమార్తె నశించారు. భార్యను చూసి పుండరీకుడు కన్నీరు కార్చాడు. పుండరీకుడు భార్య, కుమారుడి మీది వాత్సల్యంతో వారిని కాపాడుకోవడానికి గౌతమీనదీ తీరానికి వలస వెళ్ళాడు.

గౌతమీ నదిని చేరుకొని పుండరీకుడు దాహం తీర్చుకున్నాడు. పుండరీకుడు నదీ తీరానికి సమీపంలోని ఒక అగ్రహారంలోకి భిక్షకు వెళుతూ భార్య, కుమారుడిని ఒక చెట్టుక్రింద నిలిపాడు. విష్ణుమాయా కల్పితమైన ఆ బోయకాంత, కుమారుడూ మాయమై పోయారు. విష్ణుమాయ తొలగి, పుండరీకుడికి విష్ణు సాక్షాత్కారం లభించబోతుందని తెలిసి దేవతలు ఆకాశంలో వేచి చూస్తున్నారు. పుండరీకుడు సంసార

బంధమనే ఆకలిని తీర్చుకోవడానికి, వైరాగ్యమనే పాత్రలో, ఉపనిషత్తు వాక్యాల ద్వారా మోక్షలక్ష్మిని పరమానందమనే భిక్షను కోరేవాని విధంగా ఒక ఇంటిముందు నిలిచాడు. పుండరీకుడు ఆ ఇల్లాలిని 'భిక్షాందేహి' అని పిలిచాడు. విష్ణుమాయ వలన ఆ ఇల్లు పుంఢరీకునిదే కాగా, ఆ మాటలు విన్న సావిత్రి ఇంటి వెలుపలికి వచ్చి, విష్ణుమాయా ప్రభావంతో భ్రమించి ధైన్యంగా భిక్ష అడుగుతున్న పుండరీకుడిని చూసింది. సావిత్రి భర్త స్థితికి ఆందోళనపడి, పరమభక్తుడైన భర్తను భూతం సోకిందని భావించింది. ఆమె మహావిష్ణువును ప్రార్థించి, తన పాతివ్రత్యమహిమ చేత పుండరీకుడికి కలిగిన దురవస్థ తొలగిపోవాలని వేడుకుంది.

విష్ణుమాయ పుండరీకుడిని విముక్తుడిని చేసింది. పుండరీకుడు మహావిష్ణువును దర్శించుకొని పలువిధాలుగా స్తుతించాడు. పుండరీకునికి మోక్షపథాన్ని అనుగ్రహించడానికే ఇదంతా చేయవలసి వచ్చిందని మహావిష్ణువు తెలిపి, మరికొంతకాలం జీవించిన తర్వాత అతడు వైకుంఠాన్ని చేరు కుంటాడని చెప్పాడు. ఈ విధంగా పుండరీకుడు విష్ణుమాయ చేత పరీక్షించబడ్డాడని తెలుస్తుంది. ఈ కథను మార్కండేయుడు బ్రహ్మకు విష్ణుమాయా ప్రభావాన్ని తెలియజెప్పడం కోసమే వినిపించాడు. పుండరీకుని వంటి పరమ సాత్త్వికమూర్తి, నిత్య సాలగ్రామ పూజాతత్పరుడికి కూడా అన్ని కష్టాలు కలగడానికి అతడు విష్ణుమాయను సందేహించడమే కారణమని తెలుస్తుంది. పుండరీకుడు అహంకార మోహాలను కలిగించే రాజసతామస గుణాలను విడిచి, శుద్ధ సాత్త్విక జ్ఞానంతో విష్ణువును పూజించాడు. పుండరీకుడికి వైకుంఠప్రాప్తిని కలిగించడానికి విష్ణువే నారదుడి చేత విష్ణుమాయా ప్రస్తావన చేయించాడు. పుండరీకునికి సందేహ నివృత్తి కలిగించడానికా అన్నట్లు మాయా సంసార బంధాన్ని కల్పించాడు. కష్టాలపాలు జేసి కఠినంగా పరీక్షించాడు. ఇదంతా పుండరీకుని పూర్వ కర్మలను నశింప జేయడానికి, తద్వారా వైకుంఠప్రాప్తిని కలిగించడానికి చేసిన కల్పనగా తెలుస్తుంది. ఎంతటి పరమ భక్తులు కూడా పూర్వ కర్మలఫలాన్ని అనుభవించకుండా మోక్షాన్ని పొందలేరని ఈ కథ వలన తెలుస్తుంది.

చండదమనుడి కథ

చండదమనుడనే ముని ఒకనాడు అయోధ్యానగరాన్ని పరిపాలించే మాంధాత మహారాజు చేత పూజించబడ్డాడు. అతడు ఆ రాజు మహారాజవైభవాన్ని, సంపద విలాసాలనూ చూసి, తాను కూడా అలాంటి రాజ్యభోగాలను పొందాలని అనుకున్నాడు. చండదమనుడు గంగానదీ తీరంలో సంకల్పించి, బ్రహ్మను గురించి ఉగ్రమైన తపస్సు చేశాడు. సత్యలోకం నుంచి సనత్కుమారుడు వచ్చి, చండదమనుడు తపస్సు చేయడానికి కారణమేమని అడిగాడు. చండదమనుడు రాజ్యసుఖాలు పొందాలనే తన కోరికను తెలిపాడు. సనత్కుమారుడు ఈ ప్రాపంచిక భోగాలు, రాజ్యసుఖాలు అన్నీ విష్ణుమాయా కల్పితమని, కోరికలకు అంతం ఉండదని అతడికి తెలిపాడు. ఎంతో నియమ నిష్ఠలతో

ఇంతకాలం చేసిన తపస్సును వ్యర్థమైన సంసార సుఖాల కోసం వినియోగించడం బూడిదలోని హోమం అవుతుందని అన్నాడు. సనత్కుమారుడు చండదమనుడితో రాజ్యసుఖాలు నరకాన్ని కలిగిస్తాయని చెప్పి, బ్రహ్మపదం కోసం తపస్సు చేయమని బోధించాడు. సనత్కుమారుని హితబోధ వలన చండదమనుడు విష్ణుమాయాకలితమైన సంసార బంధానికి తగుల్కోకుండా మోక్షాన్ని పొందాలనుకున్నాడు. చండదమనుడు విష్ణుమాయను కాదని తన తపస్సుతో బ్రహ్మను మెప్పించాడు. బ్రహ్మ ప్రత్యక్షంకాగా చండదమనుడు విష్ణుమాయా కల్పితమైన సంసార సుఖాలు పొందకుండా మోక్షాన్ని ప్రసాదించమని కోరాడు.

బ్రహ్మ ఆ వరం ఇవ్వరాదని, అతడు మొదట సంకల్పించినట్లుగా రాజ్యసుఖాలు అనుభవించమని చెప్పాడు. బ్రహ్మ మాటలకు విరక్తిచెంది, చండదమనుడు అతడి వరాన్ని వద్దని చెప్పాడు. ఆ తర్వాత శివుడిని, సూర్యనారాయణుడినీ తన తపస్సుతో మెప్పించినా, వారు కూడా చండదమనుడు రాజ్యసుఖాలు పొందకుండా మోక్షం లభించదని తెలిపారు. ఆ మాటలకు చండదమనుడు నిర్వేదించి, ఎలాగైనా విష్ణుమాయకు తగుల్కోకుండా మోక్షాన్ని పొంది, బ్రహ్మ, రుద్ర, సూర్యనారాయణులను అవమానించాలని భావించాడు. విష్ణువు చండదమనుడి అహంకారాన్ని గుర్తించి, దాన్ని మాయతో అణగించాలని అనుకున్నాడు. విష్ణువు రాజ్యసుఖాలను కాదన్న చండదమనుడిని ఆ రాజ్యవైభోగాలతోనే భ్రమింపజేయాలని భావించాడు. విష్ణుమాయా ప్రభావంతో చండదమనుడి ఆశ్రమం రాజ అంతఃపురంగా మారిపోయింది. అతడు తన పూర్వజ్ఞానాన్ని మరిచి, రాజ్యసుఖాలలో తగుల్కొని మహారాజ వైభవంతో జీవిస్తున్నాడు.

చండదమనుడిని చూసేందుకు వచ్చిన సనత్కుమారుడు అతడికి పూర్వ జీవితాన్ని, తపోవృత్తినీ గురించి తెలిపాడు. సనత్కుమారుడు చండదమనుడితో బ్రహ్మ, రుద్ర, సూర్యనారాయణులు చెప్పిన విధంగా ప్రవర్తించి ఉంటే ఈ రాజ్యభోగాలు ప్రాప్తించేవి కాదన్నాడు. ఇప్పటికైనా చండదమనుడు సనత్కుమారుని బోధను విని పశ్చాత్తాపంతో మహావిష్ణువును ప్రార్థించి, అతని అజ్ఞానాన్ని మన్నించమని కోరాడు. విష్ణువు చండదమనుడిని అనుగ్రహించి, మోక్షాన్ని ప్రసాదించాడు. ఈ విధంగా చండదమనుడి గర్వం విష్ణుమాయ చేత భంగపాటును పొందిందని ఈ కథ వలన తెలుస్తున్నది.

ఈ చండదమనుడి కథ నారదుడికి విష్ణుమాయా మహిమను తెలపడానికి ఆకాశవాణి వినిపించింది. నారదుడు పూర్వకర్మ ఫలాన్ని అనుభవించాల్సి ఉన్నందువల్ల విష్ణుమాయను తిరస్కరించాడు. చండదమనుడి కథను నారదుడికి చెప్పడం వల్ల ఇతడికి కూడా పూర్వకర్మఫలం అనుభవించాల్సి ఉందనే సూచన ఇందులో కనిపిస్తుంది. చండదమనుడు మాంధాత మహారాజులాగ రాజ్యభోగాలను కోరుకోవడం దీనికి

నిదర్శనంగా చెప్పుకోవచ్చు. చండదమనుడికి బ్రహ్మ, శివుడు, సూర్యుడు మూడుసార్లు విష్ణుమాయా మహిమను బోధించినప్పటికీ అతడు దానిని చులకన చేశాడు. దానికి చండదమనుడి తపస్సే కారణమని చెప్పవచ్చు. చండదమనుడు తన తపస్సుతోనే బ్రహ్మ రుద్రులను మెప్పించాడు. విష్ణుమాయకు లొంగరాదని చండదమనుడు చేసిన తీవ్రప్రయత్నమే అతన్ని విష్ణుమాయా మోహంలోకి లాగింది. చండదమనుడు రాజ్యభోగాలలో మునిగి పోవడానికి అతడి సంకల్పం ప్రధాన కారణంగా కనిపిస్తుంది. కాబట్టి చండదమనుడి లాంటి తపస్సంపన్నులు కూడా విష్ణుమాయకు లొంగకుండా మోక్షాన్ని పొందలేరని ఈ కథ తెలుపుతున్నది.

4.3.2. అనుసరణలు

ఎల్లన కావ్యకథామూలాన్ని పాపరాజు, వేంకటపతి, వేంకటకవి మొదలైనవారు అనుసరించినారు. అయినప్పటికీ వారు తమ కావ్యాలలో యథోచితమైన కల్పనలు చేసి వాటికొక స్వతంత్రతను, నిండుదనాన్ని కలిగించుకున్నారు. కాని కంకంటి నారసింహకవి మాత్రం ఎల్లన కావ్య కథమూలాన్నే కాకుండా ఆసాంతం కావ్యం అంతటినీ అనుసరించడం మనకు కనిపిస్తున్నది. ఎల్లన పద్య కావ్యంలోని కథాప్రారంభం, ఎత్తుగడలు మొదలుకొని సన్నివేశాలు, సంఘటనలు, సంభాషణలు, వర్ణనలు మొదలైన వాటన్నింటినీ ద్విపదీకరించినాడని ఈ క్రింది నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు. ఎల్లన తన కావ్యంలో చేసిన కల్పనలను నారసింహకవి ఏ విధంగా అనుసరించాడో పరిశీలిస్తే ఈ విషయం మనకు మరింతగా స్పష్టమవుతుంది.

4.3.2.1. వ్యాసుడు, ధర్మరాజుల సంవాదం

ఎల్లన కావ్యంలో ధర్మరాజు కొలువుకు వ్యాసమహర్షి రాగా అతడిని పూజించి, ధర్మరాజు శ్రీకృష్ణుని యాథార్థ్యమును తెలుపమని కోరడం, వ్యాసుడు శ్రీకృష్ణుని ప్రభావాన్ని, మాయా మహిమనూ వినిపించడం, ధర్మరాజుకు వ్యాసుడు విష్ణుమాయా విలాసకథలను చెప్పబోవటం అనేవి వర్ణించబడ్డాయి. ఈ సందర్భంలో వ్యాసమహర్షి శ్రీకృష్ణుని గురించి ధర్మరాజుతో పలికిన మాటలను ఎల్లన ఈ విధంగా వర్ణించాడు.

"కావడే మానంబు కారవ సభలోన, పాంచాలికక్షయాంబరములొసగి
యాకొన్న దుర్వాసు నలుకచేపడకుండ, నరయడే నినుపులాకార్థియగుచు" (1-63)

నారసింహకవి తన కావ్యంలో ఎల్లన వ్యాసునితో పలికించిన మాటలను క్రింది విధంగా అనుసరించాడు.

"గావడే మానంబు గౌరవ్య సభను, ద్రోవది కమితముల్దువ్వల్వ లొసగి
యాకొన్న దుర్వాసు నలుకవారించి, మీకు మేలొసగడే మెదుకొండుమెక్కి" (పుట. 11)

ఇదేవిధంగా వ్యాసుడు ధర్మరాజుకు శ్రీకృష్ణుని మాయాప్రభావాన్ని తెలపడం, విష్ణుమాయకు బ్రహ్మ రుద్రాదులు కూడా మోసపోయిన విధాన్ని గురించి తెలుపుతూ

వ్యాసుడు ధర్మరాజుకు విష్ణుమాయా విలాస కథలను చెప్పడానికి పూనుకోవడాన్ని క్రమంగా వర్ణించాడు.

4.3.2.2. గోవిందశర్మ వృత్తాంతం

ఎల్లన తన కావ్యంలో వ్యాసుడు ధర్మరాజుకు విష్ణుమాయా విలాసకథలను చెప్పబోతున్న సమయంలో గోవిందశర్మపాత్రను ప్రవేశపెట్టాడు. గోవిందశర్మ చేత ధర్మరాజు కొలువులో విష్ణుమాయా విలాస కథలు వినిపించబడ్డాయి. గోవిందశర్మ సత్యభామ నుంచి పారిజాత మాలికను బహుమతిగా పొందిన వృత్తాంతంతో ఈ విష్ణుమాయా విలాసకథలు ప్రారంభమైనట్లు ఎల్లన కల్పించాడు.

"ద్వారక నుండి వచ్చె వటు వర్యుడొకండు వినీలకంధరా
కారుడు గోపిచందన వికస్వర ఫాలుడు పారిజాతమా
లా రమణీయ వక్షుడు మిళత్తులసీ నవమంజరీశ్రవో
హారి ద్వితీయ కృష్ణుడన హాటక పుస్తక హస్తుడై దివిన్" (1-108)

అంటూ ఎల్లన గోవిందశర్మ పాత్రను ప్రవేశపెట్టాడు. నారసింహకవి తన కావ్యంలో కూడా గోవిందశర్మ చేతనే విష్ణుమాయా విలాసకథలను చెప్పించాడు. నారసింహకవి గోవిందశర్మ ప్రవేశాన్ని కూడా ఎల్లన కావ్యాన్ని అనుసరించే ఈ విధంగా చేశాడు.

"ఇంచుదేహశ్రీల యింద్రనీలము జ, యించువాడెదశాంతి నెనయించువాడు
దళుకొత్తు గోపిచందన పుండ్రవల్లి, కలవాడునగు నెమ్మోము గలవాడు
...నాబ్రహ్మ, చారి యీగతి నబ్రహ్మచారియై రాగ, ..." (పుట. 17,18)

అంటూ నారసింహకవి గోవిందశర్మ పాత్రను పరిచయం చేశాడు. ఆ తర్వాత శ్రీకృష్ణునితో అతనికి గల స్నేహం, సత్యభామ నుంచి పారిజాతమలికను కానుకగా పొందిన వృత్తాంతం మొదలైన వాటిన్నింటినీ ఎల్లన కావ్యానుసారంగానే క్రమంగా ద్విపదలో చెప్పడం కనిపిస్తుంది.

4.3.2.3. మాయాలక్ష్మి వృత్తాంతం

ఎల్లన తన కావ్యంలో మహాలక్ష్మికి గర్వభంగం కలగించేందుకు మాయలక్ష్మి వృత్తాంతాన్ని కల్పించాడు. మాయాలక్ష్మి తేజోవిహీనరూపంతో వాడిన కమలం మీద కూర్చుని మహాలక్ష్మికి కనిపించడం, మహాలక్ష్మికి మాయాలక్ష్మి తన వృత్తాంతాన్ని వినిపించడం, మాయాలక్ష్మి పుష్పక విమానంలో వైకుంఠానికి వెళుతూ మహాలక్ష్మి తేజస్సును హరించడం అనేవి ఇందులో ఎల్లన చేసిన కల్పనలు. నారసింహకవి తన కావ్యంలో ఎల్లన కల్పించిన మాయాలక్ష్మి వృత్తాంతాన్ని కూడా అనుసరించాడు. మాయాలక్ష్మి తేజోవిహీన రూపాన్ని ఎల్లన వర్ణించిన తీరుగానే నారసింహకవి కూడా వర్ణించడం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"పద్మాసనాంకాగ్ర భాగాంఘ్రి శుభరేఖ, లఖిల లోకేశ్వరి యగుట నొడువ

చిన్ముద్ర చేతమించిన సమాధిక్రియ, కైవల్యలక్ష్మి నిల్కడ వచింప ...
కన్నులకు వెక్కసంబైన చెన్ను మిగిలి,
మనసునను నద్భుతంబైన మహిమగలిగి" (2-79)

అని మాయాలక్ష్మిని ఎల్లన తన కావ్యంలో వర్ణించాడు.

"గమలాసనాంకాగ్ర కలితాంఘ్రి రేఖ, లమిత లోకేశ్వరి యగుఠీవి నుడువఁ
బావన చిన్ముద్ర బలియు సమాధి, కైవల్యలక్ష్మి నిల్కడ నెఱుంగింప
గన్ను దమ్ములకు వెక్కసపాటుఁ బెనుచు, చెన్ను గల్గిన దానిఁ జిన్ని పాయమున
మనసున గనరాని మహిమల దానిఁ..." (పుట.43)

అంటూ నారసింహకవి మాయాలక్ష్మిని ఎల్లనను అనుసరిస్తూ వర్ణించడం కనిపిస్తున్నది.

ఇదేవిధంగా నారసింహకవి ఎల్లన తనకావ్యంలో చేసిన మాయాసరస్వతి వృత్తాంతం, మాయాకాంత ఇంద్రజాల ప్రదర్శన, పుండరీకుని వృత్తాంతం, చందమనుని వృత్తాంతం మొదలైన కల్పనలను కూడా యథాతథంగా అనుసరించినట్లుగా కనిపిస్తున్నది. అందువలన నారసింహకవి తన కావ్యంలో ఎల్లన కావ్యం కంటే భిన్నమైన కల్పనలేవీ చేయలేదని, యథోచితంగా అనుసరణలే చేశాడని పైన చూపిన నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు.

### 4.4. రోసనూరి వేంకటపతి – కథానుశీలన

#### 4.4.1.కావ్యారంభం

రోసనూరి వేంకటపతి రచించిన విష్ణుమాయా విలాస కావ్యంలో శివదర్పభంగం కథ వర్ణించబడింది. ఈ కావ్యకథకు శ్రోత జనమేజయ మహారాజు, కథకుడు వైశంపాయనుడు. విష్ణులీలలను వింటున్న జనమేజయ మహారాజుకు కలిగిన కుతూహల రూపమైన ప్రశ్నతో ఈ కథ ప్రారంభమవుతున్నది. జనమేజయ మహారాజు వైశంపాయన మహర్షిని, శ్రీమన్నారాయణుడు కృత్రిమనారీ రూపంతో దానవులను భ్రమింపజేసి అమృతాన్ని దేవతలకు పంచాడు కదా! దానవులు వివేకశూన్యులు కాబట్టి శ్రీహరి ధరించిన మోహినీ రూపానికి భ్రమించారు. అట్లే ఇంకెవరైనా ఈ ముల్లోకాలలో మోహినిని చూసి భ్రమించిన పురుషులు ఉన్నారేమో తెలుపమని అడిగాడు. వైశంపాయనుడు ఫాలాక్షుడు అయినా కూడా విష్ణుమాయకు భ్రమించవలసిందేనని, జనమేజయునికి మోహినీ అవతారకథను చెప్పడం ప్రారంభించాడు.

##### 4.4.1.1. శివదర్పభంగం కథ

కైలాస పర్వతం మీద భవపాశహరుడైన శివుడు సకల భూత జంగమ స్థావర ప్రపంచమంతా చేరి సేవించగా కొలువుదీరి ఉన్నాడు. ఆ సమయంలో శివుడిని దర్శించుకోవడానికి నారద తుంబురులు వచ్చారు. శివుడు నారదుడిని చూసి, క్షీరసాగర మథనంలో హాలాహలం పుట్టిన తర్వాత ఏమి జరిగిందో తెలుపమని అడిగాడు. నారదుడు

శివుడితో, క్షీరసాగరంలో కల్పవృక్షం మొదలైన వస్తువులు కలిగిన తర్వాత ధన్వంతరి అమృత కలశంతో ప్రత్యక్షమైనాడు. దానవులు అమృత కలశాన్ని అపహరించగా, దేవతలకు అమృతాన్ని దక్కించడానికి విష్ణువు మాయా మోహినిగా అవతరించాడు. ఆ మోహిని తన శృంగార విలాసంతో దానవులను మోహపరిచి, అమృతాన్ని దేవతలకు పంచింది అని తెలిపాడు. నారదుడు ఆ మోహినీ సౌందర్య విలాసాన్ని చూస్తే మదనుడిని గెలిచిన శివుడికైనా మనస్సు చలిస్తుందని అన్నాడు. నారదుడు శివుడితో ఎంతటి వారైనా విష్ణుమాయకు భ్రమించవలసిందేనని అన్నాడు. ప్రమథులు నారదుడి మాటలకు కోపించగా వారిని శివుడు వారించాడు. శివుడు నారదుడి మాటల్లో నిజమెంతో తెలుసుకోవడానికి వైకుంఠం వెళ్ళాలని పార్వతితో అన్నాడు.

పార్వతి శివుడితో ముల్లోకాలు విష్ణువు ఆధీనంలో ఉన్నాయి. కాబట్టి విష్ణుమాయకు శివుడు భ్రమిస్తే నవ్వుల పాలు కాకతప్పదని హెచ్చరించింది. అయినప్పటికీ భర్త మాటను గౌరవించాలని పార్వతి శివుడితో అతని కోరిక ప్రకారం చేయమని చెప్పింది. శివుడు పార్వతి మాటలను వినకుండా వైకుంఠానికి ప్రయాణమైనాడు. అతని వెంట పార్వతి, ప్రమథులు మొదలైన పరివారం అంతా అనుసరించింది. శివుడు వైకుంఠానికి ప్రయాణిస్తూ మార్గమధ్యంలో నందనవనం, క్షీరసాగరం, విరజానదులను గురించి పార్వతికి వివరించాడు. నారదుడు శివుడికంటే ముందుగా వెళ్ళి విష్ణువుతో కైలాసంలో అతడికి శివుడితో కలిగిన పంతాన్ని వినిపించాడు. నారదుడు మోహినీ సౌందర్యానికి ఎవరైనా మోహితులవుతారని తాను పలుకగా, శివుడు విష్ణుమాయకు భ్రమించనని దర్పంతో పలికాడని విష్ణువుకు కలహపు మాటలు చెప్పాడు.

విష్ణువు వైకుంఠానికి వచ్చిన శివపార్వతులకు ఎదురువెళ్ళి సాదరంగా ఆహ్వానించాడు. అతిథి మర్యాదలు అయిన తర్వాత శివుడు విష్ణువుతో, దానవులను భ్రమింపజేసిన అతని మోహినీ రూపాన్ని చూస్తే తానుకూడా మోహం పొందుతానని సభలో నారదుడు నిందించాడని తెలిపాడు. అందుచేత శివుడు తన వైరాగ్యం నారదుడికి, లోకానికి తెలిసేలాగ మోహినీ రూపాన్ని చూపమని విష్ణువును కోరాడు. విష్ణువు తాను వేరొక ఏకాంత సమయంలో మోహినీ రూపాన్ని చూపుతానని, శివుడికి నయోక్తులతో చెప్పాడు. శివుడు విష్ణువు మాటలు పెడచెవినపెట్టి, పంతంతో మోహినీ రూపాన్ని చూపమన్నాడు. ప్రమథులు కోపంతో నారదుడిని, విష్ణుమాయను నిందించారు.

విష్ణువు శివుడి పంతాన్ని, ప్రమథుల దురహంకారాన్ని గ్రహించి, వారిని మోసపుచ్చాలని, శివుడు కోరినట్లుగానే మాయామోహినిగా అతని ఎదుట నిలిచాడు. మోహినీ రూప విలాసానికి సభలోని వారందరూ చంచలాత్ములైనారు. ప్రమథులు ఉన్మత్తులై వలపు మాటలు పలికారు. శివుడు మోహినిని చూడగానే మరులు కొన్నాడు. శివుడికి మోహినీ దర్శనంతో దేహం పులకించింది. శివుడు విభ్రాంతుడై తాను వచ్చిన

కారణాన్ని, తన పంతాన్ని మరిచి పోయాడు. మోహినీ సౌందర్యానికి దాసుడైన శివుడు సభాసదులు తనను చులకన చేసినా, పార్వతి అలిగి కోపించినా సరే మోహినిని చేపట్టాలని భావించాడు. అంతలోనే విష్ణుమాయా కల్పితంగా ఆ సభామందిరం శృంగారవనంగా మారిపోయింది. శివుడు మోహవివశత్వంతో శృంగారవనంలో మోహిని వెంటవెళ్ళాడు. శివుడు పట్టబోయేలోగా మోహిని మాయమైపోయింది. విభ్రాంతితో వెదుకుతున్న శివుడికి మోహిని రత్నపుతిన్నెపై పూబంతి ఆట ఆడుతూ కనిపించింది. శివుడు మోహినిని సమీపించి పట్టుకోవాలని ప్రయత్నించగా చేతికి అందకుండానే అదృశ్యమైంది.

ఈ రీతిగా మాయామోహిని శృంగారవనంలో శివుడికి కనిపించి, అంతలోనే మాయమవుతూ తన శృంగార చేష్టలతో కామాతురుడిని చేసింది. ఊయల ఊగుతూ, జలకాలాడుతూ మరులు కలిగించి మాయమైన మోహినిని గురించి విచారిస్తూ, శివుడు ఆ వనంలోని చెట్టు చేమలను ఆమె జాడ అడుగసాగాడు. వనదేవతలతో వనవిహారం చేస్తున్న మోహినిని చూసి శివుడు మన్మథుని బారి నుంచి తనను కాపాడుమని వేడుకున్నాడు. మోహిని శివుడితో మన్మథుడిని జయించిన అతడికి మోహం ఎలా కలిగిందని అడిగింది. శివుడి వైరాగ్యానికి, నిగ్రహానికి తాను తగనని మోహిని మాయమైంది. మోహిని కనిపించలేదని శివుడు విరహంతో మలయ పవనాన్ని, చంద్రుడిని, మన్మథుడినీ దూషించాడు. విష్ణుమాయ చిలుక రూపంతో వచ్చి, శివుడికి మోహిని ఉన్న చోటును చూపించింది. పూపొదరింటిలో సురతోద్యుక్త రూపంతో ఉన్న మోహినిని చూసి శివుడు మోహావేశంతో ఉన్మత్తుడై కౌగిలించుకున్నాడు. మోహిని తన వాలుజడతో శివుడిని కొట్టింది. మోహినిని తాకగానే శివుడికి మదన పారవశ్యంతో శుక్లపతనమై, అది ఏరులై పారింది.

శివుని తేజం భూమిని తాకిన చోట్లన్నీ బంగారం, వెండిగా మారాయి. శివుడు పారవశ్యం విడిచి, చుట్టూ చూడగా శృంగారవనం పూర్వపు సభామందిరంగా మారిపోయింది. మోహిని విష్ణువుగా మారింది. శివుడు బ్రహ్మ జ్ఞానాన్ని పొంది, విష్ణుమాయను కీర్తించాడు. విష్ణువు హరిహరులకు మధ్య భేదం లేదని తెలిపి శివుడిని సాంత్వన పరిచాడు. శివుడు పార్వతీ సహితంగా కైలాసానికి తిరిగి వెళ్ళాడు అని వైశంపాయనుడు జనమేజయమహారాజుకు ఈకథను వినిపించాడు.

ఈ కథలో నారుదుడు చేసిన మోహినీ సౌందర్య వర్ణన శివుడికి కుతూహలాన్ని కలిగిస్తే, విష్ణుమాయా ప్రభావ వర్ణన ప్రమథులకు క్రోధాన్ని కలిగించింది. శివుడు వైకుంఠం వెళ్ళడానికి మోహినీ సౌందర్యం ప్రేరేపకమైంది. నారదుడు విష్ణుమాయను పొగిడి, తనను మాత్రం తక్కువ చేయడం శివుడికి పంతం కలిగించింది. పార్వతీదేవి కూడా విష్ణుమాయను పొగడటం విని శివుడికి అభిమానం కలిగింది. శివుడు నారదుడికి,

పార్వతికి తన ఇంద్రియ నిగ్రహ మహిమను చూపించాలనే ఉత్సాహంతో వైకుంఠానికి వెళ్ళడం కనిపిస్తుంది. నారదుడి మాటలు, పార్వతి అభిప్రాయం వినడం వల్ల శివుడికి కలిగిన కోపావేశం అంతా విష్ణువుతో తన మనస్సులోని కోరికను తెలిపేటప్పుడు వ్యక్తమవుతుంది. శివుడు వైకుంఠానికి వచ్చేంత వరకూ అతడిరాకకు విష్ణువు ప్రమేయమేమీ కనిపించదు. విష్ణువు ముందు పలికిన మాటల్లో శివుడి దర్పం వెల్లడయింది. మోహినీ రూపాన్ని చూడవద్దని విష్ణువు శివుడికి చెప్పడంలో, శివుడికి మోహినిని చూడాలనే ఉత్కంఠను కలిగించడమే ప్రధాన కారణంగా కనిపిస్తుంది. మోహినిని చూడగానే శివుడికి కలిగిన గగుర్పాటు అతడు మాయా మోహానికి తగుల్కొన్నాడని చెప్పడానికి సంకేతం. శృంగారవనంలోని మోహిని విలాస చేష్టలు అన్నీ శివుడి విరహాన్ని అతిశయింపజేయడం కోసమేనని తెలుస్తుంది. మోహిని శివుడికి కనిపించి చేతికి అందకపోవడం వల్ల అతడిలోని కామాతురతను ఉద్దీపింపజేయడమే ప్రధాన కారణంగా కనిపిస్తుంది. శివుడి మోహతీవ్రత, మోహినిని బ్రతిమాలుకోవడం, కౌగిలించుకొని శుక్లపతనాన్ని పొందడం ఇవన్నీ శివదర్పభంగంలోని భాగాలుగా చెప్పవచ్చు.

4.4.2. కల్పనలు

రోసనూరి వేంకటపతి తన కావ్యంతో శివదర్పభంగ కథను ప్రధానంగా వర్ణించాడు. ఇతివృత్తాన్ని గ్రహించడంలో ఎల్లన కావ్యం ఆదర్శమైనప్పటికీ, కథా నిర్వహణ మాత్రం కంకంటి పాపరాజు యక్షగానాన్ని అనుసరించి చేసిందని తెలుస్తున్నది. ఎల్లన కథకంటే పాపరాజు కొన్ని కల్పనలు చేశాడని ముందుగా ప్రస్తావించుకున్నాం. అయితే వేంకటపతి పాపరాజు కథా నిర్వహణ కంటే విభిన్నమైన మరికొన్ని కల్పనలు చేయడం ఈ కావ్యంలో కనిపిస్తున్నది. వేంకటపతి చేసిన ఈ కల్పనలు అతడి కావ్యానికి రసపుష్టిని ఏ విధంగా కలిగించాయో ఈ క్రింది నిదర్శనాల ఆధారంగా పరిశీలించవచ్చు.

4.4.2.1. నారదుని కైలాస ప్రయాణం

ఎల్లనార్యుడు తన కావ్యంలో శివదర్పభంగ కథను క్షీరసముద్ర మథన వర్ణనతో ప్రారంభించాడు. ఆ తర్వాత క్షీరసముద్రం నుంచి హాలాహలం జనించగా దానిని శివుడు గ్రహించడం, అమృతం లభించగా దానిని రాక్షసులు అపహరించడం, అమృతాన్ని దేవతలకు పంచడానికి విష్ణువు మోహినిగా అవతరించి రాక్షసులను మోసపుచ్చడం, ఈ వృత్తాంతాన్ని శివునికి వినిపించాలని నారదుడు కైలాసానికి బయలుదేరడం అనేవి వరుసగా వర్ణితమైనాయి. వేంకటపతి తన కావ్యాన్ని పాపరాజు లాగే కైలాసపర్వత వర్ణనతో ప్రారంభించాడు. ఆ తర్వాత కైలాసంలో శివుని ముందు నారదుడు సముద్రమథన వృత్తాంతాన్ని వినిపించడం వర్ణించబడింది. అమృతాన్ని

రాక్షసులు అపహరించగా మహావిష్ణువు మాయామోహినిగా అవతరించిన తీరును చెప్పే నెపంతో మోహినీ సౌందర్యవిలాసాన్ని వర్ణించాడు. ఎల్లన అమృతాన్ని రాక్షసులు అపహరించగా దేవతలు విష్ణువును ప్రార్థించారని పేర్కొన్నాడు. వేంకటపతి మాత్రం అమృతాన్ని అపహరించిన రాక్షసులను మోసపుచ్చేందుకు విష్ణువే పూనుకొని మోహినిగా మారి వచ్చాడని కల్పన చేశాడు. ఈ కల్పన వలన సముద్ర మథన వృత్తాంతాన్ని ఎల్లన లాగ రెండో పర్యాయం చెప్పవలసిన అవసరం లేకుండా పోయింది. ఈ కథా సందర్భంలోనే వేంకటపతి శివపార్వతుల వర్ణన మూడు పద్యాలలో (1–57,58,59), సభామందిరాన్ని రెండు పద్యాలలో (1–60,61), నారదుని ఒక పద్యంలో (1–65), మోహినీ సౌందర్యాన్ని పదమూడు పద్యాలలో (1–73 నుంచి 86వరకు) వర్ణించాడు. ఇవన్నీ వేంకటపతి తన కావ్యంలో స్వకీయంగా చేసిన వర్ణనలు.

4.4.2.2. శివుని వైకుంఠ ప్రయాణం

ఎల్లన కావ్యంలో నారదుని వలన మోహినీ వృత్తాంతం విన్న శివుడు వైకుంఠం వెళ్ళాలని భావించగా, పార్వతి అతడిని వారించి విష్ణు మహిమను గుర్తు చేసింది. ఆ తర్వాత నారదుడు శివుడికి రోషం కలిగేలాగ హేళనగా మాట్లాడి విష్ణు మహిమను పొగిడినాడు. దానికి రోషించి శివుడు పార్వతీ సమేతంగా వైకుంఠానికి బయలుదేరినట్లుగా ఎల్లన వర్ణించాడు. వేంకటపతి తన కావ్యంలో నారదుడు మోహినీ సౌందర్య వర్ణన చేసి మోహినిని చూస్తే శివుడు కూడా భ్రమిస్తాడని చులకనగా మాట్లాడినట్లు వర్ణించాడు. నారదుని మాటలకు కోపించి ప్రమథులు అతన్ని నిందించగా శివుడు వారిని వారించాడు. శివుడు మోహినిని చూడాలని వైకుంఠానికి వెళ్ళడానికి సిద్ధమవగా పార్వతి అతడిని వారించింది.

పార్వతి శివునికి విష్ణుమాయా మహిమను తెలిపినా వినకుండా అతడు వైకుంఠానికి బయలు దేరడం, శివ పార్వతులకు దారి చూపుతూ బయలు దేరిన నారదుడు వారి కంటే ముందే వైకుంఠం చేరుకోవడం, వైకుంఠంలో శివునికి విష్ణువుకు కలహం కలిగేలా మాట్లాడటం అనేవి వేంకటపతి చేసిన కల్పనలు. పార్వతి శివునితో వైకుంఠం వెళ్ళవద్దని చెప్పే సందర్భంలో విష్ణుమాయా మహిమను నాలుగు పద్యాలలో (1–113,114,115,116), శివుని ప్రయాణ సన్నాహాన్ని నాలుగు పద్యాలలో (1–121,122,123,124), శివుడు భద్రవటం సమీపంలో విడిచి చేయడాన్ని ఒక పద్యంలో (1–134), సూర్యాస్తమయాన్ని పన్నెండు పద్యాలలో (1–135 నుంచి 146 వరకు), చంద్రోదయాన్ని నాలుగు పద్యాలలో (1–147 నుంచి 150 వరకు), చంద్రాస్తమానాన్ని ఒక పద్యం (1–152), ప్రభాతకాలాన్ని ఆరు పద్యాలలో (1–153 నుంచి 158 వరకు) వర్ణించడం కనిపిస్తుంది. శివుడు వైకుంఠపురాన్ని చేరే మార్గ మధ్యంలో చూసిన అమరావతి (2–12,13), నందనవనం (2–14 నుంచి 19వరకు),

క్షీరసముద్రం (2-20 నుంచి 23వరకు) విరజానది (2-26 నుంచి 30వరకు) మొదలైన వాటిని వేంకటపతి తన స్వీయ కల్పనా చాతుర్యంతో వర్ణించాడు.

4.4.2.3. శివుని విరహం

ఎల్లన కావ్యంలో శివుడు మోహిని శృంగార విలాసాన్ని చూసి ఆమె వెంట శృంగార వనంలో పరిభ్రమించడం, మోహిని కనిపించలేదని దిగులు చెందడం, కనిపించగానే ఆనందించడం, మోహిని శృంగార చేష్టలకు తాళలేక విరహ భావంతో ఉన్మత్తుడై బలవంతంగా కౌగిలించుకొని శుక్లపతనాన్ని పొందినట్లుగా వర్ణించబడింది. వేంకటపతి తన కావ్యంలో శృంగారవనంలో శివుడు మోహినిని చూసిన సందర్భంలో వసంత ఋతువర్ణనను వనశోభకు హేతువుగా వర్ణించాడు. ఈ వసంత ఋతువర్ణన (3-7నుంచి 15వరకు) మోహిని శృంగార విలాసానికి ఆలంబనగాను, దానిని చూసిన శివునికి ఉద్దీపనగానూ దోహదపడిందని తెలుస్తుంది. ఎల్లన కావ్యంలోను, పాపరాజు యక్షగానంలోనూలేని మోహిని, దేవకాంతల వన విహారాన్ని వేంకటపతి నాలుగు పద్యాలలో (3-76 నుంచి 79వరకు) వర్ణించాడు. ఈ వనవిహారం మోహిని శృంగార చేష్టలకు దోహదకారి అయ్యి, శివుని మోహ తీవ్రతకు ప్రేరేపకం అయిందని చెప్పవచ్చు. ఎల్లన, పాపరాజు తమ కావ్యాలలో శివుని విరహాన్ని మాత్రం పేర్కొంటే, వేంకటపతి శివుడు విరహాతిశయంతో మలయ పవనాన్ని, మన్మథుని, చంద్రుని దూషించినట్లుగా పదిహేడు పద్యాలలో (3-107 నుంచి 124వరకు) వర్ణించాడు.

ఈ విధంగా రోసనూరి వేంకటపతి తన కావ్యంలో ఎల్లనాదుల కావ్యం నుంచి గ్రహించిన శివగర్వభంగ కథను ప్రధానంగా చెబుతూ, సందర్భోచితంగా స్వకీయమైన కల్పనలు కొన్నింటిని చేశాడని పై నిదర్శనాల వలన తెలుస్తున్నది. వేంకటపతి చేసిన ఈ కల్పనలు అన్నీ సందర్భశుద్ధిని కలిగి, దానితోపాటుగా రసాలంకార భూయిష్టమై వర్ణనాచాతుర్యంతో ప్రకాశిస్తున్నాయని పై పరిశీలన ఆధారంగా చెప్పవచ్చు.

4.5.ఎఱగుడిపాటి వేంకటకవి - కథానుశీలన

4.5.1. కావ్యారంభం

వేంకటకవి రచించిన విష్ణుమాయా విలాసకావ్యంలోని కథలకు శ్రోతలు నైమిశారణ్యంలోని మునులు, సూతమహర్షి కథకుడు. విష్ణుమాయా విలాసాలను వినాలని నైమిశారణ్యలలోని మునులు  పౌరాణిక కథకుడైన సూతమహర్షిని కోరగా, వారికి సూతమహర్షి ఈ కథలను వినిపించాడు. ఈ కావ్యంలో మొదట క్షీరసాగర మథన వృత్తాంతం, తర్వాత దేవదానవుల యుద్ధం, శివ గర్వభంగం అనే మోహినీ అవతార కథ, బ్రహ్మగర్వభంగం, నారదగర్వభంగం అనేకథలు వరుసగా వర్ణించబడ్డాయి. వేంకటకవి ప్రథమాశ్వాసాన్ని క్షీరసాగర మథనంతో ప్రారంభించాడు. ద్వితీయాశ్వాస ప్రారంభంలో లక్ష్మీనారాయణుల కళ్యాణం జరిగింది. ఆ తర్వాత

దేవదానవుల యుద్ధం, శివగర్వభంగం వర్ణించబడ్డాయి. తృతీయా శ్వాసంలో బ్రహ్మ గర్వభంగం, చతుర్థాశ్వాసంలో నారద గర్వభంగ కథను ప్రారంభించి, పంచమాశ్వాసంలో నారదుడిని స్త్రీగా మార్చి భంగపరిచిన కథ వర్ణించబడింది. ఈ కావ్యంలో ప్రధానంగా మూడు కథలు మాత్రమే వర్ణించబడినాయని తెలుస్తుంది. అవి 1. శివ గర్వభంగం, 2. బ్రహ్మ గర్వభంగం, 3. నారద గర్వభంగం. సూతమహర్షి నైమిశారణ్య మునులకు విష్ణుమాయా విలాస కథలను వినిపిస్తూ ముందుగా ఇంద్రుడు తాను కోల్పోయిన పదవిని, సంపదనూ విష్ణుమాయా ప్రభావంతో ఏవిధంగా తిరిగి పొందాడో చెప్పడం ప్రారంభించాడు.

4.5.1.1.క్షీరసాగర మథనం కథ

దుర్వాసముని శాపం వలన వాసవలక్ష్మి సముద్రం పాలవగా, ఇంద్రుడు పదవీచ్యుతుడై బలిచక్రవర్తిని ఆశ్రయించాడు. ఇంద్రుడు బలిచక్రవర్తిని సేవిస్తూ, విష్ణువు ఆనతి ప్రకారం క్షీరసాగర మథనానికి అతడిని ఒప్పించాడు. ఇంద్రుడు సముద్ర మథనం వల్ల లభించే అమృతం తాగి దేవతలు, రాక్షసులు అమరులు అవుతారని, ఆ తర్వాత వారు కలహం లేకుండా కలిసి మెలిసి ఉండవచ్చని బలిచక్రవర్తికి తెలిపాడు. బలిచక్రవర్తి ఇంద్రుడి మాటలకు అంగీకరించి, క్షీరసాగరానికి సరిపోయే కవ్వం, దానిని నిలపడానికి అడుగు, కవ్వాన్ని మథించడానికి అల్లె త్రాడు ఎక్కడ లభిస్తాయని అడిగాడు. ఇంద్రుడు విష్ణువు అనుగ్రహంతో అన్నీ సమకూరుతాయని చెప్పాడు. అతడు దేవదానవులకు అందరికీ ఈ వార్తను తెలుపగా విని అందరూ సంతోషించారు. దేవతలు, రాక్షసులు కవ్వంగా మందర పర్వతాన్ని తీసుకురావడానికి వెళ్ళారు. సింహనాదాలతో ఆ పర్వతాన్ని కదిలించాలని ప్రయత్నించి దేవతలు, రాక్షసులు కదల్చలేక భంగపడ్డారు.

దేవతలు ప్రార్థించగా విష్ణువు ఆజ్ఞతో అనంతుడు మందర పర్వతాన్ని సముద్రతీరంలో విడిచాడు. విష్ణువు మందర పర్వతానికి వాసుకిని అల్లెత్రాడుగా చేసి పర్వతాన్ని సముద్రంలో దించగా, అది మునిగి పోయింది. దానికి దేవతలు ఆవేదన చెంది, కాపాడుమని మహావిష్ణువును ప్రార్థించారు. విష్ణువు వేయి యోజనాల విశాలమైన వజ్రమయమైన కర్పరంతో కూర్మరూపాన్ని ధరించి, మందర పర్వతాన్ని తన వీపు మీద ఎత్తి నిలిపాడు. దేవతలు వాసుకి తలను పట్టుకోబోగా వారించి, రాక్షసులు తలను పట్టుకున్నారు. దేవతలు వాసుకి తోకను పట్టుకొని ఉత్సాహంతో సముద్రాన్ని మథించడం ప్రారంభించారు. దేవదానవులు మథించే వేగ భారానికి సహించలేక వాసుకి విషాన్ని సముద్రంలో క్రక్కినాడు. వెంటనే ఉద్ధతమైన పొగలు, మంటలతో హాలాహలం అనే విషం పుట్టింది. దేవ దానవులు భయంతో కాపాడుమని శివుడిని ప్రార్థించారు. శివుడు ప్రత్యక్షమై ముల్లోకాలను తల్లడిల్లేలా చేసిన హాలాహలాన్ని

అల్లోనేరేడు పండులాగ అరచేతితో పట్టి వేగంగా మింగి, కంఠంలో నిలిపాడు. దేవతలు, రాక్షసులు శివుడి మహిమను కొనియాడగా, శివుడు కైలాసానికి తిరిగి వెళ్ళాడు. ఆ తర్వాత దేవతలు, రాక్షసులు తిరిగి సముద్రాన్ని మథించగా అందులో నుండి ఉచ్చైశ్రవం, ఐరావతం మొదలైన వస్తువులు జన్మించాయి. చివరగా ధన్వంతరి అమృత కలశంతో ప్రత్యక్షమైనాడు. కార్యం ఫలించిందని సంతోషించి, దేవతలు, రాక్షసులు మందర పర్వతాన్ని తిరిగి యథాస్థానంలో నిలిపినారు.

బ్రహ్మదేవుడు ఆచార్యుడుకాగా, ఇంద్రుడు పెళ్ళిపెద్దగా, దేవతలు, రాక్షసులు కలిసి లక్ష్మీనారాయణల కళ్యాణాన్ని వైభవంగా జరిపించారు. ఇంద్రుడికి బ్రహ్మ ఉచ్చైశ్రవం మొదలైన వస్తువుల్ని ఇవ్వగా, రాక్షసులు అమృత కలశాన్ని అపహరించారు. దేవతలు ప్రార్థించగా విష్ణువు మోహినీరూపంతో వారి ముందు నిలిచాడు. మోహిని దేవదానవులకు వైరం కలగడానికి కారణమైన అమృతాన్ని తాను ఇద్దరికీ సమానంగా పంచుతానని కలశాన్ని తీసుకుంది. దేవతలు, రాక్షసులు రెండు బంతులుగా కూర్చున్నారు. మోహిని అమృతాన్ని మొదట దేవతలకు పంచుతుండగా, రాహుకేతువులు మారురూపాలతో అమృతాన్ని గ్రహించారు. సూర్య చంద్రులు కనుసైగ చేయగా మోహిని సుదర్శన చక్రంతో రాహుకేతువుల తలలు ఖండించింది. అమృత కలశాన్ని ఇంద్రుడికి ఇచ్చి, మోహిని అదృశ్యమైంది.

రాక్షసులు జరిగిన మోసాన్ని తెలుసుకొని, దేవతల మీదికి యుద్ధానికి వెళ్ళారు. అమృతం తాగిన దేవతలు రాక్షసులను యుద్ధంలో ఎదుర్కొన్నారు. రాక్షసులు బలి చక్రవర్తి నాయకత్వంలో రణరంగానికి వచ్చారు. దేవతలు బదరికాశ్రమ వాసులైన నరనారాయణులను శరణు వేడుకున్నారు. నరనారాయణులు యుద్ధంలో బలిచక్రవర్తిని, రాక్షసవీరులనూ ఓడించారు. రాక్షసులు ఓడిపోయి రణరంగం నుంచి పారిపోయారు. నరనారాయణులు ఇంద్రుడికి విజయాన్ని కలిగించి బదరీవనానికి తిరిగి వెళ్ళారు. ఆ విధంగా రాక్షసులు విష్ణుమాయకు తగుల్కొని మోసపోగా, విష్ణువును ఆశ్రయించిన ఇంద్రుడు తిరిన తన పదవిని, సంపదనూ పొందగలిగాడని సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు. ఈ కథలో దుర్వాసమహర్షి శాపం ఫలితంగా మహాలక్ష్మి సముద్రం పాలైంది. ఇంద్రుడికి పదవీచ్యుతి కలిగింది. బలిచక్రవర్తి దేవతలను జయించి స్వర్గాన్ని ఆక్రమించాడు. ఇంద్రుడికి తిరిగి పదవిని, సంపదలనూ కలిగించాలంటే రాక్షసులను జయించాలి. దేవతలకు అంతటి శక్తి సంపదలు కలగాలంటే అమృతాన్ని సాధించాలి. దానికి సముద్రాన్ని మథించాలి. ఆ పని దేవతలు ఒక్కరి వలన సాధ్యం కాదు, బలవంతులైన రాక్షసుల సహాయం తప్పకుండా కావాలి. అందువలననే విష్ణువు ఇంద్రుడికి సముద్ర మథనం కోసం బలిచక్రవర్తిని ఒప్పించమని సలహా ఇచ్చాడు. బలిచక్రవర్తి ఇంద్రుడి మాటలు వినడానికి అమృతపానం వల్ల రాక్షసులు కూడా అమరులు అవుతారని చెప్పడం ప్రధాన కారణం.

క్షీరసముద్ర మథనానికి కావలసిన సాధన సామగ్రిని అంతా విష్ణువే ఏర్పాటు చేశాడు. మందర పర్వతం మునిగి పోతే విష్ణువే స్వయంగా కూర్మరూపంతో దాన్ని తన వీపుమీద నిలిపాడు. క్షీరసముద్రం నుంచి జన్మించిన వస్తువులన్నింటినీ ఇంద్రుడికే అనుగ్రహించి, విష్ణువు మహాలక్ష్మి జన్మించేంత వరకూ ఎదురు చూశాడు. సముద్రం పాలైన మహాలక్ష్మిని తిరిగి పొందడం కోసమే విష్ణువు ఈ సముద్ర మథనాన్ని జరిపించాడు. సముద్ర మథనానికి బలి చక్రవర్తిని, రాక్షసులను ఒప్పించడంలోనే విష్ణుమాయ దాగి ఉంది. మందర పర్వతాన్ని కదిలించలేక పోవడం వల్ల రాక్షసుల అశక్తిత, విష్ణుమాయా మహిమ వెల్లడవుతున్నాయి. అమృతాన్ని దేవతలకు పంచడానికి మాయా మోహినిగా మారడం విష్ణుమాయా విలాసకేళికి నిదర్శనం. బలి చక్రవర్తి మొదలైన రాక్షస వీరులను ఓడించేందుకు నరనారాయణుల్ని వినియోగించడం, ఇంద్రుడికి పూర్వ వైభవాన్ని కల్పించడం అంతా విష్ణుమాయా విలాసకేళిలోని అంతర్భాగమని గ్రహించాలి. ఈ సముద్ర మథన వృత్తాంతం అంతా కూడా విష్ణువు మహాలక్ష్మిని తిరిగి పొందడానికి కల్పించిన మాయా విలాసమని తెలుస్తున్నది.

4.5.1.2. శివగర్వభంగం కథ

నారదముని త్రిలోక సంచారం చేస్తూ, ఒకనాడు శివుడిని దర్శించుకోవాలని కైలాసానికి వెళ్ళాడు. దేవతా సమూహాలతో, రుద్రగణాలతో కొలువుదీరి ఉన్న శివుడిని చూసి, నారదుడు నమస్కరించాడు. శివుడు నారదుడిని సముద్ర మథనం వల్ల కలిగిన హాలాహలాన్ని తాను హరించిన తర్వాత ఏమేమి జన్మించాయని అడిగాడు. నారదుడు శివుడితో క్షీరసాగరం నుంచి లభించిన ఉచ్చైశ్రవం మొదలైన వస్తువుల్ని ఇంద్రుడు గ్రహించాడని తెలిపాడు. అమృతాన్ని రాక్షసులు అపహరించగా, విష్ణువు మాయామోహినిగా అవతరించి, అమృతాన్ని దేవతలకు పంచాడని తెలిపాడు. నారదుడు విష్ణుమాయను ప్రస్తుతించగా విని శివుడు కోపించాడు. శివుడు నారదునితో లోకంలో ఎవరైనా విష్ణుమాయకు భ్రమించవచ్చు కాని తాను మాత్రం భ్రమించనని పలికాడు. శివుడు తన మహిమ బ్రహ్మ విష్ణువులకు కూడా తెలుసునని, పూర్వం తాను లింగ రూపాన్ని ధరించినపుడు దాని ఆద్యంతాలను బ్రహ్మ విష్ణువులు కూడా కనిపెట్టలేక పోయారని అన్నాడు. నారదుడు శివుడితో మోహిని సౌందర్యాన్ని చూస్తే అతడికి కూడా మోహం కలుగుతుందని అన్నాడు. నారదుడు శివుడి మోహాన్ని గురించి చెబుతూ, పూర్వం ఒక గౌడ ఇల్లాలిని మోహించి వెళ్ళిన శివుడు, ఆమె భర్త రాగానే భయంతో కల్లు కడవలో దాగినాడని హేళన చేశాడు. శివుడు నారదుడి మీద పంతంతో, మోహినిని చూడాలనే ఉత్సాహంతో వైకుంఠానికి బయలు దేరాడు. శివుడు వైకుంఠపురంలో ప్రవేశించగానే జయ విజయులు వచ్చి విష్ణువు సన్నిధికి తీసుకువెళ్ళారు. విష్ణువు శివుడిని సాదరంగా ఆహ్వానించి కుశల ప్రశ్నలు అడిగాడు. శివుడు విష్ణువును స్తుతించి, తాను మోహినీ రూపాన్ని చూడాలని వచ్చినట్లుగా తెలిపాడు.

విష్ణువు శివుడి కోరికను తీర్చకుంటే శివకేశవుల మధ్య అంతరం ఉందని లోకం భావిస్తుందని చెప్పి, మహాదేవుడైన శివుడు కోరినట్లుగా మోహినీ రూపంతో అతడి ఎదుట నిలిచాడు. మోహినిని చూడగానే శివుడు నారదునితో కలిగిన పంతాన్ని మరిచి మదన పరవశుడయ్యాడు. మోహిని శృంగార విలాసంతో కందుక క్రీడను ఆడుతూ శివుడికి మోహ విభ్రాంతిని కలిగించింది. శివుడు మదనాతురుడై మోహినితో మాట్లాడాలని సమీపించాడు. కందుక క్రీడలో లీనమై కోకముడి జారిన మోహినిని చూసి శివుడు కామోద్రేకంతో కౌగిలించుకున్నాడు. మోహినిని తాకగానే రతిపారవశ్యంతో శివుడికి శుక్లపతనమైంది. శివుడు మెహపారవశ్యాన్ని విడిచి, అదంతా విష్ణుమాయగా భావించి పశ్చాత్తాపాన్ని పొందాడు. శివుని తేజం నుండి సద్యోజాతుడై కాలభైరవుడు జన్మించాడు. జరిగిన దానికి చిన్నబోయిన శివుడిని విష్ణువు ఊరడించి, శివుడి మహిమను కీర్తించాడు. విష్ణువు శివుడితో నారదుడు కూడా ఇటువంటి భంగపాటు పొందుతాడని చెప్పాడు. శివుడు విష్ణువును కీర్తించి, తిరిగి కైలాసానికి వెళ్ళాడు. ఈ విధంగా శివగర్వభంగం జరిగింది.

ఈ కథలో శివుడు గర్వించడానికి నారదుడు చేసిన విష్ణుమాయాస్తుతి కారణమని మనకు తెలుస్తుంది. శివుడు రాక్షసులను విష్ణువు మాయామోహిని రూపంతో మోసపుచ్చాడని విని, తాను వారిలాగ విష్ణుమాయకు భ్రమించనని నారదుడితో అన్నాడు. మన్మథుడిని దహించిన మనోనిగ్రహం గల శివుడు కూడా మోహిని సౌందర్యానికి మోహితుడవుతాడని నారదుడు పలికిన మాటలు శివుడిలో గర్వానికి బీజప్రాయమైనాయి. నారదుడు విష్ణుమాయను స్తుతించి, శివుడి మహిమను చులకన చేయడం శివుడి గర్వాన్ని అంకురింపజేసింది. శివుడు గౌడకాంతను మోహించిన నిదర్శనంతో నారదుడు అపహాస్యం చేయడం శివుడిగర్వాన్ని అతిశయింపజేసింది. అందుచేతనే శివుడు విష్ణువు పలికిన హితోక్తులను నిర్లక్ష్యం చేశాడు. శివుడు మోహినిని చూసి నిగ్రహంతో ఉండటం తనకెంతపాటి అంటూ విష్ణుమాయను చులకన చేశాడు. మోహినీ సౌందర్యాన్ని శివుడు మెచ్చుకోవడం తోనే అతడి మోహవిభ్రాంతి వ్యక్తమయింది. శివుడి కామ వివశత్వానికి మోహినిని కౌగిలించుకోవడం నిదర్శనంగా చెప్పుకోవచ్చు. శివుడు మదన పారవశ్యం వదిలిన తర్వాత చిన్న బోవడం అతని పశ్చాత్తాపానికి చిహ్నం. శివుడు విష్ణువును స్తుతించడం అతడి గర్వభంగానికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

### 4.5.1.3. బ్రహ్మగర్వభంగం కథ

బ్రహ్మదేవుడు ఒకనాడు సరస్వతితో సరస కేళిలో ఉండగా ఈ సకల ప్రపంచమంతా అతని మాయవల్లనే నడుస్తున్నదని అన్నాడు. బ్రహ్మ సరస్వతితో తాను స్వయంభువునని, ముల్లోకాలలో తానే అధికుడనని గర్వంతో పలికాడు. సరస్వతి బ్రహ్మ మాటలకు బదులుగా విష్ణుమహిమను గురించి తెలిపింది. సరస్వతి బ్రహ్మకు

అతడు విష్ణువు నాభికమలం నుంచి జన్మించిన విషయాన్ని గుర్తుచేసింది. బ్రహ్మ ఆ మాటలకు అహంకరించి, విష్ణువు నాభికమలం నుంచి జన్మించడం తన దోషం కాదన్నాడు. బ్రహ్మ దారువు నుంచి జన్మించిన అగ్ని ఆ దారువునే అశనంగా గ్రహించినట్లుగా, విష్ణువు నాభి కమలం నుంచి జన్మించిన తాను కూడా విష్ణువు కంటే అధికుడినని పలికాడు. అతడు తన మహిమను సరస్వతికి చూపించడానికి లోకంలోని బ్రహ్మ తేజాన్ని తాను ఉపసంహరించుకుంటే, ఎవరు సృష్టి నిర్మాణాన్ని చేస్తారో ఆమెకు తెలుస్తుందని అన్నాడు. బ్రహ్మ సరస్వతితో లోకాలన్నీ అతని ఆధీనంలో ఉన్నాయని, తనను మించిన దైవం వేరొకరు లేరనీ అన్నాడు. ముల్లోకాలకు తానే కర్తను, భర్తను, భోక్తను అని గర్వంతో పలికాడు.

సరస్వతి బ్రహ్మను వారించి, అతనికి విష్ణుమాయా మహిమను తెలిపింది. విష్ణుమాయను ఎదరించవద్దని సరస్వతి బ్రహ్మకు హితవు చెప్పింది. బ్రహ్మ దురహంకారంతో తన మహిమను సరస్వతికి చూపాలని. సృష్టి నిర్మాణాన్ని విడిచిపెట్టి, సత్యలోకం నుంచి గాఢాంధకారమయమైన ఒక శూన్య ప్రదేశానికి వెళ్ళాడు. బ్రహ్మ సత్యలోకాన్ని చీకటిమయం చేసి వెళ్ళగా, సరస్వతి పరితాపంతో విష్ణువును ప్రార్థించింది. విష్ణువు లక్ష్మీదేవితో కలిసివచ్చి సరస్వతిని ఓదార్చాడు. లక్ష్మీదేవి సరస్వతిని ఆమె వెంట వైకుంఠానికి తీసుకువెళ్ళింది. బ్రహ్మ విడిచి వెళ్ళగా అంధకారంలో మునిగిపోయిన లోకాలను విష్ణువు తన మాయా ప్రభావంతో తిరిగి ప్రకాశింపజేశాడు. సృష్టినిర్మాణ కార్యాన్ని కొనసాగించాడు. విష్ణువు మాయా మునిగా మారి, బ్రహ్మ వెళ్ళిన గాఢాంధకార ప్రదేశానికి ఆవలగా ఒక శృంగార వనాన్ని కల్పించాడు. విష్ణువు ఆ వనంలో ఒక పర్ణశాలను, ఒక మాయాకన్యనూ ఏర్పరిచాడు. బ్రహ్మ తాను విడిచి వచ్చిన తర్వాత లోకాలన్నీ ఏ విధంగా తల్లడిల్లుతున్నాయో చూడాలని బయలుదేరగా, అతడికి మాయా ముని ఎదురయ్యాడు. గాఢాంధకారంలో బ్రహ్మ తేజస్సును మించిన వెలుగుతో ప్రకాశిస్తున్న మాయాముని బ్రహ్మను ఎవరని అడిగాడు. బ్రహ్మ తాను బ్రహ్మ మానస పుత్రుడైన భద్రకుడనని తెలిపాడు.

మాయముని తన పేరు మాయికుడని, సమీపంలోనే తన ఆశ్రమం ఉందని తెలిపాడు. మాయికుడు తన వెంట బ్రహ్మను కూడా తీసుకువెళ్ళాడు. మాయికుని వెంట వెళ్ళిన బ్రహ్మ ఆశ్రమద్వారంలో పూజాసామాగ్రితో ఎదురువచ్చిన మునికన్యను చూసి ఆశ్చర్యపోయాడు. మునికన్య బ్రహ్మను అర్ఘ్యపాద్యాలతో గౌరవించింది. బ్రహ్మ మునికన్య సౌందర్యానికి లోలుడైనాడని మాయికుడు గ్రహించాడు. మాయికుడు, బ్రహ్మ కాలకృత్యాలు తీర్చుకున్న తర్వాత మునికన్య వారిద్దరికీ భోజనం వడ్డించింది. తర్వాత బ్రహ్మ విశ్రమించి, మాయికుడిని ఆ కన్య వివరాలు అడిగాడు. మాయికుడు ఆమె అతని మానసపుత్రిక అని, ఆమె సుగుణాలను వర్ణించాడు. ఆమె సృష్టికర్త

అయిన బ్రహ్మను వరించిందని, అందువల్లనే మాయికుడు బ్రహ్మను తీసుకు వచ్చినట్లుగా తెలిపాడు. బ్రహ్మ మునికన్యతో తన మహత్త్వాన్ని సత్యలోకాన్ని విడిచి రావడానికి గల కారణాన్నీ తెలిపాడు. మునికన్య ఆ మాటలువిని తన గురించి బ్రహ్మకు తెలియకపోవడంతోనే అతని అల్పత్వం వెల్లడవుతుందని అన్నది. మునికన్య బ్రహ్మ లేనంతమాత్రాన లోకాలకు వచ్చిన ఆపద ఏమీలేదని పలికింది. బ్రహ్మ ఆమె మాటలకు రోషంతో, లోకంలో కొందరు తపశ్శక్తితో అల్పమైన సృష్టి చేసినంత మాత్రాన దాన్నే ఘనతగా కీర్తించడం స్త్రీలకు తెలిసిన వింతగా పేర్కొన్నాడు. బ్రహ్మ తనను వివాహం చేసుకోమని మునికన్యను అడిగాడు.

మునికన్య బ్రహ్మ ఆమెకు వశుడయ్యాడని భావించి, బ్రహ్మ సృష్టి కాకుండా వేరొక బ్రహ్మాండాన్ని తాను చూశానని చెప్పింది. మునికన్య బ్రహ్మతో యోగసమాధిలో ఆమె పద్నాలుగు లోకాలను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, ఇంద్రాది దేవతలను కూడా చూసినట్లు చెప్పింది. బ్రహ్మ మునికన్య మాటలకు కోపించి, ఆమె చెప్పిందంతా అసత్యమని అన్నాడు. మునికన్య ఆమె చెప్పింది సత్యమని బ్రహ్మతో వాదించింది. మాయికుడు వారిద్దరినీ వారించి, మునికన్య చెప్పింది నిజమైతే బ్రహ్మకు దానిని చూపించమన్నాడు. మునికన్య తన తపశ్శక్తితో పుష్పక విమానాన్ని కల్పించి, బ్రహ్మతో కలిసి దానిలో తాను చెప్పిన లోకానికి బయలుదేరింది. ఆ పుష్పక విమానం ఆకాశంలో ప్రయాణించి నిబిడాంధకారాన్ని దాటుకొని వేరొక భూమండలానికి చేరుకుంది. మునికన్యతోపాటు పుష్పకంలో ఉన్న బ్రహ్మ అక్కడ ఉన్న పర్వతాలు, సముద్రాలు, సూర్య చంద్ర మండలాలు, మృగపక్షి దైత్య పన్నగ పిపీలికాదులు మొదలైనన్నీ చూసి ఆశ్చర్యపోయాడు.

బ్రహ్మకు అతడొక కీటకం లాగ కనిపించగా, సూర్యతాపానికి ఓర్వలేక మూర్ఛపోయాడు. మునికన్య బ్రహ్మ మూర్ఛను అమృతజలంతో తీర్చింది. మునికన్య బ్రహ్మను సత్యలోకానికి తీసుకువెళ్ళగా, అక్కడ ద్వారపాలకులు బ్రహ్మను అడ్డగించారు. మునికన్య బ్రహ్మను తనవెంట అష్టముఖబ్రహ్మ సభామందిరానికి తీసుకొని వెళ్ళింది. మునికన్య అష్టముఖునికి బ్రహ్మను గురించి చెప్పి, ఆమెకు బ్రహ్మతో కలిగిన పంతం గురించి తెలిపింది. అదివిని అష్టముఖుడు బ్రహ్మను నిందించి, విష్ణు మహిమను కొనియాడినాడు. అష్టముఖుడు మునికన్యతో పూర్వం ఈ బ్రహ్మ లాగే దుర్నీతి అతన్ని కూడా భ్రమింపజేసిందని ఆవృత్తాంతాన్ని వినిపించాడు. అష్టముఖుడు ముల్లోకాల పాలన వలన ఈ భువన భారాన్నంతా తానే మోస్తున్నానని భ్రమించాడు. అష్టముఖుడు తాను తప్ప అన్యదైవం ఎవరూ లేరని గర్వించాడు. ఆకాశవాణి అష్టముఖుడితో దురహంకారం వద్దని చెప్పి, ఈ దురహంకారంతోనే భర్ముడనే వాడు పూర్వం భంగపాటును పొందాడని తెలిపింది. ఆకాశవాణి అష్టముఖుడిని వెళ్ళి మేరుపర్వతం మీద ఉన్న భర్ముడిని కలిసిరమ్మని చెప్పింది. అష్టముఖుడు మేరుపర్వతం చేరుకొని,

భర్ముడనే మునిని కలుసుకున్నాడు. భర్ముడు అష్టముఖుడిని సాదరంగా ఆహ్వానించి, అతడికి తన పూర్వ వృత్తాంతాన్ని ఈ విధంగా చెప్పాడు.

పూర్వం ఒక కమలభవాండంలో సౌమ్యుడనే బ్రాహ్మణుడికి భర్ముడు, ధర్ముడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. ఆ కుమారులు ఇద్దరూ శోణకుడు అనే ముని దగ్గర శిష్యరికం చేసి, గురువును తమ సేవలతో మెప్పించారు. శోణకుడు వారిద్దరికీ ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. భర్ముడు, ధర్ముడు ఇద్దరూ తమకు సంసారవాంఛ, శరీరంపై మోహం లేదని, మోక్షాన్ని ప్రసాదించమని కోరారు. శోణకుడు వారిద్దరికీ నారాయణ అష్టాక్షరీ మంత్రాన్ని రహస్యంగా ఉపదేశించాడు. ధర్ముడు విష్ణువును మనస్సులో నిలిపి తపస్సు చేయగా, విష్ణువు ప్రసన్నుడై అతడికి బ్రహ్మ పదవిని ఇచ్చాడు. ధర్ముడు బ్రహ్మపదవిని పొంది ముల్లోకాలను పాలిస్తుండగా, దేవతలు, మునులు చేరి అతడిని సేవించసాగారు. ఒకసారి ధర్ముడి కొలువులో విష్ణుశర్మ అనే వైష్ణవుడు విష్ణువును మించినదైవం లేరని, విష్ణు మహిమను స్తుతించాడు. అది విని శివశర్మ శివుడి మహిమను కీర్తించాడు. వారిద్దరూ హరిహరులలో ఎవరు అధికులని వాదించు కోసాగారు. ధర్ముడు వారిద్దరినీ వారించి, హరిహరుల కన్నా తానే అధికుడనని గర్వంతో పలికాడు. విష్ణుశర్మ ధర్ముడి మాటలకు కోపించి, సర్వజ్ఞుడై కూడా అతడు గర్వంతో విష్ణుమాయను చులకన చేయడం తగదని హితవు పలికాడు.

ధర్ముడు విష్ణుశర్మ మాటలకు కోపించి, సర్వలోకాన్నీ తానే సృష్టించడం వల్ల సర్వేశ్వరుడైన తానుతప్ప అన్యదైవం లేడని అన్నాడు. విష్ణుశర్మ ధర్ముడి మాటలకు కోపించి, అతడిని వానరుడిగా జన్మించమని శపించాడు. హరిభక్తితో ప్రవర్తిల్లి, తిరిగి బ్రహ్మ పదవిని పొందగలవని విష్ణుశర్మ ధర్ముడికి శాపవిమోచన మార్గాన్ని తెలిపాడు. ధర్ముడు శాప ప్రభావంతో భూలోకంలో హనుమంతుడు అనే వానరుడిగా జన్మించాడని భర్ముడు అష్టముఖుడికి తెలిపాడు. భర్ముడి హితబోధను విని అష్టముఖుడు తన దురభిమానాన్ని విడిచిపెట్టాడు. ఆనాటి నుంచి విష్ణుభక్తి తత్పరతతో ప్రవర్తిల్లుతున్నానని అష్టముఖుడు మునికన్యతో చెప్పాడు. ఆ తర్వాత అష్టముఖుడు బ్రహ్మను చూసి, దురహంకారంతో విష్ణుమహిమను చులకన చేసినందుకు అతడి ముఖం చూస్తేనే పాపం కలుగుతుందని నిందించాడు. బ్రహ్మ అష్టముఖుడు తెలిపిన వృత్తాంతాన్ని విని, తన అల్పత్వాన్ని విష్ణు మహిమనూ గ్రహించాడు. బ్రహ్మ పశ్చాత్తాపాన్ని పొంది, లేనిపోని గర్వంతో ప్రవర్తించినందుకు తాను ఇంతటి భంగపాటును పొందానని చింతించాడు. బ్రహ్మ తనలో ఎక్కడి ముని ఆశ్రమం, ఎక్కడి మునికన్య, ఇప్పుడు ఎక్కడికి వెళ్ళగలనని విచారించాడు. మునికన్య వచ్చి బ్రహ్మతో తాను చెప్పింది సత్యమని ఇప్పటికైనా నమ్మకం కలిగిందా అని అడిగింది. బ్రహ్మ సిగ్గుపడి, అక్కడి నుంచి తనను తన లోకానికి చేర్చమని మునికన్యను బ్రతిమాలుకున్నాడు.

మునికన్య ప్రభావంతో కనులుమూసి తెరిచేలోగా బ్రహ్మ పూర్వం అతడున్న అంధకార ప్రదేశానికి చేరుకున్నాడు. బ్రహ్మ తనలో సరస్వతి చెప్పిన మాటల్ని వినకుండా గర్వంతో ప్రవర్తించినందుకు ఈరీతిగా మోసపోయానని అనుకొంటూ సత్యలోకానికి వెళ్ళాడు. అక్కడ సత్యలోకం పూర్వం కంటే వైభవోపేతంగా ప్రకాశిస్తుండగా, సరస్వతి ప్రభుత్వం చేస్తుందేమోనని భావించిన బ్రహ్మకు చింతామణి సింహాసనం మీద కపటబ్రహ్మ కనిపించాడు. బ్రహ్మ తాను విష్ణువు నాభికమలం నుంచి జన్మించిన విషయాన్ని మరిచి, విష్ణుమాయను నిందించి పగనుకొని తెచ్చుకున్నానని భావించాడు. బ్రహ్మ తనలో సర్వలక్షణ సుధీనిధి అయిన సరస్వతిని పరులపాలు చేశానని పశ్చాత్తాపపడుతూ విలపించాడు. ఆ సమయంలో సరస్వతి బ్రహ్మను గురించి తలచుకున్నది. విష్ణుమాయా ప్రభావంతో కపటబ్రహ్మ కల్పనలన్నీ తొలగిపోగా సరస్వతి బ్రహ్మ సత్యలోకంలో ఒకేచోట కలుసుకున్నారు. బ్రహ్మ తాను సరస్వతితో కూడి చింతామణి సింహానం మీద ఉండటాన్ని గ్రహించి, అదంతా విష్ణుమాయా విలాసమని తెలుసుకున్నాడు. బ్రహ్మ తాను పడిన పాట్లన్నిటినీ సరస్వతికి తెలిపి, విష్ణుమాయను తరించడం ఎంతటివారికైనా శక్యం కాదని గ్రహించాడు.

ఈకథలో బ్రహ్మ, సరస్వతుల సరసకేళిలో మకరికా పత్రాలను చిత్రించిన బ్రహ్మ నైపుణ్యాన్ని సరస్వతి మెచ్చుకోవడం అతడికి గర్వకారణమైంది. అందువల్లనే బ్రహ్మ తన మహత్వాన్ని సరస్వతి ముందు అతిశయంగా పొగుడుకున్నాడు. బ్రహ్మ గర్వానికి సరస్వతి చేసిన విష్ణుస్తుతి కంటకంలాగ తగిలింది. ఏకాంత సమయంలో బ్రహ్మను కాదని, సరస్వతి విష్ణుమహిమను పొగడటం అతడి అహాన్ని రెచ్చగొట్టింది. బ్రహ్మకు సృష్టికర్తననే గర్వంతోపాటు ఈ అహంకూడా తోడవడంతో అతడు విష్ణుమాయను నిందించాడని తెలుస్తుంది. సరస్వతి విష్ణుమాయను పొగడటం బ్రహ్మకు కంటగింపును కలిగించిందని తెలుస్తుంది. అందుచేతనే బ్రహ్మ తన మహిమను సరస్వతికి చూపించాలని తహతహలాడిపోయాడు. బ్రహ్మ సృష్టి నిర్మాణాన్ని విడిచి, తన తేజాన్ని ఉపసంహరించుకోవడానికి కారణం ఆ కుతూహలమేనని చెప్పవచ్చు. విష్ణువు మాయికుడిగా మారడం, మునికన్యను, ఆశ్రమాన్నీ కల్పించడం ఇవన్నీ బ్రహ్మ సృష్టి కంటే వేరొక సృష్టి ఉందని సూచించడానికేనని తెలుస్తుంది. బ్రహ్మ మాయికుని వెంట వెళ్ళడం, ఆశ్రమంలో ఆతిథ్యాన్ని స్వీకరించి కూడా సత్యాన్ని గ్రహించక పోవడానికి విష్ణుమాయా ప్రభావమే కారణం.

విష్ణుమాయా ప్రభావంతోనే బ్రహ్మ మునికన్య మీద మోహాన్ని పొందడం జరిగిందని తెలుస్తుంది. బ్రహ్మ మునికన్యతో వాదన చేయడం, ఆమె వెంట పుష్పక విమానంలో వెళ్ళడానికి అతడు విష్ణుమాయను ద్వేషించడం కారణమని తెలుస్తుంది. మునికన్య బ్రహ్మను పుష్పక విమానంలో తీసుకువెళ్ళడం, సూర్యతాపానికి బ్రహ్మ

మూర్ఛపోవడం అతడి అల్పత్వాన్ని, అశక్తతనూ వెల్లడిస్తున్నాయి. అష్టముఖుడిని చూడగానే బ్రహ్మకు అతని మహత్వం అవగతమైంది. అష్టముఖుడు వినిపించిన విష్ణుమాయా మహత్వ కథనం అంతా బ్రహ్మ గర్వాన్ని భంగపరచడానికి చేసిన ఏర్పాటుగా కనిపిస్తుంది. బ్రహ్మకు గర్వభంగం కలిగిన తర్వాత సత్యలోకంలో చింతామణి సింహాసనం మీద కపట బ్రహ్మను కల్పించడం వల్ల అతడి గర్వాన్ని సమూలంగా నాశనం చేయడమే ప్రధానోద్దేశ్యంగా కనిపిస్తుంది. బ్రహ్మకు పశ్చాత్తాపం కలిగిన తర్వాతనే విష్ణువు తిరిగి అతడికి పూర్వపుస్థితిని కలిగించాడు. అష్టముఖుడు, ధర్ముడు, భర్ముడు మొదలైన వారందరి వృత్తాంతాన్ని వినిపించడం విష్ణుమాయా కల్పనలోని భాగమేనని గ్రహించాలి. ఈ విధంగా విష్ణువు బ్రహ్మకు కలిగిన గర్వాన్ని భంగపరిచాడని తెలుస్తుంది.

4.5.1.4. నారదగర్వభంగం కథ

శ్రీకృష్ణుడు భూభార నివారణకారుడై రుక్మిణి, సత్యభామ మొదలైన అష్టమహిషులతో కూడి ద్వారకానగరాన్ని పరిపాలిస్తున్నాడు. నారదుడు భూలోకసంచారం చేస్తూ ద్వారకా నగరానికి రాగా, శ్రీకృష్ణుడు అతడిని సాదరంగా ఆహ్వానించాడు. శ్రీకృష్ణుడు సభలో కొలువుదీరి నారదుడి కుశల ప్రశ్నలు అడిగాడు. నారదుడు శ్రీకృష్ణుడిని స్తుతించాడు. రైవతగిరి నుండి బోయవాళ్ళు శ్రీకృష్ణుడి కొలువుకు వచ్చి, జాతి పునుగు, కప్పురం, జవ్వాది, కస్తూరి, ద్రాక్షపళ్ళు, మేలైన మామిడి పండ్లు బహూకరించారు. బోయనాయకుడు శ్రీకృష్ణునితో రైవతగిరి వనశోభను వర్ణించి చెప్పి, అతడిని వన విహారానికి ఆహ్వానించాడు. శ్రీకృష్ణుడు దానికి అంగీకరించి, వారికి తగిన కానుకలు ఇచ్చి పంపించాడు. శ్రీకృష్ణుడు శుభముహూర్తాన్ని నిర్ణయించుకొని, విప్రులకు, ముత్తైదువలకు దానం చేసి వనవిహారానికి బయలుదేరాడు. శ్రీకృష్ణుని వెంట నారదుడు, రుక్మిణీ సత్యభామలు కూడా అనుసరించి వచ్చారు.

రైవతగిరి వనంలో శ్రీకృష్ణుడు విడిది చేయగా రుక్మిణి, సత్యభామలు చెలికత్తెలతో వన విహారానికి వెళ్ళారు. శ్రీకృష్ణుడు నారదుడితో కలిసి వనవిహారానికి వెళ్ళాడు. నారదుడు ఆ రైవతగిరి వనశోభను మెచ్చుకుంటూ, శ్రీకృష్ణుడి మాయా ప్రభావం వల్లనే ఆ వనానికి అంతటి శోభకలిగిందని అన్నాడు, నారదుడు శ్రీకృష్ణుడితో అతడి మాయ తనకు తెలియనిది కాదని అన్నాడు. కృష్ణుడు బదులుగా నారదుడి మహిమను తెలుసుకోవడానికి బ్రహ్మరుద్రులకు కూడా అసాధ్యమని అన్నాడు. శ్రీకృష్ణుడు నారదుడిని తన మాయా ప్రభావంతో అడవి మధ్యలోకి తీసుకువెళ్ళాడు. నారదుడు అడవి మధ్యలో నిర్మలమైన ఒక సరస్సును చూసి, విష్ణుమాయా ప్రభావితుడై ఆ సరస్సులో దాహం తీర్చుకొని స్నానం చేయాలని భావించాడు. శ్రీకృష్ణుడి అనుమతితో నారదుడు సరస్సులో మునిగి చంద్రరేఖ అనే కన్యగా మారినాడు. సరస్సు ఒడ్డున ఒక మాయకాంత కనిపించి,

ఆ చంద్రరేఖ అనంతుడనే మునికి ఆమెకి జన్మించిన కుమార్తె అని చెప్పింది. మాయకాంత చంద్రరేఖ జన్మించగానే అనంతుడు తపస్సుకు వెళ్ళగా, బిడ్డమీది మమకారంతో తాను మాత్రం వెళ్ళలేదని చెప్పింది. మాయకాంత చంద్రరేఖను ఆమె వెంట ఆశ్రమానికి తీసుకువెళ్ళింది. అక్కడ చంద్రరేఖ చెలులతో విహరిస్తూ తన పూర్వ వృత్తాంతాన్ని మరిచిపోయింది.

చంద్రకేతుడనే రాజు సత్యక నగరాన్ని ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. ఒకనాడు ఆ రాజు కొలువుకు ఎరుకలవారు వచ్చి, తేనె, సారపప్పు, పులిగోళ్ళు, నెమలి ఈకలు, చిలుకలు, పునుగు పిల్లులు, ముత్యాలు, కస్తూరివీణెలు సమర్పించారు. చంద్రకేతుడు వారి యోగక్షేమాలు విచారించాడు.  ఎరుకలవారు తాముక్షేమంగా ఉన్నామని చెప్పి, సకాలంలో వర్షాలు కురిసి పైరులు ఏపుగా పెరిగేసరికి, వాటిని తిని జంతువులు పోతరించినాయి. కాబట్టి రాజును వేటకు రమ్మని వారు ఆహ్వానించారు. రాజు పరివారంతో వేటకు ఉత్సాహంగా బయలు దేరాడు. చంద్రకేతుడు ఎరుకలతో కూడి అనేక రకాలుగా వేటాడి జంతునాశనం గావించాడు. అప్పుడు ఒక పెనుపంది కనిపించగా రాజు దానిని వెంబడించాడు. రాజును మంత్రి కూడా అనుసరించాడు. చంద్రకేతుడు పందిని తరుముతూ యమునాతీరం వరకూ వెళ్ళి, అలసిపోయి అక్కడ విశ్రమించాడు. చంద్రకేతుడు ఆ సమీపంలోనే మునికన్యలతో వనవిహారం చేస్తున్న చంద్రరేఖను చూశాడు. ఆమె కూడా రాజును చూసింది. ఇద్దరూ ఒకరి మీద మరొకరు విరహ భావాన్ని పొందారు. విరహంతో ఉన్న చంద్రరేఖను ముని కన్యలు ఆశ్రమానికి తీసుకువెళ్ళారు.

చంద్రరేఖ విరహాన్ని గురించి మునికన్యలు మాయకాంతతో వివరంగా చెప్పారు. ఆమె చంద్రరేఖను ఊరడించి, రాజు వివరాలను అడిగింది. యమునా తీరంలో చంద్రకేతుడు కూడా చంద్రరేఖ మీది విరహంతో అలమటిస్తుండగా మంత్రి రాజును ఊరడించాడు. మాయకాంత విరహంతో విలపిస్తున్న చంద్రరేఖలో, చంద్రకేతుడిని కలుసుకోమని చెప్పింది. చంద్రరేఖ యమునాతీరంలో చంద్రకేతుడు విశ్రమించిన ప్రాంతానికి వెళ్ళింది. అక్కడ అర్ధరాత్రి చీకట్లో కనిపించిన చంద్రరేఖను మంత్రి వివరాలు అడిగి ఆమెతో పాటుగా ఆశ్రమానికి వెళ్ళాడు. ఆశ్రమంలో మాయకాంత మంత్రికి అతిథి సత్కారాలు చేసి, తన కుమార్తెకు, రాజుకు వివాహం చేయించమని కోరింది. సూర్యోదయం కాగానే చంద్రకేతుడు ఏనుగు అంబారీ మీద ఎక్కి ఆశ్రమానికి రాగా, మాయకాంత రాజుకు అతని సేనలకూ ఆతిథ్యమిచ్చింది. మాయకాంత తన కుమార్తె అయిన చంద్రరేఖను చంద్రకేతుడికి అప్పగించి, కుమార్తెకు తగు జాగ్రత్తలు చెప్పింది. సత్యక నగరానికి వచ్చి చంద్రకేతుడు చంద్రరేఖను వివాహం చేసుకున్నాడు. వారి అనోన్య దాంపత్యానికి చిహ్నంగా అరవైమంది కుమారులు కలిగారు.

కొంతకాలం తర్వాత పృదుబాహుడనే శత్రురాజు చంద్రకేతుడిపైకి దండెత్తి వచ్చాడు. యుద్ధంలో చంద్రకేతుని తోపాటుగా అతని అరవై మంది కుమారులు కూడా మరణించారు. చంద్రరేఖ భర్త, కుమారుల శవాలను చూసి రొమ్ముగుద్దుకొని, నేలమీదపడి పొర్లుతూ దుఃఖించింది. విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖను ఆకలి బాధించగా, ఆమె ఒక చింతచెట్టు కనిపించింది. చంద్రరేఖ చింతఆకులతో ఆకలి తీర్చుకోవాలని చేయి సాచి ఆకులు అందుకోగా అవి అందలేదు. చంద్రరేఖ ఆకలి బాధతో విలపిస్తుండగా అక్కడికి ఒక వేద బ్రాహ్మణుడు వచ్చాడు. అతడు చంద్రరేఖ వృత్తాంతాన్ని విని, అశుచులైనవారు ధర్మతరువుల్ని తాకరాదని అన్నాడు. చంద్రరేఖను సమీపంలోని సరస్సులో స్నానం చేసి శుచిగా రమ్మని చెప్పాడు. చంద్రరేఖ వెళ్ళి ఆ సరస్సులో మునిగి, నారదుడిగా మారి పైకి వచ్చింది. నారదుడు సరస్సు గట్టున ఉన్న శ్రీకృష్ణుడితో తన చేతికి బంగారు కంకణం ఉండటానికి గల కారణమేమి అని అడిగాడు. విష్ణుమాయ తొలగిపోయి నారదుడికి జరిగిన వృత్తాంతం గుర్తుకు వచ్చింది. నారదుడు తన అజ్ఞానానికి సిగ్గుపడి శ్రీకృష్ణుడిని మాయా రహస్యాన్ని తెలుపమని కోరాడు. శ్రీకృష్ణుడు నారదుడికి మాయా ప్రభావాన్ని తెలిపి, తానే సర్వజ్ఞుడినని తెలిపాడు. నారదుడికి శ్రీకృష్ణుడు ముక్తిసాధన మార్గాన్ని, భక్తిప్రపత్తి మార్గాన్ని, అహంకార పద్ధతిని, జ్ఞానమార్గాన్ని, పంచప్రాణాలు, చతుర్దశ భువనాలు మొదలైన వాటిని గురించి వివరించాడు. నారదుడు తన అజ్ఞానాన్ని మాన్పమని శ్రీకృష్ణుడిని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు నారదుడికి మనస్సును గురించి, తపోధ్యాన మార్గాలను గురించి, యోగమార్గ పద్ధతిని గురించీ తెలిపాడు. నారదుడు శ్రీకృష్ణునికి నమస్కరించి అనేక విధాలుగా కీర్తించాడు.

ఈకథలో నారదుడు పూర్వం శివగర్వభంగానికి కారణమైనందు వల్లనే అతడు కూడా విష్ణుమాయ చేత గర్వ భంగాన్ని పొందాడని తెలుస్తుంది. శివుడు విష్ణుమాయ చేత భంగపాటును పొంది చిన్నబోయినప్పుడు, విష్ణువు అతడికి నారదుడిని కూడా ఈ రీతిగానే భంగపరుస్తానని మాట ఇచ్చాడు. దాని పర్యవసానమే నారదునికి స్త్రీరూపాన్ని, మాయాసంసార బంధాన్నీ కలిగించింది. నారదుడు శ్రీకృష్ణుడితో వనవిహారానికి వెళ్ళి, విష్ణుమాయ తనకు తెలియనిది కాదని ప్రగల్భాలు పలకడం అతడి అహంకారాన్ని వెల్లడిస్తుంది. నారదుడికి శ్రీకృష్ణుడితో గల చనువువల్ల అతనినోట ఈమాట వెలువడిందని తెలుస్తుంది. నారదుడికి సరస్సును చూడగానే, అందులో స్నానం చేయాలనే కోరిక కలగడానికి విష్ణుమాయ అతడిని ఆవరించడమే కారణంగా తెలుస్తుంది. నారదుడి స్త్రీ రూపం, విరహం, వివాహం, సంతానం, దుఃఖం ఇవన్నీ అతడి అహంకారాన్ని భంగపరిచేందుకు విష్ణువు కల్పించిన సాధనాలు. సరస్సులో మునిగే ముందు చంద్రరేఖను ఎడమ చేయి పైకెత్తి నీటిలో మునగమని వేదబ్రాహ్మణుడు చెప్పడం వల్లనే, నారదుడికి అతడి స్త్రీ రూప వృత్తాంతం గుర్తుకువచ్చింది. నారదుడు

విష్ణుమాయ చేత భంగపాటును పొందిన తర్వాత శ్రీకృష్ణుడిని మాయా రహస్యాన్ని తెలుపమని కోరడం అతడి జ్ఞానచింతనకు నిదర్శనంగా చెప్పవచ్చు. నారదుడు అజ్ఞానం నుంచి తనను మాన్పమని శ్రీకృష్ణుడిని ప్రార్థించడం అతడి వినయ విధేయతలకు, భక్తి తత్పరతకూ నిదర్శనంగా భావించవచ్చు. ఈ విధంగా నారదుడు విష్ణుమాయ చేత గర్వ భంగాన్ని పొందినాడని ఈ కావ్యంలో వర్ణించబడింది.

4.5.2. కల్పనలు

ఎఱగుడిపాటి వేంకటకవి తన కావ్యంలో ఎల్లన కంటే విభిన్నమైన కథా క్రమాన్ని పాటించాడని ముందుగానే చెప్పుకున్నాం. అయితే ప్రధానేతి వృత్తాన్ని మాత్రం ఎల్లన కావ్యాన్ని అనుసరించి గ్రహించినాడని చెప్పవచ్చు. వేంకటకవి తన కావ్యంలో చేసిన స్వీయకల్పనలు, కథాగతమైన మార్పులు ఎల్లన కావ్యాన్ని మరిపించి ఈ కావ్యానికొక స్వతంత్రతను ఆపాదించి పెడుతున్నాయని చెప్పవచ్చు. ఎల్లన తన కావ్యంలో నాలుగవ కథగా చెప్పిన శివదర్పభంగ కథను వేంకటకవి తన కావ్యంలో మొదటగా చెప్పాడు. ఎల్లన కావ్యంలో మూడవదైన బ్రహ్మగర్వ భంగ కథను వేంకటకవి మధ్యలో చెప్పాడు. ఎల్లనకావ్యంలో మాదిరిగానే వేంకటకవి కూడా నారద గర్వభంగ కథతో కావ్యాన్ని ముగించాడు. వేంకటకవి తన కావ్యంలోని కథాక్రమానికి అనుగుణంగా చేసిన స్వీయ కల్పనలు, వాటి వలన ప్రధాన కథకు కలిగిన రసపుష్టి మొదలైన విషయాలను తెలుసుకునేందుకు ఈక్రింది నిదర్శనాలు తోడ్పడుతున్నాయి.

1. సముద్రమథన వృత్తాంతం
2. లక్ష్మీనారాయణుల కళ్యాణం
3. దేవదానవుల యుద్ధం
4. శివునితో నారదుని సంవాదం
5. శివుని వైకుంఠ ప్రయాణం
6. బ్రహ్మగర్వం
7. మాయికుని వృత్తాంతం
8. శ్రీకృష్ణునితో నారదుని సంవాదం
9. చంద్రకేతుని వృత్తాంతం

4.5.2.1. సముద్రమథన వృత్తాంతం

ఎల్లన తనకావ్యంలో అమృతం కోసం దేవదానవులు క్షీరసముద్రాన్ని మథించారని తెలిపి, అమృతాన్ని అపహరించిన రాక్షసులను మోసపుచ్చేందుకు విష్ణువు మోహినిగా మారడం, దేవతలకు అమృతాన్ని పంచడం, ఈ వృత్తాంతాన్ని నారదుడు శివుని ముందు వినిపించడం అనేవి వర్ణించాడు. వేంకటకవి తన కావ్యాన్ని క్షీరసముద్ర మథన వృత్తాంతంతోనే ప్రారంభించాడు. క్షీరసముద్ర మథనానికి అమృత సాధన ఒక్కటే కారణం కాదని ఇంద్రునికి దుర్వాసుని వలన కలిగిన శాపం, సముద్రం

నుంచి మహాలక్ష్మిని వెలికి తీయడం అనేవి కూడా ప్రధాన కారణాలని వేంకటకవి చేసిన కల్పన వలన తెలుస్తున్నది. క్షీరసముద్ర మథనానికి రాక్షసుల సహాయం కూడా అవసరం ఉన్నందువలన ఇంద్రుడు బలిచక్రవర్తిని బతిమాలుకున్నాడని వేంకటకవి తెలిపాడు. దేవదానవులు మందర పర్వతాన్ని కదిలించలేక విఫలమైనప్పుడు విష్ణువును ప్రార్థించడం, హాలాహలం పుట్టగానే దేవదానవులు తెల్లబోగా బ్రహ్మ సూచనతో శివుడిని ప్రార్థించడం, ధన్వంతరి అమృతకలశంతో ప్రత్యక్షం కాగానే దేవదానవులు మందర పర్వతాన్ని యథాస్థానంలో నిలిపిరావడం అనేవి వేంకటకవి చేసిన కల్పనలు. ఈ కల్పనల వలన సముద్ర మథన వృత్తాంతానికి ఒక నేపథ్యం, కథలో వచ్చే సన్నివేశాల పట్ల ఆసక్తి, తర్వాత జరుగబోవు సంఘటనల పట్ల ఉత్కంఠత అనేవి కలుగుతున్నాయని చెప్పవచ్చు.

### 4.5.2.2. లక్ష్మీనారాయణుల కళ్యాణం

ఎల్లన తన కావ్యంలో సముద్ర మథనం వలన జన్మించిన మహాలక్ష్మి గురించి ప్రస్తాన మాత్రంగానే పేర్కొన్నాడు. ఎఱగుడిపాటి వేంకటకవి క్షీరసముద్రం నుండి జన్మించిన మహాలక్ష్మికి శ్రీమహావిష్ణువుతో కళ్యాణాన్ని జరిపించినాడు. బ్రహ్మ ఆచార్యుడుగా ఇంద్రుడు పెళ్ళి పెద్దగా వ్యవహరించి దేవదానవులు కలిసి ఈ కళ్యాణాన్ని మహెూత్సాహంగా జరిపించినట్లు వర్ణించాడు. ఈ కల్పన వలన క్షీరసముద్ర మథనం కేవలం అమృతం కోసం మాత్రమే కాదని మహాలక్ష్మి కోసం కూడా అనీ మనకు తెలుస్తున్నది. రాక్షసులు దేవతలకు సహాయం చేయడం, సముద్ర మథనం వలన కలిగిన వస్తువుల్లో దేనినీ వారు ఆశించక పోవడం, శ్రీమహావిష్ణుకు లక్ష్మీదేవితో దేవతలు జరిపించిన కళ్యాణంలో రాక్షసులు కూడా పాల్గొనడం అనే కల్పనలన్నీ కూడా విష్ణుమాయా విలాస ప్రకటనకు తొలిసంకేతాలని మనం అర్థం చేసుకోవాలి.

### 4.5.2.3. దేవదానవుల యుద్ధం

ఎల్లన తన కావ్యంలో దేవతలు, రాక్షసులకు మధ్య జరిగిన యుద్ధంలో అమృతపానం వలన దేవతలు జయించారని, రాక్షసులు ఓడిపోయి పారిపోయారని రెండు పద్యాలలో మాత్రమే ప్రస్తావించాడు. వేంకటకవి తన కావ్యంలో దేవదానవుల యుద్ధాన్ని విస్తృతంగా వర్ణించడం కనిపిస్తుంది. దేవతలు మాయోపాయంతో అమృతాన్ని పొందారని, తాము మోసపోయామనీ గ్రహించిన రాక్షసులు కోపావేశంతో దేవతలతో యుద్ధానికి తలపడ్డారు. అమృతపానం వలన కలిగిన శక్తితో దేవతలు వారిని ఎదుర్కొన్నారు. ఆ సంగతి తెలిసి బలిచక్రవర్తి స్వయంగా యుద్ధరంగానికి రాగా, దేవతలు భయపడి బదరీవనంలో తపస్సు చేసుకుంటున్న నరనారాయణ మునులను ఆశ్రయించారు. నరనారాయణులు వచ్చి బలిచక్రవర్తిని యుద్ధంలో ఓడించి, రాక్షసులను చెల్లాచెదరు చేశారు. ఇంద్రుడు రాక్షసుల బాధ తొలగిపోయి తిరిగి తన యథాస్థితిని

పొందాడు. వేంకటకవి చేసిన ఈ కల్పన వలన రాక్షసుల దురహంకారం, ఇంద్రుని విష్ణుభక్తి, బలిచక్రవర్తి శౌర్య ప్రతాపాలు, నరనారాయణుల శక్తి సామర్థ్యాలు మొదలైన అంశాలన్నీ చక్కగా నిరూపించబడి ఈ కథకు పరిపూర్ణతను కలిగిస్తున్నాయని చెప్పవచ్చు.

4.5.2.4. శివుడు, నారదుల సంవాదం

ఎల్లన కావ్యంలో నారదుడు కైలాసానికి వెళ్ళి శివుని ముందు మోహినీ వృత్తాంతాన్ని, రాక్షసులు మోసపోయిన తీరునూ వినిపించినట్లుగా కనిపిస్తున్నది. నారదుడు మోహినీ సౌందర్యాన్ని చూస్తే శివుడు కూడా వెర్రివానిలాగ తిరుగుతాడని హేళనగా మాట్లాడినట్లుగా ఎల్లనకావ్యంలో వర్ణించబడింది. నారదుని మాటల వలన కలిగిన రోషంతోనే శివుడు విష్ణువుతో మోహినిని చూపమని పంతంగా పలికినట్లు ఎల్లన కావ్యంలో వర్ణితమైంది. వేంకటకవి కూడా తన కావ్యంలో నారదునిచేతనే శివునికి మోహినీ వృత్తాంతాన్ని వినిపించాడు. ఇందులో నారదుడు విష్ణుమహిమను స్తుతించినప్పటికీ శివుని ఘనతను చులకన చేయలేదు. మోహినీ సౌందర్యాన్ని చూస్తే శివుడికి కూడా మోహం కలుగుతుందని ఎల్లనాదులు చెప్పారు. కాని అందుకు నిదర్శనాన్ని మాత్రం శివుని పరంగా పేర్కొనలేకపోయారు. వేంకటకవి శివుని మోహాన్ని పేర్కొంటూ, పూర్వం శివుడు ఒక గౌడ ఇల్లాలిని మోహించి ఆమెను సమీపించినప్పుడు ఆ ఇల్లాలి మగడు రాగా, దానికి భయపడి శివుడు కల్లుకడవలో దాక్కున్నాడనే దేశీయమైన గాథను నారదుని చేత పలికించాడు. ఈ కల్పన వలన గౌడ ఇల్లాలి అందానికే మోహితుడైన శివుడు త్రిజగన్మోహినిని చూస్తే మోహాన్ని పొందకుండా ఉండగలడా అనే భావన స్పష్టమవుతున్నది. ఆ విధంగా వేంకటకవి చేసిన ఈ కల్పన నారదుని మాటలకు ఊతమవుతున్నదని చెప్పవచ్చును.

4.5.2.5. శివుని వైకుంఠ ప్రయాణం

ఎల్లన కావ్యంలో శివుడు నారదుని మాటల వలన కలిగిన పంతంతో పార్వతితో కలిసి, సపరివార సమేతంగా వైకుంఠానికి వెళ్ళినట్లు వర్ణించబడింది. వైకుంఠానికి బయలు దేరేందుకు శివుడు ధరించిన అలంకారాలను, రూపాన్ని ఎల్లన వర్ణించాడు. వైకుంఠంలో ప్రవేశించగానే విష్ణువే ఎదురొచ్చి శివునికి స్వాగతం పలికాడు. విష్ణువు కొలువులో శివుడే ముందుగా తాను వచ్చిన కారణాన్ని విష్ణువుకు వినిపించాడు. వేంకటకవి తనకావ్యంలో కైలాసంలో శివుడు, నారదుల మధ్య సంభాషణ జరిగినప్పుడు పార్వతిని గురించి పేర్కొనలేదు. అదే విధంగా శివునితో పాటుగా వైకుంఠానికి పార్వతి వచ్చినట్లు వర్ణించలేదు. ప్రత్యేకించి శివుని వేషధారణను పేర్కొనలేదు. శివుడు వైకుంఠంలో ప్రవేశించగానే జయవిజయులు అనే ద్వారపాలకులు అతన్ని విష్ణువు సమక్షానికి తోడుకొని వెళ్ళారు. శివుడు వైకుంఠానికి రావడానికి గల కారణమేమని విష్ణువే అతన్ని అడిగినట్లుగా వేంకటకవి కల్పించాడు. ఈ కల్పనల వలన మోహిని

చేత శివుడు భ్రమించబడటాన్ని పార్వతి చూడకుండా ఉండేందుకు అవకాశం కల్పించినట్లయింది. జయవిజయులు శివుడిని తోడ్కొని వెళ్ళడంలో విష్ణుమహిమా ప్రభావం, శివునితో విష్ణువే ముందుగా మాట్లాడటంలో శివునిపై విష్ణువుకి గల ఆదరం సువ్యక్తమవుతున్నాయి.

4. 5. 2. 6. బ్రహ్మగర్వం

ఎల్లన కావ్యంలో బ్రహ్మదేవుడు మహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించి సృష్టి నిర్మాణ క్రమానికి కావలసిన సాధన సామాగ్రిని వరంగా పొందడం, తాను కల్పించిన జగత్తును ప్రాణికోటిని చూసుకొని బ్రహ్మ రాజసగుణంతో తాను తప్ప అన్యదైనం ఎవరూ లేరని గర్వించడం, మార్కండేయుని హితబోధను కాదని విష్ణుమాయను నిందించడం, బ్రహ్మ గర్వంతో సృష్టి నిర్మాణాన్ని చాలించి లోకాన్ని అంధకారంలో ముంచి మందరగిరికి వెళ్ళి తపస్సు చేయడం అనేవి వర్ణించబడ్డాయి. వేంకటకవి తన కావ్యంలోని కథను సరస్వతీ చతుర్ముఖుల సరసకేళితో ప్రారంభించిచాడు. సరసకేళిలో బ్రహ్మ సరస్వతీతో ముల్లోకాలలో తన కంటే అధికులు ఎవరూ లేరని పలికినాడు. సరస్వతి విష్ణుమాయా మహిమను వినిపించగా బ్రహ్మ గర్వంతో ఆమెను వారించి తన ఘనతను మిక్కిలిగా పొగుడుకున్నాడు. విష్ణువు నాభికమలం నుంచి జన్మించడం తన దోషం కాదంటూ బ్రహ్మ విష్ణువును నిందించాడు. బ్రహ్మ తన ఆధిక్యతను సరస్వతికి చూపేందుకని దురహంకారంతో సృష్టి నిర్మాణాన్ని నిలిపివేసి, లోకాన్ని అంధకారమయం చేసి ఏకాంతంగా గాఢాంధకారమయమైన శూన్య ప్రదేశానికి వెళ్ళిపోయాడు.

ఏకాంత సమయంలో సరస్వతి తనప్రతిభను మెచ్చుకోవడం బ్రహ్మకు గర్వకారణం అయింది. బ్రహ్మ ఆధిక్యాన్ని కాదని సరస్వతి విష్ణుమాయను స్తుతించడం బ్రహ్మకు అహంకార హేతువు అయిందని తెలుస్తుంది. సరస్వతి ముందు తన ఆధిక్యాన్ని, త్రిలోకాధిపత్యాన్ని ప్రకటించుకోవడానికే బ్రహ్మ విష్ణుమాయా మహిమను చులకన చేయడం, సృష్టి నిర్మాణాన్ని నిలిపివేయడం చేశాడని తెలుస్తున్నది. ఇక్కడ బ్రహ్మ ఆధిక్యాన్ని కాదని సరస్వతి విష్ణుమాయను పొగడటం అనే కల్పన చేయడం వలన బ్రహ్మ గర్వం వెల్లడయ్యేందుకు అవకాశం కలిగిందని చెప్పవచ్చు. అంతేకాకుండా సరస్వతితో విష్ణుమాయను కీర్తింపజేయడం అనే కల్పన బ్రహ్మ అహంకారం వ్యక్తం కావడానికి దోహదకారి అయిందని కూడా తెలుస్తున్నది.

4. 5. 2. 7. మాయికుని వృత్తాంతం

ఎల్లన తన కావ్యంలో బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి మాయా సరస్వతిని కల్పించాడు. మందరగిరి గుహలో సుందరమైన మేడ, దాని ముందు అందమైన కొలను, దాని సమీపంలో చక్కని ఉద్యానవనం ఇవన్నీ మాయాసరస్వతి తోపాటుగా

కల్పించినవి. ఆ మాయాసరస్వతి బ్రహ్మకు తనను సరస్వతిగానే పరిచయం చేసుకోవడం, ఆమె శృంగార చేష్టలు, బ్రహ్మతో రతికేళి సలిపి అతడిని శతానందుడిని చేయడం, బ్రహ్మ రతి పారవశ్యంలో ఉండగానే ఆమె మాయం కావడం అనేవి వర్ణించబడ్డాయి. వేంకటకవి బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి విష్ణువే మాయికుడనే మునిరూపంతో వచ్చినట్లు కల్పించాడు. ఆ మాయికుడు బ్రహ్మను అతని ఆశ్రమానికి తీసుకువెళ్ళడం, అక్కడ మాయికుని కుమార్తె మునికన్య (విష్ణుమాయ) మీద బ్రహ్మకు మోహం కలగడం, మునికన్య బ్రహ్మసృష్టి కంటే వేరొక భూమండలాన్ని తాను చూశానని బ్రహ్మను పుష్పకవిమానంలో అక్కడికి తీసుకువెళ్ళడం, అక్కడ బ్రహ్మ అష్టముఖుడైనబ్రహ్మ వలన విష్ణుమాయా ప్రభావాన్ని తెలుసుకొని తన అజ్ఞానానికి చింతించడం, బ్రహ్మ మునికన్యతో కలిసి తిరిగి సత్యలోకానికి చేరుకోవడం, సత్యలోకంలో చింతామణి సింహాసనం మీద కపటబ్రహ్మను చూసి విచారంతో విష్ణువును ప్రార్థించడం అనేవి వేంకటకవి చేసిన కల్పనలు.

ఇక్కడ ఎల్లన కావ్యంలోని మాయాసరస్వతికి మారుగా మునికన్య కల్పించబడింది. ఎల్లన మాయాసరస్వతి బ్రహ్మల మధ్య రతిని వర్ణిస్తే, వేంకటపకవి దానిని విడిచిపెట్టి మునికన్య వేరొక భూమండలానికి తీసుకువెళ్ళి అష్టముఖ బ్రహ్మచేత బ్రహ్మకు విష్ణుమాయా మహిమను వినిపించింది. మాయాసరస్వతి బ్రహ్మ రతిపారవశ్యంలో ఉండగా మాయమైపోయింది. మునికన్య బ్రహ్మను వేరొక భూమండలం నుంచి తిరిగి సత్యలోకం చేర్చి వెళ్ళింది. ఈ విధంగా వేంకటకవి చేసిన ఈ కల్పనలు బ్రహ్మను మాయోపాయంతో కాకుండా అతడి అల్పత్వం అతనే తెలుసుకునేలాగ చేయడానికి దోహదం చేశాయని చెప్పవచ్చు.

4.5.2.8. శ్రీకృష్ణుడు, నారదుల సంవాదం

ఎల్లనకావ్యంలో వైకుంఠంలోని మహావిష్ణువు కొలువుకు నారదుడు వెళ్ళడం, విష్ణుమాయ స్త్రీరూపం ధరించి ఇంద్రజాల ప్రదర్శనతో విష్ణుదేవుని, అతని కాంతలను మెప్పించడం, నారదుడు విష్ణుమాయను చులకన చేసి, తన ఘనతను పొగడుకోవడం, నారదుడు బ్రహ్మ రుద్రులనే మోసపుచ్చిన విష్ణుమాయను తాను జయించానని ప్రకటించుకోగా విష్ణువు అతన్ని మోసపుచ్చాలని భావించడం అనేవి వరుసగా వర్ణించబడ్డాయి. వేంకటకవి తనకావ్యంలో నారదుడు ద్వారకానగరంలో శ్రీకృష్ణుని దర్శించుకున్నాడనే వర్ణనతో కథను ప్రారంభించాడు. నారదుడు ఉండగానే శ్రీకృష్ణుని కొలువుకు రైవతగిరి నుంచి బోయవాళ్ళు వచ్చి అతన్ని వనవిహారానికి ఆహ్వానించడం, శ్రీకృష్ణుని తోపాటుగా నారదుడు కూడా రైవతగిరికి వెళ్ళడం, రైవతగిరి శోభను వర్ణిస్తూ నారదుడు శ్రీకృష్ణుని మాయ తనకు కొత్తకాదని పలకడం, శ్రీకృష్ణుడు నారదుని తన మాయతో భ్రమింపజేయాలని భావించడం అనేవి క్రమంగా కల్పించబడినాయి.

ఎల్లన వైకుంఠంలో కథను ప్రారంభిస్తే వేంకటకవి ద్వారకానగరంలో మొదలు పెట్టాడు. విష్ణువు కొలువులో విష్ణుమాయ ఇంద్రజాల ప్రదర్శనకు బదులుగా శ్రీకృష్ణుని కొలువులో రైవతగిరి బోయవాళ్ళను ప్రవేశపెట్టి వనవిహారానికి ఆహ్వానింపజేశాడు. విష్ణుమాయ చేసిన ఇంద్రజాల ప్రదర్శనకు శ్రీదేవి భూదేవులు మెచ్చుకోగా నారదుడు వానిని చులకన చేశాడు. రైవతగిరి వనశోభకు రుక్మిణీ సత్యభామలు ఆనందంతో వనవిహారం చేయగా, నారదుడు ఆ వనశోభకు శ్రీకృష్ణుని మాయే కారణమని అన్నాడు. ఇక్కడ రైవతగిరి వనశోభ అనే మాయతో శ్రీకృష్ణుడు అందరినీ భ్రమింపజేసినా తాను మాత్రం భ్రమించనని నారదుని మాటల్లోని అంతరార్థం. అందువల్లనే శ్రీకృష్ణుడు నారదుని మోసపుచ్చాలని భావించాడు. ఈ విధంగా వేంకటకవి చేసిన ఈ కల్పనలు ఈ కథకు ఒక నూతన శోభను కలిగిస్తున్నాయని చెప్పవచ్చు.

4.5.2.9. చంద్రకేతుని వృత్తాంతం

ఎల్లన కావ్యంలో నారదుని మోసపుచ్చాలని భావించిన మహావిష్ణువు సర్వవరం అనే క్షేత్రంలో మున్యాశ్రమాన్ని కల్పించడం, విష్ణువు మాయాముని రూపంతో నారదుని అక్కడికి రప్పించడం, నారదుడు మాయాముని మాటలు విని కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారడం, ఆమెను చంద్రకేతుడనే రాజు వివాహం చేసుకోగా వారికి నూరుమంది కుమారులు కలగడం, శత్రురాజుతో జరిగిన యుద్ధంలో చంద్రకేతుడు అతని కుమారులు మరణించడం, చంద్రరేఖ రణభూమిలో భర్త, కుమారుల శవాలను చూసి దుఃఖించడం, చంద్రరేఖ ఆకలిబాధకు తట్టుకోలేక భర్త, కుమారుల శవాలను గుట్టగా పేర్చి మామిడి పండును అందుకోవాలని ప్రయత్నించడం, విష్ణువు వృద్ధతాపసిగా వచ్చి ఆమెను కొలనులో స్నానంచేయమని చెప్పగా కొలనులో మునిగిన చంద్రరేఖ నారదునిగా మారడం అనేవి క్రమంగా వర్ణించబడ్డాయి.

వేంకటకవి నారదుని మోసపుచ్చాలని భావించిన శ్రీకృష్ణునిచేత మాయాకొలనును కల్పించాడు. శ్రీకృష్ణుని మాయాప్రభావంతో నారదుడు ఆ కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారిపోయాడు. శ్రీకృష్ణుడు చంద్రరేఖ తల్లిగా మాయాకాంత రూపాన్ని ధరించాడు. సత్యకనగరాన్ని పాలించే చంద్రకేతుడనే రాజు వేటకు వచ్చి చంద్రరేఖను చూడటం, వారిద్దరూ ఒకరి మీద ఒకరు మరులుకొని విరహాన్ని పొందడం, మంత్రి చొరవతో చంద్రరేఖకు చంద్రకేతునితో వివాహం కావడం, వారికి అరవైమంది కుమారులు కలగడం, శత్రురాజుతో జరిగినయుద్ధంలో చంద్రకేతుడు, అతని కుమారులు మరణించగా చూసి చంద్రరేఖ దుఃఖించడం, చంద్రరేఖ ఆకలి బాధకు తాళలేక చింతచెట్టు నుంచి చిగురులు అందుకోవడానికి భర్త, కుమారుల శవాలను గుట్టగా పేర్చడం, కృష్ణుడు వేద బ్రాహ్మణుడుగా వచ్చి చంద్రరేఖను కొలనులో స్నానం చేయమని చెప్పగా అందులో మునిగిన చంద్రరేఖ నారదునిగా మారడం అనే కల్పనలు ఇందులో

కనిపిస్తున్నాయి. ఎల్లన మాయాముని రూపంలోని విష్ణువు నారదుని కొలనులో స్నానం చేయమని చెప్పినట్లుగా పేర్కొంటే వేంకటకవి శ్రీకృష్ణుడే నారదునితో ఆ పని చేయించినట్లుగా కల్పించాడు. ఎల్లన చంద్రరేఖ చంద్రకేతుల వివాహం, సంతానం, యుద్ధం మొదలైన విషయాలు అన్నీ క్లుప్తంగా పేర్కొన్నాడు.

వేంకటకవి మాత్రం చంద్రరేఖ చంద్రకేతుల విరహం, వివాహం, యుద్ధం అనే వాటిని విస్తారంగా వర్ణించాడు. ఎల్లన చంద్రరేఖకు నూరుమంది కుమారులు కలిగారని పేర్కొంటే, వేంకటకవి అరవైమంది కుమారులుగా కల్పించాడు. చంద్రరేఖ ఆకలిబాధకు మామిడి పండును అందుకోవాలని ప్రయత్నించినట్లు ఎల్లన పేర్కొంటే, వేంకటకవి దానిని వదిలిపెట్టి చింత చిగురులను కల్పించాడు. ఈ విధంగా ఎఱగుడిపాటి వేంకటకవి తన విష్ణుమాయా విలాసంలో ఎల్లన కావ్యం కంటే విభిన్నమైన కల్పనలు చేసి తన కావ్యానికి ఒక స్వతంత్ర ప్రవృత్తిని కల్పించాడని పై నిదర్శనాల ఆధారంగా చెప్పవచ్చు.

# 5. విష్ణుమాయా విలాసకావ్యాలు – కావ్యానుశీలనము

కావ్య రచనలో కవి వర్ణించిన అనేక విషయాలు అతడి జీవితానుభవం ఆధారంగా చేసినవై ఉంటాయి. కావ్యగతంగా కవి వర్ణించిన పాత్రలు అటువంటి దృష్టితోనే నిర్మితమై ఉంటాయి. అందుచేత కావ్యంలో కవి చిత్రించిన పాత్రలను ఆయా కావ్యాలలోని ఇతివృత్త దృష్టితో పరిశీలించవలసి ఉంటుంది. అప్పుడు మాత్రమే కవి వర్ణించిన పాత్రల నిర్మాణ కౌశలాన్ని మనం చక్కగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఉంటుంది.

5.1. పాత్ర నిర్మాణం – నాయకుడు

'పాత్ర' అంటే 'యోగ్యత' అని అర్థం. ఆధారం అనే అర్థంకూడా వుంది. యోగ్యత అంటే సామర్థ్యం. కార్యసాధనలో సామర్థ్యం ఉంటుంది. కార్యసాధనకు ఎవరు ఆధారమవుతారో, అటువంటి పురుషుడిని 'పాత్ర' అని అంటారు. ఆ కార్యసాధనకు సహకరించేవారు, కార్యసాధనలో పాలుపంచుకునే వారు కూడా పాత్రలు అవుతారని గ్రహించాలి. కవి అటువంటి పాత్రలు తమ జాతి, స్వభావాలను అనుసరించి, ఇతివృత్తానుసారంగా కావ్యంలో ప్రవర్తిల్లేటట్లుగా పాత్రనిర్మాణం చేస్తాడు. విష్ణుమాయా విలాస కావ్యాలలోని పాత్ర నిర్మాణాన్ని ఆ కవులు నిర్వహించిన తీరు ఈ విధంగా ఉన్నది. ఆలంకారిక మతాన్ని అనుసరించి నాయకుడనగా రక్షకుడు అని అర్థం. లౌకికార్థంలో రక్షకుడంటే రాజు అని అర్థం. అతడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. అతడు లోకాలను బాధించే రాక్షసులను శిక్షించి, శిష్టులను రక్షిస్తాడు. శ్రీమహావిష్ణువు లోకరక్షకుడు, సృష్టిపోషకుడు. అందువల్ల విష్ణువే కావ్యలోకానికి నాయకుడవుతాడు.

"బ్రహ్మసృష్టికి విఘ్నకారులగు నక్తంచర సంచయములను సంహరించి సృష్టిని పోషించు శ్రీమన్నారాయణుడు లోకరక్షకుడు. అతడే కావ్యలోక రక్షకుడౌట యౌచిత్యచారితార్థ్యము" (కోటీశ్వరరావు, తమ్మపూడి. 1971. 16) అనే మాటల వలన శ్రీమహావిష్ణువు లోకానికి నాయకుడని తెలుస్తున్నది. కథను స్వీయఫలానుకూలంగా మార్చుకొని, తత్ఫలభోక్త అగువాడు నాయకుడు. శ్రీమహావిష్ణువు విష్ణుమాయా విలాస కథలకు కర్త. అతడు గర్వోపవిష్టులై తన మహిమను తిరస్కరించిన మహాలక్ష్మి, బ్రహ్మ, పరమేశ్వర, నారదులకు గర్వభంగం కలిగించాడు. విష్ణుమాయా మహత్యాన్ని లోకానికి ప్రకటించి, తద్వారా లోక కళ్యాణ ఫలాన్ని పొందాడు. అందుచేత విష్ణుమాయా విలాస కావ్యాలలో శ్రీమహావిష్ణువు నాయకుడు అవుతున్నాడు. శ్రీమహావిష్ణువు శ్రీవైష్ణవమతాన్ని అనుసరించి లోకరక్షకుడై ప్రవృత్తిమార్గంలో ప్రవర్తిస్తాడు. ఉత్తమ కావ్యనాయకుడు ధీరోదాత్తుడై ఉంటాడు. అతడు లోకపరిపాలన చేస్తాడు. విష్ణుమాయా విలాస కావ్యాలలోని నాయకపాత్ర గురించి ఈ నిదర్శనాల ఆధారంగా తెలుసుకోవచ్చు.

5.1.1. చింతలపూడి ఎల్లనార్యుడు - నాయకపాత్ర నిరూపణ

ఎల్లన విష్ణుమాయా నాటకంలో శ్రీమహావిష్ణువు నాయకుడు. శ్రీమహావిష్ణువు లోకకళ్యాణార్థమై సాధుజన రక్షణ, దుష్టశిక్షణ చేయడానికి దశావతారాలను ధరించాడు. అటువంటి జగన్నాయకుడైన శ్రీమహావిష్ణువు మాయా మహిమాతిశయమే ఈ ప్రబంధంలో వర్ణితమైంది. 'సర్వం విష్ణుమయం జగత్' అనే ఆర్యోక్తిని అనుసరించి ఈ జగన్నాటకానికి సూత్రధారుడు శ్రీమహావిష్ణువే అని తెలుస్తున్నది. 'శ్రీమహావిష్ణువు తన తేజోబలంతో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనాది బహువిధ రూపాలు ధరించాడు. శ్రీమహావిష్ణువు ధరించిన దశావతారాలలో ప్రతిఫలించే సౌందర్య, వీర్య, శౌర్య, ధైర్య, ప్రతాప, ప్రభావ, నిగ్రహానుగ్రహ దాక్షిణ్య గుణాలు ఉత్కృష్టములై అతడిలో వెలిశాయి. శ్రీమహావిష్ణువు శంఖ, చక్ర, గద, పీతాంబర, కౌస్తుభ, వనమాలిక, శ్రీవత్సం మొదలైన లాంఛనాలను ధరించినవాడు. చతుర్దశ భువనాలను పరిపాలించేవాడు. శ్రీమహావిష్ణువు సర్గ, స్థితి, ప్రళయ కర్తృత్వాన్ని వహించి, ప్రాణి సమూహాలను నడుపుతుంటాడు.(1-42) అటువంటి శ్రీమహావిష్ణువు సహజ మాయామానుష వేషధారిగా శ్రీకృష్ణుని రూపంతో కలియుగంలో అవతరించాడు.

"విష్ణునామ స్మరణం శుభకరం, త్రైలోక్యం విజయకరం, శ్రేయస్కరం. విష్ణుమాయను అధిగమించను ఎవరికీ శక్యం కాదు. బ్రహ్మ మొదలుకొని కీటకం వరకూ గల ప్రాణులు అన్నీ విష్ణుమాయ అనే పెనువలలో చిక్కుకొని, కోరికలనే సముద్రంలో చేపలవలె ఎడతెగక ఈదుతుంటాయి. (1-38) అని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పిన మాటలవలన తెలుస్తుంది. శ్రీకృష్ణుడు కనక పీతాంబరం ధరించినవాడు నీలిమేఘం వంటి కోమలమైన అవయవ సంపదతో, తెల్లతామర రేకులవలె కలకలనవ్వుతున్న నిర్మలమైన కన్నులతో కనిపించే లోకైక సుందరమూర్తి. నీలం, పసుపుపచ్చ, తెలుపు వర్ణాలు కలగలసిన ప్రకాశం కలవాడుగా ధర్మరాజుకు నిత్యం కనిపిస్తుంటాడు.(1-82, 83) 'శ్రీకృష్ణుడు భక్తాధీనుడు. నిరంతరం తన భక్తులను ఆపదలనుంచి కాపాడుతుంటాడు. కౌరవసదంలో ద్రౌపది మానాన్ని కాపాడాడు. ధర్మరాజును దుర్వాసముని శాపంనుంచి కాపాడాడు. అర్జునుడు సూర్యాస్తమయంలోగా సైంధవుని శిరస్సు ఖండించడానికి సాయపడ్డాడు. భీముడిని ధృతరాష్టుడి కౌగిలినుంచి రక్షించాడు.' (1-63)

ఈ రీతిగా పాండవులను కృష్ణుడు నిరంతరం కాపాడుతూ వచ్చాడు. శ్రీకృష్ణుడు ఒకనాడు సత్యభామ మనస్సును తెలుసుకోవాలని, తన మాయా ప్రభావంతో రుక్మిణి మొదలైన అష్టమహిషుల ఉద్యానవనాల్లో ఒక్కొక్క పారిజాత వృక్షాన్ని కల్పించాడు. శ్రీకృష్ణుడు అష్టమహిషుల ఇళ్ళలో, సహస్రసంఖ్యలైన గోపాంగనల ఇళ్ళలోనూ అన్ని

రూపాలు ధరించాడు. శ్రీకృష్ణుని మాయా విలాస కేళికి సత్యభామ మోసపోయి, దుఃఖించింది. శ్రీకృష్ణుడు సత్యభామ సంతాప శాంతికై ఆ రాత్రి విరహభావాన్ని అవలంబించాడు. తెల్లవారగానే ఆ మాయా రూపాలన్నింటినీ ఉపసంహరించాడు. ఈరీతిగా శ్రీకృష్ణుడు తన మాయా కేళితో సత్యభామకు గర్వభంగం కావించాడు. ఇది శ్రీకృష్ణుడి దక్షిణ నాయకత్వానికి నిదర్శనంగా కనిపిస్తుంది. శ్రీమహావిష్ణువు మహాలక్ష్మి హృదయం ఎటువంటిదో తెలుసుకోవాలని జూదంలో మాయ చేసి గెలిచాడు. మహాలక్ష్మి భూదేవి, దేవకాంతల ముందు ఓటమి కలిగినందుకు విష్ణుమాయను నిందించింది. అంతే కాకుండా వైకుంఠపుర వైభవాన్ని శూన్యం చేసింది. శ్రీమహావిష్ణువు మహాలక్ష్మి చేష్టలకు మనస్సులో కోపించాడు. విష్ణువు మహాలక్ష్మి దుర్మద గర్వాన్ని తొలగించేందుకు మాయాలక్ష్మిని కల్పించాడు. వైకుంఠపుర వైభవాన్ని పూర్వంకంటే వైభవోపేతం చేశాడు. విష్ణువు మహాలక్ష్మిని తన మాయామోహంలో ముంచి గర్వభంగం కావించాడు.

శ్రీమహావిష్ణువు నాభికమలంలో జన్మించిన బ్రహ్మ సృష్టికర్తనని, రాజసగుణంతో అహంకరించాడు. బ్రహ్మ తన దుర్నీతితో సృష్టి కార్యాన్ని చాలించి, లోకాలకు అపాయం కలిగించాడు. శ్రీమహావిష్ణువు మాయాసరస్వతిని కల్పించి, బ్రహ్మను మోహంలో ముంచి గర్వభంగం చేశాడు. విష్ణువు నారదుడి మాటలకు పంతంతో దర్పాన్ని ప్రదర్శించిన శివుడికి మాయామోహిని రూపంతో దర్పభంగం కావించాడు. నారదుడు విష్ణుమాయను జయించానని గర్వించగా, అతడికి స్త్రీ రూపాన్ని, మాయా సంసారాన్ని కల్పించాడు. శ్రీమహావిష్ణువు విష్ణుమాయను సందేహించిన పుండరీకునితో, 'అఖిల జనులు విష్ణుమాయలో మునిగి జీవిస్తున్నారు. అనేక మంది పూర్వ కర్మపాశబద్ధులై సంసార మోహజలధిలో మునిగి తేలుతున్నార'ని (3-234) స్వయంగా తెలిపాడు. విష్ణుమాయా ప్రభావంతో అనేకమంది మోహాంబుధిలో తగుల్కోటానికి గల కారణాన్ని శ్రీమహావిష్ణువు పుండరీకునితో ఈ విధంగా తెలిపాడు. "నీమనస్సంశయంబు మాన్పుటకు నపూర్వ మాయా విలసితంబగు సంసారం బధిగమించి యేను ప్రతిచ్ఛాయ యుంబోలె దీపింపం జేసి తానతగులు పెట్టి పూర్వ జన్మాంతర కర్మశేషంబు దొలగించి యుచితపదం బొసగుటకై యింత ప్రయాసంబు నొందింపవలసె" (3-236) అని అన్నాడు. శ్రీమహావిష్ణువు అహంకారబుద్ధితో విష్ణుమాయను తిరస్కరించిన వారికి గర్వభంగం కావించి, వారికి పరమపదాన్ని, ఉత్తమ జ్ఞానాన్ని అందించడమే తన లీలా విలాసకేళి అని తెలిపాడు.

శ్రీమహావిష్ణువు అనంత గుణగణ విలాసుడు, బ్రహ్మాండ నిర్మాణ కర్మకుశలుడు. అతడు ప్రకృతి పురుషాధీశ్వరుడు, నానారూప ప్రవర్తకుడు, విష్ణువు లోకవంచనా కపట నాటక సూత్రధారుడు. శ్రీమహావిష్ణువు అసూయ, మత్సర, గర్వోపవిష్టులైన తన ఇల్లాలు మహాలక్ష్మిని, కుమారుడైన బ్రహ్మను, ఇష్టసఖుడైన శివుడిని, భక్తుడైన

నారదుడిని వారి కర్మానుసారంగా మాయా మోహంలో ముంచాడు. విష్ణువు తన కపటలీలా విలాస ప్రభావంతో అందరినీ తరింపజేసి, నాయకమణిగా భాసించాడు. విష్ణుమాయా విలాస కథావృత్తమంతా వ్యాపించిన లీలావిభూతితో నాయకత్వానికి నిరూపణగా శ్రీమహావిష్ణువు పాత్ర ఈ ప్రబంధంలో వర్ణితమైందని తెలుస్తున్నది.

5.1.2. కంకంటి పాపరాజు – నాయకపాత్ర నిరూపణ

కంకటి పాపరాజు రచించిన 'విష్ణుమాయా విలాస' యక్షగానంలో శ్రీమహావిష్ణువు నాయకుడు. విష్ణువు కపటనాటకకేళీ విలాసమూర్తి. ఎంతటి ప్రభావశాలులైనా విష్ణుమాయను తిరస్కరించలేరు. విష్ణుమాయా విలాసాలలో మాయా మోహినీ విలాసం విశేషమైనది. మోహినీ విలాసం శృంగార భరితం, రసబంధురం. లోకాలన్నింటినీ సమ్మోహనమైన శ్రీకృష్ణ రూపంతో మోహింపజేసిన వానికి, స్త్రీ రూపంతో లోకాన్ని మోహంలో ముంచటం ఆశ్చర్యం కాదు కదా! బ్రహ్మ సృష్టించిన కాంతలకే తగుల్కొనే పండితులు, బ్రహ్మనే సృష్టించిన శ్రీమహావిష్ణువు వనిత అయితే మోహించకుండా ఉంటారా! ఉండలేరనిభావం. నారదుడు విష్ణుమాయను పొగిడి, మోహిని సౌందర్యాన్ని వర్ణించగా, శివుడు పంతంతో వైకుంఠానికి మోహినిని చూడటానికి వచ్చాడు. శ్రీమహావిష్ణువు స్వయంగా ఎదురువెళ్ళి శివపార్వతులను అంతఃపురానికి ఆహ్వానించాడు. విష్ణువుతో శివుడు తన పంతాన్ని విడువకుండా మోహినిని చూపమన్నాడు. విష్ణువు పలికిన హితోక్తులను శివుడు పెడచెవినపెట్టగా, నిన్ను భ్రమపెట్టుట ఎంతపని అంటూ విష్ణువు మోహినిగా మారాడు.

విష్ణువు తన స్నేహాన్ని చులకనగా భావించిన శివుడికి మోహినీ రూప విలాసంతో మరులు కలిగించాడు. శివుడు విరహ దురవస్థలో చిక్కుకొని పరితపించేటట్లు చేశాడు. విష్ణువు శివుడి దర్పం పటాపంచలయ్యేటట్లుగా అతనికి శుక్ల పతనం కలిగించాడు. మోహినీ రూపాన్ని ఉపసంహరించిన విష్ణువు శివుడితో శివకేశవులకు భేదం లేదని పలికాడు. విష్ణువు తన మాయా ప్రభావాన్ని పరీక్షించేందుకే శివుడు ఆ విధంగా ప్రవర్తించాడన్నాడు. అంతేకాని విష్ణుమాయకు భ్రమించటానికి శివుడు అజ్ఞుడు కాదని హరిహరుల ఐక్యభావాన్ని ప్రకటించాడు. శ్రీమహావిష్ణువు తనతో సమానుడైన పరమేశ్వరుడు, నారదుని మాటలకు పంతంతో విష్ణుమాయను చులకన చేయడం గ్రహించాడు. శివుడి దర్పాన్ని భంగం కావించడానికి విష్ణువు మాయా మోహినిగా అవతరించాడు. విష్ణువు శివదర్పాన్ని తగురీతిగా సంస్కరించి, తన నాయకత్వమహిమను లోకానికి ప్రకటించాడు. ఇది ఉత్తమనాయకుని లక్షణంగా తెలుపిస్తున్నది.

5.1.3. కంకంటి నారసింహకవి – నాయకపాత్ర నిరూపణ

నారసింహకవి 'విష్ణుమాయా విలాస' ద్విపదకావ్యంలో శ్రీమహావిష్ణువు నాయకుడు. శ్రీమహావిష్ణువు ఈ చరాచర సృష్టిని నడిపించేవాడు. అతడే ఈ మాయా

జగన్నాటకానికి సూత్రధారుడు. విష్ణువు ఇంద్రజాల మాయాప్రభావం ఈలోకమంతా వ్యాపించి ఉంది. జగత్కర్త, భర్త, హర్త, అయిన శ్రీమహావిష్ణువు మాయా మహిమనుంచి తప్పించుకోవడం ఎవరికీ సాధ్యంకాదు. విష్ణువు హృదయ స్థానంలో నివసించే మహాలక్ష్మి సంపద గర్వంతో విష్ణుమాయను చులకన చేసింది. కమలలోచనుని నాభికమలంలో జన్మించిన బ్రహ్మ, తనను మించిన దైవంలేరని గర్వించాడు. సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు దర్పంతో విష్ణుమాయను కాదని, తన మనోనిగ్రహశక్తిని పొగడుకున్నాడు. నిరంతరం నారాయణమంత్ర పారాయణ స్వాంతుడైన నారదుడు విష్ణుమాయను జయించానని అహంకరించాడు.

శ్రీమహావిష్ణువు వీరందరి అహంకార, దర్ప, గర్వాలను తన మాయామోహంలో ముంచి, తగువిధంగా భంగం కావించాడు. లోకనాయకుడైన విష్ణువు చివరికి దయాసాగరుడై అందరినీ తరింపజేశాడు. సర్వమంగళాధిదేవత అయిన మహాలక్ష్మి తన సంపద గర్వంతో వైకుంఠపుర వైభవాన్ని నశింపజేసింది. విష్ణుమహిమను, మాయాప్రభావాన్ని నిందించింది. విష్ణువు ఆమె చేష్టలకు కోపించి, భార్య అయినా, కుమారుడైనా, సేవకుడైనా, స్నేహితుడైనా హద్దు మీరి చేసిన తప్పు క్షమించరాదని, వారిని శిక్షించి అయినా చక్కదిద్దుట తన బాధ్యతగా భావించాడు. విష్ణువు మహాలక్ష్మి మనసులోని దురహంకారాన్ని తొలగించాలని నిశ్చయించుకున్నాడు. అందుకు తగినట్లుగా మాయాలక్ష్మిని కల్పించాడు. వైకుంఠపుర వైభవాన్ని పూర్వం కంటే మరింత ప్రకాశంగా చేశాడు. మహాలక్ష్మిని ఒంటరిని చేసి, ఆమెకు దైన్యతను కలిగించి గర్వభంగం కలిగించాడు.

ఇదే విధంగా బ్రహ్మ సృష్టికర్తనని, తనకు సాటిగల దైవంలేడని అహంకరించారు. విష్ణువు మాయా సరస్వతిని కల్పించి, బ్రహ్మను కామవివశుని చేసి గర్వాన్ని భంగపరిచాడు. పరమేశ్వరుని ఇంద్రియనిగ్రహ దర్పాన్ని మాయామోహినీ రూపంతో వంచన చేశాడు. విష్ణువు నారదుడికి మాయా స్త్రీరూపాన్ని, సంసారాన్ని కల్పించి గర్వభంగం కావించాడు. విష్ణువు పుండరీకుడు, చండదమనుడు అనే భక్తులను చిత్రమైన రీతులలో మాయాభ్రాంతులను చేసి, వారికి మోక్షాన్ని అనుగ్రహించాడు. భగవంతుడైన శ్రీమహావిష్ణువు దయాపారమ్యతకు, ధీరోదాత్త నాయకత్వ ప్రకటనకూ పై వృత్తాంతాలు నిదర్శనాలుగా కనిపిస్తున్నాయని చెప్పవచ్చు.

### 5.1.4. రోసనూరి వేంకటపతి – నాయక పాత్ర నిరూపణ

వేంకటపతి రచించిన విష్ణుమాయా విలాసంలో శ్రీమహావిష్ణువు నాయకుడు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకూ శ్రీమహావిష్ణువు దశావతారాలను ధరించాడు. లోక కళ్యాణార్థమై విష్ణువు ధరించిన అవతారాలలో మోహినీ అవతారం ప్రత్యేకమైంది. శ్రీమహావిష్ణువు దానవులను మోసగించి అమృతకలశాన్ని దేవతలకు అందించడానికి

మాయామోహినిగా అవతరించాడు. విష్ణువు అమృతాన్ని పంచే నెపంతో రాక్షసులను భ్రమపెట్టి, దానిని దేవతలకు దక్కేలాగ చేశాడు. అయితే ఈ మాయా మోహినీ విలాసానికి రాక్షసులే కాకుండా, సాక్షాత్తు పరమశివుడు కూడా మోహ వివశుడయ్యాడు. శ్రీమహావిష్ణువు మోహినిని చూడాలని దర్పంతో వైకుంఠానికి వచ్చిన శివుడిని సాదరంగా ఆహ్వానించాడు. విష్ణువు మోహినీ రూపాన్ని చూడటం శ్రేయస్కరం కాదని, సమయం వచ్చినపుడు తానే చూపగలనని శివుడితో అన్నాడు. శివుడు అహంకార దర్పంతో విష్ణుమాయను పలుచన చేసి, తన మహిమను స్తుతించుకున్నాడు. ఆ మాటలకు శ్రీమహావిష్ణువు, శివుడి గర్వక్రౌర్యములను వెంటనే మాన్పకుంటే ప్రమథలు నారదుడిని బాధిస్తారని భావించాడు. శ్రీమహావిష్ణువు శివుడిముందు మాయామోహినిగా మారాడు. ఆ మాయామోహిని తన శృంగార చేష్టావిలాసాలతో శివుడికి మరులు కలిగించింది. మోహిని శివుడిని విరహంతో ముంచగా, అతడు మట్టుమీరిన మోహంతో ఆమెను కౌగిలించుకున్నాడు.

మోహిని స్పర్శచేతనే శివుడికి శుక్లపతనమైంది. మోహిని మాయా రూపాన్ని విడిచి శ్రీమహావిష్ణువుగా మారింది. విష్ణుమాయను మహాలక్ష్మి, పార్వతి, సరస్వతులు స్తుతించారు. నారదుడు తన పంతం నెగ్గించినందుకు సంతోషంతో విష్ణుకీర్తనం చేశాడు. శివుడు విష్ణుమాయా మహత్వాన్ని గుర్తించక, వాగ్వాదవృత్తితో ప్రవర్తించిన తనను మన్నించమని అన్నాడు. శ్రీమహావిష్ణువు శివుడిని అనునయిస్తూ, నాకూ నీకూ మధ్య భేదం ఎప్పుడైనా కలిగిందా! మనలో మనకు ఈ అంతరం ఎందుకు అని అన్నాడు. విష్ణువు దేవతలలో మహాదేవుడైన శివుడికి తనకూ భేదం లేదని పలికాడు. ఈ రీతిగా శ్రీమహావిష్ణువు తన మాయా మహత్వ ప్రకటనలతో శివదర్ప భంగం కావించాడు. అందుచేత శ్రీమహావిష్ణువు నాయకత్వ మహత్వ వర్ణనను రోసనూరి వేంకటపతి పై విధంగా చేశాడని చెప్పవచ్చు.

### 5.1.5. ఎఱగుడిపాటి వేంకటకవి - నాయకపాత్ర నిరూపణ

ఎఱగుడిపాటి వేంకటకవి విష్ణుమాయావిలాస కావ్యంలోని విలాస కథలన్నింటినీ విష్ణుమాయ ప్రధానంగా వర్ణించాడు. అందుచేత శ్రీమహావిష్ణువు ఈ కథలకు నాయకుడని తెలుస్తున్నది. శ్రీమహావిష్ణువు ఈ చరాచర జగత్తు అంతటికీ పూర్వుడు. అతడు సర్వజ్ఞుడు. విష్ణువే జీవులను పుట్టించుటకు, రక్షించుటకు, విలయించుటకు కర్త అని సూతమహర్షి నైమిశారణ్యంలోని శౌనకాది మునులకు విష్ణుమహిమను వర్ణించాడు. విష్ణుమాయను అధిగమించటం భవునకైన, పద్మభవునకైనా సాధ్యం కాదు. అఖిల ప్రపంచమంతా విష్ణుమాయా ప్రకల్పితమే. 'విష్ణుమాయను, తరించడం శత్రువులై నిరంతరం పోరాడుతున్న రాక్షసులకు తరంకాదు. తనయుడై విష్ణువు నాభికమలంతో జన్మించి, లోకాలను సృష్టించే బ్రహ్మ కూడా విష్ణుమాయను తెలుసుకోలేదు. విష్ణుమాయా ప్రభావాన్ని

అవిరళుడైన శివుడు కూడా గ్రహించలేడు. విష్ణు నామ కీర్తనతో సదమలభక్తి చేత సంతతానందుడైన నారదుడు కూడా విష్ణు మాయను తరించలేడు. తాపసులకైనా, దేవతలకైనా విష్ణుమాయ అవగతంకాదు' (1-143)

శ్రీమహావిష్ణువు దేవదానవులు క్షీరసాగరాన్ని మథించడానికి పూనుకొనేలా చేశాడు. అతడే తన మాయామోహినీ రూపంతో ఉద్ధతులై అమృతకలశాన్ని అపహరించిన రాక్షసులను భ్రమింపజేశాడు. విష్ణువు అమృతాన్ని దేవతలకు దయతో అందించాడు. నారదుడి మాటలకు ప్రేరేపితుడై శివుడు మోహినీ రూపాన్ని చూడాలని వైకుంఠానికి రాగా విష్ణువు ఆప్యాయంగా ఆదరించాడు. విష్ణువు శివుడితో, నిరతదయా పూర్ణుడవు, నిష్కపటుడవు అయిన నీవు కోరిన కోరిక తీర్చకుంటే మన మధ్య భేదం ఉన్నట్లేకదా! అన్నాడు. విష్ణువు శివుడి దర్పానికి కారణమైన ఇంద్రియనిగ్రహ పటుత్వాన్ని మాయామోహిని రూపంతో భంగం చేశాడు. మోహినీ స్పర్శ చేతనే శివునికి శుక్లపతనమై పరబ్రహ్మ జ్ఞానం కలిగింది. విష్ణువు చిన్నబోయిన శివుడిని అనునయించి, కాలభైరవుడు జన్మించడానికి కారణంగా ఇదంతా జరిగిందని తెలిపాడు.

విష్ణువు గర్వోపవిష్టుడై బ్రహ్మ సృష్టినిర్మాణాన్ని చాలించి, లోకాలను అంధకారమయం చేయగా తిరిగి వాటిని పునరుద్ధరించాడు. విష్ణువు తాను సరస్వతీ బ్రహ్మ రూపాలు దాల్చి, చతుర్విధ భువనాలలో సృష్టి నిర్మాణాన్ని చేపట్టాడు. బ్రహ్మకు అతని అల్పత్వాన్ని తెలియజేసి, సత్యలోకంలో కపటబ్రహ్మను కల్పించాడు. విష్ణువు పరాభవంతో, పశ్చాత్తాపంతో బ్రహ్మకు గర్వం తొలగి పోయేలా చేశాడు. శ్రీకృష్ణుడి సభలో నారదుడు తాను విష్ణుమాయకు భ్రమించనని పలికాడు. రాక్షసులను, శివుడిని, బ్రహ్మను, మోసపుచ్చిన విష్ణుమాయ తనను తాకలేదని నారదుడు శ్రీకృష్ణుడితో గర్వంగా పలికాడు. శ్రీకృష్ణుడు వనవిహారం నెపంతో నారదుడిని సరస్సులో మునగ జేసి స్త్రీ రూపాన్ని కల్పించాడు. చంద్రరేఖ  అనే పేరుతో నారదుడు స్త్రీగా మరి, మాయా సంసారాన్ని చేశాడు. శ్రీకృష్ణుడు నారదుడికి పూర్వ కర్మఫలశేషాన్ని అనుభవింపజేసి, తన మాయను ఉపసంహరించాడు. శ్రీకృష్ణుడి మాయ తొలగిపోగా నారదుడు, 'నాగర్వమణచడానికి, ఈ సంసార బంధాన్ని మీరే కల్పించినారని తెలిసింది' (5-218) అని విష్ణుమాయను స్తుతించాడు. ఈ రీతిగా వేంకటకవి తన కావ్యంలో నాయకుడైన శ్రీమహావిష్ణువు పాత్రను తీర్చిదిద్దినాడని చెప్పవచ్చు.

చింతలపూడి ఎల్లనార్యుడు చెప్పిన కథాక్రమంలోని నాయకపాత్ర చిత్రణలో ఒక క్రమోన్మీలనం వ్యక్తమవుతున్నది. శ్రీకృష్ణుడి అష్టభార్యలలో ఇష్టసఖి అయిన సత్యభామకు పారిజాతవృక్ష ప్రాప్తి వలన, సంపద వలన గర్వం కలిగింది. దానికి విరుగుడుగా శ్రీకృష్ణుడు అష్టమహిషుల ఇళ్ళలో పారిజాత వృక్షాల్ని కల్పించి, ఏకకాలంలో అనేక రూపాలు ధరించాడు. తన మాయా విలాసకేళితో సత్యభామకు గర్వభంగం

కావించాడు. అదే విధంగా పూర్వం శ్రీమహావిష్ణువు కూడా తన హృదయవాసిని అయిన మహాలక్ష్మి సంపద గర్వంచేత అహంకరించిందని గ్రహించాడు. మహాలక్ష్మికి ప్రతిగా మాయాలక్ష్మిని కల్పించాడు. విష్ణువు మహాలక్ష్మి గర్వంతో నశింపజేసిన వైకుంఠపుర వైభవాన్ని తన మాయా విలాస వైఖరితో మరింత శోభాయమానం చేశాడు. మత్సరగ్రస్థురాలైన మహాలక్ష్మిని పరితాపానికి గురిచేసి, తర్వాత వైకుంఠప్రాప్తిని కలిగించాడు. ఆ రీతిగా మొదట శ్రీమహావిష్ణువు తన ఇల్లాలిని –ఇంటిని (మహాలక్ష్మిని) చక్కబెట్టుకున్నాడని తెలుస్తుంది.

శ్రీమహావిష్ణువు నాభికమలంలో జన్మించిన బ్రహ్మ సృష్టి నిర్మాణకార్యశక్తిని వరంగా పొందినాడు. ఆ వరగర్వం చేత అతడు విష్ణుమహిమనే ధిక్కరించాడు. అందుచేత విష్ణువు బ్రహ్మ గర్వాన్ని భంగపరిచి, పెడమార్గాన్ని పట్టిన కుమారుడిని సంస్కరించడంలో తండ్రికిగల బాధ్యతను నిర్వర్తించినాడని తెలుస్తుంది. తర్వాత విష్ణువు తనతో సమానుడు, సగం దేహాన్ని పార్వతికి సమర్పించిన వాడూ అయిన శివుడి కామదహన గర్వాన్ని, మాయామోహినీ రూపంతో, కాముని సహకారంతోనే నాశన మొనర్చాడు. ఈ చర్య ద్వారా శివకేశవులు వేరుకాదని లోకానికి చాటాడు. విష్ణువు పరమ భాగవతుడైన నారదుడి అహంకారాన్ని మాయా సంసార బంధం కలిగించి భంగపరిచాడు. నారదుడి పూర్వ కర్మఫల శేషాన్ని మానిపి తరింపజేశాడు. మానవులైన పుండరీకుడు, చండదమనుడు అనే భక్తులను కఠినంగా పరీక్షించి, మోక్షాన్ని అనుగ్రహించాడు. ఈ విధంగా 'విష్ణుమాయా విలాస' కావ్యాలలో శ్రీమహావిష్ణువు నాయకరత్నమై, తన మాయావిలాస వైఖరులతో గర్వోపవిష్ణులకు గర్వభంగం కావించాడు. పశ్చాత్తాప హృదయంతో శరణువేడిన వారిని అనుగ్రహించాడు. విష్ణుమాయా ప్రభావ ప్రకటన నెపంతో లోకకళ్యాణ ప్రదమైన విలాస చేష్టలను ఆయా కథాఘట్టాలలో ప్రదర్శించాడని తెలుస్తున్నది.

### 5.1.2. ఇతర పాత్రల పరిచయం

'విష్ణుమాయా విలాస' కావ్యాలలో కథాగమనానికి ఉపకరించిన పాత్రలు ప్రధాన, అప్రధానభేదంతో క్రింది విధంగా కనిపిస్తున్నాయి. కథలో ప్రధాన భూమికను పోషిస్తూ, కథాగమనాన్ని ప్రభావితం చేయగలిగిన పాత్రలు ప్రధానమైనవిగా భావించవచ్చు. కథాగమనంలో రంగం మీద అచేతనంగా కనిపించేవి, కవి చేత ప్రస్తావనామాత్రంగా పేర్కొనబడినవీ అయిన పాత్రలు అప్రధానపాత్రలుగా పరిగణించవచ్చు.

### 5.1.2.1. చింతలపూడి ఎల్లనార్యుడు - పాత్రల పరిచయం

ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకంలో కనిపించే పాత్రలు ప్రధాన, అప్రధాన భేదంతో ఈ విధంగా కనిపిస్తున్నాయి. ప్రధానపాత్రలలో సత్యభామ, రుక్మిణి, గోవిందశర్మ, మహాలక్ష్మి, మయాలక్ష్మి, బ్రహ్మ, మాయాసరస్వతి, శివుడు, పార్వతి,

మోహిని, నారదుడు, పుండరీకుడు, చండదమనుడు అనే పాత్రలు ఉన్నాయి. ధర్మరాజు, వ్యాసుడు, మార్కండేయుడు, సనత్కుమారుడు, సావిత్రి, బోయకాంత, దేవతలు, రాక్షసులు, ప్రమథులు, కపటముని చంద్రకేతుడు, వృద్ధబ్రాహ్మణుడు, సత్యభామ చెలికత్తె, రుక్మిణి చెలికత్తె అనేవి అప్రధాన పాత్రలుగా కనిపిస్తున్నాయి.

ప్రధాన పాత్రలు

కథలో ప్రధానంగా ఉంటూ, కథావృత్తం అంతా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావాని చూపగలిగేవి ప్రధాన పాత్రలు అని చెప్పవచ్చు. కథ ఎక్కువగా ఏ పాత్ర చుట్టూ విస్తరించి ఉంటుందో అది ప్రధానపాత్ర అవుతుంది. ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకంలో ఈక్రిందివి ప్రధాన పాత్రలుగా కనిపిస్తున్నాయి.

సత్యభామ

సత్యభామ శ్రీకృష్ణుడి అష్టమహిషులలో అతనికి అత్యంత ఇష్టమైన భార్య. సత్యభామ అష్టమహిషులలో రూపంలోను, యౌవనంలోనూ సంపన్నురాలు. ఈమె భూదేవి అంశతో జన్మించినది. సత్యభామ శ్రీకృష్ణుడు తనకే సొంతం కావాలనుకునే ధీరనాయిక. సత్యభామ అభిమానంతో పారిజాతవృక్షాన్ని నందనవనం నుంచి నేలకు తీసుకొచ్చి, తన పెరటి చెట్టును చేసుకుంది. సత్యభామ నిరంతరం తన ప్రియసఖుడు శ్రీకృష్ణుడు ఎదురుగా ఉండగా గర్వించింది. సత్యభామ ఈ రీతిగా గర్వితురాలై రుక్మిణికి పారిజాత పుష్పాలను కానుకగా పంపించే నెపంతో తనదైన మహరాజవైభవాన్ని ప్రదర్శించాలనుకుంది. సత్యభామ శ్రీకృష్ణుడితో కూడి అనుభవించే మదన సామ్రాజ్య వైభవాన్ని ప్రకటించి, తద్వారా రుక్మిణీ మొదలైన కాంతలకు హృదయశల్యం కావాలని పారిజాతపుష్పాలు పరిచారికతో పంపింది.

సత్యభామ శ్రీకృష్ణుడిని కపట కృత్యాన్ని పరిచారిక వలనవినగానే శరీరం లతలాగ వణికిపోగా, కన్నులు కోపంతో ఎర్రబడ్డాయి. ఆమె మన్మథుడి ఆగ్నేయాస్త్రం లాగా శ్రీకృష్ణుడి ముందుకు వచ్చింది. సత్యభామ అసూయవల్ల కలిగిన రోషంతో ఏడుస్తూ, 'భూలోకంలో పారిజాతవృక్షం సత్యభామ ఇంట తప్ప వేరేచోట ఉండదు. కాని నేడు దాన్ని రుక్మిణి ఇంట నిలిపావు. ఏ మందులతో నిన్ను వలపించినారు' (1-201) అని శ్రీకృష్ణుడిని నిందించింది. సత్యభామ ఇక్కడ పారిజాతాపహరణ కావ్య నాయికలాగ ఆత్మాభిమానం ప్రదర్శించడం కనిపిస్తుంది. సత్యభామకు అసూయ వలన హృదయంలో క్రోధాగ్ని రగిలింది. 'ఆమె కుండలో బంధించినపగబట్టిన నాగుపాములాగ' (1-203) పొరలిఏడ్చింది. సత్యభామ సంపద గర్వమంతా ఆమెకు కలిగిన విషాదం వలన నశించింది. సత్యభామ జరిగిన వింత అంతా శ్రీకృష్ణుడి కపట మాయా విలాసమని గోవిందశర్మ వలన తెలుసుకుంది. సత్యభామ తన అజ్ఞానాన్ని, శ్రీకృష్ణుడి విలాసకేళినీ తలచుకొని ఊరడిల్లింది. సత్యభామ తన మనసుకు ఆహ్లాదాన్ని కలిగించిన

గోవిందశర్మను పారిజాత పుష్పమాలికతో సత్కరించింది. ఈ విధంగా సత్యభామ మానినీత్వం, రూపయౌవన గర్వభంగం ఇక్కడ వర్ణితమైంది. సత్యభామకు సపత్నుల విషయంగా కలిగిన రోష విషాదాలు ఆమె విలక్షణమైన మనస్తత్వాన్ని ఆవిష్కరిస్తున్నాయి. సత్యభామ జరిగిన వృత్తాంతమంతా కృష్ణమాయ అని తెలిపిన గోవిందశర్మను పారిజాత మాలికతో సన్మానించడం ఆమె హృదయ నైర్మల్యానికి నిదర్శనంగా చెప్పవచ్చు.

రుక్మిణి

విష్ణుమాయా నాటకంలో రుక్మిణి శృంగార విలాసమూర్తిగా కనిపిస్తుంది. రుక్మిణి కథారంగం మీదికి రాగానే కొనగోటి నొక్కులుగల కుచములతో, దంతక్షతమైన అధరాలతో, కెంపురంగు కన్నులతో, చెదరిన కురులతో, శ్రీకృష్ణుడితో రతి సంరంభం చాలించి' (1-158) శయ్య దిగుతూ కనిపిస్తుంది. రుక్మిణీదేవి ఇంతటి శృంగారమూర్తిగా కనిపించడానికి కారణం ఆమెకు పారిజాతవృక్షం లభించడం. అది కేవలం శ్రీకృష్ణుడి మాయాకేళి వలన సంభవించింది. సత్యభామ గర్వభంగానికి కారణమైన కృష్ణుడి కపట నాటకంలో రుక్మిణిది ప్రధాన పాత్రగా కనిపిస్తుంది. రుక్మిణి పరిచారిక ద్వారా పంపిన పారిజాత పుష్పాలు చూసి, ఆమె మాటల వలన శ్రీకృష్ణుడు రుక్మిణితో కూడి ఉన్నాడని తెలుసుకొని సత్యభామ విషాదాన్ని పొందాలి. తద్వారా సత్యభామ గర్వం నశించాలి అనేది శ్రీకృష్ణుడి భావన. దానికి తగినట్లుగానే ఎల్లనార్యుడు రుక్మిణి పాత్రను శృంగార విలాసమూర్తిగా చిత్రించాడనిపిస్తుంది. రుక్మిణి పరిచారికతో పారిజాత పుష్పాలు సత్యభామ ఇంటికి పంపుతూ, 'మాకృష్ణుడు మాకొక పారిజాత వృక్షం తెచ్చాడు. దాని పూవులు ఇవి. ఇటువంటి పూవులు భూమిపై మరెక్కడైనా ఉన్నాయా' (1-164) అని చెప్పమన్నది. రుక్మిణి ఈ రీతిగా సత్యభామ పరిచారిక ముందు తన శృంగార విలాసాన్ని, చతుర సంభాషణా చాతురినీ ప్రదర్శించింది. ఇందంతా సత్యభామ గర్వనాశనం కొరకే అని భావించాలి. ఈ విధంగా రుక్మిణి పాత్ర ఒక ప్రయోజనాన్ని ఆశించి ఈ కథలో ప్రవేశపెట్టబడిందని తెలుస్తున్నది. అంతే కాకుండా రుక్మిణి పాత్ర తనకు ఉద్దేశించిన ప్రయోజనాన్ని సమర్థంగా నెరవేర్చిందనిపై పరిశీలన వలన తెలుస్తున్నది.

గోవిందశర్మ

'గోవిందశర్మ శ్రీ కృష్ణుడి నర్మసఖుడు. సాందీపని మహర్షి మనుమడు, ధర్మశీలుని కుమారుడు. గోవిందశర్మ పుట్టగానే ఆకాశవాణి వీడు అఖిలశాస్త్రవేది, అత్యాశ్రమవిశ్రు తకీర్తి గోవిందశర్మడు గోవింద మిత్రుడు' (1-132) అని పలికింది. గోవిందశర్మ శ్రీకృష్ణుడితో కలిగిన మైత్రి వలన, అతని అష్టమహిషులకు ఉబుసు పోవడానికి క్రొత్తలుగా కథలు చెబుతుంటాడు. గోవిందశర్మ అష్టమహిషుల అంతఃపురాలలో నిరభ్యంతరంగా సంచరిస్తుంటాడు. అతడు శ్రీకృష్ణుడు పంపగా ద్వారక నుండి ధర్మరాజు కొలువుకు సనకసనందనాది మునులతో కలిసి వచ్చాడు. అతడు 'వినీల కంధరాకారుడు.

గోపి చందనాన్ని శరీరమంతటా అలదుకొన్నవాడు. పారిజాత పుష్పమాలిక వక్షస్థలం మీద ధరించినవాడు. క్రొత్త తులసీ మాలలను ధరించిన వాడు. రెండవ కృష్ణుడి లాగ చేతిలో బంగారు పుస్తకం ధరించినవాడు' (1-108) ధర్మరాజు పారిజాతపుష్ప మాలిక గోవిందశర్మకు ఏ విధంగా లభించిందని ప్రశ్నించగా, అతడు సత్యభామ విష్ణుమాయకు భ్రమసిన కథను వినిపించాడు. గోవిందశర్మ విష్ణుమాయకు భ్రమించి దుఃఖాన్ని పొందిన సత్యభామకు, జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని తెలియజెప్పాడు.

ప్రతిమందిరంలో పారిజాత వృక్షాలను కల్పించడం, ఏక కాలంలో బహురూపాలను ధరించడం అనేవన్నీ శ్రీహరి ఇంద్రజాలం అని గోవిందశర్మ చెప్పాడు. అంతే కాకుండా సత్యభామ హృదయం ఎంత ధైర్యం కలదో చూడాలని భావించిన శ్రీకృష్ణుడి కపట నాటకాన్ని ఆమెకు తెలిపాడు. గోవిందశర్మ పూర్వం విష్ణుమాయకు భ్రమించిన మహాలక్ష్మి, బ్రహ్మ, శివ, నారదాదుల కథలను ఆమెకు వినిపించాడు. గోవిందశర్మ విష్ణుమాయా విలాస కథలను 'విష్ణుమాయా నాటకము' అనే ప్రబంధంగా రచించినట్లు సత్యభామకు చెప్పాడు. గోవిందశర్మ సత్యభామకు హృదయాహ్లాదాన్ని కలిగించి, ఆమె నుంచి పారిజాత పుష్పమాలికను బహుమతిగా పొందాడు. గోవిందశర్మ పాత్ర ఈ కావ్యంలో విష్ణుమాయావిలాస కథలను చెప్పడానికి, ఈ కథలన్నిటి మధ్యా ఒక ఏకసూత్రతను కలిగించడానికి దోహదపడింది. పారిజాతపహరణ కథ ఈ కావ్యానికి పూర్వరంగం అయితే, గోవిందశర్మ తర్వాత జరిగిన కథలన్నింటికీ పూర్వరంగంతో ఐక్యానుసంధానం కలిగించే కొలికిపూస వంటివాడు గోవిందశర్మ. ఈ విధంగా ఎల్లనార్యుడు కల్పించిన గోవిందశర్మ పాత్రలో ఒక వింతమెరుపు, చమత్కారం కనిపిస్తున్నాయి. ధర్మరాజు సభలో విష్ణుమాయా విలాసకథలను చెప్పడానికి వ్యాసుడు పూనుకొన్నాడు. ఆ సందర్భంలో అక్కడికి గోవిందశర్మ హఠాత్తుగా ప్రవేశించాడు. గోవిందశర్మ శ్రీకృష్ణుడికి ఆంతరంగిక సఖుడు, విష్ణుమాయా కథలను ప్రబంధంగా రచించినవాడు. అందుచేత విష్ణుమాయా విలాసకథలను చెప్పడానికి వ్యాసుడి కంటే గోవిందశర్మకే ఎక్కువ అధికారం ఉందని ఇతనిపాత్ర వలన తెలుస్తున్నది.

మహాలక్ష్మి

మహాలక్ష్మి శ్రీమహావిష్ణువు హృదయ పీఠాన్ని అలంకరించిన నాయికమణి. ఆమె శ్రీమహావిష్ణువు అర్ధాంగి, సముద్రుని గారాలపట్టి, చంద్రుని సహోదరి. మన్మథునికి మాతృమూర్తి. మహాలక్ష్మి సర్వమంగళాధిదేవత. మహాలక్ష్మి ఒకనాడు వైకుంఠంలో జూదమాడుతూ, విష్ణువు చేసిన మాయవలన ఓడిపోయింది. మహాలక్ష్మి భూదేవి, సరస్వతి, దేవకాంతల ముందు ఓటమిని భరించలేక విష్ణువుపై కోపించింది. మహాలక్ష్మి అల్పుడైన జూదగాడిలాగ విష్ణువు మోసంతో ఆమెను గెలిచాడని నిందించింది. మహాలక్ష్మి విష్ణుమాయను నిందించి, 'బ్రహ్మ రుద్ర ఇంద్రాది దేవతలకు పదవులు, సంపద తనవల్లనే కలిగాయని పలికింది. అంతేకాకుండా మహాలక్ష్మి, విష్ణువుకు

ముల్లోకాధిపత్యం కూడా తన వల్లనే కలిగిందని' (2-30) అహంకరించి పలికింది. మహాలక్ష్మి జూదంలో ఓటమి వలన కలిగిన కోపంతో వైకుంఠపుర వైభవానికి తన మాయా విలాస ప్రభావమే కారణమని పలికింది. అంతటితో ఆగకుండా వైకుంఠపుర వైభవాన్ని క్షణంలో శూన్యమయం చేసింది. మహాలక్ష్మి 'భూమి కంపించగా, లోకాలు తల్లడిల్లగా, పంచభూతాలు ఆక్రోశించగా, సరస్వతి ప్రార్థనను లెక్కించకుండా వైకుంఠపుర వైభవాన్ని హరించింది' (2-34)

మహాలక్ష్మి దేవకాంతలతో కలిసి వనవిహారం చేస్తూ, ఒక కొలనులో ప్రభాహీనమైన దేవతను చూసింది. మహాలక్ష్మి ఆ దేవత ప్రభావాన్ని స్తుతించి, ఆమె తపస్సు చేయటానికి గల కారణమేమని అడిగింది. మహాలక్ష్మి మాయాలక్ష్మి వృత్తాంతం విని, శ్రీమహాలక్ష్మిని, శ్రీమహావిష్ణువుకు భార్యనూ అయిన తాను ఉండగా, వేరొక లక్ష్మి ఎలా కలుగుతుందని విస్మయం చెందింది. బ్రహ్మాది దేవతలు మాయాలక్ష్మిని కీర్తించగా విని, మహాలక్ష్మి మాపయిన వేరొక లక్ష్మి, విష్ణువు ఉన్నారా? అని సందేహపడింది. మహాలక్ష్మి తన కళ్ళ ముందు జరిగేదంతా కలో ! భ్రమో ! పలవరమో! ఇంద్రజాలమో! అని సందేహించింది. మహాలక్ష్మి ఈ వనదేవత ప్రియుడు విష్ణువు తన భర్తే అయితే, ఇంకతాను ఏమికాగలనని విచారించింది. మాయాలక్ష్మి పుష్పక విమానం ఎక్కుతూ మహాలక్ష్మి తేజస్సును హరించింది. మహాలక్ష్మి తేజోవిహీనమై, మాయాలక్ష్మీ వైభవానికి, ప్రియసఖులు విడిచి పోయినందుకు, భర్త దూరమయినందుకూ మనసులో భరించరాని దుఃఖంతో పరితపించింది.

మహాలక్ష్మి వైకుంఠపురాన్ని చేరుకొని, అక్కడ విష్ణువు వేరొకలక్ష్మితో కలిసి ఉన్నాడని తెలుసుకుంది. ఇక విభుని ముందుకు ఏ విధంగా వెళ్ళగలనని ఆమె తిరిగి ఉద్యానవనంలోని కొలను చేరుకొని, తామర పీఠంపై నిష్ఠతో తపస్సు చేయసాగింది. ఆ తర్వాత మహాలక్ష్మి శ్రీమహావిష్ణువు అనుగ్రహానికి పాత్రమై, తిరిగి వైకుంఠపురం చేరుకొని పూర్వపుస్థితిని పొందింది. జరిగినదంతా కలగా భావించిన మహాలక్ష్మి పశ్చాత్తాపంతో విష్ణుమాయను స్తుతించింది. మహాలక్ష్మి ప్రవర్తన ఈ కావ్యంలో, 'ఎక్కినవానికి ఏనుగ గుజ్జట' (2-110) అనేరీతిగా కనిపిస్తుంది. మహాలక్ష్మి సకల సంపదలకూ తాను అధిదేవతనని అహంకరించింది. ముల్లోకాల వైభవానికి ప్రాభవానికి తన మహత్వమే కారణమని గర్వించింది. చివరికి విష్ణుమాయకు చిక్కుకొని పరితపించింది. అందుచేత మహాలక్ష్మి పాత్రలో స్త్రీలకు సహజమైన చిత్త చాంచల్యం, దర్పం, అసూయ మొదలైన లక్షణాలన్నీ (2-63) కనిపిస్తాయి. మహాలక్ష్మి లాగ మితిమీరిన గర్వంతో దుష్కృతి చేసినవారు ఎవరైనా విష్ణుమాయా జాలంలో చిక్కుకుని పరితపించాల్సిందే అని ఈమె పాత్ర వలన తెలుస్తుంది.

మాయాలక్ష్మి

మాయాలక్ష్మి శ్రీమహావిష్ణువు చేత మహాలక్ష్మికి గర్వభంగం చేయడానికి కల్పించబడింది. మాయాలక్ష్మి క్షీరసాగర తీరంలోని ఉద్యానవనం కొలనులో వాడి బంగారు తామర కర్ణిక మీద కూర్చొని కనిపిస్తుంది. ఆమె ఒక చేతిలో అక్షమాల, ఒకచేతితో చిన్ముద్రనుదాల్చి ధ్యానముద్రతో ఉన్నది. మాయాలక్ష్మి తన యోగసమాధిని చాలించి కనులు తెరచి, ఎదురుగా ఉన్న లక్ష్మీసరస్వతులను సామాన్యస్త్రీలుగా భావించింది. మాయాలక్ష్మి వారిని ఎవ్వరు మీరు మీ నివాసమేది? మీ పేర్లేమిటి? అని ప్రశ్నించింది. మహాలక్ష్మి కోరగా మాయాలక్ష్మి ఆమె పేరు లక్ష్మి అని, హరికి ప్రియురాలు అని తెలిపింది. మాయాలక్ష్మి విష్ణుమాయవలన మోసపోయిన తీరును మహాలక్ష్మికి వినిపించింది.

మాయాలక్ష్మి ఒక కల్పాది నందు విష్ణుమాయ వలన లక్ష్మి జన్మించిందని, ఆ లక్ష్మికి అనేక సంపదలు కలిగించి విష్ణువు పరిగ్రహించాడని మహాలక్ష్మికి చెప్పింది. మాయాలక్ష్మి విష్ణువును ముల్లోకాలూ పూజిస్తుండగా, దానికి తన ప్రభావమే కారణమని రాజసదుర్మదంతో ప్రవర్తించింది. లోకాలను సృష్టించడానికి బ్రహ్మ, శివుడు ఇద్దరూ విష్ణువును గూర్చి తపస్సు చేశారు. విష్ణువు వారి కోరిక తీర్చక ఊరకున్నాడు. మాయాలక్ష్మి విష్ణువుకు వరం ఇచ్చే శక్తి లేదని భావించి, వివేకం లేకుండా ఇద్దరికీ ఒకే వరాన్ని ఇచ్చింది. అప్పుడు మాయాలక్షి ముందు విష్ణుమాయ ప్రత్యక్షమైంది. మాయాలక్ష్మి దుర్మతిని విష్ణుమాయ నిందించి, 'నీలో దుర్మద కారణమైన రాజస తామస గుణాలు ఎక్కువగా ఉన్నాయి. అందుచేత నీ లక్ష్మీ గర్వ వైభవం నశిస్తుంది. అంతస్తేజంతో కొన్ని దివ్యవర్షాలు తపస్సు చేయమని' (2-137) శపించిందని మాయలక్ష్మి తన వృత్తాంతాన్ని వినిపించగానే, ఆమెకు శాప విమోచనం కలిగింది. కళావిహీన అయిన మాయాలక్ష్మి తిరిగి తన పూర్వపు వైభవాన్ని పొందింది.

మాయాలక్ష్మిని బ్రహ్మ మొదలైన దేవతలు పుష్పక విమానంలో వచ్చి స్తుతించారు. మాయాలక్ష్మి తన వైభవాన్ని చూసి ఆశ్చర్యపోతున్న మహాలక్ష్మి తేజస్సును హరించి, దేవకాంతలను వెంటపెట్టుకుని వైకుంఠానికి వెళ్ళిపోయింది. మాయాలక్ష్మి పాత్ర కల్పన, విష్ణుమాయను నిందించిన మహాలక్ష్మికి గర్వభంగం కావించడానికి చేసిందని తెలుస్తుంది. ఈ మాయాలక్ష్మి పాత్రవల్ల మహాలక్ష్మికి అహంకార నాశనం చేయడం అనే పరమ ప్రయోజనం నెరవేరింది. మాయాలక్ష్మి మొదట తేజోవిహీన రూపంతో కనిపించడం, తర్వాత విష్ణువు అనుగ్రహానికి పాత్రురాలై వైకుంఠం చేరుకోవడం, మహాలక్ష్మికి కనువిప్పు కలిగించడం అనేవి ఈ పాత్ర ద్వారా కవి సాధించదలచిన కార్యాలు. మాయాలక్ష్మి పాత్ర కవి ఉద్దేశించిన లక్ష్యాలను నెరవేర్చి ఈ కావ్యంలో సముచిత స్థానంలో నిలుస్తున్నదని చెప్పవచ్చు.

బ్రహ్మ

బ్రహ్మ విష్ణువు నాభికమలంలోని పరమాణు అంశం నుండి జన్మించాడు. అతడు బంగారు వర్ణపు కాంతితో మెరిసిపోతూ శ్రీమహావిష్ణువును స్తుతించి, సృష్టి నిర్మాణ సాధన సామగ్రిని వరంగా పొందాడు. బ్రహ్మ వరప్రభావం వలన బ్రహ్మాండాన్ని కల్పించి, ప్రపంచసృష్టి చేయనారంభించాడు. బ్రహ్మ సకల చరాచర జగత్తును చూసి, రాజసగుణం చేత గర్వించాడు. సత్యలోకంలో ఒకనాడు బ్రహ్మను దేవతలు, మునులూ చేరి స్తుతించగా, అతడు ముల్లోకాలలో తనంతదైవం ఎవరూలేరని పలికాడు. దేవతలలో అతనికంటే అధికుడు ఎవరూలేరని, త్రిలోకనాయకుడు తానేనని అన్నాడు. బ్రహ్మ సమస్తలోకాలూ అతనినే పూజించాలని దేవతలతో అన్నాడు. బ్రహ్మ అహంకారాన్ని మార్కండేయముని ఆక్షేపించి, విష్ణుమహిమను తెలిపాడు. బ్రహ్మ మార్కండేయముని మాటలకు కోపించి, తాను కల్పించింది కాకుండా విష్ణువు వేరొక లోకాన్ని కల్పించాడా అని పరిహసించాడు. బ్రహ్మ మార్కండేయుడు వినిపించిన విష్ణుమహిమను, పుండరీకుడి కథనూ విని కూడా ఆ మాటలను నిర్లక్ష్యం చేశాడు.

బ్రహ్మ తన మహిమను పొగడుకొని, విష్ణుమాయను నిందించాడు. బ్రహ్మతన సామర్థ్యాన్ని తెలపడానికి సృష్టి నిర్మాణాన్ని చాలించి, మందరగిరి గుహలో తపస్సు చేయడానికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ పది వేలసంవత్సరాలు నిశ్చలసమాధిలో తపస్సు చేయగా విష్ణుమాయాప్రభావంతో అతడికి మాయాసరస్వతి కనిపించింది. బ్రహ్మ మాయాసరస్వతిని చూడగానే మోహవివశుడయ్యాడు. అతడు మాయాసరస్వతిని తన అర్ధాంగిగా భ్రమించాడు. బ్రహ్మ మాయాసరస్వతితో రతికేళిలో మునిగి శతానందుడయ్యాడు. బ్రహ్మ ఆ విధంగా మాయాసరస్వతితో అనేక సంవత్సరాలు సురత సౌఖ్యాన్ని అనుభవించాడు. విష్ణుమాయా ప్రభావంతో మాయాసరస్వతి అదృశ్యం కాగా, బ్రహ్మ ఆమెను వెదుకుతూ గుహ వెలుపలికి వచ్చాడు. బ్రహ్మ విరహభారంతో, దిగులుపాటుతో, కంపం, దైన్యం, ఖేదం, లజ్జ, దుఃఖంతో ఉండగా మార్కండేయ ముని చూశాడు. బ్రహ్మ దైన్యాన్ని గుర్తించి, మార్కండేయముని విష్ణుమాయా ప్రభావాన్ని బోధించాడు.

బ్రహ్మ మార్కండేయుడి సత్యబోధనువిని దురహంకారాన్ని విడిచాడు. బ్రహ్మ విష్ణువును స్తుతించి అపరాధి, నీచ కర్ముడు అయిన అతడిని పుత్ర భావంతో మన్నించమని(3-344) ప్రార్థించాడు. బ్రహ్మ శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొంది, తిరిగి యథాస్థానానికి చేరుకున్నాడు. బ్రహ్మపాత్ర వలన, విష్ణువు నాభికమలంలో జన్మించిన సృష్టికర్త అయినా రాజసగుణంతో గర్విస్తే భంగపాటు పొందక తప్పదని తెలుస్తుంది. విష్ణుమాయను ఎదిరించిన వారు ఎంతటివారైనా మాయామోహబంధంలో తగుల్కొని పరాభవాన్ని పొందవలసిందే అని కూడా బ్రహ్మపాత్ర వలన తెలుస్తుంది.

మాయాసరస్వతి

మాయాసరస్వతి బ్రహ్మకు గర్వభంగం కావించడానికి విష్ణుమాయా ప్రభావంతో కల్పించబడింది. విష్ణుమాయ మాయాసరస్వతిగా మారి, శృంగార విలాసమూర్తిగా బ్రహ్మ ఎదుట నిలిచింది. మాయాసరస్వతి 'నెత్తమ్మిరేకుల వంటి పాదాలతో, అలరుకెమ్మోవితో, అమృత హాసంతో, వెడద కన్నులతో, నిండు జవ్వనంతో' (3-288) బ్రహ్మను మరులు కొలిపింది. మాయా సరస్వతిలో యౌవనోదయం, రమ్యత్వం, మాధుర్యం పెంపొందగా రతీదేవి లాగ బ్రహ్మ ముందు శృంగార చేష్టలను చూపింది. ప్రియుడు కనిపించలేదని 'కన్నీరు కార్చడం, కంపించడం, నవ్వడం, పులకించడం వీణను మీటి పాడటంళ (3-299) వంటి శృంగార వికారపు చేష్టలు చేసింది. మాయాసరస్వతి చేసిన ఈ అస్వాభావికపు చేష్టలన్నీ బ్రహ్మకు తపోభంగం కలిగించడానికి మాత్రమే అని గ్రహించాలి. మాయా సరస్వతిని చూసి మరులు కొన్న బ్రహ్మ ఆమె ఎవరని అడిగాడు. మాయాసరస్వతి, తాను వాణీవధూటినని తపస్సు చాలించి తనను ఏలుకోమని పలికింది.

మాయాసరస్వతి బ్రహ్మ తపోనిష్ఠను భంగపరిచింది. అతడిని సురతసౌఖ్యంలో ముంచి, శతరూపాలు ధరించింది. 'తారహారాలు ధరించి, వెలిపట్టు వస్త్రాలు ధరించి, ఒక రూపంతో మెరిసింది. నాగాభరణాలు ధరించి, చెంగావి వలువలతో ఒక మూర్తి వెలసింది. నవరత్న భూషణాలు ధరించి, చిత్రాంబరాలతో ఒకరూపం నిలించింది. విరుల సొమ్ములు, తామర నూలిచీర ధరించి ఒకరూపం కనిపించింది '(3-330) ఈ రీతిగా మాయా సరస్వతి నూరు రూపాలు ధరించింది. మాయాసరస్వతి బ్రహ్మను తన మాయాశృంగారకేళిలో ముంచి, ఒకనాడు అదృశ్యమైపోయింది. మాయాసరస్వతి, బ్రహ్మకు తపోభంగం కలిగించి గర్వనాశనం చేయడానికి కల్పించబడింది. ఆమె పాత్ర ఈ కావ్యంలో శృంగార విలాసమూర్తిగా వర్ణించబడింది. మాయాసరస్వతి విష్ణుమాయను నిందించి, నిష్ఠతో తపస్సు చేయడానికి పూనుకున్న బ్రహ్మను ఆకర్షించడానికే శృంగార వికారపు చేష్టల్ని చూపింది. ఆమె శతరూపాలు ధరించి బ్రహ్మను రతి పారవశ్యంలో ముంచింది. మాయాసరస్వతి బ్రహ్మకు రతిసౌఖ్యాలు చవిచూపించి, విషయలోలునిగా చేసింది. విషయలోలుడికి ఏకాగ్రచిత్రం కుదరడం అసాధ్యం కాబట్టి ఆమె ఈ రీతిగా ప్రవర్తించిందని గ్రహించాలి. ఈ విధంగా మాయాసరస్వతి పాత్ర కూడా ఈ కావ్యంలో ఒక ప్రయోజనాన్ని (బ్రహ్మ గర్వభంగాన్ని) ఉద్దేశించి కల్పించిన పాత్ర అని తెలుస్తుంది.

శివుడు

శివుడు త్రిమూర్తులలో లయకారకుడు, ఆదిదేవుడు. 'శివుడు గంగాజలకణాలతో మౌళి నిండగా కల్పవృక్షం లాగా ప్రకాశించువాడు. శివుడు కంఠం నందు నల్లదనంతో

పూర్ణచంద్రుని లాగ ప్రకాశించువాడు. అతడు నాగాభరణాలతో సూర్యుడిలాగ ప్రభవించువాడు. శివుడు కరుణ, గంభీర భావాలు సమంగా నిండిన సముద్రుడి వంటివాడు. శివుడు కామకళ ఎడమవైపున, బ్రహ్మజ్ఞానం కుడివైపున ప్రజ్వరిల్లగా యోగసింహాసనంపై తేజరిల్లువాడు' (4-70) పరమశివుడు క్షీరసాగర మథనంలో వెలువడిన హాలాహలాన్ని తన కంఠంలో ధరించి లోకాలను రక్షించాడు. శివుడు విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మోసపుచ్చి,అమృతాన్ని దేవతలకు పంచిన విషయాన్ని నారదుడి వలన విన్నాడు. అతడు నారదుని మాటలవలన మోహినీ సౌందర్యాన్ని చూడాలని, తన ఇంద్రియ నిగ్రహమహిమను లోకాలకు చాటాలనీ భావించాడు. శివుడు పార్వతి చేసిన హితబోధను వినకుండా సపరివారంగా వైకుంఠానికి బయలు దేరాడు.

శివుడు 'భర్మసూత్రంతో గొప్పవైన వ్యాఘ్ర, గజ చర్మాలను వస్త్రాలుగా ధరించాడు. మంత్ర పవిత్రమైన, నిర్మలమైన విభూదిని శరీరమంతా పూసుకున్నాడు. అతడు శరీరంపైన, మెడలోనూ నాగాభరణాలను ధరించాడు. శివుడు గొప్ప దైన తన జటాజూటం పైభాగాన చంద్రవంకను పువ్వుగా ధరించాడు. శివుడు మన్మథుడిని దహించిన మూడవ కంటి కాంతులు అంతటా వ్యాపించగా దివ్య యోగీంద్రమూర్తి రూపాన్ని ధరించాడు' (4-100) శివుడు శరీరమంతా విభూతిని ధరించి యోగవిద్యా రూపమిది అనేటట్లుగా నిర్వికారమైన రూపంతో వైకుంఠానికి చేరుకున్నాడు. శివుడు విష్ణువుతో మోహినిని చూడాలనే అతని కుతూహలాన్ని మొదటగా తెలిపాడు. 'విష్ణుమాయకు శివుడు కూడా మోహితుడవుతాడని' నారదుడు పలుకగా కోపించి వచ్చానని విష్ణువుతో చెప్పాడు. శివుడు తన ఇంద్రియనిగ్రహ పటుత్వమహిమను లోకాలకు తెలియజేయాలని విష్ణువును మోహినిగా మారమన్నాడు. శివుడు విష్ణువు పలికిన హితోక్తుల్ని విడిచి, మాయామోహినిని చూడకుండా తిరిగి వెళ్ళనని పంతంగా పలికాడు.

'మోహిని కనిపించగానే శివుడికి శరీరమంతా గగుర్పొడిచింది. పులకాంకురాలు పొడిచాయి, ముఖం వైవర్ణ్యాన్ని పొందింది. అతడికి శివుడి శరీరమంతా చమట బిందువులు జాలువారాయి. మనసు ఉల్లాసాన్ని పొందింది. శృంగార వాంఛ కలిగింది' (4-197) శివుడు మాయామోహిని సౌందర్యానికి దాసుడై పార్వతిని, విష్ణువును, సభలోని వారినీ మరిచి మోహినిని పట్టుకోవాలని భద్రాసనం దిగగానే, మోహిని మాయమైంది. శివుడు పాదాలు మెల్లగా మోపుతూ, పూపొదలమాటున దాగుతూ పూబంతి ఆట ఆడుతున్న మోహినిని పట్టుకోబోయి విఫలమయ్యాడు. మోహిని కనిపించక పోయేసరికి శివుడు విభ్రాంతుడై ఆ వనంలో తిరుగుతూ పరితపించాడు. ఈ రీతిగా శివుడు మోహినిని చేపట్టాలని అనేక ప్రయత్నాలు చేసి విఫలమై, విరహభావంతో దుఃఖించాడు.

శివుడు మోహిని కనిపించగానే పైట చెరగుపట్టి లాగబోయాడు. ఆ మోహిని స్పర్శతాకిడికే అతడికి శుక్లపతనమైంది. శివుడి శుక్లం బంగారు, వెండి ప్రవాహాలుగా భూమిపై ప్రవహించింది. అతడికి పరబ్రహ్మ జ్ఞానం కలిగింది. శివుడు విష్ణుమాయా విముక్తుడు అవగానే, మోహినీకాంత మాయా లీలలు కూడా మాయమైనాయి. శివుడు అత్యంత ఆదరంతో విష్ణుమాయాను స్తుతించి, పార్వతితో కూడి కైలాసానికి వెళ్ళాడు. శివుడు మన్మథుడిని జయించినవాడు, నిరంతరం యోగసమాధిలో నిశ్చల చిత్తంతో ఉండేవాడు. శివుడు నిర్వికార స్వరూపుడు అయినప్పటికీ నారదుడి మాటలకు ఉద్రేకంతో విష్ణుమాయను తిరస్కరించాడు. శివుడు మనోనిగ్రహం కలవాడిననే దర్పంతో అహంకరించినందుకు మోహిని భ్రాంతితో చిక్కుకున్నాడు. శివుడు తన దర్పం నశించేలాగా శృంగారవనంలో మోహిని వెంట వెర్రివాడిలాగా తిరిగాడు. సర్వజ్ఞుడే అహంకారంతో చివరకి అజ్ఞుడైనాడు. అందుచేత అహంకారమంతులు ఎంతటి సర్వజ్ఞులైనా విష్ణుమాయ ముందు అజ్ఞుల లాగ పరాభవాన్ని పొందక తప్పదని శివుడిపాత్ర వలన తెలుస్తుంది.

పార్వతి

పార్వతీదేవి శివుడి ఇల్లాలు, అర్ధాంగి. శివుడు నారదునితో కలిగిన పంతం వలన వైకుంఠానికి వెళ్ళి మోహినిని చూడాలని పార్వతితో అన్నాడు. పార్వతీదేవి శివుడి మాటలు విని, మిక్కిలి కాంతా వివశుడైన శివుడు, మనస్సులో ధైర్యాన్ని విడిచిపెడితే లోకాన్ని మరిచిపోతాడని తెలిపింది. పార్వతీదేవి శివుడితో మాట్లాడుతూ విష్ణుమాయను స్తుతించింది. 'ముల్లోకాలు శ్రీమహావిష్ణువు ఆధీనంలో ఉన్నాయని, దేవ, దానవ, మునులు అందరూ విష్ణుమాయలో మునిగి వర్తిస్తున్నారని తెలిపింది. పార్వతీదేవి శివుడితో విష్ణుమాయా లీలకు ఎప్పుడు ఏమవుతుందో ఎవరికీ తెలియదని చెప్పింది. అంతే కాకుండా మనస్సులోని ధైర్యం పదిలంగా ఉంటేనే, మన్మథుని వికారాలకు చలించకుండా నిగ్రహంగా ఉండగలిగితేనే వైకుంఠానికి వెళ్ళి రమ్మని' (4-86) శివునితో అన్నది. పార్వతీదేవి కూడా శివుడిని అనుసరించి వైకుంఠానికి వెళ్ళింది.

పార్వతీదేవి పాత్ర ఇందులో ఆదర్శప్రాయమైన ఇల్లాలిని తలపిస్తుంది. 'కరణేషుమంత్రి' అనేటట్లుగా పార్వతీదేవి మొదట శివుడిని వైకుంఠానికి వెళ్ళవద్దని సూచించింది. పార్వతీదేవి భర్తను వైకుంఠానికి వెళ్లవద్దనడానికి గల కారణాలను స్పష్టంగా వెల్లడించింది. పార్వతి శివుడితో, అతని కాంతామోహవివశత్వం, విష్ణుమాయా మహత్వాలను చిన్న మాటలలో పొందికగా కూర్చినట్లు పలికింది. అంతటితో ఆగకుండా, వైకుంఠానికి వెళ్ళడానికే నిశ్చయించుకున్న శివుడికి ఇంద్రియ నిగ్రహాన్ని నిలుపుకోమని హెచ్చరికలాంటి సూచన చేసింది. 'భర్త తోడిదే లోకం' అనేటట్లుగా పార్వతీదేవి శివుడిని

అనుసరించి వైకుంఠానికి వెళ్ళింది. ఈ చేష్ట భర్త శ్రేయస్సును కోరుకునే ఇల్లాలి మనస్తత్వాన్ని వ్యక్తం చేస్తుంది. ఈవిధంగా పార్వతీదేవి పాత్ర ఈ కావ్యంలో ఉత్తమ ఇల్లాలుగా చిత్రించబడిందని తెలుస్తుంది.

మోహిని

మోహినీకాంత, అమృతాన్ని అపహరించిన రాక్షసులను మోసపుచ్చి, దాన్ని దేవతలకు పంచడానికి శ్రీమహావిష్ణువు ధరించిన కృత్రిమ నారీరూపం. 'లోకాలను మోహింపజేయటానికి విష్ణువు సమ్మోహన రూపంతో స్త్రీగా అవతరించగా, 'మోహిని' అనే పేరు సార్థకమైంది. ఆ మాయామోహిని గజయానంతో అందియలు మ్రోగగా, తెల్లతామరల వంటి కన్నుల నుంచి చూపులనే సుగంధాన్ని అందరిపై చల్లుతూ మందహాసంతో నడిచివచ్చింది' (4-14) మోహిని సమ్మోహినీదేవి లాగా దేవతలను, రాక్షసులనూ చూడగానే వారికి మదనతాపం కలిగింది. మోహినిని చూసి దేవాసురులు ఆమె ఎక్కడినుండి వచ్చిందని, ఎవరని ప్రశ్నించారు. ఆమె వారితో తాను స్వేచ్ఛగా చరించేదానినని, భర్త ఎవరూలేరని తెలిపింది. ఆకాశవాణి దేవదానవులు అమృతంకోసం తగవులాడు కొంటున్నారని తనకు తెలిపిందని, వారికి సమ్మతమైతే అమృతాన్ని పంచుతానని మోహిని చెప్పింది.

మోహిని అమృత భాండాన్ని రాక్షసుల నుంచి అందుకొని, దానిని మొదట దేవతలకు పంచింది. మోహిని దేవతల పంక్తిలో మాయారూపంతో ఉన్న రాహువు అమృతాన్ని తాగబోవునంతలో, అతడి శిరస్సు ఖండించింది. దేవతలకు అందరికీ అమృతాన్ని పంచిన తర్వాత శ్రీమహావిష్ణువు కృత్రిమ నారీరూపాన్ని ఉపసంహరించి, పురుష రూపంతో ప్రకాశించాడు. శ్రీమహావిష్ణువు దేవదానవుల్ని భ్రమించడానికి మొదటిసారి మాయామోహిని రూపం ధరించాడు. రెండవసారి మోహినిని చూడాలని దర్పంతో వైకుంఠానికి వచ్చిన శివుడి ముందు మాయామోహినిగా నిలిచాడు. మాయామోహిని విష్ణుసభలోకి 'కలకల నవ్వుముఖంతోను, కాటుకరేఖల సోయగపు చూపుతోను, నెలవంక నెన్నుదురుతోను, మన్మథాకులమైన హృదయంతోను, మదగజం వంటి నడకతోను వచ్చింది' (4-199)

ఆ మోహినికాంత మదన కామధేనువు లాగ సభలోని వారందరికీ మదనపారవశ్యాన్ని కలిగించింది. మోహిని తన రూపవిలాసంతో శివుడిని కామాంధకారంలో ముంచింది. మోహిని శృంగారవనంలో విహరిస్తూ, శివుడికి అందకుండా అదృశ్యమయింది. అంతలోనే మోహిని శివుడి ముందు నిలిచి, 'పయ్యెద దిగజాఱ బసిడి చాయలదేరు చనుదోయి ముత్యాల సరములు వెలగ' (4-239) పూ బంతి ఆట ఆడింది. మోహిని తనను శివుడు చూస్తుండగా, 'జిగి గుబ్బ పాలిండ్ల జేలాంచనంబును దొడలపై ముంగొంగు దొలగియాడ' (4-249) తూగుటుయ్యాల

ఊగింది. ఆమె 'గురుతరోన్నత కుచకుంభ యుగ్మముదాంకి వీచీపరంపరల్ విఱిగిపడగ' (4-264) జలక్రీడలతో శివుడిని మోహంలో ముంచింది. మాయామోహిని మెరుపుతీగలాగ, ఎండమావిలాగ శివుడికి పట్టుకొనరానిదై విహరించింది. మోహిని విరహోన్మత్తుడై శివుడు పయ్యెద పట్టుకోగా అతనికి పట్టుబడకుండా మాయమైంది. మోహిని స్పర్శ చేతనే శివుడికి శుక్లపతనమైంది. మాయామోహినీ అవతార ప్రయోజనం నెరవేరింది. కామదహన దర్పంతో శివుడు విష్ణుమాయను తిరస్కరించాడు. కాబట్టి మోహిని తన రూపవిలాస వైఖరితో శివుడికి కామాతురతను కలిగించింది. మోహిని శివుడి దర్పాన్ని భంగపరిచి, అతడికి పరబ్రహ్మ జ్ఞానం కలగడానికి కారణమైంది. ఈ విధంగా విష్ణుమాయా మహిమను లోకానికి తెలియ జెప్పడం అనేది మోహినీ అవతార ప్రధాన ఉద్దేశ్యంగా మనకు తెలుస్తుంది. మదనాంతకుడైన శివుడికే మోహపారవశ్యం కలిగించాలి. కాబట్టి మోహినీకాంత ఇందులో అతిశయించిన శృంగార విలాసమూర్తిగా వర్ణించబడిందని తెలుస్తుంది.

నారదుడు

నారదుడు బ్రహ్మ మానసపుత్రుడు, బ్రహ్మచారి, త్రిలోకసంచారి. అతడు నిరంతరం శ్రీమన్నారాయణ నామాన్ని స్మరించేవాడు. పరమ భాగవతోత్తముడైన నారదుడు కలహాశనుడనిపేరు గడించాడు. ఈ కావ్యంలో నారదుడు అనేక సందర్భాలలో కనిపిస్తాడు. నారదుడు మొదటగా ద్వారక నుంచి ధర్మరాజు సభకు వచ్చిన సందర్భం ప్రథమాశ్వాసంలో ఉంది. గోవిందశర్మ ధర్మరాజు సభలో చెబుతున్న విష్ణుమాయా విలాసకథలకు నారదుడు కూడా ఒక శ్రోతగా కనిపిస్తాడు. చతుర్థాశ్వాసంలో నారదుడు మాయా మోహిని వృత్తాంతాన్ని శివుడి ముందు వర్ణించాడు. నారదుడే శివదర్పభంగానికి పరోక్షంగా కారకుడని తెలుస్తుంది. నారదుడి పాత్రను ప్రత్యేకంగా వర్ణించిన ఘట్టం పంచమాశ్వాసంలోని నారదగర్వభంగ కథ. నారదుడు కూడా విష్ణుమాయ చేత వంచనకు గురైన తీరు పంచమాశ్వాసంలో కనిపిస్తుంది.

వైకుంఠంలో శ్రీమహావిష్ణువు సన్నిధిలో విష్ణుమాయ చేసిన ఇంద్రజాల ప్రదర్శనను దేవకాంతలు అందరూ మెచ్చుకున్నారు. నారదుడు విష్ణుమాయను తిరస్కరించి, అతని తపోవిద్య ప్రేరేపించగా, విష్ణుమాయను జయించానని గర్వంతో పలికాడు. బ్రహ్మ రుద్రాది దివ్యులను భ్రమింపజేసిన విష్ణుమాయకు తాను భ్రమించలేదని నారదుడు విష్ణువుతో అన్నాడు. అంతటితో ఆగకుండా నారదుడు సత్యలోకంలో బ్రహ్మ ముందు, కైలాసంలో శివుడి ఎదుట, స్వర్గలోకంలో ఇంద్రుని సమక్షంలోను తాను విష్ణుమాయను జయించానని ప్రగల్భాలు పలికాడు. నారదుడు పురాకృత కర్మఫలం అనుభవించవలసి ఉన్నందువల్లనే 'అతిపరిచయాదవజ్ఞ' అనే రీతిగా ప్రవర్తించాడు. కొంతకాలానికి నారదుడు విష్ణుమాయా ప్రేరేపితుడై భూలోకంలోని సర్పవరం అనే క్షేత్రానికి

చేరుకున్నాడు. నారదుడు కపటముని వేషంలో వున్న విష్ణువుతో, తాను విష్ణుమాయను జయించానని పలికాడు. అప్పుడు ఆకాశవాణి నారదుడిని వారించి, అతడికి చండదమనముని కథను చెప్పింది. ఆ మాటలువిని నారదుడు రోషంతో, పట్టపసలేని మాటలు నమ్మవద్దని మునులతో చెప్పాడు.

నారదుడు విష్ణుమాయను చూసిన తనను ఏమాయలూ భ్రమించలేవని, ఆకాశవాణి మాటలు అసత్యమని పలికాడు. నారదుడు కపటముని మాటలునమ్మి, తన చేతి అక్షమాలను, కమండలం, విపంచిక, కుంచె, మొదలైన వాటిని రావిచెట్టుకొమ్మకు తగిలించి, విష్ణుమాయ ఆవరించగా కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారిపోయాడు. చంద్రరేఖను చంద్రకేతుడనే రాజు వరించి, వివాహం చేసుకున్నాడు. చంద్రరేఖ చంద్రకేతుడి వలన నూరుమంది కుమారులను పొందింది. చంద్రరేఖ మహాసామ్రాజ్య వైభవంతో, భర్త, కుమారులు, కోడళ్ళు, అనుకూల దాసీజనం, చేరి కొలువగా చంద్రశాలా విహారాలలో మునిగింది. ఈ రీతిగా చంద్రరేఖ మాయా సంసార బంధంలో చిక్కుకొని ఉండగా, శత్రురాజుతో జరిగిన యుద్ధంలో భర్త, నూరుమంది కుమారులూ మరణించారు. చంద్రరేఖ రణరంగానికి వెళ్ళి మరణించిన భర్త, కుమారుల శవాలపై పడి పొరలిపొరలి ఏడ్చింది. ఆమె రణభూమిలో దైన్యంగా విలపిస్తూ, ఎండవేడిమికి చెప్పరాని దప్పిక, ఆకలి ఉప్పతిల్లగా ఓర్వలేక నాలుగు దిక్కులూ చూసింది.

ఆకలిబాధతో పరితపిస్తున్న చంద్రరేఖకు విష్ణుమాయా ప్రభావంతో ఒక మామిడిచెట్టు కనిపించింది. చంద్రరేఖ మామిడిపండును అందుకోవడానికి నూరుమంది కుమారుల శవాలనూ వరుసగా పేర్చి పైకి ఎక్కినా ఆ పండు అందలేదు. భర్త శవాన్ని కూడా చేర్చి పైకి ఎక్కినా మామిడి పండు అందకపోవడంతో బాధతో ఏడవసాగింది. చంద్రరేఖ రూపంతో నారదుడు ఆవిధంగా పురాకృత కర్మఫల శేషాన్ని అనుభవించాడు. ఆ తర్వాత విష్ణువు వృద్ధతాపసిగా వచ్చి, చంద్రరేఖను కొలనులో శుచిగా స్నానం చేసి రమ్మని చెప్పాడు. చంద్రరేఖగా కొలనులో మునిగి స్త్రీరూపాన్ని విడిచి, నారదుడు పూర్వపు రూపంతో పైకివచ్చాడు. నారదుడు విష్ణుమాయా ప్రభావాన్ని గుర్తించి, తన అజ్ఞానాన్ని మన్నించమని విష్ణువును ప్రార్థించాడు. అహంకారాన్ని విడిచిన నారదుడికి శ్రీమహావిష్ణువు విశ్వరూపాన్ని చూపించి అనుగ్రహించాడు. పరమ భాగవతోత్తముడైన నారదుడు కూడా విష్ణుమాయను తిరస్కరించి గర్వాన్ని పొందాడు. నారదుడు స్త్రీ రూపాన్ని ధరించడానికి కారణం అతని పూర్వకర్మ ఫలశేషం. పూర్వకర్మల వలన కలిగిన ఫలాన్ని అనుభవించకుండా ఎవరు కూడా ముక్తిని పొందలేరు. ఎంతటి మహానుభావులైనా పూర్వ కర్మఫలాన్ని అనుభవించకతప్పదని, అది నారదుడికి కూడా తప్పలేదనీ ఈ  నారదపాత్ర వలన తెలుస్తుంది.

పుండరీకుడు

పుండరీకుడు పరమసాత్త్వికమూర్తి, విష్ణుభక్తుడు. మధురాపురంలో నివసించువాడు. అతడి భార్య సావిత్రి పరమసాధ్వి. పుండరీకుడు 'శాంతం, సద్వృతి, కారుణ్యం, సౌజన్యం కలిగినవాడు. పుండరీకుడు ఫాలభాగంలో గోపిచందన కాంతితో, చేతిలో అక్షమాలతో, చెవిలో తులసిమంజరిని ధరించి, నిరంతరం విష్ణుధ్యానంతో జీవించువాడు' (3-86) పుండరీకుడు వేదపఠనం కంటే హరికథాతత్పరత పట్ల మక్కువ ఎక్కువ కలవాడు. నారదుడు పుండరీకుడికి విష్ణుభక్తి ప్రభావాన్ని, సాలగ్రామ పూజావిధానాన్ని, హరి నామ సంకీర్తన ప్రభావాన్ని వివరించాడు. నారదుడు ఈ చరాచరజగత్తు అంతా విష్ణుమాయా మయమని పుండరీకుడికి తెలిపాడు.

పుండరీకుడు నారదుడు చెప్పిన విష్ణుమాయాప్రభావాన్ని సందేహించాడు. తన సందేహనివృత్తి చేయమని పుండరీకుడు విష్ణువును ధ్యానించాడు. పుండరీకుడిని మోహపరచడానికి విష్ణుమాయ ఒక బోయకాంత రూపంతో ఎదురయ్యింది. పుండరీకుడు ఒంటరిగా కనిపించిన ఆ బోయకాంతను చూసి, ఆమె కులాన్ని విని, 'అయ్యో ! ఇంత చక్కని అందగత్తెను బోయతగా ఎట్లు చేశాడు, ఆ వెర్రి దైవం' (3-157) అని వగచాడు. బోయకాంతను చూసి పుండరీకుడు కామోద్రేకం వలన కలిగిన ఉన్మాదంతో లజ్జాభిమానాలు విడిచాడు. పుండరీకుడు ఆ బోయకాంతతో, ఆమె వంటి సద్గుణరాశి, యౌవన రూప లక్షణ సంపదకలిగిన స్త్రీని పొందగలిగిన వాడే ధన్యుడని, అందుచేత బోయత అయినప్పటికీ అతడి ప్రేయసి కమ్మని ఆమెను వేడుకున్నాడు.(3-163) పుండరీకుడు విరాహోన్మత్తుడై ఆ బోయకాంతను తమకంతో కౌగిలించుకున్నాడు.

పుండరీకుడు ఆ బోయకాంతతో మాయా సంసారాన్ని చేసి ఒక కుమార్తెను కుమారుడినీ పొందాడు. అంతలో పుండరీకుడిని పరీక్షించేందుకు విష్ణుమాయా ప్రభావంతో ఆ ప్రాంతంలో తీవ్ర దుర్భిక్షం ప్రబలింది. కరువు కోరలకు చిక్కి పుండరీకుడి మాయాసంసారం ఛిద్రమైంది. మిగిలిన కుమారుడిని, భార్యనూ చూసి పుండరీకుడు, ఇక భూమిపై వారిమధ్యగల రుణానుబంధం తీరిపోయిందని మోహాతిశయంతో పలికాడు. ఆకలిబాధకు పురపుర పొక్కుతున్న చిన్న బిడ్డ ప్రాణాలు కాపాడుకోవాలని, పుండరీకుడు కష్టతరమైనా గౌతమీ తీరభూములకు వలస వెళ్ళడానికి సిద్ధమైనాడు. 'పుండరీకుడు కొడుకును చంకలో ఎత్తుకొని, భార్యను వీపున కట్టుకొన్నాడు. గంజి చిత్తడితో ఈగలు ముసిరిన ఉగ్గపు కుండను ఒకచేతిలో ధరించాడు. మరొక చేతిలో విల్లు, బాణాలను పట్టుకున్నాడు. పుండరీకుడు మడిచి త్రాడుతో కట్టిన చింకి ఈతాకుచాపను నడినెత్తిపై పెట్టుకున్నాడు. పీనుగులను ఎత్తుకొని తన నివాసానికి వెళ్ళే పిశాచంలాగా' (3-194) అతడు గౌతమీ తీరానికి బయలుదేరాడు.

ఈరీతిగా ప్రయాణించిన పుండరీకుడు ఒక అగ్రహారాన్ని చేరుకున్నాడు. భార్యా కుమారులను ఒక మర్రి చెట్టు నీడలో దించి, అతడు భిక్షకు వెళ్ళాడు. పుండరీకుడు వెళ్ళగానే ఆ మాయాకాంత, బాలుడు మాయమైనారు. భాగవతశ్రేష్ఠుడైన పుండరీకుడు 'వేదగ్రామంలో విష్ణుమంత్రాలయం ప్రవేశించి, సంసార క్షుధాతపశాంతికై, వైరాగ్యపాత్రలో ఉపనిషద్వాక్యముల చేత కైవల్య లక్ష్మీ పరమానందామృత భిక్ష అడుగకోరినాడు (3-212) అనే విధంగా ఒక ఇంటి ముందుకు వెళ్ళి 'భిక్షాందేహి' అని ఆ ఇంటిఇల్లాలిని పిలిచాడు. వైష్ణవమాయ వలన ఆ ఇల్లు పుండరీకుడి నివాసంకాగా, అతడి ఇల్లాలు సావిత్రి వెలుపలికి వచ్చి భర్తను చూసింది. ఆమె విష్ణుమాయా మోహావిభ్రాంతిలో ఉన్న పుండరీకుడిని గుర్తించి, ఆర్తజన శరణ్యుడైన శ్రీమన్నారాయణుడిని ప్రార్థించింది. శ్రీమహావిష్ణువు అనుగ్రహంతో పుండరీకుడి మాయామోహం తొలగింది. విష్ణుమాయ తొలగి, పుండరీకుడు సానబట్టిన జాతిరత్నం లాగా ప్రకాశించాడు.

పుండరీకుడు 'పాపానికి నిలయం, పుణ్యనాశనం, మోహం, భార్య, సంతానం, ధనదోషం అనే వ్యాధి పీడాకరమైన సంసార బంధం నుంచి కాపాడమని' (3-230) శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. భూలోకంలో మరికొంత కాలం భాగవతుడుగా ప్రసిద్ధినిపొంది, పుండరీకుడు సావిత్రి సమేతంగా మోక్షాన్ని పొందాడు. మానవులు కూడా ఉత్తమ సాత్త్విక జ్ఞానంతో శ్రీమహావిష్ణువును ఆరాధిస్తే కైవల్యాన్ని పొందగలరని పుండరీకుడి పాత్ర ద్వారా తెలుస్తుంది. విష్ణుమాయను సందేహిస్తే ఎంతటి పరమ భాగవతోత్తములైనా, మాయా మోహంలో చిక్కుకోక తప్పదని ఈ పుండరీకుడి వృత్తాంతం తెలుపుతుంది. ఈవిధంగా పుండరీకుడి పాత్ర ఉత్తమ మానవ స్వభావానికి నిదర్శనంగా ఇందులో చిత్రించబడిందని చెప్పవచ్చు.

చండదమనుడు

చండదమనుడు మునివరేణ్యుడు, తపస్సంపన్నుడు. ఒకనాడు చండదమనుడు అయోధ్యానగరానికి వెళ్ళి, మాంధాత మహారాజు చేత సత్కారాన్ని పొందాడు. చండదమనుడు మాంధాత మహారాజు అనుభవిస్తున్న రాజ్యభోగ విలాసాలను చూసి, రాజసగుణంతో తానుకూడా అటువంటి రాజ్యభోగాలు అనుభవించాలని కోరుకున్నాడు. గంగాతీరంలో చండదమనుడు రాజ్యభోగాలు అనుభవించాలనే సంకల్పంతో తపస్సు చేయనారంభించాడు. సనత్కుమారుడు వచ్చి, చండదమనుడి కోరికను విని, సంసార భోగవిలాసాలు అధోగతిపాలు చేస్తాయని అతన్ని వారించాడు. సనత్కుమారుడు 'రాజాంతే నరకంవ్రజేత్' అనే సూక్తిని చండదమనుడికి గుర్తు చేశాడు. చందదమనుడు సనత్కుమారుని బోధను విని, భోగలాలసతను విష్ణుమాయావికారమైన సంసారమోహాన్ని విడిచాడు. అతడు మోక్షాన్ని కోరి తపస్సు చేయనారంభించాడు.

చండదమనుడి తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు. చండదమనుడు బ్రహ్మకు నమస్కరించి, విష్ణుమాయా కృత్యములైన సంసారసుఖాలను తప్పించి, తనకు మోక్షాన్ని ప్రసాదించమని వేడుకున్నాడు. బ్రహ్మ చండదమనుడి కోరికను విని, రాజ్యభోగాలను కోరి తపస్సు ప్రారంభించినందువల్ల వాటిని అనుభవించకుండా మోక్షం ఇవ్వలేనని తెలిపాడు. బ్రహ్మ మాటలకు చండదమనుడు నిర్వేదించి శివుడిని, సూర్యనారాయణునీ తపస్సుతో మెప్పించగా, వారుకూడా మోక్షాన్ని ఇవ్వలేకపోయారు. చండదమనుడు మత్సరంతో విష్ణుమాయకు లోబడకుండా మోక్షాన్ని పొంది, బ్రహ్మాది దేవతలను సిగ్గుపరచాలని తదేకదీక్షతో తపస్సు చేయసాగాడు. విష్ణుమాయా ప్రభావంతో చండదమనుడి ఆశ్రమం 'యతికంఠపాశం' అనే పేరుతో రాచనగరుగా మారింది. విష్ణుమాయాలోలుడై చండదమనుడు రాజుగా మారిపోయాడు. అతడి దండ, కమండల, నారవస్త్రాలు, జపమాలలు ఖడ్గ, చినాంబర, మణికంకణ, కనకాంబర వస్త్రాలుగా మారిపోయాయి. చండదమనుడు తన బ్రహ్మయోగాన్ని మరిచి, మోహసంసార జలరాశిలో మునిగాడు. అరిషడ్వర్గాలు విజృంభించగా, రాజ్యవైభవాలకు గర్వించి చండదమనుడు పరుష భాషలు నేర్చాడు. సకల రాజ్యభోగాలను విలాసంగా అనుభవిస్తూ, చండదమనుడు పూర్వ జ్ఞానాన్ని మరిచాడు.

సనత్కుమారుడు తిరిగివచ్చి చండదమనుడి రాజ్యవైభవాన్ని చూసి, అతడికి గతాన్ని గుర్తుచేశాడు. సనత్కుమారుడి బ్రహ్మోపదేశం వలన జ్ఞానోదయమైన చండదమనుడు శ్రీమహావిష్ణువును ధ్యానించాడు. చండదమనుడు తన గత దుష్కర్మలను మన్నించి మోక్షపదవిని అనుగ్రహించమని మహావిష్ణువును వేడుకున్నాడు. అగణిత దుఃఖమయమైన సంసారబంధం నుండి విముక్తి కలిగించి, తనను కాపాడమని చండదమనుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు (5-147) శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమవగా చండదమనుడు అనేక విధాలుగా స్తుతించాడు. తపస్సంపదకు గర్వించిన చండదమనుడు తన తాపసవృత్తికి విరుద్ధంగా ప్రవర్తించాడు. అతడు విష్ణుమాయను తిరస్కరించినందుకు మాయామోహంలో తగుల్కొన్నాడు. తపోధనులైన వారికి కూడా విష్ణుమాయ తరించను శక్యంకాదని చండదమనుడి పాత్ర వలన తెలుస్తుంది. విష్ణుమాయకు లోబడకుండా మోక్షాన్ని పొందడం అసాధ్యమని ఈ పాత్ర తెలుపుతుంది.

అప్రధాన పాత్రలు

కథలో ప్రసంగవశాన ప్రవేశించి, ఏదోఒక సన్నివేశంలోనో, సంఘటనలోనో కనిపించేటు వంటివి అప్రధానమైన పాత్రలని చెప్పవచ్చు. సందర్భాన్ని బట్టి ఈ పాత్రలు ఒక్కసారే కనిపించవచ్చు, రెండుమూడు పర్యాయాలు కూడా కథారంగం మీద ప్రత్యక్షం కావచ్చు. ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించి కూడా ఈ పాత్రలు కథలో ప్రవేశపెట్టబడుతూ ఉంటాయి. విష్ణుమాయా నాటకంలో ఈ పాత్రలు ఈ విధంగా ఉన్నాయి.

ధర్మరాజు

ధర్మరాజు పాండవాగ్రజుడు. ధర్మదేవత వరప్రభావంతో కుంతీదేవికి జన్మించాడు. అత్యంత ధర్మపరాయణుడు. బలవంతుడయినప్పటికీ సత్యప్రతిజ్ఞకోసం వనవాసాన్ని ఆచరించాడు. సకల భూమండలాన్ని పరిపాలిస్తూ, అశ్వమేధయాగం చేశాడు. ధర్మరాజు తన నలుగురు తమ్ములతో కలిసి కొలువుదీరి ఉండగా వ్యాసమహర్షి వచ్చాడు. ధర్మరాజు వ్యాసమహర్షిని తగువిధంగా పూజించి, శ్రీకృష్ణుడి మహిమను కీర్తించాడు. ధర్మరాజు వ్యాసమహర్షిని శ్రీకృష్ణుని యాదార్థ్యమును తెలుపమని కోరాడు. వ్యాసుడి వలన ధర్మరాజు శ్రీకృష్ణుడి మహిమను, మాయాప్రభావాన్ని వింటుండగా అక్కడికి ద్వారకానగరం నుంచి గోవిందశర్మ అనే వటువు వచ్చాడు. ధర్మరాజు అర్జునుడి వలన గోవిందశర్మను గురించి విని, పారిజాతపుష్పమాలిక అతనికి ఎలా లభించిందని గోవిందశర్మను ప్రశ్నించాడు. ధర్మరాజు గోవిందశర్మ వలన విష్ణుమాయావిలాస కథలను విని తరించాడు. పరీక్షిత్తు మహారాజు కంటే ముందే ధర్మరాజు విష్ణుమాయా ప్రభావాన్ని గురించి వ్యాసమహర్షిని అడిగాడు. విష్ణుమాయా వివాల కథలకు మొదటిశ్రోత సత్యభామ అయితే, ధర్మరాజు రెండవశ్రోత. ధర్మరాజు సభలో గోవిందశర్మ వినిపించిన కథలనే శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు వినిపించాడు. ధర్మరాజు విష్ణుమాయావిలాస కథలన్నీ విన్న తర్వాత శ్రీమహావిష్ణువు విశ్వరూప దర్శనం చేసుకొని తరించాడు.

వ్యాసుడు

వ్యాసుడు దాశరాజు కుమార్తె అయిన మత్స్యగంధికి పరాశరముని వలన జన్మించినవాడు. కౌరవ పాండవేయ కులకర్త. వ్యాసుడు యమునానది పుంభావం ధరించిన రీతిగా ఇంద్రనీలమణుల కాంతి కలిగిన దేహం కలవాడు. అతడు సాలగ్రామ పర్వతశిఖరం వంటివాడు. ఒకనాడు వ్యాసుడు ధర్మరాజు సభకు వచ్చాడు. ధర్మజుడి సత్యసంధతను పొగిడి వ్యాసుడు శ్రీకృష్ణుడి మహిమను వినిపించాడు. వ్యాసుడు పాండవులు జన్మించినది మొదలుగా శ్రీకృష్ణుడు వాళ్ళని కాపాడుతున్న విధాన్ని ధర్మరాజుకు తెలియజేశాడు. అంతే కాకుండా ధర్మరాజుకు విష్ణుమాయా మహిమను కూడా వినిపించాడు. వ్యాసుడు ధర్మరాజుకు కలిగిన సందేహాన్ని తీరుస్తూ, విష్ణుమాయ లోకాలన్నింటినీకప్పి సకలజనులనూ అజ్ఞానాంధులను చేస్తున్నదని, విష్ణుసాయుజ్యం దుర్లభమనీ తెలిపాడు. వ్యాసుడు అహంకారపరుల మాయాచక్రంలో చిక్కుకొని పరిభ్రమిస్తుంటారని, అహంకార గ్రంథులైన బ్రహ్మరుద్రాదులు కూడా విష్ణుమాయకు మోసపోయినారని ఆ కథలను ధర్మరాజుకు వినిపించేందుకు సన్నద్ధుడయ్యాడు. ఈ విధంగా వ్యాసుడు విష్ణుమాయా విలాసకథలు వినేందుకు ధర్మరాజుకు ఆసక్తి కలగడానికి ప్రేరకుడయ్యాడని తెలుస్తుంది. ధర్మరాజు కొలువులో గోవిందశర్మ విష్ణుమాయా కథలు వినిపించడానికి వ్యాసుడే కారణమవుతున్నాడని చెప్పవచ్చు.

సత్యభామ చెలికత్తె

ఈ చెలికత్తెతోనే సత్యభామ పారిజాత పుష్పాలను రుక్మిణికి పంపింది. సత్యభామకు పారిజాత వృక్షం లభించడం, ఆమె రూప యౌవనగర్వం, మహితాత్ముడైన శ్రీకృష్ణుడు ఎప్పుడూ వీడని గర్వం కలగడాన్ని తలచుకుని ఈ చెలికత్తె ఆనందించింది. పారిజాత పుష్పాలను కానుకగా ఇచ్చే నెపంతో సత్యభామ తన మహారాజసం, శ్రీకృష్ణుడితో కలిసి ఆమె అనుభవించే మదన సామ్రాజ్య వైభవం రుక్మిణీ మొదలైన వారికి హృదయశల్యం కావాలని తనను పంపుతున్నదని ఈమె గర్వించింది. సత్యభామ చెలికత్తె రుక్మిణీదేవి అంతఃపురానికి పారిజాత పుష్పాలు తీసుకువెళ్ళింది. అక్కడ రుక్మిణి చెలికత్తె అడ్డగించగా సత్యభామ చెలికత్తె, ఆమెతో పారిజాత వృక్షాన్ని దేవేంద్రుడి నందనవనం నుంచి చూఱుపెట్టించి తెచ్చిన వీరపత్ని తిలకం సత్యభామకు తప్ప తక్కిన మగువలకు పారిజాతపుష్పాలు ఎలా లభిస్తాయని పలికింది. సత్యభామ చెలికత్తె రుక్మిణి అంతఃపురంలో శ్రీకృష్ణుడిని, పారిజాత పుష్పాలనూ చూసి, తాను తెచ్చినపూవులు ఇవ్వాలా, వద్దా అని సందేహించింది. పారిజాతపుష్పాలు తిరిగి రుక్మిణి పంపించగా, వాటిని తీసుకొని సత్యభామ చెలికత్తె చిన్నబోయిన ముఖంతో, హృదయనిర్వేదంతో, ఆవేశంతో, సిగ్గుతో తిరిగివచ్చింది. చెలికత్తె సత్యభామ మందిరంలో ఉన్న శ్రీకృష్ణుడిని చూసి, ఆశ్చర్యంతో రుక్మిణి అంతఃపురంలో జరిగిన వృత్తాంతమంతా ఆమెకు పూసగ్రుచ్చినట్టు వినిపించింది. ఈ విధంగా సత్యభామ చెలికత్తె ఆమెకు కృష్ణుడిపై ప్రణయకలహం కలగడానికి కారణమైందని తెలుస్తుంది. సత్యభామకు గోవిందశర్మ విష్ణుమాయా విలాసకథలు వినిపించడానికి ఈ చెలికత్తె కూడా ఒకానొక కారణమని మనకు తెలుస్తున్నది.

రుక్మిణి చెలికత్తె

ఈ చెలికత్తె రుక్మిణీ దేవి ఏకాంత మందిరానికి కావలి కాస్తుండగానే సత్యభామ చెలికత్తె వచ్చింది. రుక్మిణి చెలికత్తె సత్యభామ చెలికత్తెను ద్వారం దగ్గరే అడ్డగించి, రుక్మిణీకృష్ణులు ఏకాంతంలో ఉన్నారని చెప్పింది. రుక్మిణి చెలికత్తె ఆమె తెచ్చిన పూవులను చూసి, ఈ పూవులు ఎవరు పంపించారు. నీవు ఎవరి చెలికత్తెవు అని ప్రశ్నించింది. సత్యభామ చెలికత్తె పారిజాతపుష్పాలు తెచ్చిందని విని, పారిజాతపుష్పాలు అంత అరుదైనవా ఏమి మా నగరులో అందరి ఇండ్లలోనూ పారిజాత వృక్షాలు లేవా, మా అంతఃపురంలోని పరిచారికలు కూడా వాటిని ధరిస్తారు అని పరిహాసంగా పలికింది.

మార్కండేయుడు

మార్కండేయుడు ఆది మునీంద్రముఖ్యుడు, చిరంజీవి. బ్రహ్మసభలోని దేవతలు, మునులు అందరూ చేరి బ్రహ్మను పొగడుతుండగా, మార్కండేయుడు వారందరినీ వారించాడు. నిన్నగాక మొన్న జన్మించిన బ్రహ్మ లోకానికి ప్రభువు ఎలా అవుతాడని

మార్కండేయుడు ప్రశ్నించాడు. మార్కండేయుడు బ్రహ్మకు పూర్వ జన్మల పుణ్యకర్మల వలన అతడు నారాయణుని నాభికమలమున జన్మించిన విషయాన్ని గుర్తుచేశాడు. మార్కండేయుడు ప్రకృతి పురుషాధీశ్వరుడైన శ్రీమహావిష్ణువును స్వామి భృత్యన్యాయంతో సేవించమని, బ్రహ్మను దురభిమానాన్ని విడువమనీ హితబోధ చేశాడు. మార్కండేయుడి హితబోధను వినకుండా బ్రహ్మ అతడిని నిందించాడు.

మార్కండేయుడుఅనేక విధాలుగా బ్రహ్మకు విష్ణుమహిమను వర్ణించిచెప్పాడు. విష్ణుమాయా మహత్యాన్ని బ్రహ్మకు వినిపిస్తూ, పూర్వం ప్రళయకాలంలో మున్నీటి మీద ఏకాంతంగా వటపత్రం పైన శయనించిన బాలుడిని తాను చూశానని చెప్పాడు. మార్కండేయుడు శ్రీమహావిష్ణువే వటపత్రశాయి అని, అతని నోటిలోనే సమస్తలోకాలూ దాగి ఉన్నాయనీ, తాను అందులోకి వెళ్ళి పార్వతీ పరమేశ్వరులును చూసి వచ్చాననీ చెప్పాడు. మార్కండేయుడు బ్రహ్మకు పరమభాగవతోత్తముడైన పుండరీకుడి కథను వినిపించాడు. విష్ణుమాయను సందేహించి పుండరీకుడిలాగా విష్ణుమాయకు భ్రమించవద్దని హితవు పలికాడు. మార్కండేయుని మాటలు లెక్కించకుండా బ్రహ్మ సృష్టి నిర్మాణక్రమాన్ని చాలించి, లోకాలను అంధకారంలో ముంచి మందరగిరికి వెళ్ళిపోయాడు. మార్కండేయుడు ప్రార్థించగా, శ్రీమహావిష్ణువు లోకాలకు పూర్వస్థితిని కలిగించాడు. ఈ విధంగా మార్కండేయుడు బ్రహ్మ గర్వభంగానికి పరీక్ష కారణంగా కనిపిస్తాడు. బ్రహ్మను దేవ మునులు అందరూ కీర్తించగా, మార్కండేయుడు మాత్రమే అతని అజ్ఞానాన్ని అధిక్షేపించాడు. మార్కండేయుడు విష్ణుమాయాప్రభావాన్ని వినిపించినా, వినకుండా బ్రహ్మ భంగపడ్డాడు. మాయాసరస్వతి కోసం దైన్యంతో వెదుకుతున్న బ్రహ్మకు జ్ఞానబోధ చేసింది మార్కండేయుడేనని కూడా మనకు తెలుస్తుంది.

బోయకాంత

ఈ బోయకాంత పుండరీకుడిని మోహపరచడానికి విష్ణుమాయ కల్పించిన మాయాకాంత. బోయకాంత పుండరీకుడి ముందుకు 'పచ్చగాజులు, సంకుటుంగరాలు, మెడలో గురువింద పూసల సరాలతో జేవురు బొట్టుతో, సన్నని వస్త్రం ధరించి, కంచు మెట్టెలు మ్రోగగా నడిచివచ్చింది' (3-136) ఆ బోయకాంతను చూసి పుండరీకుడు ఊరు, పేరు అడుగగా ఆమె తాను బోయవారి పడుచునని, పెండ్లి కాలేదని, ముసలివారైన తల్లిదండ్రులు ఉన్నారనీ తెలిపింది. పుండరీకుడితో ఆమె తనను వివాహం చేసుకోమని కోరింది. బోయకాంత పుండరీకుడితో మాయాసంసారం చేసి ఒక కుమార్తెను, కుమారుడినీ పొందింది. కొంతకాలానికి కరువు కాటకాలు ఎక్కువ కాగా, ఆ బోయకాంత పుండరీకుడి తోపాటుగా గౌతమీ తీరప్రాంతానికి వలస వెళ్ళింది. అక్కడ ఒక అగ్రహారం పొలిమేరలో వటవృక్షం క్రింద బోయకాంత తన కుమారుడితో పాటుగా నిలిచిపోయింది. భిక్షకోసం పుండరీకుడు అగ్రహారంలోకి

వెళ్ళగానే ఆ మాయకాంత, కుమారుడూ మాయమైనారు. విష్ణుమాయను సందేహించిన పుండరీకుడికి మాయాసంసార బంధాన్ని కలిగించేందుకు ఈ బోయకాంత పాత్ర ఆధారమైంది. పుండరీకుడి పూర్వ కర్మశేషం పూర్తయ్యే వరకూ బోయకాంత అతని వెంటేఉంది పుండరీకుడి మాటల వలన ఆ బోయకాంత అతనితో ఇరవైఏళ్ళ మాయా సంసారం చేసిందని తెలుస్తుంది.

సావిత్రి

సావిత్రి పుండరీకుని భార్య, పరమ సాధ్వీమణి పుండరీకుడు విష్ణుమాయా మోహంలో చిక్కుకొని, మాయాసంసార బద్ధుడై భిక్షకు వచ్చినపుడు సావిత్రి అతడిని చూసి విస్మయం చెందింది. సావిత్రి నదీస్నానానికి వెళ్ళిన భర్త తిరిగి రాకుండానే మధ్యాహ్నం దాటిపోయిందని ఆలోచిస్తూ ఇంటి వెలుపలికి వచ్చింది. అక్కడ పుండరీకుడిని చూసి, యమునానదికి వెళ్ళి ఎంత ఆలస్యం అయ్యింది, వేగిరం వెళ్ళి బ్రహ్మణులను తీసుకురమ్మన్నది సావిత్రి భ్రాంతితో పలుకకుండా ఉన్న పుండరీకుడిని చూసి భూతం సోకిందేమో అని భావించి శ్రీ మహావిష్ణువును ప్రార్థించగా పుండరీకుడిని ఆవరించిన విష్ణుమాయ తొలగింది. ఈ విధంగా విష్ణుమాయా మోహితుడైన పుండరీకుడికి దానినుంచి విముక్తిని కలిగించేందుకు సావిత్రి చేసిన విష్ణుప్రార్థన ఒక సాధనమైంది. విష్ణువు తన మాయను ఉపసంహరించుకోవడానికి సావిత్రి ప్రార్థన కూడా దోహదకారి అయిందని తెలుస్తుంది. అందువలన సావిత్రి పాత్ర కల్పన సార్థకమవుతున్నదని చెప్పవచ్చు.

దేవతలు – రాక్షసులు

శ్రీమహావిష్ణువు మోహినిగా అవతరించడానికి దేవతలు, రాక్షసులు కారణమైనారు. క్షీరసాగరం నుంచి లభించిన అమృతాన్ని రాక్షసులు అపహరించారు. వారికి బలి చక్రవర్తి నాయకుడు. దేవతలు ఇంద్రుడి నాయకత్వంలో శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, అతడు మాయామోహినిగా వారి ముందు నిలిచాడు. మోహిని సౌందర్యానికి రాక్షసులతో పాటు దేవతలు కూడా చిత్త వికారాన్ని పొందారు. దేవరాజు, రాక్షసరాజు ఇద్దరూ చేరి మోహినిని ఆమె ఊరు, పేరు ఏమిటని అడిగారు. మోహిని అమృతం పంచడానికి వచ్చిందని తెలుసుకొని దేవతలు రాక్షసులు అమృతం మాకెందుకు, ఆమె ఆలాప, మమకారాలు చాలునని అన్నారు. మోహిని మాటను తాము ఎవ్వరూ జవదాటమని, ఆమె పాదాలు ముట్టుకొని ఒట్టు పెట్టుకున్నారు. రాక్షసులు 'అమృతమెందుకు, ప్రాణమేమిటికి, రాజ్యమెందుకు, ఇతర కోరికలు ఇంకెందుకు, మోహినితో మదనసౌఖ్యం లభిస్తే చాలు' అంటూ అమృత భాండాన్ని ఆమెకు అందించారు. అమృతం కోసం దేవతలు తూర్పువైపున, రాక్షసులు పడమరవైపున బంతి కూర్చున్నారు. దేవతలు మోహిని వలన అమృతాన్ని పొందారు. రాహువు అనే రాక్షసుడు మాయోపాయంతో

దేవతల వరుసలో కూర్చొని అమృతాన్ని తాగబోయాడు. మోహినీ రూపంలోని విష్ణువు రాహువు తలను చక్రంతో ఖండించాడు. అమృతాన్ని దేవతలకు ఇచ్చి విష్ణువు మాయమవగానే, రాక్షసులు జరిగిన మోసాన్ని గ్రహించారు. అమృతం కోసం దేవతలు, రాక్షసులకు యుద్ధం జరిగింది. అమృత పానం వల్ల దేవతలు జయించగా, రాక్షసులు ఓడిపోయి పారిపోయారు. ఈ విధంగా దేవతలు, రాక్షసులు శ్రీమహావిష్ణువు మాయామోహినిగా అవతరించడానికి కారకులయ్యారని తెలుస్తుంది.

ప్రమథులు

ప్రమథులు శివుని అనుచరగణాలు, వీరు వీర శివభక్తులు ప్రమథులు నారదుడు మాయామోహినిని పొగడుతూ విష్ణుమాయను వర్ణించినపుడు విన్నారు. ప్రమథులు శివుడితో 'దేవరముందట విష్ణుమాయ దేవతలను, రాక్షసులను మోహపరిచినట్లు చేయలేదు. భూమండలాన్ని, దిక్కుల్ని, ఆకాశాన్ని, కబళించే అంధకారం సూర్యుడిముందు నిలుస్తుందా'(4-95) అని అన్నారు. అంతే కాకుండా మాయామోహిని తమని భ్రమిస్తేనే చాలు అనీ, అది శివుడిని భ్రమించడం అసాధ్యమనీ వారు పలికారు. శివుడు వారించగా ప్రమథులు అప్పటికి వారి మాటలను నిలిపి, శివుడివెంట వైకుంఠానికి వెళ్ళారు. ప్రమథులు విష్ణువు ముందే నారదుడిని దూషించారు, విష్ణుమాయను నిందించారు. ఈ విధంగా ప్రమథగణాలు శివభక్తిపరులు గానే కాకుండా, విష్ణుమాయను నిందించే దురహంకారపరులుగా కూడా ఇందులో కనిపిస్తున్నారు. ప్రమథుల మాటలు విన్న తర్వాత విష్ణువు మోహినిగా మారి, వారి దురహంకారాన్ని భంగపరచాలని భావించాడు. శివుని దర్పభంగానికి ప్రమథులు పలికిన ప్రగల్భాలు కూడా పరోక్షంగా కారణమవుతున్నాయని పై నిదర్శనం వలన తెలుస్తుంది.

కపటముని

ఈ కపటముని నారదుడికి మాయాసంసార బంధాన్ని కలిగించడానికి సర్పవర క్షేత్రంలో వెలసిన విష్ణువు మారు రూపం. విష్ణువు వృద్ధతాపసిగా మారి, నారదుడిని సర్పవరానికి రప్పించాడు. ఆ కపటమునిని చూసి నారదుడు ఇటువంటి మహిమాన్వితుడైన మునిని ఎప్పుడూ చూడలేదని ఆశ్చర్యపోయాడు. కపటముని నారదుడి రాకవలన తన ఆశ్రమం పావనమైందని అతన్ని అనేక విధాలుగా పొగిడాడు. విష్ణుమాయకు లోబడనివాడు నారదుడేనని ప్రశంసించాడు. కపటముని నారదుడిని తన ఆశ్రమంలో భిక్ష చేయమని ప్రార్థించాడు. కపటముని నారదుడు కొలనులో మునిగేలాగ చేసి, అతడికి స్త్రీ రూపం కలగడానికి కారణమయ్యాడు. ఈ విధంగా ఈ కపటముని పాత్ర నారద గర్వభంగానికి కారణమైనదని, విశేషించి నారదుడు స్త్రీగా మారడానికి ప్రధాన కారణమనీ చెప్పవచ్చు.

చంద్రకేతుడు

చంద్రకేతుడు బిరుదాంక పురాన్ని పరిపాలించేరాజు. స్త్రీగా మారిన నారదకాంత (చంద్రరేఖ) ను వివాహం చేసుకున్నాడు. చంద్రకేతుడు చంద్రరేఖ వలన నూరుమంది కుమారులను సంతానంగా పొందాడు. చాలా కాలం రాజ్యసౌఖ్యాలను అనుభవించిన తర్వాత చంద్రకేతుడి మీదికి శత్రురాజు ఫణీంద్రకేతుడు దండెత్తివచ్చాడు. యుద్ధంలో శత్రువుల చేతిలో నూరుమంది కుమారులు మరణించగా చూసి, చంద్రకేతుడు విజృంభించి శత్రుసైన్యాన్ని నాశనం చేశాడు. చంద్రకేతుడు కూడా ఆ యుద్ధంలో వీరమరణాన్ని పొందాడు. ఈ విధంగా చంద్రకేతుని పాత్ర నారదుడికి మాయాసంసారాన్ని కల్పించడానికి వర్ణించబడిందని తెలుస్తుంది. నారదుడు స్త్రీగా మారిన తర్వాత సంసారసుఖాలు అనుభవించడానికి, సంతానాన్ని పొందడానికీ చంద్రకేతుని పాత్ర దోహదకారి అయిందని చెప్పవచ్చు.

వృద్ధ బ్రాహ్మణుడు

ఈ వృద్ధబ్రాహ్మణుని పాత్ర చంద్రరేఖ ఆకలిబాధతో మామిడిపండును అందుకోవడానికి ప్రయత్నిస్తున్న సందర్భంలో కనిపిస్తుంది. ఈ వృద్ధ బ్రాహ్మణుడు భర్త, కుమారుల శవాలను గుట్టగా చేర్చి, మామిడిపండును అందుకోవడానికి ప్రయత్నిస్తున్న చంద్రరేఖను చూసి వారించాడు. శవాలను గుట్టగాచేర్చి వాటిపైకి ఎక్కి ఏం చేయబోతున్నావని ఆమెను అడిగాడు. వృద్ధ బ్రాహ్మణుడు చంద్రరేఖ వృత్తాంతం విని, ఆమెకు ఈ అవస్థ పురాకృత కర్మవల్ల ప్రాప్తించిందని చెప్పాడు. శ్రీమహావిష్ణువు తపోవనంలోని ధర్మతరువులనుఅశుచులు తాకలేరని తెలిపాడు. సమీపంలోని కొలనులో శుభ్రంగా స్నానం చేసి రమ్మని చంద్రరేఖకు సూచించాడు. ఈ విధంగా పురాకృత కర్మ ఫలాన్ని అనుభవించి ఆర్తితో దుఃఖిస్తున్న చంద్రరేఖకు కర్తవ్యబోధ చేయడానికి ఈ వృద్ధ బ్రాహ్మణుని పాత్ర కల్పించబడిందని మనకు తెలుస్తుంది. నారదుడు స్త్రీ రూపాన్ని విడిచి, తిరిగి పూర్వపు రూపాన్ని పొందడానికి మార్గం చూపించి కూడా ఈ వృద్ధ బ్రాహ్మణుడే అని చెప్పవచ్చు.

చింతలపూడి ఎల్లనార్యుడు తన విష్ణుమాయానాటకం ప్రస్తావనా మాత్రంగా పేర్కొన్న పాత్రలు ఈ విధంగా ఉన్నాయి. ధర్మరాజు కొలువును వర్ణించినపుడు, అక్కడ భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు ఉన్నారని తెలుస్తుంది. ధర్మరాజు సభకు గోవిందశర్మ తర్వాత సనకసనందనాదులు, కశ్యప, కణ్వ, మార్కండేయ, భృగు, వశిష్ట, మతంగ, జాబాలి, జహ్నువు, వాలఖిల్యాదులు, అగస్త్య, గాలవ, జమదగ్ని, నారద, కపిల, భరద్వాజ, గౌతమ విశ్వామిత్ర మొదలైన మునులు అందరూ వచ్చారని ప్రస్తావించబడింది. వైకుంఠంలో విష్ణువు లక్ష్మీదేవితో జూదమాడే సందర్భంలో భూదేవి, సరస్వతి, దేవకాంతలు ఉన్నట్లుగా వర్ణించబడింది. మహాలక్ష్మికి వైకుంఠంలో విష్ణువు

మాయాలక్ష్మితో కలిసి ఉన్నాడని వైకుంఠపుర కాంతలు చెప్పారు. పుండరీకుడి కథలో బోయకాంత తల్లిదండ్రులు, నారదునికథలో చంద్రరేఖకు కలిగిన నూరుమంది కుమారులనూ కవి ప్రస్తావన మాత్రంగా పేర్కొన్నాడు. ఈవిధంగా చింతలపూడి ఎల్లనార్యుని విష్ణుమాయానాటకంలోని ప్రధాన, అప్రధాన, ప్రస్తావనా మాత్రపు పాత్రలను గురించి చెప్పుకోవచ్చు.

5.1.2.2. కంకంటి పాపరాజు - పాత్రల పరిచయం

కంకంటి పాపరాజు రచించిన విష్ణుమాయా విలాసం అనే యక్షగానంలో మోహిని ద్వారా శివుని దర్పం భంగం కావడమే ప్రధానంగా వర్ణించబడింది. కథానుసారంగా ఇందులో శివుడు, పార్వతి, నారదుడు, మోహిని, ప్రమథలు మొదలైన వారి పాత్రలు కనిపిస్తున్నారు.

శివుడు

శివుడు ఆదిదేవుడు, లోకభీకరమైన విషాన్ని కంఠంలో ధరించినవాడు. శివుడు నారదుని వలన విష్ణువు మోహినిగా అవతరించినట్లుగా విన్నాడు. శివుని ముందు నారదుడు విష్ణుమాయను స్తుతించి, మోహినీ సౌందర్యాన్ని వర్ణించాడు. అదివిని శివుడు రోషంతో తన ఇంద్రియ నిగ్రహపటుత్వాన్ని, మన్మథుని జయించిన వైనాన్ని శ్లాఘించుకున్నాడు. శివుడు పార్వతితో తన ఇంద్రియ నిగ్రహశక్తిని ప్రస్తావించి, మోహిని సౌందర్యానికి తాను భ్రమించనని పలికాడు. శివుడు తనముందు నారదుడు పలికిన మాటలు వమ్ము చేయాలని పంతంతో మోహినిని చూసేందుకు వైకుంఠానికి ప్రయాణమైనాడు. శివుడు ఏనుగు చర్మం వంటి నును పైన పట్టువస్త్రాన్ని ధరించాడు. మన్మథుని బొమ్మగల పెండేరాన్ని కాలికి ధరించాడు. విభూతికాంతులతో శరీరం వెన్నెలకాంతులు మరిపించగా శివుడు పార్వతితో కలిసి నందీశ్వరుని మీద వైకుంఠానికి వెళ్ళాడు. శివుడు విష్ణువుతో అతని స్త్రీరూపాన్ని చూడగోరి వచ్చానని, తనకు మోహిని రూపాన్ని చూపమని కోరాడు. శివుడు మోహినీ రూపాన్ని చూస్తే తాను కూడా మోహవివశుడవు తాడని నారదుడు చులకనగా పలికాడని విష్ణువుతో అన్నాడు. శివుడు తన విరక్తి, విష్ణుమాయ ఈ రెండింటిలో ఏది గొప్పదో లోకాలకు తెలిసేలాగ మోహినీరూపాన్ని ధరించమని విష్ణువుతో అన్నాడు.

శివుడు నారదుని పంతం, తనవైరాగ్యం లోకాలకు తెలియకుండా, మోహినిని చూడకుండా తిరిగి వెళ్ళనని పట్టుబట్టాడు. విష్ణుమాయ వలన మోహిని తన ఎదుట నిలువగానే శివుడు మరులుకొన్నాడు. శివుడు మోహినిని చూసి, శివుడు తనవంటి రసజ్ఞునకు ఈమె లభిస్తే ఎన్నిరీతులుగా రతిసౌఖ్యాలు పొందగలనో కదా అని భావించాడు. కాముడిని జయించిన శివుడు మోహిని మోహంలో తగుల్కొని కామాతురుడయ్యాడు. శివుడు మోహినిని పట్టుకోవాలని శృంగారవనంలో ఆమె వెంటపడ్డాడు. తన శృంగార చేష్టలతో కనిపిస్తూ అదృశ్యమవుతున్న మోహిని కోసం

శివుడు వెర్రివానిలాగ ఆ శృంగారవనంలో పరిభ్రమించాడు. మోహిని కనిపించలేదని శివుడు విరహోన్మత్తుడై ప్రలాపిస్తూ దుఃఖించాడు. చివరికి మోహిని ఎదుటపడగానే శివుడు మట్టుమీరిన తమకంతో ఆమెను బలవంతంగా కౌగిలించుకున్నాడు. మోహినీ కాంత స్పర్శతోనే శివునికి శుక్లపతనమైంది. మోహపారవశ్యం వీడిపోగా, శివుడు నిర్మల స్వాంతుడైనాడు. శివుడు తన యోగశక్తి ప్రభావంతో లజ్జ, శంక, అపవాదాలు లేని వాడై విష్ణుమహిమను స్తుతించాడు. విష్ణువు కూడా శివుని ఘనతను కీర్తించాడు. శివుడు నారదుని మాటలు విని పంతంతో, విష్ణుమాయాను తిరస్కరించాడు. మన్మథుని జయించిన దర్పంతో అహంకరించిన శివుడు కామాతురుడై మోహిని వెంటతిరిగాడు. సర్వజ్ఞుడే అహంకారంతో చివరికి అజ్ఞుడైనాడు. అందుచేత రాజస, తామస గుణాలు మహాత్ములను కూడా మూఢులను చేస్తాయని శివుని పాత్ర ద్వారా తెలుస్తుంది.

పార్వతి

పార్వతి శివుని అర్థాంగి. పార్వతి కైలాసంలో శివునితోపాటు కొలువులో ఉన్నప్పుడు, నారదుడు వచ్చి మోహినీ అవతారకథను వినిపించాడు. శివుడు నారదుని మాటలకు రోషించి, తన విరతిభావాన్ని పొగడుకొని విష్ణుమాయను చులకన చేశాడు. ఇదంతా పార్వతి గమనిస్తూనేవుంది. పార్వతితో శివుడు అతడి ఘనతను చెప్పగా దానికి ఆమె ఈ విధంగా సమాధానం చెప్పింది. పార్వతి శివునితో, మీరు కొత్తగా మోహిని రూపాన్ని చూసి భ్రమించినట్లుయితే తోటి వారిలో నవ్వులపాలు కావడం తథ్యం, గౌరవం నశిస్తుంది అని అన్నది. శివుడు మోహినీ రూపాన్ని చూస్తే ఎటుపోయి ఎటువస్తుందో అని ఆమె సందేహించింది. పార్వతి శివునితో వైకుంఠంలో తెగువగల పగవాడు మన్మథుడు ఉన్నాడు, విష్ణువు అసలే వగలకాడు. కాబట్టి అక్కడికి వెళ్ళవద్దు అని చెప్పింది. పార్వతి శివుడు తన మాట వినే స్థితిలో లేడని గ్రహించింది. అందుకనే దేవా, మీ ప్రయత్నాన్ని వారించడానికి తానెంతదానను అని పలికింది. పార్వతి శివునితో అతని మనస్సులో ఎలా భావిస్తే ఆ విధంగా చేయమని చెప్పింది. పార్వతి విష్ణుమాయా మహిమను తెలిసింది కాబట్టే శివుని పంతాన్ని వారించడానికి ప్రయత్నించింది. అయితే భర్త గౌరవప్రతిష్ఠలను కోరుకునే భార్యలాగ పార్వతి ప్రవర్తన ఇక్కడ కనిపిస్తుంది. శివుడు మదనాంతకుడే అయినా విష్ణుమాయకు మోసపోగలడని ఆమెకు తెలుసు. కాబట్టి సర్వజ్ఞుడైన శివుడు కలహముని నారదుని మాటలకు రోషించి మాయామోహిని రూపాన్ని చూడాలని పట్టుబడితే పార్వతి సుతిమెత్తగా వారిస్తూ శివునికి బోధించింది. ఈ విధంగా పార్వతి పాత్ర ఈ కావ్యంలో చక్కగా చిత్రించబడింది.

నారదుడు

నారదుడు బ్రహ్మ మానసపుత్రుడు. అతడు నిత్యం నారాయణనామస్మరణంతో ముల్లోకాలు సంచరించే బ్రహ్మచారి. కలహాశనుడు అనే పేరు ఈ కావ్యంలో నారదునికి సార్థక మవుతున్నది. నారదుడు కైలాసానికి వెళ్ళి శివునిముందు మోహినీ సౌందర్యాన్ని

మిక్కిలిగా వర్ణించాడు. పదివేల చంద్రబింబాలు ఒక్కసారి ఉదయించినా మోహిని ముఖానికి సాటిరావని నారదుడు శివునిముందు మోహినీ సౌందర్యాన్ని పొగిడాడు. నారదుడు ఈ సౌందర్య వర్ణనచేసి శివునికి మోహినిని చూడాలనే కుతూహలాన్ని కలిగించాడు. నారదుడు మాయామోహిని రూపవిలాసానికి దేవదానవులు మోసపోయినారని శివునికి చెప్పాడు. ఆ మోహినిని ఒకసారిచూస్తే శివునికి కూడా మోహం కలుగుతుందని పరిహాసం చేశాడు. బ్రహ్మచారి అయినప్పటికీ నారదుడు మోహిని సౌందర్యాన్ని శృంగారేతిరేకంగా వర్ణించి, శివునికి దర్పభంగం కావడానికి కారకుడయినాడు. నారదుడు విష్ణుమాయా మహిమను కీర్తించి, శివుని నిగ్రహశక్తిని చులకనచేసి మాట్లాడాడు. నారదుడు వైకుంఠానికి బయలు దేరిన శివునికి ముందు దారిచూపుతూ, తనకుంచె విసురుకుంటూ, నవ్వుకుంటూ వెళ్ళాడు. శివునికంటే ముందుగానే నారదుడు వైకుంఠాన్ని చేరుకొని, శివునితో అతడికి కలిగిన పంతాన్ని విష్ణువుకు తెలిపాడు. నారదుడు శివుని ముందు విష్ణుమాయను పొగిడి, అతనికి రోషమెక్కించాడు. శివుడు మోహిని సౌందర్యానికి దాసుడై భంగపాటును పొందాడు. అప్పుడు నారదుడు తన పంతం నెగ్గిందని ఆనందంతో విష్ణువును కీర్తించాడు. ఈ విధంగా నారదుడు మోహినీ అవతారం ద్వారా శివదర్పభంగం కావడానికి ప్రధాన సాధనమైనాడని పై పరిశీలన వలన తెలుస్తుంది. అందుచేత నారదుని పాత్రకు ఈ కావ్యంలో సముచితస్థానం ఉందని చెప్పవచ్చు.

మోహిని

శ్రీమహావిష్ణువు మాయా విలాసానికి ఈ మోహినీ అవతారం చక్కని నిదర్శనంగా కనిపిస్తుంది. రాక్షసులను మోసపుచ్చి, దేవతలకు అమృతాన్ని పంచడానికి శ్రీమహావిష్ణువు ధరించిన కృత్రిమ నారీ రూపం ఈ మాయామోహిని. మోహిని రూప విలాసం తాపసులకు కూడా అనురక్తిని కలిగించింది. మోహినీకాంతను చూసి రాక్షసులు మోహాంధకారంలో మునిగారు. ఆ మాయామోహిని రాక్షసులను మోసపుచ్చి అమృతాన్ని దేవతలకు మాత్రం పంచింది. మోహినీ సౌందర్యాన్ని, విలాసాన్ని చూడాలని పంతంతో వైకుంఠానికి వచ్చిన శివుని ముందు విష్ణువు మాయామోహినిగా నిలిచాడు. అప్పుడు ఆ సభామందిరమంతా సువాసనలు గుభాళించాయి. మోహిని కొప్పువిరుల పరిమళానికి తుమ్మెదలు చేరాయి. మోహినీకాంత చంద్రబింబం వంటి మొలకనవ్వుల ముద్దుమోముతో, మన్మథని మోహనాస్త్రం లాగ శివుని ముందుకు వచ్చింది. ఆమెను చూడగానే శివునికి శరీరం పులకరించింది.

శ్రీమహావిష్ణువే మోహిని అనేటట్లుగా పాంచజన్యం (శంఖం) ఆమె కంఠంలోను, చక్రం పిఱుదులలోను, కాంచనాంబరకాంతి శరీరకాంతిలోను, కౌస్తుభమణికాంతి పెదవిలోను, శ్రీవత్సలాంఛనం నీలిమకాంతి కొప్పులోను అమరినాయి. మోహిని తన

సౌందర్యంతో, 'ఏలాగైనగాని దీనినెలయించికొనిపోయి బాళిమీఱనేలకున్న భావమున దాళరాదు' అని శివుని నోటివెంట పలికించింది. మోహిని శివుడు ఆమె వెంటరాగా, శృంగార వనంలో విహరించింది. మోహిని పొన్నచెట్ల నీడల్లో పూబంతి ఆటలాడుతూ శివునికి కనువిందు చేసింది. కౌగిలించుకో బోయిన శివుని చేతికి అందినట్లే అంది అదృశ్యమయింది. మోహిని బంగారు తూగుటుయ్యాలలో ఊగుతూ శివునికి మోహం కలిగించింది. శివుడు తాకబోగా మోహిని పూపొదరిళ్లలో మాయమైంది. మోహిని విరహోన్మత్తుడైన శివునితో, మన్మథుని గెలిచిన అతనికి అంత మోహం ఎలా కలిగిందని ప్రశ్నించింది. మోహిని మీద మట్టుమీరిన మోహంతో శివుడు కౌగిలించుకోబోగా, అతడిని తన వాలుజడతో కొట్టింది. మోహిని తన స్పర్శతో శివునికి శుక్లపతనం కావించి మాయమైంది. మోహిని పాత్ర ప్రధానంగా శివుని దర్పాన్ని భంగం చేయడానికే కల్పించబడిందని తెలుస్తుంది. విష్ణువు శివుని మోహాంధకారాన్ని నాశనం చేయడానికి, మదనాంతకుడననే శివునికి మదనాతురతను కలిగించడానికి మోహినిగా అవతరించాడు. మన్మథుని దహించిన శివునికే మోహాన్ని కలిగించాలి. కాబట్టి మోహిని రూపయౌవన సౌందర్య వర్ణనలో శృంగార రసభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ విధంగా మోహినీకాంత పాత్ర శివునికే మరులు కలిగించేటువంటి శృంగార మూర్తిగా ఇందులో వర్ణితమైందని చెప్పవచ్చు.

ప్రమథులు

ప్రమథులు శివుని అనుచరగణాలు. నిరంతరం శివుని సేవలో ఉండేవారు. ప్రమథులు నారదుడు శివుని ఇంద్రియ నిగ్రహాన్ని చులకనచేసి మాట్లాడిన సందర్భంలో కొలువులోనే ఉన్నారు. ప్రమథులు నారదుని మాటలుకు కోపించి, శివుని నిందించడానికి వచ్చావా, ఈశ్వరుని మహిమ తెలుసుకొనేంతటి వాడివా, ఇక్కడ నీ పెద్దరికమేమిటి అని రకరకాలుగా ప్రశ్నించారు. శివుడు వారించగా ప్రమథులు తమకోపాన్ని అణచుకొని నారదుని వదిలిపెట్టారు. ప్రమథులు వైకుంఠంలో కూడా విష్ణువు ముందు నారదుని నిందించారు. అయితే విష్ణువు సభామందిరంలో మోహిని కనిపించగానే ప్రమథులు మోహవిభ్రాంతులై, రకరకాల వింతచేష్టలు చేశారు. ఈ విధంగా ప్రమథులు పరమ స్వామిభక్తులుగాను, వీరశైవమూర్తులుగానూ మనకు కనిపిస్తున్నారు. శివనింద చేసినవారు ఎంతటివారైనా ప్రమథులు లెక్కించక, వారిని దండించడానికి కూడా వెనుకాడరని పై పరిశీలన వలన తెలుస్తుంది. కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాసం అనే యక్షగానంలోని పాత్రలు రంగస్థలంమీది నటుల వలె ప్రవర్తించడం ఈ కావ్యంలోని విశేషం. ఇందులోని పాత్రల చిత్త వృత్తులు, హావభావాల ప్రదర్శన అంతా సంభాషణల రూపంతోనే వ్యక్తమవుతున్నది. ఈ విధంగా పాపరాజు రచించిన విష్ణుమాయావిలాస యక్షగానంలోని పాత్రలను గురించి చెప్పుకోవచ్చు.

5.1.2.3. కంకంటి నారసింహకవి - పాత్రల పరిచయం

నారసింహకవి శ్రీకృష్ణుని మాయాకేళికి భ్రమసిన సత్యభామకు, గోవిందశర్మ చెప్పిన విష్ణుమాయా విలాసకథలను ద్విపద రీతిలో రచించాడు. ఇందులో సత్యభామ తోపాటుగా విష్ణుమాయకు తగుల్కొన్న మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుల గర్వభంగ కథలు, పుండరీకుడు, చండదమనుల ఉపాఖ్యాన కథలు ఉన్నాయి. నారసింహకవి కావ్యంలోనిపాత్రలు క్రింది విధంగా ఉన్నాయి.

గోవిందశర్మ

గోవిందశర్మ శ్రీకృష్ణుని ఆంతరంగిక సన్నిహితుడు, సాందీపనిముని కుమారుడైన ధర్మశీలుని కుమారుడు. అతడు పుట్టగానే ఆకాశవాణి ఈ బాలుడు వేదవేదాంగ కోవిదుడు అవుతాడని, గోవింద మిత్రుడు గోవిందశర్మ అని పలికింది. గోవిందశర్మ వేదశాస్త్రాలు చక్కగా చదివినవాడు, బ్రహ్మచారి. సనకసనందనాది మునులతో కలిసి గోవిందశర్మ. శ్రీకృష్ణుడు పంపగా ధర్మరాజు సభకు వచ్చాడు. గోవిందశర్మను చూసి ధర్మరాజు అతనికి పారిజాతపుష్పమాలిక ఎలా లభించిందని అడిగాడు. గోవిందశర్మ సత్యభామ కృష్ణమాయకు తగుల్కొని విషాదాన్ని పొందగా, ఆమెకు విష్ణుమాయా విలాసకథలను చెప్పి విషాదాన్ని మాన్పినాడని, గోవిందశర్మ మాటలకు స్వాంతనచెంది సత్యభామ అతనికి పారిజాతపుష్పమాలికను బహూకరించిందని ధర్మరాజుతో చెప్పాడు. గోవిందశర్మ ధర్మరాజు సభలో పూర్వం అతడు సత్యభామకు వినిపించిన విష్ణుమాయా విలాసకథలను మళ్ళీ చెప్పాడు. ఈ విధంగా గోవిందశర్మ పాత్ర ఈ కావ్యంలో విష్ణుమాయా విలాసకథలను చెప్పే కథకుడిగా చిత్రించబడిందని చెప్పవచ్చు.

సత్యభామ

సత్యభామ సత్రాజిత్తు కుమార్తె. సత్యభామ శ్రీకృష్ణుడు నిరంతరం తన చెంతనే ఉండాలని భావిస్తుంది. సురతరువైన పారిజాతవృక్షాన్ని తన పెరటిచెట్టుగా చేసుకుంది. సత్యభామ గర్వంతో సపత్నులకు పారిజాత సుమాలను కానుకగా పంపించి, అవమానించాలని భావించింది. సత్యభామ తన చెలికత్తె ద్వారా సపత్నుల ఇళ్ళలో కూడా పారిజాతవృక్షం ఉండటం, కృష్ణుడు కపటవేషంతో రుక్మిణితో కూడి ఉన్నాడని తెలుసుకుని శ్రీకృష్ణుని నిందించింది. గోవిందశర్మ మాటల వలన ఉపశమించింది. దానికి నిదర్శనంగా సత్యభామ గోవిందశర్మకు పారిజాతపుష్ప మాలికను బహుకరించింది. ఈ విధంగా సత్యభామ తన రూపయౌవన గర్వంతో కృష్ణమాయ వలన భంగపాటును పొందిందని తెలుస్తున్నది. అయితే సత్యభామ మానినీత్వం అంతర్లీనంగా ఆమెపాత్రను ప్రకాశింపజేస్తున్నది. అంతేకాకుండా సత్యభామ సపత్నుల ఇండ్లలో పారిజాత వృక్షం ఉందని తెలిసి కోపించి, ఆ తర్వాత దుఃఖించింది. సత్యభామ జరిగినదంతా కృష్ణుని కపటనాటకమని గ్రహించి ఆనందించింది. ఇవన్నీ సత్యభామ పాత్రలోని విలక్షణతను తెలుపుతున్నాయని చెప్పవచ్చు.

రుక్మిణి

రుక్మిణి శ్రీకృష్ణుని అష్టమహిషులలో మొదటిది. ఆమె శ్రీకృష్ణునికి పరమ భక్తురాలు. ఆమె ఈ కావ్యంలో శృంగార మూర్తిగా కనిపిస్తుంది. రుక్మిణి కథారంగం మీద మొదటగా రతికేళిలో మునిగి కనిపిస్తుంది. సత్యభామకు గర్వభంగం కావించడానికి శ్రీకృష్ణుడు కల్పించిన మాయాకేళిలో రుక్మిణిది ప్రధానపాత్ర. రుక్మిణికి కూడా మాయా పారిజాతవృక్షం లభించినప్పుడు ఆమె శ్రీకృష్ణునితో రతిసౌఖ్యాలలో మునిగి తేలింది. రుక్మిణి ప్రయత్న పూర్వకంగానే సత్యభామ చెలికత్తెకు సంభోగచిహ్నాలతో విలాసమూర్తిగా కనిపించింది. రుక్మిణి కూడా పారిజాతవృక్షం కలిగినందుకు, శ్రీకృష్ణుడు ఆమె ఎదుట ఉన్నందుకూ సత్యభామాది సపత్నులు ఎలా విరహాన్ని పొందుతున్నారో తెలుసుకోవాలని భావించింది. రుక్మిణి, మాకృష్ణుడు మాకొక పారిజాత వృక్షాన్ని తెచ్చాడు. ఆ చెట్టు పూవులు ఇవి. వీటి సుగంధాన్ని ఎక్కడా చూడరు అని చెలికత్తె చేత సత్యభామకు పారిజాతపుష్పాలు పంపింది. ఇక్కడ రుక్మిణి ప్రవర్తన శ్రీకృష్ణుని కపటనాటకంలో భాగమని గ్రహించాలి. ఇక్కడ రుక్మిణిపాత్ర సత్యభామకు రోష విషాదాలు కలిగేటట్లుగా ప్రవర్తించింది. ఈ విధంగా రుక్మిణిపాత్ర ఒకానొక పరమప్రయోజనాన్ని ఆశించి కల్పించినట్లుగా కనిపిస్తుంది. ఆ ప్రయోజనం రుక్మిణిపాత్ర ద్వారా చక్కగా నెరవేర్చిందని చెప్పవచ్చు.

మహాలక్ష్మి

మహాలక్ష్మి శ్రీమహావిష్ణువు హృదయ వాసిని. ఆమె సర్వమంగళాధి దేవత, సముద్రుని గారాబు కుమార్తె. చంద్రుని సోదరి అయిన మహాలక్ష్మి సంపదలకు అధిదేవత. వైకుంఠంలో మహాలక్ష్మి భూదేవి, సరస్వతి మొదలైన దేవకాంతల సమక్షంలో విష్ణువుతో వినోదానికి జూదం ఆడింది. విష్ణువు మాయోపాయం వలన మహాలక్ష్మి జూదంలో ఓడిపోయింది. మహాలక్ష్మి తన ఓటమికి విష్ణుమాయ కారణమని తెలుసుకొని, ఈర్ష్యవలన కలిగిన కోపంతో విష్ణువును నిందించింది. లోకాలన్నింటికీ సంపదలు కలిగించే తన మాయముందు విష్ణుమాయ అల్పమైందని గర్వించి పలికింది. విష్ణుమాయను గణించకుండా మహాలక్ష్మి అసూయతో వైకుంఠపుర వైభవాన్ని శూన్యమయం గావించింది. మహాలక్ష్మి గర్వాన్ని భంగపరచాలని విష్ణువు మాయాలక్ష్మిని కల్పించగా, ఆమెను చూసి మహాలక్ష్మి విస్మయం చెందింది. ఉద్యానవనంలో మాయాలక్ష్మి వృత్తాంతం విని, తాను కాకుండా మరొకలక్ష్మి ఎలా ఉంటుందని కలవరపడింది. అంతలో ఆ మాయాలక్ష్మి మహాలక్ష్మి తేజస్సును హరించి వెళ్ళింది.

మహాలక్ష్మి ఆ ఉద్యానవనంలో ఒంటరిగా తిరుగుతూ, విష్ణువుతో కలిగిన ఎడబాటుకు విచారించింది. మహాలక్ష్మి తన అహంకారాన్ని విడిచి పశ్చాత్తాపంతో విష్ణువును గూర్చి పరితపించింది. ఏవిధంగానైనా ఆ ఉద్యానవనం నుంచి వెళ్ళి విష్ణువును చేరుకోవాలని భావించింది. మహాలక్ష్మి తన పశ్చాత్తాపాన్ని విష్ణువుకు తెలిపి

తనువు త్యజించాలని, మనసులో ధ్యానించింది. శ్రీమహావిష్ణువు అనుగ్రహంతో మహాలక్ష్మి మాయాబంధం నుంచి తరించి, తన పూర్వపుస్థితిని పొందింది. మహాలక్ష్మి తన భర్త అయిన శ్రీమహావిష్ణువుతో గల అతిచనువు వల్ల విష్ణుమహిమను చులకనగా మాట్లాడింది. మహాలక్ష్మి గర్వంతో విష్ణుమాయను నిందించినందుకు పడరాని పాట్లుపడింది. మేరతప్పి దురహంకారంతో ప్రవర్తించినవారు ఎవరైనా విష్ణుమాయా జాలంలో తగుల్కోక తప్పదని మహాలక్ష్మి పాత్ర వలన తెలుస్తున్నది.

మాయాలక్ష్మి

మాయాలక్ష్మి మహాలక్ష్మికి గర్వభంగం కావించడానికి విష్ణుమాయ చేత కల్పించబడిన మాయాకాంత. మాయాలక్ష్మి క్షీరసాగర తీరంలోని వనంలో ప్రభాహీనమైన కొలనులో వాడిపోయిన బంగారు తామరపీఠంపై తపోదీక్షతో కనిపిస్తుంది. మాయాలక్ష్మి మహాలక్ష్మితో తాను లక్ష్మినని, ఆమె భర్త శ్రీమహావిష్ణువు అని తెలిపింది. సృష్టి నిర్మాణశక్తిని వరంగా పొందాలని బ్రహ్మరుద్రులు తపస్సు చేయగా, విష్ణువు మిన్నకున్నాడు. మాయాలక్ష్మి దర్పంతో బ్రహ్మరుద్రులకు వరం ఇవ్వడానికి వెళ్ళింది. మాయాలక్ష్మి విష్ణుమాయను తిరస్కరించి, బ్రహ్మరుద్రులకు అప్రమత్తంగా వరం ఇచ్చింది. దానికి విష్ణుమాయ కోపించి, మాయాలక్ష్మిని శపించిందని ఆమె తన వృత్తాంతాన్ని మహాలక్ష్మికి చెప్పింది. మాయాలక్ష్మికి శాపవిమోచనం కలిగి, ఆమె వైకుంఠానికి వెళుతూ మహాలక్ష్మి తేజస్సును హరించి, దేవకాంతలను తనవెంట తీసుకువెళ్ళింది. మాయాలక్ష్మి, సంపదగర్వంతో విష్ణుమాయను తిరస్కరించిన మహాలక్ష్మి దర్పాన్ని భంగపరచడానికి విష్ణుమాయచేత కల్పించబడింది. మాయాలక్ష్మి మహాలక్ష్మికి అహంకార భంగం కావించడానికే తేజోవిహీనరూపంతో కనిపించింది. ఈ విధంగా మాయాలక్ష్మి పాత్ర మహాలక్ష్మికి కనువిప్పు కలిగించడంలో ప్రధాన సాధనమైందని తెలుస్తున్నది.

బ్రహ్మ

సృష్టికర్త అయిన బ్రహ్మ శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి బంగారు మేని ఛాయతో జన్మించాడు. బ్రహ్మ శ్రీమహావిష్ణువు ఇచ్చిన వర ప్రభావంతో బ్రహ్మాండాన్ని కల్పించాడు. అందులో ప్రాణికోటులను తగువిధంగా కల్పించాడు. చరాచర జగత్తు అంతటినీ సృష్టించిన కార్యదక్షతతో బ్రహ్మదేవుడు గర్వితుడైనాడు. బ్రహ్మ సృష్టి నిర్మాణాన్ని నిపుణతతో చేసిన తనంతటి దైవం వేరెవరూ లేరని రాజసగుణంతో అహంకరించాడు. సత్యలోకంలో బ్రహ్మ కొలువులో దేవతలు, మునులు అందరూ చేరి అతన్ని కీర్తించగా విని పొంగిపోయాడు. బ్రహ్మ సభాసదులను ఉద్దేశించి ఇకనుంచీ లోకాలన్ని అతడినే పరమదైవంగా పూజించాలని ప్రకటించాడు. బ్రహ్మ తన మాటలకు అడ్డువచ్చి, విష్ణుమాయను పొగిడిన మార్కండేయుని దూషించాడు. బ్రహ్మ విష్ణువు కల్పించిన బ్రహ్మాండం ఎక్కడైనా ఉందా అని మార్కండేయుని పరిహసించాడు. విష్ణువు సమర్థుడు అయితే అతడు సృష్టి నిర్మాణం చేయరాదా అని మార్కండేయుని ప్రశ్నించాడు. బ్రహ్మ

విష్ణుమాయను నిందించి, తన మహిమ లోకాలకు తెలిసే విధంగా సృష్టి కార్యాన్ని నిలిపివేశాడు. లోకాలను అంధకారంలో ముంచి బ్రహ్మ మందరగిరిపై తపస్సు చేసుకోడానికి వెళ్ళిపోయాడు.

మందరగిరి గుహలో బ్రహ్మ పదివేల ఏండ్లు తపస్సు చేశాడు. విష్ణుమాయ వలన మాయాసరస్వతి బ్రహ్మ తపస్సు భంగం చేయడానికి వచ్చింది. బ్రహ్మ మాయాసరస్వతి శృంగార చేష్టలకు మోహవివశుడైనాడు. బ్రహ్మ మాయాసరస్వతిని తన అర్థాంగిగా భావించి ఆమెతో రతిసౌఖ్యాలు అనుభవించాడు. మాయాసరస్వతి నూరురూపాలు ధరించగా, ఆమెతో భోగించి బ్రహ్మ శతానందుడు అయ్యాడు. బ్రహ్మ మాయాసరస్వతి మాయమవగా, ఆమెను వెదుకుతూ మందరగిరి గుహ వెలుపలికి వచ్చాడు. అక్కడ మార్కండేయాది మునులను చూసి బ్రహ్మ దీనుడై, ఆ ముని వలన జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని తెలుసుకున్నాడు. బ్రహ్మ తన అజ్ఞానానికి సిగ్గుపడి, విష్ణుమహిమను కీర్తించాడు. బ్రహ్మ అపరాధి, కపటశీలుడు, దురాత్ముడు, మిక్కిలి గర్వితుడూ అయిన తనను, కన్నతండ్రి కుమారుని లాగ మన్నించమని విష్ణువును ప్రార్థించాడు. ఈ విధంగా శ్రీమహావిష్ణువు నాభికమలంలో జన్మించినప్పటికీ బ్రహ్మ రాజసగుణం చేత అహంకారాన్ని పొందాడని తెలుస్తుంది. రాజసగుణంతో అహంకరించి, విష్ణుమాయను ఎదిరించిన వారు ఎవరైనా మాయామోహంలో చిక్కుకొని పరితపించాల్సిందే అని బ్రహ్మ పాత్ర వలన తెలుస్తున్నది.

మాయాసరస్వతి

మాయాసరస్వతిని బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి శ్రీమహావిష్ణువు కల్పించాడు. మాయా సరస్వతి విష్ణుమాయను నిందించి, తపస్సు చేస్తున్న బ్రహ్మ ముందు నిలిచింది. ఆమె తన శృంగారవిలాసవైఖరితో బ్రహ్మకు చిత్తచాంచల్యం కలిగించింది. మాయాసరస్వతి బ్రహ్మతో తాను సరస్వతినని చెప్పి, ఆమెను ఏలుకోమన్నది. మాయాసరస్వతి బ్రహ్మను తపోవిధినుంచి మరల్చింది. మాయాసరస్వతి నూరు రూపాలు దాల్చి, బ్రహ్మను రతిసౌఖ్యాలలో తేల్చింది. బ్రహ్మ రతిపారవశ్యంలో ఉండగా మాయాసరస్వతి అదృశ్యమైపోయింది. ఈ విధంగా మాయాసరస్వతి బ్రహ్మ గర్వభంగానికి సాధనంగా ఇందులో చిత్రించబడిందని తెలుస్తుంది. తపోదీక్షలో ఉన్న బ్రహ్మను కామమోహితునిగా చేసి, అతని అహంకారాన్ని నాశనం చేసి మాయాసరస్వతి అదృశ్యమైంది. కాబట్టి కవి కల్పించిన మాయాసరస్వతి పాత్ర ఈ కథకు రసపుష్టిని కలిగించిందని భావించవచ్చు.

మార్కండేయుడు

మార్కండేయముని బ్రహ్మ సభలో దేవతలు, మునులు చేరి అతడిని పొగడుతుండగా వాళ్ళని వారించాడు. తాను తప్ప వేరేదైవం లేదన్న బ్రహ్మను మార్కండేయుడు అధిక్షేపించాడు. మార్కండేయుడు విష్ణుమాయను స్తుతించి, బ్రహ్మకు

అతని అల్పత్వాన్ని తెలియజెప్పాడు. మార్కండేయుడు బ్రహ్మకు పూర్వజన్మల పుణ్యకర్మల వల్లనే ఆ పదవి లభించిందని గుర్తుచేశాడు. మార్కండేయుని హితబోధకు బ్రహ్మ కోపించి, దూషించాడు. మార్కండేయుడు బ్రహ్మకు విష్ణుమహిమను, ప్రళయకాలంలో మున్నీటిపై ఒంటరిగా ఉన్న వటపత్రశాయి అయిన శ్రీమహావిష్ణువు ప్రభావాన్ని వివరించి చెప్పాడు. మార్కండేయుడు లోకాలన్నీ శ్రీ మహావిష్ణువులోనే లీనమై ఉన్నాయని, వటపత్రశాయి నోటిలో అతడు పార్వతీ పరమేశ్వరులను చూశాడనీ బ్రహ్మకు తెలిపాడు. మార్కండేయుడు విష్ణుమాయను సందేహించి, పరమభక్తుడైన పుండరీకుడు కూడా మోసపోయిన తీరును బ్రహ్మకు వినిపించాడు. మార్కండేయుని మాటల్ని లెక్కచేయకుండా బ్రహ్మ సృష్టి నిర్మాణాన్ని ఆపివేసి, లోకాలను అంధకారమయం చేసి వెళ్ళిపోయాడు. మార్కండేయుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, విష్ణువు లోకాలకు పూర్వపు స్థితిని కల్పించాడు. విష్ణువు మార్కండేయునికి దివ్య దృష్టిని కలిగించి, విశ్వరూపాన్ని చూపించాడు. ఈ విధంగా మార్కండేయుని పాత్ర బ్రహ్మ గర్వభంగానికి పరోక్షంగా కారణమవుతున్నదని తెలుస్తుంది. బ్రహ్మ గర్వించి సృష్టి నిర్మాణాన్ని ఆపడానికి మార్కండేయుని హితబోధను వినకపోవడమే కారణమని చెప్పవచ్చు.

శివుడు

ఆదిదేవుడైన శివుడు కైలాసవాసి, నిర్వికారుడు, అతడు మన్మథుని జయించినవాడు. శరీరంలో సగభాగాన్ని పార్వతికి ఇచ్చినవాడు. దేవదానవులు క్షీరసాగరాన్ని మథించగా పుట్టిన హాలాహలానికి లోకాలు అన్నీ తల్లడిల్లగా, శివుడు ఆ విషాన్ని కంఠంలో ధరించి గరళ కంఠుడైనాడు. శివుడు నారదుని వలన మోహిని సౌందర్యాన్ని గురించి విని, ఆమెను చూడాలని కుతూహల పడ్డాడు. శివుని ముందే నారదుడు విష్ణుమాయను పొగిడి, శివుని ఇంద్రియ నిగ్రహాన్ని పరిహసించాడు. శివుడు నారదుని మాటలకు పంతంతో వైకుంఠానికి వెళ్ళి మోహినిని చూసి, తన వైరాగ్య భావాన్ని లోకానికి చాటాలని భావించాడు. శివుడు తన ఇంద్రియ నిగ్రహపటుత్వ మహిమను పొగడుకొని, పార్వతి మాటలు లెక్కించకుండా వైకుంఠానికి ప్రయాణమైనాడు. శివుడు కాంచన సూత్రంతో వెలగొందే నడుముకు ఏనుగు చర్మాన్ని ధరించి, పులిచర్మాన్ని పైన చుట్టుకొని, మెడలో నాగాభరణాలు తాల్చినాడు. శరీరమంతా విభూతి కాంతితో వెన్నెలను మరిపించగా యోగమూర్తి లాగ శివుడు వైకుంఠానికి వెళ్ళాడు.

శివుడు విష్ణువు సభలో దేవతాసమూహాల ముందు, నారదునితో కలిగిన పంతాన్ని వినిపించాడు. శివుడు తన నిర్వికారత లోకానికి తెలిసేలాగ విష్ణువును మోహినిగా మారమని కోరాడు. విష్ణువు పలికిన నయోక్తులను వినకుండా శివుడు మోహినిని చూపమని పంతం పట్టాడు. శివుని ముందు మోహిని నిలువగానే, అతనికి మదన

వికారం కలిగింది. శివుడు మోహిని శృంగార విలాస చేష్టలకు మోహవివశుడై శృంగారవనంలో ఆమెను వెంబడించాడు. శివునికి మోహిని కనిపిస్తూ, మాయమవుతూ, పూబంతి ఆటలతో మురిపిస్తూ, తుగుటుయ్యాలలో ఊగుతూ శృంగార విలాస క్రీడలతో విరహోన్మత్తుని గావించింది. కామమోహితుడైన శివుడు మట్టు మీరిన మోహంతో మోహినిని కౌగిలించుకోబోగా, అతనికి శుక్ల పతనమైంది. మోహం నశించిన శివుడు పరబ్రహ్మ జ్ఞానాన్ని పొందాడు. విష్ణువు శివుడిని ఊరడించి కీర్తించాడు. శివుడు కూడా శ్రీ మహావిష్ణువును స్తుతించి, కైలాసానికి వెళ్ళాడు. నిరంతరం యోగసమాధిలో ఉంటూ విరతిభావాన్ని కలిగిన శివుడు కూడా నారదుని మాటలకు మత్సరించాడు. శివుడు తన విరతి భావాన్ని, నిగ్రహపటు మహత్యాన్ని లోకానికి చాటాలని దురహంకార పూరితుడైనాడు. అందుచేతనే శివుడిని మోహిని మోహంలో ముంచిందని తెలుస్తున్నది. కాబట్టి అహంకారమతులు విష్ణుమాయను తరించలేరని, సర్వజ్ఞుడైన శివుడు కూడా దానికి అతీతుడు కాదని ఈ పాత్ర వలన తెలుస్తున్నది.

పార్వతి

పార్వతి పరమేశ్వరుని పట్టమహిషి. ఆమె శివుని శరీరంలో సగభాగాన్ని పొందిన అర్థాంగి. నారదుడు శివునికి మోహినీ వృత్తాంతాన్ని వినిపిస్తున్నప్పుడు పార్వతి అక్కడే వుంది. శివుడు నారదుని మాటలకు పంతంతో మోహినిని చూడాలని భావించాడు. పార్వతి శివుని మాటలు విని, దేవా మీ మనసు నవనీతం లాగ ఎంతో కోమలమైంది. మోహినిని చూడగానే మీ మనసు ఏమవుతుందో తెలియదు. చిత్త భ్రమ కలిగితే నలుగురిలో నవ్వులపాలు తప్పదు. పరుల ముందు గౌరవం నశిస్తుంది. వైకుంఠంలో పగవాడైన మన్మథుడు ఉన్నాడు. విష్ణువు అసలే వగలకాడు. కాబట్టి మీ మనోధైర్యంపై నమ్మకం ఉంటేనే వైకుంఠానికి వెళ్ళండి అని పలికింది. పార్వతి విష్ణుమాయను తక్కువగా అంచనావేయవద్దని శివునికి సూచించింది. పార్వతి భార్యగా తన ధర్మాన్ని అనుసరించి, అహంకారంతో పెడత్రోవపడుతున్న శివునికి హితబోధ చేసింది. అంతే కాకుండా పార్వతి భర్త అభిప్రాయాన్ని గౌరవించి, శివుడిని వైకుంఠానికి వెళ్ళమని కూడా చెప్పింది. పార్వతి భర్త మనస్సును తెలుసుకొని, అతడి అభిప్రాయాన్ని కించపరచకుండా తగురీతిలో హితవు పలకడం మనకు కనిపిస్తుంది. పార్వతి శివుడి కోరిక మేరకు వైకుంఠ ప్రయాణానికి కూడా సన్నద్ధమైంది. ఈ విధంగా పార్వతిపాత్ర ఆదర్శప్రాయమైన ఇల్లాలుగా మనకు కనిపిస్తుంది.

మోహిని

ఈ మోహిని శ్రీమహావిష్ణువు ధరించిన కృత్రిమ నారీరూపంగా మనకు కనిపిస్తుంది. అమృతాన్ని రాక్షసుల నుంచి సంగ్రహించి, దేవతలకు పంచడానికి విష్ణువు ఈ మాయామోహినిగా అవతరించాడు. లోకాలను మోహింపజేసే నారాయణుని

నారీ రూపానికి జగన్మోహిని అనే పేరు సార్థకమైంది. మాయామోహిని తన శృంగార చేష్టలతో రాక్షసులను భ్రమపెట్టింది. అమృతాన్ని గ్రహించిన మోహిని దానిని ముందుగా దేవతలకు వడ్డించింది. మోహిని మాయాపాయంతో అమృతాన్ని తాగాలని భావించిన రాహువు తలను ఖండించి, అదృశ్యమైంది. నారదుని మాటలకు ప్రేరేపితుడై దర్పంతో మోహినిని చూడాలని పంతం పట్టిన శివుని ముందు విష్ణువు మాయామోహినిగా నిలిచాడు. ఆ మాయామోహిని శృంగారవనంలో శివుని ముందు విలాసంగా విహరించింది. మోహిని చలువరాతితిన్నె మీద పూబంతి ఆటలాడుతూ శివునికి కనువిందు చేసింది. పుష్పాపచయం చేస్తూ అతడికి వేడుక కలిగించింది. మోహిని వెంట మదనాతురుడై తిరుగుతున్న శివునికి జలక్రీడలాడుతూ మదన జ్వరాన్ని కలిగించింది. మోహిని విరహోన్మత్తుడైన శివుని చేత బ్రతిమాలించుకుంది. శివుడు మట్టుమీరిన తమకంతో సమీపంలో ఉన్న మోహినిని కౌగిలించుకోబోగా, అతడిని తన జడతో కొట్టి మోహిని అదృశ్యమైంది. మోహిని స్పర్శ మాత్రం చేతనే శివునికి శుక్లపతనమై, బ్రహ్మజ్ఞానం కలిగింది. ఈ విధంగా మాయామోహిని శివుని కామదహన దర్పాన్ని భంగం కావించడానికి ప్రధాన కారణమైందని చెప్పవచ్చు. అంతే కాకుండా విష్ణుమాయా ప్రభావ మహిమను లోకానికి ప్రకటించడానికి కూడా ఈ మోహినీకాంత పాత్ర దోహదకారి అవుతుందని చెప్పవచ్చు.

నారదుడు

బ్రహ్మ మానసపుత్రుడైన నారదుడు పరమ భాగవతోత్తముడు. అతడు బ్రహ్మచారి, త్రిలోకసంచారి. నారదుడు విష్ణుమహిమను, మాయాప్రభావాన్ని స్వయంగా చూసినవాడు. ఒకనాడు వైకుంఠంలో విష్ణుదేవుని సన్నిధిలో విష్ణుమాయ స్త్రీ రూపాన్ని ధరించి, ఇంద్రజాల విద్యను ప్రదర్శించింది. దానిని సభలోని వారందరూ మెచ్చుకోగా, నారదుడు మాత్రం పరిహసించాడు. నారదుడు తన యోగవిద్యామహిమ చేత ప్రేరేపితుడై, విష్ణుమాయను చులకన చేసి మాట్లాడాడు. నారదుడు బ్రహ్మ రుద్రాదులు కూడా మోసపోయిన విష్ణుమాయను తాను ఒక్కడినే జయించినానని ముల్లోకాలలో ప్రకటించుకున్నాడు. పుణ్యక్షేత్రాలను చూస్తూ నారదుడు విష్ణుమాయా ప్రభావంతో సర్వవరం క్షేత్రానికి చేరుకున్నాడు. అక్కడ నారదుడు కపటముని వేషంలో ఉన్న విష్ణువు ముందు తన మహిమను పొగడుకున్నాడు. ఆకాశవాణి నారదుని అహంకారాన్ని ఆక్షేపించి, అతనికి చండదమనుడనే ముని కథను వినిపించింది.

నారదుడు ఆకాశవాణి మాటలను లెక్కచేయకుండా విష్ణుమాయను చులకన చేసి మాట్లాడాడు. నారదుడు కపటముని మాటలు విని కొలనులో మునిగి చంద్రరేఖ అనే స్త్రీగా మారిపోయాడు. చంద్రకేతుడనే రాజు వచ్చి, ఆ చంద్రరేఖను వివాహం చేసుకొన్నాడు. చంద్రరేఖ ఆ రాజుతో మాయాసంసారం చేసి నూరుమంది కుమారులను

పొందింది. శత్రురాజు చేతిలో భర్త, నూరుమంది కుమారులు మరణించగా, చంద్రరేఖ రణరంగంలో కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖకు ఆకలిబాధ కలిగింది. ఆమె సమీపంలో ఉన్న మామిడి చెట్టు మీది పండును అందుకోవడానికి కుమారులు, భర్త శవాలను గుట్టగా పేర్చింది. చంద్రరేఖ శవాలగుట్టమీద ఎక్కి అందుకోవాలని ప్రయత్నించినా ఆ పండు అందలేదు. ఆకలిబాధతో చంద్రరేఖ ఏడుస్తుండగా, విష్ణువు వృద్ధబ్రాహ్మణుని రూపంతో వచ్చి ఆమెను శుచిగా స్నానం చేసి రమ్మన్నాడు. చంద్రరేఖ కొలనులో మునగగా, స్త్రీ రూపాన్ని విడిచి నారదుడు నీటిలోంచి వెలుపలికి వచ్చాడు. నారదుడు జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని గ్రహించాడు. శ్రీమహావిష్ణువును స్తుతించి నారదుడు తిరిగి పూర్వపు స్థితిని పొందాడు. నారదునికి విష్ణువుతో గల అతిపరిచయం, పూర్వకర్మలను అనుభవించాల్సి ఉండటం అనే కారణాల వలన స్త్రీ రూపం కలిగిందని తెలుస్తుంది. విష్ణుమాయను తెలిసిన వాడైనప్పటికీ నారదుడు అహంకరించినందు వల్లనే స్త్రీ రూపాన్ని పొంది మాయాసంసార బంధంలో చిక్కుకున్నాడని చెప్పవచ్చు. అందుచేత దురహంకారంతో విష్ణుమాయను ఎవరూ అతిక్రమించలేరని ఇక్కడ నారదుని పాత్ర తెలియజేస్తుంది.

చంద్రకేతుడు

చంద్రకేతుడు బిరుదాంకపురాన్ని పరిపాలించే రాజు. చంద్రకేతుడు నారదుడు చంద్రరేఖ అనే స్త్రీ రూపాన్ని పొందగా, ఆమెను వివాహం చేసుకున్నాడు. చంద్రకేతునికి చంద్రరేఖ వలన నూరుమంది కుమారులు కలిగారు. చంద్రకేతుడు అనుకూలవతి అయిన భార్య, కుమారులు, కోడళ్ళతో సుఖంగా ఉన్న సమయంలో శత్రురాజు దండెత్తి వచ్చాడు. చంద్రకేతుడు యుద్ధంలో తన కళ్ళ ముందే నూరుమంది కుమారులు చనిపోవడం చూశాడు. కుమారుల మరణానికి ఖిన్నుడై చంద్రకేతుడు కూడా యుద్ధంలో వీర మరణాన్ని పొందాడు. ఈ విధంగా చంద్రకేతుడు నారదుడు స్త్రీగా మారిన సందర్భంలో ఆ చంద్రరేఖతో మాయాసంసారం చేసి, కుమారులను పొందాడు. నారదునికి మాయాసంసార బంధాన్ని కలిగించడానికి చంద్రకేతుని పాత్ర ఉపకరించిందని తెలుస్తుంది.

పుండరీకుడు

పుండరీకుడు మధురానగరంలో నివసించే పరమ వైష్ణవభక్తుడు. అతని భార్య సావిత్రి. పరమ భాగవతోత్తముడైన పుండరీకుడు సద్భక్తితో నిరంతరం సాలగ్రామ స్వరూపుడైన శ్రీమహావిష్ణువును పూజించేవాడు. పుండరీకుని వద్దకు ఒకసారి నారదుడు వచ్చి విష్ణుభక్తి మహిమ, సాలగ్రామ పూజా మహాత్మ్యం, హరినామ సంకీర్తనా ప్రభావాన్ని వివరించాడు. పుండరీకునికి నారదుడు సకల జగత్తు అంతా విష్ణుమాయా కల్పితమని

చెప్పాడు. పుండరీకుడు తన కళ్ళముందు కనిపించేదంతా విష్ణుమాయా కల్పితమని నమ్మలేక, విష్ణుమాయ ఉందా అని సందేహించాడు. పుండరీకుడిని మాయామోహితుడిని చెయ్యాలని విష్ణుమాయ ఒక బోయపడుచు రూపంతో అతని ముందు నిలిచింది. పుండరీకుడు విష్ణుమాయకు తగుల్కొని, తన వంశాన్ని మరిచి ఆ బోయపడుచుపై మరులు కొన్నాడు. పుండరీకుడు బోయదాని కులహీనతకు చింతించి కూడా మోహవివశుడై ఆమెను వివాహం చేసుకున్నాడు. పుండరీకునికి బోయపడుచు వలన ఒక కుమార్తె, ఒక కుమారుడు కలిగారు. మాయాసంసార బద్ధుడై పుండరీకుడు ఇరవై ఏళ్ళు గడిపాడు. విష్ణుమాయా ప్రభావంతో కరువు కాటకాలు బాధించగా పుండరీకుడు ఆ ప్రాంతం విడిచి, గౌతమీ తీరభూములకు వలస వెళ్ళడానికి సిద్ధమైనాడు.

పుండరీకుడు కరువు తీవ్రతకు చిక్కి శల్యమైనాడు. అతని అత్తమామలు, కుమార్తె, మరణించగా భార్య, కుమారుని వెంటతీసుకుని వలస వెళ్ళేందుకు పూనుకున్నాడు. పుండరీకుడు కుమారుని చంకలోపెట్టుకొని, భార్యను వీపుకు కట్టుకొన్నాడు. గంజికుండను ఒక చేతిలో పట్టుకొని, విల్లు, బాణాలు మరొకచేతిలో ధరించాడు. చింకి ఈతచాపను తలపై పెట్టుకొని పుండరీకుడు గౌతమీనది తీరంలోని ఒక అగ్రహారాన్ని చేరుకున్నాడు. ఊరి వెలుపల భార్య, కుమారుని చెట్టునీడలో ఉంచి, పుండరీకుడు భిక్షతీసుకురావడానికి వెళ్ళాడు. విష్ణుమాయా కల్పితమైన భార్య, కుమారుడు మాయమయ్యారు. పుండరీకుడు మాయాప్రభావంతో అతని ఇంటికేవెళ్ళి భిక్షను అడిగాడు. పుండరీకుని ఇల్లాలు సావిత్రి ధాతువులు దప్పి భ్రాంతిలో ఉన్న భర్తను చూసి ఆశ్చర్యపోయింది. పుండరీకునికి కలిగిన చిత్తవికారాన్ని తొలగించమని ఆమె శ్రీమహావిష్ణువును ప్రార్థించింది.

శ్రీమహావిష్ణువు అనుగ్రహంతో పుండరీకునికి కలిగిన మాయావికారం తొలగిపోయింది. పుండరీకుని మీద దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. పుండరీకుడు శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొంది, సంసారబంధం నుండి విముక్తిని కలిగించమని కోరుకున్నాడు. ఈ విధంగా పుండరీకుడు పరమవైష్ణవుడైనప్పటికీ, శుద్ధసాత్విక బుద్ధితో సాలగ్రామ పూజను చేసినప్పటికీ విష్ణుమాయకు తగుల్కొన్నాడు. పుండరీకుడు విష్ణుమాయా ప్రభావాన్ని సందేహించడమే దానికి కారణం అని చెప్పవచ్చు. దాని ఫలితంగానే పుండరీకుడు మాయాసంసార బద్ధుడై పడరాని పాట్లు పడ్డాడు. అందుచేత సందేహాస్పదమైన చిత్తంతో విష్ణుపూజ చేయరాదని, మనసావాచా విష్ణువును నమ్మి పూజించినవారు ముక్తిని పొందగలరనీ పుండరీకుని పాత్రవలన తెలుస్తుంది.

సావిత్రి

సావిత్రి పుండరీకుని భార్య పతివ్రతాశిరోమణి. సావిత్రి పుండరీకుని పితృకార్యం కోసం ఇంట్లో ఏర్పాట్లు చేసుకుంటూ ఉండగా పుండరీకుడు నదీస్నానానికి వెళ్ళాడు.

మధ్యాహ్నం మించకుండా బ్రాహ్మణ పూజ చేయాలని సావిత్రి పనిలో ఉండగా విష్ణుమాయకు భ్రమించిన పుండరీకుడు భిక్షకోసం వచ్చాడు. సావిత్రి ఇంటి వెలుపలికి వచ్చి, విష్ణుమాయకు తగుల్కొని అయోమయంగా ఉన్న పుండరీకునికి భూతంగాని సోకిందేమో అని విస్మయం చెందింది. సావిత్రి ఎదురుగా ఉన్న పుండరీకుడిని నదీస్నానానికి వెళ్ళి అంత ఆలస్యమయిందేమని అడిగింది. సావిత్రి మాటలకు బదులు చెప్పకుండా అచేతనంగా ఉన్న పుండరీకుని దుస్థితిని చూసి కలత చెందింది. సావిత్రి ఆర్తజనశరణ్యుడైన శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, పుండరీకుని కమ్ముకున్న విష్ణుమాయ తొలగిపోయింది. ఈ విధంగా సావిత్రి సతీసావిత్రి లాగ మాయామోహంలో చిక్కుకున్న భర్తను విముక్తుడిని చేసింది. పుండరీకుడిని విష్ణుమాయ విడువడానికి సావిత్రి చేసిన విష్ణుప్రార్థన దోహదకారి అయిందని మనకు తెలుస్తుంది. కాబట్టి సావిత్రి పాత్ర కల్పన సార్థకమయిందని చెప్పవచ్చు.

బోయపడుచు

ఈ బోయపడుచు పుండరీకుడిని మాయాసంసార బంధంలో తగిలించడానికి విష్ణుమాయ చేత కల్పించబడింది. విష్ణుమాయ ఆవరించిన పుండరీకుని ముందు ఈ బోయపడుచు మన్మథుని మోహనాస్త్రం లాగ నిలిచింది. ఆమె బోయవారికి సహజమైన పచ్చగాజులు, సంకుటుంగరాలు, గురువింద పూసల మాలలు ధరించి, కాలి అందెలు శబ్దం చేస్తుండగా పుండరీకుని ఆకర్షించింది. బోయపడుచు పుండరీకునితో మాటలు కలిపి, ఆమెకు వివాహం కాలేదని, ముసలి తల్లిదండ్రులు ఉన్నారనీ చెప్పింది ఆమె తన రూపలావణ్యంతో పుండరీకునికి మరులు కలిగించి, వివాహం చేసుకోమని అడిగింది. బోయపడుచు పుండరీకుడిని వివాహం చేసుకుని, అతని వలన ఒక కుమార్తెను, కుమారునీ సంతానంగా పొందింది. విష్ణుమాయా కల్పితంగా కరువుబాధ పీడించగా బోయపడచు పుండరీకుని తోపాటుగా గౌతమీ తీరభూములకు వలస వెళ్ళింది. అక్కడ ఊరి పొలిమేరలో ఒక వటవృక్షం నీడలో కుమారుని తోపాటు ఆ బోయపడుచును నిలిపి, పుండరీకుడు భిక్షకు వెళ్ళాడు. బోయపడుచు పుండరీకుడు అగ్రహారంలోనికి భిక్షకు వెళ్ళగానే కుమారునితో సహా అదృశ్యమైంది. ఈ విధంగా బోయపడుచు పుండరీకునికి విష్ణుమాయా ప్రభావాన్ని తెలియజేసేందుకు దోహదకారి అయిందని తెలుస్తుంది. పరమభక్తుడైన పుండరీకుడిని కామాతురునిగా చేయడానికి ఈ బోయపడుచు శృంగారమూర్తిలాగా కల్పించబడింది. పుండరీకుడిని మాయా సంసారబద్ధుడిని చేసిన బోయపడుచు, అతడు మాయా విముక్తుడు కావడానికి కూడా కారణమైందని చెప్పవచ్చు.

చండదమనుడు

చండదమనుడు గొప్పతాపసి. అతడు ఒకసారి అయోధ్యను పరిపాలించే మాంధాత మహారాజు చేత పూజించబడ్డాడు. చండదమనుడు మాంధాత మహారాజు

అనుభవిస్తున్న మహారాజ వైభోగాలను తాను కూడా పొందాలని భావించాడు. రాజసగుణకలితుడై చండదమనుడు రాజ్యభోగాలను పొందగోరి, గంగాతీరంలో ఏకనిష్ఠతో తపస్సును ప్రారంభించాడు. చండదమనుని తపస్సును తెలుసుకొని సనత్కుమారుడు కోరికలు దుఃఖానికి కారణమని హితబోధ చేశాడు. సనత్కుమారుడు విష్ణుమాయను కీర్తించి, ఎవరైనా విష్ణుమాయను తరించకుండా మోక్షాన్ని పొందలేరని చండదమనునికి తెలిపాడు. చండదమనుడు విష్ణుమాయకు చిక్కకుండా మోక్షాన్ని పొందాలని బ్రహ్మను గురించి తపస్సుచేశాడు. చండదమనుని తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమైన బ్రహ్మ, అతడు మొదట సంకల్పించిట్లుగా రాజ్యభోగాలు అనుభవించాలని చెప్పాడు. రాజ్యసుఖాలు అనుభవించకుండా చండదమనునికి మోక్షం లభించిందని బ్రహ్మ తెలిపాడు.

చండదమనుడు బ్రహ్మ మాటలకు నిర్వేదాన్ని పొందాడు. అతడి తపస్సుకు శివుడు, సూర్యనారాయణుడు కూడా మోక్షాన్ని ఇవ్వలేకపోయారు. చండదమనుడు విష్ణుమాయ మీది పంతంతో కఠినంగా తపస్సు చేయసాగాడు. విష్ణుమాయా ప్రభావంతో చండదమనుని ఆశ్రమం యతికంతపాశమనే నగరంగా మారిపోయింది. చండదమనుడు రాజుగా మారి, రాజ్యభోగాలు అనుభవిస్తూ గతాన్ని మరిచిపోయాడు. సనత్కుమారుడు వచ్చి చండదమనుడికి అతని పూర్వపు మునివృత్తిని గుర్తుచేశాడు. చండదమనుడు జరిగినదంతా విష్ణుమాయా కల్పితమని సనత్కుమారుని వలన తెలుసుకున్నాడు. చండదమనుడు తన అజ్ఞానాన్ని మన్నించమని విష్ణుమాయను అనేక విధాలుగా స్తుతించాడు. విష్ణువు అనుగ్రహానికి పాత్రుడై చండదమనుడు పూర్వపు జ్ఞానాన్ని పొందాడు. కాబట్టి ప్రారబ్ధకర్మలను అనుభవించకుండా, విష్ణుమాయా బంధానికి తగుల్కోకుండా ఎంతటి తపస్సంపన్నులైనా తరించలేరని చండదమనుని పాత్ర వలన తెలుస్తుంది. ఈకావ్యంలో కథాగతంగా ఎదురయ్యే పాత్రలను వాటి స్థాయీభేదాలను అనుసరించి సముచితరీతిలో కల్పించడం కనిపిస్తుంది. పాత్రలను, కథాగతికి అనుకూలంగా తీర్చిదిద్దడం ఇందులో గమనించదగిన అంశం. కవి తన రచన ద్వారా వెల్లడించదలచిన విష్ణుమాయా మహత్వ ప్రకటనకు ఈ పాత్రలన్నీ కూడా యథోచితరీతిలో దోహదపడ్డాయని తెలుస్తుంది. ఈ విధంగా కంకంటి నారసింహకవి రచించిన విష్ణుమాయావిలాస ద్విపద కావ్యంలోని పాత్రలను గురించి చెప్పుకోవచ్చు.

### 5.1.2.4. రోసనూరి వేంకటపతి - పాత్రల పరిచయం

వేంకటపతి రచించిన విష్ణుమాయావిలాసంలో శివదర్పభంగ కథ మూడు ఆశ్వాసాలలో విస్తరించి ఉంది. కావ్యేతివృత్తం నాతి విస్తరం. కాబట్టి ఇందులోని పాత్రలు కూడా పరిమిత సంఖ్యలో సముచిత రీతిలో చిత్రించబడ్డాయని తెలుస్తుంది. శివుడు, పార్వతి, మోహిని, నారదుడు, ప్రమథగణాలు ఇందులో పాత్రలుగా కనిపిస్తున్నారు.

శివుడు

శివుడు త్రిమూర్తులలో ఆదిదేవుడు. అతడు మదనుని దహించిన నిర్వికారమూర్తి శివుడు క్షీరసాగరం నుంచి పుట్టిన హాలాహలాన్ని దయతో కంఠంలో భరించి లోకాలను కాపాడిన దయామూర్తి. శివుడు నారదుని వలన విష్ణువు మాయామోహినిగా అవతరించి రాక్షసులను మోసపపుచ్చాడని విన్నాడు. ఆ మాయామోహినిని చూడాలని శివుడు కుతూహలపడ్డాడు. శివుని ముందు నారదుడు విష్ణుమాయను కీర్తించాడు. ఆ మోహినీ సౌందర్యాన్ని చూస్తే శివుడు కూడా మోహాన్ని పొందుతాడని నారదుడు హేళనచేశాడు. శివుడు నారదుని మాటలకు రోషించి, పార్వతికి తన నిర్వికారమహిమను తెలిపాడు. శివుడు నారదుని మాటలు అసత్యాలు అని నిరూపించడానికి పార్వతీ సమేతంగా వైకుంఠానికి బయలుదేరాడు.

శివుడు తెల్లని విభూతితో శరీరం ధవళ కాంతులతో వెలుగొందగా, నడుముకు కట్టిన గజచర్మకాంతిని కంఠంలోని నీలిమ అధిగమించగా, చిఱుతపులి చారల చర్మకాంతి నాగాభరణాల శిరోరత్నంతో పోటీపడగా, కాలికి ధరించిన బొమ్మపెండెపు కాంతి లలాటలోచన కాంతితో సమానం కాగా, తలమీది చంద్రుని కాంతులు జటామండలం లోని గంగాతరంగాలపై తేలియాడగా, చేతులలో పినాకం, దమరుకం, పురశువు, శూలం, ముద్గరం మొదలైన ఆయుధాలు ధరించి (1-125) వైకుంఠానికి బయలు దేరాడు. శివుడు వైకుంఠం చేరుకొని, విష్ణువు చేత ఆతిథ్యాన్ని అందుకున్నాడు. శివుడు విష్ణువుతో మోహినిని చూడాలనే అతని కోరికను తెలిపాడు. శివుడితో మోహినిని చూడవద్దని విష్ణువు పలుకగా, శివుడు నారదునితో కలిగిన పంతాన్ని తెలిపాడు. శివుడు తన వైరాగ్యం గొప్పదో, విష్ణుమాయ గొప్పదో లోకానికి తెలుపకుండా తిరిగి వెళ్లనని విష్ణువుతో పంతంగా పలికాడు. విష్ణుమాయా ప్రభావంతో జగదేక సౌందర్యరాశిగా మోహిని శివుని ముందు నిలువగా, అతడు చిత్త చాంచల్యాన్ని పొందాడు. మోహినీ సౌందర్యానికి శివుడు కామాతురుడైనాడు.

శివుడు విష్ణుమాయా కల్పితమైన శృంగారవనంలో విహరిస్తున్న మోహినిని వెంటపడ్డాడు. శివుడు మోహిని మాయమైతే దిగులు చెందుతూ, ఎదురుపడితే ఆనందిస్తూ ఆమె వెంట విహరించాడు. శివుడు పూబంతి ఆటలాడుతూ మైమరచిన మోహినిని చూసి మదన పరవశం పొందాడు. మాయామోహిని ఉయ్యాలలో ఊగుతూ, జలకాలాడుతూ శివుని చేతికి అందకుండా మాయమైంది. మోహిని కనిపించక శివుడు విరహోన్మత్తుడై పరితపించాడు. అంతలోనే మోహినిని ఎదురవగా శివుడు ఓపలేని తమకంతో కౌగిలించుకోబోయాడు. మోహ పారవశ్యంతో మోహినిని తాకగానే శివునికి శుక్లపతనమైంది. మోహపారవశ్యం తొలగి పరబ్రహ్మజ్ఞానం కలిగిన శివుడు తన యోగవిద్యాప్రభావం వలన సిగ్గు, లజ్జ, అవమానాలకు అతీతుడైనాడు. శివుని మహిమను

విష్ణువు కీర్తించగా, విష్ణుమాయా మహిమను శివుడు స్తుతించాడు. కామాతురత అనేది ఎంతటి జితేంద్రియులనైనా అధోగతిపాలు చేస్తుందని శివుని పాత్ర వలన వెల్లడవుతుంది. సాక్షాత్తు మన్మథుని జయించినవాడు, నిర్వికారుడూ అయిన శివుడే మాయామోహిని వలన మోహాతురుడైనాడు. సర్వజ్ఞుడే అజ్ఞుడై మోహిని వెంట వెర్రిగా తిరిగాడు. అందుచేత విష్ణుమాయను తరించడం శివునికే సాధ్యం కాలేదని ఈ పాత్ర వలన తెలుస్తుంది.

పార్వతి

పార్వతీదేవి శివుని శరీరంలో సగభాగాన్ని పొందిన అర్ధాంగి. పార్వతి భర్త మనస్సును తెలుసుకున్న దొడ్డఇల్లాలుగా ఈ కావ్యంలో కనిపిస్తుంది. శివుడు నారదుని కలహపు మాటలకు కోపించి విష్ణుమాయను చులకనగాచేసి, అతని నిర్వికారాన్ని పొగడుకున్నాడు. అప్పుడు పార్వతి విష్ణుమాయా ప్రభావాన్ని శివునికి నయోక్తులతో ఈ విధంగా తెలిపింది. పరమేశ్వరా, మాయలు చేయడంలో విష్ణువు ఘనుడని మీకు తెలిసిందే. మోహినిగా మారిన విష్ణువును చూసి, మీ మనస్సు చలిస్తే సభలో గౌరవం ఎలా కలుగుతుంది. మానవుల కంటే మునులు అధికులు, మునులకు దేవతలు, వారికి బ్రహ్మ అధికుడు. బ్రహ్మకు విష్ణువు అధికుడు అన్ని విధాలా విష్ణువుకు మీరే అధికులు కాని మాయచేయడంలో విష్ణువే అధికుడు. అతడు ఎవరినైనా వేయివిధాలుగా భ్రమింపజేయగలడు. విష్ణువు మానవరూపంతో (శ్రీకృష్ణుడు) ఇంద్రుడిని, బ్రహ్మను, నారదుడిని మాయతో మోసగించాడు.

బ్రహ్మ గోవులను, గోపాలకులను, బాలకులనూ దాచగా కృష్ణుడు మాయతో వారందరినీ కల్పించి అతడిని మోసపుచ్చాడు. గోపాలకులపై రాళ్ళవాన కురిపించిన ఇంద్రుడిని తన మాయతో భ్రమింపజేశాడు. గోపాంగనలు అందరితో ఏకకాలంలో క్రీడించి ఈ నారదుని భ్రమింపజేశాడు. నీటిలోపల, వెలుపలా కనిపించి అక్రూరుని భ్రమింపజేశాడు (1-116) అలాంటి విష్ణుమాయను చూడాలని వెళితే మిమ్మల్ని కూడా భ్రమించకుండా ఉండదు. శ్రీ మహావిష్ణువు జగన్మోహిని రూపంతో కనిపిస్తే చూసి భ్రమించినట్లయితే మీ గౌరవానికి నగుబాటు కదా అంటూ ఆమె అభిప్రాయాన్ని తెలిపింది. పార్వతి తాను చెప్పవలసింది చెప్పాక, 'దేవా! మీకు తగినరీతిగా చేయండి. వెళ్లవద్దని తాను వారించడం ఎందుకని శివునితో పలికింది. పార్వతి భర్తమాటను గౌరవించి శివుని వెంట వైకుంఠానికి ప్రయాణమైంది.

పార్వతీదేవి మెడలో పతకం, ముక్కెర, చేతులకు బటువైన చుట్టుంగరాలు, కంకణాలు ధరించింది. రావిరేకులు, అపరింజికమ్మలు, అలరుపాపటబొట్టు, తీగె బుడగలు, చంద్రికలు, సంది కడియాలు, ఉరువైన గంటలమొలనూలు వేసుకుంది. గౌడసరాలు, బంగారుమెట్లు, వీరముద్రికలు, రత్నాభరణాలు ధరించింది. గంధకస్తూరి

సుగంధ ద్రవ్యాలు అలదుకుంది. పట్టు పీతాంబరాలు కట్టుకుంది. సర్వమంగళాదేవి అయిన పార్వతి ఈ రీతిగా అలంకరించుకొని వైకుంఠానికి వెళ్ళింది. పార్వతీదేవికి శివుని మహిమ తెలుసు. అయినా శివుడు విష్ణుమాయను చులకన చేయడానికి కారణం నారదుని మాటలవలన కలిగిన కోపమని ఆమె గ్రహించింది. అందువల్లనే పార్వతి విష్ణుమాయా ప్రభావాన్ని శివునికి గుర్తుచేసింది. దర్పానికి పోయి నలుగురిలో నగుబాటు కావద్దని పార్వతి శివుడిని సున్నితంగా హెచ్చరించింది. అయినప్పటికీ శివుడు ఆమె మాటను వినకపోవటంతో, భర్త అభిప్రాయాన్ని గౌరవించింది. పతితోడిదే లోకమని భావించి, పార్వతి శివుని వెంట వైకుంఠానికి నడిచింది. ఈ విధంగా పార్వతి పాత్ర ఆదర్శప్రాయమైన ఇల్లాలుగా ఇందులో కనిపిస్తుందని చెప్పవచ్చు.

నారదుడు

బ్రహ్మ మానస పుత్రుడైన నారదుడు ఇందులో కలహ భోజనుడుగా కనిపిస్తున్నాడు. నారదుడు వినిర్మలదేహంతో, సదానారాయణ అష్టాక్షరీమంత్రజపంతో త్రిలోకసంచారం చేసేవాడు. నారదుడు ఒకనాడు కైలాసంలో శివుడిని దర్శించుకొనేందుకు వెళ్ళాడు. నారదుడు శివునితో శ్రీమహావిష్ణువు మాయామోహినిగా అవతరించి రాక్షసులను మోసపుచ్చాడని, అమృతాన్ని దేవతలకు పంచాడని తెలిపాడు. నారదుడు మోహినీ సౌందర్యాన్ని వర్ణించి, ఈశ్వరా! మోహినీ రూపాన్ని చూసినప్పుడే మీ సర్వజ్ఞతకు సార్థకత లభిస్తుందని (1-82) శివుడితో అన్నాడు. నారదుడు మోహినీ సౌందర్యానికి ఎంతటివారైనా వివశులు కావలసిందే అని, శివుడు కూడా దానికి అతీతుడు కాదని రోషమెక్కించాడు. నారదుడు శివునితో అతని మాటలకు కోపగించవద్దని చెప్పి, విష్ణుమాయను జయించడం బ్రహ్మాది దేవతలకు కూడా అసాధ్యమని తెలిపాడు. శివపార్వతులతో కలిసి వారికి దారి చూపుతూ నారదుడు వైకుంఠానికి వెళ్ళాడు.

నారదుడు శివునికంటే ముందే వైకుంఠానికి చేరుకున్నాడు. నారదుడు శ్రీమహావిష్ణువు వద్దకు వెళ్ళి, శివుని మాటలుగా శివకేశవులకు కలహం కలిగే కల్లమాటలను పలికాడు. శివుడు దర్పంతో తాను విష్ణుమాయకు భ్రమించనని పలికినట్లుగా, నారదుడు విష్ణువుతో చెప్పాడు. నారదుడు మోహినిని పొగిడి శివుడికి రోషం కలిగేలా చేశాడు. అంతేకాకుండా విష్ణువు మాయామోహినిగా అవతరించి శివునికి దర్పభంగం కావించడానికి కారకుడయ్యాడు. నారదుడు శివుని దర్పాన్ని భంగపరిచి, అతని పంతాన్ని నెగ్గించినందుకు విష్ణుమాయను అనేక విధాలుగా స్తుతించాడు. ఈ విధంగా నారదుడు తన కలహపు మాటలతో విష్ణుమాయా మహిమ లోకానికి వెల్లడికావడానికి ప్రేరకుడయ్యాడని తెలుస్తుంది. మాయా మోహిని ద్వారా శివుని దర్పం నశించడానికి కూడా నారదుని కలహపు మాటలే దోహదపడ్డాయని ఇతని పాత్ర ద్వారా వెల్లడవుతుంది.

మోహిని

మోహినీ అవతారం శ్రీ మహావిష్ణువు రాక్షసుల నుంచి అమృతాన్ని సంగ్రహించి, దానిని దేవతలకు అందించడానికి ధరించిన కృత్రిమ నారీరూపం. ఈ మాయామోహిని అమృతంకోసం కలహించుకుంటున్న రాక్షసులు, దేవతలముందు శృంగార రసమంతా కుమ్మరించిన తొలకరి మెఱుగు ముద్దుగుమ్మ లాగ నిలిచింది. మాయామోహినిని చూసి దేవతలు దేహాలు మరిచారు. రాక్షసులు ఇది నాప్రియురాలు, నాభార్య, నాప్రేయసి అంటూ మోహాంధవృత్తిలో మునిగిపోయారు. మోహిని రాక్షసుల చేతనున్న అమృతకలశాన్ని అందుకుంది. మోహిని రాక్షసులను, దేవతలను వేర్వేరు పంక్తులుగా కూర్చుండబెట్టింది. మోహిని ముందుగా దేవతలకు అమృతాన్ని వడ్డిస్తూ రాక్షసులను తన శృంగార చేష్టలతో మోహపరిచింది. నారదుని మాటలకు రోషించి, దర్పంతో మోహినిని చూడాలని వచ్చిన శివుని ముందు విష్ణువు మాయామోహినిగా నిలిచాడు. మాయామోహిని కనిపించగానే సభలోని నీలిమకాంతి కొప్పులో మెరిసింది. కౌస్తుభరత్నదీప్తి పెదవుల్లో వెలిగింది. శార్ఙ్గపువంపు కనుబొమ్మలల్లో చెలువొందింది. కాంచనాంబరపు మెరుగు శరీరకాంతిలో మెరిసింది. పాంచజన్యపు సొగసు కంఠం నందు చేరింది. చక్రమహత్వం జఘనంలో కనిపించింది. మీనావతారమై కన్నులు మెరిశాయి (2-94)

ఈ రీతిగా విష్ణుసంకేతాలతో కనిపించిన మోహినిని విష్ణువని భావించకుండా, సర్వజ్ఞుడైన శివుడు కూడా అజ్ఞుడైనాడు. విష్ణుమాయతో సభామందిరం శృంగారవనంగా మారగా, మోహిని అందులో విహరిస్తూ శివుడికి మదునాతురతను కలిగించింది. మోహిని తన శృంగార చేష్టలతో శివుడిని చేతికి విరహోన్మత్తునిగా చేసింది. మోహిని పూబంతి ఆటతో శివునికి మరులు కలిగించింది. వనదేవతలతో పుష్పాపచయం చేస్తూ శివునికి మదనతాపం కలిగించింది. మోహినీకాంత పూపొదరింటిలో శయ్యమీద రతికేళికి అనువైన రూపంతో శివునికి కనిపించింది. శివుడు మట్టుమీరిన తమకంతో మోహినిని కౌగిలించుకోగా, మదన పారవశ్యంతో అతడికి శుక్లమపతనమైంది. మాయామోహిని శ్రీమహావిష్ణుగా మారిపోయింది. మాయామోహిని నిర్వికారస్వరూపుడు, విజితేంద్రియుడూ అయిన శివునికి దర్పభంగం కావించడానికే రెండోసారి అవతరించింది. మన్మథుని జయించిన గర్వంతో విష్ణుమాయను చులకన చేసిన శివునికి మన్మథ తాపాన్ని కలిగించి, విరహోన్మత్తుని గావించడానికే మోహిని శృంగార విలాసమూర్తిగా వర్ణించబడింది. విష్ణుమాయా విలాసాలలో మోహినీ అవతారం శృంగార పార్యంతికమై, రసానంద హేతువు అవుతున్నదని మోహిని పాత్ర ద్వారా తెలుస్తుంది.

ప్రమథులు

ప్రమథ గణాలు శివభటులు వీరు నిరంతరం శివుని సేవలో తరించే వీరశైవ మూర్తులు. నారదుడు విష్ణుమాయను పొగిడి, శివుని ఇంద్రియనిగ్రహ మహిమను

చులకన చేసి మాట్లాడాడు. ప్రమథులు నారదుని మాటలకు కోపించారు. ప్రమథులు శివనింద చేసిన నారదుని చూసి గిటగిట పండ్లు కొరుకుతూ చుట్టుముట్టినారు. కఠినపు పలుకులతో శివనింద చేసిన ఈ బాసకటారి బ్రహ్మణుని బంధించండి అన్నారు. ప్రమథులు నారదునితో నీ స్థితిని ఎఱుగకుండా శివుని నిందించడానికి వచ్చావా, పరమేశ్వరుని మహాత్మ్యం తెలియని నీకు ఇక్కడ నిలిచే అర్హతలేదు. నీ గొప్పలు, తబ్బిబ్బులు మానమని అతడిని బాధించడానికి పూనుకున్నారు. శివుని కనుసైగలతో ప్రమథులు శాంతించారు. ప్రమథులు శివునివెంట వైకుంఠానికి వెళ్ళారు. విష్ణుసభలో మోహినిని చూడగానే ప్రమథులు మోహభ్రాంతితో మునిగిపోయారు.

నారదుని ముందు, విష్ణువు ముందూ ప్రగల్భాలు పలికిన ప్రమథులు మోహినిని చూడగానేవారి ప్రజ్ఞలన్నీ మరిచిపోయారు. ప్రమథులు విష్ణుమాయా మోహంలో చిక్కుకుని వెర్రితనంతో ప్రవర్తించారు. ఈ విధంగా శివభక్తి పరాయణులైన ప్రమథులు నారదుడు చేసిన పరిహాసానికి ఓర్వలేక, అతడిని దూషించారు. విష్ణుసభలో కూడా ప్రమథులు శివుని జితేంద్రియతను కీర్తించి, విష్ణుమాయను తిరస్కరించారు. అందువల్లనే వారు మోహిని వల్ల చిత్తచాంచల్యాన్ని పొంది, వెర్రి చేష్టలు చేశారని తెలుస్తుంది. ఈ కావ్యంలో రోసనూరి వేంకటపతి మోహినీఅవతార కథ ద్వారా విష్ణుమాయా మహత్వాన్ని వర్ణించాడు. శివగర్వ భంగం నిమిత్తంగా ఇందులో విష్ణుమాయా మహిమ ప్రకటితమైంది. దానికి అనువైనరీతిలోనే ఇందులోని పాత్రల కల్పన కూడా చేయబడిందని పై పరిశీలన వలన మనకు తెలుస్తుంది.

5.1.2.5. ఎఱగుడిపాటి వేంకటకవి – పాత్రల పరిచయం

వేంకటకవి రచించిన ఈ కావ్యం విష్ణుమాయా విలాసకథలను భక్తి యోగ ప్రధానంగా వర్ణించింది. వేంకటకవి కావ్యరచన పురాణ శైలిలో కనిపిస్తుంది. అందుచేత ఇందులోని పాత్రలు కూడా పౌరాణిక పాత్రల్లాగ కనిపిస్తాయి. ఇందులో ప్రధానంగా దేవదానవులు క్షీరసాగరాన్ని మథించడం, లక్ష్మీ నారాయణుల కళ్యాణం, శివదర్పభంగం, బ్రహ్మ గర్వభంగం, నారద గర్వభంగం అనే కథాఘట్టాలలో విష్ణుమాయా మహిమ వర్ణించబడింది. వేంకటకవి గ్రహించిన కథలలోని పాత్రలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

ప్రధాన పాత్రలు

వేంకటకవి విష్ణుమాయా విలాసంలో ఇంద్రుడు, బలిచక్రవర్తి, శివుడు, మోహిని, బ్రహ్మ, సరస్వతి, మాయికుడు, మాయికుని కుమార్తె, నారదుడు, చంద్రకేతుడు ప్రధాన పాత్రలుగా కనిపిస్తున్నారు. విష్ణుమాయా విలాసకథలు ప్రధానంగా ఈ పాత్రల నిమిత్తంగా నిర్వహించబడ్డాయని తెలుస్తుంది.

ఇంద్రుడు

ఇంద్రుడు అష్టదిక్పాలకులలో ముఖ్యుడు, స్వర్గలోకపాలకుడు. ఇంద్రుడు దుర్వాసముని శాపం ఫలితంగా తన పదవిని, వైభవాన్ని కోల్పోయాడు. రాక్షసుల చేత అవమానాన్ని పొందిన ఇంద్రుడు దేవలోకం నుంచి వియోగాన్ని పొందాడు. ఇంద్రుడు దీనుడై, బలిచక్రవర్తిని ఆశ్రయించి సేవకునిగా కాలం గడుపుతున్నాడు. ఇంద్రుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించి, తగిన మంతనాన్ని గ్రహించాడు. ఇంద్రుడు బలిచక్రవర్తితో అమృతం లభిస్తే దాన్ని సేవించి దేవతలు రాక్షసులు అమరులు అవుతారని తెలిపాడు. ఇంద్రుడు దేవతలు, రాక్షసులు కలిసి క్షీరసాగరాన్ని మథించడానికి అనుమతించమని బలిచక్రవర్తిని కోరాడు. దానికి తగినట్లుగా అమృతపానం వల్ల ఆయురారోగ్యాలు కలిగి దేవతలు, రాక్షసులు సమానబలం కలవారు అవుతారని, అప్పుడు వారిమధ్య వైరం ఉండదనీ సమయస్ఫూర్తితో బలిచక్రవర్తిని ఒప్పించాడు. ఇంద్రుడు తమకు శ్రీమహావిష్ణువు అండదండలు ఉంటాయని బలిచక్రవర్తికి నమ్మకాన్ని కలిగించాడు.

ఇంద్రుడు తన వాక్చాతుర్యంతో, సమయస్ఫూర్తితో బలిచక్రవర్తి అంగీకారాన్ని పొంది, సముద్ర మథనానికి దేవతలు, రాక్షసులను సన్నద్ధులను చేశాడు. ఇంద్రుడు మందరపర్వతాన్ని కదల్చలేక దేవతలు, రాక్షసులు భంగపడగా విష్ణువును ప్రార్థించాడు. సముద్ర మథనానికి సర్వం సిద్ధం కాగా, ఇంద్రుడు ముందుగా వాసుకి తలవైపు చేరాడు. రాక్షసులు పౌరుషంతో వాసుకి తలను పట్టుకోవాలని ఇంద్రుడు ఆ విధంగా చేశాడు. సముద్ర మథనంలో మొదట హాలాహలం పుట్టినపుడు ఇంద్రుడు బ్రహ్మదేవుని సూచనతో శివుడిని ప్రార్థించాడు. ఇంద్రుడు క్షీరసాగరం నుంచి కలిగిన వస్తుసంచయాన్ని గ్రహించి, మహాలక్ష్మిని, కౌస్తుభమణిని శ్రీమహావిష్ణువుకు భక్తితో సమర్పించాడు. ఇంద్రుడు పెళ్ళిపెద్దగా వ్యవహరించి లక్ష్మీనారాయణుల కళ్యాణం జరిపించాడు. అమృత కలశాన్ని రాక్షసులు అపహరించగా, ఇంద్రుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించి అమృతాన్ని పొందాడు. ఇంద్రుడు అమృతపానం వల్ల తిరిగి తన పూర్వపు స్థితిని పొందాడు.

రాక్షసులను యుద్ధంలో ఎదుర్కొన్న ఇంద్రుడు, బలిచక్రవర్తి బారినుంచి కాపాడమని నరనారాయణులనే మునులను ప్రార్థించాడు. వారి సాయంతో ఇంద్రుడు బలిచక్రవర్తిని జయించి, తిరిగి తన పదవిని, స్వర్గాధిపత్యాన్ని పొందాడు. ఈ విధంగా ఇంద్రుడు మునిశాపంతో కోల్పోయిన పదవి, సంపదలను, నిరంతర విష్ణుధ్యానంతోనే తిరిగి పొందగలిగాడని తెలుస్తుంది. కష్టాలు ఎవరికీ శాశ్వతం కావని, సంయమనంతో భగవంతుని పాదాలను ఆశ్రయించిన వారికి తప్పకుండా సుఖాలు లభిస్తాయని ఇంద్రుని వృత్తాంతం తెలుపుతుంది. అందుచేత విష్ణుభక్తులకు కాలప్రభావంతో కష్టాలు

కలిగినప్పటికీ సత్ప్రవర్తన, భక్తిభావం వల్ల అవి అచిరకాలంలోనే తొలగిపోతాయని ఇంద్రుని పాత్రవలన వెల్లడవుతుందని చెప్పవచ్చు.

బలిచక్రవర్తి

బలిచక్రవర్తి రాక్షసరాజు, ప్రహ్లాదుని మనుమడు, విరోచనుని కుమారుడు. బలిచక్రవర్తి పూర్వపువైరభావాన్ని మరిచి, శాపగ్రస్తుడైన ఇంద్రునికి ఆశ్రయమిచ్చాడు. బలిచక్రవర్తి అమృతం లభిస్తుందని చెప్పిన ఇంద్రుని మాటలు నమ్మాడు. అమృతం వల్ల దేవతలకు, రాక్షసులకూ మేలు కలుగుతుందని బావించి, సముద్రమథనానికి అంగీకరించాడు. బలిచక్రవర్తి అమృతం లభించిన తర్వాత విష్ణువు మాయామోహిని రూపంతో దాన్ని దేవతలు పంచినాడని, అమృతపానం వల్ల దేవతలు యుద్ధంలో రాక్షసులను ఎదుర్కొన్నారనీ విన్నాడు. బలిచక్రవర్తి ముందు రాక్షసులు ఇంద్రుడు చేసిన మోసాన్ని చెబుతూ, 'దానవేశ్వరా! దేవతలకు, రాక్షసులకూ మధ్య పొత్తు కుదురుతుందా. రాక్షసరాజులు ఏనాడైనా ఈ ఇంద్రుడిని నమ్మినారా. ఎప్పుడైనా విష్ణువు రాక్షసులకు మేలు కలిగించాడా. కాని నేడు మీ నిష్కపటబుద్ధి వల్ల రాక్షసులకు ఇంతటి దురవస్థ కలిగింది' అని విన్నవించారు.

బలిచక్రవర్తి దేవతల చేష్టలకు కోపించాడు. ఇంద్రుడు, దేవతలు మర్యాదను మరిచి రాక్షసులను బాధించారు. ఆప్తుడిగా నటించి స్నేహంతో అనేక మాటలాడిన ఇంద్రుడు మహాదర్పోద్ధతుడైనాడా, అమృతపానంతో ఇంద్రుడు రాక్షసులనే ఎదిరించాడా' అని రాక్షసుల ముందు తన కోపాన్ని ప్రదర్శించాడు. బలిచక్రవర్తి రాక్షసవీరులతో దేవతలు తాగిన అమృతాన్ని క్రక్కిస్తాను. దిక్పాలకుల గర్వాన్ని అణగద్రొకుతాను. ఇంద్రుని, దేవతలను యుద్ధంలో బాధిస్తాను అని పరుషంగా పలికాడు. బలిచక్రవర్తి రాక్షసులకు అభయమిచ్చి, ఇంద్రునిపైకి యుద్ధానికి వెళ్ళాడు. భూమండలం బీటలు వారి సప్తసముద్రాలు బుడబుడ ధ్వనులతో ఉడుకుపట్టే విధంగా బలిచక్రవర్తి సైన్యంతో బయలు దేరివెళ్లాడు. దిక్కులన్నీ దద్దరిల్లే విధంగా భీషణ ప్రస్థానభేరి మ్రోగించాడు. బలిచక్రవర్తి రాక్షససైన్యంతో కూడి ఇంద్రుడిని ఎదుర్కొని ఘోరమైన రీతిగా యుద్ధాన్ని చేశాడు.

బలిచక్రవర్తి ధాటికి నిలువలేక దేవతలు పారిపోయి, నరనారాయణులనే మునులను ఆశ్రయించారు. బలిచక్రవర్తి యుద్ధరంగానికి వచ్చిన నరనారాయణులను చూసి, 'మునులారా, యుద్ధం చేయడమంటే ప్రణవాది సన్మంత్ర పఠనం కాదు. బాణాలు సంధించడమంటే జపమాలికలను త్రిప్పడం కాదు. శత్రువులను ఎదుర్కొవడం ఆత్మధ్యానం చేసినంత సులువుకాదు (2-119) అంటూ హేళన చేశాడు. బలిచక్రవర్తి నారాయణమునితో దారుణమైన రీతిలో యుద్ధంచేసి, అతడిని మూర్ఛపోయేలా చేశాడు. నారాయణముని బలిచక్రవర్తి యుద్ధ నైపుణ్యాన్ని మెచ్చుకున్నాడు. యుద్ధంలో బలిచక్రవర్తి

నారాయణముని ధాటికి విరథుడైనాడు. బలిచక్రవర్తి ఆయుధాలను నారాయణముని ఛిద్రం చేయగా, రాక్షసరాజు నిరాయుధుడైనాడు. యుద్ధరంగంలో వీరోచితంగా పోరాడిన బలిచక్రవర్తి చివరికి రథాన్ని, ఆయుధాలనూ కోల్పోయాడు. మనస్సులో కలత చెందినవాడై బలిచక్రవర్తి యుద్ధం చేయలేక రణరంగం నుంచి మరలిపోయాడు.

ఈ విధంగా బలిచక్రవర్తి ఇంద్రుడు శత్రువని తెలిసికూడా అతడు దీనస్థితిలో ఉంటే ఆదరించి, ఆశ్రయమిచ్చాడు. ఇంద్రుని మాయమాటలు నమ్మి, అమృతంకోసం రాక్షసులను కూడా సముద్రమథనానికి పంపినాడు. బలిచక్రవర్తి కంటే ముందుగాని, ఆతని తర్వాతగానీ ఏ రాక్షసరాజూ ఈ విధంగా దేవతలతో పొత్తు పెట్టుకోలేదు. ఇంద్రుని దైన్యస్థితిని చూసి జాలిపడటం బలిచక్రవర్తిలోని దయాగుణానికి నిదర్శనంగా కనిపిస్తుంది. జాతిరీత్యా రాక్షసుడైనప్పటికీ బలిచక్రవర్తిలోని ఉదారగుణం దయాశీలత, నాయకత్వలక్షణం, వీరత్వం వంటి గొప్పగుణాలన్నీ ఈ పాత్ర ద్వారా వెల్లడవుతున్నాయని చెప్పవచ్చు.

శివుడు

ఈ కావ్యంలో ఆదిదేవుడైన శివుడు కైలాసంలో రత్నపీఠిక మీద సుఖస్థితిలో కొలువై, శుభమూర్తిగా కనిపిస్తాడు. దేవదానవులు మథించగా క్షీరసాగరం నుంచి పుట్టిన హాలాహలాన్ని భరించి, శివుడు లోకాలను కాపాడాడు. శివుడు నారదుని వలన రాక్షసులను విష్ణువు మాయామోహిని రూపంతో మోసపుచ్చిన విధానాన్ని విన్నాడు. మోహినీ సౌందర్యాన్ని గురించి విని శివుడు మనసులో ఆశ్చర్యపోయి, అయ్యో! దానవులు విష్ణువే మోహినిగా మారి వచ్చాడని గుర్తించలేకపోయారు కదా! (2-181) అని జాలిపడ్డాడు. నారదుడు విష్ణుమాయను స్తుతించగా విని, శివుడు మనస్సులో కోపించాడు. శివుడు 'పూర్వం తాను మహాలింగాకృతిని ధరించినపుడు బ్రహ్మ హంసగా, విష్ణువు తాబేలుగా మారి శివలింగానికి ఆద్యంతాలను కనుగొనలేక పోయారు కదా!' అని తన మహిమను శ్లాఘించుకొన్నాడు. నారదుడు శివుని ఇంద్రియ నిగ్రహశక్తిని పరిహసించి, విష్ణుమహిమను స్తుతించాడు. శివుడు నారదుని మాటలకు కోపించి, మోహినిని చూడాలని వైకుంఠానికి వెళ్లాడు. శివుడు వైకుంఠంలో విష్ణువు చేత సాదరంగా ఆదరాన్ని పొందాడు.

శివుడు విష్ణువుతో తాను మోహినిని చూడాలని వచ్చానని తెలిపాడు. శివుడు విష్ణువు చెప్పిన నయోక్తులు వినిమనస్సును నిలుపుట తనకు కష్టమేమీ కాదని మోహినిని చూపమన్నాడు. విష్ణువు మాయామోహినిగా తన ముందు నిలువగానే శివుడు కన్నుల పండుగగా మోహినిని చూసి భ్రాంతచిత్తుడైనాడు. సభామందిరం శృంగారవనంగా మారగా, శివుడు ఏకాంతంగా ఉన్న మాయామోహిని వెంట అనుసరించాడు. శివుడు మోహినిని చూసి ముల్లోకాలలో ఇటువంటి సౌందర్యం ఎన్నడూ చూడలేదని

మెచ్చుకున్నాడు. శివుడు మనదపరవశుడై మోహిని లభించినట్లయితే, ఇక కైలాసం ఎందుకు, గిరిజాసంగమం ఎందుకు, భువనాధిపత్యం ఎందుకని వగచాడు (2–288) శివుడు మోహినీ సౌందర్యానికి దాసుడై ఏ విధంగానైనా ప్రయత్నించి, ఈమోహిని పొందు పొందకుంటే మన్మథ బాణాల విరహాగ్నితో దహించుకుపోవడం తప్పదని భావించాడు. శివుడు కందుకక్రీడ నెపంతో శృంగార చేష్టలను ప్రదర్శించే మోహినిని చూసి విరహోన్మత్తుడైనాడు. శివుడు తాళలేని తమకంతో ఉన్మాది విధంగా మోహినిని పైనపడి కౌగిలించుకున్నాడు. మోహిని వక్షస్పర్శ తాకగానే మోహపారవశ్యంతో శివునికి శుక్లపతనమైంది. శివుని తేజస్సు నుంచి సద్యోగర్భంతో కాలభైరవుడు జన్మించాడు. పారవశ్యం తొలగి శివునికి పరబ్రహ్మ జ్ఞానం కలిగింది. శివుడు తన వెడుగుబుద్ధి వలన విష్ణుమాయను లెక్కించక ఇంతటి అవివేకానికి పూనుకొన్నానని పశ్చాత్తాపపడ్డాడు. విష్ణువు, 'లోకాలు నీ ఆధీనములు, సర్వమయుడవు నీవు' అని శివుడిని కీర్తించాడు.

ఈ విధంగా సర్వజ్ఞుడైన శివుడు కూడా నారదుని కలహపు మాటలకు రోషించి, విష్ణుమాయను చులకన చేశాడు. శివుడు నారదుని ముందు తన ఘనతను అతిశయించి పొగడు కున్నాడు. తన నిగ్రహ పటుత్వ మహత్వ ప్రదర్శనంతో లోకాలను ఆశ్చర్యపరచాలని భావించిన శివుడు ఆశాభంగాన్ని, గర్వభంగాన్ని పొందాడు. అందుచేత అహంకారమతులు ఎంతటి సర్వజ్ఞులైనా ఎప్పటికీ విష్ణుమాయను జయించలేరని శివుని పాత్ర వలన తెలుస్తుంది. ఎవ్వరుగాని వినయ విధేయ సంపత్తి చేతనే విజయాన్ని, శుభాన్ని పొందగలరని, దానికి లోకపాలకుడైన శివుడు కూడా అతీతం కాదని ఈపాత్ర వలన తెలుస్తుంది.

మోహిని

ఈ మాయామోహిని అమృతాన్ని రాక్షసుల నుంచి సంగ్రహించి, దానిని దేవతలకు అందించడానికి శ్రీమహావిష్ణువు ధరించిన నారీరూపం. అమృతం కోసం కలహించుకొంటున్న దేవతలు, రాక్షసుల ముందు మాయామోహిని ముగ్ధతనమంతా తనసొమ్ముగా ధరించి నిలిచింది. ఆమె దేవతలకు, రాక్షసులకు అమృతాన్ని పంచుతానని అమృత కలశాన్ని సంగ్రహించింది. మోహిని ముందుగా దేవతలకు అమృతాన్ని వడ్డిస్తూ, రాక్షసులను తన శృంగార చేష్టలతో అదుపులో పెట్టింది. మోహిని మాయారూపులై అమృతాన్ని పొందిన రాహుకేతువుల తలలు ఖండించి అమృతాన్ని ఇంద్రునికి అప్పగించి మాయమైంది. కైలాసంలో శివుని ముందు నారదుడు మోహినీ సౌందర్యాన్ని వర్ణించాడు. నారదుడు మోహినీకాంతను చూస్తే శివుడు కూడా మరులుకొని, ఆమెవెంట తిరుగుతాడని పంతంగా పలికాడు. శివుడు వైకుంఠానికి వెళ్ళి విష్ణువును మోహినిగా మారమని పట్టుబట్టాడు. విష్ణువు శివుడిని మోహపరచడానికి కల్పించిన మదనదీపంలాగ, వర్షాగమానికి ముందువచ్చే మెరుపు తీగలాగ, మన్మథుని ఖడ్గపు మెరుపులాగ,

అంధకారంలో విద్యుల్లత లాగ మోహిని(2-224) శృంగారవనంలో నిలిచింది. శివుడు మోహినిని చూసి చిత్త భ్రాంతిని పొంది, ఎన్నడూ ఇలాంటి కన్యను చూడలేదని ఆశ్చర్యపోయాడు. మోహిని తన రూపవిలాసంతో, శృంగారచేష్టలతో శివుడిని మన్మథ బాణాలకు గురిచేసింది. కందుకక్రీడను ఆడుతున్న మోహినికి నుదుటిమీద స్వేద బిందువులు మంచి ముత్యాల పట్టికలాగ అమరినాయి. చెక్కిళ్ళ కాంతులు కుండలాలమీదికి చేరి మరింతగా ప్రకాశించాయి. కుచభారంతో నడుము వణికింది. కందుకక్రీడతో మైమరచిన మోహిని చెదిరిన పైటను సవరించడం మరచిపోయింది. మోహిని కందుకక్రీడ నెపంతో శివుడిని మదనబాధితుడిని చేసింది.

పూబంతిని వెదుకుతూ మోహిని పరాకుతో పూలగుత్తిని కోయబోగా ఆమె కోకపోకముడి పట్టు జారిపోయింది. చీర తొలగిన మోహినిని చూసి శివుడు ఉన్మాదిలాగ కౌగిలించుకొని మదన పరవశాన్ని పొందాడు. మోహిని స్పర్శతో శివుని తేజం పతనమైంది. శివుడు పారవశ్యాన్ని విడిచి చూడగా, మాయామోహిని విష్ణువుగా మారిపోయింది. మన్మథుడు లోకాలనే మరులు కొలిపేవాడు. శివుడు ఆ మన్మథుని దహించిన ఇంద్రియనిగ్రహం కలవాడు. అతడు నారదుని మాటలకు కోపించి, దర్పంతో విష్ణుమాయను చులకన చేశాడు. శివుడు మోహిని జగదేకసౌందర్యాన్ని చూసి కూడా చలించనని గర్వించాడు. మోహిని తన శృంగార విలాసంతో శివుడిని వివశుడిని చేసింది. శివుడి దర్పాన్ని భంగపరచి, విష్ణుమాయా ప్రభావాన్ని లోకానికి వెల్లడించడానికి మోహిని పాత్ర ఎంతగానో దోహదకారి అయిందని చెప్పవచ్చు.

బ్రహ్మ

బ్రహ్మ శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి జన్మించాడు. బ్రహ్మ సకల చరాచర జగత్తును సృష్టించేవాడు. బ్రహ్మ ఒకనాడు సత్యలోకంలో సరస్వతితో సరసకేళిలో మునిగి తన ఘనతను, సృష్టి నిర్మాణచాతుర్య దక్షతనూ శ్లాఘించుకున్నాడు. బ్రహ్మ ముల్లోకాలలో వర్తించేది అతని మాయా ప్రభావమేనని సరస్వతితో అన్నాడు. అతడు స్వయంభువు అనీ, ముల్లోకాలలో బ్రహ్మకు తప్ప ఇతరులకు సృష్టినిర్మాణ చాతుర్యం లేదనీ పలికాడు. బ్రహ్మ మాటలకు నొచ్చుకొని సరస్వతి విష్ణుమాయా మహిమను గుర్తుచేసింది. బ్రహ్మ ఆమె మాటలకు కోపించి, ఇంద్రుడు, శివుడు, విష్ణువు మొదలైన వారంతా అతని సృష్టిలోని వారేనని అన్నాడు. బ్రహ్మ సరస్వతికి తన మహిమను తెలియజేయాలని భావించాడు.

బ్రహ్మ తన సృష్టి కార్యాన్ని నిలిపివేస్తే విష్ణువు గిష్ణువు ఎవరు కూడా సృష్టి చేయలేరని గర్వించి పలికాడు. అతడు లోకాలకు నాయకుడైన తనలాగ సృష్టి నిర్మాణాన్ని ఎవరు చేయగలరని సరస్వతితో ప్రగల్భాలు పలికాడు. బ్రహ్మ సృష్టి నిర్మాణాన్ని చాలించి, ముల్లోకాలలోని అతడి తేజాన్ని ఉపసంహరించుకున్నాడు. అతడు సత్యలోకాన్ని విడిచిపెట్టి

ఏకాంతమైన గాఢాంధకార ప్రాంతానికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ గాఢాంధకార ప్రాంతంలో ఒంటరిగా తిరుగుతూ మాయికుడనే మునిని చూశాడు. బ్రహ్మ ఆ మాయికునితో తనపేరు భద్రకుడు అని చెప్పాడు. బ్రహ్మ మాయికుని వెంట అతని ఆశ్రమానికి వెళ్ళాడు. బ్రహ్మ అక్కడ మాయికుని కుమార్తెను చూసి వరించాడు. బ్రహ్మ ఆ మునికన్యతో తానే బ్రహ్మనని, స్వయంభువుననీ తెలిపాడు. అతడు బ్రహ్మ ఆ మునికన్య సౌందర్యానికి దాసుడై, సరస్వతిని విడిచి ఆమెతోనే ఉంటానని తెలిపాడు. బ్రహ్మ మునికన్య మాటలువిని, ఆమె వెంట పుష్పకవిమానంలో వేరొక లోకానికి వెళ్ళాడు. బ్రహ్మ అక్కడ వెలుగుతున్న భూమండలం, పర్వతాలు, సముద్రాలు, అడవులు, సమస్త సృష్టినీ చూసి మూర్ఛపోయాడు.

బ్రహ్మ ఆ భూమండలం మీద సత్యలోకానికి వెళ్ళి, అక్కడ అష్టముఖ బ్రహ్మను చూసి సిగ్గుపడ్డాడు. అష్టముఖబ్రహ్మ వలన బ్రహ్మ తన అల్పత్వాన్ని తెలుసుకున్నాడు. వారి వలన విష్ణుమహిమను గ్రహించాడు. బ్రహ్మ తన గర్వాన్ని గుర్తించి, దాని వలన ఇలాంటి భంగపాటు కలిగింది కదా! అని విచారించాడు. బ్రహ్మ తన గర్వాన్ని విడిచి, పశ్చాత్తాపంతో తిరిగి సత్యలోకానికి వచ్చాడు. బ్రహ్మ అక్కడ చింతామణి సింహాసనం మీద ఉన్న మాయాబ్రహ్మను చూసి అతిదుఃఖితాత్ముడైనాడు. బ్రహ్మ హరినాభి పద్మం నుంచి పుట్టిన పుట్టుకను మరిచి, తాను విష్ణువును నిందించినందుకు తగిన శాస్తి జరిగిందని చింతించాడు. బ్రహ్మ భగవంతుని విడిచి అన్యులను శరణు వేడటం అవివేకమని గ్రహించాడు. బ్రహ్మ తన గర్వమంతా అణిగిపోగా విష్ణువు పాదపద్మాలను తపోనిష్ఠతో ధ్యానించాడు. బ్రహ్మశ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొంది, తిరిగి సత్యలోకానికి చేరుకున్నాడు. బ్రహ్మ గర్వానికి సరస్వతి చేసిన విష్ణుమాయాస్తుతి ప్రధాన కారణం. బ్రహ్మ సరస్వతికి తన ప్రభావాన్ని చూపించాలని ఆరాటపడ్డాడు. బ్రహ్మను మించిన వారు ముల్లోకాలలో ఎవరూ లేరని తెలిపేందుకు విష్ణువును కూడా నిందించాడు. విష్ణుమాయా మోహితుడైన బ్రహ్మ, అష్టముఖ బ్రహ్మ వల్ల విష్ణుమహిమను తెలుసుకున్నాడు. బ్రహ్మ పశ్చాత్తాపమే అతడికి తిరిగి పూర్వపు స్థితిని కల్పించింది. అందుచేత విధాతకూడా విష్ణుమాయ నుంచి తప్పించుకోలేడని ఈ పాత్ర వలన తెలుస్తుంది.

సరస్వతి

సరస్వతి బ్రహ్మదేవుని ఇల్లాలు, విద్యాధిదేవత. సరస్వతి సరసకేళిలో ఆమె చెక్కిలిపై మకరికా పత్రాలు చిత్రించిన బ్రహ్మ నిపుణతను మెచ్చుకుంది. సరస్వతి తామరతూడు కంటే సూక్ష్మమైన వీణా తంత్రులపై తాను బహురీతులుగా నాదాలు పలికించినా ఎవ్వరూ స్తుతించరు అని భావించింది. సరస్వతి గర్విష్టి అయిన బ్రహ్మ అతన్ని స్వయంభువుగా ప్రకటించుకుంటే వారించింది. సరస్వతి బ్రహ్మతో, ఓ సర్వేశ్వరా!

సకల జగత్తును సృష్టించే నీకు విష్ణునాభికమలం నుంచి పుట్టడానికి కారణమేమి? అని అడిగింది. అంతేకాకుండా సరస్వతి బ్రహ్మకు 'సర్వం విష్ణుమయం' అనే సత్యాన్ని కూడా వినిపించింది. సరస్వతి మాటలకు కోపించి బ్రహ్మ అతడి ప్రభావాన్ని ఉపసంహరించుకొని, సృష్టి నిర్మాణాన్ని నిలిపివేశాడు. అప్పుడు సరస్వతి బ్రహ్మతో, 'ఛలోక్తిగా, నవ్వులకు పలికిన మాటలు ఇంతటి కలహానికి కారణమైనాయి. మహానుభావుడైన శ్రీమహావిష్ణువును తృణీకరించడం తగదు. ఈ దురాగ్రహం వద్దు' (3-32) అని పలికింది.

దురహంకారంతో బ్రహ్మ మాయమవగానే సరస్వతి పరితపించింది. చెలికత్తెలు ఆమెను మందలించగా, 'భర్త పెడబుద్ధితో ప్రవర్తిస్తే భార్య అతడికి తల్లిలాగ బుద్ధులు చెప్పాలి కదా?' అని సరస్వతి వారితో పలికింది. సరస్వతి బ్రహ్మను గురించి ఆలోచిస్తూ విష్ణువు తన మాయాకేళితో బ్రహ్మను కోపగిస్తాడో, గర్వమణగిస్తాడో అని సందేహించింది. సరస్వతి శ్రీ మహావిష్ణువును ప్రార్థించగా విష్ణువు బ్రహ్మకు గర్వభంగం చేసి, ఆమె చెంతకు చేరుస్తానని తెలిపాడు. సరస్వతి శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొంది, వైకుంఠంలో శ్రీమహాలక్ష్మి దగ్గర ఆశ్రయాన్ని పొందింది. సరస్వతి భర్త ఎడబాటువలన విరహ భావాన్ని పొందింది. సరస్వతి బ్రహ్మను గూర్చి భావిస్తున్న సమయంలోనే విష్ణుమాయా ప్రభావంతో వారిద్దరూ సత్యలోకంలో కలుసుకున్నారు. సరస్వతి యథాస్థితిలో బ్రహ్మను చూసి, అది విష్ణుమాయా విలాసకేళిగా తెలుసుకుంది. విష్ణుమహిమను గుర్తించి, విష్ణుధ్యానం చేసే వారికి కష్టాలు తొలగిపోతాయని సరస్వతి పాత్రవలన తెలుస్తుంది. అహంకార పరుడైన బ్రహ్మకు సరస్వతి విష్ణువును ప్రార్థించడం వలననే మోహభ్రాంతి తొలగింది. సాత్త్విక‌ భక్తితో తనను సేవించిన వారిని శ్రీమహావిష్ణువు కాపాడుతాడని సరస్వతి పాత్ర వలన వెల్లడవుతుంది.

మాయికుడు

శ్రీమహావిష్ణువు బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి మాయికుడు అనే ముని రూపాన్ని ధరించాడు. మాయికుడు గాఢాంధకారంలో బ్రహ్మ ముందు ఎర్రని జటలతో చుట్టిన కిరీటం వంటి మౌళితో, చెవిలో అక్షమాలికతో, దండత్రయాన్ని ధరించి, కమండలం, విభూతి ధరించిన శరీరంతో, మెడలో జంధ్యం ధరించి, కాషాయ వస్త్రాలు, ఊర్ధ్వపుండ్రాలూ ధరించి సూర్యునిలాగ వెలుగుతూ (3-80) కనిపించాడు. మాయికుడు బ్రహ్మను చూసి, 'ఎక్కడినుండి వస్తున్నారు. ఈ గాఢతమస్సులో ఉండటానికి కారణమేమి, ఊరేమిటి, పేరేమిటి' అని అడిగాడు. మాయికుడు బ్రహ్మ వృత్తాంతం విని అతనితో, కులశీలం కలిగిన మనుషులను, కీర్తివంతులను, అభిమానధనులను, ధర్మపాలకులను, వ్రతదాన మహిమా ప్రవర్ధనశీలురు అయిన వారితో తాను కలిసి ఉంటానని తెలిపాడు. మాయికుడు కులగోత్ర హీనతతో ఉండే వారిని కలలో కూడా

తాను స్పృశించనని తన స్వభావాన్ని తెలిపాడు. అతడు బ్రహ్మను ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. మాయికుడు బ్రహ్మకు మునికన్య చేత సపర్యలు చేయించి, మాయికుడు బ్రహ్మ ఆమె మోహంలో తగుల్కొనేలా చేశాడు. మాయికుడు మునికన్య గుణ గణాలు బ్రహ్మ ముందు వర్ణించి, ఆమె బ్రహ్మను వివాహం చేసుకుంటుందని తెలిపాడు. మాయికుడు తన మాటలతో బ్రహ్మకు రోషాన్ని కలిగించి, అతడు మునికన్య చేత పరాభవాన్ని పొందేలా చేశాడు. ఈ విధంగా మాయికుడు బ్రహ్మను పొగిడి, అతడు మునికన్య మోహంలో తగుల్కొనేలాగ చేసి గర్వభంగం కలిగించాడు. బ్రహ్మ గర్వభంగానికి ప్రేరేపకంగా మాయికుని పాత్ర కల్పించబడిందని చెప్పవచ్చు.

మునికన్య

ఈ మునికన్య మాయికుని మానసపుత్రిక. ఈమె బ్రహ్మకు గర్వభంగం కలిగించడానికి విష్ణువు చేత కల్పించబడిన మాయాకన్య. మునికన్య మాయికుని శిక్షణలో పెరిగింది. చిన్ననాటినుంచే నియమంగా సకల శాస్త్రాలు నేర్చుకుంది. గొప్ప తపోవిద్యను అభ్యసించింది. యోగవిద్యలను సహజంగానే నేర్చుకొని, అష్టసిద్ధులను సాధించింది. మునికన్య సౌందర్యం బ్రహ్మకే మరులు కలిగించింది. మునికన్య స్వయంభువుగా లోకాలను పాలించే వాడిని వివాహం చేసుకుంటానని బ్రహ్మకు తెలిపింది. మునికన్య బ్రహ్మ మాటలు విని, అతడి గర్వాన్ని చులకన చేసింది. బ్రహ్మ సృష్టించిన వారిలో మునికన్య కూడా ఉంటే, ఆమెగురించి అతడికి ఎందుకు తెలియలేదని ప్రశ్నించింది, మునికన్య పూర్వం ఆమె చూసిన బ్రహ్మాండం గురించి బ్రహ్మకు వర్ణించి చెప్పింది. ఆమె తన యోగమాయతో పుష్పక విమానంలో బ్రహ్మను వెంట తీసుకువెళ్లింది. మునికన్య తన చెలికత్తెలతో ఇతడు బ్రహ్మదేవుడు, స్వయంభువు బ్రహ్మాండాన్ని పాలించేవాడు అని చెప్పి మర్మంగా అవహేళన చేసింది. మునికన్య విష్ణుమాయా కల్పితమైన బ్రహ్మాండాన్ని చేరుకుని, బ్రహ్మను అష్టముఖ బ్రహ్మ ముందు నిలిపింది. మునికన్య బ్రహ్మకు ఆతడి అల్పత్వాన్ని తెలిపి, విష్ణుమాయా మహిమను లోకానికి వెల్లడించింది. ఈ మునికన్య పాత్ర బ్రహ్మకు విష్ణుమాయా ప్రభావాన్ని తెలిపి, గర్వభంగం కావించడానికి కల్పించబడిందని తెలుస్తుంది. మునికన్య బ్రహ్మతో చేసిన వాదన ఆమె శాస్త్రజ్ఞానాన్ని తెలుపుతుంది. పుష్పక విమానంలో బ్రహ్మను మరొక బ్రహ్మాండానికి తీసుకువెళ్ళడం మునికన్య యోగవిద్యా ప్రభావానికి నిదర్శనం. ఈ విధంగా విష్ణుమాయా మహిమను లోకానికి ప్రకటించేందుకు మునికన్య పాత్ర చక్కని సాధనమైందని చెప్పవచ్చు.

నారదుడు

నారదుడు దేవముని, నిరంతరం నారాయణనామాన్ని ధ్యానించు పరమ భాగవతోత్తముడు. నారదుడు ఒకనాడు ద్వారకానగరానికి వచ్చి శ్రీకృష్ణుని ఆతిథ్యాన్ని

పొందాడు. నారదుడు శ్రీకృష్ణునితో, బ్రహ్మాదిదేవతలు కూడా తరించలేరని విష్ణుమాయను తాను మాత్రమే జయించినానని పలికాడు. నారదుడు శ్రీకృష్ణునితో కలిసి రైవతగిరి విహారానికి వెళ్ళాడు. నారదుడిని చూసి పౌరకాంతలు, పూర్వం పారిజాతపుష్పం రుక్మిణికి ఇచ్చి కలహం కలిగించిన ముచ్చుతపసి వల్ల నేడు మళ్ళీ ఏ కలహం పుడుతుందో అని దూషణ చేశారు. రైవతగిరి వనంలో విహరిస్తున్న నారదుడికి విష్ణుమాయా ప్రభావంతో కొలనులో స్నానం చేయాలనే కోరిక కలిగింది. ఆ కొలనులోని నీరు సిద్ధ రసమని శ్రీకృష్ణుడు నారదుడికి తెలిపాడు. ఆ కొలనులో మునిగి నారదుడు విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖ అనే స్త్రీ రూపాన్ని పొందాడు.

చంద్రరేఖ యమునాతీరంలో వనవిహారం చేస్తూ, ఆ రాజ్యాన్ని పరిపాలించే చంద్రకేతుడనే రాజును వరించింది. చంద్రరేఖ చంద్రకేతునితో మయాసంసారాన్ని చేసి అరవైమంది కుమారులను పొందింది. చంద్రరేఖ రూపంతో నారదుడు మాయాసంసారం చేస్తూ పూర్వకర్మఫలాన్ని అనుభవించాడు. శత్రురాజుతో జరిగిన యుద్ధంలో చంద్రకేతుడు, చంద్రరేఖ అరవైమంది కుమారులూ మరణించారు. చంద్రరేఖ రణభూమిలో మరణించిన భర్త, కుమారుల శవాలను చూసి తలను మోదుకుంటూ, రొమ్ముగుద్దుకొంటూ, దిక్కులు పిక్కటిల్లేలా దుఃఖించింది (5-172) విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖకు ఆకలిబాధ కలిగింది. చంద్రరేఖ ఆ సమీపంలోని చింతచెట్టు చిగుళ్ళు అందుకోవాలని భర్త, కుమారుల శవాలను గుట్టగా పేర్చింది. ఎంత ప్రయత్నించినా చింతచిగుళ్ళ అందకపోవడంతో చంద్రరేఖ ఆకలి బాధతో విలపించసాగింది. అప్పుడు శ్రీకృష్ణుడు వేదబ్రాహ్మణుని రూపంలో వచ్చి చంద్రరేఖను కొలనులో శుచిగా స్నానం చేసి రమ్మని చెప్పాడు.చంద్రరేఖ ఒక చేతిని పైకి ఉంచి కొలనులో మునిగింది. కొలనులో మునిగిన చంద్రరేఖ నారదుడిగా మారింది. నారదుడు తన చేతికి ఉన్న బంగారు కంకణాన్ని, స్త్రీ చేతినీ చూసి జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకున్నాడు. నారదుడు విష్ణుమాయను జయించాననే అతని అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు. నారదుడు స్త్రీ రూపంతో తాను పొందిన భంగపాట్లను తలచుకొని, విష్ణుమాయను తరించడం ఎవరికీ సాధ్యంకాదని గ్రహించాడు. నారదుడు అహంకారమే అన్ని కష్టాలకూ మూలమని గ్రహించి, విష్ణుమాయా మహత్వాన్ని తెలుసుకొని తరించాడు. ఈ విధంగా అహంకారపరులు ఎంతటి భక్తాగ్రేసరులు అయినా విష్ణుమాయనుంచి తప్పించుకోలేరని నారదుని పాత్ర వలన తెలుస్తుంది.

చంద్రకేతుడు

చంద్రకేతుడు సత్యక నగరాన్ని పరిపాలించే సూర్యవంశపు మహారాజు. ఒకనాడు చంద్రకేతుడు యమునానది తీరానికి వేటకు వెళ్ళాడు. అక్కడ వనవిహారం చేస్తున్న మునికన్య చంద్రరేఖను వరించి, వివాహం చేసుకున్నాడు. చంద్రకేతుడు చంద్రరేఖతో

కూడి అమరసుఖాలను అనుభవించాడు. చంద్రకేతుడు చంద్రరేఖ వలన అరవైమంది కుమారులను పొందాడు. చంద్రకేతుడు భార్యా మోహితుడై సర్వం మరిచి సుఖస్థితిలో ఉన్నప్పుడు పృథుబాహుడు అనే శత్రురాజు దాడిచేశాడు. చంద్రకేతుడు తన అరవైమంది కుమారులతో కలిసి పృథుబాహుడిని రణరంగంలో ఎదుర్కొన్నాడు. చంద్రకేతుడు రణరంగంలో శత్రువుతో భీకరంగా యుద్ధంచేసి వీర మరణాన్ని పొందాడు. ఈ విధంగా చంద్రకేత మహారాజు పాత్ర నారదగర్వ భంగానికి ప్రధాన సాధనంగా కల్పించినట్లుగా కనిపిస్తుంది. చంద్రకేతుడు కన్యగా మారిన నారదుడిని వివాహం చేసుకొని, ఆ కన్యతో మాయా సంసారాన్ని సాగించి అరవైమంది కుమారులను పొందాడు. చంద్రకేతుని మరణం వలన నారదునికి పూర్వ కర్మఫలం అనుభవించే అవకాశం కలిగింది. అందుచేత చంద్రకేతుడు నారదుని కథలో ప్రధానపాత్ర వహిస్తున్నాడని చెప్పవచ్చు.

అప్రధాన పాత్రలు

కథలో సందర్భవశాన కనిపించి, కథాగమనంలో తమవంతు సహకారాన్ని అందించేవి అప్రధాన పాత్రలుగా భావించవచ్చు. కథాగమనాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావితం చేయడం కూడా ఈ అప్రధాన పాత్రల వలన జరుగుతుంది. వేంకటకవి విష్ణుమాయా విలాసంలో దేవతలు రాక్షసులు, నరనారాయణులు, అష్టముఖబ్రహ్మ, భర్ముడు, ధర్ముడు, అనే అప్రధాన పాత్రలు కనిపిస్తున్నాయి.

దేవతలు, రాక్షసులు

దేవతలు, రాక్షసులు అమృతం కోసం క్షీరసాగరాన్ని మథించడానికి పూనుకున్నారు. వారు ముందుగా మందర పర్వతాన్ని పెకలించడానికి ప్రయత్నించి, సింహనాదాలు చేస్తూ, మల్లయోధుల లాగ ప్రవర్తిస్తూ, భుజబలాన్ని ప్రదర్శించడానికి ఉవ్విళ్ళూరుతూ ఆర్భాటం చేశారు. దేవతలు, రాక్షసులు మందరపర్వతాన్ని ఇసుమంతైనా కదల్చలేక భంగపాటును పొందారు. ఆ తర్వాత క్షీరసాగరంలో వేయగానే మందర పర్వతం మునిగిపోతుంటే, దేవతలు, రాక్షసులు, ఆహా! పర్వతం క్రుంగిపోతుంది. దానిని నిలిపి, తమను కాపాడుమని విష్ణువును ప్రార్థించారు. క్షీరసాగరాన్ని మథిస్తూ దేవతలు, రాక్షసులు ఉత్సాహంగా ఏలలు పాడుతూ, కేకలువేస్తూ, హేలాగతిగా గంభీర అట్టహాసాలు చేశారు. వారు క్షీరసాగరం నుంచి కాలకూటవిషం పుట్టగానే హాహాకారాలు చేస్తూ పరుగులు తీశారు. అమృతం లభించగానే దేవతలు, రాక్షసులు మందరపర్వతాన్ని తిరిగి యథాస్థానంలో ఉంచి వచ్చారు. దేవతలు, రాక్షసులు లక్ష్మీ నారాయణులకు కళ్యాణం చేశారు. చివరకు అమృతం కోసం వారిలో వారు కలహించుకున్నారు. దేవతలు ప్రార్థించగా మాయామోహిని అవతరించి, అమృతాన్ని వారికి పంచింది. రాక్షసులు మోహిని వలన మోసపోయి, బలిచక్రవర్తిని దేవతలమీదికి యుద్ధానికి

పురిగొల్పారు. దేవతలు నరనారాయణులను శరణువేడి బలిచక్రవర్తి బారినుంచి తప్పించుకున్నారు. ఈ విధంగా దేవతలు, రాక్షసులు అమృతం సంపాదించడానికి, విష్ణువు మోహినీ అవతారం ధరించడానికి కారణమైనారని చెప్పవచ్చు.

నరనారాయణులు

నరనారాయణులు బదరీవనంలో తాపసవృత్తిలో ఉన్న మునులు. వారు పింగళ జటామకుటాలు ధరించినవారు, ఆజానుబాహులు, అమితబలులు. నరనారాయణులు శరణాగత రక్షకులు, సమరాంగణ భీమసాహసులు. నరనారాయణులను ఇంద్రుడు వచ్చి బలిచక్రవర్తి బారినుండి కాపాడమని శరణుకోరాడు. వారు ఇంద్రుడికి అభయం ఇచ్చారు. నరనారాయణులు యుద్ధరంగంలో బలిచక్రవర్తితోను, రాక్షస వీరులతోనూ భీకరంగా పోరాడారు. యుద్ధంలో నరనారాయణులు రాక్షససైన్యాన్ని నిర్వీర్యం చేసి, బలిచక్రవర్తిని నిరాయుధుడిని చేశారు. వారు రణరంగం నుంచి బలిచక్రవర్తిని తరిమి కొట్టి, రాక్షససైన్యాన్ని నిర్మూలనం చేశారు. దేవదానవ యుద్ధంలో నరనారాయణులు ఇంద్రునికి విజయాన్ని కలిగించి, బదరీవనానికి తిరిగి వెళ్ళిపోయారు. ఈ విధంగా నరనారాయణులు తాపసుల అయినప్పటికీ శరణాగతులను రక్షించడానికి యుద్ధం చేయడానికి కూడా వెనుకాడరని తెలుస్తుంది. విష్ణుభక్తుడైన ఇంద్రుడిని కాపాడి, దుష్టులైన రాక్షసులకు పరాభవాన్ని కలిగించడం వలన నరనారాయణుల తపోమహిమ వెల్లడవుతుంది. ఈ నిదర్శనం వలన నరనారాయణులు శ్రీమహావిష్ణువు అంశకలిగిన వారని తెలుస్తుంది.

అష్టముఖ బ్రహ్మ

అష్టముఖ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మకు గర్వభంగం కలిగించి, అతడికి విష్ణుమాయా మహిమను తెలుపడానికి కల్పించిన పాత్ర. విష్ణుమాయా కల్పితమైన మరొక బ్రహ్మాండంలో అష్టముఖ బ్రహ్మ సృష్టినిర్మాణం చేస్తున్నాడు. అష్టముఖ బ్రహ్మ మునికన్య వెంట వచ్చిన బ్రహ్మను చూసి, విష్ణుమాయను చులకన చేసినందుకు అతడిని దూషించాడు. అష్టముఖ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మతో, పూర్వం తాను కూడా దుర్నీతి వలన మోసపోయి గర్వాన్ని పొందాడని తెలిపాడు. అష్టముఖ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మకు భర్మడనే ముని వృత్తాంతాన్ని తెలిపి, విష్ణుమాయా మహిమను అతడికి వినిపించాడు. అష్టముఖ బ్రహ్మ హరిభక్తి లేనివాడు నీచుడని తెలిపి, చతుర్ముఖ బ్రహ్మకు చేటుకాలం దాపురించిందన్నాడు. అందుచేతనే చతుర్ముఖ బ్రహ్మ విష్ణుమాయను నిందించాడని అన్నాడు. అష్టముఖ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మను చూసి, విష్ణునింద చేసిన వీని ముఖం చూస్తే కలిగిన పాపం పదివేల అశ్వమేధ యాగాలు చేసినా పోదని అన్నాడు. ఈ విధంగా అష్టముఖ బ్రహ్మ చతుర్ముఖ బ్రహ్మకు విష్ణుమహిమను తెలిపి, అతడి అల్పత్వాన్ని తెలియపరిచాడని చెప్పవచ్చు. బ్రహ్మ గర్వభంగానికి అష్టముఖ బ్రహ్మ కూడా ఒక ప్రధాన కారణంగా కనిపిస్తున్నాడని ఈ పాత్ర వలన తెలుస్తుంది.

భర్ముడు

భర్ముడు సౌమ్యుడు అనే ముని కుమారుడు. భర్ముడు బ్రహ్మవేత్త, యోగ విద్యాదురంధరుడు. భర్ముడు శోణకుడు అనే ముని ఆశ్రమంలో శిష్యరికం చేసి, గురువును మెప్పించాడు. భర్ముడు చేసిన శుశ్రూషకు మెచ్చి శోణకుడు అతడికి నారాయణ మంత్రాన్ని ఉపదేశించాడు. భర్ముడికి విష్ణువు ఎవరనే సందేహం కలిగింది. దానికి సమాధానం భర్ముడు తన గురువైన శోణకుడి వలన తెలుసుకున్నాడు. భర్ముడు తన కంటికి కనిపించే ప్రపంచమంతా విష్ణుమాయా కల్పితమని గ్రహించాడు. అతడు మందరగిరి గుహలో విష్ణుధ్యానంలో మునిగి, శరీరాన్ని మరిచిపోయాడు. భర్ముడు సశరీరంగా తపోనిష్ఠతో శ్రీమహావిష్ణువును ధ్యానిస్తుండగా, తొమ్మిది మంది బ్రహ్మలు కాలగర్భంలో కలిసిపోయారు. ఈ భర్ముడే అష్టముఖ బ్రహ్మకు విష్ణుమహిమను తెలిపి, అతడి దుర్నీతిని మాన్పించాడు. ఈ విధంగా విష్ణుపాదాలను నిష్ఠతో ధ్యానించే వారికి చిరంజీవత్వం లభిస్తుందని భర్ముని పాత్రవలన తెలుస్తుంది.

ధర్ముడు

ఈ ధర్ముడు భర్మునికి సోదరుడు, శోణకుడి ఉపదేశించిన అష్టాక్షరీ మంత్రాన్ని జపించి, శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొందాడు. ధర్ముడు విష్ణువు వలన బ్రహ్మ పదవిని పొందాడు. ధర్ముడు సృష్టికర్తగా ముల్లోకాధిపత్యం వహించి, తమోగుణ కలితుడైనాడు. అతడు కొలువులో శివకేశవులలో అధికులు ఎవరిని వాదం కలిగింది. అప్పుడు ధర్ముడు తమకించి, హరి ఏ విధంగా లోకాన్ని కాపాడును, శివుడు ఏరీతిగా లోకాలను హరించును అని తన మహిమను పొగడుకున్నాడు. ధర్ముడు 'విష్ణువెంతవాడు' అని విష్ణుమహిమను ధిక్కరించాడు. దానికి ఫలితంగా ధర్ముడు విష్ణుశర్మ వలన వానరుడిగా జన్మించాలనే శాపాన్ని పొందాడు. మానవుడుగా జన్మించిన ధర్ముడు విష్ణువును ధ్యానించి బ్రహ్మ పదవిని, దైవత్వాన్ని పొందాడు. కాని పదవి వలన గర్వించి, విష్ణుమాయను నిందించి శాపగ్రస్తుడైనాడు. అందుచేత ఎంతటి తపస్సంపన్నులైనా విష్ణుమాయను నిందిస్తే తగువిధంగా భంగపాటును పొందక తప్పదని ఈ ధర్ముని పాత్ర వలన తెలుస్తుంది. ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన విష్ణుమాయా విలాసంలోని కథలలో ప్రస్తావనా మాత్రంగా కనిపించే మరికొన్ని పాత్రలు ఈ విధంగా కనిపిస్తున్నాయి. ద్వితీయాశ్వాసంలో లక్ష్మీనారాయణుల కళ్యాణం సందర్భంగా అప్సరకాంతలు, దేవమునులు మొదలైన వారందరూ వచ్చి శ్రీమహావిష్ణువును కీర్తించారు.

దేవతలు, రాక్షసులకు జరిగిన యుద్ధంలో అష్టదిక్పాలకులతో ఎనిమిదిమంది రాక్షసవీరులు యుద్ధం చేశారు. శివుడు వైకుంఠానికి వెళ్ళినప్పుడు, ద్వారపాలకులైన జయ విజయులు అతడిని విష్ణువు దగ్గరకు తోడ్కొని తీసుకువెళ్ళారు. మోహినీ స్పర్శ వలన శివుడికి మదన పారవశ్యంతో శుక్లపతనం అయినప్పుడు సద్యోగర్భంతో కాలభైరవుడు జన్మించాడు. తృతీయాశ్వాసంలో భర్ముడు, ధరుడికి సౌమ్యుడనే ముని

తండ్రిగాను, శోణకుడు అనే ముని గురువుగానూ కనిపిస్తున్నారు. ధర్ముని కొలువులో శివకేశవులను గురించిన వాదంలో శివశర్మ, విష్ణుశర్మలు ఉన్నారు. బ్రహ్మకు గర్వనాశనం చేయడానికి విష్ణువు సత్యలోకంలో చింతామణి సింహాసనం మీద కపటబ్రహ్మను కల్పించాడు. చతుర్థాశ్వాసంలో రైవతగిరి వనంలో రుక్మిణి, సత్యభామలు పుష్పాపచయం చేస్తూ విహరిస్తారు. రైవతగిరి నుంచి బోయవాళ్ళువచ్చి శ్రీకృష్ణునికి కానుకలు ఇస్తారు. చంద్రకేతుడిని వేటకు ఆహ్వానించడానికి ఎరుకలవారు కానుకలతో వస్తారు. చంద్రకేతునికి చంద్రరేఖతో అతని మంత్రి వివాహం కుదిర్చాడు. చంద్రరేఖను సంరక్షించింది మాయకాంత రూపంలోని శ్రీకృష్ణుడు. పంచమాశ్వాసంలో పృథుబాహుడు చంద్రకేతునిపైకి దండెత్తి వచ్చిన శత్రురాజు. చంద్రకేతుని అరవైమంది కుమారులు యుద్ధంలో అతనికి సహాయం చేశారు. చంద్రరేఖకు శుచిగా స్నానంచేసి రమ్మని సలహా ఇచ్చింది వేదబ్రాహ్మణుడి రూపంలోని శ్రీకృష్ణుడు. ఈ విధంగా ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన విష్ణుమాయా విలాసంలో విభిన్నమైన మనస్తత్వాలతో, వైవిధ్యభరితమైన రీతిలో పాత్రలు కనిపిస్తున్నాయని చెప్పవచ్చు.

## 5.2. రసదర్శనము

రసవిశిష్ఠములైన వర్ణనలన్నీ ప్రబంధింపబడిన రచన మహాప్రబంధం అవుతుంది. శ్రోతకు రసానందాన్ని కలిగించడమే కావ్యరచనకు పరమోద్దేశం. శ్రోత రసమూర్తి అయినప్పుడు కావ్యంకూడా రసోత్కృష్టమయం కావాలి. కావ్యగతమైన రసవర్ణనలకు నాయకుడు ప్రధాన ఆలంబన అవుతాడు. నాయక లక్షణాలను అనుసరించి ధీరోదాత్తుడు కావ్యనాయకుడు అయితే, ఆ కావ్యంలో రసం వీరమవుతుంది.

"ధీరోదాత్త- ధీరోద్ధత-ధీరలలిత-ధీరశాంతా ఉత్సాహం,

క్రోధ, కామినీరతి, నిర్వేద ప్రధానా" (కోటేశ్వరరావు, తుమ్మపూడి. 1971.8)

వీరరసానికి స్థాయీభావం ఉత్సాహం. అందువలన ధీరోదాత్తుడు ప్రధానంగా ఉత్సాహాత్మకుడై ఉండాలని తెలుస్తుంది. "ధీరోదాత్తుడను నాయకుడెల్లప్పుడును వీరరసార్హుడై యుండవలయును" (కోటేశ్వరరావు, తుమ్మపూడి. 1971.8)

విష్ణుమాయా విలాస కావ్యనాయకుడు ధీరోదాత్తుడు. కాబట్టి ఇక్కడ రసం వీరమవుతున్నది. అయితే వీరరసం శృంగారరస పార్యంతికంగా కూడా భావించబడు తుంది. లోకంలో ఏ స్త్రీ అయినా ఉత్సాహవంతుడు, లోకోత్తర క్రియాచణుడూ అయిన మహావీరుడినే వరిస్తుంది. అందువలన లోకోత్తర గుణాలు కలిగిన మహావీరుడు కావ్య నాయకుడైనప్పుడు ఆ కావ్యంలో అంగిరసం శృంగారం, అంగరసం వీరం అవుతుంది. విష్ణుమాయా విలాసకావ్యాలలో అంగి, అంగరసాలు ఏవిధంగా పోషించబడ్డాయో ఈ రసదర్శనం నందు సమన్వయించబడుతుంది.

5.2.1. అంగిరసం

కావ్యంలో ప్రధానంగా వర్ణించిన రసాన్ని అంగిరసంగా చెప్పుకోవచ్చు. నవరసాలలోని ఏదైనా ఒకరసం కావ్యంలో ప్రధానంగా పోషించబడి, తక్కినవి అంగరసాలుగా రసపుష్టికి తోడ్పడతాయి. కావ్యంలో శృంగార, వీర రసాలలో ఏదో ఒకటి అంగిరసంగా ఉండవచ్చు. శృంగారం అంగిరసమైతే వీరం అంగరసమవుతుంది. భగవంతుడు ధర్మసంస్థాపన కొరకు ప్రతియుగంలోనూ అవతరిస్తానని భగవద్గీతలో పలికాడు. లోకరక్షణకు భగవంతుడిని ప్రేరేపించేది, అతడిలోని దయాగుణమేనని మనం గ్రహించాలి. ఈ దయాగుణమే భగవంతుడిని వీరరసార్హ నాయకుడుగా చేస్తున్నది. వీరరసం ఎల్లప్పుడూ శృంగార రసం నుండి అంతర్భవిస్తుంది. అందువలన విష్ణుమాయా విలాస కావ్యాలలో అంగిరసం శృంగారమని, అంగరసం వీరమనీ తెలుస్తుంది.

శృంగార రసం

నవరసాలలో సర్వజనులకూ ఆహ్లాదాన్ని కలిగించేది శృంగారరసం. కావ్యాలలో వర్ణించే శృంగార రస విభావాదికాలను లోకంలోని ప్రతి ఒక్కరూ గుర్తించగలరు. అయితే శృంగారం అనగానే కావ్యాలలో కవులు వర్ణించేటువంటి నాయిక అంగాంగ వర్ణనలు మాత్రమే అని భావించరాదు. కేవలం శారీరక వ్యామోహం వలన కలిగిన లౌకిక శృంగారం, కావ్యాలలో కవులు వర్ణించే శృంగారంతో సమానంకాదు. మహాకవులు కావ్యాలలో వర్ణించేది అలౌకి శృంగారమని గమనించాలి. ఉదాత్తులు, ఉజ్జ్వల వేషధారులు అయిన స్త్రీపురుషులు అన్యోన్య విలీనత్వంతో సుఖించిన ఒకానొక ద్వంద్వాతీత స్థితిని కావ్యంలో వర్ణించడాన్ని శృంగారంగా భావించాలి. శృంగార రసానికి నాయికా నాయకులు ఆలంబన విభావాలు. వారి రూపయౌవన హావభావాలు, నూపురాంగహారాలు, మలయానిల చంద్రికాదులు అనేవి ఉద్దీపన విభావాలు. నాయికా నాయకుల భావహావహేలలు, లీలావిలాసాలు, భ్రూతారానన దృగ్వ్యంసనాలు అనేవి అనుభావాలు. ఆలస్యము, ఉగ్రత, జుగుప్స తప్ప మిగిలిన ఇరవై వ్యభిచారీభావాలు శృంగారరసంలో కనిపిస్తాయి.

శంగారరసం ప్రధానంగా విప్రలంభం, సంభోగం అని రెండు విధాలుగా ప్రవర్తిల్లుతుంది. వివాహపూర్వకమైన అభిలాష విప్రలంభంలో, అభిలాష–చింతన–స్మృతి –గణకథనం–ఉద్వేగం–ప్రలాపం–ఉన్మాదం–వ్యాధి– జడత–మృతి అనే దశావస్థలు ఉన్నాయి. శృంగార రసానికి స్థాయీ భావం రతి. స్త్రీ పురుషులు యొక్క అన్యోన్యమైన ఆలంబన గల ప్రేమ అనే చిత్తవృత్తి విశేషాన్ని 'రతి' అని అంటారు. "తత్ర స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః, ప్రేమాఖ్య శ్చిత్తవృత్తి విశేషోరతిః స్థాయిభావః" (రామరాజభూషణుడు. 1976.320) రతి అవస్థలు ఐదు రకాలుగా ఉంటాయి.

ఈ ఐదు రకాల అవస్థలలోనూ రతి ఐదురకాల పేర్లతో పిలువబడుతుంది. అంకురావస్థలో 'ప్రేమ' అని, పల్లవావస్థలో 'మానం' అని కలికావస్థలో 'ప్రణయం' అని, పుష్పావస్థలో 'స్నేహం' అని, ఫలావస్థలో 'రాగం' అనే విధంగా పిలువబడుతుంది. "అంకుర పల్లవ కలికాప్రసూన ఫలభోగ భాగియం క్రమశః ప్రేమామానః ప్రణయః స్నేహెూరాగో-నురాగశ్చ" (రామరాజభూషణుడు. 1976. 320) అలంకారికుల మతాన్ని అనుసరించి కావ్యంలో మొదటగా రతిని నాయికపరంగానే వర్ణించాలి. నాయికానాయకుల పరస్పరానురాగం తర్వాత వివాహాన్ని, సంభోగాన్ని వర్ణించడం కనిపిస్తుంది.

5.2.1.1. చింతలపూడి ఎల్లనార్యుడు - శృంగారరస నిర్వహణ

ఎల్లనార్యుడు తన కావ్యంలో సంభోగ, విప్రలంభ శృంగారాలు రెండింటినీ వర్ణించాడు. సంభోగ శృంగారాన్ని అన్నిచోట్లా వాచ్యం చేయకుండా సూచించి మాత్రం వదిలివేశాడు. బ్రహ్మ గర్వభంగ కథలో మాత్రం మాయాసరస్వతి, బ్రహ్మల మధ్య సంభోగాన్ని వాచ్యం చేశాడు. శివదర్పభంగం కథలో విప్రలంభ శృంగారాన్ని విశేషంగా వర్ణించాడు.

సంభోగ శృంగారం

సత్యభామ, శ్రీకృష్ణుడు ఈ కావ్యంలో శృంగార రసపోషణకు ఆలంబన అయిన నాయికా నాయకులు. వారు ఉజ్జ్వల వేషధారులు, రూపయౌవన విలాసులు. రూప యౌవనము చేత వారిద్దరూ రతికేళికి ప్రేరేపితులైనారు. చంద్రకాంత శిలలతో కూడిన తెల్లని మణిమండపాలు, వాటిలోని కోమలమైన పుష్పడోలికలు మొదలైనవన్నీ సత్యభామ, శ్రీకృష్ణుల మధ్య శృంగార రసోద్దీపనకు కారణమైనవి. "దళమగు రూపయౌవన మదంబున బైకొని చంద్రపాదని ర్మల కలధౌతసౌధమణి మంటపకోమల పుష్పడోలికా" (1-139) రసోద్దీపకమైన అటువంటి ఏకాంత సమయంలో శ్రీకృష్ణునితో సత్యభామ రతికేళిలో ఉన్నదని ఎల్లనార్యుడు సంభోగశృంగారాన్ని సూచ్యం చేశాడు.

"..ఁబద్మలోచనుడు దానును రమించుచు సత్యభామతాఁ
దలచె మదీయ కేళికినితండె ప్రియుండని నెమ్మనంబునన్" (1-139)

సంభోగం తర్వాత సత్యభామ రతిపారవశ్యంతో శ్రీకృష్ణుని పలుమార్లు చూసింది. అతడి శృంగార చేష్టలను తలచుకొని పులకించింది. సత్యభామ రతివలన కలిగిన సుఖపారవశ్యంతో శ్రీకృష్ణుని కౌగిలించుకుంది. సత్యభామకు కలిగిన ఈ శృంగార చేష్టలన్నీ అనుభావాలుగా కనిపిస్తున్నాయి.

"తిలకించుచు పులకించుచుఁ, ద్గళితోత్కట పారిజాత గంధం బెసగన్" (1-141) సత్యభామ రతికేళి తర్వాత మందహాసంతో తన శయ్యనుంచి దిగగానే ఆమె జడముడి వీడిపోయింది, పయ్యెదజారిపోయింది. సత్యభామ ఎర్రబడిన కన్నులతో, గోరుగాట్లతో

నిండిన మర్మప్రదేశాలతో, సురతకేళి వలన తమకించు శరీరంతో శ్రీకృష్ణుని శరీరాన్ని ఊతగా పట్టుకొన్నది. ఈ రీతిగా సంభోగ చిహ్నాలతో శ్రీకృష్ణుని కూడి ఉన్న సత్యభామ దేహస్థితి వర్ణనలు ఇక్కడ వ్యభిచారీ భావాలుగా కనిపిస్తున్నాయి.

"..యరజారెడు వేణియు మందహాసమున్,

బయ్యెద జీరుపాటు నవపాటలితాక్షులు మర్మసీమలన్" (1-142)

ఈ విధంగా ఎల్లనార్యుడు సత్యభామ శ్రీకృష్ణుల సంభోగ శృంగారాన్ని కేవలం మూడు పద్యాలలో సూచనప్రాయంగా మాత్రమే వర్ణించాడు. శ్రీకృష్ణునితో రుక్మిణీదేవి సంభోగ శృంగారాన్ని కూడా కేవలం రెండు పద్యాలలో మాత్రమే సూచించి విడిచిపెట్టాడు.

"సుమనోనిర్మిత హర్మ్య నిర్మల శశి జ్యోత్స్నా రసస్వచ్ఛ" (1-157) అనే పద్యంలో రుక్మిణిదేవి శ్రీకృష్ణునితో రతి సంరంభాన్ని చాలించినట్లుగా పేర్కొన్నాడు.

"అంకుశనిర్భిన్న హస్తి కుంభములట్లు, కొనగోటి నొక్కుమల కుచములమర" (1-158) అనే పద్యంలో సంభోగచిహ్నాలతో కూడిన రుక్మిణీదేవిని వర్ణించాడు. అదేవిధంగా తృతీయాశ్వాసంలోని పుండరీకోపాఖ్యానంలో పుండరీకుడు బోయకాంతతో రమించడాన్ని కూడా కేవలం ఒక వాక్యంలోనే పేర్కొన్నాడు. పుండరీకుడు బోయకాంత సౌందర్యానికి తమకించినవాడై, మోహపారవశ్యంతో కౌగిలించుకొన్నాడు. ఆ నదీతీరంలోని పూపొదరిండ్ల మాటున పుండరీకుడు బోయకాంతతో సంభోగించాడు. "ఇట్లు మోహపరవశత్వంబున బ్రహ్మకులసంభవుండు సంభ్రమించి... మదవతినతి ప్రయత్నంబున నొయ్యన నెయ్యంబుగా దార్చికొని తన్నదీ సవిధ పుష్పిత లతానికుంజ క్రోడంబున నిధువన క్రీడలాచరించి తదనంతరంబ" (3-169)

పంచమాశ్వాసంలోని నారదగర్వభంగ కథలో చంద్రరేఖ, చంద్రకేత మహారాజుల సంభోగ శృంగారాన్ని ఎల్లనార్యుడు కేవలం ఒక్క మాటతోనే సరిపుచ్చినాడు.

"యాచంచలాక్షిని డాయంబోయి... కైకొని తన పురంబునకుంగొని పోయి యభిమత రతిక్రీడలందేలుచుండె..." (5-181)

ఈవిధంగా ఎల్లనార్యుడు సంభోగ శృంగారాన్ని వాచ్యం చేయకుండా మాధుర్యగుణంతో సూచన ప్రాయంగా మాత్రమే పేర్కొన్నాడు. ఎల్లనార్యుని కావ్యంలోని ఇటువంటి సూచ్యత శృంగార రసభావానికి మరింత వన్నెను చేకూర్చిందని చెప్పవచ్చు. ఎల్లనార్యుడు సంభోగ శృంగారాన్ని వాచ్యం చేసి వర్ణించిన సందర్భం ఒకటి మాత్రం తృతీయాశ్వాసంలో కనిపిస్తున్నది. బ్రహ్మగర్వభంగ కథలో మాయాసరస్వతి, బ్రహ్మ ఆలంబన విభావాలుగా, వారి మధ్య సంభోగ శృంగారం వర్ణించబడింది. విష్ణుమాయా ప్రభావంతో సరస్వతి చంద్రబింబం వంటి ముఖంతో మాయాసరస్వతిగా మారింది. ఎల్లనార్యుడు మాయాసరస్వతి సౌందర్యాన్ని,

"శ్రీమద హర్ముఖద్యుమణి చెల్వున నుజ్వల రాగరేఖం" (3-286)

అనే పద్యంలో పాదాల వర్ణనతో మొదలు పెట్టి పది పద్యాలలో (3-295.126 వరకు) అంగాంగ వర్ణన చేశాడు. మాయాసరస్వతి బ్రహ్మ ముందు కన్నీరు కారుస్తూ, కంపించిపోతూ, అంతలోనే నవ్వుతూ, పులకిస్తూ వీణను మీటుతూ పాడింది. ఆమె నవయౌవన మదోద్రొకంతో ఉప్పొంగుతూ, మన్మథ రసోల్లాసంతో రకరకాల శృంగార చేష్టలను(3-299) ప్రదర్శించింది.

మాయాసరస్వతి శృంగార చేష్టలన్నీ ఉద్దీపన విభావాలు కాగా, బ్రహ్మకు ఆమెమీద మోహం కలిగింది. ఆ తర్వాత ఎల్లనార్యుడు బ్రహ్మ చూసిన మాయాసరస్వతి శరీర వర్ణనను పాదాలు మొదలుకొని, ఫాలభాగం వరకూ ఒక వచనంలో వర్ణించాడు. "పల్లవచరణ రమణీయత్వంబును, నారంభోరుయూరు చారుభావంబును, నాపులిన జఘన జఘనత్వంబును...నాశీతాంశు ఫాల ఫాలభాగ పరభాగంబును, నానీలకచ కచనిచయ చాకచక్యంబును నాసుకుమారి సౌకుమార్యంబును..." (3-308) బ్రహ్మ మాయాసరస్వతిని తన కులపాలికగా భ్రమించి, ఆమెతో అనేక వేలసంవత్సరాలు సంభోగించాడు. అయినప్పటికీ బ్రహ్మకు తనివి చాలక, రతికేళి మీద ఉత్సాహం దినదినానికి పెరిగింది. బ్రహ్మ మాయాసరస్వతితో బహువిధ రతులతో క్రీడించినా తృప్తి పొందలేకపోయాడు. కామకేళీలోలుడైన బ్రహ్మ రతిక్రీడలకు ఓర్వలేక మాయాసరస్వతి నూరు రూపాలు ధరించింది. బ్రహ్మ ఆ శతరూపాలతో క్రీడించి శతానందుడయ్యాడు. "అట్లు శతరూప విలాసంబులం గరంగించిన యమ్మించు దీగెబోడియందు శతానందుండు ననేక సంవత్సరంబులు సురత సౌఖ్యంబనుభవించె" (3-332) ఈ విధంగా చింతలపూడి ఎల్లనార్యుడు తన కావ్యంలో సంభోగ శృంగారాన్ని వర్ణించిన తీరును గురించి చెప్పుకోవచ్చు.

విప్రలంభ శృంగారం

ఎల్లనార్యుడు విప్రలంభ శృంగారాన్ని శివదర్పభంగ కథలో విశేషంగా వర్ణించాడు. మాయా మోహిని సౌందర్యాన్ని చూసి మోహవివశుడైన శివుని విరహవేదన అంతా విప్రలంభ శృంగారంగా చెప్పుకోవచ్చు. ఇక్కడ శివుడు, మయామోహిని ఆలంబన విభావాలు కాగా విప్రలంభ శృంగారం పోషించబడింది. ఎల్లనార్యుడు మదనాంతకుడైన శివుడికే మరులు కలిగించడానికి ఉద్దీపనమైన మోహిని సౌందర్యాన్ని విశేషంగా వర్ణించాడు. ఎల్లనార్యుడు మాయామోహిని సౌందర్యం నిర్వికారుడైన శివుడికే శృంగారోద్దీపన కలిగించేలా ఉందని వర్ణించాడు. మోహిని చూపులు మన్మథుని వేయిపూలబాణాల వరుసలాగ ఉన్నాయి. ఆమె అందమైన ముఖం లక్ష పద్మములు ఒకేసారి వికసించినట్లుగా ఉంది. మోహిని శరీరకాంతి కోటి చంద్రులు ఒక్కసారి ఉదయించినట్లుగా ఉంది. ఆమె లావణ్య సంపద రతీదేవి శతకోటి మూర్తులు ధరించినట్లుగా ఉంది (4-204)

ఎల్లనార్యుడు మదన కామధేనువు లాగ సభలోకి ప్రవేశించిన మోహిని అంగాంగ సౌందర్యాన్ని ఒక వచనంలో విశేషంగా వర్ణించాడు. లత్తుక రసంతో ప్రకాశిస్తున్న పాదాలు మొదలుకొని, కేశపాశం వరకూ గల శరీర సౌందర్యాన్ని, "లత్తుకరసంబు జొత్తిల్లుచుం బ్రణయాపరాధ నాయకవక్ష స్తాడనప్రసాద దానశౌండంబులై వందనీయంబులైన యడుగు కెందమ్ములును, ... బారిజాత ప్రసూనగర్భ నిర్భరంబులై విరహి మర్మ భవనంబులై పెంజీకటి సిరులు నించు నింద్రనీల ఖండఖచిత మయూర పింఛమానంబైన సాలక కేశ పాశంబులను" (4-205) అంటూ విశేషంగా వర్ణించాడు. మోహిని జగదేక సౌందర్యానికి లోలుడై శివుడు ఆమె వెంట శృంగారవనంలోకి వెళ్ళాడు. ఆ మాయామోహిని శివుడికి మరులు కలిగించాలని రత్నపు తిన్నెపై, "పయ్యెద దిగజాఱఁ బసిడి చాయలుదేరు, చనుదోయి ముత్యాల సరమువెలుగ..." (4-239) పూబంతి ఆటఆడుతూ కనిపించింది. మోహిని తన చేతికి అందలేదని శివుడికి నిర్వేదం కలిగింది. శృంగారవనంలోని చెట్లు చేమలు అన్నీ మోహినిగానే శివుని కంటికి భ్రాంతిని కలిగించాయి.

'జిగిగుబ్బిపాలిండ్లఁ జేలాంచలంబును దొడలపై ముంగొంగు దొలగియాడ.." (4-249) తూగుటుయ్యేల ఊగుతున్న మోహిని శృంగార విలాసానికి శివుడికి మదనతాపం ఎక్కువయింది. మోహినిని శివుడు వెనుకనుంచి అందుకోబోగా అంతలోనే ఆమె మాయమైంది. మోహిని కనిపించలేదనే తలపుతో శివుడికి విరహోద్దీపన కలిగింది. జలక్రీడలాడుతున్న మోహినిని చూసిన శివుడు మదనాతురుడైనాడు. మోహిని శివుడిని దగ్గరకు రావద్దని వారించి మాయమైంది. మోహిని కనిపించక గుండెచెదిరిన శివుడు నిర్విణ్ణుడైనాడు. శివుడు విరహోన్మత్తుడై కన్నీరు కారుస్తూ, వికలమనస్కుడై మోహినిని చేరుకున్నాడు. శివుడు మోహినితో, మన్మథతాపంతో దహించుకుపోతున్న తన శరీరాన్ని కౌగిలించుకోమని వేడుకున్నాడు శివుడు విరహాన్ని భరించలేక దుర్వియోగంలో తగుల్కొని మన్మథుని చేత బాధించబడుతున్న తనను కౌగిలించుకోమని మోహిని పయ్యెదను పట్టుకున్నాడు.

"చిక్కితి దుర్వియోగమునఁ జిక్కితి చక్కెరవింటివానిచేఁ ..." (4-238) అంటూ శివుడు మోహినిని కౌగిలించుకోడానికి ప్రయత్నింగానే అతడికి శుక్లపతనమైంది. శివుడు, మోహిని ఆలంబనగా, మోహిని సౌందర్యం, శృంగార చేష్టలు ఉద్దీపనగా, శివుని విరహభావం, ఉన్మత్త చేష్టలు అనుభావాలుగా ప్రవర్తిల్లుగా ఇక్కడ విప్రలంభ శృంగారం వర్ణించబడిందని చెప్పవచ్చు. ఈవిధంగా ఎల్లనార్యుడు తన కావ్యంలో సంభోగ, విప్రలంభ శృంగారాలు రెండింటినీ వర్ణించాడని తెలుస్తుంది.

5.2.1.2. కంకంటి పాపరాజు - శృంగార రస నిర్వహణ

పాపరాజు రచించిన విష్ణుమాయావిలాస యక్షగానంలో శివదర్పభంగ కథ మాత్రమే గ్రహించబడింది. పాపరాజు ఇందులో విప్రలంభ శృంగారాన్ని మాత్రమే

వర్ణించాడు. కవి స్వీకరించిన కథా వృత్తాన్ని అనుసరించి ఇందులో సంభోగ వర్ణనకు అవకాశం లేదని చెప్పవచ్చు. శివుడు, మోహినీ కాంతల మధ్య విప్రలంభ శృంగార వర్ణన ఇందులో కనిపిస్తుంది. మోహినీ పరమేశ్వరులను ఇక్కడ శృంగార రసపోషణకు ఆలంబనగా చెప్పుకోవచ్చు. మోహినీ అవతార పరమార్థమే, మొదట దానవులను తన శృంగార విలాసవైఖరులతో మోసపుచ్చి, అమృతాన్ని సంగ్రహించడం కోసమని తెలుస్తుంది. శివుని ముందు నారదుడు చేసిన మోహినీకాంత సౌందర్య వర్ణన అంతా, శివుడికి మోహినిని చూడాలనే కోరికను ఉద్దీపింపచేయడానికి అని తెలుస్తుంది. వైకుంఠంలో శివుని ముందు నిలిచిన మోహిని అంగాంగ వర్ణన కొప్పువిరుల పరిమళంతో మొదలైంది. కొప్పువిరుల పరిమళం తుమ్మెదల్ని పిలవడం, కరిమబ్బులో చంద్రకళవంటి నెన్నుదురు, నుదుటి కస్తూరి రేఖ, మొలకనవ్వుల మోము, జళుకు కమ్మలకాంతి, నిడువాలు చూపులు, కలువరేకుల్లాంటి కొలకులు, వజ్రపు ఱాలకమ్మలు, చెక్కుల మకరికాచిత్రపత్రములు మొదలుకొని స్తనమండలం, ముంజేతులు, కరములు, నూగారు, ఊరువులు, నడుము, మొలనూలు, అందియలు, మట్టెలు, పాదాల వరకూ (పుట. 31,32) వర్ణించడం జరిగింది.

మోహిని సౌందర్యానికి సభాసదులతో పాటుగా శివుడికి కూడా మదనోద్దీపన కలిగింది. మోహిని ఎదురుగా నిలువగానే శివుడికి గుండె జల్లుమంది, నివ్వెరపాటు కలిగి శరీరమంతా పులకరించింది. శివుడు మోహినిని చూసి 'ననువంటి రసజ్ఞునకు దొరికితే దీని నెన్ని చందముల రతినేలుకోగలను (పుట. 38) అని భావించాడు. శృంగారవనంలో ఒంటరిగా ఉన్న మోహినిని చూడగానే శివుడికి శరీరం గడగడ వణికింది. అడుగులు తడబడగా శివుడి లలాటం నుంచి స్వేదం ధారలు కట్టింది. శివుడు మోహవారధిలో మునిగి మోహినిని సమీపించాడు. శృంగారవనంలోని పుప్పొడిలో పొరలాడు తుమ్మెదల ఝంకారం, గండుకోయిలల కూతలు తోడుగా మన్మథుడు విజృంభించాడు. శృంగారవనంలో మాయామోహిని,

"జాఱుకుచ్చెలు వామకరమున, జక్కఁజెక్కుచు గుబ్బిగుబ్బలఁ
జాఱు ముక్తాహారవల్లులు చౌకళింపన్" (పుట. 42)

బంతి ఆట ఆడుతూ శివునికి కనిపించింది. మోహిని తూగుటుయ్యాలలో ఊగుతూ, ఏలలు పాడుతూ, శివుడు సమీపించగానే అదృశ్యమైంది. శివుడు విరహోన్మాదంతో,

"దానిఁజేరుటెన్నడో వెడవింటి వానిఁగేరుటెన్నడో,
ఎదను హత్తుటెన్నడో దాని చిన్ని పదములొత్తుటెన్నడో
సేదదీర్చుటెన్నడో విరహాబ్ధి నీద నేర్చుటెన్నడో" (పుట. 50) అని

పలవరించసాగాడు. మోహిని శివుడు చూస్తుండగా పూవులుకోసే నెపంతో పయ్యెద జార్చి, బాహుమూలం, పయ్యెద, నాభి, నూగారు వంటి మర్మప్రదేశాలను బహిర్గతం చేస్తూ పెక్కురీతులుగా శృంగార వికారాలు ప్రదర్శించింది.

విరహోన్మత్తుడైన శివుడు మలయపవనాన్ని, చంద్రుడిని, మన్మథుడినీ దూషించాడు. మోహిని కనిపించక శివుడు విరహభావంతో భ్రాంతిచెంది పలవరించాడు.

"చేరరావె ముద్దుబెట్టవె యోముద్దుగుమ్మ
వేరుసేయనేలె విరహ వేదన తాళుకోలేను..." (పుట.65) అంటూ శివుడు మట్టుమీరిన మోహంతో మోహినిని కౌగిలించుకొని పతన రేతస్కుడైనాడు. ఈ విధంగా శివుడి విరహభావం అనుభావం కాగా ఇందులో విప్రలంభ శృంగారం వర్ణితమైనదని చెప్పవచ్చు.

5.2.1.3. కంకంటి నారసింహకవి – శృంగార రస నిర్వహణ

నారసింహకవి తన విష్ణుమాయావిలాస ద్విపదకావ్యంలో సంభోగ, విప్రలంభ శృంగారాలు రెండింటినీ తగువిధంగా వర్ణించాడు. ఇతడు కూడా ఎల్లనార్యుని మార్గాన్ని అనుసరించి సంభోగ శృంగారాన్ని ఎక్కువ చోట్ల వాచ్యం చేయకుండా సూచించి మాత్రమే విడిచిపెట్టాడు. విప్రలంభ శృంగారాన్ని శివగర్వభంగం కథలో ప్రధానంగా వర్ణించాడు.

సంభోగ శృంగారం

ప్రథమాశ్వాసంలో శ్రీకృష్ణుడు, సత్యభామ ఆలంబన విభావాలుగా సంభోగ శృంగారం వర్ణించబడింది. ఆ తర్వాత రుక్మిణీదేవి శ్రీకృష్ణుల రతికేళి సందర్భంగా సంభోగ శృంగారం ఈ విధంగా వర్ణించబడింది. 'రుక్మిణీదేవి అంతఃపురం పైభాగంలో చంద్రకాంతశిలలతో వజ్రాలు పొదిగిన శయ్యపైన, చిగురాకుల పానుపు మీద శ్రీకృష్ణునితో కూడి ఉంది. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితో రతిక్రీడలు చాలించి శయ్యనుంచి దిగాడు. అప్పుడు రుక్మిణీదేవి నఖాంకపు గుర్తులు గల పాలిండ్లతో, దంతక్షతమైన అధరాలతో, కెంజాయవర్ణపు కన్నులతో, చిక్కువడిన కురులతో వేడుకగా నడిచివెళ్ళి కొలనులో దిగి స్నానమాచరించి, మేలైన పట్టువస్త్రాలు ధరించింది' (పుట.24) ఈ వర్ణనలు ఉద్దీపన కాగా రుక్మిణీ శ్రీకృష్ణుల సంభోగం, తర్వాత సంభోగ చిహ్నాలతో కూడిన రుక్మిణీదేవి వర్ణన అనుభావాలుగా ఇక్కడ సంభోగ శృంగారం వర్ణించబడింది. తృతీయాశ్వాసంలోని పుండరీకుని కథలో పుండరీకుడు, బోయకాంత ఆలంబన విభావాలుగా సంభోగ శృంగారం వర్ణించబడింది.

యమునానదీ తీరంలో ఉన్న పుండరీకుని ఎదుట తళుకుకన్నులతో బిత్తరపుచన్నులతో, మొలకప్రాయంతో ఒక బోయకాంత నిలిచింది. పుండరీకుడు ఆ బోయకాంత గుబ్బపాలిండ్లు, ముద్దు మొగము, లేనగవు, ఒయ్యారమునూ కళవళపాటుతో చూస్తుండిపోయాడు. పుండరీకుడు తన ఎదురుగా నిలుచున్న కుటిల కుంతల బోయకాంతను చూసి మోహవివశుడైనాడు. ఆ బోయకాంత పుండరీకుని మనస్సు తెలుసుకోవాలని, సొలపుచూపులు చూస్తూ, చనుకట్టు కనిపించేలాగ పయ్యెదను కొంత దిగజార్చింది. నదిలో కాళ్ళు, చేతులు కడుగుకొన్నది. ఒక తామరపువ్వును

చేతిలో తిప్పుతూ శృంగార చేష్టలు చేసింది. బోయకాంత అంగసౌందర్యం, ఆమె శృంగార చేష్టలూ పుండరీకునికి ఉద్దీపన కలిగించగా, అతడు ఆమె మీద మరులు కొన్నాడు. పుండరీకుడు తన పుట్టుకను మరచి, బోయకాంత మీద మోహం మట్టుమీరగా కౌగిలించుకున్నాడు. ఆ కౌగిలిని విడువకుండా పుండరీకుడు బోయకాంతతో ఆ నదీతీరంలోని పూపొదరిండ్లలో సంభోగించాడు.

"గౌగిలి వదలకఁగడుప్రయత్నమున, సవిధపుష్పిత నికుంజ క్రోడమునకు
దానిని దారిచి సురతక్రీడ దేల్చి, యా నంద వార్ధి నోలాడుచు..." (పుట. 79)

ఈవిధంగా బోయకాంత అంగవర్ణన, శృంగార చేష్టలు ఉద్దీపన కాగా, పుండరీకునికి ఆమెపై కలిగిన మోహం అనుభవాలు కాగా ఇక్కడ సంభోగ శృంగారం వర్ణితమైంది.

తృతీయాశ్వాసంలోనే బ్రహ్మ, మాయాసరస్వతిల సంభోగ శృంగార వర్ణన ఉంది. ఇక్కడ బ్రహ్మ, మాయాసరస్వతి ఆలంబన విభావాలు. మాయాసరస్వతి అంగాంగ వర్ణన, ఆమె శృంగార హావభావాలు ఉద్దీపన కాగా బ్రహ్మకు ఆమె మీద రతివాంఛ కలిగింది. మాయాసరస్వతితో బ్రహ్మ అనేక వేలఏండ్లు రతికేళి సలిపాడు. అయినా బ్రహ్మ తనివి తీరక దినదినోద్ధత రతిస్థితులలో మునిగి, మొనపలు నాటిన పెదవులతో, కొనగోటి చెనకులతో నిండిన తనువుతో, పాలిండ్ల కుంకుమరాగం సోకిన వక్షస్థలంతో, కాటుకరేకలు నిండిన చెక్కులతో, పాదాల లత్తుక అంటిన నుదురుతో, కీల్జడ వాట్లపాలైన వీపుతో బహువిధరతులలో మునిగిపోయాడు. బ్రహ్మ తీవ్ర రతులకు తాళలేక ఆ మాయాసరస్వతి నూరు రూపాలు ధరించింది. బ్రహ్మ ఆ నూరు రూపాలను కూడి శతానందుడైనాడు (పుట. 103) ఇక్కడ బ్రహ్మ సంభోగ చిహ్నాలు అనుభవాలు కాగా, మాయాసరస్వతి శతరూపాలు ధరించిన విధం వ్యభిచారీ భావాలుగా కనిపిస్తున్నది.

ఈవిధంగా నారసింహకవి బ్రహ్మ, మాయా సరస్వతుల సంభోగశృంగారాన్ని వాచ్యంగా వర్ణించిన తీరును గురించి చెప్పుకోవచ్చు. నారసింహకవి పంచమాశ్వాసంలో చంద్రరేఖ, చంద్రకేతుమహారాజుల సంభోగ శృంగారాన్ని ఒక వాక్యంలో సూచన మాత్రంగా చెప్పి విడిచిపెట్టాడు.

విప్రలంభ శృంగారం

నారసింహకవి శివదర్పభంగ కథలో శివుడు, మోహిని ఆలంబన విభావాలుగా విప్రలంభ శృంగారాన్ని వర్ణించాడు. మదనాంతకుడైన శివుడికి మోహం కలిగించడానికి మాయామోహిని కల్పించబడింది. లత్తుకశోభతో చికురాకుల వలె కోమలమైన పాదాలతో మొదలుపెట్టి, మీగాళ్ళు, తొడలు, చేతులు, నడుము, నూగారు, నాభి, పాలిండ్లు, బాహువులు, కంఠం, ముఖం, పెదవులు, చెక్కులు, నాసిక, చెవులు, కన్నులు, నుదురు, శిరోజముల వరకూ మోహిని శరీరాన్ని శృంగారమయంగా (పుట. 133,134) వర్ణించాడు. మోహిని సౌందర్యం శివుడికి ఆమె మీద కామోద్దీపన కలిగించింది.

శృంగారవనంలో ఒంటరిగా ఉన్న మోహినిని పట్టుకోవాలని శివుడు ప్రయత్నించగా ఆమె మాయమైంది. మోహిని పూబంతి ఆట ఆడేనెపంతోను, తూగుటుయ్యాల ఊగుతున్నట్లుగాను, జలకాలాడే వంకతోనూ తన శృంగార చేష్టలతో, అంగాంగ ప్రదర్శనతో శివుడికి మదనతాపం కలిగించింది.

"చందురాతిన్నెపై జారుపయ్యంట, చన్దోయి ముత్యాలసరములల్లాడ" (పుట. 139) మోహిని పూబంతి ఆట ఆడింది. "గడుసు చన్గుబ్బలంగదియు పయ్యెదయుం, దొడలపై ముంగొంగు తొలగిఁయాడంగ..." (పుట. 140) తూగుటుయ్యాల ఊగింది.

"గురుతరోన్నత కుచకుంభముల్దాకి, విరివియౌ తరగలు విరిగిపడంగ." (పుట. 141) మోహిని జలక్రీడలాడుతూ శివుడికి కనిపించింది. మాయామోహిని అదృశ్యమవగానే శివుడు విరహోన్మత్తుడై మోహవిభ్రాంతితో చింతించాడు. మోహాతిశయంతో శివుడు కన్నీరు కారుస్తూ ఆ శృంగారవనంలో దైన్యంగా,

"కన్నీరు కొనగోటఁగడకు మీటుచును, విన్ననైయందెల్ల వెదకి దైన్యమున
విరహ మోర్వక మోహ వివశుడై" (పుట. 142)

వెర్రివానిలాగ తిరగసాగాడు. శివుడు మోహినిని కనుగొని, విరహతాపంతో దహించుకుపోతున్న అతడిని ఘనసార చందనాకలితమైన కౌగిలిలో చేర్చి కాపాడమని వేడుకున్నాడు. శివుడు ఓపలేని మోహంతో మోహినిని కౌగిలించుకొని సుఖపారవశ్యంతో పతనరేతస్కుడైనాడు. ఇక్కడ మోహిని శృంగార విలాస చేష్టలు, శివుని విరహాతిశయం, దైన్యతలను వర్ణించుట వల్ల ఇది విప్రలంభ శృంగారం అని చెప్పవచ్చు. ఈ విధంగా కంకంటి నారసింహకవి తన కావ్యంలో సంభోగ, విప్రలంభ శృంగారాలను ఉచితరీతిగా వర్ణించాడని తెలుస్తుంది.

5.2.1.4. రోసనూరి వేంకటపతి – శృంగార రస నిర్వహణ

వేంకటపతి తన విష్ణుమాయావిలాస కావ్యాన్ని శృంగార ప్రబంధంగా పేర్కొన్నాడు. అందుచేత ఇందులో శృంగారరసం ప్రధానంగా వర్ణితమైనదని చెప్పుకోవచ్చు. ఈ కావ్యంలో వేంకటపతి శివదర్పభంగ కథనే వర్ణించాడు. అందుచేత ఇక్కడ సంభోగ శృంగారానికి అవకాశం లేదు. ఇందులో విప్రలంభ శృంగారమే ప్రధానంగా వర్ణించబడింది. శివుడు, మోహినీకాంతలు ఇక్కడ ఆలంబన విభావాలు. నారదుడు చేసిన మోహిని అంగాంగ సౌందర్య వర్ణన శివునికి ఉద్దీపన కలిగించింది. విమలేందు బింబమో, వికచారవిందమో తెలియనంత అందమైన మోహిని ముఖం నుంచి మొదలుపెట్టి, చూపులు, చనుగవలు, కురులు, నడుము, పిరుదులు, పాదాలు, మీగాళ్ళు, ఊరువులు, నూగారు, అధరాలు మొదలుగా అంగాంగ వర్ణనను నాలుగు సీసపద్యాలు, ఒక చంపకమాలలో వర్ణించాడు.

"విమలేందు బింబమో వికచారవిందమో తరుణినెమ్మోమేరు పఱుపరాదు" (1-73)

అనే పద్యం నుంచి వరుసగా, "జలరుహగంధి కోకకుచ, సామజయాన." (1-74)

"లలన పాదములు పల్లవ సంపదవహించు.............."(1-75)

"పటువైన పాలిండ్లు బంగారు జిగి గుండ్లు............" (1-76)

"శృంగార రసమెల్ల, జిగిగుల్కుతొలకరి................." (1-77)

అనే పద్యం వరకూ ఈ వర్ణన కొనసాగింది.

శరీరమంతా శృంగారరసంతో తొణికిసలాడుతున్న ఆ మోహిని గురించి విని శివుడు మదనాతురుడయ్యాడు. మాయామోహిని గంటల మొలనూలితో, పాదనూపురముల రవళితో, చెంగావి రంగు పావడ ధరించి, పాలిండ్లపై కుంకుమ రాగంతో నడిచి రాగా (2-05.69) చూసి శివుడు ఆమెపై మరులుకొన్నాడు. శివుడు మోహినిని చూసి అతని వంటి రసజ్ఞునికి ఆమె దొరికితే వలపు తీరునట్లుగా రతికేళితో ఏలుకొనా అని భావించాడు. శివుడి మోహానికి ప్రచోదకంగా వసంతశోభ పదిపద్యాలలో వర్ణించబడింది.

"కుజవర్గమునకు నాకులపాటు గలిగించి, పైకంబుగైకొన బనుచుజాణ"(3-7) అనే పద్యం నుంచి "అత్తరి నిండు చాయ చిగురాకులదిండు గండుకోయిలల్" (3-15) అనే పద్యం వరకూ చేసిన వసంత ఋతువర్ణన శివుడి మోహానికి మరింత ఉద్దీపనను కలిగించింది. శృంగారవనంలో మోహినీకాంత చేసిన శృంగార రసోద్దీపకమైన చేష్టలు శివుడి మోహాన్ని మరింత ఉద్దీపింపజేశాయి. మోహిని చెదిరిన పైటచెంగుతో, జారుతున్న పోకముడితో, చిక్కుపడిన హారాలతో పూబంతి ఆట ఆడుతూ కనిపించింది.

"నిక్కెడు గుబ్బ చన్గవను నిల్వని పైటచెరంగు రంగునన్" (3-22)

శివుడు శృంగారవనంలో చేతికి చిక్కకుండా మాయమైన మోహినిని తలచుకొని విరహవ్యధను అనుభవించాడు. చంద్రుడు, మన్మథుడు చెలరేగి బాధించగా శివుడు విరహబాధ నుంచి కాపాడుమని మోహినిని వేడుకున్నాడు. మన్మథుడు తన వాడిబాణాలతో చంపక ముందే కరుణతో కాపాడుమని,

"మరుడు చంపకమున్నె కరుణనన్ బ్రోవు నీ, కాళ్ళకెమ్రొక్కుదు గమలపాణి
భక్తిలోనూన నీమృదు పదములాన" (3-42) అంటూ శివుడు విలపించాడు.

మోహినీకాంత తూగుటుయ్యాల ఊగుతూ, పుష్పాలు కోస్తూ, జలక్రీడలు ఆడుతూ తన మర్మాంగ ప్రదర్శనతో, శృంగార చేష్టావిలాసాలతో శివుడికి రతి వాంఛను కలిగించింది. మోహిని కనిపించక శివుడు విరహోన్మత్తుడై ఆ శృంగారవనంలో తిరుగుతూ, మలయపవనాన్ని, మన్మథుడిని, చంద్రుడినీ దూషించాడు.

మలయపవనాన్ని, "నిన్నుమేతగొనిన పన్నగములవల" (3-114),

"మలయనగంబున విషధర " (3-115)అనే రెండు పద్యాలలో దూషించాడు.

చంద్రుడిని, "వలనొప్పన్ ధరనోషధీపతిగనిన్ వాక్రువ్వగాఁజంద్రకే" (3-117),

"ఇలదోషాకరుడనగా.." (3-119) అని మూడు పద్యాలలో దూషించాడు. మన్మథుడిని కూడా, "కూటువగుంపుల పోటునమ్మకయునీ.." (3-121), "శివుడు కాముడనుమాట చెల్లకుండ" (3-122) అనే రెండు పద్యాలలో దూషించాడు.

శివుడు మోహిని కనిపించలేదని పలవరిస్తూ, హా! అని పరితపిస్తూ మతిభ్రమించి తిరుగుతూ పూపొదలో ఉన్న మోహినిని చూశాడు. శివుడు ఓర్వలేని విరహాతిశయంతో, మోహం ఉప్పతిల్లగా మోహినిని కౌగిలించుకున్నాడు. మదన పారవశ్యంతో శివుడికి శుక్లపతనమైంది. శివుని విరహం ఉపశమించిందింది. ఇక్కడ మోహిని సౌందర్యం, శృంగార చేష్టావిలాసాలు ఉద్దీపన కాగా శివుడికి విరహం కలిగింది. మోహిని కనిపించక శివుడు పొందిన విరహవ్యథ అంతా అనుభవాలు కాగా ఇక్కడ విప్రలంభ శృంగారం వర్ణించబడిందని చెప్పవచ్చు.

5.2.1.5. ఎఱగుడిపాటి వేంకటకవి – శృంగార రసనిర్వహణ

వేంకటకవి రచించిన విష్ణుమాయావిలాస కావ్యంలో విప్రలంభ, సంభోగ శృంగారాలు, ప్రధానంగా వర్ణించబడ్డాయి. ఈ కావ్యంలోని శృంగార వర్ణనలలో వెంకటకవి పాటించిన సంయమనం గమనించదగ్గది.

విప్రలంభ శృంగారం

శివదర్పభంగం కథలో శివుడు, మోహినీకాంత ఆలంబన విభావాలుగా విప్రలంభ శృంగారం వర్ణించబడింది. శివుడికి మరులు కలిగించడానికి కల్పించబడిన మాయామోహిని అంగసౌందర్య వర్ణన విశేషంగా చేయబడింది. అంధకారంలో కన్నులు మిరుమిట్లు గొలిపే విధంగా క్షణమాత్రం ప్రకాశించే మెరుపుతీగలాగ మోహిని శివుని ముందు నిలిచింది. మాయామోహినిని చూడగానే శివుడికి చిత్తభ్రాంతి కలిగింది. ముల్లోకాలకూ అత్యద్భుతంగా సకలశృంగార రసములు సంగ్రహించి బ్రహ్మ స్త్రీగా కల్పించినాడా! అని శివుడు మోహిని సౌందర్యాన్ని మెచ్చుకున్నాడు. శృంగారమూర్తి అయిన మోహిని శరీరకాంతి, పాదాలు, నితంబం, ఊరువులు, నూగారు, రోమరాజి, కటిప్రదేశం, కుచములలు, బాహువులు, చేతివేళ్ళు, కంఠం, ఉదరం, నఖములు, చిరునవ్వు, దంతములు, అధరాలు, ముక్కు, చెక్కిళ్ళు, కన్నులు, చెవులు, నుదురు, ముఖం, కుంతలాలు, నడుము, మొదలుగా ముప్ఫై మూడు రకాల అంగాల వర్ణన చేయబడింది.

"పుత్తడి బొమ్మయో! పుత్తడి బొమ్మైన, చేతన స్థితిని రాజిల్లుటెట్లు" (2-235) అనే పద్యం నుంచి, "చిగురులు తాబేళ్ళు జిగిమఱుల్ కాలికల్, కదళులు ధరనింగి నడుము ఫణియు" (2-268) అనే పద్యం వరకూ ఈ అంగాంగ వర్ణన కనిపిస్తుంది.

శివుడు శృంగారవనంలో కందుకక్రీడ ఆడుతూ మైమరచి, నుదురు చెమట ముత్యపు బిందువులతో నిండగా, కటి కుచభార సంకటంతో నడుము వణకగా పైట

సవరించడం కూడా మరిచిపోయిన మోహినిని చూశాడు. శివుడికి కామోద్దీపన కలిగించడానికి, "...గ్రందుకొని మాకందార మందార ముఖ తరుబృందాగ్రంబులం బలుక నిజకరతల ఘట్టన వేగంబున చేతప్పి కడింబడిన వడి చప్పుడున బెదరి బెదరి గుప్పున లేచునప్పులుగు గమి రమణీయ నినదంబు తనచేతప్పనకుంగా చప్పటలిడుచు ఘొల్లున నవ్వినక్రియ తెల్లనైన యాదవ దిగ్గన లేచి కందుకంబందు కొనుటకు..." (2-275) అంటూ కందకక్రీడ ఆడుతున్న మోహిని శృంగార విలాసం ఒక దీర్ఘమైన వచనంలో వర్ణించబడింది.

మోహిని శరీరసౌందర్యం, కందుకక్రీడ నెపంతో ఆమె చేసిన శృంగార చేష్టలు చూసిన శివునికి మదనోద్దీపన కలిగింది. మోహినిపై శివుడికి మరులు కలిగించేందుకు మన్మథుడు విజృంభించాడు. శివుడు మదన బాధితుడై, "ఎటులతాళగవచ్చునీయిందు వదన, సరసకరుణాకటాక్షవీక్షణలవంబు నన్ను జెందక నిముషమెన్నంగ కల్పమగు చున్నది మరుమాయ మిగులగమ్మి" (2-272) అంటూ నిర్వేదం చెందాడు. శివుడు మోహిని పొందు దొరికితే ఇక తనకు కైలాస నివాసంగాని, సిద్ధరసాయన పానంగాని, త్రిభువన సామ్రాజ్య వైభవంగాని, అర్థనారీశ్వరతత్వంగాని అవసరంలేదని (2-287) భావించాడు. శివుడు ఏరీతిగా అయినా మోహినిపొందు తనకు కలుగకుంటే మదనబాణాల తాకిడికి దహించుకుపోతానని పరితపించాడు. మిక్కిలి తమకంతో మోహినిని కౌగిలించుకున్న శివుడికి శుక్ల పతనమైంది. మోహిని రూపసౌందర్యం, శృంగార చేష్టలు ఉద్దీపనకాగా శివుడికి కలిగిన విరహం విప్రలంభ శృంగారంగా పరిణమించిందని చెప్పవచ్చు.

తృతీయాశ్వాసంలోని బ్రహ్మగర్వభంగం కథలో బ్రహ్మ మునికన్య సౌందర్యానికి మరులుకొన్న సందర్భంలో విప్రలంభ శృంగారం వర్ణించబడింది. ఇక్కడ బ్రహ్మ, మునికన్యలు ఆలంబన కాగా, మునికన్య అంగసౌందర్యం బ్రహ్మకు శృంగార రసోద్దీపన కలిగించింది. మునికన్య రూపవిలాస వైఖరికి మరులు కొన్న బ్రహ్మ, ఆమెను తలచుకొని ఉసురుమని అలమటిస్తూ, తాపాన్ని అణచుకుంటూ, నిలువలేక తత్తరపడుతూ విరహాన్ని అనుభవించాడు (3-121). చతుర్థాశ్వాసంలో చంద్రరేఖ, చంద్రకేతుమహారాజుల మధ్య విప్రలంభ శృంగారం వర్ణించబడింది. చంద్రరేఖ, చంద్రకేతుడు ఇక్కడ ఆలంబన విభావాలు వారి రూపయౌవన, ఉజ్జ్వల వేషధారణలు, చేష్టావిలాసాలు ఉద్దీపన కాగా మొదట విప్రలంభ శృంగారం, తర్వాత సంభోగ శృంగారం వర్ణించబడ్డాయి. చంద్రకేతుడిని వలచిన చంద్రరేఖకు అతని ఎడబాటు వలన విరహ భావం కలిగింది. చెలికత్తెలు చంద్రరేఖను పుష్పాపచయానికి తీసుకువెళ్ళారు. చెలికత్తెలు చేసిన శైత్యోపచారాలు అన్నీ విఫలమవగా, వారు మన్మథపూజ చేశారు. చంద్రరేఖ విరహవ్యథతో ఓర్వలేక కన్నీరు కార్చగా, చెలికత్తెలు మన్మథుని దూషించారు.

చంద్రరేఖ విరహం,

"కారణమేమియో తెలియగాదని తాదనివోనికాంక్షనిట్టూరుపునించు." (4-284) అనే పద్యం నుంచి మొదలై, "అనుచు మారుని గడుదూరియబలజేరి." (4-305) అనే పద్యం వరకూ సుమారు ఇరవై ఒక్క పద్యాలలో వర్ణించబడింది. ఈవిధంగా వేంకటకవి తన కావ్యంలో విప్రలంభ శృంగారాన్ని వర్ణించాడని చెప్పవచ్చు.

సంభోగ శృంగారం

చంద్రరేఖ, చంద్రకేతుల వివాహానంతరం వారిమధ్య సంభోగ శృంగారం వర్ణించబడింది. చంద్రరేఖ ఏకాంతమందిరంలోకి ప్రవేశించి తెరచాటున ఉండగా, చంద్రకేతుడు ఆమెను చేయిపట్టి శయ్యమీదికిచేర్చి లాలించాడు. చంద్రరేఖ యవ్వనపుశోభ, లజ్జ ఉద్దీపనకాగా చంద్రకేతుడు ఆమెతో సంభోగించాడు. చంద్రకేతుడు చెక్కిలి నొక్కె నెపంతో వస్త్రాన్ని తొలగించి, తాంబూలం అందించు మిషతో కెమ్మోవిని మొనపంటితో నొక్కి, అగరు పంకం తుడుచునట్లుగా పయ్యెద సడలించి, చంద్రరేఖతో ప్రథమ సరసరతికేళి కావించాడు. చంద్రరేఖ, చంద్రకేతుల సంభోగ శృంగారం ఐదుపద్యాలలో (5-123 నుంచి, 5-127 వరకూ) వర్ణించబడింది. ఈ విధంగా ఎఱగుడిపాటి వేంకటకవి తన కావ్యంలో విప్రలంభ శృంగారాన్ని, సందర్భోచితంగా సంభోగ శృంగారాన్ని కూడా వర్ణించాడని చెప్పవచ్చు.

5.2.2. అంగ రసాలు

కావ్యంలో శృంగారం అంగిరసమైనప్పుడు వీరరసం దానికి అంగభూతంగా ప్రవర్తిల్లుతుంది. కావ్యంలో వీరరసం తోపాటుగా మిగిలిన రసాలు కూడా సందర్భోచితంగా వర్ణించడం జరుగుతుంది. విష్ణుమాయా విలాస కావ్యాలలో అంగిరసానుకూలంగా అంగరసాలు ప్రవర్తిల్లిన తీరు ఈ విధంగా కనిపిస్తున్నది.

5.2.2.1. చింతలపూడి ఎల్లనార్యుడు - రసనిర్వహణ

ఎల్లనార్యుడు తన విష్ణుమాయాం నాటక వీరరసాన్ని ప్రధాన అంగరసంగా వర్ణించాడు. వీరరసం తోపాటుగా మిగిలిన రసాలను కూడా సందర్భోచితంగా వర్ణించడం కనిపిస్తుంది.

వీరరసం

వీరరసానికి ఆలంబన విజేతవ్యుడు. ఉద్దీపన అతని చేష్టాదులు. అనుభవాలు స్థైర్యం, ధైర్య, శౌర్య, త్యాగ, వైశారద్య, ఉత్సాహాలు. విభావాలు అసమ్మోహం, అధ్యవసాయం, నయ, బల, పరాక్రమాదులు. వ్యభిచారీ భావాలు ధృతి, మతి, గర్వము, ఆవేగము, ఉగ్రత, స్మృతి, రోమాంచకములు. ఇటువంటి విభావానుభావ వ్యభిచారీభావ సంయోగం వలన జనించిన స్థాయి అయిన ఉత్సాహం వీరరస ఉత్పత్తికి కారణం. వీరరసానికి స్థాయీ భావం ఉత్సాహం. "లోకోత్తర కార్యములు సాధింపజేయు

గట్టియత్నముత్సాహము. లోకోత్తర కార్యమనిన నిట దాన,ధర్మ, దయా, యుద్ధాదులు" (రామరాజభూషణుడు. 1976.324) స్థాయీభావమైన ఉత్సాహాన్ని అనుసరించి వీరరసం కూడా దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం, దయావీరం అనే నాలుగు రకాలుగా ప్రవర్తిల్లుతుంది.

"దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం తథైవచ, దయావీరమపి ప్రాహ బ్రహ్మాత్రివిధ సమ్మితం. దానవీర, ధర్మవీర, యుద్ధవీరములను నీ త్రివిధములకు సమ్మతమగు దయావీరమును గూడ బ్రహ్మనుడివెను అని భరతముని చెప్పెను. ఈ త్రివిధములకును సమ్మతమనగా భావమిది. దయావశమున దానమును ధర్మమును యుద్ధమును గూడ నొనర్ప వచ్చును. పరదుఃఖ దుఃఖిత్వము గదాదయ. అందువలన నుద్రిక్తమగు నుత్సాహము మహాసత్త్వులకుదయించును. అపుడు వారివారి ప్రకృతుల ననుసరించియు దేశకాలౌచిత్యముల ననుసరించియు వారు పై మూడు విధములగు నుత్సాహముల నావిష్ణులగుదురు" (కోటేశ్వరరావు, తుమ్మపూడి. 1971.485)

ఈ నిదర్శనం వలన వీరరసానికి స్థాయి అయిన ఉత్సాహం జనించడానికి ప్రధాన హేతువు 'దయ' అని తెలుస్తుంది. భగవంతుడిని లోకరక్షణకు పురికొల్పేది దయాగుణమేనని ముందుగానే చెప్పుకున్నాం. దయామూలకమైన ఉత్సాహం నుంచే దానం, ధర్మం, యుద్ధం అనే వీరరస భావాలు ఉత్పన్నమవుతున్నాయని తెలుస్తుంది. విష్ణుమాయానాటకంలో సత్యభామ, మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుల గర్వభంగ కథలు వర్ణించబడ్డాయి. వీరందరూ శ్రీమహావిష్ణువు మహత్వాన్ని తృణీకరించి, భగవత్ప్రసాదితమైన తమ ప్రతిభను తలచుకొని దురాచారపరాయణులైనారు. ధర్మభ్రష్టులై, దుర్విదగ్ధులైన వీరందరినీ శ్రీమహావిష్ణువు తన మాయామోహంలో తగుల్కొనేలాగ చేశాడు. విష్ణువు వారివారి కర్మఫలాన్ని అనుభవింపజేసి, తగురీతిగా దండించి, వారిని తిరిగి ధర్మమార్గంలో నడిపించడానికి ఉత్సాహించాడు. అందుచేత ఇందులో ధర్మవీర రసస్థాపన జరిగిందని చెప్పవచ్చు.

సర్వమంగళాధి దేవత అయిన మహాలక్ష్మి వినోదార్థం జూదంలో ఆమెను ఓడించినందుకు విష్ణువును నిందించింది. మహాలక్ష్మి విష్ణువుకు ముల్లోకాల ప్రభుత్వం కలగడానికి, వైకుంఠపుర వైభవానికి ఆమే కారణమని గర్వించింది.

"త్రైలోక్య విభుత నీకు గల్గుటయే, నేను నీకు గలుగంగ గాదె" (2-30) అంటూ మహాలక్ష్మి గర్వంతో వైకుంఠపుర వైభవాన్ని ఉపసంహరించి,

"నావిస్ఫూర్తులు నే గ్రహించెద భవన్మాయా విలాసంబులె,

ట్లై వర్తించునొ చూతమంచు నిజదివ్యా కారమేపారగాన్" (2-33)

దానిని శూన్యమయంగా చేసింది. దురహంకారంతో ఈ రీతిగా ధర్మపథాన్ని విడిచి, అహంకారమతి అయిన మహాలక్ష్మిని సంస్కరించడానికి శ్రీమహావిష్ణువుకు ఆమె చేష్టలే

ఉద్దీపన కలిగించాయి. మహాలక్ష్మి గర్వమణచడానికి ఉత్సాహించిన శ్రీమహావిష్ణువు వైకుంఠపుర వైభవాన్ని తిరిగి ప్రకాశింపజేశాడు. మహాలక్ష్మికి ప్రతిగా మాయాలక్ష్మిని కల్పించాడు. ఉద్యానవనంలో మహాలక్ష్మిని ఒంటరిని చేసి పడరానిపాట్లు కలిగించాడు.

మహాలక్ష్మి విష్ణుమాయా మోహంలో చిక్కుకొని, మాయాలక్ష్మి వైభవానికి, చెలికత్తెలు విడిచివెళ్ళినందుకు, భర్త వలన కలిగిన ఎడబాటుకూ, "..మోహాతిశయంబున నవ్విష్ణుమాయా సముద్రంబు దరియింప జాలక యాలోకమాత మిథ్యాలక్ష్మి మహోత్సవ సంభ్రమంబును... వల్లభుండు వియుక్తుడగుటయుఁ దనమనంబునకసహ్యా దుఃఖ కారణం బులగుటం జేసి పరితపించి..." (2179) అంటూ మహాలక్ష్మి దుఃఖించిందని ఎల్లన వర్ణించాడు. మహాలక్ష్మి సంపద గర్వంతో ధర్మమార్గాన్ని విడిచి, విష్ణువును నిందించింది. మహాలక్ష్మికి గర్వభంగం కలిగించి తద్వారా లోకానికి విష్ణుమహిమను ప్రకటించడానికి ప్రయత్నించిన విష్ణువు ఉత్సాహం ధర్మంగా పరిణమించుట చేత ఇక్కడ రసం ధర్మవీరమని చెప్పవచ్చు.

బ్రహ్మ సృష్టికర్తననే గర్వంతో తాను తప్ప అన్యదైవం లేదని అహంకరించి విష్ణువును నిందించాడు. సృష్టినిర్మాణ కార్యాన్ని చాలించి, మేరుపర్వతంపై తపస్సు చేయాలని వెళ్ళాడు. ఇక్కడ బ్రహ్మ చేసిన విష్ణునింద, లోకాలకు కలిగించిన అపాయం ఉద్దీపనకాగా శ్రీమహావిష్ణువుకు బ్రహ్మకు గర్వభంగం కలిగించేందుకు ఉత్సాహం కలిగింది. "అస్మదీయ మాయ యఖిలంబుననక తా, బ్రహ్మననుచు లోకపతినటంచు, యోగిననుచు నున్న యుబ్బెల్లినడగించి, పిదపలోకమునకు ముదమొనర్తు" (3-262) అని విష్ణువు మాయాసరస్వతిని కల్పించి, బ్రహ్మను మరులుకొలిపి గర్వభంగం కావించాడు. మదనాంతకుడైన శివుడు మోహినీ అవతార పరమార్థాన్ని గ్రహించక, తన నిగ్రహపటు మహిమను లోకాలకు చాటాలని గర్వించాడు. దానిని గ్రహించిన శ్రీమహావిష్ణువు శివుని దర్పాన్ని ఉపశమింపజేయడానికి పూనుకున్నాడు.'..స్వాంతన వచనంబులం బోవు వాడుకాడు, దీనికేమిసేయువాడ, నమ్మహాత్ముని చిత్తంబు సంక్షోభింప జేయవలసె, నీతని తమకంబుకొలది గాదు, నేడు వీరిని మోసపుచ్చి సిగ్గుపరపకుంటినేని గెంటసంబాడి నవ్వుదురని.." (4-174) విష్ణువు మనసులో భావించి, మాయామోహిని రూపంతో శివదర్పభంగం కావించాడు.

నారదుడు తాను విష్ణుమాయను జయించినానని గర్వించి ముల్లోకాలలో చాటుకున్నాడు. దాన్ని తెలుసుకున్న విష్ణువు, "తన్మాయ గణింపక యిట్లు పలికిన యావెడంగుమునింగనుంగొని మనంబున రోసి యతనికి బురాకృత కర్మశేషంబు ననుభవింపం గారణంబు గలదని దివ్యచిత్తంబున నెఱుంగ నవధరించి..." (5-28) విష్ణువు నారదునికి స్త్రీ రూపాన్ని కల్పించి, సంసారబంధంలో తగిలించి, గర్వభంగం కావించాడు. చండదమనుడు దురహంకారంతో విష్ణుమాయను తిరస్కరించాడు. దాన్ని

గ్రహించిన విష్ణువు, ''ఒల్లనన్నయితని యుల్లంబురాజ్యసం, పదలవెల్లిగొలిపి ముదమొనర్చి, యవల మోక్షమిత్తు...'' (5-110) అని చండదమనుడికి రాజ్యభోగాలు కల్పించి, గర్వభంగం కావించాడు. ఇంతవరకూ చూపిన నిదర్శనాలలో శ్రీమహావిష్ణువు అహంకారమతులైన మహాలక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదుడు, చండదమనుడు మొదలైన వారిని సంస్కరించడానికి ఉద్దీపన కలిగించింది ధర్మసంబంధమైన ఉత్సాహమేనని తెలుస్తుంది. అందుచేత ఇది ధర్మవీరం.

పరమభాగవతుడైన పుండరీకుడు విష్ణుమాయను గురించి సందేహించి, "స్వామీ నేనీ భక్తుండ నీవు భక్తవత్సలుండవు గావున నించుక నీమాయ చూపవలయునని విష్ణునిం ప్రార్థించుచున్న..." (3-130) పుండరీకుని ఉద్ధరించి, మోక్షమివ్వాలని శ్రీమహావిష్ణువుకు అపారమైన కరుణ కలిగింది. పుండరీకునికి బోయకాంతతో మాయాసంసారాన్ని కల్పించి, చివరకు మోక్షపథాన్ని అనుగ్రహించాడు. "... యుత్తమ సాత్వికజ్ఞానంబున నన్ను సాలగ్రామస్వరూపు నారాధించిన నిన్ను... యుచిత పదంబొసగుటకై యింత ప్రయాసంబు నొందింపవలసె..." (3-236) అని విష్ణువు పుండరీకునితో పలికాడు. శ్రీమహావిష్ణువు పుండరీకుడిని ఉద్ధరించడానికి ఉద్దీపనమైంది దయామూలకమైన ఉత్సాహమని తెలుస్తుంది. అందుచేత ఇక్కడ దయావీరం పోషించబడిందని చెప్పవచ్చు. ఈ విధంగా ఎల్లనార్యుడు తన కావ్యంలో ధర్మవీరం, దయావీర రసాలను అంగరసంగా వర్ణించాడని చెప్పవచ్చు.

కరుణరసం

పుత్రుడు మొదలగు ఆప్తులైన వారి వియోగం వలనగాని, మరణం వలనగాని కలిగిన వైక్లబ్యమనే చిత్తవృత్తి విశేషమును శోకము అంటారు. "పుత్రాది వియోగ మరణాది జన్మావైక్లబ్యాఖ్యా చిత్త వృత్తి విశేషశ్శోకః " (రామరాజభూషణుడు. 1976. 232) తృతీయాశ్వాసంలో పరమ భాగవతుడైన పుండరీకుడు మాయాసంసారమగ్నుడై, కరువు బారిన పడినప్పుడు, అతని దైన్యాన్ని, శోకాన్ని వర్ణించుటలో కరుణరసం కనిపిస్తుంది. "అట్లు మానిసి మానిసిం దిను కఱవు దఱిమిన నుపాయశూన్యులై సకల మహాజనులు నాకటి చిచ్చు పెచ్చున మలమలమాడి యెండి కుండబడుగులై హతశేషులు పాడైన యూళ్ళ విడిచి యయ్యెనెలవులకు బోవుచుండి రట్టిముట్టడి నత్తమామలు గూతురంతరించిన నంతరించలేక నవ్విరించి కులసంభవుండు దుఃఖాక్రాంతుడై ప్రియకాంతం జూచి కన్నీరు నిగుడ్చుచు.." (3-184) అని కరువు తీవ్రత వర్ణించబడింది. ఇక్కడ కరువు ప్రాంతంలోని ప్రజల దయనీయమైన పాట్లు, పుండరీకుని దైన్యత, అత్తమామలు, కుమార్తె మరణం, తీవ్రమైన ఆకలిబాధ, భార్య కుమారులను కాపాడుకోలేని నిస్సహాయత ఇవన్నీ పుండరీకుని శోకానికి దోహదంగా కనిపిస్తున్నాయి. అందుచేత ఇది కరుణ రసమని తెలుస్తుంది.

ఇదే విధంగా పంచమాశ్వాసంలో చంద్రరేఖ యుద్ధరంగంలో మరణించిన భర్త, కుమారులను చూసి విలపించే సందర్భంలో కూడా కరుణ రసం వర్ణించబడింది.

భయానకం

వ్యాఘ్రదర్శనం మొదలైన వాటివలన కలిగిన పరమ అనర్థ విషయకమైన వైక్లబ్యరూపమగుచిత్త వృత్తి విశేషము భయానకము. “వ్యాఘ్ర దర్శనాది జన్మాపరమానర్థ విషయకో వైక్లబ్యాకృశ్చిత్త వృత్తి విశేషః భయః ” (రామరాజభూషణుడు. 1976. 324) తృతీయాశ్వాసంలోని పుండరీకుని కథలో తీవ్రమైన దుర్భిక్షం కలిగిన తీరును వర్ణించే సందర్భంలో భయానక రసవర్ణన కనిపిస్తుంది. కరువు కాటకాలను సూచించే దుశ్శకునాలు కనిపించగానే పాపమనే ఇనుపశరీరంతో, భరింపశక్యంకాని కోపమనే వాడియైన కోరలతో, అవమానమనే పొడవైన నాలుకతో, జనులరోదనలనే సింహనాదంతో, కొండవంటి పదునైన కరవాలంతో, భయంకరమైన రీతిగా కరువు అనే నిశాచరి జంతులోకం మీదికి విజృంభించింది.

“దురిత మలీమసాంగమును దుస్సహరోష కఠోరదంష్ట్రలున్

వికృతాకృతింగసిమ సంగుచుంబైకొనె జంతులోకమున్” (3-180) అంటూ కరువును వర్ణించడం కనపిస్తుంది. ఇక్కడ కరువు వర్ణనను రాకాసి రూపంతో పోల్చి భయంకరంగా వర్ణించినందున ఇది భయానక రసమవుతున్నది.

బీభత్సం

ఏవగింపును కలిగించే పురీషాది వస్తువులను చూడటం వలన కలుగు విచికిత్స అనే చిత్తవృత్తి విశేషము జుగుప్స అనబడుతుంది. జుగుప్స స్థాయీభావంగా కలిగింది బీభత్సరసం. “కదర్య వస్తువిలోకన జన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషోజుగుప్సా” (రామరాజభూషణుడు. 1976.325) పుండరీక చరిత్రలో కవి చేసిన కరువు వర్ణన బీభత్సరసమయంగా ఉన్నది. “....గ్రామోపకంఠంబు పశుశల్యంబుల య్యె గృహాంగణంబులు శవమయంబులయ్యె, పట్టణంబులు శుష్కీభూత మృతకరి తురగ గర్దభోష్ట్ర కళేబర కబళన వ్యాకీర్ణకుర్కుర కంకగృధ్ర కాకసాలా వృక కోలాహల మయంబులయ్యె, ... దిశావలయంబు దుర్గంధ మయంబుయ్యె, నహోరాత్ర సంధ్యా సమయంబులు పిశాచమలినచ్ఛాయా మయంబులయ్యె...” (3-181) అంటూ కరువు రక్కసి కోరలకు చిక్కిన ఆ ప్రాంతంలో పశువుల ఎముకల గుట్టలు, ఇళ్లలోని శవసమూహాలు, చనిపోయిన జంతు, పక్షి సమూహాల కళేబరాలు, పిశాచాల మలినచ్ఛాయలు, వాటి దుర్గంధం మొదలగు జుగుప్సా భరితమైన వర్ణన వలన ఇది బీభత్సరసం అవుతున్నది. చంద్రకేతుని యుద్ధం తర్వాత రణరంగాన్ని వర్ణించిన సందర్భంలో కూడా బీభత్సరసం కనిపిస్తున్నది.

రౌద్రం

గురువు, బంధువు, మిత్రాదుల వధ మొదలైన పరమాపరాధం వలన కలుగు ప్రజ్వల నామకమగు చిత్తవృత్తి విశేషము క్రోధము. ఈ క్రోధము స్థాయీ భావంగా కలిగింది రౌద్రరసం. "గురు బంధు వధాది పరమాపరాధ జన్మా ప్రజ్వలనాఖ్యః శ్చిత్త వృత్తి విశేషః క్రోధః" (రామరాజభూషణుడు. 1976.326) శ్రీమహావిష్ణువు ధరించిన మాయామోహిని రూపాన్ని చూస్తే శివుడు కూడా మరులుకొంటాడని పలికిన నారదుని మాటలకు ప్రమథలు కోపించారు. కన్నులు కెంపువర్ణంలోకి మారగా పరుష పదజాలంతో నారుదుడు కూపమండూకమని, నీచబుద్ధి గలవాడని నిందించారు. శివుని మహిమను చులకన చేసిన నారదుని కొట్టడానికి ఉద్యుక్తులైనారు. ప్రమథలు కోపంతో విష్ణువును కూడా అతని మాయను చూపమని దూషించారు. "..బ్రమథశ్రేష్ఠలు క్రోధపరుష భాషణంబులం గడకన్నులం గెంపుదోపనిట్లనిరి" (4-162) ప్రమథులకు నారదుడు తమ ప్రభువైన శివుడిని తక్కువ చేసి విష్ణుమాయను పొగడటం రుచించలేదు. అంతే కాకుండా శివుడిని కూడా విష్ణుమాయ భ్రమింపజేస్తుందని పలికిన నారదుడి మాటలు వారికి కోపాన్ని కలిగించాయి. ప్రమథులు నారదుడిని, విష్ణువునూ నిందించిన మాటలు (4-164) క్రోధంతో నిండినవి. కాబట్టి ఇక్కడ రసం రౌద్రం అవుతున్నది. మార్కండేయుడు చేసిన విష్ణుమాయాస్తుతిని విని కోపంతో బ్రహ్మ చేసిన విష్ణునిందలో కూడా రౌద్రరసం కనిపిస్తున్నది.

అద్భుతరసం

అలౌకికమైన వస్తువులను చూడటం వలన కలిగే ఆశ్చర్యమనే చిత్త వృత్తి విశేషము విస్మయము. ఈ విస్మయం స్థాయీ భావంగా కలిగినది అద్భుతరసం. "అలౌకిక వస్తుదర్శనాది జన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయః" (రామరాజభూషణుడు. 1976.328) మహాలక్ష్మి వైకుంఠపుర వైభవాన్ని హరించి వెళ్లి తిరిగి వచ్చిన తర్వాత ఆ పురవైభవాన్ని చూసినప్పుడు ఆమెకు కలిగిన విస్మయం అద్భుతరస పోషకంగా ఉంది. ఆ వైకుంఠపురం పూర్వం కంటే మరింత శోభాయమానంగా ప్రకాశిస్తున్నది. అనంత లక్ష్మినివాస సదనమై, అపూర్వ మణిమాలికలతో అలంకృతమై వికసించిన బంగారు తామరపుష్పాలతో సుందరమై, ముల్లోకాలకూ ఆనందాన్ని కలిగిస్తున్నది.

"ననంతలక్ష్మి నివాస సదనంబై రాశీభూతదివ్యతేజః పుంజంబై... వైకుంఠపుర భేదనంబు చూచి లక్ష్మి విలక్ష హృదయయై నేనిప్వీడు పాడు చేసి పోయితిం గ్రమ్మరనింత యైశ్వర్యవంతంబు గావించిన దివ్యప్రభావులెవ్వరొకో యిది జగదేకాశ్చర్యంబు..." (2-186) అంటూ వైకుంఠపుర వర్ణన చేయబడింది.

ఇక్కడ అపూర్వమగు వైకుంఠపుర వైభవ దర్శనం మహాలక్ష్మి విస్మయానికి కారణం. కాబట్టి ఇది అద్భుతరసమని చెప్పవచ్చు. తృతీయాశ్వాసంలో మార్కండేయుడు

జగత్ప్రళయ సమయంలో మున్నీటి మీద వటపత్రశయనుడైన బాలుని నోటిలో పద్నాలుగు లోకాలను దర్శించి విస్మయాన్ని పొందాడు. ఆ సందర్భంలో మార్కండేయునికి కలిగిన విస్మయం అద్భుతరసంగా కనిపిస్తుంది.

శాంతరసం

ఇది నిత్యము, ఇది అనిత్యము అనే విచారము వలన కలుగు విషయ విరాగమనే పేరుగల చిత్తవృత్తి విశేషము శమము. ఇది శాంతరసానికి స్థాయీ భావం. "నిత్యా నిత్య వస్తు విచార జన్మా విషయ విరాగాఖ్యో నిర్వేదశ్శమః" (రామరాజభూషణుడు 1976.328) తృతీయాశ్వాసంలోని పుండరీకునికథలో కరువు కాటకాలతో జనజీవనం అతలాకుతలం కాగా అక్కడ దారిద్ర్యం తాండవించింది. అటువంటి పరిస్థితుల్లో ఆకలిగొన్న బాల వృద్ధ స్త్రీల సమూహాలు చేసిన భయంకరమగు ఆర్తనాదాలు, తినేందుకు గ్రాసం, తాగేందుకు నీరులేక, ఎండిన చెరువుల అడుగున గడ్డిపోచలు నములుతూ కృశించిన పశుగణాలు చేసే అంబారవాలు ఆకాశాన్ని అంటాయి. 'భిక్షాందేహి' అనే దీన జనాలాపాలు, 'దరిద్రమృతస్యచ' అనే దుఃఖార్తుల విలాపాలతో ఆ ప్రాంతంలో నిర్వేదం అలముకుంది.

"...క్షుధాతుర బాల వృద్ధ స్త్రీలోక భీరుక పరిదేవనార్త నాదంబులును... 'భిక్షాందేహి' 'నాస్తి గచ్ఛ' యనుదీన నిర్దయ జనాలాపంబులును 'దరిద్రమృతస్యచ' యను దుఃఖార్తుల దీన విలపితంబులును.." (3-181) అంటూ కరువుతీవ్రత వర్ణించబడింది. ఇక్కడ కరువు పరిస్థితుల వల్ల ప్రజలు దారిద్ర్య, ఆకలిబాధలతో దీనంగా విలపించడం వారి విచార విషణ్ణవదనాలు, విషయవైరాగ్యం మొదలైన చిత్తవృత్తుల వలన ఇది శాంతరసమని తెలుస్తుంది. ఈ విధంగా చింతలపూడి ఎల్లనార్యుడు తనకావ్యంలో కథా సందర్భాన్ని అనుసరించి రసపోషణ కావించాడని చెప్పవచ్చు.

5.2.2.2. కంకంటి పాపరాజు - రస నిర్వహణ

పాపరాజు తన యక్షగానంలో శివదర్పభంగ కథకు తగిన రీతిలో చేసిన రస నిర్వహణ క్రింది విధంగా కనిపిస్తున్నది.

వీరరసం

పరమశివుడు నారదుని కలహపు మాటలకు ప్రేరేపితుడై గర్వించి విష్ణుమాయా మహత్వాన్ని తృణీకరించాడు. తన నిగ్రహపటుత్వ మహిమను లోకాలకు చాటవలెనని భావించాడు. శివుని తమకాన్ని భంగపరచడానికి విష్ణువు మోహినీ రూపంతో అవతరించాడు. శివదర్పాన్ని భంగపరిచి, ధర్మమార్గంలో శివుడిని కుదురుకొల్పడం ఇందులోని పరమోద్దేశం. ఇక్కడ శివుడి తమకం, దాని పర్యవసానమైన దర్పం ఉద్దీపనవిభావం కాగా విష్ణువు ధరించిన మాయామోహినీ రూపం ఆలంబన విభావంగా

ధర్మవీర రసస్థాపన కావించబడింది. శివుడు వైకుంఠపురానికి వచ్చినట్లు గ్రహించిన విష్ణువు, "వినిజనార్దనుడతడు వచ్చిన, విధము మనసునఁ దెలిసి నవ్వుచు

పునుకఁదాలుపుఁజూడ నంతఃపురమువెడలెన్" (పుట. 25)

ఇచట శివుని ఆగమనం విష్ణువునకు ఉత్సాహభరితమైనదనే విషయం వ్యక్తమవుతున్నది. ఆ పురాణదంపతులను విష్ణువు సముచిత రీతిన గౌరవించాడు. అప్పుడు శివుడు విష్ణువుతో, "నావిరక్తివైభవంబు నీ విశేష మాయ జగము, లీవిరించి ముఖులు దెలియనింతివగుము వింతయేల, మరుని సంహరించి మిత్తి మదమణంచి యున్న నన్ను, ఏమరులు పరుపవశమె నీకు మాయదారివగుచురమ్ము" (పుట. 28) అని తమకించి పలికాడు. దానికి తగినట్లుగా ప్రమథులు కూడా కొన్ని దురోక్తులు పలికారు. విష్ణువు అంతా విని, పరమేశ్వరుని దురహంకారం ఇలా ఉండగా,

"బ్రమలువెట్టక తాళుకొన్నను బ్రతుకనిత్తురెవేల్పుతపసిని

ప్రమథవరులటుగాన భర్గుని భ్రాంతుని జేతున్" (పుట. 28)

అని నిశ్చయించుకొన్నాడు. విష్ణువు శివుడి పంతం చెల్లించడానికా అన్నట్లుగా,

"మంచిదే మఱియేమి నిను భ్రమయించుటెంతపనియిది

పంచబాణుని సూడు దీరగఁబణతి నగుదున్" (పుట. 29)

అంటూ మాయామోహిని రూపాన్ని ధరిచాడు. విష్ణువు శివుడి తమకాన్ని, దర్పాన్ని తన శృంగార చేష్టా విలాసాలతో భంగపరిచాడు. తమకం వీడి, దర్పమణగిన శివుడు విష్ణువును స్తుతించాడు. విష్ణువు 'మదినెంచమనలోన మనకు భేదముగలదె' అని శివుడిని ఊరడించాడు. దర్పంతో ధర్మపథాన్ని వీడిన శివునికి అతని తమకాన్ని అణగించి, గర్వభంగం కలిగించడానికి విష్ణువుకు కలిగిన ఉత్సాహం వలన మోహినీకాంత ఆవిర్భవించింది. మోహినీ విలాస చేష్టలన్నీ ఈ ఉత్సాహ ప్రతిఫలనమే కాబట్టి ఇది ధర్మవీరమని తెలుస్తున్నది. ఈ విధంగా అంగిరసమైన శృంగారానికి ధర్మవీరం అంగరసమై పై విధంగా ప్రవర్తిల్లిన్నదని చెప్పవచ్చు.

హాస్యం

విష్ణువు మాయామోహినిగా అవతరించిన సందర్భంలో అక్కడ ఉన్న ప్రమథులు పొందిన శృంగార పారవశ్యం, వారి వికృత చేష్టలు హాస్యరస స్ఫోరకంగా ఉన్నాయి.

"శైవుడొక్కడు బారజాచి మోహినియనుచు, గారవంబున నొకని గౌగిటను జేర్చెన్ ప్రమదముననొక రుద్రభటుడు తన కుంచెయని, గమకించి యొకని గడ్డము పట్టితీసెన్" (పుట. 34) ఇక్కడ మోహినీకాంత అతిలోకసౌందర్యానికి పరవశులై ప్రమథులు చేసిన వికారపు చేష్టలు, వారి హావభావాలూ హాసమును కలిగిస్తున్నాయి. మోహిని అని ఒక ప్రమథుడు మరొకడిని కౌగిలించుకోవడం, జడలు వీడునట్లుగా శివమాడట తమకంతో మరొక ప్రమథుడు స్తంభం మీది ప్రతిమను ముద్దాడట వేరొక ప్రమథుడు శిష్టని

జడపట్టిలాగట పక్కనున్న వాని గడ్డమును కుంచె అని భ్రమించి మరొక ప్రమథుడు లాగటం మొదలైన ఈ వికారపు చేష్టలన్నీ హాస్యరసమును పండిస్తున్నవి. కాబట్టి ఇది హాస్యరమని చెప్పవచ్చు.

కరుణరసం

మదనాంతకుడైన శివుడే మోహినీకాంత మోహంలో తగుల్కొని పరిపరి విధాలుగా పరితపించాడు. శృంగారవనంలో మోహినీకాంత అదృశ్యమవగా,

"అయ్యయో నా మోహ మారడిచేసి,
యొయ్యారి చేఁజక్కియును జిక్క కరిగె
కనుదోయి నీరు గ్రక్కున గోటమీటు,
నెలుగురాలు పడంగ నింపు దొఱంగ" (పుట.58)

అని శివుడు విరహంతో దుఃఖించినట్లుగా వర్ణించబడింది. ఇక్కడ శివుడు విరహాతిశయంతో విలపించడం, అతడి దీనమైన విలాపాలు శోకంగా పరిణమించాయి. శివుడి దైన్యత, దాని వలన కలిగిన శోకం ఇక్కడ కరుణరసాన్ని కలిగిస్తున్నది.

బీభత్సం

శివుడు మోహవివశుడై మోహినీ కాంతను పట్టబోయే సమయంలో అతడి మొలవస్త్రం తొలగుట మోహినీకాంతను కౌగిలించుకోగానే స్ఖలితరేతస్కుడగుట అనే వర్ణనలు జుగుప్సావహంగా ఉన్నాయి. అవి బీభత్స రసహేతువులు అవుతున్నాయి.

"వీడెమొల పులివన్నెపట్టు, తోడు, తోడఁ గనఁబడెలోని గుట్టు " (పుట.66)

"చేల విడినది వేలబడినది, నిగ్గుబాయుట యెగ్గడాయుట
నీలకంఠుడు తెలియఁజాలకబాళిమీఱి " (పుట.67)

"అడుగులు తొట్రిలంగ నిటులంగనంగౌగిటనుంచుకొన్నయ
ప్పుడె తనులెల్ల జెమ్మరిల్లబోరన జాఱిన శుక్ల మేఱులై
మడుగులు గాల్వలై ధరణి మండలిసోకిన..." (పుట.67) అంటూ శివుడి శుక్లం పతనం కావడం వర్ణించబడింది. ఇక్కడ శివుని తమకం వలన మొలవస్త్రం తొలగుట ద్వారా లోనిగుట్టు కనబడింది. అతడు దానిని గమనించక మోహినిని కౌగిలించుకోగా శుక్లం ఏఱులై పారింది అని వాచ్యము చేయుట వలన ఈవర్ణన జుగుప్సావహమవుతున్నది. ఇలాంటి జుగుప్సాహేతువగు వర్ణన చేయుట వలన ఇది బీభత్సరసము అవుతున్నది.

రౌద్రం

శివుని ఎదుట నారదుడు విష్ణుమాయను ఉత్కర్ష చేయగా, దానికి కోపించిన ప్రమథులు నారదుని నిందించే సందర్భంలో రౌద్ర రసం కనిపిస్తున్నది.

"కినుక రదనములు కిటకిట గీటువారు, మొగమెఱ్ఱవారబొమ ముడి వెట్టువారు

శివుని నిందింప వచ్చితె యనెడివారు, ఎటులనీశ్వరు మహిమ లెఱుగుననువారు
ఇచట నితని ప్రతిష్ఠలేమి యనువారు" (పుట. 22)

అంటూ ఎల్లన ప్రమథుల కోపాన్ని పై విధంగా వర్ణించాడు. ఇక్కడ ప్రమథులు తమ ప్రభువైన పరమశివుని మహత్వాన్ని కాదని, నారదుడు విష్ణుమాయను పొగడటాన్ని సహించలేక కోపంతో అతడిని నిందించారు. అప్పటి వారి హావభావాలు పై వర్ణనలో ప్రతిఫలిస్తున్నాయి. క్రోధా విష్టులయిన ప్రమథుల కోపపుచేష్టల వర్ణన చేయుట వలన ఇది రౌద్రరసము అవుతున్నది.

అద్భుతం

విష్ణువు మోహినిగా అవతరించగానే శివునికి సాత్త్వ్వక భావాలు కలిగి, ఆ కొలువుకూటం అంతా క్షణమాత్రంలో శృంగారవనంగా మారిపోయింది. ఆ సందర్భంలో శివుడికి కలిగిన విస్మయం అద్భుతరసావిష్కరణకు దోహదమవుతున్నది. విష్ణుమాయా ప్రభావం వలన మోహినీ వశుడయిన శివుడు తన ఆసనాన్ని దిగగానే పార్వతి, ప్రమథులు, దేవతాప్రముఖులు అందరూ అదృశ్యమైనారు. క్షణమాత్రంలోనే కొలువుకూటం, "కనకసాలములెల్లనచ్చటఁగనకసాలములయ్యెఁగీర్తులు
మొనసె నారద మునియు నారద ములతెఱంగు
ఈ లాగున నాస్థానంబంతయు నుద్యానవనంబైనఁ" (పుట. 39)

దానిని చూసి శివుడు చోద్యపడినట్లుగా వర్ణించబడింది. కనకమయమైన ఆ కొలువు కూటమంతా సంపెంగ వృక్షాలతో నిండిపోయినది. ఆ కొలువులోని పురుషశ్రేష్ఠులు అందరూ సురపొన్నచెట్లుగా మారిపోయారు. మనోజ్ఞమైన లతాతోరణాలు అన్నీ పూలగురివెంద తీగలుగా పరిణమించాయి. సభలోని దేవతలందరూ జాజిపూలవనంగా మారిపోగా, నారదముని నారింజవృక్షంలాగ శోభిల్లగా, ఆ సభామందిరం శృంగార వనంగా పరిణమించింది. ఈవిధంగా ఆస్థానమంతా ఉద్యానవనంగా మారిపోగా చూచి శివుడు ఆశ్చర్యపోయాడు. ఇక్కడ కొలువుకూటం అంతా క్షణమాత్రంలోనే శృంగారవనంగా మారిపోవటం, కొలువులోని వస్తుసంచయాలు, పురుషులు అందరూ వనాంతర వృక్షాలుగా పరిణమించటం అనేది శివునికి విస్మయ కారకమైంది. కాబట్టి ఇది అద్భుతరసం అవుతున్నది. ఈవిధంగా కంకంటి పాపరాజు తన యక్షగానంలో కథోచితమగురీతిలో పాత్రగత సంభాషణ, చేష్టావిలాసాదులకు రసపుష్టిని కలిగించేట్లుగా రసనిర్వహణ చేనాడని పైన చూపిన నిదర్శనాల వలన తెలుస్తున్నది.

5.2.2.3. కంకంటి నారసింహకవి – రస నిర్వహణ

నారసింహకవి తన ద్విపద 'విష్ణుమాయా విలాసము' లో గ్రహించిన ఐదు కథలలోనూ నవరసభరితమైన వర్ణనలు చేశాడు. అవి ఈ కావ్యంలో ప్రవర్తిల్లిన తీరు ఈ విధంగా ఉంది.

వీరరసం

ఈ కావ్యంలో శృంగారం అంగిరసం కాబట్టి వీరం అంగరసమవుతున్నది. ఎల్లనార్యుని విధంగానే నారసింహకవి కూడా ధర్మవీర ప్రతిపాదికములైన కథలనే గ్రహించాడు. కాబట్టి ఇందులో 'ధర్మవీరం' అంగరసమని తెలుస్తుంది. విష్ణుమాయను అపహసించి లక్ష్మి, బ్రహ్మ, శివుడు, నారదులు తమ స్వీయ ప్రతిభాసామర్థ్యాలను పొగడుకొని, విష్ణుదూషణ చేశారు. అహంకారమతులైన వీరందరినీ విష్ణువు తన మాయాజాలంలో తగుల్కొనునట్లుగా చేశాడు. వారికి తగు విధంగా ప్రాయశ్చిత్తాన్ని కలిగించి, పశ్చాత్తాపంతో శరణు వేడునట్లుగా చేశాడు. చివరకు వీరందరినీ ఉద్ధరించిన శ్రీమహావిష్ణువు సంకల్పం ఉత్సాహం కాగా, అది ధర్మ స్థాపనము నందు ప్రవర్తిల్లటంచేత రసము ధర్మవీరము అవుతున్నది.

శ్రీమహాలక్ష్మి జూదంలో ఓడినందుకు అవమానపడి విష్ణువుమీద కోపించింది. ఆడువారిని భ్రమింపజేయు విష్ణుమాయ తన మాయకు సాటిరాదని గర్వించి పలికింది. అంతటితో ఆగకుండా,

"నీదైన వైకుంఠ విలయోత్సములు। నీదుగృహశ్రీలు నీవైభవములు
నద్దేవి వైకుంఠసామ్రాజ్య। విభవమంతయుమ్రింగె" (పుట. 35)

అంటూ మహాలక్ష్మి వైకుంఠపురాన్ని శూన్యం చేసింది. సర్వమంగళాధిదేవత అయిన శ్రీమహాలక్ష్మి ఇలా నిర్దయగా వైకుంఠపుర వైభవాన్ని కబళించగా, విష్ణుదేవుడు ధర్మమార్గాన్ని వీడిన ఆమెను సంస్కరించాలని నిశ్చయించాడు. మహాలక్ష్మి మత్సరంతో కావించిన ఈ అకృత్యపుచేష్టలు, విష్ణుమాయను తిరస్కరించి తన మహిమను పొగడుకొన్న ప్రలాపములు అన్నీ ఉద్దీపనకాగా విష్ణువు ఆ దేవిని ఉద్ధరించాలని ఉత్సాహించాడు. బలము, పౌరుషము, సంపద విలాసముల వలన జనులు దుర్వినయ గర్వాంధమతులు అవుతారు. కాబట్టి సతిగాని, సుతుడుగాని, హితుడుగాని, సామంతుడుగాని ఎవ్వరికైనా హద్దుమరచి నేరం చేసినచో ఏ విధంగానైనావారికి దర్పభంగం కావించుట భగవంతుని విధి అందుచేతనే విష్ణువు

"దాలక్ష్మినెడు మదంబుననున్న। యీలేమ దుర్భావమిగిరింపవలయు
కావున నిమ్మహాగర్వాంధురాలి। భావంబు కలుషిత పాలుగానిపుడు
గావింతు వేరెయొక్క రమావధూటి..." (పుట. 41)

అంటూ మహాలక్ష్మికి ప్రతిగా మాయాలక్ష్మిని కల్పించి, వైకుంఠపుర వైభవాన్ని ప్రకాశింపజేశాడు. మహాలక్ష్మిని ఉద్యానవనంలో ఏకాకిని చేసి, ఆమె ప్రభను సంగ్రహించాడు. మహాలక్ష్మి మాయాలక్ష్మి వైభవానికి, చెలికత్తెలు విడిచి వెళ్ళుటకు, భర్త ఎడబాటుకు కలిగిన బాధను భరించలేక పశ్చాత్తాపంతో పరితపించింది. మహాలక్ష్మి విష్ణుమాయను తరియించలేక పరిపరివిధాలుగా పరితపించగా విష్ణుదేవుడు అనుగ్రహించాడు.

ఇక్కడ మహాలక్ష్మి సంపదగర్వంతో విష్ణుమాయను తిరస్కరించింది. అందుచేత విష్ణువు ఆమెకు తన మాయా విలాసవైఖరితో గర్వభంగం కావించడానికి వైకుంఠపురాన్ని తిరిగి ప్రకాశింపజేశాడు. మాయాలక్ష్మిని కల్పించాడు. మహాలక్ష్మిని ఒంటరిని చేశాడు. ఈ చేష్టలన్నీ విష్ణుదేవుని ఉత్సాహాన్ని వ్యక్తం చేస్తునాయి. కాబట్టి విష్ణువునకు మహాలక్ష్మిని ఉద్ధరించడానికి కలిగిన ఉత్సాహం స్థాయీభావం కాగా ఇక్కడ ధర్మవీరం రసమవుతున్నది. ఇదే విధంగా బ్రహ్మ, శివ, నారదాదుల దర్పాన్ని భంగం కావించేటప్పుడు కూడా భగవంతుని ఉత్సాహం ధర్మస్థాపనార్థమే వ్యక్తమయింది. కాబట్టి అక్కడ కూడా ధర్మవీరమే అంగరసమవుతున్నది.

పుండరీకుడు పరమ భాగవతోత్తముడు. సాత్త్వికగుణ సంపన్నుడు. నిరంతర సాలగ్రామ పూజావ్రతుడు. అతడు విష్ణుమాయను సందేహించి, దానిని తీర్చమని ప్రార్థించగా విష్ణువు అతడి మీద దయాపూర్ణుడైనాడు. విష్ణువు మాయా ప్రభావంతో పుండరీకుడిని మాయాసంసార బంధంలో తగిలించాడు. సంసారబంధంలో తగుల్కొని పలువిధాలుగా పరితపించిన పిమ్మట పుండరీకునికి ముక్తిమార్గాన్ని అనుగ్రహించాడు.

"బాలక నీ మనస్సంశయం బడచు । హాళిమైభూరి మాయావిలాసమున
నిర్మల పదమిచ్చు నెనరుతో నింత । ఆయాసపెట్టితి నార్తిఁజెందకుము" (పుట. 91)

అని ఊరడించాడు. కాబట్టి ఇక్కడ భగవంతునికి పుండరీకుని మీద కలిగిన 'దయ' స్పష్టమవుతున్నది. దయారూపకమగు భగవంతుని ఉత్సాహం పుండరీకునికి మోక్షపదవిని అనుగ్రహించినందు వలన ఇక్కడ దయావీరము రసమవుతున్నది. ఈ విధంగా నారసింహకవి తన కావ్యంలో శృంగార రసానికి అంగరసంగా వీరమును ధర్మ, దయా భేదాలతో పరిపోషించాడని తెలుస్తున్నది.

హాస్యం

బ్రహ్మ విష్ణుమహిమను, మాయాప్రభావాన్ని తిరస్కరించి తనమహిమను పొగడుకొన్నాడు. విష్ణువు మాయాసరస్వతి రూపంతో బ్రహ్మను మోహంలో ముంచివేయగా అతడు కామాతురుడైనాడు. మందరగిరి గుహాంతరం నుండి మాయాసరస్వతి అదృశ్యమవగా బ్రహ్మ ఆమెను వెంబడించి వెలుపలికి వచ్చిన సందర్భంలో,

"వచ్చి మార్కండేయ వాచంయమీంద్రుఁ । డచ్చట విష్ణుమాయా జయంబునకుఁ
వెలవెలబోవు వివేక విహీను । నలువ నప్పుడు చూచినవ్విరందఱును" (పుట. 104)

అంటూ బ్రహ్మ వికారపు రూపాన్ని వర్ణించడం కనిపిస్తుంది. సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు విష్ణుమాయామోహంలో తగుల్కొని, మాయాసరస్వతి కొరకు దిగులుతో, వగపుతో, ఆశ్చర్యం, సిగ్గు కనబడగా వెలవెలబోతూ దీనుడైనాడు. బ్రహ్మరూపం, అతని చేష్టాదులు మార్కండేయాది మునులకు వికారమయంగా కనిపించగా వారందరూ

నవ్వుకొన్నారు. ఇక్కడ బ్రహ్మ యొక్క రూపదైన్యత, అతని వగపు, సిగ్గు, బిడియం, వెలవెలబోవు వికార రూపం, చేష్టాదులు హాసమునకు ఉద్దీపనకాగా రసము హాస్యము అవుతున్నది.

కరుణరసం

నారదగర్వభంగ కథలో నారదుడు విష్ణుమాయా ప్రభావం వలన చంద్రరేఖ అనే స్త్రీగా మారి మాయాసంసార బంధంలో చిక్కుకొన్నాడు. యుద్ధంలో భర్త, కుమారులూ మరణించగా, చంద్రరేఖ ఆ రణరంగంలో మరణించిన తన వారిని చూచి దుఃఖించే సందర్భంలో

"నతిరక్త పంకిలంబగు రణక్షోణి। యతిశయ రక్తిమనతులమైయుండె
నేమిసేయుదు నింకనెక్కడ జొత్తు। నీ మహాపదకని యేడ్చుచు నుండి" (పుట.170)

అంటూ కవి చంద్రరేఖ శోకాన్ని వర్ణించాడు. ఇక్కడ భర్త, పుత్ర మరణ వియోగం ఉద్దీపనకాగా రణరంగంలో విగతజీవులైన వారిని చూచి చంద్రరేఖ పొందిన శోకం స్థాయీభావంగా కరుణరసం వర్ణితమైనది. ఇదేవిధంగా పుండరీకుడు బోయకాంతతో మాయాసంసారం చేసేటప్పుడు కరువు విలయానికి అతని కుమార్తె, అత్తమామలు మరణించారు. ఆప్తుల మరణం ఉద్దీపనకాగా, అక్కడ పుండరీకునికి కలిగిన శోకం స్థాయీభావంగా కరుణ రసవర్ణన చేయబడింది.

భయానకం

పుండరీక చరిత్రలో కరువును వర్ణించే సందర్భంలో భయానకరసం వర్ణించబడింది. పుండరీకుడు బోయ ఇల్లాలితో సంసారం చేస్తున్న ప్రాంతంలో ఏర్పడిన తీవ్రమైన దుర్భిక్ష పరిస్థితులకు తాళలేక జనులు పడుతున్న కష్టాలను,

"నాలీడ జఠర క్షుధాగ్ని సంతప్త ।బాలవృద్ధస్త్రైణ పరిదేవనములు
గాన రక్షంతి పుణ్యాని పురాకృ। తానియన్ధార్మిక తతిధైర్యమమరె" (పుట.83)

ఆకలిబాధకు తాళలేక జనులు చేసే పరిదేవనములు, నీరు, గడ్డిలేక కృశించి పశువులు చేసే అంభారవములతో దిక్కులు పిక్కటిల్లినాయి. 'భిక్షాందేహి', 'నాస్తి గచ్ఛగచ్ఛేతి' అనే దీనారవములు, 'దరిద్రస్యమృతస్యచ' అని వగచేవారు, 'జాతస్య మరణం ధ్రువంబు' అనే విరక్తి మాటలు, 'రక్షంతుపుణ్యాని పురాకృతాని' అనే ధార్మిక వచనాలతో ఆ ప్రాంతం మార్మోగుతున్నది. ఇక్కడ జనుల దుస్థితి, దీనాలాపాలు, నిర్లిప్తత, దైన్యత, కరువు వలన కలిగిన పరమ అనర్థభూతమగు పరిస్థితులు భయావహం కాగా భయానక రసం వ్యక్తమవుతున్నది.

బీభత్సం

పుండరీకుని మాయా సంసారాన్ని కరువు కాటకాలు చుట్టుముట్టగా, అప్పటి పరిసరాల జుగుప్సావహమైన పరిస్థితిని కవి ఇలా వర్ణించాడు.

"జారాపణంబులుప్రాణనిర్ముక్త । కరిహయోష్ట్రశ్వానగార్దభమహిష
బవలు సంధ్యలురేలు బహుళ పిశాచ । నివహకోలాహల నిబిడంబులయ్యె" (పుట. 83)

ఇక్కడ పట్టణాలన్నీ జంతు కళేబరమయంగాను, గృహాలన్నీ జనులు శవమయంగాను, శవనివహాల మీద చరించే రాబందువుల, జంతువుల కలకల స్వనములు, దుష్కర్మలు పెచ్చుమీరగా, దుర్వాసనలు చుట్టుక్రమ్ముకొనగా, పగలు, సంధ్యలు, రేలు, పిశాచాల కోలాహలం రేగటం అనేవన్నీ జుగుప్సావహంగా ఉన్నందువల్ల ఇది బీభత్సరసము అవుతున్నది. చంద్రకేతుడు యుద్ధరంగంలో కుమారులతో సహా మరణించిన సందర్భంలో ఆ రణభూమిని వర్ణిస్తూ కవి బీభత్సరస స్ఫురణను కలిగించాడు.

రౌద్రం

బ్రహ్మను దేవతలు, మునులు కీర్తించగా అతడు గర్వంతో, తాను తప్ప అన్యదైవంలేడని అన్నాడు. మార్కండేయుడు విష్ణుమహిమను నుతించగా, బ్రహ్మ ఆ ముని పలుకులకు రోషించి క్రోధావిష్టుడైనాడు.

"ఈ మరుద్గణములు నీమునుప్రభృతు । లీమహామును లీదిగీశులీవసువు
ధిక్కరించితివి బుద్ధియొకింతలేదె । యెక్కడి మునివి నిన్నేమనవచ్చు" (పుట. 67)

అంటూ మార్కండేయుని తూలనాడాడు. సభలో దేవతలు, మునులు అందరి ముందు తనను కాదని, విష్ణుమాయను పొగడిన మార్కండేయుని మాటలు బ్రహ్మకు ఉద్దీపన కలిగించాయి. బ్రహ్మ మార్కండేయుడు తనపట్ల పరమాపరాధం చేసినాడని క్రోధంతో రగిలిపోయాడు. అందువలననే బ్రహ్మ మార్కండేయుని పలుకులు వదరుబోతు మాటలని అతన్ని తీవ్రంగా దూషించాడు. ఇక్కడ మార్కండేయుని విష్ణుస్తుతి ఉద్దీపనకాగా, బ్రహ్మచేసిన దూషణ అంతా మార్కండేయునిపై కలిగిన క్రోధాన్ని వెల్లడిస్తున్నది. కాబట్టి ఇది రౌద్ర రసమవుతున్నది.

అద్భుతం

సంపదగర్వంతో అహంకరించిన శ్రీమహాలక్ష్మి విష్ణుమాయకు తగుల్కొని మాయాలక్ష్మిని చూచి ఆశ్చర్యపోయింది. ఆమె వృత్తాంతం విని సంభ్రమానికి లోనయింది. అంతలో ఆకాశవాణి మాటలతో మాయాలక్ష్మి వైకుంఠానికి వెళ్ళడానికి దివ్యవిమానం, దేవతలు అక్కడికి చేరుకున్నారు. అప్పుడు బ్రహ్మ రుద్రాది దేవతాగణములు చేరి కొలువగా ఆ మాయాలక్ష్మి పుష్పకవిమానాన్ని చేరుకున్నది. దానిని చూసి,

"వియదాది మూర్తియౌ విష్ణునిమీద వివరింప వేఱొక విష్ణుండుగలడె
గలగంటినో భ్రమగప్పెనోలేక । స్థల విశేషమొయింద్రజాలవైభవమొ" (పుట. 53)

అంటూ మహాలక్ష్మి ఆశ్చర్యపోయింది. ఆకాశవాణి పలుకగా, పుష్పకవిమానం ప్రత్యక్షమైంది. దేవతాసమూహం చేరికొలువగా ఆ మాయాలక్ష్మి వైకుంఠపురానికి

ప్రయాణమైంది. దానిని చూసి వేరొక విష్ణువు, లక్ష్మి ఉన్నారా! ఏమో! అని శ్రీమహాలక్ష్మి సందేహంతో విస్మయం చెందింది. ఇక్కడ ఆకాశవాణి పలుకులు, మాయాలక్ష్మి వైభవం, దేవతల వింతచేష్టలు, పుష్పక విమానం ప్రత్యక్షం కావడం, తాను ఉండగా వైకుంఠానికి మరొకలక్ష్మి వెళ్ళటం అనే సంఘటనలన్నీ ఉద్దీపనలై మహాలక్ష్మికి విస్మయాన్ని కలిగించినందు వలన ఇది అద్భుతరసమని తెలుస్తున్నది.

శాంతరసం

నారదుడు విష్ణుమాయను తిరస్కరించి, చంద్రరేఖ అనే స్త్రీగా మారినాడు. ఆ చంద్రరేఖ యుద్ధంలో భర్త, కుమారులూ, మరణించగా ఒంటరిగా రణభూమిలో విలపిస్తూ ఆకలిబాధకు తాళలేక పరితపించింది. అప్పుడు విష్ణువు వృద్ధతాపసి రూపంతో వెళ్ళి కర్తవ్యబోధ చేయగా,

"మరుబోలు మగడును మానాఢ్యులైన । సుతులును బొలియగాజూచితినేటి
దేహంబుపైఁ గాంక్ష తీఱె సంసార । మోహంబు వాసె నీ ముఖ్యవాక్యముల"

(పుట. 172) అంటూ చంద్రరేఖ అతనితో పలికింది. చంద్రరేఖ ఆ తాపసితో భర్త, కుమారులు మరణించగా చూసి, ఇంకా జీవించి ఉన్న ఈ నీచపు పడతి జన్మచాలు. ఏడేడు జన్మలకు కూడా ఇక ఆడపుట్టుక వద్దు. సకల సంపదలతో రాజ్యసుఖాలు అనుభవించిన ఆ కాపురమంతా క్షణంలో నశించింది. ఇక జీవితాన్ని చాలించి, దివ్యలోకాలు పొందుతాను అని నిర్వేదంగా పలికింది. ఇక్కడ చంద్రరేఖ చూసిన భర్త, కుమారుల మరణం, క్షణభంగురమైన సంసారబంధం ఇవన్నీ ఉద్దీపన కాగా, ఆమె మాటలు నిర్వేదభరితమై వెలువడినాయి. కాబట్టి ఇది శాంతరసమని తెలుస్తున్నది. ఈ విధంగా నారసింహకవి తన కావ్యంలో కథా పరిపోషకంగా నవరసాలనూ సందర్భోచితంగా పోషించినాడనిపై నిదర్శనాలు వలన తెలుస్తున్నది.

5.2.2.4. రోసనూరి వేంకటపతి – రస నిర్వహణ

వేంకటపతి తన కావ్యంలో శివదర్పభంగ కథను రసభరితంగా వర్ణించాడు. ఆయాతావులలో రసబంధురంగా వేంకటకవి చేసిన వర్ణనలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

వీరరసం

శివుడు నారదుని మాటల చేత ప్రేరేపించబడి మాయామోహినీ రూపాన్ని చూడటానికి వైకుంఠానికి వచ్చినపుడు,

"మరునిజయించి మృత్యువు ప్రమత్తవిధంబుడిగించిలోకభీ
గురుకొని తళ్కునీకులుకు గుబ్బలు నిక్కగంజూచిమెచ్చెదన్" (2-75)

అని శివుడు మరుని జయించితిని, మృత్యువును చంపితిని. లోకభీకర గరళాన్ని మింగితిని అటువంటి తనను నారదుడు పరిహాసమాడుట తగదని తమకంతో పలికాడు.

ఈ తమకపు పలుకులు ఉద్దీపనకాగా, శ్రీమహావిష్ణువుకు శివుని సంస్కరించవలెననే ఉత్సాహం కలిగింది.

" శ్రీ నిత్యాత్మకుడం తరంగమునన్, జింతించి రౌద్రాకృతిన్

పూనన్ వెన్కను జూతమీ తని ఘనంబున్ బెంపు సొంపరగన్" (2-80)

అని విష్ణువు, శివుడు సర్వజ్ఞుడైన కూడా కోపావేశంతో నారదుని మాటలు నిమిత్తంగా తనను చుల్కన చేయడానికి కారణం అతని అహంకారాత్మ అని గ్రహించాడు. అందువల్లనే మంచి మాటలతో సరిపుచ్చుదామని భావించాడు. విష్ణుదేవుని ఈ యోచన శివుడిని ఉద్ధరించటానికి అతని మనసులో కలిగిన ఉత్సాహాన్ని సూచిస్తున్నది. శివుడు అహంకరించి, విష్ణుమాయను తేలికచేసి తన ఘనతను పొగడు కొన్నాడు. విష్ణువు శివుని గర్వక్రౌర్యాలను తప్పక భంగపరచాలని నిశ్చయించుకొన్నాడు.

"మాన్యుడవంచు నిన్నుఁబలుమారునుతింపుచునుండులీలసా

కన్యవిచారమేల కుకుమాయుధు కార్యమె చక్కన య్యేదున్" (2-88)

అని విష్ణువు మోహినీ రూపాన్ని ధరించి, తన శృంగార చేష్టావిలాసాలతో శివుడిని మదనాతురునిగా చేసి, అతని దర్పమణచాడు. ఇక్కడ శివుని దురహంకారం, ప్రమథుల ప్రలాపములు ఉద్దీపనలుకాగా విష్ణువుకు కలిగిన ఉత్సాహం మోహినీ, విలాస, చేష్టాదుల రూపమున వ్యక్తమైంది. తమకం తొలగి శివుడు విష్ణుమహిమను కీర్తించటం అందుకు నిదర్శనం. కాబట్టి ఇది ధర్మవీరమని తెలుస్తుంది. ఈ విధంగా అంగిరసమైన శృంగారానికి అంగభూతమై ధర్మవీరం ప్రవర్తిల్లినదని తెలుస్తున్నది.

హాస్యం

శివుని ఎదుట శ్రీమహావిష్ణువు జగన్మోహినిగా అవతరించే సన్నివేశంలో ఆ జగన్మోహిని రూపవిలాసానికి ప్రమత్తులై ప్రమథులు ప్రదర్శించిన వికారపు చేష్టలు హాస్య రసజనకంగా ఉన్నాయి.

"ప్రమథుఁడొక్కండొక్క ప్రమథుఁదద్భామగా, భావించి గడ్డంబు పట్టితివియు

విరహిసివమెత్తి తెలియక వెనుక ముందు" (2-103) అంటూ మోహినీ సౌందర్య వర్ణన చేయబడింది. భువనమోహనమగు రూపంతో వెలసిన మోహినీకాంత సభలోని వారందరికీ మరులు కలిగించింది. అప్పుడు ప్రమథులు తమతమ ప్రజ్ఞలు, ధైర్య, క్రౌర్యములు విడిచిపెట్టారు. తమకంతో ఒక ప్రమథుడు మోహినిగా భ్రమించి వేరొక ప్రమథుని గడ్డం పట్టి లాగాడు. మోహినిగా భ్రమించి ఒక రుద్రభటుడు వేరొక శివదూతను కౌగిలించుకున్నాడు. ఒక శైవుడు మరొక మహేశ్వరసేవకుని కాంతగా భావించి పెనగబోయాడు. ఒక రుద్రభటుడు బంగారు స్తంభపు బొమ్మను మోహిని అని భావించి ముద్దాడినాడు. ఇలా విష్ణుమాయావిలాస వైఖరి వలన ప్రమథులు చేసిన వికారపు చేష్టలు ఇక్కడ హాసాన్ని కలిగిస్తున్నాయి. కాబట్టి ఇది హాస్యరసము.

కరుణరసం

మోహినీకాంత రూప సౌందర్యానికి లోలుడై శివుడు విరహ భావాన్ని పొందాడు. ఆ సందర్భంలో మోహిని అదృశ్యమవగా ఆమె కొరకు శివుడు విరహాతిశయంతో విలపించటం, అతని దీనత్వం, శోకావస్థ మొదలైనవి కరుణరసమయంగా కనిపిస్తున్నాయి. శివుడు సరస్సులో జలకాలాడుతూ, దగ్గరకు రావద్దని పూపొదరిండ్లలో అదృశ్యమైన మోహిని గురించి నిర్వేదంతో విలపించాడు.

"నీవియోగాగ్నినేమిట, నింకనార్తు,

గోటఁకడ మీటుచును వచ్చి, ... కుధరధ్వ" (3-105)

అంటూ శివుడు మోహిని కనిపించలేదని విరహవ్యథతో పరితపిస్తూ కన్నీరు కార్చాడు. కాసార సైకత తీరము నందు పుప్పొడి రాశులపై దొర్లినాడు. ఈ దైన్యపు చేష్టలు, శివుని శోకం కలిసి కరుణ రస స్ఫురణను కలిగిస్తున్నాయి. కాబట్టి ఇది కరుణరసము.

బీభత్సం

మోహినీకాంతను పట్టుకొనే సమయంలో శివుని ఉన్మాదావస్థ, మొలవస్త్రం తొలగుట, శుక్లపతనము మొదలైన జుగుప్సావహమైన వర్ణనలు బీభత్సరస హేతువులవుతున్నాయి.

"అనువగుమోహముప్పతిల నందముగా మొలఁగట్టిగాగ" (3-140)

"కొట్టునకోర్చి దిట్టడయి గొబ్బునఁబయ్యెదఁగుల్కుగుబ్బలన్" (3-141)

"కడువడి నంగనన్ బిగువు కౌగిట బిగ్గగఁజేర్చుకొన్నయ" (3-142)

ఇక్కడ మోహవివశత్వంతో శివుడు మోహినిని బలవంతంగా పట్టబోయినపుడు అతడి మొలవస్త్రం ఊడితొలగింది. దానివలన లోనిగుట్టు కనబడటం, శుక్లపతనమవటం అనే జుగుప్సాకరమైన వర్ణనలు చేయటం వలన బీభత్సరసం ఉత్పన్నమవుతున్నది.

రౌద్రం

నారదుడు మాయామోహిని విలాసాన్ని వర్ణిస్తూ శివుని ఘనతను చులకన చేసినాడని ప్రమథులు కోపించిన సందర్భంలో రౌద్రరస వర్ణన కనిపిస్తున్నది.

"గిటగిట పండ్లు గీటుచును గ్రిక్కిరినియున్ ముని చుట్టుముట్టియు

ప్పటివలె వేగమేగదిని పట్టుడు బాసకటారి బాపనిన్" (1-105)

అంటూ ప్రమథలు నారదుని చుట్టుముట్టారు. మోహిని విలాసాన్ని చూస్తే శివుడు కూడా మరులు కొంటాడని నారదుడు అన్నాడు. అదివిని ప్రమథులు కోపంతో పండ్లు కొరుకుతూ నారదుడిని చుట్టిముట్టి పరుషపదజాలంతో నిందించారు. ఇక్కడ ప్రమథులు తమ ప్రభువైన పరమశివుని నారదుడు తేలికచేసి మాట్లాడినందు వలన అతనిపై తమ కోపాన్ని ప్రదర్శించారు. ఈ విధంగా ప్రమథుల కోపపు హావభావాల వర్ణన వలన ఇది రౌద్రరసమవుతున్నది.

అద్భుతం

విష్ణువు మాయామోహినిగా అవతరించే సందర్భంలో సభాసదులందరూ ఆ హఠాత్పరిణామానికి విస్మయాకులితచిత్తులైనారు. మోహినీ సందర్శన వలన సభాసదులకు కలిగిన విస్మయం అద్భుత రసహేతువు అవుతున్నది.

"ఆసభనున్నవారతి చంచలాత్ములై, యందరు మిగులమోహములబ్రమయఁ

నిగుడి శివుబ్రోల నెలతయై, నిల్చిపొలచి" (2-93) అని మోహిని శివుని ముందు నిలిచినతీరు వర్ణించబడింది. విష్ణువు మోహినిగా మారిన క్షణంలోనే సభాసదులు అందరూ అతి చంచలాత్ములైనారు. బ్రహ్మకు వేదపాఠాలు తొలగి మదనశాస్త్రం తోచింది. మునులకు జ్ఞానం చెడింది. ముక్తి కాంత మోము వంచింది. హరి యోగమాయ వలన సువాసనతో మోహనాస్త్రంవలె మోహిని శివుని ఎదుట నిలిచి విస్మయపరిచింది. ఆ మోహిని శ్రీవత్సలక్ష్మం వంటి కొప్పుధరించి, కౌస్తుభం వంటి మోవితో, శార్ఙ్గంవంటి కనుబొమలతో, పాంచజన్యంవంటి కంఠంతో, చక్రంవంటి జఘనంతో, మీనాల వంటి కన్నులతో ఎదుట నిలువగా (2-94) సర్వజ్ఞుడయిన శివుడు కూడా విస్మయంతో చకితుడైనాడు. ఇక్కడ మోహినీ అవతారఘట్టం హఠాత్పరిణామం కాబట్టి దానికి సభాసదులు విభ్రమాన్ని పొందారు. ఆ మోహిని అతిలోక సౌందర్యాన్ని చూసి వారు విస్మయాన్ని పొందారు. సర్వజ్ఞుడయిన శివుడే ఆ సౌందర్యానికి విస్మయం చెందుట వలన ఇది అద్భుతరసమవుతున్నది. ఈవిధంగా రోసనూరి వేంకటపతి తన కావ్యంలో శృంగారరసం తోపాటుగా కథోచితమగు వర్ణనలను సందర్భోచితంగా పోషించినాడని పై నిదర్శనాలవలన స్పష్టమవుతున్నది.

5.2.2.5. ఎఱగుడిపాటి వేంకటకవి - రస నిర్వహణ

వేంకటకవి తన కావ్యంలో అంగిరసమైన శృంగారానికి పరిపోషకంగా వీరరసాన్ని అంగరసంగా వర్ణించాడు. దానితో పాటుగా కథాసందర్భాన్ని అనుసరించి తక్కిన రసాలను కూడా వర్ణించిన తీరు క్రింది విధంగా ఉంది.

వీరరసం

ఈ కావ్యంలో వర్ణించిన కథలు నాలుగు. సముద్ర మథనం నెపంగా లక్ష్మీనారాయణుల కళ్యాణం, మోహిన్యవతారం నెపంగా శివదర్పభంగం, బ్రహ్మగర్వభంగం, నారదగర్వభంగం అనేవి ప్రధానకథలు. క్షీరసముద్ర మథనం కథలో దానవులు దురహంకార పరాయణులై దేవతల మీదికి దండెత్తి వచ్చినపుడు శ్రీమహావిష్ణువు నరనారాయణులనే మునుల రూపంతో వెళ్ళి యుద్ధంలో దానవులను దండించాడు. దేవతలను రక్షించాడు. లోకకంటకులైన రాక్షసుల బారినుండి దేవతలను, లోకాలనూ కాపాడటానికి శ్రీమహావిష్ణువు పూనుకున్నాడు. దేవతల సముద్ధరణం, దానవుల దురహంకార భంగం అనే పనుల పట్ల భగవంతునికి కలిగిన ఉత్సాహ

ఫలితమే నరనారాయణులు రాక్షసులతో చేసిన యుద్ధం. రణరంగంలో బలిచక్రవర్తి మొదలుగా రాక్షసవీరులను ఓడించి, పారద్రోలిన తర్వాత నరనారాయణ మునులు ఇంద్రునితో పలికిన మాటలు భగవంతుని ఉత్సాహాన్ని తెలుపుతున్నాయి.

"జయము ఘటిల్లెమీకు దనుజ ప్రకరంబు హతావశేషమున్"

వెనుకటిదుర్దశలించుక, కనుమానమెవిష్ణుభక్తికారడిగలదే" (2-155) అని అరనారాయణులు ఇంద్రునితో అన్నారు. యుద్ధరంగంలో రాక్షససమూహం నశించగా, మిగిలినవారు బలిచక్రవర్తితో కలిసి పారిపోయారు. కాబట్టి మహావిభవంతో మూడులోకాలను పాలించుమని నరనారాయణులు ఇంద్రునితో పలికారు. విష్ణుభక్తులకు ఎన్ని దుర్దశలు ప్రాప్తించినా చివరకు మహావిభవం కలుగుతుందని అన్నారు. ఇక్కడ విష్ణుభక్తులైన ఇంద్రాది దేవతలను రాక్షసుల బారినుంచి కాపాడి ఉద్ధరించటానికి శ్రీమహావిష్ణువు ఉత్సాహం నరనారాయణుల రూపంలో ప్రస్ఫుటమైంది. అది యుద్ధం రూపంతో ప్రకటితమై దురహంకారంతో విజృంభించిన దానవులను దండించింది. సజ్జనులై శరణువేడిన ఇంద్రాది దేవతలను సముద్ధరించింది. దేవతను ఉద్ధరించడానికి, దానవులను దండించడానికి జరిగిన యుద్ధం భగవంతుని ఉత్సాహాన్ని వ్యక్తపరుస్తున్నందువలన ఇది యుద్ధవీరమవుతున్నది.

శివుడు నారదుని కలహపు మాటల వలన దర్పోద్ధతుడై మోహినిని చూడాలని వైకుంఠానికి వెళ్ళాడు. విష్ణువు అతడిని నయోక్తులతో స్వాంతనపరచాలని ప్రయత్నించి, విఫలమైనాడు. విష్ణువు మోహినిగా అవతరించడానికి శివుడిని ఉత్సాహమే ప్రధాన కారణం. "శ్రీహరి శంభుతో ననియె నీయందంతనేలాతినే

మనసొక్కించుకనేనెరుంగుటకు నీమార్గంబునుంబల్కితిన్" (2-222)

అనే శ్రీమహావిష్ణువు మాటలు దీనికి నిదర్శనములు. మోహినీ రూపవిలాసంతో శివుని మరులుకొలిపి, విరహోన్మత్తునిగాచేసి, చివరకి శుక్లపతనమై శివుడు చిన్నబోయినపుడు,

"కారణమిట్టులుండగను గాదన నీకును నాకు శక్యమే

మారమదాపహారముని మానన చారుదయా సాగరా!" (2-303) అంటూ శివుని ఓదార్చుతున్న విష్ణువు మాటలు కూడా శివుని ఉద్ధరించుటకు అతనికి కలిగిన ఉత్సాహాన్ని వ్యక్తపరుస్తున్నాయి. ఇక్కడ శ్రీమహావిష్ణువుకు కలిగిన ఉత్సాహం ధర్మము నందు పర్యవశించుచున్నది. కాబట్టి ఇది ధర్మవీరమవుతున్నది. బ్రహ్మ సృష్టికర్తనని గర్వించి, విష్ణుమాయను లెక్కించక దుర్మదంతో సృష్టి నిర్మాణక్రియను చాలించినాడు. బ్రహ్మ దురహంకారాన్ని నిర్మూలించి అతడిని తిరిగి ధర్మమార్గాన నిలుపుటకు శ్రీమహావిష్ణువు పూనుకొన్నాడు. దానికి సరస్వతి చేసిన ప్రార్థన హేతువు అయింది.

"లేవే భారతి నీతపో మహిమ చాలింపదగున్‌లెమ్మ? నీ

నేవేళన్ నశియించునప్పుడుగదా యిందుండనర్హుండగున్" (3-54)

అని విష్ణువు సరస్వతిని స్వాంతన పరుస్తూ పలికిన ఈ మాటలు బ్రహ్మను ఉద్ధరించి

ధర్మమార్గాన నిలుపుటకు అతడికి కలిగిన ఉత్సాహాన్ని వ్యక్తపరుస్తున్నాయి. విష్ణువు గర్వోద్ధతుడైన బ్రహ్మను తగిన విధంగా తన మాయావిలాస వైఖరితో భంగపరచిన తర్వాత, "మదంబడగి గర్వంబు సర్వంబునుం బూర్వ పక్షంబై తప్తహృదయుండును నత్యంతదీనుండును బహుతరార్తి సమన్వితుండునునై యొక్క విజన ప్రదేశంబున సంపాదిత సర్వసాధనుండై శ్రీశ్రీ హరిపాదారవింద యుగళ సంస్థితహృదయకమలుండై తపోనిష్ఠనచంచల మానసంబునం..." (3-352) అని గర్వం నశించి, పశ్చాత్తాప హృదయంతో బ్రహ్మ శ్రీమహావిష్ణువును శరణు వేడినట్లుగా వర్ణించ బడింది. ఇక్కడ బ్రహ్మ గర్వం, సరస్వతి చేసిన ప్రార్థన ఉద్దీపనకాగా, శ్రీమహావిష్ణువు మాయావిలాస వైఖరికి తగుల్కొని బ్రహ్మ గర్వభంగాన్ని పొందాడు. కాబట్టి ఇక్కడ ఉత్సాహం స్థాయీ భావమై ప్రకాశిస్తున్నది. అది ధర్మాన్ని ఉద్ధరించడానికి హేతువు అయినందు వలన ఇది ధర్మవీరము అవుతున్నది.

ఇదే విధంగా నారదగర్వభంగ కథలో కూడా ధర్మాన్ని ఉద్ధరించడానికే విష్ణువు ఉత్సాహం చూపుట వలన అంగరసము ధర్మవీరమవుతున్నది. ఈ విధంగా వేంకటకవి తన కావ్యంలో అంగరసముగా యుద్ధ వీరం, ధర్మవీర రసాలను పోషించాడని చెప్పవచ్చు.

హాస్యం

శ్రీకృష్ణుడు సపరివారంగా రైవతగిరికి బయలుదేరునపుడు ముందుగా బ్రాహ్మణులకు ముత్తైదువులకు దానం చేయాలని వారిని పిలిపించాడు. అక్కడికి వస్తున్న బ్రాహ్మణులు, ముత్తైదువుల సంరంభం, వారి హావభావాలు హాస్యాన్ని కలిగిస్తున్నాయి.

"పదవె కూంతుర తక్కువెక్కువ, నిముషమింతే తాళవె తొక్కేవు పాంతర కూడనియ్యవె సుబ్బి యిదుగో కోక గట్టుకొ వత్తువిదుగో..." (4-85) అని బ్రాహ్మణ ముత్తైదువుల సంభాషణ ఇక్కడ వర్ణించబడింది. శ్రీకృష్ణుడు దానమీయబోతున్నాడని తెలుసుకొని, ఆ కానుకలు గ్రహించడానికి త్వరపడుతూ బయలుదేరుతున్న బ్రాహ్మణ ముత్తైదువుల సంరంభం, వారి సంభాషణలు, చేష్టలూ ఉద్దీపనలు కాగా చూసే వారికి హాస్యము కలుగుతున్నది. కాబట్టి ఇక్కడ రసము హాస్యము.

కరుణరసం

నారదగర్వభంగకథలో చంద్రకేతుడు, తనకుమారులతో కలిసి యుద్ధ రంగంలో మరణించిన సన్నివేశంలో, రణస్థలంలో వారి శవాలను చూసి చంద్రరేఖ విలపించే సందర్భంలోని శోకవర్ణన కరుణరసభరితంగా ఉన్నది.

"ప్రాణవల్లభుమీద బడిమోదుకొనుచును, పలవరింపుచు దిశల్ కలయజూచి
చంద్రరేఖ దుఃఖ జలధి మునిగె" (5-172)

అంటూ చంద్రరేఖ దుఃఖం వర్ణించబడింది. చంద్రరేఖ రణభూమిలో చంద్రకేతుడు

తన కుమారులతో సహా విగతజీవుడై పడిఉండగా చూసి విలపించింది. భర్త శవం మీదపడి తలమోదుకుంటూ, పూర్వచర్యలను పలుమార్లు పలవరించింది. రణభూమిలో చెదిరిపడిన కుమారుల శవాలను చూసి ఘోరపు దుఃఖాన్ని పొందింది. ఒక్కొక్క కుమారుని శవాన్ని చూసి రొమ్ము గుద్దుకొంటూ మోము బద్దలు కొట్టుకుంటూ రోదించసాగింది. ఇక్కడ చంద్రరేఖకు భర్త, కుమారుల మరణం వలన కలిగినశోకం కరుణరసహేతువు అవుతున్నందువలన ఇది కరుణరసము.

భయానకం

దేవదానవులు క్షీరసాగరాన్ని మథించినపుడు మొదటగా కాలకూటమనే విషం ఉద్భవించింది. ఆ సమయంలో కాలకూట విషప్రభావం ఎంత తీవ్రమైనదో, చెబుతూ

"పటుధూమ జాల సంస్పర్శమంబరమార్గ, చరులత్యంత మూర్ఛలను ముంప
యురలదరికొంచు విషవహ్ని తిరుగజొచ్చె" (1-192)

అంటూ భయంకరమైన విషప్రభావాన్ని వర్ణించాడు. వాసుకిని మందరగిరికి చుట్టి మహాభారంతో క్షీరసాగరాన్ని మథించగా, దానికి సహించేక విషాన్ని క్రక్కినాడు. అది ఉద్ధతమైన ధూమంతోనిండి, మంటలతో ఆకాశాన్ని అంటుతూ, దుర్వహకాలాగ్ని లాగ కాలకూటమనే పేరుతో లోకాలన్నింటినీ క్రమ్ముకొన్నది. దుర్ధరతర తీక్షణతతో భూమిపై వ్యాపించినది. సకల లోకాలూనిండిన ఆ విషవహ్నిని భరించలేక బ్రహ్మాది దేవముఖ్యులు కూడా భయంతో హాహాకారాలు చేశారు. ఇక్కడ కాలకూటవిషం పుట్టడం, అది వ్యాపించటం వలన లోకాలకు కలిగిన భీతి, దేవతా ముఖ్యులు కూడా భయంతో హాహాకారాలు చేయటం అనే వర్ణనలన్నీ భయోత్పాతాన్ని వ్యక్తం చేస్తున్నాయి. కాబట్టి ఇది భయానకరసమవుతున్నది.

బీభత్సం

దేవదానవులతో నరనారాయణులు చేసిన యుద్ధంలో దానవసైన్యం నశించిన తీరును, యుద్ధరంగంలో ప్రత్యక్షమైన బీభత్సమైన వాతావరణాన్ని వర్ణించునపుడు జుగుప్స కలుగుతున్నది.

"... శకలంబులగు సకల పరికరంబులును డొల్లు శిరంబులును పొరలు కళేబరంబులును పరువులెత్తు మొండెంబులును బొబ్బలిడు మస్తకంబులును తుమురగుభూషణంబులును అమేయ ప్రమాణంబులగు నవయవంబులునునై మస్కిష్క కర్దమంబును ఎమ్ముల శిలలును కళేబర మీనంబులును చికుర శైవాలంబులును రుధిరజలపూర్ణంబును...మేధోమస్తిష్క మాంసంబులా పూర్ణంబుగా మెసవికసివోక మసంగుచు భూతప్రేత పిశాచ ఢాకినీ శాకినీ కూష్మాండముఖ భూతగణంబుల కహకహోర్భాట కలకల హాస మహాట్టహాస ప్రముఖ సంకులారావ కోలాహలంబైన రవంబు భీషణంబయెనయ్యెడు" (2-113) ఇక్కడ వర్ణించిన యుద్ధరంగంలోని

సన్నివేశమంతా జుగుప్సావహంగా ఉన్నది. డొల్లుశిరస్సులు, పరుగులెత్తే మొండెములు, బొబ్బలిడు మస్తకములు, మేధోమస్తిష్కమాంసము, భూతప్రేతాల ప్రలాపాలు మొదలగునవన్నీ జుగుప్సాభరితంగా ఉన్నందున ఇది బీభత్సరసమవుతున్నది.

రౌద్రం

అమృతం కొరకు జరిగిన పోరులో దేవతలు అమృతపానం వలన రాక్షసులను ఓడించినారని విని బలిచక్రవర్తి రోషంతో పలికిన మాటలు కోపాన్ని ధ్వనిస్తున్నాయి.

"ఏమేమీ సురలింతగా నెదిరి మిమ్మీరీతి భంగించిరా, క్రక్కించెద నమృతంబును
సృక్కించెద నింద్రునసురశేఖరులారా!" (2-90)

అంటూ బలిచక్రవర్తి రాక్షసులతో పలికాడు. దేవతలు రాక్షసులను మోసం చేశారని, యుద్ధంలో ఓడించారనీ విని బలిచక్రవర్తి కోపోద్రిక్తుడైనాడు. అల్పబలులైన దేవతలు, బలిచక్రవర్తికి దాసులుగా ఉన్నవారు రాక్షసవీరులను మోసగించారని విని కోపంతో, అమృతాన్ని క్రక్కించెదని పరితమాడినాడు. ఇక్కడ బలిచక్రవర్తికి దానవులను దేవతలు మోసంతో జయించినారని వినటం కోపకారణమైంది. తన రాక్షస జాతికి దేవతలు చేసిన పరాభవానికి బలి కోపోద్రిక్తుడైనాడు. కాబట్టి బలిచక్రవర్తి కోపం ఇక్కడ రౌద్ర రసస్ఫూర్తిని కలిగిస్తున్నది.

అద్భుతం

లోకభీకరమైన హాలాహలం జనించినపుడు బ్రహ్మ మొదలుగాగల దేవప్రముఖులు కూడా భయపడి శివుడిని ప్రార్థించారు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఆ హాలాహలాన్ని మింగునపుడు లోకాలన్ని విస్మయంతో వీక్షించాయి.

"ముల్లోకంబులందరికొని,.. ట్లల్లన శంభుండు బట్టి హస్తాబ్జములన్" (2-209)

"పట్టిన నట్టిటు చెదరుచు,.. బెట్టెన్‌లోగొన్నజగముబెగ్గిలునుచున్" (2-210)

శివుడు ముల్లోకాలనూ భయపెట్టిన కాలకూటవిషాన్ని అల్లోనేరెడు పండులాగ అరచేతిలో పట్టి, పట్టినా అటుఇటు చిట్టాడుతున్న ఆ విషాన్ని అమాంతంగా మింగి కంఠంలో ధరించాడు. ఇలాంటి అతిమానుషమైన శివలీలను చూసి దేవతలతోపాటు లోకాలన్నీ విస్మయం చెంది ఆనందించాయి. ఇక్కడ శివునిచేష్టవలన దేవతలకు కలిగిన విస్మయం స్థాయిగా అద్భుతరసం ఆవిష్కృతమైనది.

శాంతం

బ్రహ్మ గర్వోపవిష్ణుడయ్యి, సృష్టినిర్మాణ కార్యాన్ని చాలించి, తన ప్రభావాన్ని ఉ పసంహ రించాడు. బ్రహ్మ సత్యలోకాన్ని విడిచి అదృశ్యుడయినపుడు సరస్వతికి కలిగిన నిర్వేదాన్ని వర్ణించిన సందర్భంలో శాంతరసం ప్రస్ఫుటమవుతున్నది.

"అత్యంత చింతాక్రాంతయై యుపవనంబును నగరంబును కలయ
యత్యంత దైన్య భావంబునొంది యుండుటకు వెరగుపడి..." (3-48)

అని వేంకటకవి సరస్వతి నిర్వేదాన్ని వర్ణించాడు. బ్రహ్మ సత్యలోకాన్ని విడిచి వెళ్ళగానే

అక్కడ అంతా నీరసము, నిస్తేజము, నిరుపమ మాలిన్యం, నిరుత్సకత, అశుభ జ్యోత్న్న, అత్యంతదీనభావం, నెలకొన్నాయి. సరస్వతి నిర్వేదంతో దుఃఖాన్ని పొందింది. ఇక్కడ సరస్వతి నిర్వేదానికి హేతువైన బ్రహ్మగమనం, తద్వారా కలిగిన నిస్తేజము మొదలైనవన్నీ శమమనే స్థాయీభావానికి హేతువులవుతున్నందున ఇది శాంతరసమవుతున్నది. వేంకటకవి తనకావ్యంలోని కథలలో ఇతివృత్తానుసారంగా, అంగరసాలను పోషించాడు. శృంగారం అంగిరసం కాబట్టి దానికి పరిపోషకంగా వీరరసాన్ని, అందులోనూ, కథేతివృత్తాన్ని అనుసరించి యుద్ధ, ధర్మ వీరరసాలను పండించాడు. అనువైన చోటులలో మిగిలిన రసాలను సాంగోపాంగంగా వర్ణించి, విష్ణుమాయా విలాసకథలను రసమయములుగా మలిచాడు. ఈ విధంగా 'విష్ణుమాయా విలాసకావ్యము' లలో ఆయాకవులు తమతమ కావ్యేతివృత్తాలను, కథాసందర్భాలనూ అనుసరించి రసపోషణను కావించిన విధానాన్ని గురించి చెప్పుకోవచ్చు.

5.3. అష్టాదశ వర్ణనలు

ఆలంకారికులు మహాకావ్యానికి చెప్పిన లక్షణాలలో అష్టాదశవర్ణనలు కలిగి ఉండటం అనేది కూడా ఒక ప్రధాన లక్షణంగా కనిపిస్తుంది. ప్రబంధం విషయంలో ఈ లక్షణం అనివార్యమైంది. ప్రబందం అనగానే మొదటగా అష్టాదశ వర్ణనలు ఉండాలనే నియమం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆలంకారికులలో కావ్యవర్ణనలును గురించి మొదటగా ప్రస్తావించింది భామహుడు ఇతడు కావ్యభేదాలను గురించి చెబుతూ, సర్గబంధం అనే మహాకావ్యంలో మంత్ర-దూత-ప్రయాణ-ఆజి-నాయకాభ్యుదయములు అనే పంచసంధులు (వర్ణనలు) ఉండాలని పేర్కొన్నాడు. ఆ తర్వాత దండి తన 'కావ్యాదర్శము'లో కావ్యభేదాలను గురించి ప్రస్తావిస్తూ, సర్గబంధములో అష్టాదశవర్ణనలు ఉండాలని చెప్పాడు. దండి తర్వాత సాహిత్యదర్పణము, అంకారశేఖరము అనే గ్రంథాలలో ఈ అష్టాదశవర్ణనలుకు బదులుగా సుమారు ముప్పై వర్ణనల వరకు పొడిగించడం జరిగింది. అయితే కావ్య వర్ణనలు అష్టాదశ వర్ణనలుగానే ప్రసిద్ధమైనాయి. దండి చెప్పిన అష్టాదశ వర్ణనలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః,
ఉద్యాన సలిలక్రీడా మధుపానరతోత్సవైః,
విప్రలంబై ర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః,
మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి" (దండి. 1981.16)

ఇందులో పేర్కొన్న మంత్ర, దూత, ప్రయాణ, యుద్ధములు భామహుడు చెప్పినవి. మిగిలిన వర్ణనలన్నీ దండి స్వకీయములు. దండి పేర్కొన్న అష్టాదశ వర్ణనలలో ఋతువులు-సూర్యచంద్రోదయాలు-జలకేళి-ఉపవనవిహారం-మధుపానం

-గిరి-వియోగములు శృంగార రసోద్దీపన సామాగ్రి. రతోత్సవము- పుత్రోదయము -శృంగారరస పార్యంతిక విషయములు. అదేవిధంగా మంత్ర-ద్యూత-యుద్ధ-విజయములు వీరరస సామాగ్రిగా గుర్తించవచ్చు.

ఈ విధంగా ఆలంకారికులు చెప్పిన అష్టాదశ వర్ణనలు వీరశృంగార విభావాదికములు అనేది స్పష్టమవుతున్నది. ఆలంకారికుల అభిప్రాయాన్ని అనుసరించి కావ్యంలో శృంగార వీరరసాలలో ఏదోఒకటి అంగి రసంలా ఉండాలి. కాబట్టి వారు చెప్పిన వర్ణనలు కావ్యంలోని రససృష్టికి హేతువులుగా గుర్తించాలి. కావ్యంలో సందర్భాన్ని అనుసరించి రసము, భావములను గుర్తించి, దానికి అనుగుణంగా వర్ణనలు చేయటం కవిలోని కావ్యనిర్మాణ కౌశలాన్ని తెలుపుతుంది. కాబట్టి రసవిరుద్ధమైన వర్ణనలు చేయడం దోషమే అవుతుందని చెప్పవచ్చు.

5.3.1. చింతలపూడి ఎల్లనార్యుడు - వర్ణనా నైపుణ్యం

ఎల్లనార్యుడు తన 'విష్ణుమాయా నాటకము' ను ప్రబంధోచిత వర్ణనలతో పరిపుష్టం చేశాడు. ప్రబంధ రచన ఉత్కృష్టమైన స్థాయిని అందుకొన్న రాయలవారి కాలంలో రచించుట వలన ఈ కావ్యంలో రసబంధురమైన వర్ణనలు సందర్భోచితంగా కనిపిస్తాయి.

5.3.1.1. పుర వర్ణన

'విష్ణుమాయా నాటకము' లో వైకుంఠ పురవర్ణన, కైలాస పురవర్ణన కనిపిస్తుంది. ద్వితీయాశ్వాసంలో వైకుంఠ పురవర్ణన సంక్షిప్తంగా కనిపిస్తుంది. కథాప్రసంగం నేరుగా వైకుంఠంలోనే ప్రారంభించడం వలన అక్కడ సంక్షిప్తత, స్పష్టత అవసరమవుతాయి.

"పాలమున్నీటిలో బ్రభవించును దయరా,

గోపురోద్దామ వరము వైకుంఠపురము" (2-9)

అంటూ వైకుంఠపురం క్షీరసాగరంలో ఏవిధంగా కనిపిస్తుందో వర్ణించాడు. చతుర్థాశ్వాసంలో పరమ శివుడు వైకుంఠానికి బయలుదేరినప్పుడు ఆ నగరంలోని నూతనమైన విశేషాలను అన్నింటినీ ఎల్లనార్యుడు ఉత్ప్రేక్షా భరితంగా మన కళ్ళముందు ఉంచుతాడు. "వలయిత రత్నవప్రము సువర్ణ శిరోగృహ రాజసంచయో

జ్వలితమునైన యప్పురము సాగర మధ్యతటంబునందుని

ర్మల పరివేష చక్రరుచి మండన మండిత చంద్రభాను మం

డల ప్రతిబింబ మోయనంగ నంగడునొప్పు ద్రిలోకపర్యమై" 4-116)

అని వైకుంఠపురం, దానిలోకి ప్రవేశించేవారికి భేరీశంఖ మృదంగనాదాలు మంగళ ధ్వనులతో స్వాగతం పలుకుతున్నాయి. మేలిమిధూపదీపాలు గోపురాలనుండి వెలువడుతున్నాయి. మేలిమి బంగారు మయమై, రత్నకాంతులతో మెరుస్తున్న మేడలు, స్ఫటికమణి కాంతులతో వెలుగొందుతున్న కోట, క్షీరసాగరానికి మధ్యలో వెలసిన నగరం, అక్కడ హరినీలమయమైన మేడలు ఉన్నాయి. కైలాస మేరు పర్వతాలను

వప్రక్రీడతో కొమ్ములతో అలవోకగా కూల్చ గల ఏనుగులు ఉన్నాయి. మనోవంతో పరిగెత్తు గుర్రాలు, హిరణ్యకశి పాదాలను జయించగల రాజభటులు, నిర్మలమైన నీటితో అగడ్త మొదలుగా ఆ వైకుంఠపురం సకల సంపద్విలాసినిగా ముప్పై ఆరుపద్యాలలో (2-9 నుంచి 2-45 వరకు) వర్ణించబడింది. వైకుంఠపురం బ్రహ్మకు పురిటిల్లు. ప్రళయకాలపు దుర్దశలు తాకనైనాలేని పుణ్యభూమి. మోక్షలక్ష్మికి చక్కని కేళిభవనం, పంచభూతాలను పుట్టించునది. ఆ విధంగా వైకుంఠపుర వైభవం 'విష్ణుమాయా నాటకము'లో వర్ణితమైంది.

చతుర్థాశ్వాసంలో కైలాస పురవర్ణనను ఎల్లనార్యుడు వచనంలో సముచిరీతిలో ఈ విధంగా వర్ణించాడు. "... గనక మణిమయ ప్రాకారగోపుర సౌధవీధికా బద్ధతోరణ వైజయంతీ విరాజితంబును, సతత వికసిత సురభి సురతరు కుసుమ విసర విసృమర పరిమళ మిళిత తరుపవన సహచర ముఖర మధుకర నికర మృదునినద హృదయంగమంబును..." (4-69) వెడికొండపై వెలసిన కైలాసపురం కనకమణిమయ ప్రాకారగోపురాలతో, సౌధాలతో నిర్మితమైంది. వైజయంతీ విరాజితమైన తోరణాలు కట్టిన వీధులు ఉన్నాయి. ప్రతి ఇంటి లోపలి నుండి కనకమయమైన ఘంటానినాదాలు వీనులవిందుగా బలి సమయాన్ని తెలుపుతున్నాయి. ప్రాసాద, గోపుర పురోభాగాలలో వృషభ ధ్వజాలు ప్రతిష్ఠించి ఉన్నాయి. అఖండమాణిక్య దీప మాలికలతో అంతర గృహాలు ప్రకాశిస్తున్నాయి. పంచాక్షరీ ప్రముఖమైన, పాశుపత జపధ్యాన పారాయణం జరుగుతూ ఉంది. ప్రమథగణ సహస్రాలతో ముక్తిమండపాలు నిండి ఉన్నాయి. నందికేశ్వర దండనాయకత్వం కింద దేవమునులు కుర్చున్న మండపాలు ఉన్నాయి. ప్రతి ద్వారం వద్ద కనకదండాలు ధరించిన ద్వారపాలకులు అనేకులు అచట ఉన్నారు. అటువంటి జగదేక పూజ్యమైన శివాలయాన్ని, కైలాసపురాన్ని ఎల్లనార్యుడు వర్ణించాడు.

5.3.1.2. సముద్ర వర్ణన

ప్రబంధ వర్ణనలలో సముద్రవర్ణన కూడా ఒకటి. కథానుసారంగా ఇందులో వైకుంఠపుర వర్ణన సందర్భంలో క్షీరసాగరాన్ని యథోచితంగా వర్ణించడం కనిపిస్తుంది. దేవదానవులు అమృతం కోసం సముద్రాన్ని మథించేటప్పుడు సముద్ర వర్ణన ప్రస్తావించబడింది. వైకుంఠపుర వైభవాన్ని మహాలక్ష్మి హరించిన తర్వాత విష్ణువు ఆమెకు గర్వభంగం కలిగించడానికి క్షీరసాగర తీరానికి విహారానికి తీసుకువెళతాడు. అక్కడ వాళ్ళు విమలఫేనకాంతులతో, ఘోషణ భీషణాలతో ఉన్న క్షీరసాగరాన్ని చూస్తారు. ఆ సందర్భంలో విష్ణుమూర్తి మహాలక్ష్మికి క్షీరసాగరంలోని విశేషమైన వస్తువులను చూపుతూ,

"వేల్లితనవీన తర విద్రుమలతోద్యో, త్పల్లవ విలగ్నమయి భాసిలెడుముత్తెం

బల్లదె మృగాక్షి కల శాంబునిధిలోనీ,
యుల్ల సిలు మోవిఁగడు నొప్పి చిఱునవ్వై" (2-44) అని వర్ణించాడు. క్షీరసాగరం నుంచి వెలువడి మెరుస్తున్న ముత్యాలు ఉల్లాసంగా నవ్వుతున్న మహాలక్ష్మి చిరునవ్వులాగా ఉన్నాయి. చంచలనేత్ర అయిన మహాలక్ష్మి చూపులను పోలునటువంటి చేపలు ఆ సముద్రపు అలలపై ఈదుతున్నాయి. మహాలక్ష్మి కంఠానికి సాటి అవుతుందని సముద్రుడు అలల చేతులతో శంఖాన్ని తీరంవైపు విసరగా, అది కదలలేక అట్లే పడి ఉంది అంటూ సముద్రవర్ణన చేయబడింది. ఎల్లన సుదీర్ఘమైన వచనంలో సముద్రాన్ని, అందులోని వస్తు సమూహాన్ని స్త్రీ శరీర పరంగా చిత్ర విచిత్ర రీతిలో వర్ణించాడు. సముద్రుని గుణగణాలను వర్ణిస్తూ నవరసాలనూ వాచ్యం చేస్తూ,

"పాయక పై కొనిన దక్షిణ నాయకత్వంబున నందఱ నొక్క చందంబుగు ప్రేమంబున నుద్దామ దీర్ఘ తరంగ బాహుదండంబులు సాచి కౌగిలించిన తదీయ పద్మ వదన తదధర నిర్గళిత మధుమధురామృత పానంబున నుప్పొంగు లీలాసంగతి వలన శృంగార రసంబును." (2-47) అని సముద్ర వర్ణన చేశాడు.

పై విధంగా ఎల్లనార్యుడు తన కావ్యంలో సముద్రవర్ణన చేస్తూ విశేష పద ప్రయోగాలతో, నూతన భావస్ఫురణతో, చమత్కారవంతంగా ఒక్కో రసానికీ ఒక్కో విశేషమైన అర్థాన్ని ప్రయుక్తం చేస్తూ ఈ వర్ణన చేశాడని తెలుస్తుంది.

### 5.3.13. పర్వత వర్ణన

ప్రబంధ వర్ణనలలో పర్వత వర్ణన కూడా ప్రస్తావించబడింది. ఎల్లనార్యుని 'విష్ణుమాయా నాటకము'లో పర్వత వర్ణన కూడా కనిపిస్తుంది. నారదుడు కైలాసానికి వెళ్ళిన సందర్భంలో హిమవత్పర్వతాన్ని, కైలాసగిరిని విశేషంగా వర్ణించబడం కనిపిస్తుంది. అదే విధంగా బ్రహ్మ సృష్టి కార్యాన్ని చాలించి, తపస్సు చేసుకోవడానికి వెళ్ళినపుడు మందర పర్వతం వర్ణితమైంది. పరమశివుని దర్శించుకోవడానికి వెళ్ళిన నారదుడు చూసిన హిమవత్పర్వత వర్ణన ఇది. రత్నశృంగమయమైనది, శివ తాండవం చేత ఖండ శిఖరమైనది, గంగాప్రవాహంచేత పరిశుద్ధమైనదీ అయిన హిమాలయంపై,

"పార్వతీ శంభుదంపతుల కేళీసౌధ, వాసనాశ్రీధరంబు కైలాస ధరము" (2-63) అంటూ కైలాస పర్వత వర్ణన చేయడం కనిపిస్తుంది. పార్వతీ పరమేశ్వరులకు కైలాస పర్వతం కేళీసౌధం, అమర కన్యకలకు క్రీడాచలం, భూదేవికి శిరోభూషీణం, దశకంధరుని చేతిలో తమ్మిబంతి, పుష్కర శ్రీదేవి పువ్వుగద్దె, పూర్వం రావణుని బాహుబలం వల్ల కైలాసగిరి నెఱియలు పారగా, ఆ నెఱియలలో ప్రకాశిస్తున్న ఇంద్రనీల మణులు తుమ్మెదలుగా కైలాస పర్వతం భూదేవి చేతితో ధరించిన కలువ పువ్వులా ఉంది. ఆకాశగంగా ప్రవాహం ఉన్నత చంద్రకాంత శిలలపై పడగా పైకి ఎగసిన నీటితుంపరలు ఆకాశంలో దట్టమై, వెండికొండపై కొలువైన శివునికి నిర్మించిన ముత్తెపు

మేలుకట్టులాగ కనిపిస్తున్నాయి. అటువంటి కైలాస పర్వతం ఈ కావ్యంలో ఉత్ప్రేక్షలతో ఏడుపద్యాలలో, ఒక వచనంలో వర్ణితమైంది.

తృతీయాశ్వాసంలో మందరపర్వత వర్ణన కనిపిస్తుంది.

"కనుగొనియెనట్లు చని య, వ్వనరుహ సంభవుండు మణిసువర్ణమయోద్య
ద్ఘసశృంగ సంగతస్య, ర్వని తాసాహస్రసుందరము మందరమున్" (3-266)

అంటూ మందర పర్వతాన్ని కేవలం ఒక పద్యంలో మాత్రమే పేర్కొనటం వల్ల, ఆ వర్ణన కథాగతికి ఆటంకం కాకుడదన్నది కవి నిబద్ధతగా భావించాలి.

5.3.1.4. చంద్రోదయ వర్ణన

ఎల్లనార్యుడు తన కావ్యంలో ఋతువర్ణనను చేయలేదు. కథాగమనంలో కల్పించుకొని వర్ణించేందుకు అవకాశం ఉన్నప్పటికే ఔచిత్యదృష్టితో ఋతువర్ణనలను విడిచిపెట్టినట్లు కనిపిస్తుంది. నారద కథలో మాత్రమే చంద్రోదయ వర్ణన ఉంది. అది కూడా కథోచితమైన రీతిలో రెండు పద్యాలలో మాత్రమే వర్ణించాడు. నారదుడు విష్ణుమాయా ప్రభావంతో చంద్రరేఖగా మారి, వివాహం చేసుకొని నూరుమంది కుమారులను పొందిన తర్వాత యుద్ధంలో భర్తతోపాటుగా కుమారులు అందరూ మరణించారు. ఆ సమయంలో చంద్రరేఖ కూడా యుద్ధరంగంలో ఉంది. హరిమాయలోనే సకల జగత్తు మునిగిపోవునట్లుగా చీకట్లలో లోకం మునిగిపోయింది. అపుడు చంద్రోదయమైంది.

"నారదముని యజ్ఞానము, దూరంబైపోవఁ దెలివి దూఁకొనుమదిలో
నీరీతిననెడు పగిదిన, పారతమంబడఁగ నమృత భానుఁడు పొడిచెన్" (5-205)

అని చంద్రోదయ వర్ణన చేయబడింది. అజ్ఞానం వల్లనే నారదుడు అన్నిపాట్లు పడ్డాడు. కాబట్టి అతని అజ్ఞానం తొలగి తెలివి కలిగే విధంగా, అపార తమస్సును అణచునట్లుగా అమృతకిరణుడు చంద్రుడు ఉదయించాడు. నారదుడు శ్రీమహావిష్ణువునకు సన్నిహితుడు కాబట్టి అతనిపై అమేయమైన కృపారసాన్ని కురుస్తున్నట్లుగా వెన్నెల ధారలు కురిశాయి. వెన్నెలలో చకోరపక్షులు ఆనందంతో కోరికలు తీరునట్లుగా విహరించాయి. ఆ విధంగా చంద్రోదయమైందని ఎల్లన వర్ణించాడు.

5.3.1.5. సూర్యోదయ వర్ణన

ఎల్లనార్యుడు నారదకథలో సూర్యోదయాన్ని కేవలం ఒకే పద్యంలో సమయోచితంగా వర్ణించాడు.

"నలిన విలోచనుండు కరుణానిధి క్రమ్మఱ సుప్రసన్నుఁడై
నలిన సహితుండుదోఁచె నలినప్రకరోల్లసనంబు మీఱగన్" (5-208)

నలిన విలోచనుడైన శ్రీమహావిష్ణువు నారదుని పట్ల సుప్రసన్నుడైనాడు. నారదుడు గర్వాంధుడు కాకున్న పూర్వపు వర్చస్సును తిరిగి ఇవ్వడానికి, అజ్ఞాన తిమిరాన్ని

అణచి, దయనంతా ముద్ద చేసి తెచ్చెనా అనే విధంగా సూర్యుడు ఉదయించాడు. ఈ సూర్యోదయం కారణంగా విష్ణువుకు భక్తుల పట్ల గల ఆదరణభావం, అతని దయాగుణం, మరీముఖ్యంగా నారదుని పట్ల గల అనురాగం చక్కగా వెల్లడవుతున్నాయి.

5.3.1.6. ఉద్యానవన వర్ణన

ప్రబంధ నాయికల విహారాలన్నీ ఉద్యాన వనాలలోనే జరుగుతాయి. బట్టి ఉద్యానవన వర్ణన ప్రబంధాలలో తరచుగా కనిపిస్తుంటుంది. 'విష్ణుమాయా నాటకము'లో ఉద్యానవన వర్ణన ద్వితీయాశ్వాసంలో మహాలక్ష్మి క్షీరసాగర తీరంలో చూచిన వనాన్ని గురించి చెప్పేటప్పుడు కనిపిస్తుంది. శివుడు మోహినిని వెంబడించే ఘట్టం అంతా మాయా శృంగారవనంలోనే జరిగింది. ఆ సందర్భంలో విశేషించి ఉద్యానవన వర్ణన కనిపిస్తుంది. విష్ణుమూర్తి మహాలక్ష్మితో కలిసి సముద్ర తీరంలోని ఉద్యాన వసంలోకి వెళ్ళాడు. అది తాళ, పూగ, నారికేళ, కేతక, వకుళ, కదళి, వనస, సింధువార పారిజాత మొదలగు చెట్ల సమూహంతో నిండిన ఉద్యానవనం. అందులో లక్ష్మీదేవి మొదలైన కాంతలు విహరించిన తీరు ఇది.

"నిండారు బొన్నలనెత్తావిఁ గైకొని,కాత్మగంధ వహోర్థంబు సార్థకముగ" (2-49) సకల జగత్తును జయించాలని కడువేగంతో వచ్చి దండు దిగిన మన్మథుని లాగ ఆ వన సౌందర్యం ఉల్లాసభరితంగా ఉంది. పొదరిండ్ల నీడలు శీతాకాలాన్ని, పూదేనె తుంపరలు వర్షా కాలాన్ని, కోకిల నాదాలు వసంతకాలాన్ని, కాశ్మీర గంధాన్విత ఉష్ణవాయువులు గ్రీష్మర్తువును, మధుకరగతితో కనిపించే మేఘతతులు శరత్కాలాన్ని స్ఫురింపచేయగా ఆ వనం చూసే వారికి ప్రమోదభరితమైంది. అటువంటి వనంలో విష్ణువు లక్ష్మితో కలిసి పలు రకాల పుష్పాలను సంగ్రహించి, వాటిని అనేక విధాలుగా ధరించి, ఆనందిస్తూ, ఆస్వాదిస్తూ పుష్పాపచయ క్రీడలతో వనవిహారం చేశారు.

చతుర్థాశ్వాసంలో మోహినీకాంత వెంటపడిన శివునికి శృంగారవనం మరింత మదనోద్దీపితమైంది. విష్ణువు కొలువు కూటం క్షణమాత్రంలోనే శృంగారవనంగా మారిన విధాన్ని వచనంలో క్రింది విధంగా వర్ణించాడు కవి. "యా ప్రదేశంబు చూతపనస రంభా ఖర్జూర జంబు జంబీర నారికేళ కురవకాశోక వకుళ కరవీర పారిజాత సిందువారాది పాదప ప్రతానంబును, నేలా లవంగలుంగ మాతులుంగ తక్కోల ద్రాక్షా మాధవీ యూధికా మల్లీమతల్లికా ప్రముఖ లతామంటప కుసుమిత నికుంజ పుంజంబును..."(4-231) ఆ శృంగారవనం చూతపనస రంభాది ఫలవృక్షాలతో, పారిజాత, అశోక, సింధువారాది పుష్ప వృక్షాలతో, ద్రాక్షా, మాధవీ, మల్లికా మొదలగు కుసుమిత లతా మంటపాలతోను, పూపొదరిండ్ల తోను, వికసిత కమలీకైరవ, ఉత్పలాదులతో నిండిన సరోవర సమూహాలతో, మణిమయ దరీగృహాలతో, పుష్పతరు శాఖలతో నిండిన బంగారు ఊయలలతో, కుసుమ రసఫల రసధారా ప్రవాహాలతో,

మందమారుత భరితమై, కోకిలారవ కోలాహలంతో, శుకనికర కలాపాలతో, చంచరీక ఝూకారాలతో, హరిణ మిథున సంచారాలతో ఒక చక్కని వనంగా పరిణమించింది. ఈవిధంగా ఉద్యానవన వర్ణన వైకుంఠపుర సమీపంలోను, విష్ణువు కొలువు కూటమే శృంగార వనంగా మారిన సందర్భంలోనూ రెండుసార్లు శృంగారాతిరేకంగా వర్ణితమైంది.

5.3.1.7. జలక్రీడ

ప్రబంధ వర్ణనలలో వనవిహారంతో పాటుగా జలక్రీడను కూడా వర్ణించడం కనిపిస్తుంది. 'విష్ణుమాయానాటకము'లో మోహిని వనవిహారం చేస్తూ సరస్సులో జలక్రీడలాడుతూ కనిపిస్తుంది. ఆ సందర్భంలో సరోవరంలో మోహిని జలక్రీడలను ఎల్లనార్యుడు క్రింది విధంగా వర్ణించాడు.

"గురుతీరోన్నత కుచకుంభ యుగమ్ముదాఁకి, వీచీపరంపరల్ విఱిగిపడగ
యిందు శేఖరుఁడద్భుతా నందలీల" (4-264)

మోహిని జలక్రీడలు ఆడుతున్న సరోవరంలో అలలు ఆమె శరీరాన్ని తాకి విరిగి పడుతున్నాయి. మోహిని జలక్రీడను హంసలు నేర్చుకుంటున్నాయి. తామర పూవులు పుప్పొడిని, సౌరభాన్ని, పూదేనేనూ నీటి మీద తేల్చుతున్నాయి. మోహిని ముఖాన్ని అరవిందాలు సరిపోలగా, నీలవేణికి సాటిగా తుమ్మెదల గుంపు చేరగా, కుచములతో చక్రవాక పక్షులు పోలగా జలక్రీడలాడింది.

4.3.1.8. విరహ వర్ణన

'విష్ణుమాయానాటకము'లో విరహ వర్ణన బ్రహ్మగర్వభంగ కథలో, శివుడు మోహిని పట్ల మోహవివశత్వాన్ని పొందిన సందర్భంలోను వర్ణించబడింది. విష్ణుమాయా మహత్వ ప్రదర్శన నెపంగానే బ్రహ్మ రుద్రులు ఈ విరహావస్థను పొందారు. ఇదంతా విష్ణుమాయా నాటక ప్రభావమే కాని బ్రహ్మ రుద్రుల మహత్వాన్ని కించపరచడానికి కాదని గ్రహించాలి. బ్రహ్మ విష్ణుమహిమను, మాయా ప్రభావాన్ని తిరస్కరించి, అందరికనా అధికుడను, ఆది దేవుడను నేనే అని అహంకరించాడు. విష్ణుమాయ మాయాసరస్వతీ రూపంతో అతడిని అనేక విధాలుగా మోహపరిచింది. మాయాసరస్వతి శతరూపాలతో రతులలో మునిగించి ఒకనాడు అదృశ్యం అయ్యింది. ఆ సమయంలో మందరగిరి శిఖరం మీద గుహాంతర్భాగంలో ఉన్న బ్రహ్మ మాయ సరస్వతి కనిపించక, విరహభారానికి ఓర్వలేక ఆమెను వెంబడిస్తూ గుహ వెలువపలికి వచ్చాడు. అక్కడ మాయాసరస్వతి అదృశ్యం కాగా, మార్కండేయాది మునులు బ్రహ్మకు కనిపించారు.

"పొలఁతి యదృశ్య భావమును బొందిన తాపసవర్యులద్భుతా
విలమతి నున్న పద్మజు వివేక విహీనునిఁ జూచి రందఱున్" (3-334)

వివేకహీనుడై మన్మథునిచేత బాధింపబడుతూ బ్రహ్మ ముఖంలో దిగుపాటుతో, శరీరంలో కంపనం కలిగి, దైన్యంతో విలక్షణాకారం కలిగి, ఖేదం, లజ్జ కలిసి

దుఃఖసముద్రంలో ముంచినట్లుగా కనిపించాడు. చతుర్థాశ్వాసంలో శివుడు నారదుని మాటల వలన మోహిని రూపాన్ని చూడాలని ప్రమత్తుడై వైకుంఠానికి వెళ్ళాడు. విష్ణువు మోహినీ రూపాన్ని ప్రదర్శించగానే శివుడు మదనాతురుడై తన నైజాన్ని మరిచి, శృంగార వనంలో మోహినిని వెదుకుతున్న సందర్భంలో విరహవర్ణన కనిపిస్తుంది. సర్వజ్ఞుడైన శివుడు అజ్ఞునిలాగ మాయామోహినీ రూపసౌందర్యానికి వివశుడై మదన పీడితుడైనాడు. శివుడు మోహినిని చేపట్టబోయి, ఆమె అదృశ్యమయ్యే సరికి విభ్రాంతితో, మదన జ్వర పీడితుడై విరహభావాన్ని పొందాడు. శివుడు చూస్తుండగానే శృంగారవనంలో తూగుటుయ్యాల మీద నుంచి మోహిని అదృశ్యమవగా అతడు ఖిన్నుడైనాడు. శివుడు నిశ్చేష్టతతో కన్నుల నుండి బాష్పాంబువులు రాలగా, తనువు కంపించగా, కంఠం గద్గదికతను పొందగా నిట్టూర్పులు విడుస్తూ దీనుడై మోహిని గురించి చింతించాడు. ఆమె ఊగిన తూగుటుయ్యాలను సమీపించి దాని అదృష్టాన్ని అభినందించాడు. మోహిని కాంతను పూపొదరింటిలో చూచి,

> "పొనుపుడిగ్గ నేమిటికిఁ బంకజలోచన నన్ను మన్మథా
> గా నొనరింపవే రతుల కందువఁ జెంది కృపాతరంగిణీ" (4-287)

అంటూ విరహభారంతో కన్నుల నీరుకారగా శివుడు దీనుడై మోహినీ కాంతను పరిపరి విధాలుగా వేడుకుంటూ విరహావస్థను పొందాడు. ఈవిధంగా ఈ కావ్యంలో విరహవర్ణన కనిపిస్తుంది.

5.3.1.9. వివాహం

ఎల్లనార్యుడు తన కావ్యంలో వివాహాన్ని గురించి ప్రత్యేకంగా వర్ణించలేదు. కాని ప్రస్తావన మాత్రం చేశాడు. పుండరీకుని చరిత్రలో పుండరీకునికి బోయవనితతో వివాహం జరిగినట్లుగా పేర్కొనబడింది. నారదుని కథలో స్త్రీగా మారిన నారదుని చంద్రకేతుడనే రాజు వివాహం చేసుకొని నూరుమంది కుమారులను పొందినట్లుగా కల్పించాడు. ఈ విధంగా 'విష్ణుమాయానాటకము'లో రెండు పర్యాయాలు ఎల్లనార్యుడు వివాహ ప్రస్తావన చేశాడు. కాని కల్పించుకొని ఆ వివాహాలను గురించి అనవసరమైన వర్ణనలు చేయక ఔచిత్యదృష్టితో విడిచిపెట్టినట్లుగా కనిపిస్తుంది.

5.3.1.10. రతి వర్ణన

ప్రబంధ రచనలో శృంగార వర్ణనలు అనివార్యంగా పరిగణించే కాలంలో రచించడం వలన 'విష్ణుమాయానాటకము'లో కూడా కథాగతిని అనుసరించి రతి వర్ణన చేయడం కనిపిస్తుంది. ప్రథమాశ్వాసంలో రుక్మిణీ సత్యభామలతో శ్రీకృష్ణుని రతివర్ణన ప్రస్తావికంగా కనిపిస్తుంది. తృతీయాశ్వాసంలో పుండరీకుడు బోయకాంతతోను, బ్రహ్మ మాయాసరస్వతితోనూ సాగించిన శృంగారంలో రతి వర్ణన చేయబడింది.

ప్రథమాశ్వాసంలో సత్యభామ మణిమండప పుష్పడోలికా తల్పం మీద శ్రీకృష్ణునితో రమించింది.

"చయ్యన శయ్యడిగ్గి యర జాఱెడు వేణియు మందహాసమున్
యొ్యయ్యన వచ్చె వాకిటికి నుబ్బుచు నవ్విభుఁ గూడి క్రీడమై" (1-142)

ఇక్కడ సత్యభామ, శ్రీకృష్ణుల రతిని ఎల్లనార్యుడు 'రమించుచు' అని మాత్రమే పేర్కొన్నాడు. తర్వాత సత్యభామను సంభోగ చిహ్నాలతో వర్ణించడం వలన శ్రుతిమించని శృంగార వర్ణన చేశాడని తెలుస్తున్నది. కాని పుండరీకుని కథలో పుండరీకుడిని చూసిన బోయకాంత చేసిన చేష్టలు శృంగారాతి రేకంగా ఉన్నాయి. అట్లే పుండరీకుడు బోయకాంత మోహంలో పడి తనలోతాను, '..తదీ యోచిత రతి తంత్ర సుఖ ప్రాచుర్యంబను భవింతు బ్రహ్మము ముట్టన్' అని భావించాడు. అతడు కామోద్రేకం వలన లజ్జాభిమానాలు విడిచి ఆ మాటలే బోయకాంతతో చెబుతాడు. పుండరీకుడు తమకంతో ఆ బోయకాంతను కౌగిలించుకొని, పూర్వం ఆమె యౌవనసిరికి వంశాన్ని మరిచిపోగా, కౌగిలిలో తనువును మరిచాడు.

ఈ విధంగా మోహవినశుడైన పుండరీకుడు, "బ్రహ్మకుల సంభవుండు సంభ్రమించి పరిరంభించి పులక కలితా కలిత గాత్రా భోగుండును, బద్ధానురాగుండునునై కౌగిలి వదలక మదవతి నతి ప్రయత్నంబున నొయ్యన నెయ్యంబుగాఁ దార్చికొని తన్నదీ సవిధ పుష్పితలతా నికుంజక్రోడంబున నిధువన క్రీడలాచరించి" (3-169) అంటూ రతివర్ణన చేయబడింది. ఆ తర్వాత పుండరీకుడు ఆ బోయకాంతతో మాయాసంసారం చేయనారంభించాడు. ఈ వర్ణనలో కూడా సంభోగ ప్రస్తావన ఏక వాక్యంలో చేయబడిందే కాని విశేషంగా వర్ణించలేదు.

బ్రహ్మ విష్ణుమాయను తిరస్కరించి మందరగిరి గుహాంతర్భాగంలో తపోనిష్ఠలో ఉన్నాడు. మాయాసరస్వతి అతడిని మోహవివశుడిని చేసింది. బ్రహ్మ మాయసరస్వతిపై మోహంతో పలువిధాలుగా ఆమెతో సంభోగించాడు.

"అంతకంతకు లతాంతాస్త్ర రసాంభోధి,
లలన నూరు రూపములు ధరించె" (3-328)

అంటూ బ్రహ్మ, మాయాసరస్వతుల రతి వర్ణించబడింది. బ్రహ్మ గాఢరతులకు తాళలేక ఆ మాయాసరస్వతి నూరు రూపాలు ధరించి అతడికి సురత సౌఖ్యం అందించింది. ఇక్కడ మాయాసరస్వతి, బ్రహ్మల రతి వర్ణన మూడు పద్యాలలో చేయబడింది. ఈ శృంగార వర్ణన కూడా నాతి దీర్ఘమై, దాంపత్య శృంగారాన్ని గుర్తు చేస్తుంది. అందువలన ఎల్లనార్యుడు తన కావ్యంలో మితిమీరిన శృంగార వర్ణన చేయలేదని చెప్పవచ్చును.

5.3.1.11. పుత్రోదయ వర్ణన

ఈ ప్రస్తావన రేఖామాత్రంగా పుండరీకుని కథలోను, నారదుని కథలోనూ కనిపిస్తుంది. విష్ణుమాయా ప్రభావంతో పుండరీకుడు బోయకాంతతో సంసారం చేశాక "…. యింటికి సర్వంబు దానమై బోయ కాపురంబు సేయుచుండె, నివ్విధంబునఁ గొంతకాలంబున నప్పువ్వుఁబోణి జవ్వనం బనుభవించి యొక్క కొడుకు నొక్క కూతురం గనియెనంత" (3-169) అని పుండరీకునికి బోయకాంతకు కలిగిన సంతానం గురించి ప్రస్తావించడం కనిపిస్తుంది. నారద గర్వభంగ కథలో విష్ణుమాయా ప్రభావం వలన నారదుడు స్త్రీ రూపాన్ని పొందినప్పుడు చంద్రకేతుడనే రాజు చూసి, వివాహం చేసుకుంటాడు. దాని ఫలితంగా చంద్రకేతుని వలన నారద కాంత సంతానాన్ని పొందిన విషయాన్ని ఎల్లనార్యుడు కింది విధంగా పేర్కొన్నాడు.

"కొడుకుల నూర్వురఁగనెన, గడఁగిరి వివిధాస్త్ర శస్త్ర కౌశలలీలన్" (5-182) కథలో అప్రధానమైన ఈ కుమారోదయ వర్ణనలను ఎల్లనార్యుడు ప్రస్తావన మాత్రం గానే పేర్కొనటం ఔచిత్యదృష్టితోనే అని భావించాలి. కథలో తరువాత చంద్రకేతునితో పాటుగా అతని నూరుమంది కుమారులు కూడా మరణిస్తారు కాబట్టి వారి గురించి విశేషించి వర్ణించటం వృథా ప్రయాసే అవుతుందని కవి భావం. ఈవిధంగా ఈ కావ్యంలో పుత్రోదయ వర్ణన రెండు పర్యాయాలు కనిపిస్తుంది.

5.3.1.12. ప్రయాణ వర్ణన

ప్రయాణ వర్ణన 'విష్ణుమాయానాటకము'లో శివగర్వభంగ కథలోను, పుండరీకుని చరిత్రలోను, బ్రహ్మ తపస్సు చేసుకోవడానికి మందర పర్వతానికి వెళ్ళే సందర్భంలోను కనిపిస్తుంది. విశేషించి వైకుంఠానికి సపరివారంగా పయనమైన శివుని ప్రయాణ వర్ణన గురించి చెప్పుకోవాలి. చతుర్థాశ్వాసంలో శివుని వైకుంఠపుర ప్రయాణ వర్ణన చేయబడింది. వైకుంఠ ప్రయాణానికి సన్నద్ధుడై శివుడు ధరించిన రూపం,

"ఆపాద ఫాలభస్మో, రూపంబిది యనఁగ రుద్రుఁడు పొలిచెన్" (4-101) అని వర్ణించబడింది. యోగవిద్యారూపమిది అనే విధంగా శివుడు నిర్వికల్ప తేజోమహిమతో ఆపాదమస్తకం భస్మాన్ని ధరించాడు. పంచాక్షరీ మంత్ర మహిమతో దుర్వాంఛలను, కలుషేంద్రియాలనే పెనుపాములకు వాకట్టుగట్టి, మన్మథుని రూపాన్ని బిరుదు పెండేరంగా ధరించి, ధృడనిశ్చయంతో పార్వతీ సహితుడై, నందీశ్వరుని అధిరోహించి బయలుదేరాడు. శివుని ముందు నారదుడు నడవగా, ప్రమథులు ఇరువైపుల చేరి సేవించారు. హరిమాయను హరుడు ఏ విధంగా గెలువగలడో చూడాలని దేవతలు నలుదిక్కులా వైకుంఠపురానికి బయలుదేరారు.

వైకుంఠపురంలో తరువాత జరుగబోవు కథకు ఉత్కంఠను కలిగించడానికి ప్రయాణ వర్ణన ఇక్కడ శివుని రూప వర్ణనతో కలిపి చేయబడింది. ఒక కార్యనిమిత్తంగా

ప్రయాణించవలసినప్పుడు, అందుకు తగిన విధంగా శారీరక అలంకరణ కూడా ఉండాలని ఈ సన్నివేశం తెలుపుతుంది. శివుని జితేంద్రియత్వ సూచకంగా ఇక్కడ అతని రూప వర్ణన కనిపిస్తుంది. ఈ రూప వర్ణన సందర్భోచితంగా ఉన్నదని చెప్పవచ్చు. మోహినిని చూడకముందు ఇక్కడ వర్ణించిన శివుని బాహ్యరూప వర్ణన అతడి మానసిక స్థితిని, నిగ్రహపటిమనూ వ్యక్తపరుస్తున్నది. తృతీయాశ్వాసంలో దుర్భిక్షబాధకు తట్టుకోలేక పుండరీకుడు బోయఇల్లాలిని, కుమారుడినీ వెంటబెట్టుకొని గౌతమీ తీరప్రాంతానికి వలస వెళ్ళే సందర్భంలో, "కొడుకుఁ జంకట నిడికొని బోయయిల్లాలిఁ

పుండరీకుండు గౌతమీ భూమికరిగె" (3-194) అంటూ ప్రయాణ వర్ణన చేయబడింది. పుండరీకుని ప్రయాణ వర్ణనలో కరువు మనిషిని ఎంత దారిద్ర్యానికి గురిచేస్తుందో కనిపిస్తుంది. దుర్భిక్షం విలయతాండవం చేసిన ప్రాంతం కాబట్టి దారి మధ్యలో ఆకులు అలములు తింటూ, అక్కడక్కడా ఆగుతూ కొంతకాలానికి పుండరీకుడు పాపక్షయానికి గౌతమీ పుణ్యభూమికి చేరుకున్నాడు. కరువు రక్కసికోరలలో చిక్కుని బాధించబడిన పుండరీకుని రూపం పిశాచరూపాన్ని తలపిస్తుంది. ఈ విధంగా ప్రయాణ వర్ణన ఈ కావ్యంలో కనిపిస్తుంది.

5.3.1.13. యుద్ధ వర్ణన

సముద్ర మథనం తర్వాత మోహిని అమృత కలశాన్ని మాయోపాయంతో గ్రహించి, దానిని దేవతలకు వడ్డించింది. జరిగిన మోసాన్ని గ్రహించి బలి మొదలైన దానవులు దేవతలతో కలహానికి సిద్ధపడతారు. దుర్దాంత సముద్ర ఘోషతో దేవతలను దానవులు ఎదుర్కొన్నారు.

"అమరేంద్రుడును నుగ్రుడై శిఖియమాద్యాశాధిపశ్రేణితో
భ్రమయొప్పన్ దరుమంగ వీగఁ బొడిచెన్ రాత్రించరవ్యూహమున్" (4-57.150)

అంటూ అమృతపానం చేత దేవతలు కూడా దానవులను ధీటుగా ఎదుర్కొన్నారని వర్ణించబడింది. యుద్ధం మొదలయ్యేసరికి, వీరులైనప్పటికీ దానవులు కార్యం చెడి, శక్తినశించి దేవతలతో పోరాడలేక యుద్ధరంగం నుండి పారిపోయారు. దేవేంద్రుడు అమృతకలశంతో అమరావతికి చేరుకున్నాడు. ఇక్కడ యుద్ధం జరిగిన ప్రస్తావన నాలుగు పద్యాలలో మాత్రమే చెప్పబడింది. యుద్ధం జరిగిన తీరును వర్ణించడం కనిపించదు. కల్పించుకొని యుద్ధ వర్ణన చేయకుండా, దాని గురించి ప్రస్తావించి తర్వాత కథలోకి సూటిగా వెళ్ళిపోయాడు ఎల్లనార్యుడు. దేవదానవుల యుద్ధానికి తర్వాతకథలో అంతగా ప్రాధాన్యం లేకపోవటమే దానికి కారణమని భావించాలి.

నారదగర్వభంగ కథలో, నారదకాంతను వివాహం చేసుకున్న చంద్రకేతుని మీదికి ఫణీంద్రకేతుడు దండెత్తి వచ్చిన సందర్భంలో వారిరువురి మధ్య జరిగిన యుద్ధం వర్ణించబడింది. చంద్రకేతుడు భార్యాసమేతుడై, ఇరు పార్శ్వాలలో కుమారులు

తేరులెక్కిరాగా, మదపుటేనుగులు, గుర్రాలు, కాల్బంటులు నేల ఈనినట్లుగా వెంటరాగా సర్వవరక్షేత్ర సమీపంలో విడిది చేశాడు.

"సేనలు రెండునిట్లు రథ సింధుర సైంధవ సద్భటోద్భట

బూనికి నిల్చె మోహరము భూరి భయంకరలీల గ్రాలఁ గాన్" (5-190)

భేరుల మ్రోతతో, భటుల హుంకారాలతో, కరీంద్ర ఘీంకారాలతో, తురంగ హేషలతో, యుద్ధం మొదలైంది. ఆకాశంలో వీరపురుషులను అప్సర కాంతలు కన్నుల పండువుగా చూస్తున్నారు. వజ్రాయుధం ధాటికి రెక్కలు తెగి కొండలు కూలిన విధంగా, రథికులచేత ఏనుగులు కూలాయి. సముద్రంలో అలల తాకిడికి కూలిపోవు ఓడలలాగ రథాలు ఏనుగులు దంతాల తాకిడికి నేలకూలాయి. అశ్వబలం, కాల్బలం నాశనాన్ని పొందింది. కొండల లాగ ఎదుర్కొన్న రెండు సైన్యాలూ, మంచులాగ చెదిరిపోయాయి. అటువంటి సంకుల సమరంలో చంద్రకేతుడు, అతని నూరుమంది కుమారులూ వీర మరణాన్ని పొందారు.

ఎల్లనార్యుడు ఈ ఘట్టంలో యుద్ధాన్ని ఏడు పద్యగద్యాలలో వర్ణించాడు. కథలో ఈ యుద్ధ వర్ణన ప్రభావం ముగింపుకు ముందు గొప్పములుపుగా పరిణమించింది. ఈ యుద్ధమే జరుగకుంటే కథాగమనంలోని బిగువు సడలిపోతుంది. ముగింపుకు ముందు కలుగవలసిన ఉత్కంఠకు తావుండదు. దానివలన కథను నడిపించిన కవి ఉద్దేశ్యమే మరుగున పడిపోతుంది. ఈ బలమైన సంఘటన స్త్రీగా మారిన నారదుని అహంకారాన్ని ప్రక్షాళన చేసి, తిరిగి అతడిని పరమ భాగవతోత్తమునిగా చేయగలగాలి. అందుకోసమే రణరంగంలో చంద్రరేఖను ఒంటరిని చేసి, ఆమె పరితాపాన్ని ఉపశమిం పజేయటం విష్ణుమాయానాటక పరమోద్దేశ్యం. అందువలన ఇక్కడ యుద్ధ వర్ణన ఈ పాటిగా చేయటం సమంజసమని భావించాలి. ఈవిధంగా చింతలపూడి ఎల్లనార్యుడు తన 'విష్ణుమాయానాటకము' ను ప్రబంధోచిత వర్ణనలతో పరిపుష్టంచేసి కావ్యసౌందర్యానికి వన్నెతెచ్చాడని తెలుస్తున్నది.

5.3.2. కంకంటి పాపరాజు - వర్ణనా నైపుణ్యం

ఈ 'విష్ణుమాయా విలాసము' యక్షగాన ప్రక్రియలో రచించింది. పాపరాజు దీనిని ప్రకృష్టమైన వర్ణనలతో ప్రబంధ రచనను స్ఫురించేలాగా రచించాడు. ఇందులో కైలాస పర్వతం, వైకుంఠపురం, మోహినీ సందర్శన ఘట్టంలో విష్ణుమాయా కల్పితమైన శృంగారవనం అనే మూడు ప్రదేశాలు ఈ కథకు రంగస్థలాలుగా కనిపిస్తాయి.

5.3.2.1. పురవర్ణన

కంకంటి పాపరాజు తన కావ్యంలో పురవర్ణనను రెండుసార్లు చేశాడు. మొదట నారదుడు శివుడి దర్శనానికి కైలాసానికి వెళ్ళినప్పుడు కైలాస పురాన్ని, శివుడు మోహినిని చూడటానికి వైకుంఠం వెళ్లినప్పుడు వైకుంఠ పురాన్ని వర్ణించాడు. నారదుడు

తుంబురునితో కలిసి పరమేశ్వర దర్శనానికై హిమాలయ పర్వతంపై ఉన్న అలకాపురి మీదుగా కైలాసానికి చేరుకున్నాడు. అప్పుడు నారదుడు,

"వైదూర్య గోపుర ద్వారంబు సొచ్చి,
రాణించు నంతః పురము ప్రవేశించి" (పుట. 12)

కైలాస పురానికి మొదటగా భద్రవటం ఉంది. ఆ నగరం వైఢూర్య గోపుర ద్వారాలతో, మణిమయమైన ప్రాకార సమూహాలతో నిండి ఉంది. చంద్రశాలలు ఉపరితలంలో కలిగిన సౌధాలు ఉన్నాయి. నారదుడు నవరత్నమయమైన తోరణాలతో ధవళ వృషాంఖ కేతనాలతో ఉన్న ముక్తిమంటపాలు, హజారమాలూ దాటుకుంటూ, మాణిక్య దీపకాంతులతో వెలుగుతున్న అంతఃపురంలోనికి ప్రవేశించాడు. ఈవిధంగా పాపరాజు నారదుడు ప్రయాణిస్తూ దర్శించిన కైలాసపురాన్ని వర్ణించాడు. నారదుని ప్రయాణ సందర్భంలో చేసింది కావున ఈ వర్ణన అంతా ఒక చోట నిశ్చలంగా ఉన్న నగరాన్ని కాకుండా, కదులుతూ ఉన్న దృశ్యంగా మనకు కనిపిస్తుంది అదే ఈ వర్ణనలోని ప్రత్యేకత.

మోహినీ సందర్శనాభిలాషతో శివుడు పార్వతీ ప్రమథగణాల సమేతంగా వైకుంఠపురానికి బయలుదేరాడు. వైకుంఠ నగర ద్వారాన్ని సమీపించిన శివుడు పార్వతికి వైకుంఠపుర వైభవాన్ని వర్ణిస్తాడు. దేవదానవులు పాలసముద్రాన్ని తరువగా పుట్టిన వెన్నను తీసి దిన్నె వేసినట్లుగా శ్వేతద్వీపం ప్రకాశిస్తున్నది. అందులో కోటకొమ్మలు రేకులలాగ అమరగా వైకుంఠపురం మెట్ట తామరపూవులాగ వెలుగొందుతున్నది. శివపార్వతులు ఆ నగరంలోకి ప్రవేశించి, అందమైన ఉద్యానవనాలు, విరజానదిని, రత్నమయమైన తోరణ ద్వారాలు దాటి, అనేక వీధులను నడిచి, రమ్య హర్మ్య సమూహాలతో నిండిన రాజమార్గాన్ని అనుసరించి, కాంచన ప్రాకారమయమైన గోపురాన్ని దాటుకుని పెద్ద మేడను చేరుకున్నారు. పగడపు స్తంభాలతో, చంద్రకాంత శిలామయమైన గోడలతో, వివిధ పుష్పాలంకృతమై వైకుంఠపురం ఒప్పినదని పాపరాజు పురవర్ణనను చేశాడు.

5. 3. 2. 2. సముద్ర వర్ణన

శివుడు వైకుంఠపురానికి వెళ్ళిన సందర్భంలో క్షీరసముద్ర ప్రస్తావన కనిపిస్తుంది.

"హరి యిల్లపుటల్లుఁడాయెనని యుప్పొంగు, కరణి నుబ్బెడి పాలకడలిఁగను మతివ, తరువఁ బుట్టిన వెన్న తఱిదిన్నె వేసిరనఁ.."(పుట. 24) అంటూ శివుడు క్షీరసముద్రాన్ని గురించి పార్వతికి చెప్పాడు. శివుడు మోహినీ రూప సందర్శనాభిలాషతో పార్వతీ సమేతంగా వైకుంఠపురానికి బయలుదేరాడు. ఆ ప్రయాణంలో శివుడు మొదటగా క్షీరసాగరాన్ని చూశాడు. క్షీరసాగరంలో ఎడతెగక పుడుతున్న అలలు సముద్రుడి ఉత్సాహాన్ని ప్రకటిస్తున్నాయి. సముద్రంలో నుంచి వినిపిస్తున్న భీకరమైన

ఘోషకు, విష్ణువు సముద్రుడికి ఇల్లరికపుటల్లుడు కావడమే కారణం. దేవదానవులు తరువగా క్షీరసాగరం నుంచి పుట్టిన వెన్న ముద్దవలె శ్వేతద్వీపం కనిపిస్తున్నదని, అందులో ఉన్న వైకుంఠపురం మెట్ట తామరవలె ఉన్నదనీ శివుడు సముద్ర వర్ణనను చేశాడు.

5.3.2.3. పర్వత వర్ణన

నారదుడు తుంబురునితో కలిసి పరమేశ్వరుని దర్శించుకోవడానికి కైలాసానికి వెళుతున్నప్పుడు మొదటగా హిమాలయ పర్వతాన్ని చూశాడు. ఆ సందర్భంలో నారదుడు తుంబురునితో హిమాలయ పర్వతపు ఔన్నత్యాన్ని ఈ విధంగా వర్ణించాడు.

"బహుళ పక్షమునందుఁ బాయుచంద్రునికళలు,
మహినజుడు ప్రోగిడిన మాడ్కిఁదగినగము
నిడిమేని చుట్టగానిడి శిఖర మిషమునను ... " (పుట. 11)

హిమాలయ పర్వతం మంచు మయంకాబట్టి ధవళ కాంతులతో శోభిల్లుతూ ఉంటుంది. అది బహుళ పక్షంలో చంద్రుడు కోల్పోయిన చంద్రకళలను భూమి మీద బ్రహ్మదేవుడు ప్రోగు చేసినట్లున్నది. అది చంద్రుని లాగ కాంతివంతంగా, చల్లదనాన్ని కలిగించేదని భావం. పొడవైన తన శరీరాన్ని చుట్టగా చుట్టి ఆదిశేషుడు నిలువెత్తుగా పడగలెత్తినట్లు ఆ హిమవత్పర్వతం ఎత్తైన శిఖరాలతో విశాలంగా విస్తరించింది. దిక్కులన్నిటా మిక్కిలిగా నిండి వెలుగొందుతున్న ప్రమథుల కీర్తి లాగ ఆ హిమాలయ పర్వతం ఆకాశ పర్యంతం విస్తరించి ఉన్నదని కవి పర్వత వర్ణన చేశాడు. ఇక్కడ మూడు జంపె తాళములలో ఈ వర్ణన నాతి విస్తరంగా కనిపిస్తుంది.

5.3.2.4. ఉద్యానవన వర్ణన

మోహినీకాంత శివుని ఎదుట నిలువగానే క్షణమాత్రంలో విష్ణువు కొలువుకూటం శృంగారవనంగా మారిపోయే అందమైన దృశ్యం ఇందులో వర్ణితమైంది. కొలువులో ఉన్న వారందరూ శృంగారవనంలో అంతర్భాగమవుతూ ఏయే విధంగా మార్పు చెందారో ఈ ఉద్యానవని వర్ణనలో మిక్కిలి రమణీయంగా కనిపిస్తుంది.

"కనకసాలములెల్ల నచ్చటఁ గనక సాలము లయ్యెఁ గీర్తులు
గనిన పున్నాగములు పున్నాగమ్ములయ్యెన్
లెలతేటి తెగల రూపుల కైపు మీఱెన్" (పుట. 39)

మాయామోహిని కనిపించగానే మహావిష్ణువు సభామందిరం శృంగారవనంగా మారింది. ఆ సందర్భంలో కొలువుకూటంలోని బంగారు స్తంభాలు బంగారు సాలవృక్షాలుగాను, కౌశిక, గౌతమ, శుకమహర్షులు పక్షిసమూహాలుగాను, ఫలపుష్పశోభితమైన ఉద్యానవనంలో అంతర్భాగంగా పరిణమించిన దృశ్యం ఇక్కడ వర్ణించబడింది.

5.3.2.5. జలక్రీడ

మోహినితన మాయా విలాసంతో శివుడిని మదనాతురుడిని చేయాలని సరోవరంలో జలలాడుతూ కనిపించింది. మోహిని పట్ల మోహవివశుడైన శివుడు జలక్రీడలలో మునిగి ఉన్న మోహినిని చూశాడు.

"సోలుచు సరోజములఁ దాలుచుఁ బరాగముల
మాలుచుఁ దొగన్మెలఁగఁ జాలుచుఁ జెలంగెన్" (పుట. 57)

సరోవరంలో జలకాలాడుతున్న మోహిని సోలుతూ సరోజములను ధరించింది. అందులోని పుప్పొడి పరాగరేణువులు రాలుతుండగా ఆడుహంసలాగ నీటిపై ఆడుతున్నది. చక్రవాక పక్షిలాగ తామర తూడులను కొరికింది. తామర పూవులపై వాలుతున్న తుమ్మెదలలాగ దరీలతలపై తూలుతూ జలకాలాడుతున్నది. నీటిపై తేలుతూ, మృణాళములను పెకలిస్తూ వాటితో హంసలను తోలుతున్నది. ఈవిధంగా మోహినీకాంత సరోవరంలో జలక్రీడలను ఆడిందని పై వర్ణన తెలుపుతున్నది.

5.3.2.6. విరహం

శివుడు మోహినీకాంత మోహంలోపడి శృంగారవనంలో తిరుగుతూ విరహబాధను పొందాడు. ఆ సందర్భంలో శివుని విరహవర్ణన ఈ విధంగా కనిపిస్తుంది.

"హత్తుకొని వలరాజుకైదువలెత్తునియె గుబ్బల, వేళ గాదె విరహవేదన తాళరాదె" (పుట. 45) మన్మథుని దహించిన శివుడు ఇప్పుడు మదనాతురడైనాడు. సమయంకోసం చూస్తున్న మన్మథుడు తన వాడియైన పూలబాణాలతో వేయగా, విరహజ్వరంతో శివుడు మోహినికాంతను పలవరిస్తున్నాడు. కౌగిట చేర్చుకొని మదనుని కైదువుల నుంచి ప్రాణాలను కాపాడమని మోహినిని వేడుకున్నాడు. మన్మథుని వలపు సైన్యం బారులుతీరి శృంగారవనమంతా మదనోత్సాహం కలిగించగా, శివుడు మన్మథుని ధాటికి నిలువలేక మోహిని మీద విరహభావాన్ని పొందాడు. అంతేకాకుండా శివుడు ఆ శృంగారవనంలో భ్రమసి తిరుగుతూ చెట్టుచేమలను మోహిని గురించి అడుగుతూ, ఆమె కనిపించక విలపించాడు. మలయపవనాన్ని, చంద్రుని, మన్మథుని దూషించాడు. మోహినిని బ్రతిమాలుకుంటూ వేడుకున్నాడు. చివరికి మట్టుమీరిన మోహంతో పట్టబోయాడు. ఆ విధంగా శివునికి మాయామోహం విడిచి, జ్ఞానోదయం అయ్యేంత వరకూ ఈ కావ్యంలో విరహవర్ణనే విస్తరించి కనిపిస్తుంది.

5.3.2.7. రతి వర్ణన

ఇందులో కవి రతి వర్ణనను చేయలేదు. కాని మోహినీ రూప సందర్శనం వలన చిత్తభ్రాంతితో మోహపరవశుడైన శివుడు తన మనస్సులో ఆమెను గురించి చేసిన భావనలో 'రతి' ప్రసంగం వినిపిస్తుంది.

"మొనపల్లు మొనసియును మొనయని విధంబునను,

నన్ను వంటి రసజ్ఞునకు దొరికి తేదీని
నెన్నిచందముల రతినేలుకోగలను" (పుట. 37)

అని శివుడు భావించాడు. మోహిని పట్ల శివుని అంతరంగంలో చెలరేగిన శృంగాతిరేకమే అతని మాటలలో మనకు కనిపిస్తుంది. శృంగార చేష్ట ఎంతటి సౌకుమార్యంగా ఉండాలో ఇక్కడ శివుని మాటల వలన వ్యక్తమవుతుంది. శివుడు రసజ్ఞుడు కాబట్టి ఎన్ని విధాలుగా 'రతి నేలుకోగలను' అని అతని మనోభావాన్ని వక్తం చేశాడు. కాబట్టి ఇది రతిని గురించి కాకుండా, కేవలం ప్రస్తావన మాత్రమేనని గ్రహించాలి.

5.3.2.8. ప్రయాణ వర్ణన

కంకంటి పాపరాజు ఇందులో ప్రయాణ వర్ణను రెండుచోట్ల చేశాడు. నారదుడు కైలాసపురానికి వచ్చే సందర్భంలో మొదటి వర్ణన కనిపిస్తుంది. ఆ తర్వాత శివుడు పార్వతి, ప్రమథగణ పరివారంగా వైకుంఠపురానికి బయలుదేరే సందర్భంలో కూడా ప్రయాణ వర్ణన చేయడం కనిపిస్తుంది. శివుడు కరివన్నె గల నునుపట్టును ధరించి, చిరుతచారల చర్మాని నడుముకు చుట్టుకొన్నాడు. మన్మథుని బొమ్మగల కడియాన్ని కాలికి ధరించి, తెల్లని విభూతిని శరీరమంతా ధరించాడు. పార్వతీ సమేతంగా నందీశ్వరుని ఎక్కి మంగళ వాయిద్యాలు మ్రోగగా వైకుంఠానికి బయలు దేరాడు.

"కుంచె విసరుకొంచు నవ్వుకొంచు శౌరిఁగాంచువేడ్క
చని చని యానల కంతుడు వైకుంఠనగరోప కంఠంబుఁజేరి" (పుట. 1955)

అని ప్రయాణ వర్ణన చేయబడింది. శివుని వైకుంఠపుర ప్రయాణానికి కారకుడైన వాడు నారదుడు. తన పంతం నెగ్గించుకోవడానికి దారిచూపుతూ, కుంచెవిసురుకొంటూ, నవ్వుకొంటూ ముందు నడువగా, శివుడు ప్రమథగణాలతో కలిసి అతడిని అనుసరించాడు. నేడు శివుని విరక్తిని, విష్ణుమాయా మహిమనూ చేరి చూడాలని బ్రహ్మ, దేవమునులు, దిక్పాలకులు వెంటనడువగా శివుడు ప్రయాణించి వైకుంఠపురానికి చేరుకున్నాడు. ఇలా ప్రయాణ వర్ణన ఈ కావ్యంలో సందర్భోచితంగా ప్రసక్తమైంది. ఈవిధంగా పాపరాజు తన రచన యక్షగానం అయినందు వలన, అందులో సంభాషణాదులకే ప్రాధాన్యత ఉన్నందు వలన కావ్య గౌరవానికి భంగం కలిగించని రీతిలో ఆయా వర్ణనలను చేశాడని తెలుస్తున్నది.

5.3.3. కంకంటి నారసింహకవి - వర్ణనా నైపుణ్యం

నారసింహకవి తన ద్విపద కావ్యంలో చింతలపూడి ఎల్లనార్యుడు 'విష్ణుమాయా నాటకము'లో గ్రహించిన కథలనే వర్ణించాడు. నారసింహకవి తన కావ్యంలో ప్రబంధోచిత వర్ణనలను ఆయా కథలలో సాంగోపాంగంగా వర్ణించాడు. నారసింహకవి ద్విపద కావ్యంలోని ప్రబంధ వర్ణనలు ఈ విధంగా కనిపిస్తున్నాయి.

5.3.3.1. పుర వర్ణన

'విష్ణుమాయావిలాసము' ద్విపద కావ్యంలో పురవర్ణన రెండు పర్యాయాలు కనిపిస్తుంది. శివదర్పభంగ కథలో మొదట కైలాసపురవర్ణన ఈ విధంగా చేయబడింది. నారదుడు మోహినీ అవతార కథను శివునికి వినిపించాలని తుంబురునితో కలిసి కైలాసపురానికి వెళ్ళిన సందర్భంలో పురవర్ణన క్రింది విధంగా ఉంది.

"... సువర్ణ సాలజాలముల, డాలొందు మరకతాట్టాలకములను
శివ మందిరము ప్రవేశించి..." (పుట.119)

కైలాసనగరంలో సువర్ణమయమై, మరకత మణులతో, నీల గోపురాలతో, కెంపు ఛాయలతో నిండిన మేడలు ఉన్నాయి. స్ఫటిక కుడ్యాలపై చిత్రంగా రత్నాలతో చిత్రించిన చిత్తరువులు, ముత్యాలతో కట్టిన అందమైన తోరణాలు, గోమేధికపు కవాటాలు, మిక్కిలి చక్కనైన విపణి మార్గాలు ఉన్నాయి. సురతరువులతో సువాసనలు వెదజల్లుతున్న లీలావనాలు, మాణిక్య దీపకాంతులతో వెలుగుతున్న గృహసమూహాలు, బలి సమయాన్ని తెలుపుతూ మోగుతున్న బంగారు ఘంటా ఘణఘణధ్వనులు, ముక్తిమంటపాలతో కైలాసపురం వైభవంగా ఉంది. శివుడు మోహినీ దర్శనానికి వెళుతూ దర్శించిన వైకుంఠపుర వైభవం అతడి మాటలలోనే వర్ణించబడింది.

"దోరమౌ సాంబ్రాణి ధూప ధూమములు,
శ్రీనివాసంబలఁ జిన్నగ్గలించెఁ"(పుట.125) అంటూ విష్ణువు మహాలక్ష్మికి సముద్రంలోని విశేషాలను వర్ణించాడు. క్షీర సముద్రంలో మెట్టతామర పూవులాగ వైకుంఠ నగరం బంగారు మేడలతో నిర్మితమైనది. దివ్యామృత ఫలమైన విరజానది ఈ నగరానికి పరిఘగా ఉంది. స్ఫటికగోపుర శృంగపటలాది శిల్పమయమైన ద్వారములు ఏడు ఉన్నాయి. ప్రాసాద కుడ్యాలపై దశావతార చిత్రాలు రచించి ఉన్నాయి. జలయంత్రాల నుండి వెలువడు తుంపరలు పురలక్ష్మి అతిధులకు సేసలు పెడుతున్నట్లుగా ఉన్నాయి. కనక పూర్ణకుంభాలను తలపై ధరించిన నటాంగనలలాగ ప్రతి సౌధానికీ శిఖరాలు కుంభాకారంలో తీర్చి ఉన్నాయి. రమణీయమైన ముత్యాల రంగవల్లులతో రాజమార్గాలు అలంకరించి ఉన్నాయి. చిత్రమైన తోరణాలు కట్టి ఉన్నాయి. కుసుమ సౌరభంతో ఆ వైకుంఠపురం శ్రీనివాసమను పేరుతో సార్థక నామం కలిగినదని వర్ణితమైనది. ఈవిధంగా పురవర్ణన ఈ కావ్యంలో ప్రబంధరీతిలో వర్ణితమైనదని తెలుస్తున్నది.

5.3.3.2. సముద్ర వర్ణన

సర్వమంగళాధి దేవత అయిన మహాలక్ష్మి గర్వంతో వైకుంఠపుర వైభవాన్ని ఉపసంహరించింది. విష్ణువు ఆమెకు గర్వభంగం కావించాలని సాగరతీరానికి తీసుకువచ్చినప్పుడు సముద్ర వర్ణన కనిపిస్తుంది.

"ఘన బాడ బహు తాశిఁగమనీయతీర
వెలయ నుప్పొంగెడు విధముఁజూచితె" (పుట. 36)

క్షీరసాగరంలోని బడబాగ్ని వేడిమికి తిమి ఈదుతూ తీరప్రాంతంలో విహరించేటప్పుడు దాని తోక తాకిడికి హతమైన మీనములు ఆకాశవీధికి చేరి మీనరాశిగా మారాయి. మీనములు సాగరంలో జన్మించిన మహాలక్ష్మి కన్నులతో సరిపోలడానికి కెరటాల మీద తేలుతూ మాటి మాటికీ కనువిందు చేస్తున్నాయి. ఆకాశాన్ని తాకునట్లుగా ఎగసి పడుతున్న కెరటాల మీద నురగ మంచులాగ ఉంది. పైకి రేగుతున్న తుంపరలు తారకలు కాగా, చంద్రుడు ధరించిన చందన మాలలాగ మనోహరంగా సముద్రుని కెరటాల వరుస కనిపించింది. అతిలోక సౌందర్య భావంతో చంద్రుడిని, తులసివృక్షమును, కౌస్తుభమణిని, కామధేనువు మొదలుగా లోకకీర్తిని కలిగించే సంతానాన్ని పొందిన ఆనందంతో ఉప్పొంగుతున్న సముద్రుడి కుతూహలాన్ని విష్ణువు మహాలక్ష్మికి చూపించాడు. సముద్రంలోని శైవలాలు కాంతలు కాగా, వాటినన్నిటినీ సమాదరించే దక్షిణ నాయకుడి లాగ సముద్రుడు శృంగార భావాన్ని వహించాడు. ఈవిధంగా సముద్ర వర్ణన చేయబడింది.

5.3.3.3. పర్వత వర్ణన

నారదుడు తుంబురునితో కలిసి శివుడిని దర్శించుకొనేందుకు కైలాసానికి వెళు తున్న సందర్భంలో హిమవత్పర్వత వర్ణన చేయబడింది.

"... శారదా హీర, ఘననార నీహార కలిత భాసంబు
లని రజతాద్రి సోయగము వర్ణించి...." (పుట. 118)

నారదుడు చూసిన కైలాసపర్వతం శరత్కాలంలో కనిపించే తెల్లని మేఘసమూహంలాగా ఒప్పారు మంచుతో ధవళకాంతితో మెరుస్తున్నది. దివ్యమణిమయ శిఖరాల మీద సిద్ధదంపతులు నడిచిన పాదముద్రలతో, కేళికా ఉద్యానవనాలలో నెమళ్ళ క్రేంకారావాలతో, ఆడులేళ్ళ గుంపులు చేసే నాట్యాలతో, రుద్రకన్యకల నానావిధ నృత్తగాన వాయిద్యఘోషలతో ఆ పర్వతం ఒప్పుతున్నది. అది గిరిజా గిరీశులు క్రీడించే మేడ, హరుని భక్తులకు ఇష్టమైన రచ్చపట్టు, ధరణికాంత తలమీద ధరించిన ముత్యం, బ్రహ్మలోకాన్ని మోయు స్తంభం, వ్యోమలక్ష్మి నివసించు గొప్ప వజ్రపీఠం. రావణ భుజబలంతో విచ్చుకున్న రాళ్ళు రేకులుగా, బంగారు కాంతితో వెలుగు ధాతువులు కేసరాలుగా, అలకానదీ ప్రవాహాలు మరందంగా, ఘనమైన ఏనుగుల గుంపు తుమ్మెదలుగా, ఈ హిమవత్పర్వతం భూదేవి చేత ధరించిన పద్మంలాగా భాసిల్లినది అని పర్వత వర్ణన చేయబడింది.

5.3.3.4. చంద్రోదయ వర్ణన

నరసరాజు చంద్రోదయాన్ని వర్ణించకుండా కథాసందర్భానుసారంగా

చంద్రోదయాన్ని గురించి ప్రస్తావించాడు. నారదుడు విష్ణుమాయా ప్రభావంతో స్త్రీగా మారి, యుద్ధరంగంలో భర్త, కుమారులు మరణించగా చూసి విలపిస్తున్న సమయంలో రాత్రి అయింది. నారదుడు విష్ణుమాయను అతిక్రమించి, అజ్ఞానంతో ప్రవర్తించి చివరికి జ్ఞానాన్ని పొందే సమయం ఆసన్నమవుతున్నట్లుగా చంద్రోదయమైంది.

"నారదమౌనియజ్ఞాన మీరీతి,

సనియెఁ దూర్పునఁ దోచెఁ జందమామయును" (పుట. 170)

కథాగతికి హేతువుగా ఇక్కడ చంద్రోదయ వర్ణన చేయటం విశేషం.

5. 3. 3. 5. సూర్యోదయ వర్ణన

నారదుని కథలో సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు యుద్ధరంగంలో చంద్రరేఖ శోకించే సమయంలో వర్ణితమయ్యాయి. కథా సందర్భానికి అనువుగా సందర్భోచితంగా ఈ వర్ణనలు ఉన్నాయి. పాత్ర మానసిక స్థితికి దర్పణంగా కూడా ఈ వర్ణనలు కనిపిస్తున్నాయి.

"నలిననేత్రుడు కరుణానిధి యగుట

దుల కించె నరుణ కాంతులు దిక్కులలమ" (పుట. 170) అని సూర్యోదయం వర్ణించబడింది. నారదుని తపోఫలంగా, అతని అజ్ఞానాన్ని నశింపజేయడానికి విష్ణువు బ్రహ్మవర్చస్సుతో చేసిన బంతిలాగ సూర్యుడు ఉదయాద్రిపై ఉదయించాడు. దిక్కులు వెలుగునట్లుగా సూర్యకాంతులు వ్యాపించాయి. సూర్యాస్తమయం కూడా ఇందులో ప్రస్తావితమైంది. చంద్రకేతునికి, ఫణికేతునికి మధ్య జరిగిన యుద్ధం ముగిసిన తర్వాత సుర్యాస్తమయం అయింది.

"రణమండల హత రాజన్య వీర,

నరుణాంశు కలితుడై యపుడస్తమించె" (పుట. 169)

యుద్ధరంగంలో మరణించిన వీరుల రక్తపంకిలాన్ని కడుగు కొనడానికి వెళ్ళినాడో అనే విధంగా సూర్యుడు ఎర్రనికాంతులతో అపరాంబుధిలోకి మునిగి అస్తమించాడు. అస్తమించే సూర్యకాంతికి కారణం యుద్ధరంగంలోని వీరుల రక్తపంకిలమని ఊహించబడింది. ఈ విధంగా సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు ఇందులో కనిపిస్తున్నాయి.

5. 3. 3. 6. ఉద్యానవన వర్ణన

శివుడు మోహినీ రూప సందర్శనాభిలాషుడై వైకుంఠానికి వెళ్ళినపుడు, అక్కడ విష్ణువు కొలువు కూటం మోహిని ప్రత్యక్షం కాగానే శృంగారవనంగా మారిపోయింది. ఆ సందర్భంలో ఉద్యాన వనాన్ని కవి క్రింది విధంగా వర్ణించాడు.

"ప్రాకార గోపుర ప్రాసాదములుని,

వలెనున్న నహజమౌ వనమనీ తలంచి" (పుట. 138)

విష్ణువు కొలువుదీరిన ఆ కొలువుకూటం ఒక్కసారిగా మామిడి, ఖర్జూర, పనస మొదలైన ఫలవృక్షాలతో, కదంబ, వకుళ, కనకాంబర, అర్జున మొదలగు పూలమొక్కలతో, ద్రాక్షతీగలు, మిరియపు పొదలు, మల్లెపూల పొదరిండ్లు, గురువింద పందిళ్ళు మొల్ల తీగెలు, అల్లిబిల్లిగా అల్లుకొనిన వనంగా మారింది. అందులో మాధవీ, మల్లికా, తక్కోల లతలు, కమల కల్హారాలు, షండములతో నిండిన కొలనులు చంద్రకాంత శిలావేదికలు, మాణిక్యమందిరాలు, కనకపు తూగుటుయ్యాలలు, పుష్పమకరందపు కాలువలు, శుకపికముల ప్రమత్తగీతాలు, నెమళుల నాట్యాలతో ఒక దివ్య శృంగారవనంగా ఆ కొలువు మందిరం మారిపోయిందని ఉద్యావన వర్ణన చేయబడింది.

5.3.3.7. జలక్రీడ

శివుడిని మోహవివశుడిని చేస్తూ మోహిని చేసిన విలాసచేష్టలలో జలక్రీడ కూడా ఒకటి. మోహినిని వెంబడిస్తూ శృంగారవనంలో తిరుగుతున్న శివుడు ఆమెను సరస్సులో జలకాలాడుతుండగా చూశాడు.

"నంచలలో రాజహంసియపోలి,
గావించుచును గన్నుగవ కింపునింప" (పుట. 141)

అని మోహిని జలక్రీడ వర్ణించబడింది. సరోవరంలోని హంసలలో రాజహంసలాగ ఈదుతూ, ఆకాశగంగలోని కమలంలాగ ప్రకాశిస్తూ, జలక్రీడలాడుతున్న మోహిని కుచోన్నతిని తాకి నీటితరగలు విరిగి పడుతున్నాయి. వేగంగా ఈదుతున్న తీరును చూసి హంసలు అనుకరించాయి. తామరపువ్వుల నుంచి ఎగసిన తుమ్మెదలు మోహిని ముఖకమల సువాసనలకు మత్తిల్లి మోముపై వాలాయి. సరస్సులో కలిగిన కల్లోలానికి వికసిత తామరపూవులలోని పుప్పొడిధూళి ఎగురగా మోహిని విలాసంతో ఆ సరోవరంలో జలక్రీడలాడిందని కవి వర్ణించాడు.

5.3.3.8. విరహం

శివుడు మదనాతురుడై జలకాలడుతున్న మోహినిని సమీపంచగా ఆమె అతడిని వారించి, అదృశ్యమయింది. సరస్సులో మోహిని కనిపించక శివుడు దీనుడై విరహభావాన్ని పొందాడు.

"జలకేళిఁ జాలించి చనుదెంచుననుచుఁ,
విరహమోర్వక మోహ వివశుడై పలికె" (పుట. 149) అని శివుని విరహం వర్ణించబడింది. మోహవిభ్రాంతితో మదనాంతకుడే మదనాతురుడైనాడు. మోహిని కనిపించక దీనుడై పలువిధాలుగా ప్రలాపించాడు. శివుడు మోహిని మాయలాడి అని, ఆమె మాటలు విని మోసపోయాననీ అతి సామాన్యునిలాగ పరిపరివిధాలుగా తనను నిందించుకున్నాడు. మోహినిపై పుట్టిన మోహం భరించరానిదై, శివుడు మన్మథ తాపంతో విలపించాడు. మెరుపు తీగలాగ మెరుస్తూ కనిపించి, ఎండమావి లాగ

ఆశపెట్టి చివరికి చేతికి అందకుండా పోయిందని వికలమనస్కుడైనాడు. శివుడు మన్మథుని బారినుంచి కాపాడమని మోహినిని పలువిధాలుగా వేడుకున్నాడు. భరించరాని మోహంతో వివశుడై మోహినీ కాంతను పట్టబోయాడు. చివరికి విరహోన్మత్తుడై శివుడు బలవంతంగా మోహినిని కౌగిలించుకొని విష్ణుమాయా మోహం తొలగి సుజ్ఞానాన్ని పొందాడు. ఈ విధంగా ఇందులో శివుని విరహం వర్ణించబడింది.

5.3.3.9. రతి వర్ణన

నారసింహకవి కథాగత సందర్భాలను అనుసరించి రతి ప్రస్తావన మాత్రం చేశాడు. కల్పించుకొని సంభోగాన్ని వర్ణించలేదు. ఈ ప్రస్తావన ప్రథమాశ్వాసంలో శ్రీకృష్ణుడు సత్యభామల దాంపత్య శృంగారాన్ని వర్ణించేటప్పుడు, విష్ణుమాయా కలితుడైన బ్రహ్మ శతరూపాలు ధరించిన, మాయాసరస్వతితో క్రీడించి శతానందుడైన సందర్భంలోనూ కనిపిస్తుంది.

"నాసత్య నవగాఢ యౌవనమదము,

రమణుని మేకొని రమియించుచుండి" (పుట. 12) అంటూ శ్రీకృష్ణుడు, సత్యభామల రతి ప్రస్తావన చేసి, శయ్యదిగి వచ్చిన సత్యభామ వర్ణనలో సంభోగ చిహ్నాలను పేర్కొనటం కనిపిస్తుంది. తృతీయాశ్వాసంలో బ్రహ్మ విష్ణుమాయా ప్రభావితుడై మందరగిరి గుహలో మాయాసరస్వతో రతిక్రీడలలో మునిగిన విధాన్ని క్రింది విధంగా వర్ణించాడు కవి.

"ధర్మముల్జప తపోధ్యాన సంధ్యాది,

యన్నలిజుండు శతానందుడయ్యె" (పుట. 103)

బ్రహ్మ మాయాసరస్వతిపై మరులుకొని ఆమెతో రతిక్రీడలలో మునిగి ధర్మాన్ని, తపోవిధిని, ధ్యానాన్ని, సంధ్యాది కర్మలనూ విడిచిపెట్టాడు. గాఢరతులతో విజృంభించగా దానికి ఓర్వలేక ఆ మాయాసరస్వతి నూరురూపాల్ని ధరించింది. బ్రహ్మ ఆ నూరురూపాలతో సంభోగించి శతానందుడయ్యాడు. ఈవిధంగా బ్రహ్మ, మాయా సరస్వతుల సంభోగ వర్ణన చేయబడింది.

5.3.3.10. పుత్రోదయం

ఈ కావ్యంలో పుత్రోదయ వర్ణన సూచనా మాత్రంగానే కనిపిస్తుంది. పుండరీక చరిత్రలో బోయకాంతకు పుండరీకుని వలన ఒక కుమారుడు, కుమార్తె కలిగినట్లు వర్ణితమైంది. నారదకథలో స్త్రీగా మారిన నారదుడు చంద్రకేతుడనే రాజు వలన నూరుమంది కుమారులను పొందినట్లుగా వర్ణించబడింది. పుండరీకుడు బోయకాంతతో కలిసి ఆమె ఇంటికి వెళ్ళాడు.

"నాయింతి గృహమున కరిగి తదీయ,

గొడుకు నొక్కని నొక్క కూతురిఁగనియె" (పుట. 81)

మాయాసంసారం చేసి బోయకాంత వలన పుండరీకుడు ఒక కుమారుని, కుమార్తెనూ పొందినాడని పై వర్ణన వలన తెలుస్తుంది. నారదుడు విష్ణుమాయా ప్రభావం వలన స్త్రీగా మారినప్పుడు అక్కడికి వచ్చిన చంద్రకేతుడనే రాజు ఆమెను వివాహం చేసుకున్నాడు.

"యెడబాటు గావించి యువిద గ్రహించి,
గురు బలాధికులు నూఱ్గురు సుతుల్బుట్టి" (పుట. 167)

చంద్రకేతుడు చంద్రరేఖను వివాహమాడి, ఆమె వలన నూరుమంది కుమారులను పొందినట్లుగా ఇక్కడ వర్ణించబడింది. ఈవిధంగా కావ్యంలో పుత్రోదయ వర్ణన కనిపిస్తున్నది.

5.3.3.11. ప్రయాణ వర్ణన

శివుడు నారదుని మాటలు విని మోహినీ రూప సందర్శనాభిలాషుడై వైకుంఠపురానికి పార్వతి, ప్రమథగణ సమేతుడై బయలుదేరాడు. ఆ సందర్భంలో వైకుంఠపురానికి బయలుదేరిన శివుని ప్రయాణం ఈ విధంగా వర్ణించబడింది.

"హరు ప్రయాణము కలహాశికవ్వేళ,
మురువొంది వైకుంఠమునకు వేంచెసె" (పుట. 123)

వైకుంఠపురానికి శివుని ప్రయాణం నారదునికి పరమానందాన్ని కలిగిస్తుండగా దేవదుందుభులు ఆకాశంలో బెట్టుగా మ్రోగాయి. అప్పుడు ప్రయాణసన్నాహ కోలాహలం సందడి చేయగా, శివుడు నడుముకు కొత్త నాగాజినమును ధరించి, మంత్ర పవిత్ర విభూదిని శరీరమంతా అలదుకొన్నాడు. కరిచర్మాన్ని కట్టుకొని, చంద్రుని తలపూవుగా ధరించాడు. మన్మథుని బిరుదు అందెను ఎడమకాలికి ధరించాడు. స్థిర రాజయోగ బుద్ధితో శివుడు పార్వతితో కలిసి నందిని అధిరోహించాడు. నాలుగు దిక్కులలో ప్రమథులు చేరి కొలువగా శివుడు సంరంభంతో బయలుదేరి వైకుంఠపురం చేరుకున్నాడు. ఈవిధంగా శివుడు వైకుంఠానికి వెళ్ళే సమయంలో ప్రయాణ వర్ణన సమయోచితంగా చేయబడింది.

5.3.3.12. యుద్ధవర్ణన

నారద గర్వభంగ కథలో చంద్రకేతునికి, ఫణికేతునితో జరిగిన యుద్ధం వర్ణితమైంది. ఈ యుద్ధ వర్ణన ఆ కథలో ముగింపునకు ముందు జరిగే సంఘటన కాబట్టి దీనిని కవి సందర్భోచితంగా వర్ణన చేయటం కనిపిస్తుంది.

"...హెచ్చిన పౌరుషమునఁ, బోరాడిరప్పుడు ప్రుథురథ తురగ
శిరముఖండించి మించి జయంబుగాంచె" (పుట. 168)

చంద్రకేతుని వైభవాన్ని చూసి ఓర్వలేక సామంతుడైన ఫణికేతండు దండెత్తి వచ్చాడు. వారిద్దరి మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రథ, తురగ, గజ,

వీరభటుల సమూహాలు చెలరేగి యుద్ధం చేశాయి. మదపుటేనుగులు రథికుల చేత కొండల లాగ నేలకూలాయి. మదగజాల దంతపు ఘాతానికి పెనుకెరటాల తాకిడికి సముద్రంలో కూలేటువంటి ఓడల లాగ రథాల వరుసలు కూలిపోయాయి. మంచుకొండలు విచ్చుకొని నశించిపోయిన విధంగా ఇరువైపుల సైన్యం చెలరేగి నశించిపోయింది. ఈవిధంగా నారసింహకవి 'విష్ణుమాయా విలాసము' ద్విపద కావ్యంలో ప్రబంధోచిత వర్ణనలు సంధర్భానుకూలంగా, నాతివిస్తరంగా వర్ణించబడ్డాయని తెలుస్తున్నది.

5.3.4. రోసనూరి వేంకటపతి – వర్ణనా నైపుణ్యం

వేంకటపతి తన కావ్యాన్ని శృంగార ప్రబంధంగా పేర్కొన్నాడు. కాబట్టి ఇందులో రసవంతములైన ప్రబంధ వర్ణనలు ఉన్నాయని తెలుస్తుంది. ఇది శివగర్వభంగ కథను మాత్రమే వర్ణించిన కావ్యం. పాపరాజు యక్షగానమే దీనికి మార్గదర్శి. అయితే సందర్భానుసారంగా వేంకటపతి నూతనమైన కల్పనలతోను, వర్ణనలతోనూ ఈ కావ్యాన్ని తీర్చిదిద్దాడు.

5.3.4.1. పుర వర్ణన

ఈ కావ్యంలో కథారంగం మొదట కైలాసపర్వతం మీద, ఆ తర్వాత వైకుంఠపురంలోనూ జరుగుతుంది. కాబట్టి ఇందులో వేంకటపతి కైలాసపర్వత వర్ణన చేస్తూ పురవర్ణన కూడా చేశాడు. కైలాస పర్వతం శరత్కాలంలోని పూర్ణచంద్రునిలాగ ధవళకాంతులతో చూసేవారికి ఇంపు కలిగిస్తున్నది. ఆ పర్వతాన్ని చుట్టి వికసించిన సంపెంగ పూవులు బంగారు కాంతులతో గుంపులుగా విస్తరించాయి. కైలాసపర్వత శిఖరం మీద గోపుర వేదికలతో కైలాసపురం విస్తరించి ఉంది. ఆ నగరంలో ఎటువైపు చూసినా చంద్రకాంత శిలలు సుందర చిత్రశిల్పములై ఆశ్చర్యకరంగా, వైభవంగా పురమందిరాలను అసమాన విలాస వైఖరితో నింపుతున్నాయి.

"ఏచాయఁ జూచిన, నెలిమిఁ జక్కని రుద్ర,
హాశివ స్వామి నవవిధాత్యంత భూమి" (1–55)

అంటూ పురవర్ణన చేయడం కనిపిస్తుంది.

5.3.4.2. సముద్ర వర్ణన

వేంకటపతి సముద్ర వర్ణనను సంక్షిప్తంగానే చేశాడు. వైకుంఠ పురానికి వెళ్ళే మార్గంలో శివుడు ముందుగా క్షీరసముద్రాన్ని చేరుకొని పార్వతితో దాని గురించి ఈ విధంగా చెబుతాడు.

"గౌరితోనిట్లను, కాంతయల్లదె కంటె, యనతి దూరమున దుగ్ధాంబు రాశి
యున్నవని చూపి మఱియు నయ్యుగ్రు డనియె" (2–21)

విష్ణువు తనకు ఇల్లురికపుటల్లుడు అయినాడని తెలిపేవిధంగా ఘనతరంగ సమూహాలతో

ఆకాశాన్ని అందుకోవాలనే ఉత్సాహంతో క్షీరసముద్రంలో పెనుకెరటాల పడిలేస్తున్నాయి. అందులోని శ్వేతద్వీపం దేవదానవులు సముద్రాన్ని మథించినపుడు తేలిన వెన్నకుప్ప లాగా తేలుతున్నది. దాని మీద వెలసిన వైకుంఠ నగరం మెట్టతామర లాగ, కోట కొమ్మలు తామరరేకుల లాగ భాసిల్లగా అందంగా కనిపిస్తున్నది. ఈవిధంగా వైకుంఠ పురాన్ని దర్శించబోయిన శివుడు ముందుగా క్షీరసాగరాన్ని చూసి, దాని వైభవాన్ని పార్వతికి తెలిపిన సందర్భంలో సముద్ర వర్ణన చేయబడింది.

5.3.4.3. పర్వత వర్ణన

ఈ కావ్యంలో కథా ప్రారంభమే పర్వత వర్ణనతో మొదలవుతుంది. కైలాసపర్వత వర్ణన ఈ విధంగా కనిపిస్తుంది.

"మందార మల్లికా కుందచందనపిచు, మందకల్పద్రుమ సుందరంబు
భక్తఫల దంబు కైలాస పర్వతంబు" (1–50)

కైలాస పర్వతం మందార, మల్లికా, చందనాది కల్పతరువులతో సుందరమైనది. శుక, పిక, చంచరీకాది పక్షుల ఉత్సాహభరితమైన గానంతో శోభితమైనది. సామాజ, భల్లూక, సింహ, ఖడ్గ మృగాదులతో నిండిన సత్కంధరం. గంధర్వ యక్ష రాక్షస, సిద్ధ, దేవతాదులతో సేవించబడేది. కాసారాలలో హంస, బక, చక్రవాకాది పక్షితతులతో వెలసిన భక్తఫలదము. అష్టైశ్వర్యసంపదలతో, అణిమాది సిద్ధులతో, శోభన మందిరాలతో, సుందరతరమైనది. గోపుర ప్రాకారాలతో, వృషభ తోరణాలతో అలంకృతమైనది. పుష్పిత ఫలితమైన బహు వృక్షజాతులు నిండిన ఉద్యానవనాలు కలిగినది. పూర్ణిమా చంద్ర చంద్రికా స్ఫురిత ధవళ కాంతులతో విలసిల్లునది కైలాస పర్వతం అంటూ పర్వత వర్ణన చేయబడింది.

5.3.4.4. చంద్రోదయ వర్ణన

శివుడు వైకుంఠపురానికి వెలుపల ఉన్న భద్రవటం సమీపాన విశ్రమించిన సందర్భంలో చంద్రోదయ వర్ణన కనిపిస్తుంది. సూర్యాస్తమయం తర్వాత చీకటులు వ్యాపించగా తారకలు కనిపించగా చంద్రుడు తూర్పు దిక్కున ఉదయించాడు.

"గగనాటవీ తారకా మృగంబుల నేలు
జంద్రు డుదయించెఁ గాంతి నిస్తంద్రుఁడగుచు" (1–148) అంటూ చంద్రోదయం వర్ణన చేయబడింది. ఆకాశమనే అడవిలో తారకలనే మృగాలను పాలించడానికి వచ్చిన సింగపుకొదమ లాగా, చకోరపక్షుల తపోఫలితం లాగ, యామినీకాంత కర్ణ రత్నకుండలం లాగా, కుముదవన సమూహాలు సంతసిల్లగా చంద్రుడు ఉదయించాడు. సూర్యకిరణ ప్రభావంతో పరితప్తులైన జనులపై వీచడానికి చీకటి కాంత చేతిలో ధరించిన వింజామర లాగ చంద్రుడు కనిపించాడు. అదేవిధంగా చంద్రాస్తమయ వర్ణన కూడా ఒక పద్యంలో ఇందులో కనిపిస్తుంది.

5.3.4.5. సూర్యోదయ వర్ణన

శివుని ప్రయాణ సన్నాహానికి సంకేతంగా దిక్కులలో పక్షుల కలకలం ఎక్కువకాగా, రాత్రి గడిచిందనహానికి గుర్తుగా ప్రభాతమైంది.

"రాతిరి గడిచిన యట్లు ప్ర,

దోతేరఁగ నంద రెలిమితో మేల్కొనుచున్" (1-154)

ప్రభాతకాలాన్ని సంక్షిప్తంగానే వర్ణించిన వేంకటపతి సూర్యాస్తమయ కాలాన్ని మాత్రం విశేషించి పన్నెండు పద్యాలలో వర్ణించాడు. ఇందులో సంధ్యారాగాన్ని, చీకటులను, తారకలను రెండేసి పద్యాలలో వర్ణించాడు.

"క్షితి సర్వజ్ఞుఁడనంగఁ బేరయిన యాశ్రీకంఠుఁడార్యాసమ

ర్థత భానుండపరాబ్ధి శాయిఁగనఁ జేరంబోయె సన్మిత్రుడై" (1-139)

సర్వజ్ఞుడయిన పరమేశ్వరుడు పార్వతీ సమేతుడై నీ మోహినీరూపవిలాసాన్ని దర్శించడానికి విచ్చేస్తున్నాడని తెలియజెప్పటానికి పనిమీద బయలు దేరినట్లుగా భానుడు అపరాబ్ధిశాయి అయిన విష్ణుమూర్తిని చేరబోయినాడు అని సూర్యాస్తమయ వర్ణన చేయబడింది. ఈ విధంగా ఇందులో సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు కనిపిస్తున్నాయి.

5.3.4.6. ఋతు వర్ణన

మోహినీ రూప దర్శనంతో శివునికి విష్ణువు కొలువు శృంగారవనంగా మారిన సందర్భంలో వసంత ఋతువర్ణన చేయబడింది. మన్మథునికి ఆప్తుడవటం వలన వసంతుడు శివుని మీద దండెత్తి వచ్చినట్లుగా కోకిలాలాపనతో, చిలుకల కిలకిలా రావములు నిండి, ఫలపుష్ప శోభితమై వసంతశోభ ఆ శృంగారవనంలో ప్రత్యక్షమైంది.

"నీలాల నిశ్రేణి, నెఱివేణి సవరించి,

రాగ సంభ్రాంతులుగ వసంతాగమంబు" (3-10)

కువలయనేత్ర వైభవంతో, సురుచిరమైన అధరాలతో, చిగురాకుల కెంపు కలిగి, పూల గుత్తులు కుచయుగమును స్ఫురించగా, వికసిత కింశుకాంశుకము ధరించి, లలిత శృంగారభావ కళారూఢితో దిక్కులన్నిటా వనలక్ష్మి శోభిల్లునట్లుగా వసంతం వచ్చింది అని ఋతువర్ణన చేయబడింది.

4.3.4.7. ఉద్యానవన వర్ణన

మాయామోహినీ రూపాన్ని చూస్తున్న శివుడు విష్ణువు కొలువు క్షణమాత్రంలో శృంగారవనంగా మారటం వలన మోహవివశుడయ్యాడు. ఆ సందర్భంలో శృంగారవన వర్ణన మోహిని విలాస చేష్టలకు రంగభూమిగా వర్ణితమైంది.

"వనదేవతా ఘన స్తనకుంభ సంభృత, ప్రచుర కుంకుమ పంక రుచియసంగ

సవురు నిరసింపు సరసంపుఁ జివురు గుంపు" (పుట.3-12)

వనదేవత స్తనములకు అంటుకున్న కుంకుమ కాంతి అనునట్లుగా, మన్మథుడు శిరస్సున ధరించిన మణిమయ కిరీటకాంతి పుంజమనునట్లుగా ఆ శృంగారవనంలో శుకపికాదుల కలకల రవములు, తరువులకు నిలువెల్లా విచ్చుకున్న చివురాకులకాంతి ఇంపుగా వ్యాపించింది. వనకన్యకు వసంతునికీ జరిగే వివాహానికి కుతూహలంతో లతాలలనలు చేతులలో సేసలు పెట్టుటకు ధరించిన ముత్యాల లాగ ఆ వనమంతా పూలమొగ్గలతో లతలు విలసిల్లాయి. వసంతుని కొలువులోని మేలుకట్లు అనునట్లుగా చెట్లన్నీ పూవుల గుత్తులతో నిండిపోయాయి. ఈవిధంగా ఈ కావ్యంలో ఉద్యానవన వర్ణన చేయబడింది.

5.3.4.8. జలక్రీడ వర్ణన

శృంగారవనంలో శివుని ఎదుట నుంచి అదృశ్యమైన మోహినీకాంత ఒక సరోవరంలో జలకాలాడుతూ కనిపించింది. ఆ సరోవరంలో మోహిని జలక్రీడలు ఆడుతూ, కేళీవిలాసంతో నీటి మీద సోలుతూ, సరోజములలో హంసకన్య లాగ తేలియాడుతున్నది. నీటిలోని మరాళములను మృణాలములతో దరికి తోలుతూ, తామరల మీద మూగుతున్న తుమ్మెదలను తోలుతూ, హేళితో మరందములను గ్రోలుతూ మోహిని జలక్రీడాడినట్లుగా ఇందులో వేంకటపతి జలక్రీడను వర్ణించాడు. ఈ వర్ణన కంకంటి పాపరాజు చేసిన వర్ణనను పోలి ఉన్నది.

"సోలుచు సరోజములు దాలుచు పరాగముల రాలుచు
రథాంగివలె వ్రాలుచును గేళిం" (3-95)

అంటూ మోహిని జలక్రీడ వర్ణన చేయబడింది.

5.3.4.9. విరహం

వేంకటపతి ఇందులో మోహిని పట్ల అనురక్తుడైన శివుని విరహాతిశయాన్ని వర్ణించాడు. శివుడు పలుమార్లు చేపట్టబోయిన సమయంలోనే అదృశ్యమవుతున్న మోహినిని వెదుకుతూ విరహోన్మత్తుడైనాడు.

"మరులున బొరలుచుఁ దెరలుచుఁ
విరవిర పుప్పొడుల కడను వెతబడు నపుడున్" (3-107)

మోహిని పైన మరులుకొన్న శివుడు దైన్యభాషణలతో తన విరహాన్ని వ్యక్తపరిచాడు. శివుడు తాను గాలిని మేతగామేయు పాములను చుట్టగా ధరించినా, ఆ మేలుమరిచి మలయ పవనం వేడిగాలి లాగ తగిలిందని నిందించాడు. శివుడు చంద్రుడు తన అమృతకిరణాలతో మన్మథ జ్వరాన్ని కలిగిస్తున్నాడని, మన్మథుడు మదన బాణాలతో పీడిస్తున్నాడనీ మలయపవన, చంద్ర, మన్మథ దూషణ చేశాడు. ఈ విధంగా సర్వజ్ఞుడు శివుడు కూడా చివరికి అజ్ఞుని లాగ విరహభావాన్ని పొంది, విలపించాడని ఇందులో వర్ణితమైంది.

5.3.4.10. ప్రయాణ వర్ణన

శివుడు నారదునితో పంతమాడి, మోహిని సందర్శనాభిలాషతో పార్వతి, ప్రమథగణాలతో కూడి వైకుంఠపురానికి వెళ్ళే సందర్భంలో ప్రయాణ వర్ణన కనిపిస్తుంది. వైకుంఠపురానికి ప్రయాణ సన్నద్ధుడైన శివుడు తనవెంట మునులు, దేవతలు, ప్రమథులు ఇరువైపులా చేరి కొలువగా వారందరినీ మన్నించి వేడుకతో ప్రయాణమైనాడు.

"శ్రీవైకుంఠపురమునకుఁ, గా వృషభారూఢుఁ డగుచు గమనోత్సుకతన్" (2-6)

శివుడు వైకుంఠపురానికి ఉత్సాహంతో బయలుదేరాడు. మార్గమధ్యంలోని విశేషాలను పార్వతికి చెబుతూ అలకాపురాన్ని, అమరావతినీ దాటుకుని, అక్కడ వారి మర్యాదలను స్వీకరిస్తూ ముందుకు ప్రయాణించాడు. శివుడు నందనవనంలోని వింతలను విశేషించి పార్వతికి చెబుతూ క్షీరసాగరాన్ని, అందులోని శ్వేతద్వీపాన్ని, దాని మీద వెలసిన వైకుంఠపురాన్ని చేరుకున్నాడు. ఈ ప్రయాణవర్ణనలో నందన వనవర్ణన విస్తారంగా కనిపిస్తుంది. తక్కిన అలకాపురం, అమరావతి, క్షీరసాగరాదుల వర్ణన మాత్రం సంక్షిప్తంగానే చేయబడింది.

ఈ విధంగా రోసనూరి వేంకటపతి తన విష్ణుమాయావిలాస శృంగార ప్రబంధాన్ని రసవంతమైన వర్ణనలతో ప్రబంధ బంధురంగా రచించాడని తెలుస్తుంది.

5.3.5. ఎఱగుడిపాటి వేంకటకవి – వర్ణనా నైపుణ్యం

వేంకటకవి రచించిన ఈ 'విష్ణుమాయావిలాసము"లో కావ్యోచిత వర్ణనలు కనిపిస్తున్నాయి. కథా నిర్వహణలో వేంకటకవి స్వతంత్రించి చేసిన మార్పులకు అనుగుణంగా ఆయా తావులలోని వర్ణనలు కావ్య పఠనానురక్తిని కలిగిస్తున్నాయి. ప్రబంధరీతిని అనుసరించిన ఆ వర్ణనలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

5.3.5.1. పురవర్ణన

పరమేశ్వరుడు నారద ప్రేరేపితుడై మోహినీ సందర్శనాభిలాషతో వైకుంఠపురానికి వెళ్ళిన సందర్భంలో పుర వర్ణన చేయబడింది.

"అల్లవిగో మహదావరణాత్యున్నతోత్కటం బగుచతుర్వ్యూహములును
నామక ద్వారగేహాళీసీమ గరిమ" (2-197)

క్షీరసాగరాన్ని చేరుకున్న శివ పార్వతులకు దూరం నుంచే వైకుంఠపురం కనిపించింది. ఆ నగరంలో అత్యున్నతమైన చతుర్వ్యూహములు, అంబరచుంబిత మాణిక్య గోపురమంటపాలు, ఆలయ ప్రాంగణంలోని హేమధ్వజస్తంభాలు, పద్మరాగ మణిమయమైన శిఖరాగ్రకుంభాలు, రత్నమండితమైన సింహద్వారాన్ని వారు చూశారు. శివపార్వతులు నగరానికి మొదట కనిపించిన శృంగారవనాన్ని దర్శించారు. సుధారసబంధురమై ప్రవహించే పిల్లకాలువలను దాటుకున్నారు. సరోజ రాగమణి నిర్మితమై, మేలిమి పసిడి మెరుగుతో వెలుగుతున్న కోటను, వజ్రరత్న ఘటితమైన

భూరి కవాటాలను, ఆకాశాన్ని తాకుతున్న గోపురాలనూ వారు వైకుంఠపురంలో చూశారు. ఆ పురంలోని జనులు అందరూ చతుర్భుజులు, చక్ర గదాబ్జ నందకములను చేతులలో ధరించినవారు. కనకాంబర ధరులు, మణికిరిటాలు అలంకరించుకొన్నవారు. వారు చతుర్విధముక్తులు. అటువంటి పరమ పుణ్యప్రదమైన వైకుంఠపురాన్ని శివపార్వతులు దర్శించారని వైకుంఠపుర వర్ణన చేయబడింది.

5.3.5.2. సముద్ర వర్ణన

దేవదానవులు పూనుకొని మందర పర్వతం కవ్వంగా, వాసుకి అల్లెత్రాడుగా క్షీరసాగరాన్ని మథించడానికి పూనుకున్నారు. ఆ సందర్భంలో క్షీరసాగర వర్ణన కనిపిస్తున్నది.

"విశ్వంభరుండైన విష్ణుని సత్కీర్తి పూనికె నతి శుభ్రమైనదాని
భాసమానోన్నతైక నభంబుదాని" (1-177)

క్షీరసాగరంలో శ్వేతదీవిలో విశ్వంభరుడైన శ్రీమహావిష్ణువు నివసిస్తున్నాడు. అటువంటి భాగ్యంచేత విష్ణుమూర్తి సత్కీర్తితో నిండి అతిశుభ్రమై దవళవర్ణంతో మెరిసిపోతున్న క్షీరసాగరాన్ని దేవదానవులు చూశారు. దానిలో హరికథా మాలికల లాగ ఎడతెగక ఆకాశాన్ని అంటుతున్న కెరటాలు పుడుతున్నాయి. నిరంతరం సంచరిస్తున్న తిమి తిమింగలాలతో కలితచెంది, అమృతకణాలు నక్షత్ర గణాలను తాకుతున్నాయి. కాంచన, చూత, చందన, వట, నారికేళ వృక్షాలతో ఆవరించబడిన క్షీరసాగరాన్ని దేవదానవులు దర్శించినారని సముద్రవర్ణన చేయబడింది. అమృతకణాలు, ఫలవృక్షాల ప్రస్తావన తర్వాత క్షీరసాగరం నుంచి పుట్టేటువంటి అమృతాన్ని కల్పవృక్షాదులను సూచిస్తున్నాయి.

5.3.5.3. పర్వత వర్ణన

ఈ కావ్యంలో పర్వత వర్ణన రెండు పర్యాయాలు ముందర, కైలాస పర్వత విషయంగా చేసినట్లు కనిపిస్తున్నది. మొదట దేవదానవులు క్షీరసాగర మథనానికి మందరగిరిని పెకలించడానికి చేసిన ప్రయత్న సందర్భంలో వారు చూసిన మందర పర్వతాన్ని కవి క్రింది విధంగా వర్ణించాడు.

"నీలగండప్రభాజాల తమిస్రంబు లంబుజరాగ శృంగారుణంబు
గలుగు మందర శైలంబు గనిరి మ్రోల" (1-167)

దేవదానవులు భూమిని ఆకాశంతో కలుపుతున్నంత ఎత్తుకు ఎదిగిన, కాంచన రత్న కాంతులతో వెలుగుతున్న, గండ శైల శిఖరాలతో కూడిన మందర పర్వతాన్ని చూశారు. మామిడి మొదలుగా గల వృక్షాలతో విలాస భరితమై మదపుటేనుగులు, సింహ మృగసహితమై ఒప్పుతున్న మందర గిరిని వారు చూశారు. అప్సరకాంతలు విహరించగా చూసి విస్మయంతో శిలలైనట్లుగా పచ్చరాళ్ళు, కిన్నరుల గానానికి పరవశించి తలలూపుతున్న పన్నగ సమూహాలు, గైరికాది ధాతువుల సమూహాలు, గరుడమణి శృంగాలతో, శృంగార వనాలతో ఆ మందరశైలం మిక్కిలిగా ప్రకాశించింది.

నీలగండశిలలు చీకట్లను కల్పించగా, కొండకొనల మీద వికసించిన ఎర్ర గన్నేరు పూవులు ఎర్రని కాంతులను వెదజల్లాయి. తరుశిఖలలో పుష్పాలు నక్షత్ర సమితిని గుర్తుచేయగా, సూర్యకాంత శిలలతో వెలుగుతున్నది వికసించిన కలువ పువ్వులాగ సంధ్యకాలంలోని పశ్చిమాకాశం లాగ భ్రమించుచున్న మందరశైలాన్ని దేవదానవులు చూశారు. ఈ విధంగా పర్వత వర్ణన చేయబడింది.

5.3.5.4. ఋతు వర్ణన

చంద్రకేతుడనే రాజు చంద్రరేఖతో వివాహం తర్వాత వనవిహారం చేసే సందర్భంలో ఋతువర్ణన చేయబడింది. ఆరు ఋతువులనూ కవి సముచిత రీతిలో క్రింది విధంగా వర్ణించాడు. కేళీవనంలో విహరిస్తున్న చంద్రరేఖ, చంద్రకేతులకు ఆ వనంలోకి అప్పుడే ప్రవేశిస్తున్న వసంత శోభ ఇలా కనిపించింది.

"వెడవిల్తు జయధాటి విడిదల సవరించు,
నపుడు గనుపట్టె నా వసంతాగమంబు" (5-153)

మన్మథుని జైత్రయాత్రకు విడిదిని కల్పించే పనులతో త్వరపడుతున్న విధంగా, చెట్ల చివర్లలో చివురుల ధ్వజములను ఎత్తించి, పూవుపొదరిండ్ల గుడారాలు నిర్మించి, లేత మావిగుబురుల పందిరులు తీర్చి, పూదేనె కాల్వలు పొందుపరిచి, కోకిల ధ్వనుల కంచుకొమ్ములను సవరించి, ఆడులేళ్ళ సమూహాలు ఎదురుతీర్చి, చిగురులు, తామరతూండ్లను, మధువును తగిన బహుమతులుగా తెచ్చి, కోయిలలు, హంసలు, చిలుకలకు మంచి కానుకలు అందిచటానికి చైత్రుడు చేసిన ఏర్పాట్లు అనే విధంగా వసంతం వచ్చింది. ఆ తర్వాత కొంతకాలానికి 'రాత్రుళ్ళు కొద్దులయ్యి, పగళ్ళు దీర్ఘమైనాయి. వేయికిరణాల చేతులతో సూర్యుడు భూమిపై నీరు త్రాగగా, నీరు నీటిని కోరగా, నీడలు నీడకు చేరగా, వాయువు వాయువునకు పయనించగా వేసవి కాలపు బెట్ట భూమిపై వెలసింది' (5-133,134)

వేసవి తాపాన్ని తీర్చడానికి 'మేఘగర్జనలతో ఆకాశంలో మేఘతతుల ప్రయాణంతో వాతావరణం చల్లనయింది. కృష్ణమోహన కాంతితో వెలుగుతున్న మేఘసమితిని చూచి భూకాంత మేను పులకరించినట్లుగా, తొలకరి వానలకు భూమిపై మొలకలు మొలిచాయి. భూకాంత సస్యభరితమైంది. చెరువులు పరిపూర్ణమైనాయి. స్వాతికొంగలు ఆకాశంలో ధవళ వస్త్రాలు పరిచినట్లుగా పయనమైనాయి' (5-141,143) 'శరత్కాలంలో చంద్రకాంతులు రాత్రులను వెలిగించాయి. వెన్నెల కాంతులకు తెల్లుపూవులు భూమిపై వృద్ధిపొందాయి. తెల్లుపూవుల తెల్లదనం లాగా మేఘాలు తెల్లనయ్యాయి. నదులు అల్ప ప్రవాహాలయ్యాయి. ఆ విధంగా శరత్కాలం ఉజ్జ్వలంగా ప్రకాశించింది' (5-146) శరత్కాల రాత్రులు ముగియగానే, 'పంటలు వృద్ధి పొందాయి. జనులు చలిమంటలకు చేరారు. భూమిపై మంచు పెరిగింది. నీరు ఆవిరయ్యింది. శీతాకాలం సకల విశ్వమంతా

సంపూర్ణంగా నిండిపోయింది' (5-148) మంచు 'కగిపోగానే కమలవనాలు తల వాల్చాయి. చెరువులలో నీరు తగ్గింది. చలి తన ప్రభావాన్ని తగ్గించింది. పైరులు సమృద్ధిగా పండాయి. శిశిరకాలం వచ్చిందని తెలుపుతూ ప్రకృతిలో ఈ మార్పులు కలిగాయి' (5-149) ఈ విధంగా ఋతు వర్ణన ఈ కావ్యంలో సముచితంగా కనిపిస్తుంది.

5.3.5.5. చంద్రోదయ వర్ణన

చంద్రకేతుడు చంద్రరేఖ మీద విరహంతో, ఎలాగైనా ఆమెను తనకు కూర్పమని మంత్రితో చెబుతుండగా సాయంత్రమైంది. అప్పుడు సంధ్యకాలం, చీకట్లు, తారకలూ క్రమంగా కనిపించగా చంద్రోదయాన్ని కవి క్రింది విధంగా వర్ణించాడు.

"అట కలహాశనికైన వికృతాంగములన్ విరహాగ్ని నొందినన్
పటుతల దీధితిన్ కుముద బంధుడు దోచెను తూర్పుదిక్కునన్" (4-376)

వనంలో విహరించి ఆశ్రమానికి వచ్చిన చంద్రరేఖ విరహంతో ఉండగా, నారదుడు స్త్రీగా మారిన విధానికి ఆశ్చర్యంతో, ఇప్పుడు విరహాన్ని ఎలా భరిస్తున్నాడో అనే కుతూహలంతో రాబోవు దూతకు ముంగిట్లో దారి చూపుటకా అనునట్లుగా, చీకట్లతో నిండి ఆకాశంలో ముంగిటదీపం లాగా, చంద్రజ్యోతి లాగ చంద్రుడు తూర్పుదిక్కున ఉదయించాడు అని చంద్రోదయం వర్ణించబడింది.

5.3.5.6. సూర్యోదయ వర్ణన

చంద్రకేతుడు రాత్రంతా చంద్రరేఖ మీద విరహంతో గడపగా, తెల్లవారు సమయానికి మంత్రి శుభవార్తతో తిరిగి వచ్చాడు. మంత్రి చంద్రకేతునితో వివాహానికి చంద్రరేఖ అంగీకరించిందని తెలిపాడు. ఆ సమయంలో ఆహ్లాదభరితంగా వేగుచుక్క తూర్పుదిక్కున చంద్రకాత ధరించిన మేలిమి ముత్యం లాగా దర్శనమిచ్చింది. పక్షులకు మెలుకువ కలిగిస్తూ, పాములకు ఆకలి కలిగిస్తూ, చోరులకు భీతిని కలిగిస్తూ, ఇతరులు పనిపాటలు చేసుకోవడానికి మేల్కొనునట్లుగా శీతవాయువులు వీచాయి. తూర్పుదిక్కున సూర్యరథం సమీపించిన కారణంగా, శత్రువీరుల శిరస్సులను ఖడ్గంతో తెగగొట్టగా పైకి ఎగజిమ్ము రక్త ధారల లాగ సూర్యుని కిరణాల కాంతి ఎర్రగా వ్యాపించింది.

"కమలిని సేదదేరె శశికాంతులు వెల్వలబాలె తుమ్మెదల్
రమణము జారె మిక్కిలిని రాగఁము దిక్కుల మీరె నెంతయున్" (5-98)

చంద్రకాంతులు వెలవెల బారగా, పద్మకాంత సేదదీరగా, తుమ్మెదలు వెలువడి కమల వనాలలో తిరుగుతూ కమల కాంతలను చేరగా, తెల్లకలువలు మదిలో వెతలతో కూలినాయి. గృహాంతరాలలో వెలుగుతున్న దీపకాంతులు అందాన్ని కోల్పోయాయి. సూర్యకాంతులు దిక్కులలో వ్యాపించినాయి. ఈ విధంగా చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలు ఇందులో వర్ణితమైనాయి.

5.3.5.7. విరహం

చంద్రకేతుడిని చూసి మోహంతో చంద్రరేఖ విరహభావాన్ని పొందగా చెలికత్తెలు ఆమెను ఉద్యానవనంలో పుష్పాపచయ క్రీడలకు తీసుకువెళ్ళారు. ఆ సందర్భంలో వేంకటకవి మునికన్యల పుష్పాపచయ క్రీడనూ, చంద్రరేఖ విరహాన్ని క్రిందివిధంగా వర్ణించాడు. రాజకుమారుడైన చంద్రకేతుని చూచినప్పటి నుండి చంద్రరేఖ కారణమేమో తెలియకుండా, తీరని కాంక్షతో నిండినదై నిట్టూరుపుతో ఉస్సురని అంటున్నది. ఊరకనే ఏడుస్తుంది. అలత పొందుతుంది. వేదన పడుతుంది. ఆమె వేదనను మాన్పటానికి చెలులు ఉద్యానవనానికి తీసుకు వెళ్ళారు.

"మల్లెపువ్వులు హస్తపల్లవ పుటినిడ,
మదన శరభిన్న హృదయమై పదరు లాగి" (4–290)

చెలికత్తెలు మల్లెపూవులు కోసి దోసిట్లో పోయగా చేతులు మిక్కిలి పొక్కెనని పారవేసింది. లేత చివురాకుల మెత్తదనాన్ని చూడమని ఇవ్వగా, వాడిపోయినవని విసిరి వేసింది. పూవు తేనెల మాధుర్యాన్ని చూడమని ఇవ్వగా, కడువేడి అని విడిచి వేసింది. కలువ గొజ్జగి నీరు చిందగా, మేను కందుతున్నదని కోపగించింది. చల్లగాలికి తల్లిడిల్లింది. పికశుకముల కూతలకు భయపడింది. చంద్రకాంత శిలావేదికలను ఏవగించుకున్నది. మదన బాణాలతో హృదయం భిన్నమవగా చంద్రరేఖ విరహాభావాన్ని పొందింది. చెలికత్తెలు చేసిన శీతలోపచారములన్నీ విరోధములే అయినాయి. మన్మథుడు శివుని కంటి మంటకు బూడిద కుప్పగామారి మరణించాడు. అతడి వాహనమైన చిలుకలు అడవుల పాలయ్యాయి. పూల బాణాలు మాలల పాలయ్యాయి. సైన్యం అంతా అనేక రకాల చెట్లపాలు అయ్యింది. ధ్వజము, శరీరం, అందం అంతా కాలి చచ్చి కూడా చావకుండా ఈ విధంగా విరహాన్ని కలిగిస్తున్నావు కదా! అని చెలికత్తెలు మన్మథుని దూషించారు. ఈవిధంగా చంద్రరేఖ విరహావస్థ ఇందులో వర్ణితమైంది.

5.3.5.8. ఉద్యానవన వర్ణన

శ్రీకృష్ణుడు సత్యభామారుక్మిణులతో కూడి నారదుడు వెంటరాగా రైవతగిరికి విహారం నిమిత్తంగా వెళ్ళిన సందర్భంలో ఉద్యానవన వర్ణన కనిపిస్తుంది. సత్యభామ రుక్మిణులు చెలులతో కలిసి రైవతగిరి మీద వనవిహారం చేస్తూ, వర్షాకాలంలో తడిసిన వనశోభకు ఆశ్చర్యపోయారు. పూవుతేనెల జడివానకు తడిసి గొజ్జగి పూపొదలు మంచు సోనలతో నిండినాయి. పూవుపొదలలో చేరిన చిలుకలు, కోయిలలు, నెమళ్ళు కప్పల సమూహాల కూతలతో వనమంతా మ్రోత వ్యాపించింది. పొదరిండ్లపై చేరిన మేఘపంక్తుల గర్జనల లాగ ఆ ధ్వనులు ఒప్పగా ఆ వనమంతా వర్షాకాలపు వింతశోభతో అలరారింది. "మావుల జుట్టు పోకనుమ్రాకుల బ్రాకుచు వీకమూగుచున్
చేవదలిర్పగేరుచు వచింపుచు నాడుచు బాడుచుందమిన్" (4–106)

ఆ ఉద్యానవనంలో విహరిస్తున్న కాంతలు నునుపుగా ఉన్న పోకమానులను పట్టి పాకుతూ, ఉత్సాహంతో చెట్ల మీదికి మూగుతూ, తీగలతో ఊయలు ఊగుతూ, పూవు తేనియలు తాగుతూ, పూవు గుత్తులను క్రమంగా కోయుచూ శుకనినాదాలను, పికకుజితాలనూ ధైర్యంగా తిరస్కరిస్తూ, ఆడుతూ పాడుతూ తమకంతో ఆ వనంలో విహరించారు. పూచి నిండుగా కొమ్మలు వాలిన పొన్నచెట్టును చేరి ఒక కన్నియ పూవులు కోయబోయింది. పొన్నపూవులోని తుమ్మెదలు అందమైన మోవితావిని తాగేందుకు ఝుమ్మని వచ్చి ఆ కన్నియను మూగినాయి. దానికి ఆ కన్నీయ భీతిల్లగా చూచిన చెలికత్తెలు నవ్వసాగారు. తామర పొత్తున నవదంపతులు పువ్వుతేనెలు కలిపి తాగగా, ఓర్వలేక వచ్చి ఒక దుండగపు తుమ్మెద తామరాకు అంచును తొక్కింది. ఆ మధువంతా చిందగా చూసేందుకు నయనానందకరంగా ఉన్నది. ఈ విధంగా సత్యభామ రుక్మిణులు ప్రియకాంతలతో కూడి రైవతగిరి ఉద్యానవనమంతా కలియదిరుగుతూ వనవిహారం చేశారుని ఉద్యానవన వర్ణన చేయబడింది.

5.3.5.9. జలక్రీడ

సత్యభామ రుక్మిణీ కాంతలు వనవిహార శ్రమ చేత, బడలికను తీర్చుకోవడానికి అందమైనది, తామరలు, హంసలు మొదలుగా జలజాతమై కన్నుల పండువుగా ఉన్న సరోవరంలో జలక్రీడలకు ఉపక్రమించారు. పూర్వం బృందావనంలో గోపికలు వస్త్రహీనలై జలకాలాడగా శ్రీకృష్ణుడు సిగ్గువిడిచి వారి వలువలు అపహరించాడు. కాబట్టి నేడు వస్త్రాలతోనే జలకాలాడుట మర్యాద అని భావించి స్త్రీలు ఆ సరోవరంలోకి దిగి జలకాలాడేందుకు సన్నద్ధులైనారు. పయ్యెదలు గట్టిగా చేర్చి, చెరగులను గట్టిగా చుట్టి, ఒకరి చేతులు ఒకరు కొట్టుతూ, పందెమడుతూ ఒకరితో ఒకరు పోటీ పడుతూ ఆ సరోవరంలోకి దుమికినారు.

"వాలవాలం బొక్కనీలాహి వేణిక, కడువెంటబడె బర్హికచ యొకర్తు
సరసి సుమనాభ యొక్కతె సరసిముంచె" (4-135)

సరోవరంలో జలకాలాడుతూ పామువలె అల్లిన పొడవైన జడ కలిగిన ఒక కన్నె ఈదులాడగా, వెంటనే నెమలి పింఛం వంటి జడకలిగిన మరోకాంత ఆమెను వెంబడించింది. కరికుంభ కుచములు కలిగిన కన్య ఒక చెలిని వెనుకకు ఈడ్వగా, సింహం వంటి నడుము కలిగిన చెలి పైకి ఉరికి ఆమెను నీట ముంచింది. పద్మహస్తంతో ఒక కన్యనీళ్ళు పైన చల్లగా, భద్రగజం వంటి నడక కలిగిన చెలి ఆమెను చేయిపట్టి తిప్పింది. తుమ్మెద వంటి వెంట్రుకలు గల కాంత ఒకటి ఓయని అరువగా సంపెంగ నాసిక గల కాంత దానిని ప్రయత్నించి నీటిలో తేలునట్లుగా చేసింది. ఒక సైకత నితంబి కినుకతో ఒక చెలిని నీటి నుంచి పైకెత్తగా, సుడి వంటి నాభి కలిగిన కాంత ఒకటి దానిని సరస్సులో ముంచింది. ఈ విధంగా రుక్మిణీ సత్యభామలు చెలులతో కలిసి సరస్సులో విలాస భరితంగా జలక్రీడలు ఆడినారు.

5.3.5.10. వివాహం

ద్వితీయాశ్వాస ప్రారంభంలో దేవదానవులు కలిసి లక్ష్మీనారాయణులకు కళ్యాణం జరిపించారు. ఆ వివాహాన్ని గురించి వేంకటకవి విపులంగా వర్ణించాడు.

"అంబుజ సంభవుడాచార్యుడై యొప్పె పేర్మి శక్రుడు పెళ్ళి పెద్దగాగ
హరివరించెను ముదముతోనాదిలక్ష్మి" (2-6)

లక్ష్మీ నారాయణుల కళ్యాణానికి బ్రహ్మ ఆచార్యుడైనాడు. ఇంద్రుడు పెళ్ళి పెద్దగా అన్ని పనులూ స్వయంగా పర్యవేక్షించాడు. వరుసగా దిక్పాలకులు తగిన పనులన్నీ చక్కగా నిర్వహించారు. అప్సరకాంతలు తమ నృత్యగానాలతో వివాహ వేడుకలో ఆడిపాడారు. వినసొంపుగా దివ్య దుందుభులు మ్రోగాయి. మునుల భార్యలు మంగళగీతాలు పాడారు. తుంబుర నారదులు గానం చేశారు. ఆకాశంలో దేవతలు పూలవాన కురిపించారు. మునులు క్రమంగా వేదపాఠాలు చదివారు. గంగ కాంచన కలశంతో నీటిని అందించగా, సముద్రుడు కన్యాదానం చేయగా, శ్రీహరి ఆనందంతో మహాలక్ష్మిని వివాహమాడాడు. అప్సరకాంతలు, బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు, మునులు, యక్ష గంధర్వసిద్ధ సాధ్య కిన్నర కింపురుష పన్నగాదులు అనేక విధాలుగా శ్రీమహావిష్ణువును స్తుతించారు. లోక కళ్యాణార్థం శ్రీమహావిష్ణువు దేవదానవుల చేత అమృతం నెపంగా క్షీరసాగరాన్ని మథింపచేసి, అందులో నుండి జన్మించిన మహాలక్ష్మిని వివాహమాడినాడు. ఈ విధంగా శ్రీ లక్ష్మినారాయణుల కళ్యాణం ఈ కావ్యంలో వర్ణితమైంది. చంద్రకేతుడనే రాజు చంద్రరేఖను వివాహమాడిన సందర్భంలో వారి వివాహాన్ని గురించి కూడా కవి సందర్భోచితంగా ఒక పద్యంలో వర్ణించాడు. అందులో వివాహానంతరం చంద్రకేతుడు బంధుమిత్రులను, ప్రజలను అనేక కానుకలతో, దానాలతో సంతృప్తి పరచినట్లుగా వర్ణితమైంది.

5.3.5.11. పుత్రోదయం

చంద్రకేతుడు మాయా స్త్రీరూపంలో చంద్రరేఖగా ఉన్న నారదకాంతతో నూరు సంవత్సరాలు సంసార సుఖాలు అనుభవించిన తర్వాత వారికి పుత్రోదయ ప్రాప్తి కలిగింది. "ఇట్లు శతసంవత్సరంబులు తనియని సురుత సామ్రాజ్య సౌఖ్యంబునం బొందుచున్న సమయంబున పూర్వ శాప నిమిత్తంబుల నరువది సంవత్సరంబులు క్రమంబున నరువది తనూభవులై యాదంపతులకు నుదయించి.." (5-156) ఈ విధంగా విష్ణుమాయా ప్రభావ ఫలితంగా, పూర్వ శాప నిమిత్తంగా చంద్రరేఖకు అరవైమంది కుమారులు కలిగి, దినదిన ప్రవర్ధమానులై, పరిపూర్ణయౌవనులై తేజిరిల్లినారని పుత్రోదయాన్ని వర్ణించాడు.

5.3.5.12. ప్రయాణ వర్ణన

రైవతగిరి నుండి బోయలు వచ్చి, రైవతగిరివనంలో విహరించమనికోరగా, శ్రీకృష్ణుడు సపరివార సమేతుడై రైవతగిరికి బయలుదేరాడు. ఆ సమయంలో ప్రయాణ

వర్ణన చేయబడింది. శ్రీకృష్ణుడు వన విహారానికి బయలుదేరే ముందు విప్రులకు, ముత్తైదువలకూ దానంచేశాడు. సారధిని రథం సిద్ధం చేయమని సైగచేశాడు. అతడు వేగంగా వెళ్ళి రథాన్ని సిద్ధంచేసి తీసుకురాగా, శృంగారమూర్తిలాగ శ్రీకృష్ణుడు ఆ రథాన్ని అధిరోహించాడు. గరుడకేతనం ఎగురవేశారు. అందులో నారదుడు, బలరాముడు, అష్టమహిషులు కూర్చున్నారు. అపుడు పుర్వాద్రి మీద చంద్రుని లాగా మోహనమైన ఆ రథంలో శ్రీకృష్ణుడు కనిపించాడు.

"దారకుడల్లనల్ల ప్రమీదం బున దేరటు వోవనియ్య శృం

చారుమణి ప్రభా పటల సౌధములందరుల నుండి చల్లుచున్" (4-90)

శ్రీ కృష్ణుని రథసారథి అయిన దారకుడు మెలమెల్లగా ఆనందంతో రథాన్ని ముందుకు నడిపించగా, శృంగారవనానికి వెళ్ళే మార్గంలో దూతికలు, వారికంటే ముందుగా మార్గానికి ఇరువైపులా పౌరకాంతలూ సంతోషంతో పేలాలు, అక్షతలు చేతులతో ధరించి అందమైన మణిమయ సౌధాగ్రముల నుంచి చల్లినారు. ఆ విధంగా శ్రీకృష్ణుడు సపరివారసమేతంగా రైవతగిరి మీది శృంగార వనశోభను దర్శించడానికి సంరంభంతో ప్రయాణమైనాడని ప్రయాణ వర్ణన చేయబడింది.

5.3.5.13. యుద్ధ వర్ణన

వేంకటకవి తన కావ్యంలో దేవదానవులకు మధ్య జరిగిన యుద్ధాన్ని విపులంగా వర్ణించాడు. ఆంధ్ర మహాభారత ప్రభావం, తిక్కన గారి వర్ణనా కౌశలం వేంకటకవి రచనలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. క్షీరసాగర మథనం తర్వాత అమృతభాండాన్ని రాక్షసులు తస్కరించగా, మోహిని రూపంలో వచ్చి విష్ణువు అమృతాన్ని దేవతలకు పంచాడు. దానికి కోపించిన దానవులు బలి చక్రవర్తి నాయకత్వంలో దేవతలపైకి దండెత్తి యుద్ధానికి వచ్చారు. బలిచక్రవర్తి యుద్ధ సంరంభంతో సైన్యాన్ని నడిపించగా భూమి బీటలు వారింది సప్త సముద్రాలు బుడుబుడు ధ్వనులతో మసిలిపోయాయి. చెవులు చిల్లులు పడి దిగ్గజాలు పరుగుపెట్టాయి. భీషణమైన ప్రస్థాన భేరి మోతకి దిక్కులన్నీ గిరిగిర తిరిగాయి. నేల ఈనినట్లు దానవసైన్యం రణ రంగానికి కదిలింది. కోట్లసంఖ్యలో రాక్షససైన్యం గొప్ప రథాలతో, మత్త గజాలతో అశ్వాలతో, కాల్బలంతో నాలుగు సముద్రాల పర్యంతం వ్యాపించింది. నర నారాయణులనే మునులు ఇంద్రుని కోరిక మీద రాక్షసులతో యుద్ధానికి ఎదుర్కొన్నారు.

ఆకాశంలో మేఘాలు ఢీకొనగా మెరుపులు ఏర్పడే విధంగా రాక్షస దేవతల సైన్యాలు ఎదుర్కొన్నాయి. రాక్షసవీరులు యుద్ధ తంత్ర నిపుణతతో రణరంగంలో చెలరేగి పోరాడగా కిరీట కుండల విభూషితమైన శరీరాంగాలు ఖండించబడి, వీరుల రక్తంతో రణభూమి అంతా రక్తసిక్తమైంది. యుద్ధరంగంలో మదగజాలు రథ సమూహాలను త్రుంచి, నుగ్గుగా చేశాయి. మదగజాలపై అశ్వ సమూహాలు అటు

ఇటు దుముకుతూ ప్రౌఢక్రియతో కుంభస్థలాలను పొడిచాయి. సుర రాక్షస యోధులు రథాలతో పరస్పరం ఎదుర్కొని దివ్యబాణ సమూహంతో ఒకరినొకరు ఎదుర్కొన్నారు.

"ధనువుంద్రుచుచు వేరెకార్ముకములందందన్ వడిం దాల్చుచున్
ధనముల్ గైకొని బీరు వోకడ రుచుద్దామక్రియం బోరుచున్" (2-111)

అనేవిధంగా దేవదానవ సంగ్రామం సంభ్రమంగా సాగింది. ధనుస్సులను పరస్పరం తుంచుతూ, అంతలోనే వేగంగా వేరొక ధనువును అందుకుంటూ, శరీరాలపై బాణ సమూహాలను నాటుతూ, మూర్ఛపోతూ, అంతలోనే తేరుకొంటూ గొప్పవీరులై సారథులను చంపుతూ, ఖడ్గం, చురకత్తి, కుంతకం మొదలైన యుద్ధ సాధనాలతో భయంకరంగా యుద్ధం చేశారు.

ఈ విధంగా దారుణంగా జరిగిన ఆ యుద్ధంలో మరణించిన ఏనుగులు, పొడి అయిన రథాలు, ముక్కలుగా నరుకబడిన గుర్రాలు, ముక్కలుగా చెదిరిన భటుల సమూహాలు, తునుకలయిన గొప్ప కేతనాలు, నుగ్గు నుగ్గు అయిన పగ్గాలు, తెగి పడిన నొగలు, ఖండములైన కోదండాలు, విరిగిపడిన ఇరుసులు, చెక్కలయిన చక్రములు, డొల్లు శిరస్సులు, పొర్లుతున్న కళేబరాలు, పరుగులెత్తు మొండెములు, బొబ్బలిడుతున్న ముఖాలు, గుట్టులుగా తెగిపడిన అవయవాలు, రక్తజలాలతో నిండినదై, కళేబరాలు తేలుతుండగా గొప్ప రక్తకాసారం లాగా ఆ రణభూమి కనిపించింది. ఈవిధంగా యుద్ధ వర్ణన ఈ కావ్యంలో పూర్వ కావ్య సంప్రదాయాన్ని అనుసరించి విపులమైన రీతిలో వర్ణితమైందని తెలుస్తున్నది.

5.4. ఆలంకారికత

అలంకారాలు సహజంగా కావ్యంలో వర్ణించే వస్తువు యొక్క స్వరూప స్వభావాలను ప్రకాశింపజేస్తాయి. కవి యొక్క ప్రౌఢో శక్తి చేత కావ్యంలో అలంకారాలు ప్రయోగింపబడతాయి. అలంకారాలు కావ్యంలోని ప్రధాన కథాసంబంధిగా ఉండాలి. అలంకారాలు వర్ణించేకాలంలోని ఆ వస్తువు యొక్క స్వరూప స్వభావాలను సహృదయుడైన పాఠకుడి మనస్సులో సముద్దీపింపజేసే విధంగా ఉండాలి. కావ్యంలో అలంకార రచనలో ప్రయోగించిన ఉపమానం ఏదైనప్పటికీ, అది అలంకారం యొక్క సార్థక్యాన్ని కలిగి ఉండాలి. విష్ణుమాయా విలాసకావ్యాలలో కవులు ప్రయోగించిన ఆలంకారిక సౌందర్యం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

5.4.1. చింతలపూడి ఎల్లనార్యుడు – ఆలంకారిక ప్రయోగం

ఎల్లనార్యుడు తన విష్ణుమాయానాటకంలో కథాసందర్భానుసారంగా ప్రయోగించిన అలంకారాలు క్రింది విధంగా ఉన్నాయి.

5.4.1.1 శబ్దాలంకారాలు

కావ్యంలో శబ్దాన్ని మాత్రమే ఆశ్రయించి ప్రవర్తిల్లేవాటిని శబ్దాలంకారాలు అంటారు. ఈ అలంకారాలలో శబ్దమే ప్రధానంగా కనిపిస్తుంది. శబ్దాలంకారాలలో

అనుప్రాస, యమకం, ముక్తపదగ్రస్తం మొదలైనవి ప్రధానమైనవి. విష్ణుమాయా నాటకంలో శబ్దాలంకారాలు క్రింది విధంగా ఉన్నాయి.

వృత్త్యనుప్రాస

ద్వితీయాశ్వాసంలోని మహాలక్ష్మి కథలో శ్రీమహాలక్ష్మి మాయాలక్ష్మి మహిమను గురించి దేవకాంతలతో చెప్పే సందర్భంలో వృత్త్యనుప్రాసయుక్తమైన ఈ పద్యం కనిపిస్తున్నది.

"నాకేశ్వరు సతికంటెను, భూకామిని కంటె నద్రి పుత్రిక కంటెన్
నీకంటెను నాకంటెను, లోకోత్తర చరితయిది విలోకింపదగన్" (2–90)

పైపద్యంలోని 'కంటె' అనే హల్లుల పునరావృత్తి వృత్త్యనుప్రాస అలంకారంగా కనిపిస్తుంది. మహాలక్ష్మి మాటలలోని ఈ పునరుక్తి మాయలక్ష్మి ప్రభావాన్ని దేవకాంతలకు తెలియజెప్పేందుకు తోడ్పడుతున్నది. అందువలన కథాసందర్భానికి తగినరీతిగా ఈ అలంకార ప్రయోగం ఉందని చెప్పవచ్చు.

ఇదేవిధంగా, "కలమృదు పల్లవము కంటె వసంతవిహారచారుకో..." (1–70)
"తిలకించుచుపులకించుచు..." (1–13)
"గిలకల సారెల మ్రోతయు..." (2–13)
"తాళపూగనారి కేళహింతాళకే..." (2–48)
మొదలైన పద్యాలలో వృత్త్యనుప్రాస అలంకారం కనిపిస్తున్నది.

ఛేకానుప్రాస

ద్వితీయాశ్వాసంలో శ్రీమహాలక్ష్మితో కలిసి మహావిష్ణువు వనవిహారం చేసే సందర్భంలో వర్ణించిన ఈ పద్యంలో ఛేకానుప్రాస అలంకారం కనిపిస్తుంది.

"సఫల పూగశ్రేణి సౌభాగ్య మగ్గించి, యురగవల్లుల దండ నుండి యుండి
గురివెంద పందిళ్ల పరువంబు గొనియాడి, మల్లెపూఁ బొదరిండ్ల మలసి మలసి
ద్రాక్షాఫలస్రవద్రస ధారలను నాని, గొజ్జంగిపూఁ దేనెఁ గ్రోలిక్రోలి
సహకార చారు మంజరులకుఁ దలయుంచి, పొన్న పుప్పొళ్లపైఁ బూసిపూసి" (2–54)

ఈ పద్యంలో 'ఉండి యుండి', 'మలసి మలసి', 'క్రోలి క్రోలి', 'పూసి పూసి' అనే హల్లుల జంటలు వ్యవధానం లేకుండా ఆవృతమైనాయి. అందుచేత ఇది ఛేకానుప్రాస అలంకారం అవుతున్నది. ఈ హల్లుల జంటల అవ్యవధానమైన ఆవృత్తి వలన కలిగిన శబ్దసౌందర్యం పద్యానికి ఒక వింత ఆకర్షణను కలిగిస్తున్నది. ఇదేవిధంగా, "మనమునఁ గుందికుంది పలుమాఱు నిజేశ వియోగవహ్నితా" (2–194) అనే పద్యంలో కూడా ఛేకానుప్రాస అలంకారం కనిపిస్తుంది.

అంత్యానుప్రాస

తృతీయాశ్వాసంలో మార్కండేయుడు బ్రహ్మకు వటపత్రశాయి అయిన మహావిష్ణువు మహిమను వర్ణించే సందర్భంలో అంత్యానుప్రాస అలంకారం కనిపిస్తుంది.

"బాలుడయ్యును ప్రౌఢితోఁబరగు వాని, గోచరించియు బ్రహ్మమై తోచు వాని
సృష్టిలీలాత్మకుండయై చెలగు వాని, విపుల మాయాచరిష్ణున విష్ణుగంటి" (3-79)
ఇందులో వటపత్ర శయనుడైన బాలుడిని ఉద్దేశించి చెబుతూ, ఆ బాలుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువే అని స్ఫురింపజేయడం కోసం 'వాని' అనే హల్లులకు పద్యపాదం చివరలో ఆవృత్తిని కలిగించినట్లుగా తెలుస్తుంది. అందువలన ఇది అంత్యానుప్రాస అలంకారం. ఇదే విధంగా, "దవ్వు వచ్చుటయు మార్దవముచేనోర్వక...ఁబడుచు" (2-180) అనే పద్యంలో కూడా అంత్యానుప్రాస అలంకారం కనిపిస్తుంది.

ముక్తపదగ్రస్తం

ద్వితీయాశ్వాసంలో మహాలక్ష్మి సరస్వతిలో మాయాలక్ష్మి మహిమను పొగిడే సందర్భంలో ముక్తపదగ్రస్త అలంకారం ఉంది.

"బ్రహ్మాది దేవతల్ ప్రణమిల్లరే తన, కేటికంజలి ఘటియించదాను
తనకేది యభిమతార్థమొకాని యభిమతా, ర్థమునకు నభిమతార్థంబు దాను
తను గూర్చి యందఱు తపము సేయుటగాక,
యొరు గూర్చి తపము సేయుదురె తాను" (2-86)

ఈ పద్యంలో మహాలక్ష్మి మాయాలక్ష్మి మహిమను పొగుడుతూ 'తాను'అనే పదాన్ని పద్యపాదం చివరలో విడిచి, తిరిగి 'తన' అనే పదాన్ని గ్రహించి పద్యపాదాన్ని ప్రారంభించడం కనిపిస్తున్నది. విడిచిన పదాన్ని తిరిగి గ్రహించి, దానితో పద్యపాదాన్ని ప్రారంభించడం వలన ఇది ముక్తపదగ్రస్తం అని చెప్పవచ్చు. ఎల్లనార్యుడు తన విష్ణుమాయా నాటకంలో ప్రయోగించిన శబ్దాలంకారాలను గురించి పై విధంగా చెప్పుకోవచ్చు.

5.4.1.2. అర్థాలంకారాలు

అర్థాన్ని ఆశ్రయించుకొని కావ్యంలో ప్రవర్తిల్లే అలంకారాలు అర్థాలంకారాలు. ఉపమానాదులు అర్థాలంకారాలుగా ప్రసిద్ధి. ఈ అలంకారాలలో అర్థమే ప్రధానమని తెలుస్తుంది. కావ్యగతమైన వర్ణనలకు, రసభావాలకూ ఈ అర్థాలంకారాలు మరింత వన్నెను కలిగిస్తాయి. విష్ణుమాయానాటకంలో కనిపించే ప్రధానమైన అర్థాలంకారాలు ఈ విధంగా ఉన్నాయి.

ఉపమాలంకారం

ద్వితీయాశ్వాసంలో శ్రీమహాలక్ష్మి మాయాలక్ష్మిని ఆమె వృత్తాంతం తెలుపమని అడుగుతున్న సందర్భంలో ఉపమాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"మలిన వస్త్ర గుప్త మాణిక్యమును బోలె
నీఱుగవిసియున్న నిప్పువోలె
వెలది నీదు రూపు వెలిమాసి లోనింపు
గలిగి యుంటకేమి కారణంబు" (2-100)

మాయాలక్ష్మి కల్పన మహాలక్ష్మికి గర్వభంగం కలిగించడానికి చేసింది. అందుచేతనే మాయాలక్ష్మి కళావిహీనంగా, ప్రభమాసిన దేవత లాగ కనిపించింది. ఆమెను చూసిన మహాలక్ష్మికి కలిగిన సందేహానికి ఈ ఉపమానాలు చక్కని నిదర్శనలుగా కనిపిస్తున్నాయి. మాయాలక్ష్మి ప్రభమాసి, మలిన వస్త్రంలో దాచిన మాణిక్యం లాగ, నీరు గవిసిన నిప్పుకణిక లాగ ప్రకాశహీనంగా కనిపిస్తున్నదని ఇక్కడ పోలిక చెప్పబడింది. పంచమాశ్వాసంలో నారదుడికి బ్రహ్మమునుల మధ్య మాయాముని రూపంతో ఉన్న విష్ణువు గ్రహ గణాలు చుట్టూ చేరిన సూర్యుడి లాగ కనిపించాడు.

"బ్రహ్మముని పారిషద మధ్య భాసియగుచు
గ్రహగణాశ్రితుడైన భాస్కరుండు వోలె
బ్రహ్మతత్వంబు తానయై ప్రతిఫలించు
హరినపూర్వర్షివరుఁ జూచియరుదు నొంది" (5-57)

ఇక్కడ మాయాముని బ్రహ్మమునుల మధ్య ఉండటాన్ని, గ్రహాల మధ్య ప్రకాశించే సూర్యుడితో పోల్చడం వలన ఇది ఉపమాలంకారం అవుతున్నది.
ఇదేవిధంగా,

"ఆచతుర్ముఖకీట పర్యంత జంతు..." (1-38)
"మానసంబునిండి వెలువడు..." (1-55)
"నిండి తొలంకు నాకొలని నెన్నడుమంగనకాంబుజాత..." (2-76)
"హరికరుణాసంప్రాప్తిన్..." (2-149)
"మేదినీకాంత ముత్యాల మేలుకట్టు..." (3-27)
"అనిన మందహాస మందంద రోచులఁ..." (3-66)

మొదలైన పద్యాలు ఉపమాలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

ఉత్ప్రేక్షాలంకారం

చతుర్థాశ్వాసంలో శ్రీమహావిష్ణువు మాయామోహినిగా మారిన సందర్భంలో చేసిన వర్ణన ఉత్ప్రేక్షాలంకారాన్ని ప్రతిఫలిస్తున్నది.

"తరుణాంఘ్రి పద్మద్వయీ లాక్షాప్ర
భాస్ఫూర్తులింద్ర గోపములుగాగ
నవరత్న ఖచిత మండన బహుచ్ఛాయాక
దంబంబు శక్రచాపంబుగాగ
కుచకుంభ చిత్రిత గోరోచనాపత్ర
లతలు సాధామినీ లతలు గాగ
గమన లీలోచ్చలత్కచ భార విచికిల
సూనముల్ వడగండ్ల సొంపుగాగ

కాంచి ఘంటా నినాదంబు గర్జగాగ
లలన కందర్ప పర్జన్య లక్ష్మి వోలె
దివిజ దైతేయ చాతకోత్సవముగాగ
వాలు జూపుల నమృతంపు వానగురిసె" (4-18)

ఇక్కడ దేవతలు, రాక్షసులు అనే చాతక పక్షులకు ఆనందం కలిగించే విధంగా మోహిని అనే పర్జన్యలక్ష్మి వాలుచూపులు అనే అమృతపు వాన కురిపించిందని కవి ఊహిస్తున్నాడు. ఈ వాలు చూపులనే అమృతపు వాన కురవడానికి ముందు ఇంద్రగోపములు, ఇంద్రధనుస్సు, మెరుపుతీగలు, వడగండ్లు, ఉరుములుగా మోహిని అంగాలను ఊహించడం వల్ల ఇది ఉత్ప్రేక్షాలంకారం అవుతున్నది.

ఇదే విధంగా,

"నీలపయోధరావలి వినిర్భర దీధితులాడ..." (1-36)
"వాసవ నీలజాలముల వారణ రాలెడు మింట నుండి..." (1-110)
"పాలమున్నీటిలో ప్రభవించు నుదయ..." (2-9)
"నీదగు సోదర భావము జెంది యనిందిత కీర్తి..." (2-42)
"రావణ బాహుదండముల త్రయ్యలు వ్రాసినరాలు..." (4-64)
"కటకాగ్రంబులఁ గేసరుల్ కరుల వీకం బట్టుచో..." (4-66)
"ప్రొద్దుగ్రుంకకమున్ను పురుషుండు వడుటయె..." (5-201)

మొదలైన పద్యాలు ఉత్ప్రేక్షాలంకార యుక్తంగా ఇందులో కనిపిస్తున్నాయి.

ఉల్లేఖాలంకారం

ప్రథమాశ్వాసంలో శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు విష్ణుమాయా ప్రభావాన్ని వివరించే సందర్భంలో ఉల్లేఖాలంకారం ప్రయోగించబడింది.

"క్రతుదీక్షితర్షి సంతతికి దుగ్ధరసంబు
గురియు నాక నివాస సురభివోలె
సస్యాభివృద్ధికి చాలంగ వర్షించు
ప్రావృట్పయోధర పటలి వోలె
వేలాతటంబున విబుధ రక్షార్థంబు
ప్రభవించు నమృత కుంభంబువోలె
సత్య భామన స్స్వామికి నభివాంఛి
తమునిచ్చు పారిజాతంబువోలె
పారకాంక్షి పరీక్షిన్నృపాల మౌళి
మధుకర స్వాంత సంతోషమయములైన
కోరికల మించు శుకముఖాంభోరుహంబు
నందనందన గాథామరందధార" (1-30)

ఈ పద్యంలో శుకమహర్షి ముఖం నుంచి వెలువడుతున్న శ్రీకృష్ణగాథ అనే మరందధారను వర్ణిస్తున్నాడు. అది క్రతుదీక్షలలోని మహర్షులకు పాలధారలు కురిపించే 'సురభి' అనే కామధేనువు వంటిది. సస్యాభివృద్ధికి భూమిపై వర్షించే మేఘసమూహం వంటిది. క్షీరసముద్రం నుంచి దేవతలను రక్షించడానికి ఉద్భవించిన అమృతకుంభం వంటిది. శ్రీకృష్ణుడికి కోరినవి కల్పించే పారిజాతం వంటిది. ఇక్కడ శుకమహర్షి వినిపిస్తున్న శ్రీకృష్ణునికథను పలువురికి పలురకాలుగా ఆనందాన్ని కలిగిస్తుందని వర్ణించడం వల్ల ఇది ఉల్లేఖాలంకారం అవుతున్నది.

ఇదే విధంగా "భక్తితోడఁ భావించు దీనుల..." (1-73)

"బ్రహ్మలయ్యెన మంద్రు పరమార్థమని పల్కి..." (3-51)

"శ్రీతులసీ మహీజాతాభిషేకంబు..." (3-103)

"శ్రీతులసీ మహీజంబు మొలుప బెట్టినఁగల్లు" (3-104)

"దివ్యసాలగ్రామదేవ మందిరము..." (3-115)

మొదలైన పద్యాలలో ఉల్లేఖాలంకారం కనిపిస్తున్నది.

రూపకాలంకారం

ప్రథమాశ్వాసంలో ధర్మరాజు సభకు వస్తున్న గోవిందశర్మను వర్ణించిన పద్యంలో అతడికి శ్రీకృష్ణుడితో అభేదం చెప్పబడింది.

"ద్వారక నుండి వచ్చె వటువర్యుఁ డొకండు వినీల కంధరాం
కారుడు గోపిచందన వికస్వరఫాలుడు పారిజాతమా
లా రమణీయ వక్షుడు, మిళత్తులసీవన మంజరీశ్రవో
హారి ద్వితీయ కృష్ణుడన హాటకపుస్తక హస్తుడై దివిన్" (1-108)

ఈ పద్యంలో గోవిందశర్మ వర్ణనలో కనిపించే వినీల కంధరాకారం, ఫాలభాగంలో గోపిచందనం, పారిజాతమాల, తులసీమాలలు ధరించడం అనేవి శ్రీకృష్ణుడి రూపంతో సమానంగా ఉన్నాయి. చూసేవారికి గోవిందశర్మ రెండవ కృష్ణుడుగా కనిపిస్తున్నాడు. ఇక్కడ గోవిందశర్మకు, శ్రీకృష్ణుడికీ రూప సాదృశ్యం ఉండటం వల్ల వారిద్దరికీ అభేదాన్ని వర్ణించడం కనిపిస్తుంది. అందువలన ఇది అభేద రూపకాలంకారం అని చెప్పవచ్చు. ద్వితీయాశ్వాసంలో మాయాలక్ష్మి వర్ణనలో తాద్రూప్య రూపకం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"కాంచన పంకజమెక్కెడు
కాంచన కలహంస వోలె కమలాలమయా
కాంచన పుష్పకమెక్కెన్
గాంచన మయ దేహరుచులు గడలు కొనంగన్" (2-164)

ఈ పద్యంలో బంగారు వర్ణంలోని పుష్పకవిమానాన్ని ఎక్కుతున్న మాయాలక్ష్మి, బంగారు తామరపూవును ఎక్కుతున్న బంగారు హంసితో సమానంగా వర్ణించబడింది.

ఇక్కడ మాయాలక్ష్మికి, బంగారు హంసికి తాద్రూప్యం వర్ణించబడినందు వలన ఇది తాద్రూప్యరూపకం అని చెప్పవచ్చు.

ఇదేవిధంగా, "వేదపురాణ శాస్త్ర ముఖ విద్యలు మూర్తి వహించి పల్కేడున్" (3-54)

"సావిత్రియతని యంగన, సావిత్రికి సాటివచ్చు..." (3-8)

"నీవును సాలగ్రామ శిలావాసుండైనయట్టి..." (3-92)

"గోపాల వేషధరుడై, శ్రీపతి వేణు స్వనంబు..." (3-297)

"కుముదమున జృంభితంబగు, హిమకరబింబంబు..." (4-8)

మొదలైన పద్యాలలో రూపకాలంకారం ప్రయుక్తమై కనిపిస్తున్నది.

అర్థాంతరన్యాసం

ప్రథమాశ్వాసంలో వ్యాసుడు ధర్మరాజు గుణగణాలను పొగుడుతున్న సందర్భంలో అర్థాంతన్యాస అలంకారం స్ఫురిస్తున్నది.

"జననాథోత్తమ ధర్మనందన! హరిశ్చంద్రక్షమాభర్తతో
నెనయై నిల్చితి సత్యవాక్యమున ధాత్రీశోత్తమ శ్రేణిలో
నని నిన్మెచ్చెద నట్లకాదె, సుజనుండైనట్టి వాడార్యవ
ర్తన వర్తించినఁ గీర్తియున్ సుకృతముం బ్రాపింపదేయెయ్యెడన్" (1-58)

ఈ పద్యంలో వ్యాసుడు ధర్మరాజు సత్యవాక్య పరిపాలనను సత్యహరిశ్చంద్రుడితో పోల్చడం విశేషం. దానిని సుజనుడైనవాడు ఆర్యుల మార్గంలో ప్రవర్తిస్తే కీర్తి, సుకృతం కలుగుతాయనే సామాన్యవాక్యంతో సమర్థించాడు. అందువలన ఇది అర్థాంతరన్యాస అలంకారమవుతున్నది. ధర్మరాజు సత్యవాక్య పాలనకు కారణం అతడు సుజనుడు కావడం. లోకంలో సుజనుడైన వాడు సన్మార్గంలో ప్రవర్తిస్తే అతడికి కీర్తి, సుకృతం కలగడం సహజం. కాబట్టి విశేషాన్ని సామాన్య వాక్యంతో సమర్ధించడం వలన ఇది అర్థాంతరన్యాసం.

ఇదేవిధంగా, "ఈ రసమును నిర్దయతయుఁ,
క్రూరత్వము సతులసహజ గుణములు మిగులన్" (2-63)

"అక్కట యింత చక్కని మృగాక్షిని బోయతనెట్లు చేసె..." (3-157)

"వాసన లేని మేలిమి సువర్ణము దీనిమనోహరత్వమ..." (3-157)

"పైగాలి వారినంతనె, యోగము చెడిమనసుగరగె..." (3-302)

"వెలవెల బాఱిరి వేల్పులు, తలచెదరి సుధాఘటంబు..." (4-10)

"అమృతకుంభమిచ్చి రంభోజపత్రాక్షి..." (4-39)

మొదలైన పద్యాలలో అర్థాంతరన్యాసాలంకారం కనిపిస్తున్నది.

స్వభావోక్తి అలంకారం

ప్రథమాశ్వాసంలో సత్యభామ అంతరంగాన్ని వెల్లండించే ఈ క్రింది పద్యంలో స్వభావోక్తి అలంకారం కనిపిస్తున్నది.

"నాతోగూడి విభుండు సంతమునున్నాడిట్లు ప్రేమోల్లస
చ్చేతోమోద మెలర్ప దీనికి మదిన్ సిగ్గైన నెట్లున్నవా
రోతర్కింపగ రుక్మిణీ ముఖ వరారోహల్ తదుద్యోగముల్
చూతామంచు దరస్మితాంశుకలనాను స్మేర వక్త్రాబ్జయై" (1-145)

ఈ పద్యంలో సత్యభామ శ్రీకృష్ణుడు ఆమెను కూడి ఎల్లప్పుడూ విడువ కుండా ఉన్నాడని భ్రమించింది. రుక్మణి మొదలైన అష్టమహిషులు శ్రీకృష్ణుడి ఎడబాటుకు ఏవిధంగా బాధపడుతున్నారో తెలుసుకోవాలని కుతూహలంతో చెలికత్తె చేత పారిజాతపుష్పాలు పంపించబోతున్నది. ఇక్కడ సత్యభామ అంతరంగ వర్ణన సహజమైన ఆమె స్త్రీ స్వభావాన్ని వ్యక్తపరుస్తున్నందు వలన ఇది స్వభావోక్తి అలంకారం అవుతున్నది.
ఇదేవిధంగా, "విన్నంబోయిన మోముతో హృదయ నిర్వేదంబుతో..."(1-186)

"అల్పసంసార సుఖానుభోగ, మఖిలషింపుదురధములు..." (3-172)

మొదలైన పద్యాలు స్వభావోక్తి అలంకారానికి ఉదాహరణలుగా కనిపిస్తున్నాయి.

ఆక్షేపము

తృతీయాశ్వాసంలో మార్కండేయుడు బ్రహ్మ గర్వాన్ని తిరస్కరించి, అతడికి విష్ణుమహిమను తెలిపే సందర్భంలో ఆక్షేపాలంకారం కనిపిస్తున్నది.

"అక్కట కన్నులార గనియైన నెఱుంగవు రాజసంబుపెం
పెక్కగ వేద మేది నుతియించెడుఁ జూడవె తద్రహస్యమున్
న్యకృతమయ్యె నీకతన నల్ప విచారుడ వౌటఁ జేసినీ
వెక్కడ విష్ణుడెక్కడ సహింతురె యార్యులనర్హవాక్యముల్" (3-69)

ఇందులో మార్కండేయుడు విష్ణుమహిమను చులకన చేసిన బ్రహ్మ రాజసగుణాన్ని, దుర్మదాన్ని ఆక్షేపిస్తూ, విష్ణువుకు బ్రహ్మకుగల అంతరాన్ని వివరించడం కనిపిస్తుంది. రాజసగుణ కలితుడైన బ్రహ్మకు వేదాలు నుతించేటువంటి విష్ణుమహిమ కనిపించకపోవడానికి అతని అల్పజ్ఞానమే కారణమని మార్కండేయుడి మాటలలోని ఆక్షేపం వలన తెలుస్తున్నది. కాబట్టి ఇది ఆక్షేపాలంకారం.

ఇదేవిధంగా, "నిన్నగాదు మొన్ననీవు జనించుట..." (3-56)

"హరిపరమాత్ముడు బ్రభుడునయ్యేనేని..." (3-59)

"ఈమునులీ మరుద్గణము లీదనుజుల్విని..." (3-64)

మొదలైన పద్యాలలో ఆక్షేపాలంకారం కనిపిస్తున్నది.

అతిశయోక్త్యలంకారం

చతుర్థాశ్వాసంలోని వైకుంఠంపుర వర్ణనలో అతిశయోక్తులు అలంకారగర్భితంగా క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

"సింగపు మోములుం గలుగు చిత్తరు రూపములప్పురోత్తమో
త్తుంగ సువర్ణ హర్మ్యములఁ దోరములై యటవేల్పుటేటి నీ

టంగడు బింబింతంబులగుటన్ గని నీళ్ళకు దెచ్చి యభ్రమా

తంగము భీతి మాన్పుదురు తచ్చలితా చలిత ప్రవాహులై" (4-117)

ఈ పద్యంలో, వైకుంఠపురంలోని బంగారు మేడలపై చెక్కిన సింహపు ముఖాలు గల బొమ్మలు ఆకాశగంగ నీటిలో ప్రతిబింబిస్తున్నాయి. ఆకాశగంగలో నీళ్ళకు వచ్చిన ఐరావతం సింహపు ముఖాన్ని చూసి భయపడగా, గంగా ప్రవాహం ఆ సింహపు ప్రతిబింబాన్ని చెరిపివేస్తూ, ఐరావతానికి భీతిమాన్పుతున్నది. ఇక్కడ వైకుంఠపురంలోని మేడలు ఆకాశం వరకూ వ్యాపించాయని, అందువల్లనే ఆకాశగంగలో మేడల మీది సింహపు బొమ్మల ముఖాలు ప్రతిబింబిస్తున్నాయనీ అతిశయించి వర్ణించడం వలన ఇది అతిశయోక్తి అలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా,

"అమలినహారిహాటక మయంబును నగు సరోజ..." (4-114)

"వలయిత రత్న వప్రము సువర్ణ శిరోగృహ రాజ..." (4-116)

"త్రిపథగయే చతుష్పథగ దేవతరంగిణి చూడుడంచు..." (4-122)

"పాలమున్నీటిలోపల ఎంతదవ్వైన, జానుదఘ్నంబుగా సంచరించు" (4-129)

"రూపముతోడిగాడ్పులు గరుత్తులు లేని ఖగంబు..." (4-130)

"భూరిబలోగ్రహేమ కశిపు ప్రముఖాసురులంజయించి..." (4-131)

మొదలైన పద్యాలలో అతిశయోక్తి అలంకారం ప్రయుక్తమై కనిపిస్తుంది.

దీపకాలంకారం

తృతీయాశ్వాసంలోని పుండరీకుని కథలో దారిద్ర్యాన్ని వర్ణించే సందర్భంలో దీపకాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"క్రతుదీక్షల్ వడుగుల్ వివాహ కలనా సీమంతముల్

రతి తంత్రోత్సవమాట పాటలు ప్రియాలంకార సారస్యముల్

వ్రతముల్ వేదపురాణ శాస్త్రపఠనల్ వర్ణాశ్రమాచారముల్

హత సంస్కారములయ్యె లేమిగడుఁ బెల్లైయెల్లెడన్ దోచినన్" (3-183)

ఈ పద్యంలో వర్ణిస్తున్న క్రతువులు, వడుగులు, వివాహం, సీమంతం మొదలైన శుభకార్యాలు, ప్రియ అలంకారాలు, వ్రతాలు, వేదపురాణ శాస్త్ర పఠనాలు మొదలైన పుణ్యకార్యాలు అన్నీ కూడా లేమి వలన హత సంస్కారాలైనాయని తెలుస్తుంది. ఇక్కడ ఉపమేయమైన దారిద్ర్యానికి ఉపమానాలలోని సామాన్య ధర్మానికి ఏకాన్వయం కలుగుతున్నందున వలన ఇది దీపకాలంకారం.

దృష్టాంతం

తృతీయాశ్వాసంలోని పుండరీకుని కథలో దృష్టాంతాలంకారం ఈ విధంగా కనిపిస్తుంది.

"నీ యిటువంటి సద్గుణము నీవన యౌవన రూప లక్షణ
శ్రీయుతిఁ జెందగల్గిన విశేష పురాకృత పుణ్యమేమనన్
దోయజనేత్రి నందగు మనోరథమున్ ఫలియించు నీవు నా
ప్రేయసివైతివేని విధి పెంపున బోయతవైననేమగున్" (3-163)

ఈ పద్యంలో ఉపమేయమైన బోయకాంత గుణాల కంటే ఉపమానంగా సద్గుణం, నవయౌవన రూపం, సంపద విలాసం మొదలైన భిన్నధర్మాలు వర్ణించబడ్డాయి. ఉమేయ, ఉపమానాలుగా వర్ణించిన ఈ భిన్న ధర్మాలు ఇక్కడ బింబ ప్రతిబింబత్వాన్ని కలిగి ఉన్నాయి. కాబట్టి ఇది దృష్టాంతాలంకారం.

పర్యాయం

ప్రథమాశ్వాసంలో సత్యభామ వర్ణనలో పర్యాయాలంకారం క్రింది విధంగా కనిపిస్తుంది.

"చయ్యన శయ్యడిగ్గి యరజాఱెడు వేణియు మందహాసమున్
బయ్యెద జీరుపాటు నవపాటలి తాక్షులు మర్మసీమలన్
వ్రయ్యలు వ్రాసియున్న నెలవంకలు నొప్పగ నా లతాంగియొ
య్యొయ్యనవచ్చె వాకిటికి నుబ్బుచు నవ్విభు గూడి క్రీడమై" (1-142.27)

ఈ పద్యంలో ఉపమేయమైన సత్యభామకు మొదట శయ్యను ఆశ్రయంగాను, ఆ తర్వాత ఆమె దానిని విడిచి వాకిలి వరకూ వచ్చినట్లుగానూ వర్ణించడం జరిగింది. ఇక్కడ సత్యభామకు మొదట శయ్యను ఆశ్రయంగా చెప్పి, దానికి పర్యాయంగా తర్వాత వాకిలిని సత్యభామకు ఆశ్రయంగా వర్ణించడం చేత ఇది పర్యాయాలంకారం అని చెప్పవచ్చు. ఇదేవిధంగా,

"ఈఱంబులగు పొదరిండ్ల నీడలవలి, గ్రమ్మిచో శీతల క్షణముదోచు" (2-51)
"ఆజగదేక భర్తకుఁ బ్రియాంగననైన మహానుభావతన్" (2-112)
"మును వనిత జవ్వనపు సిరిఁ, గనివంశము మఱచె..." (3-167)

మొదలైన పద్యాలలో పర్యాయాలంకారం కనిపిస్తున్నది.

సందేహాలంకారం

తృతీయాశ్వాసంలో పుండరీకుడు విష్ణుమాయను సందేహించే సందర్భంలో సందేహాలంకారం క్రింది విధంగా కనిపిస్తుంది.

"ఈ భూమండలి యీ సముద్ర వలయం బీవాయు వీపావకం
బీ భాస్వత్తు హిమాంశు దీప్తి కలుగన్నీ జంతు సంపత్తి మా
యా భిన్నమ్ములటంట మెట్టులవి దృష్టాంతంబులై యుండగా
నేభావంబున నిశ్చయింతు నొకటే నీతథ్యమిథ్యాద్వయిన్" (3-127)

ఈ పద్యంలో పుండరీకుడు తాను చూస్తున్న భూమండలం, సముద్రం, పంచభూతాలు

మొదలైన వన్నీ కనుల ముందు కనిపిస్తుండగా, వాటిని విష్ణుమాయా కల్పితములని నమ్మడం ఎలాగని సందేహించడం వలన ఇది సందేహాలంకారంగా కనిపిస్తుంది. ఇదే విధంగా, "ఏనీకొని తెచ్చినవిరు, లీనెతకు నీగిమేలొ..." (1-172)

"ఆలుంబిడ్డలు నిండ్లు నర్థమును నయ్యై యన్వయాచారముల్" (3-126)

"ఈయాలును నీ బిడ్డలు, నీయిండ్లును నీకులంబు..." (3-129)

"కుండలీకృత భోగమండి తోన్నత ఫణో, ధారమై..." (4-68)

"మదన నిధాన దేవతయె మానినియై తిలకింపవచ్చు..." (4-201)

"అరవింద వదనమోమో, యరవిందమె నీలవేణి..." (4-266)

మొదలైన పద్యాలన్నీ సందేహాలంకార యుక్తంగా ఉన్నాయి.

భ్రాంతిమదలంకారం

తృతీయాశ్వాసంలో మార్కండేయుడు విష్ణుమాయా మహిమను గురించి చెబుతున్న సందర్భంలో భ్రాంతిమదలంకారం కనిపిస్తున్నది.

"విష్ణుమాయగాగ వివరింపుదురు మహో
సూక్ష్మమతులు మఱియు స్థూల మతులు
బ్రహ్మ సృష్టిగాగ భావింత్రు కొందఱె
ద్దియును నెఱుకపడక తిరుగుచుంద్రు" (3-74)

ఈ పద్యంలో చరాచర జగత్తు అంతా విష్ణుమాయ అని మహానుభావులు భావిస్తారని, స్థూలమతులు బ్రహ్మ సృష్టి అనుకొంటారని, మరి కొంతమంది ఏదీ తేల్చుకోలేక భ్రాంతిలో ఉంటారని మార్కండేయుడు బ్రహ్మకు చెబుతున్నాడు. ఇక్కడ సృష్టిఅంతా విష్ణుమాయా కల్పితమా లేక బ్రహ్మ కల్పితమా అనే భ్రాంతిలో జనులు ఉన్నారని వర్ణించబడింది. కాబట్టి ఇది భ్రాంతిమదలంకారం అని చెప్పవచ్చు.

ఇదేవిధంగా,

"నవనలిన ప్రియోర్ధ్వ కిరణ ప్రతతుల్ పురివెండి మేడలం" (4-121)

"మృగమదాలేపము మెఱయు వేదికనద్రి, కూల భాగంబని" (4-139)

మొదలైన పద్యాలలో భ్రాంతి మదలంకారం కనిపిస్తున్నది.

సహోక్త్యలకారం

ద్వితీయాశ్వాసంలో దేవదుందుభుల వర్ణనలో ప్రయుక్తమైన సహోక్త్యలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"గంధర్వ మధుర గానము
బంధుర దుందుభిరవంబుఁ బైపైనాశా
సంధుల మొరయగ దక్షిణ
గంధవహాము వీచె దివ్య గంధంబులతోన్" (2-171)

ఈ పద్యంలో దక్షిణ గంధపవనం సుగంధ భరితమై గంధర్వ మధురగానంతో బంధురమైన దుందు భిరవంతో కలిసి దిక్కులంతటా వ్యాపించిందని వర్ణించబడింది. ఇక్కడ ఉపమేయ, ఉపమానాలైన దక్షిణ గంధపవనం, గంధర్వగాన దుందుభిరవాలు రెండూ ప్రస్తుతములే అవుతున్నాయి. గంధర్వగానం, దుందుభిరవం దక్షిణ గంధపవనంతో కలిసి దిక్కుల సంధుల వరకూ వ్యాపించిందని వర్ణించుట చేత ఇది సహోక్త్యలంకారం అవుతున్నది.

### వినోక్త్యలంకారం

ద్వితీయాశ్వాసంలో వినోక్త్యలంకారం క్రింది విధంగా ప్రయోగించబడింది.

"బల సంపత్పౌరుషములు
గలిగియు వినయంబులేని గర్వాంధులుత
ద్బలసంపత్పౌరుషములు
పొలిదఱుగక వశులుగారు బుద్ధిదలంపన్" (2-58)

ఈ పద్యంలో బలం, సంపద, పౌరుషం కలిగినప్పటికీ వినయం లేకపోతే జనులు గర్వాంధులు అవుతారని వర్ణించబడింది. ఇక్కడ ఉపమేయానికి బలం, సంపద, పౌరుషం ఉన్నప్పటికీ, వినయం లేకపోవడమనే అల్పవస్తులోపం వలన గర్వం అనే హీనత వర్ణించబడింది. అందుచేత దీనిని వినోక్త్యలంకారం అని చెప్పవచ్చు.

### పరికరాలంకారం

తృతీయాశ్వాసంలోని మార్కండేయముని వర్ణనలో సాభిప్రాయమైన విశేషణాలు పరికరాలంకారంగా క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

"అర్కోదగ్రరుచి ప్రకాశుడు ప్రభావాఢ్యుండు వేదార్థసం
పర్క ప్రస్ఫుట సత్యవాక్యుడు మహా ప్రామాణిక శ్రేష్ఠుడౌ
మార్కండేయ మహామునీశ్వరుడు పద్మ ప్రోద్భవున్ మూఢతా
కార్కశ్యం బెడలింపగోరి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్" (3-67)

ఈ పద్యంలో మార్కండేయముని విష్ణుమాయను చులకన చేసిన బ్రహ్మ మూర్ఖత్వాన్ని, కర్కశాన్ని తొలగింప జేయడానికి హితబోధ చేయబోతున్నాడు. సృష్టికర్త అయిన బ్రహ్మకే హితబోధ చేయాలంటే మార్కండేయముని కూడా అంతటి ప్రభావం కలిగిన వాడై ఉండాలి. మార్కండేయమునిని ఉద్దేశించి ఇక్కడ ప్రయోగించిన విశేషణాలు. అర్కోదగ్రరుచి ప్రకాశుడు, ప్రభవాఢ్యుడు, వేదార్థ సంపర్క ప్రస్ఫుట సత్యవాక్యుడు, మహాప్రామాణిక శ్రేష్ఠుడు మొదలైనవన్నీ అతడు బ్రహ్మతో సమానమైన ప్రభావం కలవాడని తెలుపుతున్నాయి. ఇక్కడ విశేషణాలు అన్నీ సాభిప్రాయమవుతున్నందు వలన ఇది పరికరాలంకారం అని చెప్పవచ్చు.

ఇదేవిధంగా,

"దివ్యమైతగు గౌతమీ తీరభూమి, భోగమోక్షంబులకు జన్మభూమి" (3-192)
అనే పద్యంలో కూడా పరికరాలంకారం కనిపిస్తున్నది.

అర్థాపత్యలంకారం

తృతీయాశ్వాసంలో మార్కండేయముని పుండరీకుడిని గురించి వర్ణించే సందర్భంలో అర్థాపత్యలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"జలజాతోద్భవ పుండరీకుడు విశేషజ్ఞానియై యుండియుం
బలుపాట్లంబడె విష్ణుమాయనికఁ జెప్పన్వేడి నిర్వ్యాజని
శ్చలిత బ్రహ్మవిదుండొకండు నిలువన్ శక్తుండె తన్మాయకున్
వెలయం దత్కరుణాశ్రితుండు వెలిగా విశ్వంభరామండలిన్" (3-239)

ఈ పద్యంలో మార్కండేయముని బ్రహ్మతో, పరమ భాగవతుడు, విశేషజ్ఞాని అయికూడా పుండరీకుడు విష్ణుమాయకు భ్రమించి పడరాని పాట్లుపడ్డాడు. ఇక నిర్వ్యాజనిశ్చలితుడై బ్రహ్మజ్ఞాని అయిన ఎవరైనాగాని విష్ణుమాయకు భ్రమించకుండా ఉండగలరా అని అన్నాడు. ఇక్కడ విష్ణుమాయకు విశేషజ్ఞాని, పరమ భక్తుడైన పుండరీకుడే భ్రమించినప్పుడు, ఇక అన్యులు భ్రమించకుండా ఉండగలరా! అనే భావన స్ఫురిస్తున్నది. అందుచేత ఇది అర్థాపత్యలంకారం అని చెప్పవచ్చు.

ఇదేవిధంగా, "జలరాశి మగ్న వసుధా
తలమెత్తిన క్రోడమూర్తి తాగావున..." (1-72)
"త్రైలోక్య వినుత సాధ్వికి
శ్రీలక్ష్మికి నీయవస్థ సిద్ధించెబతిన్..." (2-169)
"అమృతం బేటికిఁ బ్రాణమేమిటికి రాజ్యం బేలయన్యాఖిలా" (4-38)
మొదలైన పద్యాలలో అర్థాపత్యలంకారం కనిపిస్తున్నది.

విషమాలంకారం

ద్వితీయాశ్వాసంలోని మాయాలక్ష్మి వర్ణనలో ప్రయోగించిన విషమాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఈలలనా శిరోమణికి నీశుభమూర్తికి నీలతాంగికి
య్యాలరిదైవమేమిటికి నచ్చెరువైన తపోగ్నికీలలం
దూలగఁ జేసెఁ జేసియును దూకొనిదీని తపంబు పేర్మికిం
బాలన వృత్తి నీవలదె పొల్పడం గ్రమ్మర వాంఛితార్థముల్" (2-87)

ఈ పద్యంలో మాయాలక్ష్మి వర్ణనలోని లలనాశిరోమణి, శుభమూర్తి, లతాంగి అనే విశేషణాలు ఆమెను సుకుమారమైన స్త్రీమూర్తిగా ప్రకటిస్తున్నాయి. అటువంటి మాయాలక్ష్మిని దైవం తపోగ్నికీలలో పడేటట్లుగా చేశాడని ఇందులోని భావం.

ఇక్కడ మాయాలక్ష్మిని కోమలమైన స్త్రీమూర్తిగా చెబుతూ, ఆమె కోమలత్వానికంటే వ్యతిరేకమైన తపోగ్నికీలలు ప్రాప్తించాయని వర్ణించడం వలన ఇది విషమాలంకారం అవుతున్నది.

సారాలంకారం

చతుర్థాశ్వాసంలోని మోహినీకాంత వర్ణనలో సారాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"వేయి మన్మథుల పూవింటి కోలలబారు
వరుసను దృక్పరం పరలు నిగుడ
లక్ష పద్మంబుల యుల్లాసంబు పొదిగొన్న
కరణినెమ్మోము వికాస మడరఁ
గోటి చంద్ర ద్యుతుల్ కొనసాగుచున్న రూ
పంబునఁ దనుదీప్తి ప్రజ్వరిల్ల
శతకోటి రతి వధూ సౌభాగ్యమెసలారు
పగిది లావణ్య సంపద దనర్ప..." (4-204)

ఈ పద్యంలో మోహినీకాంత చూపులు మన్మధుని వేయి పూలబాణాలుగా, ఆమెముఖం లక్షపద్మాలు వికసించినట్లుగా, శరీరకాంతి కోటి చంద్రకాంతులు వెలిగినట్లుగా, మోహిని లావణ్య సంపద రతీదేవి శతకోటి రూపాలకు సాటిగా వర్ణించబడింది. ఇక్కడ మోహినీకాంత సౌందర్య వర్ణనకు ఉత్తరోత్తర ఉత్కర్షను కలిగించుట చేత ఇది సారాలంకారం అవుతున్నది.

అధికాలంకారం

ప్రథమాశ్వాసంలోని శ్రీకృష్ణుని గుణగణాలను వర్ణించే పద్యంలో అధికాలంకారం క్రింది విధంగా ఉంది.

"అమరేంద్రర్షులచేత మ్రొక్కుగొను నయ్యంభోజ పత్రాక్షుడ
య్యమరేంద్రర్షులు చూడ నెమ్మిప్రణతుండై కంటికిన్ రెప్పచం
దమునన్ నీకు సహాయుడై తిరుగుచున్నాడట్టి నీవంటియు
త్తము డాదివ్యుల యందునైన గలడే ధాత్రీశులింకేటికిన్" (1-66)

ఈ పద్యంలో దేవతలు, ఇంద్రులు, మహర్షుల చేత మ్రొక్కులందుకొంటున్న శ్రీకృష్ణుడు వారందరూ చూస్తుండగా, ప్రణతుడై ధర్మరాజుకు సహాయకుడుగా తిరుగుతున్నాడు. కాబట్టి ధర్మరాజు వంటి ఉత్తముడు దేవతలలో కూడా లేడనిభావం. ఇక్కడ ఉపమానాలైన దేవతులు, ఇంద్రుడు, మహర్షుల కంటే ఉపమేయమైన ధర్మరాజుకు ఆధిక్యం చెప్పబడింది. అందుచేత ఇది అధికాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "ఉదయింపడే సూర్యుడు దయాద్రి నుదయాద్రి..." (3-61) అనే పద్యంలో కూడా అధికాలంకారం కనిపిస్తున్నది.

విశేషోక్త్యలంకారం

తృతీయాశ్వాసంలో పుండరీకుడికి విష్ణు మహిమను తెలుపుతున్న నారదుడి మాటలలో విశేషోక్తి అలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"ప్రతిదివసోపవాసములఁ బాయక కృస్సియుసత్యదానస
ద్వ్రతములఁ బెద్దలయ్యును దురంత తపోనలకీలఁ గ్రాగియున్
గ్రతునియ మార్తి మ్రాగియును గానరు వైష్ణవదివ్యలోకమ
చ్యుత పదపంకజార్చకుల చొప్పున విప్రకులైక భూషణా" (3-108)

వైకుంఠప్రాప్తిని కోరి ప్రతిరోజూ ఉపవాసదీక్షతో కృశించినా, సత్యం, దానం వంటి వ్రతాలతో పుణ్యం సంపాదించినా, తపోగ్ని కీలల్లో కాగినా, క్రతువు నియమంతో చేసినా వైష్ణవుల లాగ అన్యులు మోక్షాన్ని పొందలేరని పద్యంలోని భావం. ఇక్కడ మోక్ష సాధనకు పాటించదగిన ఉపవాసం, సత్యనిష్ఠ, దాన తత్పరత, వ్రతదీక్ష, తపస్సు, క్రతునిర్వహణ మొదలైనవి జరిగాయనడానికి ప్రస్ఫుటమైన కారణాలు కనిపిస్తున్నప్పటికీ, మోక్షం లభించడమనే కార్యం జరగలేదని చెప్పడం వలన ఇది విశేషోక్తి అలంకారం అవుతున్నది.

కావ్యలింగం

తృతీయాశ్వాసంలో బ్రహ్మ తన మహిమను పొగుడుకొనే సందర్భంలో కావ్యలింగాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"నాకంటె నధికుడొక్కడు
లోకంబుల లేడు దివిజ లోకములోనన్
నాకల్పించిన యవియు
ల్లోకంబులు నధికుడిందులోనం గలడే" (3-45)

ఈ పద్యంలో బ్రహ్మ తన ఘనతను పొగడుకొంటూ, భూలోకంలోగాని, దేవలోకాలలో గాని అతనికంటే అధికుడు ఎవరూ లేరని పలికాడు. దానిని సమర్థించుకోడానికి లోకాలు అన్నింటినీ కల్పించింది బ్రహ్మ కాబట్టి అతనికంటే అధికుడు ఆ లోకాలలో ఉండడని అతడి భావన. ఇక్కడ బ్రహ్మ తనకు తాను అధికుడినని ప్రకటించుకొని, దాన్ని సమర్థించేందుకు పద్నాలుగులోకాలు అతనిచేతనే కల్పంచబడినాయనే కారణాన్ని తెలిపాడు. అందుచేత ఇది కావ్యలింగాలంకారం అవుతున్నది.

ప్రతీపాలంకారం

ప్రథమాశ్వాసంలో ధర్మరాజు సభను వర్ణించే సందర్భంలో ప్రతీపాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"దేవగంధర్వ యక్షదైతేయ రాజ
సభలు చూచితినవియునీ సభకుసాటి

గావు సుర రాజుసభ యేమొ కానికొంత
ధార్మికశ్రేష్ఠ సంపూర్ణ ధర్మతనయ"(1-121)

ఈ పద్యంలో దేవ, గంధర్వ, యక్ష, రాక్షసరాజ సభలు ధర్మరాజు సభకు సాటిరావు అని వర్ణించబడింది. ఇక్కడ ఉపమానాలైన దేవ, గంధర్వ, యక్ష, రాక్షసరాజ సభలను ఉపమేయమైన ధర్మరాజు సభకు సాటిరావని వర్ణించడం చేత ఇది ప్రతీపాలంకారం అవుతున్నది.

కారణమాలాలంకారం

తృతీయా శ్వాసంలోని సత్యలోక వర్ణనలో కారణమాలాలంకారం క్రింది విధంగా కనిపిస్తుంది.

"బ్రహ్మపోయినఁదోడి బ్రహ్మలు వోయిరి
సృష్టిక్రియా లీలఁ జిక్కుపఱచి
వేదశాస్త్రాధిక విద్యలెల్లను మ్రింగి
యాసరస్వతి యత్తనాశ్రయించె
బ్రహ్మరథంబు నిర్వ్యాపారమైన నం
చలు విచ్చి మానస సరసికరిగె
బ్రహ్మ తేజ స్ఫూర్తి బాసినసత్యలో
కంబు పెంచీకటిఁ గవసి యుండె
పద్మ సింహాసనాగ్రంబు పాడువారె ....." (3-249)

ఈ పద్యంలో బ్రహ్మ సత్యలోకాన్ని విడిచి వెళ్ళగానే ఉపబ్రహ్మలు సృష్టినిర్మాణాన్ని చిక్కుపరిచి వెళ్ళారు. సరస్వతి వేద విద్యలన్నింటినీ ఉపసంహరించి వైకుంఠానికి వెళ్ళి లక్ష్మిని ఆశ్రయించింది. బ్రహ్మ రథం కదలక హంసలు మానస సరోవరానికి వెళ్ళిపోయాయి. బ్రహ్మ తేజస్సు లేక సత్యలోకం పెను చీకట్లతో నిండిపోయింది. పద్మ సింహాసనం పాడుపడిందని వర్ణించాడు. ఇక్కడ పద్మ సింహాసనం పాడుపడడానికి, సత్యలోకం అంధకారంలో మునిగిపోవడానికి బ్రహ్మ లేక పోవడమే కారణం. కాబట్టి ఉత్తరోత్తర కారణాన్ని పూర్వ పూర్వ వస్తువులచేత చెప్పడం వలన ఇది కారణమాల అలంకారం అవుతున్నది.

అనుమానాలంకారం

పంచమాశ్వాసంలోని మాయాముని వర్ణనలో అనుమానాలంకారం ఈ క్రింది విధంగా ప్రయుక్తమైంది.

"లలిత పద్మాక్ష మాలికాలం కృతుండు
గోపి చందన తిలక ప్రదీపితుండు
నగుచునమ్ముని విష్ణుమూర్త్యాత్మకంబు
కరణినున్నాడు సాత్వికాకార మహిమ" (5-59)

ఈ పద్యంలో నారదుడు లలిత పద్మాక్షమాలికతో అలంకరించబడినవాడు, గోపిచందన తిలకంతో ప్రకాశించేవాడు అయిన మాయాముని సాత్వికాకార మహిమతో విష్ణుమూర్తి లాగ ఉన్నాడని భావించాడు. ఇక్కడ మాయాముని ధరించిన పద్మాక్ష మాలిక, గోపిచందన తిలకం అనే అలంకారాలు సాధనాలుగా నారదుడు అతడిని విష్ణువుగా అనుమానించడం వలన ఇది అనుమానాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "అభినవలీలా సితాం భోరుహంబని

కమనీయ ధవళ శంఖంబనియును" (4-20)

అనే పద్యంలో కూడా అనుమానాలంకారం కనిపిస్తున్నది.

విభావనాలంకారం

చతుర్థాశ్వాసంలో శివుడి వర్ణనలో విభావనాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఆతటి నిలువక గ్రక్కున
చేతోభవకేళిలేక శివునకుఁ బెలుచన్
రేతఃపూరము గంగా
స్రోతో రూపమునఁ దొరగెఁ జోద్యంబడరన్" (4.290)

ఈ పద్యంలో శివుడు మాయామోహినిని కౌగిలించుకోవాలని పయ్యెదపట్టి లాగగానే, రతికేళి లేకుండానే శివుడికి శుక్లపతనమై గంగాప్రవాహం లాగ పారిందని వర్ణించబడింది. ఇక్కడ శివుడికి రతికేళి అనే కార్యం జరగకుండానే శుక్లపతనం కలిగిందనే కారణాన్ని వర్ణించడం వలన ఇది విభావనాలంకారం అవుతున్నది.

వ్యాజనిందాలంకారం

చతుర్థాశ్వాసంలో ప్రమథులు నారదుడిని నిందించే సందర్భంలో వ్యాజనిందాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"మాయల ముంచునిన్నయిన మచ్చరికించిన విష్ణుడంచు నుం
బాయక రుద్రునిం బలికెఁ బల్కిన యప్పుడె పండ్లుడుల్లగా
వ్రేయుదు మీ వెడంగు ముని వేగిరమేలని భర్త మాన్పగాఁ
బోయెను గాక యీ పనులు బోయిన పిమ్మటఁ జెప్పనేటికిన్" (4-164)

ఈ పద్యంలో ప్రమథులు నారదుడిని విష్ణువు కొలువులో నిందించడం వర్ణించబడింది. నారదుడు కైలాసంలో విష్ణువు తన మాయతో శివుడిని కూడా భ్రమపెట్టునని చులకనగా పలికినప్పుడే పండ్లురాలునట్లుగా వేయవలసిందని ప్రమథులు నిందించారు. ఇక్కడ ప్రమథులు నారదుడిని నిందచేత నింద చేయడం వలన ఇది వ్యాజనిందాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "స్వామి భృత్యన్యాయ సరణి నాక్షేపించు...." (2-17)

"జూదరికాని చందములు చూపితివన్నియు..." (2-25)

"ఈమునులీమరుద్గణము లీదనుజుల్ వినియూర..." (3-64)

"అరయలోకనాథుడు సురాసుర పూజ్యుడు కర్త..." (3-65)

"కూపమండూకమును బోలెఁ గొంచమైన..." (4-163)

మొదలైన పద్యాలలో వ్యాజనిందాలంకారం కనిపిస్తున్నది.

చింతలపూడి ఎల్లనార్యుడు రచించిన 'విష్ణుమాయానాటకం'లో శబ్ద, అర్థాలంకార ప్రయోగానికి పైన పేర్కొన్న పద్యాలు నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి. కవి ప్రయోగించిన ఈ అలంకారాలు అన్నీ కూడా కథాసందర్భాన్ని పురస్కరించుకొని రచించినవేనని పై పద్యాలలోని భావం తెలియజేస్తున్నది. ఈ విధంగా ఎల్లనార్యుని ఆలంకారిక ప్రయోగం 'విష్ణుమాయానాటకం'లో ప్రయుక్తమైన తీరును గురించి చెప్పుకోవచ్చు.

5.4.2. కంకంటిపాపరాజు-ఆలంకారిక ప్రయోగం

విష్ణుమాయా విలాస యక్షగానంలో పాపరాజు ప్రయోగించిన అలంకారాలు శబ్ద, అర్థభేదాలతో క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

5.4.2.1. శబ్దాలంకారాలు

కంకంటి పాపరాజు యక్షగానంలో ఆదిప్రాస, అంత్యప్రాస, వృత్యనుప్రాస, ఛేకానుప్రాస, ముక్తపదగ్రస్తం అనే శబ్దాలంకారాలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

ఆదిప్రాస

కంకంటి పాపరాజు తన కావ్యారంభంలో చేసిన దైవస్తుతిలో ఆదిప్రాస అలంకారం క్రింది విధంగా ఉంది.

"దరము చూపెడుకేలు కాకో, దరము నేపెడు డాలు భక్తుల
దరముఁ బాపెడు వాలుఁ బూనిన, హరిఁ దలంతున్" (పుట. 1)

పై పద్యంలో విష్ణువును స్తుతిస్తూ కవిప్రయోగించిన 'దరము'అనే హల్లులు పద్యపాదానికి ఆదిలో పునరుక్తం కావడం వలన ఇది ఆదిప్రాస అలంకారంగా కనిపిస్తున్నది.

ఇదే విధంగా, "తటినిముంచిన శిరము శ్రీకుచ
తటిని డించినకరము జగమిం
తటిని మించిన భరముగల ధూ
ర్జటిని గొలుతున్" (పుట. 1)

"శ్రుతుల వెలసిన పేరు నలుగవ
శ్రుతుల సొలసిన తీరు జపని...."(పుట. 2)

"భవము సఫలముగ వై
భవము లొసగుము పరా..." (పుట. 2)

మొదలైన పద్యాలు ఆదిప్రాస అలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

వృత్త్యనుప్రాస

శివుడి ప్రభావాన్ని వర్ణించే సందర్భంలో వృత్త్యనుప్రాస అలంకారం ఈ విధంగా ప్రయుక్తమై కనిపిస్తున్నది.

"కనువెంట జనుమంట ననవింట మనుదంట
తనువంట గను బంటు తనము గనిపించెన్" (పుట. 8)

పైపద్యంలో బిందుపూర్వ కటకారం 'ంట' పలుమార్లు ఆవృతమై, శబ్ద చమత్కారాన్ని ప్రకటిస్తున్నది. కాబట్టి ఇది వృత్యానుప్రాస అలంకారమని తెలుస్తుంది.

ఇదేవిధంగా "జగకందు జిగి చిందు తొగవిందు సిగఁ బొందు..." (పుట. 8)
అనే పద్యంలో బిందుపూర్వక దకారం 'ందు' ఆవృత్తమైంది.

"బలుచండి పులిదండి పొలదండి తలఁ జెండి..." (పుట. 8)
అనేపద్యంలో బిందు పూర్వక డకారం 'ండి' ఆవృత్తమై వృత్యానుప్రాస అలంకారంగా కనిపిస్తున్నది.

అంత్యానుప్రాస

మాయామోహిని వర్ణనలో అంత్యానుప్రాస అలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"కమ్మ జిగి చెక్కుల నటింపంగ
నెమ్మొగమునఁ గళలు మించఁగ
చిమ్మ చీకటి కొప్పునించఁగ
కమ్మ వాసన దిశలు ముంచఁగ
కలికి చూపుల వలపు దొలకఁగ
కచ భరంబునఁ గౌను బెళుకఁగ....." (పుట. 17)

పై పద్యంలో ప్రతి పాదంచివర 'గ'కారం ఆవృత్తమైనందు వలన ఇది అంత్యానుప్రాస అలంకారమని చెప్పవచ్చు.

ఛేకానుప్రాస

శివుడి విరహాన్ని వర్ణించే సందర్భంలో ఛేకానుప్రాస అలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"తనరుచుఁ జెలివిరి దండలు గొని మూ
ర్కొను మూర్కొని తమిఁ గనుఁగవఁ జేర్చున్" (పుట. 49)

పై పద్యంలో 'మూర్కొను – మూర్కొని' అనే హల్లుల జంటలు వ్యవధానం లేకుండా ప్రయుక్తమైనాయి. కాబట్టి ఇది ఛేకానుప్రాస అలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "పణతుక లత్తుక – ఫాలతటంబున
నిడుకొను నిడుకొని – యెంతయునలరున్" (పుట. 49)
"చెలిగంధముపైఁ గలయనించుకొనుఁ

గలయనించుకొని నలుగడలరయున్" (పుట. 49)

అనే పద్యాలలో కూడా ఛేకానుప్రాస అలంకారం కనిపిస్తున్నది.

ముక్తపదగ్రస్తం

శివుడు మాయామోహిని సౌందర్యాన్ని మెచ్చుకొనే సందర్భంలో ముక్తపదగ్రస్త అలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"కొప్పు గాదిది గండు తుమ్మెద కప్పుగాని తుమ్మెద
కప్పు గాదిది చిమ్మ చీకటి యొప్పుగాని.
మోము గాదిది నవ్వు వెన్నెల గీముగాని వెన్నెల
గీము గాదిది మంచి తామర గోముగాని
చెక్కు గాదిది కమ్మ బంగరు నక్కుగాని బంగరు
నక్కు గాదిది మించు టద్దపు టెక్కుగాని."(పుట. 35)

పై పద్యంలో 'తుమ్మెదకప్పు', 'వెన్నెలగీము', 'బంగరునక్కు' అనే పదాలు మొదటి పాదంలో ప్రయోగించి. తిరిగి ఆ పదాలనే గ్రహించి తరువాత పాదాన్ని ప్రారంభించడం వలన ఇది ముక్తపదగ్రస్తం అవుతున్నది.

కంకంటి పాపరాజు తన కావ్యంలో ప్రయోగించిన శబ్దాలంకార వైచిత్రిని గురించి పై విధంగా చెప్పుకోవచ్చు.

5. 4. 2. 2. అర్థాలంకారాలు

కంకంటి పాపరాజు తనకావ్యంలో ప్రయోగించిన అర్థాలంకారాలు ఈ విధంగా కనిపిస్తున్నాయి.

ఉపమాలంకారం

కైలాస పర్వతాన్ని వర్ణించే సందర్భంలో ఉపమాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"శిరమునను సిందూర రుచిదగఁ, జెలుగు వేలుపు మస్తుటేనుగు
కరణినగ్గిరి తుదల గైరిక కాంతి వెలయున్" (పుట. 7)

ఈ పద్యంలో కైలాస పర్వతాన్ని వర్ణిస్తూ, తెల్లని మంచుతో నిండిన ఆ పర్వతం శిఖరభాగంలోని గైరిక ధాతువుల కాంతి, ఐరావతం శిరస్సు మీద సిందూరాన్ని ధరించినట్లుగా ప్రకాశిస్తుందని కవి ఉపమించాడు. ఇక్కడ కైలాస పర్వతం మీద గైరిక ధాతువుల కాంతికి, ఐరావతం తలమీది సిందూరానికి పోలిక చెప్పడం వలన ఇది ఉపమాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా,

"వెండియును బైడియును దడఁబడు..." (పుట. 7)

అనే పద్యంలో కూడా ఉపమాలంకారం వర్ణించబడింది.

రూపకం

కైలాసంలో కొలుపు దీరి ఉన్న శివుడిని వర్ణించే సందర్భంలో రూపకాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"గరళనీలిమఁ జెందు కంఠంబు తోడఁ
బరిపూర్ణ హరిణాంకు ప్రతివచ్చువాని..." (పుట. 13)

పై పద్యంలో శివుడు కంఠంలో గరళపు నీలిమ కాంతితో నిండు చంద్రుడితో సమానంగా ఉన్నాడని వర్ణించబడింది. ఇక్కడ శివుడు ధవళదేహంతో కంఠంలో గరళం వలన కలిగిన నీలవర్ణంతో పూర్ణ చంద్రుడు లాగ ఉన్నాడని చెప్పడం వలన శివుడి కంఠంలోని నీలవర్ణానికి, చంద్రుడిలోని కళంకానికీ తాద్రూప్యం కనిపిస్తున్నది. అందువలన ఇది తాద్రూప్య రూపకాలంకారం అవుతున్నది.

ఉత్ప్రేక్షాలంకారం

కైలాసపర్వతాన్ని వర్ణించే సందర్భంలో ఉత్ప్రేక్షాలంకారం ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"బహుళపక్షమునందుఁబాయుచంద్రునికళలు
మహినజుఁడు ప్రోగిడిన మాడ్కిదగెనగము" (పుట. 11)

ఈ పద్యంలో కైలాసపర్వతం బహుళపక్షంలో చంద్రుడి నుంచి విడివడిన కళలను భూమిపై బ్రహ్మదేవుడు ప్రోగు చేసిన విధంగా ఉన్నదని ఊహించుట చేత ఇది ఉత్ప్రేక్షాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "ఒప్పునెవ్వని వింటికొప్పు ఋక్షశ్రేణి..." (పుట. 8)

"హరియిల్లపుటల్లు డాయెననియుప్పొంగు..." (పుట. 24)

"నలువొంద మెట్టకెందమ్మివలె వైకుంఠ..." (పుట. 24)

"జవరాలి విరిసరులు – శమనారిచే నమరె..." (పుట. 49)

"చెలిగంధమభవుమై – నలరె మరుతూపులకు..." (పుట. 50)

మొదలైన పద్యాలలో ఉత్ప్రేక్షాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

స్వభావోక్త్యలంకారం

నారదుడి మాటలు విని కోపించిన ప్రమథుల హావ భావాలను వర్ణించే సందర్భంలో స్వభావోక్త్యలంకారం క్రింది విధంగా కనిస్తున్నది.

"కినుక రదనములు కిటగిట గీటువారు
మొగ మెఱ్ఱవార బొమ ముడివెట్టువారు
శివుని నిందింపవచ్చితె యనెడివారు
ఎటుల నీశ్వరు మహిమ లెఱుగుననువారు
ఇచట నితని ప్రతిష్టలేమి యనువారు" (పుట. 22)

ఇక్కడ నారదుడు శివుడి మహిమను చులకన చేయడాన్ని సహించ లేక ప్రమథులు పొందిన కోపావేశాన్ని, వారి హావ భావప్రదర్శననూ వర్ణించడం కనిపిస్తున్నది. ప్రమథుల కోప స్వభావ వర్ణన చేసినందు వలన ఇది స్వభావోక్త్యలంకారం అవుతున్నది.

దీపకాలంకారం

విష్ణుమాయా విలాస కథల మహిమను గురించి చెప్పే సందర్భంలో దీపకాలంకార ప్రయోగం ఈ విధంగా కనిపిస్తున్నది.

"వెలయును వేడుక లొలయును సుకృతము
పొలియును బాతకములు హరికథలన్" (పుట.6)

ఈ పద్యంలో హరికథాశ్రవణం వలన వేడుకలు, సుకృతములు కలుగుతాయని, పాతకములు నశిస్తాయనీ వర్ణించబడింది. ఇక్కడ ఉపమేయమైన హరికథాశ్రవణానికి, ఉపమానాలైన వేడుకలు, సుకృతములు, పాతకములు అనే వాటికి సామాన్య ధర్మంచేత ఏకాన్వయం చెప్పడం వలన ఇది దీపకాలంకారం అవుతున్నది.

పర్యాయాలంకారం

కైలాసంలో శివుడి విహారాన్ని వర్ణిస్తున్న సందర్భంలో పర్యాయాలంకార ప్రయోగం ఈ విధంగా ఉన్నది.

"అలకరాజు వనినొకపుడు గిరిజఁ గలిసి మెలసి యలసి
సొలసి కొలకు గొలకు కలువ చెలువ చలువ లలవరించు
భద్రవటము నీడ వీరభద్ర ముఖ్యులద్రి జాది
భద్రగతులఁ గొలువ వెలయు భద్రగతులనొక్కవేళ
నింగిమెఱయుఁ దారశైల శృంగ సౌధరంగమందు
భృంగి లాస్యభంగి నయమెఱింగి యొక్కయెడఁ జెలంగు" (పుట.9)

ఈ పద్యంలో శివుడు పార్వతీదేవితో కలిసి వనవిహారం చేయడం, భద్రవటం నీడలో కొలువుదీరడం, కైలాసపర్వత శిఖర సౌధం మీదగల నాట్యరంగం మీద లాస్యాన్ని చేయడం అనేవి వర్ణించబడ్డాయి. ఇక్కడ శివుడికి మొదట ఉద్యానవనాన్ని ఆశ్రయంగా వర్ణించి, తర్వాత భద్రవటాన్ని, నాట్యరంగాన్ని ఆశ్రయాలుగా మొదటిదానికి పర్యాయంగా వర్ణించుట చేత ఇది పర్యాయాలంకారం అవుతున్నది.

శ్లేషాలంకారం

నారదుడు జగన్మోహిని సౌందర్యాన్ని వర్ణించే సందర్భంలో శ్లేషాలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"కలికి పయ్యెదలోని కుచమును
వెలిగనంబడు గుబ్బఁ జూచిన
<u>తలప విల్లును</u> <u>మొదటి విల్లును</u> ధవళదేహా

జంటగా నూగారు సకివిరి
సరుల కీల్జడగనినఁ గైకొన
వింటినారిని వింటి నారిని వృషభవాహో" (పుట. 21)

ఈ పద్యంలో శివుడు మోహిని పయ్యెదలోని కుచమును చూస్తే కైలాసాన్ని (తలపవు ఇల్లు = తలపవిల్లు; శివుడి నివాసం కైలాసం), పైకి కనిపించే వక్షస్థలాన్ని చూస్తే మేరుపర్వతాన్ని (మొదటివిల్లు = మేరుపర్వతం) మరిచిపోతాడని భావం. శివుడు మోహిని నూగారును, విరిసరుల కీల్జడను జంటగా చూస్తే పార్వతీదేవిని (కైకొనవు ఇంటినారి = కైకొనవింటినారి; శివుడి ఇంటినారి పార్వతీదేవి), ఇంటినారిని విడిచివేస్తాడని భావం. ఇక్కడ తలపవు ఇల్లును, అని విడదీయటం వలన కైలాసం అని, మొదటి విల్లు మేరు పర్వతం అని, కైకొనవు ఇంటినారి అని విడదీయటం వలన పార్వతీదేవి అని, వింటి నారిని అనే అర్థాలు శ్లేష వలన కలుగుతున్నాయి. అందువలన ఇది శ్లేషాలంకారం.

సందేహాలంకారం

మాయామోహిని సౌందర్య విలాసాన్ని చూసి రాక్షసులకు కలిగిన సందేహం అలంకారంగా ఈ విధంగా కనిపిస్తున్నది.

"వెలది తేనియలొలుకఁ బలుకఁ దానేర్చెబో
పలుకులకు నెటుల కప్రపుఁ దావి గలిగెన్
మగువ వెన్నెలలు జిలుకఁగ నవ్వనేర్చెబో
నగవులకు మురిపెంపు వగలెట్లు గలిగెన్
పటువు గుబ్బెత యంచవలె నడవ నేర్చెబో
నటన గల నడకు కులుకెటులఁ గనిపించెన్" (పుట. 17)

పై పద్యంలో రాక్షసులు మోహిని సౌందర్యాన్ని చూసి, మోహిని మాటల్లో తేనెలాంటి మాధుర్యం ఉంది. కాని ఆ పలుకులకు కర్పూరపు సువాసన ఎలాకలిగింది. ఆమెనవ్వితే వెన్నెల కురిసినట్లుగా ఉంది కాని నవ్వుకు వగలు ఏవిధంగా కలిగాయి. మోహిని హంసలాగ నడిచింది. కాని ఆ నడకలలోకులకు ఎలా కనిపించిందని సందేహించారు. ఇక్కడ మోహిని సౌందర్యాన్ని పోల్చుడానికి రాక్షసులకు సందేహం కలిగినందు వలన ఇది సందేహాలంకారం అవుతున్నది.

భ్రాంతిమదలంకారం

శివుడితో పాటు వైకుంఠపురంలోనికి ప్రవేశించిన నందికి కలిగిన భ్రాంతి ఈ క్రింది విధంగా వర్ణించబడింది.

"చక చకలు గులుకు పచ్చలగతిని జూచి ప
చ్చిక యనుచు గిబ్బితేజీ చౌకళింపన్" (పుట. 25)

ఇక్కడ శివపార్వతులను వీపున వహించి వైకుంఠపురంలోకి ప్రవేశించిన నంది పచ్చరాళ్ళతో ఉన్న మార్గాన వెళుతూ, ఆ పచ్చరాళ్ళ కాంతికి భ్రమించి దానిని పచ్చికగా భావించి నోటితో అందుకో బోయినట్లుగా వర్ణించబడింది. పచ్చరాళ్ళు పరిచిన నేలను, చూసి నంది పచ్చగడ్డిగా భ్రమించి, అందుకోవడానికి ప్రయత్నించడం దానికి కలిగిన భ్రాంతిని తెలుపుతున్నది. అందువలన ఇది భ్రాంతిమదలంకారం అవుతున్నది.

అర్థాపత్యలంకారం

విష్ణుమాయా ప్రభావాన్ని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు వివరించే సందర్భంలో అర్థాపత్యలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"మగతనంబున నుండి జగముల
మరులు గొల్పెడు వన్నె కానికి
మగువ తనమున భ్రమలు పెట్టుట
మఱియు నరుదా?" (పుట. 6)

పురుషరూపంతోనే లోకాలకు మోహాన్ని కలిగించే శ్రీమహావిష్ణువు మోహినీ రూపంతో జనులను మోసపుచ్చడంలో ఆశ్చర్యమేముందని ఈ పద్యానికి భావం. ఇక్కడ మహావిష్ణువు పురుషమోహన రూపానికే లోకాలు మోహపారశ్యాన్ని పొందుతున్నట్లుగా వర్ణించబడింది. మరి అటువంటి విష్ణువే స్త్రీరూపాన్ని ధరించి లోకాలను భ్రమపెట్టడంలో వింత ఏముందని చెబుతూ, ఒక ఉత్కృష్టవస్తువే సాధించబడుతున్నప్పుడు అల్పవస్తువు సాధించబడటంలో వింతలేదని చెప్పడం వలన ఇది అర్థాపత్యలంకారం అవుతున్నది.

కావ్యలింగం

మాయామోహినిని చూడగానే రాక్షసులకు కలిగిన మోహాన్ని వర్ణించే సందర్భంలో కావ్యలింగాలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"బలిముఖాసురుల మృతరసమున బలియునాసలమానిరి
లలనతో రతిమీద తమిఁ గైలాసవాస" (పుట. 16)

ఈ పద్యంలో అమృతం కోసం క్షీరసముద్రాన్ని మథించి, దేవతల చేతినుంచి అమృత భాండాన్ని అపహరించిన బలి చక్రవర్తి మొదలైన రాక్షస వీరులు అమృతాన్ని తాగాలనే కోరికలను విడిచిపెట్టారు. మాయామోహినితో రతి సౌఖ్యాన్ని పొందాలనే తమకంతో రాక్షసులకు అమృతపానం మీద ఆశ నశించిందని భావం. ఇక్కడ బలిచక్రవర్తి మొదలైన రాక్షస వీరులు వారి చేతిలో అమృతభాండం ఉన్నప్పటికీ అమృతం తాగాలనే ఆశను విడిచిపెట్టారని చెప్పి, మోహినితో రతి మీద రాక్షసులకు కలిగిన తమకమే దానికి కారణమని సమర్థించడం వలన ఇది కావ్యలింగాలంకారం అవుతున్నది. ఈ విధంగా కంకంటి పాపరాజు తన విష్ణుమాయా విలాస యక్షగానంలో ప్రయోగించిన శబ్దార్థ సహితమైన అలంకారాలను గురించి చెప్పుకోవచ్చు.

5.4.3. కంకంటి నారసింహకవి–ఆలంకారిక ప్రయోగం

నారసింహకవి తన కావ్యంలో ప్రయోగించిన అలంకారాలు శబ్ద, అర్థప్రధానంగా ఈ విధంగా ఉన్నాయి.

5.4.3.1. శబ్దాలంకారాలు

విష్ణుమాయా విలాస ద్విపద కావ్యంలోని శబ్దాలంకార ప్రయోగాలకు నిదర్శనాలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

వృత్త్యనుప్రాసాలంకారం

మాయాలక్ష్మి పుష్పక విమానం ఎక్కి వైకుంఠానికి వెళ్ళే సందర్భంలోని ఈ క్రింది వర్ణనలో వృత్యానుప్రాసాలంకారం కనిపిస్తున్నది.

"పల్లవ వల్లరీ ఫలదళ స్ఫురిత
మల్లిమతల్లికావళిఁ జూడనొప్పె
నాచరోరాక్షి భాగ్యపు వైభవంబు..." (పుట. 51)

ఇక్కడ మాయాలక్ష్మి వర్ణనలోని ద్విత్వలకార 'ల్ల' ఆవృత్తి వృత్త్యనుప్రాసాలంకారంగా కనిపిస్తున్నది.

ఛేకానుప్రాసాలంకారం

మహాలక్ష్మి దేవకాంతలతో కలిసి క్షీరసముద్ర తీరంలోని వనంలో విహరిస్తున్న సందర్భంలో ఛేకానుప్రాసాలంకార వర్ణన క్రింది విధంగా ఉన్నది.

"బూగీఫల శ్రేణి పొలుపువర్ణించి
నాగ వల్లికల దండల నుండి యుండి
గురువింద పందిళ్ళ కొమరు వర్ణించి
విరిమల్లె పొదల తావికిఁ జొక్కి చొక్కి
సలలితద్రాక్షా రసములు వర్ణించి
యలరు గొజ్జగి తేనియలు గ్రోలిగ్రోలి
సహకార చారుమంజరులు వర్ణించి
మహిత తుంగ రజంబుమైఁ బూసి పూసి" (పుట. 40)

ఇక్కడ మహాలక్ష్మి దేవకాంతలు కలిసి చేసిన వన విహారాన్ని వర్ణిస్తూ, 'ఉండి, ఉండి', 'చొక్కి, చొక్కి', 'గ్రోలి, గ్రోలి', 'పూసి, పూసి' అనే హల్లు జంటలు అవ్యవధానంగా ప్రయోగించబడినందు వలన ఇది ఛేకానుప్రాసాలంకారం అవుతున్నది.

అంత్యానుప్రాసాలంకారం

మహాలక్ష్మి శూన్యమయం చేసిన తర్వాత విష్ణుమాయా కల్పితమైన వైకుంఠం పూర్వం కంటే ప్రకాశంగా ఉందని అంత్యానుప్రాసాలంకార యుక్తంగా ఈ విధంగా వర్ణించబడింది.

"ప్రోల్లసద్రత్న గోపురముల చేత
గుమిగొన్న బంగారు కోటల చేత
సముదగ్రతర చంద్రశాలల చేత
నవహరిన్మణి తోరణశ్రేణి చేత
భవనాగ్నికేతన ప్రకరంబు చేత
విమల కాంచన కుంభ వితతుల చేత ..." (పుట. 56)

వైకుంఠపుర వర్ణన చేస్తున్న ఈ పద్యంలో ప్రతిపాదం చివర 'చేత' అనేది ఆవృత్తి కావడం వలన ఇది అంత్యానుప్రాసాలంకారం అవుతున్నది. నారసింహకవి తన కావ్యంలో ప్రయోగించిన శబ్దాలంకారాలకు నిదర్శనాలు పై విధంగా కనిపిస్తున్నాయి.

5.4.3.2. అర్థాలంకారాలు

నారసింహకవి తన విష్ణుమాయావిలాసంలో ప్రయోగించిన అర్థాలంకారాలు ప్రధానంగా ఈక్రింది విధంగా ఉన్నాయి.

ఉపమాలంకారం

మాయాలక్ష్మికి శాపవిమోచనం కలిగిన సందర్భంలో ఆమెను వర్ణిస్తున్న ఈ క్రింది పంక్తులలో ఉపమాలంకారం కనిపిస్తున్నది.

"ఖరకిరణ సంగతి రంగుమీటి
కరమొప్పు నంభోజ కలికయోయనగ
హరికరుణాప్రాప్తి నప్పద్మసదన
పరమ సంతోష సంభరితమై యొప్పె..." (పుట. 52)

ఇక్కడ శాపవిమోచనం కలిగిన మాయాలక్ష్మి ముఖం శ్రీమహావిష్ణువు కరుణ వలన పరమ సంతోష సంభరితమై ఒప్పినదని, అది సూర్యకిరణాలు తాకి వికాసంతో మిక్కిలి శోభిల్లే పద్మం లాగ ఉన్నదని పోలిక చెప్పబడింది. మాయాలక్ష్మి ముఖం వికసించిన పద్మంతో పోల్చబడినందు వలన ఇది ఉపమాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "నతివకునవనిధానాధి దేవతలు,
గములు గూడుక యూడిగములు గావించి
రమరు వసంతోదయమ్మునఁ బుష్ప,
లతికాతతుల్వనలక్ష్మిఁ గైసేయుగతి"(పుట. 52)

అనే చోట కూడా ఉపమాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

ఉత్ప్రేక్షాలంకారం

కైలాసపర్వత వర్ణన చేసే సందర్భంలో ఉత్ప్రేక్షాలంకార ప్రయోగం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"కటకాగ్రముల మత్తకరులకేసరులు

పటు శక్తిఁ బట్టుచోఁ బ్రబలుతద్ఘోర
గర్జలు దిక్కుడుంగంబులు బదులు
గర్జింప నిమ్మహాగ్రావంబు భూరి
రావాప్తి మీఱెనుగ్ర నృసింహదేవు
డావిర్భవింపగా నమ్మహామహుని
యశనిఘోషముల చేనమరు హిరణ్య
కశిపు సభామధ్యగస్తంభమనగ..." (పుట. 119)

కైలాస పర్వతం మీద మత్తకరులను సింహాలు బలవంతంగా పట్టబోయే సమయంలో చేసే గర్జనలు దిక్కులలో మార్మోగుతున్నాయి. ఆ సింహగర్జనలు నిండిన కైలాసపర్వతం, నృసింహదేవుడు ఆవిర్భవించే సమయంలో హిరణ్యకశిపుని సభామధ్యంలోని స్తంభంగా ఊహించబడినందు వలన ఇది ఉత్ప్రేక్షాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "నారావణుని బాహులానగా వ్రయ్యఁ
బారినరాల్ దళప్రతతులుగాక..." (పుట. 118)

అనే చోట కూడా ఉత్ప్రేక్షాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

ఉల్లేఖాలంకారం

శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు విష్ణుమాయా ప్రభావాన్ని వినిపించే సందర్భంలో ఉల్లేఖాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"హవదీక్షితర్షుల కలరి పాల్గురియు
దివిజలోకము కామధేనువోయనగఁ
బైరుల వాడుఁ దీర్పంగ వర్షించు
సార వర్షాకాల జలదాలి యనగ..." (పుట. 7)

ఇక్కడ శ్రీమహావిష్ణువు క్రతుదీక్షలతో జీవించే మహర్షులకు సంతోషంతో పాలు కురిపించే దేవలోకపు కామధేనువు వంటివాడని, పైరుల వాడును తీర్చడానికి వర్షించే వర్షాకాలపు మేఘం వంటివాడని భావించడం వలన ఇది ఉల్లేఖాలంకారంగా తెలుస్తున్నది.

రూపకాలంకారం

శాపం తీరిన తర్వాత మాయాలక్ష్మి పుష్పక విమానంలోకి వెళుతున్నప్పుడు చేసిన ఈ క్రింది వర్ణన రూపకాలంకారమయంగా ఉన్నది.

"గాంచన పంకేజ కర్ణికనెక్కు
కాంచన కలహంసి కైవడిఁ దోపఁ
గాంచన గాత్రి యక్కపటాబ్జసదన
కాంచన మణి పుష్పకము మీదనెక్కి" (పుట. 53)

శాపవిమోచనం వలన పూర్వపు ప్రకాశాన్ని పొందిన మాయాలక్ష్మి బంగారు దేహంతో

వెలుగొందుతూ, బంగారు మణిమయ పుష్పకవిమానాన్ని ఎక్కుతున్నది. అది చూసేవారికి బంగారు తామర కర్ణిక మీదికి ఎక్కుతున్న బంగారు కలహంస లాగ ఉన్నదని ఇందులోని భావం. ఇక్కడ మాయాలక్ష్మికి బంగారు కలహంసతో తాద్రూప్యం వర్ణించబడినందు వలన ఇది రూపకాలంకారంగా భాసిల్లుతున్నది.

ఇదేవిధంగా, "నిండుతావులు గ్రమ్మునెరయావి విరుల
దండవాడసుర మర్దను దండవాడు..." (పుట. 18)
"అన్నసాలగ్రామ మర్చించునిన్నుఁ
గన్న నా కన్నులు గడుఁ జల్లనయ్యె..." (పుట. 72)

మొదలైనవి రూపకాలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

అర్థాంతరన్యాసాలంకారం

మహాలక్ష్మి విష్ణుమాయను తిరస్కరించి గర్వించినందుకు పడిన కష్టాలను గురించి చెబుతున్న సందర్భంలో అర్థాంతరన్యాసాలంకారం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"..........బ్రాణేశు
దంటతనంబునఁ దటిమి మాటాడు
పడతికి దురవస్థ పాటిల్లకున్నె
గడలిరాయని ముద్దుకన్నియవంటి
వాలుగంటికె యెంతవచ్చెననంగ
నీ లౌకికస్త్రీల నికఁ జెప్పనేల" (పుట. 54)

భర్తను గౌరవించకుండా గర్వంతో తిరస్కరించి పలికే స్త్రీకి దురవస్థలు కలుగుతాయని, చెబుతూ, సముద్రుని ముద్దుల గారాబు కుమార్తె అయిన మహాలక్ష్మికే గర్వంతో విష్ణుమాయను చులకన చేసినందుకు పడరాని పాట్లు కలిగాయి. ఇక సామాన్య స్త్రీల సంగతి చెప్పనేల అని తెలుపుతున్నాడు కవి. ఇక్కడ గర్వంతో భర్తను చులకన చేసిన స్త్రీకి కష్టాలు కలుగుతాయనే సామాన్య వాక్యాన్ని చెప్పి, అలా ప్రవర్తించినందుకు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మికే కష్టాలు కలిగాయనే విశేష వాక్యంతో సమర్థించాడు. అందువలన ఇది అర్థాంతరన్యాసాలంకారం అవుతున్నది.

స్వభావోక్త్యలంకారం

మహాలక్ష్మి విష్ణువును చులకన చేసి గర్వంతో ప్రవర్తించినందుకు కలిగిన కష్టాలను తలచుకొని పరితపిస్తున్న సందర్భంలో చేసిన ఈ క్రింది వర్ణనలో స్వభావోక్త్యలంకారం కనిపిస్తున్నది.

"సిరమువాంచి ముకుందు చెంతకేమనుచు
బోవుదు నెటి మాలిపోయితినేని
లావణ్యనిధిఁ గ్రొత్తలననఁ దాఁ దగిలి
యున్న విభుండు నాయుపతాపమడచి

మన్నించుకే కేరి మాటాడు గాక
నావల్ల వచ్చిన నలకువకింక
దైవంబుననేల ధవు దూఱనేల
పరితపింపగనేల..." (పుట. 58)

మహాలక్ష్మి వైకుంఠ వైభవాన్ని చూసి, విష్ణువు మాయాలక్ష్మితో కూడి ఉన్నాడని తెలుసుకొని, ఇక ఏవిధంగా వైకుంఠానికి వెళ్ళగలనని చింతించింది. ఒకేవేళ తాను వెళ్ళినప్పటికీ, విభుడు ఓదార్చి, మన్నించగలడా హేళన చేస్తాడు గాని అని భావించింది. మహాలక్ష్మి ఈ దురవస్థ అంతా ఆమె వల్లనే కలిగిందని, దానికి దైవాన్నిగాని, భర్తనుగాని నిందించ పనిలేదని, చింతించడం కూడా వ్యర్థమని అనుకొన్నది. ఇక్కడ మహాలక్ష్మి అంతరంగంలోని ఆలోచనలను విశేషంగా వర్ణించినందు వలన ఇది స్వభావోక్త్యలంకారం అవుతున్నది.

ఆక్షేపాలంకారం

విష్ణు మాయను కాదని గర్వంతో పలికిన బ్రహ్మమాటలకు బదులుగా మార్కండేయుడు విష్ణుమహిమను బోధించే సందర్భంలో ఆక్షేపాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"నిన్నఁ గాదట మొన్న నీవు జన్మించు
టిన్నిటి లోకంబు లిపుడుద్భవించె
నపుడె ప్రభుండవైనటు వలె నకట
స్వపితయౌ విష్ణునిఁ జర్చింపవైతి
నారాయణుని నాభి నలినంబునంద
పారమహాపుణ్యఫల విశేషమునఁ
బొడిముట మఱచితే బుద్ధిరాజసము
గడుమించి యున్ననెక్కడి వివేకంబు" (పుట. 66)

మార్కండేయుడు చిరంజీవి కాబట్టి బ్రహ్మ విష్ణువు నాభికమలం నుంచి జన్మించడం తెలిసినవాడు. అందువల్లనే బ్రహ్మను ఉద్దేశించి అతడు పుట్టక ముందు నుంచే లోకాలు ఉన్నాయని, బ్రహ్మవిష్ణువు నాభికమలం నుంచి జన్మించాడని, మార్కండేయుడు బ్రహ్మ రాజసుగుణాన్ని ఆక్షేపిస్తున్నాడు. ఇక్కడ బ్రహ్మ మాటలకు సమాధానంగా పలికిన మార్కండేయుడి మాటలు ఆక్షేపణతో కూడి ఉన్నందువలన ఇది ఆక్షేపాలంకారం అవుతున్నది.

అతిశయోక్త్యలంకారం

శివుడు పార్వతికి చూపుతున్న వైకుంఠపుర విశేషాలను వర్ణించే సందర్భంలో అతిశయోక్త్యలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"జలరాశి తరగల చాలుననెగయు
బలుతుంపురులు సౌధపటలాగ్రకేతు
జాత వాతా హతి చామని మీది
కేతెంచెఁ బురలక్ష్మియిడు సేసలనగ" (పుట. 125)

వైకుంఠపురాన్ని ఆవరించి ఉన్న క్షీరసాగరపు తరుగల మీది నుంచి ఎగిసే తుంపరలు ఆ నగరంలోని సౌధాగ్ర భాగాన ఉన్న కేతనాలు వీచే గాలికి తిరిగి నేలమీదికి రాలుతున్నాయి. అది చూసేవారికి, నగరంలోకి ప్రవేశించేవారికి పురలక్ష్మి చల్లుతున్న సేసలు లాగ ఉన్నాయని కవిభావన. ఇక్కడ క్షీరసాగర కెరటాల మీది తుంపరలు సౌధాగ్రభాగాల వరకూ వ్యాపించాయని అతిశయించి వర్ణించినందు వలన ఇది అతిశయోక్త్యలంకారం అవుతున్నది.

దీపకాలంకారం

కరువు కాటకాల వలన కలిగే ఈతి బాధలను వర్ణించిన సందర్భంలో దీపకాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

"గ్రతు వేద శాస్త్ర పురాణ సాహిత్య
గతులు సంగీతము ల్గకవికలయ్యె
వడుగులు పెండ్లిండ్లు వరయాగవిధులు
గడిచె రతిక్రీడ కనరయ్యెఁ బ్రజకు
హీనతఁ దలపకెల్లెడల..." (పుట. 84)

కరువు కాటకాలు ప్రబలడం వలన క్రతువులు, వేద, శాస్త్ర, పురాణ సాహిత్యగతులు, సంగీతములు కకావికలయ్యాయి. వడుగులు, పెండ్లిండ్లు, యాగ కార్యాలు గతించాయి, రతిక్రీడ కానరావడం లేదు. ప్రజలకు కరువు వలన దారిద్ర్యం ప్రాప్తించినందుకే ఇవన్నీ కలిగాయని ఇందులోని భావం. ఇక్కడ ఉపమాన, ఉపమేయాలకు గల సామాన్యధర్మంచేత ఏకాన్వయం చెప్పినందు వలన ఇది దీపకాలంకారం అవుతున్నది.

దృష్టాంతాలంకారం

పుండరీకుడు బోయకాంతకు గల కులహీనతకు విచారించే సందర్భంలోని ఈ క్రింది వర్ణనలో దృష్టాంతాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

"నీవంటి సద్గుణనిధిఁ జారు రూప
లలిత యౌవన కళాలక్షణవతిని
గలసి వినోదింపఁ గలిగె నాపూర్వ
జనన పుణ్య విశేష సంపదయెంత
యని యెంతు నాచిత్తమలరదే నీవు
ప్రేయసివైనఁ గిల్బిషదైవఘటన
బోయ కులంబునఁ బుట్టిన నేమి..." (పుట. 80)

పుండరీకుడు బోయకాంత చారురూప లలిత యౌవన లక్షణాలను చూసి మెచ్చుకుంటూనే, మరొక వంక ఆమె కులహీనతకు చింతిస్తూ అది దైవఘటన దోషమేగాని ఆమె దోషంకాదని అంటున్నాడు. ఇక్కడ పుండరీకుడు మొదట బోయకాంత రూపయౌవన లక్షణాలను మెచ్చుకొని, తర్వాత ఆమె కూలహీనతకు దైవఘటనే దోషమని, ఆమెలో ఏ దోషమూ లేదని రెండు అభిప్రాయాలను బింబ ప్రతిబింబ భావంతో చెప్పడం వలన ఇది దృష్టాంతాలంకారం అవుతున్నది.

పర్యాయాలంకారం

మహాలక్ష్మి దేవకాంతలతో కలిసి క్షీరసాగరం తీరంలోని ఉద్యానవనంలో విహరించే సమయంలో చేసిన ఈ వర్ణనలో పర్యాయాలంకారం కనిపిస్తున్నది.

“బొదరిండ్ల నీడల బొలయుచు శైత్య
మొదవించి శీతర్తువో యనమించుఁ
జాలపూదేనియ జడిగొను చోటఁ
బ్రాలేయ సంపద నావహించుఁ
గిసలయస్వాది కోకిలనినాదంబు
లెసగుచో నామని యిది యనఁదనరు
నగరు కాశ్మీర గంధాన్వితపవన
మెగయుచో వేసంగి యిక్కువఁదెలుపు
మద మత్త మధుకర మహనీయ రుచులు
వొదులుచో వర్షా విభూతిఁ గాన్పించు
విచికిల కిరణ నవీన చంద్రికల
రుచి మించు శరద్రూఢియునెఱపు” (పుట. 40)

ఉద్యానవన శోభను వర్ణిస్తూ మొదట పొదరిండ్ల నీడలు శీతలత్వాన్ని కలిగిస్తున్నందు వలన అది శిశిర ఋతుభావన కలిగిస్తుందని పేర్కొన్నాడు. ఆ తర్వాత దానికి పర్యాయంగా హేమంతం, వసంతం, గ్రీష్మం, వర్షం, శరృతువులను పేర్కొనడం వలన ఇది పర్యాయాలంకారం అవుతున్నది.

సందేహాలంకారం

కైలాస పర్వతాన్ని గురించి నారదుడు తుంబురుడికి వర్ణించి చెబుతున్న సందర్భంలో సందేహాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

“నల్లనాడురు లింగమగుచు మిన్నొఱయు
తెల్లవేలుపు మహాదీప్తిపుంజంబొ
ప్రతికృష్ణపక్ష విభ్రష్టేందు కళల
చతురాననుండొక సరినిడ్డప్రోగొ

యసమాక్షు లావణ్యమందందజారి

వసుధనేకముగఁ బర్వతమైన యదియొ" (పుట. 119)

కైలాసపర్వతం పూర్వం శివుడు మహాలింగంగా ఆవిర్భంచి ఆకాశాన్ని తాకునట్లుగా పెరగగా వ్యాపించిన తెల్లని కాంతిపుంజమో, ప్రతి కృష్ణపక్షంలో నశిస్తున్న చంద్రకళలు నేలమీద రాలిపడగా బ్రహ్మ ఒకచోట పేర్చిన ప్రోగో, శివుడి లావణ్యం అక్కడక్కడా జారిపడి, భూమిపై ఒకటిగా చేరిఏర్పడిన పర్వతమో అనునట్లు ఉన్నదని వర్ణించబడింది. ఇక్కడ కైలాసపర్వతం శివలింగం కాంతిపూజమా, చంద్రకళల ప్రోగా, లేక శివుడి లావణ్యమా ఏదో తేల్చుకోలేని సందేహాన్ని కలిగిస్తున్నందు వలన ఇది సందేహాలంకారం అని చెప్పవచ్చు.

భ్రాంతిమదలంకారం

శివుడు పార్వతీ సమేతంగా వైకుంఠపురంలోకి ప్రవేశించినప్పుడు నందికి కలిగిన భ్రాంతి క్రింది విధంగా వర్ణించబడింది.

"మరకత సౌధకోమల రుచుల్సాచి

గరకి యౌనని మూతి గ్రక్కునసాచు

తన నీడ మణి భిత్తిఁ దగఁ జేరగిబ్బి

చెనక వచ్చెనటంచు జిఱ్ఱునఁదిరుగు

నందియల్మొరయ దేహద్యుతుల్మెఱయ

నందికేశ్వరుడు తాండవ మాచరించు" (పుట. 126)

వైకుంఠనగరంలోకి ప్రవేశించిన నందికేశ్వరుడు సౌధాలకు పొదిగిన మరకత మణుల కాంతిని చూసి పచ్చిక అని అందుకోవడానికి మూతిని సాచాడు. తన నీడ మణిస్తంభంలో చూసి మరొక ఎద్దు వచ్చిందేమోనని వెనుకను తిరిగాడు. తెల్లని మేడను చూసి కైలాస పర్వతమని తాండవమాడినాడని వర్ణించబడింది. ఇక్కడ నందికేశ్వరుడు వైకుంఠనగరంలో భ్రాంతితో సంచరించినాడని వర్ణించినందు వలన ఇది భ్రాంతిమదలంకారం అవుతున్నది.

వినోక్త్యలంకారం

మహావిష్ణువు లక్ష్మీదేవికి గర్వభంగం కావించాలని భావించిన సందర్భంలోని ఈ క్రింది పద్యంలో వినోక్త్యలంకారం కనిపిస్తున్నది.

"బలముఁ బౌరుషము సంపద్విలాసములుఁ

గలికి దుర్వినయుతా గర్వాంధ మతులు

బలముఁ బౌరుషము సంపద్విలాసములు

తలగక నెదురును దము నెఱుంగుదురె" (పుట. 41)

లోకంలో బలం, పౌరుషం, సంపద విలాసాలు కలిగినప్పటికీ దుర్వినయంతో

గర్వాంధులైన వారు ఆ బలం, పౌరుషం, సంపద విలాసాలు తొలగకుండా వివేకాన్ని పొందలేరని భావం. ఇక్కడ ఉపమేయానికి వినయం లేక పోవడమనే అల్పవిషయ లోపం వలన గర్వాంధత అనే హీనతను వర్ణించినందు వలన ఇది వినోక్త్యలంకారం అని తెలుస్తున్నది.

విషమాలంకారం

మహాలక్ష్మి దేవకాంతలతో మాయాలక్ష్మికి కలిగిన దురవస్థను గురించి చెబుతున్న సందర్భంలో విషమాలంకారం కనిపిస్తున్నది.

"నీలలనామణికీ శుభమూర్తి
కీలతాతన్వికినీమిటారికిని
దామస దైవ మిత్తపమునఁ గమల
నేమిటి కొనరించె నిటులొనర్చినది
గోరిన గోర్కెఁ గ్రక్కున నీయరాదె
కారుణ్య దూరులక్కట దైవతములు" (పుట. 44)

మహాలక్ష్మి దేవకాంతలతో మాయాలక్ష్మిని చూపుతూ, ఈ లలనామణికి, లతాతన్వికి తామసదైవం తపోగ్ని కీలలను కలిగించాడు. ఈమె కోరికను తీర్చకుండా ఉపేక్షిస్తున్న దేవతలు కరుణలేని వారు కదా! అని అన్నది. ఇక్కడ మాయాలక్ష్మిని వర్ణిస్తూ లలనామణి, శుభమూర్తి, లతాతన్వి అనే విశేషణాలు ప్రయోగించినందు వలన ఆమె సుకుమారవతి అని తెలుస్తున్నది. అటువంటి సుకుమారికి తపోగ్నిని కలిగించినట్లుగా చెప్పి విరుద్ధమైన భావాలు వర్ణించినందు వలన ఇది విషమాలంకారం అవుతున్నది.

సారాలంకారం

విష్ణుమాయా ప్రభావాన్ని శుకమహర్షి పరీక్షిత్తుమహారాజుకు వినిపించే సందర్భంలో సారాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"పంచేంద్రియములకుఁ బరమంబులగుస
మంచిత స్థితి విషయార్థంబులనఘ
అఖిలార్థములకెక్కుడై మించు మనసు
నిఖిలప్రవర్తన నియమంబు గలిగి
మనమున కధికమై మలయు సద్బుద్ధి
యనుపమ సూక్ష్మభావాలంబియగుచు
బుద్ధికి నుత్కృష్ట భూమియౌనాత్మ
సిద్ధి సమ్యజ్ఞాన సీమంతమగుచు
నత్తత్వమునకెక్కుడగు మహత్తామ
హత్తున కంటె నవ్యక్తంబు మించు

నవ్వల పరకాష్ఠమై పురుషుండు
నివ్వటిల్లు పయోద నికర గర్భస్థ
భానుని చందానఁ బ్రకృతిలోఁగలసి.........” (పుట. 8)

పంచేంద్రియాల కంటే పురుషార్థాలు పరమమైనవని, అఖిలార్థముల కంటె మనస్సు ఎక్కువని, మనస్సు కంటే సద్బుద్ధి అధికమైనదని, బుద్ధికంటే ఉత్కృష్టమైనది ఆత్మ అని, దానికంటే ఎక్కువైనది మహత్తు అని, ఆ మహత్తుకంటే అవ్యక్తం మించినదని, దానికంటే పరాకాష్ఠగా పురుషుడు ఉంటాడని, అతడు సముద్రగర్భంలో దాగిన సూర్యుడి లాగ ప్రకృతిలో కలిసి ఉంటాడని ఇందులోని భావం. ఇక్కడ పంచేంద్రియాల నుంచి మొదలుపెట్టి పురుషుడి వరకూ చెప్పిన వాటిలో ఉత్తరోత్తరా ఉత్కర్షగా వర్ణించుటచేత ఇది సారాలంకారం అవుతున్నది.

అధికాలంకారం

బ్రహ్మదేవుడు మార్కండేయమునితో తన ఆధిక్యాన్ని గురించి చెప్పుకుంటున్న సందర్భంలో అధికాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

“ఉదయింపడే సూర్యుడు దయాద్రిఁదొలుత
నుదయాద్రికంటె నెంతో కాంతిఁ గనడె
పుట్టండె మార తాప్తుండు చెట్టునను
చెట్టుకంటెనుదగ్ర శిఖల రాజిలడె
నావిధంబున నేను హరియందుఁ బుట్టి
ఠీవిమైనంతకంటెను మేటినైతి” (పుట. 67)

ఉదయాద్రి మీద ఉదయించిన సూర్యుడు ఆ ఉదయాద్రి కంటే ఎంతో కాంతివంతంగా ప్రకాశిస్తున్నాడు. చెట్టు నందు జన్మించిన అగ్ని ఆ చెట్టుకంటే ఉదగ్రశిఖల చేత రాజిల్లుతున్నాడు. అదేవిధంగా విష్ణువు నాభీకమలం నుంచి జన్మించిన బ్రహ్మదేవుడు తాను కూడా ఆ విష్ణువుకంటే మేటి అయినాడని ఇందులోని భావం. ఇక్కడ ఉపమానం కంటే ఉపమేయానికి ఆధిక్యం చెప్పబడి నందు వలన ఇది అధికాలంకారం అవుతున్నది.

విశేషోక్త్యలంకారం

నారదుడు పుండరీకుడికి సాలగ్రామపూజా మహిమను వివరించే సందర్భంలో విశేషోక్త్యలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

“దాన సత్యవ్రతతతులచే దగిలి
యూనిన ప్రతి దివ సోపవాసములఁ
గృస్సియు ఘన తపః క్రూరాగ్ని శిఖల
డస్సియు పవనకాండపునేమములను

క్రాగియుఁ దీర్థయాత్రా ప్రవాసముల
ప్రాగియు జనులు సేరరునిష్కళంక
పరమవైష్ణవ దివ్యభవనంబు విష్ణు
చరణ పంకజ యుగార్చకులను బోలి" (పుట.74)

దాన, సత్యవ్రత క్రియాలతో ప్రతిదినం ఉపవాసములతో కృశించినా, ఘనతపః క్రూరాగ్ని శిఖలలో దస్సినా, తీర్థయాత్రా ప్రవాసములతో గడిపినా జనులు విష్ణుపదార్చకుల లాగ వైకుంఠప్రాప్తిని పొందలేరని ఇందులోని భావం. ఇక్కడ వైకుంఠప్రాప్తికి చేయదగిన పుణ్యకార్యాలు జనులు చేసినారనే ప్రస్ఫుటమైన నిదర్శనం కనిపిస్తున్నప్పటికీ, వారికి విష్ణుభక్తులకు లాగ వైకుంఠప్రాప్తి కలుగదని వర్ణించుట చేత ఇది విశేషోక్త్యలంకారం అవుతున్నది.

ప్రతీపాలంకారం

నారదుడు ధర్మరాజు సభను గురించి ధర్మరాజుతో చెబుతున్న సందర్భంలో ప్రతీపాలంకార ప్రయోగం ఈ విధంగా కనిపిస్తున్నది.

"దేవ గంధర్వ దైతేయాది సభలు
నే విలోకించితి నీ సభకుపమ
గావవి సురరాజు ఘనసభసాటి
గావింపనగునేమొ కాని భూమీశ" (పుట.19)

నారుదుడు ధర్మరాజుతో దేవ గంధర్వ రాక్షసరాజ సభలు అతడు చూసినవన్నీ కూడా ధర్మరాజు సభతో సాటిరావని, ఇంద్రసభ మాత్రం కొంతవరకు పోల్చదగినదని అంటున్నాడు. ఇక్కడ ఉపమేయమైన ధర్మరాజు సభను కాకుండా ఉపమానాలైన దేవ గంధర్వ రాక్షసరాజ సభలను వర్ణించి, ఉపమానాలకు ఉపమేయంతో పోలిక చెప్పినందు వలన ఇది ప్రతీపాలంకారం అవుతున్నది.

అనుమానాలంకారం

నారదుడు సర్పవరక్షేత్రంలో కనిపించిన మాయామునిని చూసి అతడు మహావిష్ణువులాగ ఉన్నాడని భావించే సందర్భంలో అనుమానాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఎన్నడుఁ గనుగొన మీ మునీశ్వరుని
నిన్నియమ నిరూఢి యీ విరక్తియును
ఈ జ్ఞానమహిమయు నీక్షించి రేనిఁ
బ్రజ్ఞేచ్ఛఁ గొల్వరే బ్రహ్మాది సురలు
శౌరి మూర్త్యంతర ఛాయనున్నాడు
వేరిడనేల శ్రీవిభుడెకాబోలు

ఈదివ్యవనభూమియే మోక్షపదవి

ఈ దివ్య మౌనీంద్రుడే మాధవుండు" (పుట. 152)

నారదుడు మాయాముని ఎదురవగానే ఇలాంటి మునిని ఎన్నడూ చూడలేదని అనుకున్నాడు. ఈ ముని జ్ఞానమహిమను చూస్తే బ్రహ్మాది దేవతలు కూడా కోరి పూజిస్తారని, విష్ణువు మరోరూపంలాగ ఉన్నాడని, ఆ దివ్యవనమే వైకుంఠమని, ఆ దివ్యముని సాక్షాత్తు శ్రీమహావిష్ణువే అని భావించాడు. ఇక్కడ నారదుడు మాయామునిలోని తేజస్సును, అక్షమాలికలు, ఊర్ధ్వపుండ్రాలు అనే సాధనాలను చూసి మహావిష్ణువుగా భావించినందు వలన ఇది అనుమానాలంకారం అవుతున్నది.

వ్యాజనిందాలంకారం

బ్రహ్మ విష్ణుమాయను చులకనచేసి, మార్కండేయమునిని నిందిస్తున్న సందర్భంలో వ్యాజనిందాలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"నీజగన్నాయకు నీదేవదైత్య

పూజితు నీగుణాంభోధినీసభను

జీరికిఁ గొనక దూషింపరాదనక

క్రూరుడవై నోరఁగొలదులు వదరి

ధిక్కరించితివి బుద్ధి యొకింత లేదె

యెక్కడి మునివి నిన్నేమనవచ్చు" (పుట. 67)

బ్రహ్మ దేవతాసమాహాలు చేరి తనను పొగుడుతున్న సమయంలో మార్కండేయముని ఆక్షేపించినందుకు కోపించాడు. జగన్నాయకుడైన తనను దేవతలు, రాక్షసులు, మునులు అందరూ పూజించేవాడిని, సభలో అందరూ చూస్తుండగా ఎదిరించరాదని, దూషింపరాదని భావించకుండా నోటికి వచ్చినట్లుగా వదరి ధిక్కరించిన మార్కండేయుడు వివేకహీనుడని, మునివృత్తికి కళంకమని బ్రహ్మ నిందించాడు. ఇక్కడ బ్రహ్మ మార్కండేయుడు చేసిన హితబోధను అవమానంగా భావించి, కోపంతో మార్కండేయమునిని నిందించినందు వలన ఇది వ్యాజనిందాలంకారం అవుతున్నది. ఈవిధంగా కంకంటి నారసింహకవి తన విష్ణుమాయా విలాసంలో సందర్భానుకూలంగా చేసిన ఆలంకారిక ప్రయోగాలను గురించి, వాటికి కావ్యంలో కనిపిస్తున్న నిదర్శనాలను గురించి చెప్పుకోవచ్చు.

5.4.4. రోసనూరి వేంకటపతి - ఆలంకారిక ప్రయోగం

రోసనూరి వేంకటపతి తన కావ్యంలో ప్రయోగించిన అలంకారాలలో శబ్దాలంకారాల కంటే అర్థాలంకారాలే ప్రధానంగా కనిపిస్తున్నాయి. వేంకటకవి విష్ణుమాయావిలాసంలోని ఆలంకారిక ప్రయోగాలు ఈ విధంగా ఉన్నాయి.

శబ్దాలంకారాలు

వేంకటపతి విష్ణుమాయావిలాసంలో వృత్త్యనుప్రాసాలంకారం మాత్రమే శబ్దాలంకార ప్రయోగంగా కనిపిస్తున్నది. ఆదిప్రాసాలంకారం కూడా ఒక్క పద్యంలో ప్రయుక్తమై కనిపిస్తున్నది.

వృత్త్యనుప్రాసాలంకారం

కైలాసంలో శివుడి స్వరూపాన్ని వర్ణించే సందర్భంలోని ఈ క్రింది పద్యంలో వృత్త్యనుప్రాసాలంకారం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఆశైలాధీశుండు మ
హాశివుండకిలేశుఁ డాశ్రితావనుడుసమ
స్తాశా పరిపూర్ణుడు భవ
పాశ హరుడు భవుడు భక్త పాలుండెపుడున్" (1-56)

శివుడి రూపాన్ని, స్వభావాన్ని వర్ణిస్తున్న ఈ పద్యంలోని 'డ'కార ఆవృత్తి వినేవారికి డమరుకనాదం లాగ వినిపిస్తున్నందువలన ఇది వృత్త్యనుప్రాస అలంకారంగా కనిపిస్తున్నది.

ఇదేవిధంగా, "మరులున బొరలుచుఁ దెరలుచు..." (3-107)
"చిలుకల కొలికినిగూడక...." (3-129)
"ఏననగా నీవనగా
మానుగ మానకిద్దఱకుఁ గ్రమంబుగ భేదం..." (3-155)

మొదలైన పద్యాలు వృత్త్యనుప్రాసాలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

ఆదిప్రాసాలంకారం

నారదుడు కైలాసంలో శివుడిని సందర్శించిన సందర్భంలో చేసిన శివస్తుతిలో ఆదిప్రాసాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"శరణు గౌరీ ముఖాబ్జ భాస్కరవికాస
శరణు కైలాస నిరుపమాచలనివాస
శరణు మురహర సరగిరి శరశరాస
శరణు సంపూర్ణ పూర్ణిమా చంద్రహాస" (1-67)

ఈ పద్యంలో 'శరణు' అనే హల్లులు ప్రతి పాదానికి ప్రారంభంలో ఆవృత్తమైనందు వలన ఇది ఆది ప్రాసాలంకారం అవుతున్నది. అదే విధంగా ఈ పద్యంలోనే ప్రతిపాదం చివర 'స' అనే హల్లు ఆవృత్తమై అంత్యప్రాసను కూడా స్ఫురింపజేస్తుండటం ఈ పద్యంలోని విశేషంగా చెప్పవచ్చు.

5.4.4.2. అర్థాలంకారాలు

వేంకటపతి తన కావ్యంలో ప్రయోగించిన అర్థాలంకారాలు ప్రధానంగా క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

ఉపమాలంకారం

మోహిని శృంగారవనంలో కందుకక్రీడ ఆడుతున్న సందర్భంలోని ఈ క్రింది పద్యంలో ఉపమాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

"ముద్దురాకేందుముఖి నగుమొగముచెంత
కెనయునప్పుడు చూడ పూర్ణేందుమండ
లంబు వలెనున్న నీకందు కంబు....." (3-25)

ఈ పద్యంలో మోహిని తన ముఖం దగ్గరకు తీసుకున్నప్పుడు కందుకం ఆమె ముఖ సౌందర్యం ప్రతిబింబించి, పూర్ణచంద్రబింబం లాగ కనిపిస్తున్నదని వర్ణించబడింది. ఇక్కడ మోహిని ముఖంతో సాదృశ్యం చెబుతూ కందుకాన్ని పూర్ణచంద్రబింబంతో పోల్చినందు వలన ఇది ఉపమాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "తురుణాబ్జపాణి వరసుం
దరహస్త తలంబుఁ జెంది తరుణార్కరుచిన్..." (3-24)

అనే పద్యంలో కూడా ఉపమాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

ఉత్ప్రేక్షాలంకారం

సూర్యాస్తమయ వర్ణన చేస్తూ కవి ప్రయోగించిన ఉత్ప్రేక్షాలంకారం ఈక్రింది పద్యంలో కనిపిస్తున్నది.

"క్షితిసర్వజ్ఞుడనంగఁ బేరయిన యా శ్రీకంఠుడార్యాసమ
న్వితుడై నీదగు మోహినీత్వము గనన్ వేంచేయుచున్నాడుపో
ద్గతి మీరల్ పురుషోత్తమాఖ్యులని పల్కన్ బోవునట్లైక్రియా
ర్హత భానుండపరాబ్ధి శాయిఁగనఁ జేరంబోయె సన్మిత్రుడై" (1-139)

ఈ పద్యంలో కవి సూర్యాస్తమయ వర్ణన చేస్తున్నాడు. సందర్భం శివుడు పార్వతీ సమేతంగా మోహినిని చూడాలని వైకుంఠానికి వెళ్ళడం. దీనిని పురస్కరించుకొని, సర్వజ్ఞుడైన శివుడు పార్వతీదేవితో కలిసి మోహినీ రూపాన్ని చూడటానికి వస్తున్నాడని విష్ణువుతో చెప్పడానికా అన్నట్లుగా సూర్యుడు సన్మిత్రుడై పశ్చిమ సముద్రంలోకి క్రుంకినాడు అని వర్ణించబడింది. సూర్యాస్తమయ సమయంలో సూర్యుడు పశ్చిమ సముద్రంలోకి క్రుంకడం సహజం. దానిని శివుడి రాకను విష్ణువు తెలిపేందుకుగాను సూర్యుడు సముద్రంలోనికి క్రుంకినాడని ఊహించినందువలన ఇది ఉత్ప్రేక్షాలంకారం అవుతున్నది. ఇదేవిధంగా,

"ఘనతర దీప్తితోఁదనువికాసినిగా నొనరించు లోకలో..." (1-137)

"సమయ భటుండు పూర్వనగ సానుతటంబను కొత్తళంబునన్..." (1-138)

"పరగ మరుండుపెన్దొగ తుపాకిని బుప్పొడి మందు..." (1-144)

మొదలైన పద్యాలు ఉత్ప్రేక్షాలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

ఉల్లేఖాలంకారం

సూర్యోదయ వర్ణనలో కనిపించే ఈ క్రింది పద్యంలో ఉల్లేఖాలంకారం కనిపిస్తున్నది.

"ప్రాచీదిశాభామ ఫాల భాగంబున
దీపించు సింధూర తిలకమనగ
దూరుపుకొండపై గైరికస్థలమున
నైరావతముపెట్టునడుగనంగ
బూర్వ సముద్రంబు పొంత సంభవమయి
పొదలెడు పగడంపుఁ బొదయనంగ
బరమేశ్వరున కింద్రు పంపున దేవతల్
గొనివచ్చు కెంపుల గొడుగనంగ
సూర్యుడుదయింప.........." (2-4)

ఈ పద్యంలో ఉదయిస్తున్న సూర్యుడు తూర్పుదిక్కు అనే భామ నుదుటిపై ధరించిన సిందూర తిలకం లాగ, తూర్పుకొండపై గైరిక స్థలంలో ఐరావతం పెట్టే అడుగులాగ, తూర్పు సముద్రంలో పుట్టి పెరిగిన పగడపు పొదలాగ, పరమేశ్వరుడికి ఇంద్రుడు పంపిన కెంపుల గొడుగులాగ వర్ణించబడ్డాడు. ఇక్కడ ఉదయిస్తున్న సూర్యుడు చూసేవారికి సింధూరపు తిలకం లాగ, ఐరావతం అడుగులాగ, పగడపు పొదలాగ, కెంపుల గొడుగులాగ పలువిధాలుగా కనిపించడం వలన ఇది ఉల్లేఖాలంకారం అవుతున్నది. ఇదేవిధంగా, "గగనాటవీ తరకా మృగంబులనేలు
కొనవచ్చు సింగంపుఁ గొదమయనంగ..." (1-148)
అనే పద్యంలో కూడా ఉల్లేఖాలంకారం కనిపిస్తున్నది.

రూపకాలంకారం

వైకుంఠంలో మహావిష్ణువు, శివుడు ఎదురయిన సందర్భంలో వారి సమాగమాన్ని వర్ణించిన పద్యంలో రూపకాలంకారం క్రింది విధంగా ఉన్నది.

"నీలాచల రాజమును
త్కైలాసనగంబు గదియగా వచ్చునెడన్
శ్రీలలనేశుడు హరియున్
శూలాయుధుడపుడుగవిసి శుభకరమతులై" (2-63)

ఈ పద్యంలో వైకుంఠంలో మహావిష్ణువు శివుడిని ఆహ్వానించేటప్పుడు వారిద్దరూ ఎదురయ్యి, ఒకరినొకరు కౌగిలించుకొన్నారని వర్ణించబడింది. నీలమేఘశ్యాముడైన విష్ణువు, ధవళదేహుడైన శివుడిని సమీపించగా, నీలాచలం కైలాస పర్వతాన్ని కౌగిలించుకొనేందుకు సమీపించినట్లుగా ఉన్నదని కవి భావన. ఇక్కడ నీలాచలంతో

విష్ణువుకు, కైలాస పర్వతంతో శివుడికి అభేదం చెప్పడం వలన ఇది రూపకాలంకారం అవుతున్నది.

పర్యాయాలంకారం

కైలాసంలో శివుడి విహారాన్ని వర్ణించే సందర్భంలోని ఈ క్రింది పద్యంలో పర్యాయాలంకారం కనిపిస్తున్నది.

"ఒకవేళ నణిమాది యోగసిద్ధులసిద్ధ
భాషణాశ్లేషణ ఫణితికలరు
నొకవేళరుద్ర కన్యల యాటపాటలు
నాలించుచుండుఁ జిత్తానురక్తి
నొకవేళ శుకపిక నికరసుస్వరచరణ
వాటికల్గను నిరాఘూట లీల
నొకవేళ నిందు కొల్వుండి వారిజసంభ
వాదుల మనువుల నాదరించు
నొక్కవేళను వ్యాఘ్రాజినోత్తరీయ
విపుల పరిధానుడై తపోవృత్తినుండ..." (1-58)

ఈ పద్యంలో కైలాసంలోని శివుడు ఒకవేళలో యోగసిద్ధులతో మాట్లాడుతూ, ఇంకొకవేళ రుద్రకన్యల ఆటపాటలను చూస్తూ, ఒకసారి వనంలోని శుకపికాదులతో కాలక్షేపం చేస్తూ, మరొకసారి బ్రహ్మమొదలైన మనువులతో కొలువు దీరుతూ, ఒక్కోసారి పులిచర్మం ఉత్తరీయంగా ధరించి తపోవృత్తిలో ఉంటున్నాడని వర్ణించబడింది. ఇక్కడ శివుడికి మొదట ఒక ఆశ్రయాన్ని చెప్పి, తర్వాత దానికి పర్యాయంగా అనేక ఆశ్రయాలను వర్ణించినందు వలన ఇది పర్యాయాలంకారం అవుతున్నది.

సందేహాలంకారం

మోహినీకాంత సౌందర్యాన్ని వర్ణించే సందర్భంలోని పద్యంలో సందేహాలంకారం కనిపిస్తున్నది.

"విమలేందు బింబమో వికచారవిందమో
తరుణినెమ్మో మేరు పఋపరాదు
మగమీల ప్రాపులో మదనుని తూపులో
వెలది చూపులెఱిగి పలుకరాదు
మిసిమి పొన్గిండులో పసినిమ్మపండులో
యింతి చన్గవ నిశ్చయింపరాదు
చంచరీకంబులో శక్రనీలంబులో
శంపాంగికురులో భావింపరాదు..." (1-73)

ఈ పద్యంలో కవి మోహిని అంగాంగ సౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు. మోహిని ముఖం నిండు చంద్రుడో, వికసించిన అరవిందమో వేరు చేయరాదు అని, ఆమె చూపులు మగమీల ప్రాపులో, మదనుని తూపులో పలుకరాదని, చనుగవలు బంగారుబంతులో, పసినిమ్మపండులో నిశ్చయించలేమని, కురులు చంచరీకములో, శక్రనీలములో భావించలేమని సందేహాన్ని వ్యక్తం చేయడం వలన ఇది సందేహాలంకారం అవుతున్నది.

వినోక్త్యలంకారం

నారదుడు మోహినీ సౌందర్యాన్ని వర్ణిస్తూ, శివుడిమోహం ఎలాంటిదో చెబుతున్న సందర్భంలో వినోక్త్యలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

“మారుని గెలిచితిరేమరి
దారు వనస్త్రీలనేలఁ దగిలితిరిటు మీ
ధీరోదారక్రియలె
వ్వారికిఁ దెల్లంబు లెంచ వలనే వానిన్” (1-81)

ఈ పద్యంలో మన్మథుడినే జయించిన మనోనిగ్రహం కలిగిన శివుడు ఆ తర్వాత మోహంతో దారువనంలోని మునికాంతల వెంటపడ్డాడని నారదుడు గుర్తుచేస్తున్నాడు. ఇక్కడ మన్మథుడిని జయించిన నిగ్రహశక్తిగల శివుడికి దారువనంలోని మునికాంతల వెంటపడటమనే అల్పత్వం ఆపాదించబడింది. దానివలన శివుడి నిగ్రహపటుమహిమకు హీనత కలుగుతున్నది. అల్ప విషయలోపం వలన శివుడికి హీనతను వర్ణించుట చేత ఇది వినోక్త్యలంకారం అవుతున్నది.

స్వభావోక్త్యలంకారం

శివుడిని చులకన చేసిన నారదుడిని నిందించే సందర్భంలో ప్రమథుల హావ భావాల వర్ణన స్వభావోక్తి అలంకారంగా కనిపిస్తున్నది.

“గిటగిట పండ్లు గీటుచును గ్రిక్కిరియున్ చుట్టు ముట్టియున్
బెటపెటలైన పల్కులను భీషణ భంగులఁ బేలియుగ్రునిన్
దట వట లాడెనే యెదుర తన్ను నెఱుంగ పోవనీకుడె
ప్పటివలె వేగమే గదిసి పట్టుడు బాసకటారి బాపనిన్” (1-105)

ఈ పద్యంలో నారదుడి మీద కోపంతో ప్రమథులు గిట గిట పండ్లు గీటడం, పెటపెటలైన మాటలు భీషణంగా మాట్లాడటం, తటవట లాడటం, కలిసి పట్టమనటం మొదలైన చేష్టలన్నీ వారికోపావేశాన్ని తెలుపుతున్నాయి. ఇక్కడ ప్రమథుల చేష్టల వర్ణన వారి స్వభావాన్ని వెల్లడిస్తునందు వలన ఇది స్వభావోక్త్యలంకారం అవుతున్నది.

సారాలంకారం

పార్వతీదేవి శివుడి ఆధిక్యాన్ని తెలుపుతున్న సందర్భంలోని ఈ పద్యంలో సారాలంకారం కనిపిస్తున్నది.

"నరులకు మునులధికులు ముని
వరులకు సురలధికులమర వర్గమ్ములకున్
బరమేష్ఠియధికుడీతనికి
హరి యధికుండతనికీవెయధికుడవెందున్" (1-114)

ఈ పద్యంలో మానవుల కంటే మునులు అధికులు, మునులకు దేవతలు, దేవతలకు బ్రహ్మ, బ్రహ్మకు విష్ణువు అధికుడు. విష్ణువు కంటే శివుడు అధికుడని వర్ణించబడింది. ఇక్కడ ఉత్తరోత్తర వస్తువులను ఉత్కర్ష చేసి ఆధిక్యం తెలుపుతూ వర్ణించినందు వలన ఇది సారాలంకారం అవుతున్నది.

భ్రాంతిమదలంకారం

మాయామోహిని శృంగార రూపవిలాసాన్ని చూసి భ్రమించిన ప్రమథులను వర్ణించిన ఈ క్రింది పద్యంలో భ్రాంతిమదలంకారం కనిపిస్తున్నది.

"ప్రమథుడొక్కం డొక్క ప్రమథుఁ దద్భామగా
భావించి గడ్డంబు పట్టితివియు
భ్రమగొని యొకరుద్రభటుడొక్క శివదూతఁ
గాంతగాఁ గనుఁగొని కౌగిలించు
మరి యొక్క శైవుండు మహేశ్వరుసేవ
కుని బడంతిగ నెంచి పెనగబోవు
భవు భృత్యుడొక్కండు పసిడి కంబపు బొమ్మఁ
గొమ్మని ముద్దాడుఁ గోర్కి మెరయ..." (2-103)

ఈ పద్యంలో మోహిని సౌందర్యానికి భ్రాంతులైన ప్రమథుల చేష్టలను వర్ణించబడ్డాయి. ఒక ప్రమథుడు మరొక ప్రమథుడి గడ్డం పట్టిలాగడం, ఒక ప్రమథుడు మరో శివదూతను భ్రాంతితో కౌగిలించుకోవడం, ఒక ప్రమథుడు మరొక ప్రమథుడిని పెనగబోవడం, ఒకడు బంగారు స్తంభపు బొమ్మను మోహిని అని ముద్దాడటం అనే ప్రమథుల చేష్టలు భ్రాంతి పూర్వకములుగా కనిపిస్తున్నందు వలన ఇది భ్రాంతిమదలంకారం అవుతున్నది.

అధికాలంకారం

శివుడు నారదుడితో తన ఆధిక్యాన్ని చెబుతున్న సందర్భంలోని ఈ క్రింది పద్యంలో అధికాలంకారం కనిపిస్తున్నది.

"నన్నుండి నిపుణుడాతం
డెన్నిక నేఁ జక్రమీయనిలఁ జక్రియనన్
బెన్నిధిగఁ బేరుగాంచెను
నన్నా బ్రమయించు నతడు నారీమణియై" (1-102)

ఈ పద్యంలో శివుడు విష్ణువు కంటే తానే అధికుడనని తెలుపుతూ, శివుడు తన

చక్రాన్ని ఇచ్చినందు వల్లనే విష్ణువుకు 'చక్రి'అనే పేరు కలిగిందని, అటువంటి విష్ణువు తనను మోహినీ రూపంతో ఏవిధంగా భ్రమించగలడని అన్నాడు. ఇక్కడ శివుడు విష్ణువు కంటే తానే అధికుడినని చెబుతూ, దానికి నిదర్శనంగా చక్రం ఇచ్చిన వృత్తాంతాన్నితెలపడం వలన ఇది అధికాలంకారం అవుతున్నది.

కావ్యలింగాలంకారం

శివుడు శృంగారవనంలో ప్రమత్తుడై మోహిని గురించి పలవరించే సందర్భంలోని క్రింది పద్యంలో కావ్యలింగాలంకారం కనిపిస్తున్నది.

"వెలది నిన్నిట మూర్కొనె విరులసరము
సుమనసులకైనఁ దరమెనిన్ స్తుతియొనర్పఁ
బుణ్యతర వాసనలు మీకు బుట్టినిల్లు
గాగ విధి విధియించుట గలదు మొదల" (3-63)

ఈ పద్యంలో శివుడు మోహిని ధరించి, సువాసనలు ఆఘ్రాణించిన పూలమాలను చూసి, దాని పుణ్యం ఎంతగొప్పదో పొగడటానికి ఎంతటి వారికైనా సాధ్యం కాదని అన్నాడు. సువాసనలు పూవులకు పుట్టినిల్లుగా విధి విధించిన నియమం గలదని శివుడు పేర్కొన్నాడు. ఇక్కడ పూలమాల సువాసనను మోహిని ఆస్వాదించిందని, అంతటి భాగ్యం ఆ పూలమాలకు కలగడానికి విధి విధించిన నియమమైన సువాసనలు కలిగి ఉండటం కారణమని సమర్థించడం వలన ఇది కావ్యలింగాలంకారం అవుతున్నది.

వ్యాజనింద

శివుడు మోహినీకాంత మీద విరహభావంతో మలయపవనాన్ని దూషించే సందర్భంలోని ఈ పద్యంలో వ్యాజనిందాలంకారం కనిపిస్తున్నది.

"మలయ నగంబునవిషధర
కులములతోఁగవిసి మనినకుత్సితమతినీ
వెలమి నుపకారమెఱుగుదె
మిల మిల నిను పాము గఱచి మ్రింగదెపవనా"(3-115)

ఈ పద్యంలో శివుడు మలయ పవనాన్ని ఉద్దేశించి, మలయపర్వతం మీద విషపు పాములతో కలిసి ఉన్నందువలన కుత్సితమతితో ఉపకారబుద్ధిని మరిచిపోయాడని, అందువల్లనే పవనుడిని పాము కరిచి మ్రింగుతుందనీ అన్నాడు. ఇక్కడ విరహప్తుడైన శివుడిని పవనుడు బాధించాడు. అందువలన శివుడు మలయపవనాన్ని నిందించాడని ఈ పద్యం వలన తెలుస్తున్నది. ఆ విధంగా ఇది వ్యాజనిందాలంకారం అవుతున్నది. ఈ విధంగా రోసనూరి వేంకటపతి తన కావ్యంలో ప్రయోగించిన శబ్ద, అర్థాలంకారాలు సందర్భోచితంగా, కథానుకూలంగా ఉన్నాయనిపై నిదర్శనాల వలన తెలుస్తున్నది.

5.4.5. ఎఱగుడిపాటి వేంకటకవి–ఆలంకారిక ప్రయోగం

ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన విష్ణుమాయావిలాసంలో అలంకారిక ప్రయోగం శబ్దార్థయుక్తంగా క్రింది విధంగా కనిపిస్తున్నది.

5.4.5.1.శబ్దాలంకారాలు

వేంకటకవి ప్రయోగించిన శబ్దాలంకారాలలో వృత్యనుప్రాస, ఆదిప్రాస, అంత్యప్రాస, ఛేకానుప్రాస, లాటానుప్రాస, ముక్తపదగ్రస్తం అనేవి ఈ క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

వృత్త్యనుప్రాస

ప్రథమాశ్వాసంలో కాలకూట విషం జనించి, లోకమంతటా వ్యాపించే సందర్భంలోని ఈ క్రింది వర్ణనలో వృత్యానుప్రాస అలంకారం కనిపిస్తున్నది.

"తరుల గిరులను కరులను పురవరముల
నకుల నసురుల సురల ఖేచరుల విశల
కరుల శరధుల నదులను గెరలి తెరలి
యురల దరికొందు విషవహ్ని తిరుగజొచ్చె" (1-192)

పై పద్యంలో రేఫ, లకారం పలుమార్లు ఆవృత్తమై కనిపిస్తున్నది. అందువలన ఇది వృత్యనుప్రాసాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా, "అడిగెదనని గమకించును
నడిగిన నితనికిని కోపమడరిన యేనిన్..." (3-122)

అనే పద్యంలో కూడా వృత్యనుప్రాసాలంకారం కనిపిస్తున్నది.

ఆదిప్రాస

ద్వితీయాశ్వాసంలో మహావిష్ణువును అప్సరసలు స్తుతించిన పద్యంలో ఆదిప్రాసాలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"శోభనమే నగ సుస్థిర ధృతికిన్
శోభనమే నయశోభిత మతికిన్
శోభనమే ఫణిసూదన గతికిన్
శోభనమే నతసూరి వితతికిన్" (2-9)

ఈ పద్యంలో 'శోభనమే' అనే పదం పద్యపాదానికి మొదట్లో పునరావృత్తం అయినందు వలన ఇది ఆదిప్రాసాలంకారం అవుతున్నది.

అంత్యప్రాస

ద్వితీయాశ్వాసంలో లక్ష్మీనారాయణుల కళ్యాణం సందర్భంగా చేసిన విష్ణుస్తుతిలో అంత్యప్రాసాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"శ్రీకరమూర్తికి శ్రీవరదునకున్

నాకవిరోధి వినాశకరునకున్
లోకనివాసికి లోకధరునకున్
ప్రాకట సత్యకృపానిరతునకున్" (2-10)

పై పద్యంలో అన్ని పాదాలకు చివర 'కున్' అనేది పునరావృత్తం కావడం వలన దీనిని అంత్యప్రాసాలంకారంగా చెప్పవచ్చు.

ఇదేవిధంగా, "వేదాంతవేద్యుతా విద్వాంసు లొకవంక
నుత్తమ సత్కవు లొక్కవంక..." (4-198)

అనే పద్యంలో కూడా అంత్యానుప్రాసాలంకారం కనిపిస్తున్నది.

ఛేకానుప్రాస

ప్రథమాశ్వాసంలో హాలాహలం జనించిన సందర్భంలో బ్రహ్మ శివుడిని స్తుతించే పద్యంలో ఛేకానుప్రాసాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"శ్రీగిరిజాధీశ! చిన్మయ! భవనాశ! శశికోటి సంకాశ! శరణు శరణు
గంగా జటాజూట కలిత చంద్ర కిరీట సదముల వృషఘోట శరణు శరణు
సకల వేదాగణ్య! సర్వలోకశరణ్య! సంతతకారుణ్య! శరణు శరణు
గజచర్మ పరిధాన కామితసంధాన! సాధువృష్టి నిధాన! శరణు శరణు"

(1-200.39) ఈ పద్యంలో శివస్తుతి చేస్తూ ప్రతిపాదం చివర 'శరణు' అనే హల్లుల జంటలు అవ్యవధానంగా ప్రయుక్తమైనందువలన ఇది ఛేకానుప్రాస అవుతున్నది.

లాటానుప్రాస

చతుర్థాశ్వాసంలో ద్వారకా నగరానికి వస్తున్న నారదుడి వర్ణనలో లాటానుప్రాసాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"అంతంత నెంతయు నాత్మపద్మంబున
నెక్కొన్న హరిగాంచి చొక్కి చొక్కి
యక్కడక్కడ తత్కథాలాప మాధుర్య
మహిమచేఁ దనమేను మరచి మరచి
యప్పటిప్పటికి దదంఘ్రి సంస్మరణాప్తి
చెందంగ నానంద మంది మంది
యాడాడఁ దత్కృత క్రీడా విలాసముల్
దలపోసె సంతుష్టిఁ జెలగి చెలగి.." (4-51)

ఈ పద్యంలో నారదుడు తన ఆత్మ పద్మంలో నెలకొన్న విష్ణువును దర్శించి ఆనందించడాన్ని 'చొక్కి చొక్కి' అని, విష్ణుకథల ఆలాప మాధుర్యమహిమ చేత పొందిన ఆనంద పారవశ్యాన్ని మేను 'మరచి మరచి' అని, విష్ణుపాద సంస్కరణాప్తి చేత నారదుడు పొందిన ఆనందాన్ని 'మంది మంది' అని, విష్ణుకృతమైన క్రీడావిలాసాలు

తలచుకొని అతడు పొందిన సంతుష్టిని 'చెలగి చెలగి' అని వర్ణించబడింది. ఇక్కడ నారదుడికి కలిగిన ఆనంద పారవశ్యాన్ని సూచించడానికి 'చొక్కి చొక్కి', 'మరచి మరచి', 'మంది మంది', 'చెలగి చెలగి' అనే పదాల జంటలు అర్థభేదం లేకుండా తాత్పర్య భేదంతో ప్రయోగించబడ్డాయి. ఈ జంట పదాలలో మొదటిపదం లౌకికమైన ఆనందాన్ని ప్రకటించేది. రెండవ పదం అలౌకికమైన చిదానందాన్ని ప్రకటిస్తున్నది. అందువలన ఇది లాటానుప్రాస అవుతున్నది.

ముక్తపదగ్రస్తం

పంచమాశ్వాసంలోని శరత్కాల వర్ణనలో ముక్తపదగ్రస్తం క్రింది విధంగా ప్రయుక్తమై కనిపిస్తుంది.

"పద్మతా తనయింటి పగమాన సైతోడు
జేరిన క్రియ శశి సిరి వహించె
సిరి రాక కలరిన చెలువమోయన చంద్ర
కిరణ జాలంబు విస్ఫురణదనరె
చంద్ర కరస్ఫూర్తి సంతతులన భూమి
తరచుగా శరపుష్ప తతి దనర్చె
శర సుమ ప్రతిబింబ సంభృతినయ్యో
నోయట్లన్న నిర్మలంబయ్యెవారి
వారి పూర్ణత సడరె వాహినులను
వాహినుల వెడలిరి నృపుల్ వైరియాత్ర
యాత్రలకు బోవనతిరమ్యమగుచుదనరె
తనకు శరదాగ మంబున ధరణియందు" (5-146)

ఈ పద్యంలో పూర్వపాదంలో విడిచిన పదాన్ని గ్రహించి, తిరిగి ఆ పదంతోనే పద్యపాదాన్ని ప్రారంభించడం కనిపిస్తున్నది. ఇక్కడ సిరి, చంద్ర, శర, వారి, వాహినులు, యాత్ర అనే పదాలు పూర్వపాదంలో విడిచి, తిరిగి వాటితోనే తర్వాత పద్యపాదాన్ని ప్రారంభించినందు వలన ఇది ముక్తపదగ్రస్తం అవుతున్నది. ఈవిధంగా ఎఱగుడిపాటి వేంకటకవి తన కావ్యంలో ప్రయోగించిన శబ్దాలంకారాలు, వాటి ఉదాహరణలను గురించి చెప్పుకోవచ్చు.

5.4.5.2. అర్థాలంకారాలు

వేంకటకవి తన విష్ణుమాయావిలాసంతో ప్రయోగించిన అర్థాలంకారాలు ప్రధానంగా ఈ క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

ఉపమాలంకారం

శివుడు లోకాలను తల్లిడిల్లునట్లుగా చేసిన కాలకూటవిషాన్ని మింగుతున్న సమయంలో ఉపమాలంకార ప్రయోగం క్రింది విధంగా ఉన్నది.

"ముల్లోకంబులు దరికొని
తల్లడపడజేయు విషము తగు మాత్రంబౌ
నల్లో నేరెడు బండ
ట్లనల్లన శంభుండు బట్టె హస్తాబ్జములన్" (1-207)

ఈ పద్యంలో లోకాలనే భయభ్రాంతులను చేసిన కాలకూటవిషం శివుడు తన చేతిలోకి తీసుకోగానే పొందిన రూపం వర్ణించబడింది. ఇక్కడ శివుడి చేతిలోకి వెళ్ళగానే కాలకూటవిషం అల్లోనేరెడు పండులాగ, అంతటి పరిమాణంలో, అలాంటి రంగుతో కనిపించిందని భావం. కాలకూట విషానికి అల్లోనేరెడు పండుతో పోలిక చెప్పినందువలన ఇది ఉపమాలంకారం అని తెలుస్తున్నది.

రూపకాలంకారం

క్షీరసముద్రం నుంచి ఐరావతం జనించిన సందర్భంలో చేసిన వర్ణనలో రూపకాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"కైలాసకుధరమొక్కో
ప్రాలేయాచలమొ యనగ బటుకాయముతో
మేలగు సర్వాంగముల
పొలుచు నైరావతంబు సంభవమయ్యెన్" (1-218)

ఈ పద్యంలో క్షీరసముద్రం నుంచి ఐరావతం కైలాసపర్వతం లాగ పెద్దశరీరంతో, మేలైన అవయవాలతో జన్మించిందని వర్ణించబడింది. ఇక్కడ తెల్లదనంలోను, ఆకారంలోనూ కైలాస పర్వతంలో ఐరావతానికి అభేదం కల్పించబడినందువలన ఇది అభేద రూపకమవుతున్నది.

ఇదేవిధంగా, "పూచిన మోదుగట్టులను భూరితరాస్త్రతనుప్రకాశుడై..." (2-136)

"చానమీగాళ్ళు మరుకేళి చక్రయుగళి..." (2-240)

అనే పద్యాలలో కూడా రూపకాలంకార ప్రయోగం కనిపిస్తున్నది.

ఉత్ప్రేక్షాలంకారం

మాయామోహిని సౌందర్యాన్ని వర్ణించే సందర్భంలో కవి చేసిన ఉత్ప్రేక్షాలంకార ప్రయోగం క్రింది విధంగా ఉన్నది.

"ఆముకురాస్యచారు మధురాధర శర్కర వాసనాప్తిచే
నామహనీయ నాభి మహిరాంతరము వెల్వడి చన్నుగొండలన్
రామణిహార నిర్ఝరులు రాగని దాటలేక నిల్చెనో
చీమల బారునా బొలిచె చెల్వగు నారు మనోహరాంగికిన్" (2-246)

మోహిని మధురాధరముల నుంచి వెలువడుతున్న చక్కెర వాసనకు ఆమె నాభి అనే రంధ్రం నుంచి వెలువడిరాగా, ఎదురుగా చన్నులనే కొండలు వాటి మధ్య మణిహారాలనే

ప్రవాహాలు అడ్డువచ్చినాయి. వాటిని దాటలేక అక్కడే నిల్చిపోయిన చీమలబారు లాగ నూగారు కనిపిస్తున్నదని భావం. ఇక్కడ మోహిని నాభిప్రదేశం నుంచి వక్షస్థలం వరకూ ఉన్న నూగారును, నాభి అనే భూరంధ్రం నుంచి వెలువడి చన్నులనే కొండలు అడ్డురాగా వాటిని దాటలేక నిలిచిపోయిన నల్లచీమలబారు అని ఊహించుట చేత ఇది ఉత్ప్రేక్షాలంకారం అవుతున్నది.

ఇదేవిధంగా,

"నిచ్చరాజసమున నచ్చరాంగనలుండ రచ్చరాలైనట్టు పచ్చటాలు..."(1-163)

"మదగజరాజిదేరులకు మావుతులుం బురికొల్పిప్రేల్మిడిన్..." (2-109)

"నెయ్యముతోన పద్మజుడనే కృషికుండు నిరంతరంబునున్..." (2-238)

"సరసవిహార మందలరి జక్కవలంబరవీధికేగగా..." (2-243)

మొదలైన పద్యాలు ఉత్ప్రేక్షాలంకారానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

స్వభావోక్త్యలంకారం

క్షీరసాగరాన్ని దేవదానవులు మథించే సందర్భంలో వారి హావభావాలు స్వభావోక్త్య అలంకారంగా క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

"ఏలల్పాడుచు కేకలార్భటులచే హేలాగతిన్ దోర్బలా
భీల ప్రక్రియ ప్రజ్ఞలాడుచును గంభీరాట్టహాసంబులన్
హేళిం జిత్తము లుల్లసిల్ల విపులాహంకార హుంకారముల్
సాలం బర్వ నిశాచరుల్గడగి రాశాచక్ర మల్లాడగన్" (1-188)

ఈ పద్యంలో క్షీరసాగరాన్ని మథించేందుకు పూనుకున్న రాక్షసుల చేష్టలు వారి సహజ స్వభావాన్ని ప్రతిబింబించిన తీరు వర్ణించబడింది. రాక్షసులు ఉత్సాహంతో ఏలలు పాడుతూ, కేకలు, ఆర్భటులచేత విలాసంగా ప్రజ్ఞలు పలుకుతూ, గంభీర అట్టహాసాలు చేస్తూ, అహంకారహుంకారాలు ప్రకటిస్తూ క్షీరసముద్రాన్ని మథించారు. ఇక్కడ రాక్షసుల చేష్టలన్నీ వారి స్వభావాన్ని పట్టి చూపుతున్నందు వలన ఇది స్వభావోక్తి అలంకారం అవుతున్నది. ఇదేవిధంగా,

"పట్టిన నట్టిటు చెదరుచు, జిట్టాడు హాలాహలంబు శివుడణగబిగన్" (1-208)

"అనిదిగ్గన లేచి యత్యంత భయ శక్తి..."(3-55)

"ప్రావిటులంపిన పటు భూషణాదులు......" (4-31)

అనే పద్యాలలో స్వభావోక్త్యలంకారం కనిపిస్తున్నది.

యథాసంఖ్యాలంకారం

లక్ష్మీనారాయణుల కళ్యాణఘట్టంలో యథాసంఖ్యాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"క్రమముతో మునులు వేదపాఠములు జదువ

గంగ కాంచన కలశోదకంబు లిడగ
వారినిధిరాజు కన్నియ ధారవోయ
హరి వరించెను ముదముతో నాదిలక్ష్మి” (2-6)

ఈ పద్యంలో మునులు వేదపాఠాలు చదవడం, గంగ బంగారు కలశంతో నీటిని అందించడం, సముద్రుడు కన్యాదానం చేయడం, శ్రీమహావిష్ణువు ఆనందంతో మహాలక్ష్మిని వరించడం అనేవి క్రమంగా చెప్పబడినది. అందువలన ఇది యథాసంఖ్యాలంకారం అవుతున్నది.

ఉల్లేఖాలంకారం

చంద్రుడు క్షీరసాగరం నుంచి జన్మించినప్పుడు చేసిన వర్ణనలో ఉల్లేఖాలంకారం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

“కువలయ జీవితేశ్వరుడు కోమల సీతకరుడు వర్ధనో
త్సవఫలదాయకుండు హిమధాముడు సుందరమందిరుండు జ
క్కవ కవవీడు కోట సితకాయుడు రేమగడంబుజారి మా
ధవ మలయానిలాప్తుడు సుధానిధి చంద్రుడుఁ బుట్టెనంబుధిన్” (1-224)

ఈ చంద్రుడిని కువలయ జీవితేశ్వరుడు, కోమల సితకరుడు, వర్ధనోత్సవ ఫలదాయకుడు, హిమధాముడు, సుందర మందిరుడు, జక్కవకవ వీడుకోట, సితకాయుడు, రేమగడు, అంబుజారి, మాధవ మలయానిలాప్తుడు, సుధానిధి అనే గుణవిశేషణాలతో పలువిధాలుగా వర్ణించుట వలన ఇది ఉల్లేఖాలంకారం అవుతున్నది.

అతిశయోక్త్యలంకారం

ద్వారకానగరంలోని రత్నసౌధాలను వర్ణించే సందర్భంలో ప్రయోగించిన అతిశయోక్తి అలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

“ఆపురిలోపలం గల మహాంధ తమంబునణంప గోరి తా
రేపున జక్రవాళగిరి యెక్కయు నోపక సూర్యచంద్రులు
ద్దీపితమైన తేజముల దీర్చిరిగా తమ నామకంబులన్
గోపురసౌధ రత్నముల కోటి మహోన్నతి దెల్పశక్యమే”(4-15)

ద్వారకానగరంలోని అంధకారాన్ని నశింపజేయాలని సూర్యచంద్రులు చక్రవాళగిరి మీదికి ఎక్కినప్పటికీ వారి ప్రయత్నం ఫలించలేదు. అందువలన సూర్యచంద్రులు ద్వారకానగరంలోని గోపుర సౌధములపైకి ఎక్కి తమ ప్రతిబింబాలను తీర్చిదిద్దినట్లుగా రత్నాలు గోపుర సౌధములపై ప్రకాశిస్తున్నాయని ఈ పద్యానికి భావం. ఇక్కడ ద్వారకా నగరంలోని సాధముల గోపురాలు చక్రవాళ పర్వతం కంటే ఉన్నతములని, సూర్య చంద్రులకంటే ఎత్తుగా ఉన్నాయని అతిశయించి వర్ణించినందువలన ఇది అతిశయోక్తి అలంకారం అవుతున్నది.

దీపకాలంకారం

దేవదానవుల యుద్ధం ప్రారంభసూచకంగా బలిచక్రవర్తి ప్రస్థాన భేరి మ్రోతను వర్ణించునప్పుడు దీపకాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"జగతి బీటలువారి సప్తవారాసులు బుడుబుడు ధ్వనులతోనుడుకు వట్టె
పవన తంతులు పటాపంచలై ధరమీద వెగడుగానక్ష వృష్టి గురిసె
చెవులు చిందరవట్టి చెదరిన గుండెల భ్రమ జెంది దిక్కరుల్ పరువులెత్తె
పద్మభవాండంబు బహిరంబువులు వాడు పగిది నిట్టట్టుగా బెగడితిరిగె
సకలలోకంబు నార్తిని సంచలించె
కుండలేశ్వరుడుడెంతయు బెండుపడియె
దిక్కులన్నియు దిర్ధిర దిరుగ జొచ్చె
భీషణంబగు ప్రస్థాన భేరిమ్రోత" (2-92)

ఈ పద్యంలో భూమండలం బీటలు వారి సప్తసముద్రాలు బుడుబుడు ధ్వనులతో ఉడుకుపట్టడం, మేఘాలు చెదిరిపోయి నేలపై చుక్కలు వానలాగ రాలిపడటం, దిగ్గజాలు గుండె చెదిరి భ్రమతో పరుగులు తీయడం, పద్మభవాండం సముద్రాలు ఆవిరవునట్లుగా తడబడుతూ తిరిగిపోవడం, లోకాలన్నీ ఆర్తినిపొంది సంచలించడం, ఆదిశేషుడు బెండుపడటం, దిక్కులన్నీ దిర్ధిరమని తిరిగిపోవడం అనే సంఘటనలన్నీ బలిచక్రవర్తి మ్రోగించిన ప్రస్థాన భేరి మ్రోత వలన కలిగినాయని వర్ణించడబడింది. ఇక్కడ ఉ మాన, ఉపమేయాలకు మధ్య ఉన్న సామాన్య ధర్మం చేత, పై సంఘటనలు అన్నింటికీ బలి చక్రవర్తి మ్రోగించిన ప్రస్థానభేరి కారణమని చెప్పడం వలన ఇది దీపకాలంకారం అవుతున్నది.

పర్యాయాలంకారం

మహావిష్ణువు కల్పించిన మున్యాశ్రమాన్ని వర్ణించిన సందర్భంలో పర్యాయాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"గొజ్జంగి పూబొదల్ గురిసిన హిమవారి
 కోలముల్ ద్రవ్విన కుల్యసరణి
జారిన వారి కేదారముల్ పూరించి
 చెంగల్వ కొలనులుప్పొంగ నిండి
ఘనసార కాంచన క్రముకపంక్తులవచ్చి
 పసిడి గేదగి మడిపట్ల నెరసి
కురువేరు మరువంపు గుంపులనలరించి
 ద్రాక్ష పందిరులలో దాపుకొనుచు
పర్ణశాలాంగణావృత పారిజాత
చందనాగరుముఖ తరు బృందమూల

చంద్రకాంతోపలంబుల సరవిజుట్టు
వెలయు సంతత శీతలస్థలములందు" (3-105)

ఈ పద్యంలో గొజ్జంగి పూపొదలపై కురిసిన మంచునీరు కాలువలలో ప్రవహించి కేదారములను పూరించి, కాంచనక్రముక పంక్తులను, పసిడిగేదగి మడులను నింపుతూ, కురువేరు, మరువపు గుంపులను తడుపుతూ, ద్రాక్ష పందిరులు, పర్ణశాలలోని పారిజాత, చందన, అగరు, తులసీవనాలలో ప్రవేశించి, చంద్రకాంతోపలమైన సరస్సులో నిండిందని వర్ణించబడింది. ఇక్కడ మంచునీటికి మొదట గొజ్జగి పూపొదలను ఆశ్రయంగా వర్ణించి, ఆ తర్వాత కేదారములు, గేదగిమడులు, మరువపు మడులు, ద్రాక్ష పందిరులు, తులసీ వనం, చంద్రకాంతోపలమైన సరస్సు మొదలైన వాటిని పర్యాయంగా ఆశ్రయాలని వర్ణించుట వలన ఇది పర్యాయాలంకారం అవుతున్నది.

అర్థాంతరన్యాసం

బ్రహ్మ గర్వాన్ని తలచుకొని సరస్వతీదేవి చింతిస్తున్న సమయంలో అర్థాంతరన్యాసాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"లోగన సర్వసమ్మతము లోకహితంబును నాత్మసేమమున్
గాగడు నొత్తి తెల్ప కొరగాములుగా మదినెంచెనక్కటా
కాగల దుష్టకర్మ ఫలకారణమున్ దొలగింపశక్యమే.." (3-47)

ఈ పద్యంలో సరస్వతీదేవి సర్వసమ్మతం, లోకహితం, ఆత్మక్షేమంగా భావించి బ్రహ్మకు విష్ణుమాయా ప్రభావాన్ని వినిపించగా, దానిని బ్రహ్మ తిరస్కారంగా భావించాడు. బ్రహ్మ గర్వంతో సత్యలోకం విడిచి వెళ్ళాడు. బ్రహ్మ అనుభవించవలసిన దుష్టకర్మఫల కారణంగానే అతడికి ఇటువంటి దుష్టబుద్ధి కలిగిందని సరస్వతీదేవి భావన. ఇక్కడ సర్వసమ్మతం, లోకహితం, అయిన మాటలు వినిపించినప్పటికీ వాటిని బ్రహ్మ నిందార్థంలో గ్రహించాడనే విశేష వాక్యాన్ని చెప్పి, అనుభవించాల్సిన దుష్టకర్మ ఫలకారణాన్ని తొలగించడానికి ఎవరికి శక్యం అవుతుందనే సామాన్య వాక్యంతో సమర్థించినందు వలన ఇది అర్థాంతరన్యాసాలంకారం అవుతున్నది

ఇదేవిధంగా,

"ఈపనికొద్దిలో నజునకిచ్చను దోచదు శౌరిమాయచే..." (3-50)
"పడతియెడనున్న పురుషుడు...." (2-192)

అనే పద్యాలలో కూడా అర్థాంతరన్యాసాలంకారం కనిపిస్తున్నది.

సందేహాలంకారం

మాయామోహిని దేవదానవులతో మాట్లాడే సందర్భంలో ఆమె పలుకులను గురించి దేవదానవులకు కలిగిన సందేహం అలంకారంగా క్రింది విధంగా కనిపిస్తున్నది.

"చక్కరతేనెయో సుధయో చంద్రకరంబులొ ద్రాక్షలోయనన్
మక్కువ మాధురీ రస సమన్వితమై తగు ముద్దుపల్కులన్

చక్కెర బొమ్మయిట్లనె నిశాచర దివ్యులు నిందు మత్సరం
బెక్కగ పోరి బెట్టుకొన నేమి కతంబన..." (2-25)

పై పద్యంలో మోహిని పలుకులు ముద్దులొలుకు మాధురీరస సమన్వితంగా, చక్కెర, తేనె, సుధ, చంద్రకిరణాలు, ద్రాక్షఫలాలు వీటిలో ఏదో స్పష్టంగా నిశ్చయించుకోలేని సందేహాన్ని కలిగిస్తున్నాయని వర్ణించడం వలన ఇది సందేహాలంకారం అవుతున్నది. ఇదేవిధంగా,

"పుత్తడి బొమ్మయో! పుత్తడి బొమ్మైన చేతనస్థితి రాజిల్లుటెట్లు..." (2-235)

"పిలిచిన బల్కునో పలుక బెగ్గిలి సిగ్గున చాటుకేగునో..." (2-284)

"నేరుపులేని బాలకుడు నేరమిదెంతని కావజూచునో..." (3-51)

మొదలైన పద్యాలలో సందేహాలంకారం కనిపిస్తున్నది.

భ్రాంతిమదలంకారం

మాయామోహినిని చూసిన సందర్భంలో శివుడి మనస్సులో కలిగిన సందేహం అలంకారంగా ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"కన్నుల కద్భుతంబయిన కాయజు సంహరుడాత్మలోపలన్
కన్నదిగాను మౌని సురకాండములెంతయు సన్నుతింపగా
విన్నదిగాదు ఇట్లువనవీధి నపూర్వ విలాస భాసమై
కన్నులపండు వయ్యెనిది కన్గొనంచును భ్రాంతచిత్తుడై" (2-230)

ఈ పద్యంలో శృంగారవనంలో అపూర్వ విలాసంతో విహరిస్తున్న మాయామోహిని కన్నుల ముందు నిలవగానే శివుడు తనలో, ఆ మాయామోహిని రూపం పూర్వం ఎన్నడూ చూసిందిగాని, మునులు, దేవతలు పొగడగా విన్నదిగాని కాదని, అపూర్వమైన ఆ రూప సౌందర్యాన్ని చూడగా కన్నుల పండుగగా ఉందని భావించాడు. ఇక్కడ అపూర్వమైన, పూర్వం తాను చూడనిది, విననిదీ అయిన మోహిని రూపాన్ని చూసిన శివుడికి కలిగిన భావన అతడి భ్రాంతిని తెలుపుతున్నది. అందువలన ఇది భ్రాంతి మదలంకారం అని చెప్పవచ్చు.

పరికరాలంకారం

శివుడు హాలాహలాన్ని గ్రహించిన సందర్భంలో అతడి మహిమను వర్ణించే పద్యంలో పరికరాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"అవలీలన్ గరుణం జగద్భయదమౌహాలాహలాహారమున్
శివుడెబ్భంగిని నిర్వహించె నహహా శీతాంశుడమౌళిపై
నివసింపగనౌయంచు నందరు మహానిర్విణ్ణులై యంతటన్" (1-209)

ఈ పద్యంలో లోకభయంకరమైన హాలాహలాన్ని అవలీలగా, కరుణతో శివుడు ఏవిధంగా గ్రహించగలిగాడు. శీతాంశుడైన చంద్రుడిని తలపై ధరించినవాడు కాబట్టే హాలాహలాన్ని

భరించగలిగాడు అని లోకాలన్నీ శివుడిని ఆశ్చర్యంతో స్తుతించాయని వర్ణించబడింది. ఇక్కడ లోకభీకరమైన హాలాహలాన్ని శివుడు భరించడానికి, అతడు తలపై చంద్రుడిని ధరించడమే కారణమని సాభిప్రాయమైన విశేషణాన్ని ప్రయోగించినందు వలన ఇది పరికరాలంకారం అవుతున్నది.

విషమాలంకారం

బలిచక్రవర్తి యుద్ధరంగంలో ఎదురైన నరనారాయణులనే మునులను చూసి పలికిన మాటల్లో విషమాలంకార ప్రయోగం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ప్రణవాది సన్మంత్ర పఠనంబుగాదుగా ఘనధనుర్వేదవాక్కౌశలంబు
జపమాలికాశ్రమ చాతురిగాదుగా బాణ సంధానసత్ ప్రౌఢిమంబు
లసదాత్మధ్యాన లక్ష్యంబు గాదుగా శాత్రవకంఠ లక్ష్యప్రసక్తి
ఘనతాపసాభివందన రూఢిగాదుగా ఆరాతి ప్రత్యాహ తాహవంబు" (2-119)

ఈ పద్యంలో బలిచక్రవర్తి తాపసవృత్తితో ఆశ్రమాలలో జీవించే నరనారాయణులనే మునులకు యుద్ధరంగం గురించి చెబుతున్నాడు. ధనుర్వేదకౌశలమంటే ప్రణవాది సన్మంత్ర పఠనం కాదు, బాణసంధాన ప్రౌఢిమ అంటే జపమాలికను త్రిప్పడం కాదు, శత్రువుల కంఠాలనే లక్ష్యాలపై గురిచూడటం అంటే ఆత్మధ్యానంపై దృష్టి నిల్పడం కాదు, శత్రువును ధీటుగా ఎదుర్కోవడమంటే తాపసులకు అభివందనం చేసినంత తేలిక కాదు అని ఈ పద్యంలోని భావం. ఇక్కడ తాపసవృత్తితో జీవించే వారికి కఠినమైన, నిర్దయాపూరితమైన యుద్ధవిద్యలు నిర్వహించడం ఎలా సాధ్యమవుతుందని బలిచక్రవర్తి మాటల్లోని భావం. తాపసులు, సాత్త్వికులు అయిన వారిని కఠినమైన, రాజసగుణ భరితమైన యుద్ధవీరులుగా ఆరోపిస్తూ, వ్యతిరేకమైన భావాలను వర్ణించినందు వలన ఇది విషమాలంకారం అవుతున్నది.

అధికాలంకారం

బ్రహ్మదేవుడు తన ఆధిక్యాన్ని గురించి సరస్వతితో చెబుతున్న సందర్భంలో అధికాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"దారువులందు బట్టు శిఖి దారువులే యశనంబుగా గొనున్
దారువు పావక క్రియల దానొకయించుక మాన్పనేర్చునే
యారయ దారు జాతము హుతాశను నందొక దూషితంబె" (3-23)

ఈ పద్యంలో దారువు నుంచి జన్మించే అగ్ని ఆ దారువునే దహించ గలుగుతుంది. కాని దారువు అగ్నిని ఆర్పడానికి పనికిరాదు. అంతమాత్రాన దారువు నందు పుట్టడం అనేది అగ్నికి దోషాన్ని కలిగించలేదు కదా అని వర్ణించబడింది. ఇక్కడ అగ్ని దారువు నుంచి పుడుతున్నప్పటికీ అగ్నికే ఆధిక్యాన్ని చెప్పడం వలన ఇది అధికాలంకారం అవుతున్నది.

విశేషోక్త్యలంకారం

నారదుడు విష్ణుమాయా ప్రభావాన్ని శివుడికి వినిపించే సందర్భంలో విశేషోక్త్యలంకారం ఈ విధంగా కనిపిస్తున్నది.

"కమలామహాదేవి కాముకత్వమెకాని
వానిమాయ యొకింతగానలేదు
స్రష్టసర్వంబును సృష్టి సేయుటగాని
వాని మహత్వంబు గానలేడు
వేదవేదాంతముల్ వినుతిసేయుట గాని
నిక్కంబు వాని వర్ణింపలేవు
కరకంఠ విను తారకము జపించుటగాని
యమ్మహామహు దెలియంగలేవు..." (2-190)

ఈ పద్యంలో శ్రీమహాలక్ష్మి మహావిష్ణువు హృదయవాసిని అయినాగాని అతని మాయను ఒక్కి కూడా చూడలేదు. బ్రహ్మ సకల సృష్టి చేయును గాని విష్ణుమహత్వాన్ని గ్రహించలేడు. వేదవేదాంతాలు స్తుతించడమేగాని విష్ణువు నిజతత్వాన్ని వర్ణించలేవు. శివుడు తారక మంత్రాన్ని జపించునే గాని మహామహుడైన విష్ణువు స్వరూపాన్ని తెలుసుకోలేడు అని వర్ణించబడింది. ఇక్కడ ప్రస్ఫుటమైన కారణం ఉన్నప్పటికే కార్యం ఉత్పత్తి కాలేదని పై నిదర్శనాల ద్వారా వర్ణించినందు వలన ఇది విశేషోక్త్యలంకారం అవుతున్నది.

కారణమాలాలంకారం

మోహినీ రూపాన్ని వర్ణించే ఈ పద్యంలో కారణమాలాలంకారం ఉన్నది.

"తనుకాంతిగమ్మిన వనభూజములు చుట్టు
తళుకులు మేలపరంజి తళుకులుగను
తరువులపై వ్రాలు మెరుగారు జూపుల
కాటుక రేఖలు కలయ బర్వ
కాటుకరేఖలగమ్మిముద్దుల చిన్నినవ్వు
వెన్నెల తేట నివ్వటిల్ల
వెన్నెల తేటపై వెదజల్లి నట్టుల హస్త
పల్లవకాంతులలముకొ..." (2-228)

ఈ పద్యంలో శృంగారవనంలో మోహిని నిలవగానే ఆమె శరీరపు అపరంజి తళుకులతో వనంలోని చెట్లన్నీ ప్రకాశించాయి. ఆ తరువులపై మోహిని చూపుల కాటుక రేఖలు విస్తరించాయి. ఆ కాటుక రేఖలను కమ్ముకొంటూ మోహిని చిరునవ్వుల వెన్నెల తేటలు వెలుగొందాయి. వెన్నెల తేటపై వెదజల్లినట్లుగా మోహిని హస్త పల్లవ కాంతులు అలముకొన్నాయని వర్ణించబడింది. ఇక్కడ ఉత్తరోత్తర కార్యాలను పూర్వ పూర్వ వస్తువులచేత వర్ణించినందు వలన ఇది కారణమాలాలంకారం అవుతున్నది.

కావ్యలింగం

బ్రహ్మదేవుడు తన మహిమను సరస్వతికి వినిపించే సందర్భంలో కావ్యలింగాలంకారం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"జగములు నాకు నధీనము, జగములకే భర్తనయ్యు జగము సృజింపన్
మిగులనెరవాది గావున, తగు స్రష్టత్వంబు మరియు తగదెవ్వరికిన్" (3-27)

ఈ పద్యంలో బ్రహ్మదేవుడు జగములు తనకు ఆధీనములని చెప్పి, దానిని సమర్థించుకోవడానికి, లోకాలను సృష్టించేందుకు తగినందువల్లనే అతడికి సృష్టికర్త పదవి లభించిందని, లోకంలో ఇంకెవ్వరూ అతడిలాగ సృష్టి నిర్మాణం చేయజాలరని చెప్పుకున్నాడు. అందువలన ఇది కావ్యలింగాలంకారం అవుతున్నది.

అనుమానాలంకారం

చంద్రరేఖను చూసి చంద్రకేతమహారాజు తన మనస్సులో మెచ్చుకొంటున్న సందర్భంలోని ఆమె వర్ణనలో అనుమానాలంకారం క్రింది విధంగా కనిపిస్తున్నది.

"వనలక్ష్మి నిక్కమీ వనితాలలామంబు
కాకున్నచో హస్తకమల యగునె
మదను పట్టపురాణి మానినీ తిలకంబు
కాకున్న మోహనాక్రాంతయగునె
లలిత విద్యుల్ల తా లలనా శిరోమణి
కాకున్న శుంభత్ప్రకాశ యగునె
యతనుని సమ్మోహ నాస్త్రంబు కోమలి
కాకున్న విభ్రమకారి యగునె..." (4-270)

పై పద్యంలో చంద్రరేఖను వర్ణిస్తూ, ఈమె వనలక్ష్మి కాకుంటే చేతిలో కమలం ఉంటుందా, రతీదేవి కాకుంటే మోహం కలిగించ గలుగుతుందా, మెరుపుతీగ కాకుంటే శరీరం ప్రకాశవంతంగా ఉంటుందా, మన్మథుని సమ్మోనాస్త్రం కాకుంటే మోహ విభ్రాంతిని కలిగించ గలుగుతుందా అని వర్ణించబడింది. ఇక్కడ చంద్రరేఖలోని లక్షణాలను బట్టి ఆమెను పై విధంగా నిశ్చయించుట వలన ఇది అనుమానాలంకారం అవుతున్నది.

వ్యాజస్తుతి

దేవతల వలన పరాభవాన్ని పొందిన రాక్షసులు బలిచక్రవర్తితో దేవతల స్వభావాన్ని చెబుతున్న సందర్భంలో వ్యాజస్తుతి అలంకారం ఈ క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఏనాడైనను దేవదైత్యులకు పొత్తెంతేనియుంగల్గునా
ఏనాడైన నిశాచరేశ్వరులు మున్నీయింద్రునిన్నమ్మిరా
ఏనాడైనను శౌరియున్ మనకు మేలింతైన రానిచ్చునా
ఈ నాటన్ భవదీయు నిష్కపట మిట్లింతయ్యె దైత్యేశ్వరా!" (2-87)

ఈ పద్యంలో రాక్షసులు దేవతలతో వారికి గల వైరాన్ని తెలుపుతూ, ఏనాడైనా దేవతలకు రాక్షసులకు పొత్తుకలిగిందా, రాక్షస రాజులు ఏనాడైనా ఈ ఇంద్రుడిని నిమ్మినారా, ఏనాడైనా ఇంద్రుడు రాక్షసులకు కాస్త మేలైనా కలిగించాడా అని బలిచక్రవర్తికి తెలిపారు. ఇక్కడ రాక్షసుల మాటల వలన రాక్షస జాతికి ఓటమి, మరణం, అవమానం కలగడానికి బలిచక్రవర్తి నిష్కపటంగా ఇంద్రుడిని నమ్మడే కారణమని తెలుస్తున్నది. రాక్షసులు బలిచక్రవర్తి నిష్కపటాన్ని స్తుతిస్తూనే, ఇంద్రుడిని నమ్మినందుకు అతడిని నిందిస్తున్నందు వలన ఇది వ్యాజస్తుతి అలంకారం.

వ్యాజనింద

దేవతలు అమృతాన్ని కపటంతో పొందారని తెలుసుకొని రాక్షసులు ఇంద్రుడిని, దేవతలను నిందించే సందర్భంలో వ్యాజనింద అలంకారంగా క్రింది పద్యంలో కనిపిస్తున్నది.

"ఏనాడైనను దేవతల్ మనకు మేలింతైన రానిత్తురా
యేనాడైనను దేవతల్ మనము పొత్తెంతేని కావింతుమా
యీనాటన్ బలిచక్రవర్తి కపటం బింతైన చింతింపకి
ట్లానీచుండగు శక్రుమాయలకు లోనై యింతగావింపడే" (2-45)

ఈ పద్యంలో రాక్షసులు దేవతలు తమకు ఏనాడూ కొంచెమైనా మేలు రానివ్వరని, దేవతలకు వారికి మధ్య స్నేహం ఏనాడూ కలుగలేదని అంటూ, నీచుడైన ఇంద్రుడి మాయమాటల వలన నేడు బలి చక్రవర్తి కపటాన్ని గ్రహించకుండా స్నేహం చేశాడనీ అన్నారు. ఇక్కడ రాక్షసులు దేవతల వలన వారికి కలిగిన పరాభవానికి ఇంద్రుడు చెప్పిన మాయమాటలను బలిచక్రవర్తి నమ్మడమే కారణమని భావించి, ఇంద్రుడిని నీచుడని నిందించడం వలన ఇది వ్యాజనింద అలంకారం అవుతున్నది.

ఎఱగుడిపాటి వేంకటకవి రచించిన విష్ణుమాయా విలాసంలోని శబ్ద, అర్థాలంకారాలు అన్నీ కూడా కథాసంధర్భాన్ని అనుసరించి ప్రయోగించినవని కవి చూపిన నిదర్శనాల వలన తెలుస్తున్నది. ఈవిధంగా వేంకటకవి విష్ణుమాయా విలాసంలోని ఆలంకారికతను గురించి చెప్పుకోవచ్చు.

5.5. ఔచిత్యం

కావ్యరచనలో కవికి గల ఔచిత్యదృష్టి ఆ కావ్యాన్ని రసభరితం చేస్తుంది. కావ్యరచనలో అనౌచిత్యం అనేది రసభంగానికి హేతువు అవుతుంది. కవి తనకావ్యంలో పాత్రస్థాయిని, దాని మానసిక స్థితిని బట్టి, సందర్భశుద్ధిని గ్రహించి, లోకరీతిని అనుసరించి చేసిన పద్యరచన ఆ కావ్యానికి ఔచిత్యాన్ని కలిగిస్తుందని చెప్పవచ్చు. విష్ణుమాయ విలాసకావ్యాలలోని ఔచితీమంతమైన పద్యరచనా రీతిని గురించి క్రింది విధంగా చెప్పుకోవచ్చు.

5.5.1. చింతలపూడి ఎల్లనార్యుడు–ఔచిత్యపోషణ

ఎల్లన తన కావ్యంలో చేసిన వర్ణనలలో ఔచితీమంతమైన పద్యాలు అనేకం కనిపిస్తున్నాయి. పాత్రోచితంగా, కథానుకూలంగా, రసబంధురంగా రచించిన ఈ పద్యాలు ఎల్లన పాటించిన ఔచిత్యానికి నిదర్శనాలుగా చెప్పుకోవచ్చు.

"ఇరువది యేడులయ్యె మన మిద్దరముంగవగూడి యెందునే
యెరుసును లేక యుండితిమి యీ సరికిన్ విధియింతమీదనే
వెరపునఁ బెట్టునో యెఱుగ వృద్ధులుఁ బుత్రియుఁ బోవ దుఃఖసం
భరితులమైతిమి య్యడలు పాటున కంటెను లేమినొప్పిడున్" (3–185.107)

ఈ పద్యం పుండరీకోపాఖ్యానంలో పుండరీకుడు తన బోయ ఇల్లాలితో మాట్లాడుతున్న సందర్భంలోనిది. కరువు ముట్టడికి అత్తమామలు, కుమార్తె మరణించిన బాధతో పుండరీకుడు దైన్యత నిండిన హృదయంతో పై విధంగా పలికాడు. మాయా ప్రభావంతో పుండరీకుడు తన మనసులోని మాటలను బోయ ఇల్లాలికి వినిపించినందు వలన ఈ పద్యం ఒక్కసారి చదవగానే సులభంగా అర్థమవుతూ, శైథిల్యతను కలిగి ప్రసాదగుణ యుక్తంగా ఉందని చెప్పవచ్చు. ఈ పద్యంలోని వాడుక మాటలు పాత్ర మనస్థితిని తెలుపుతున్నాయి. 'ఇరువది యేడులయ్యె' అనడంలోని దీర్ఘత పుండరీకుని శోకానికి, దీనత్వానికి సూచకంగా ఉంది. కుమార్తె మరణం వలన కలిగిన దుర్భరమైన శోకం 'విధియింత మీదనే వెరవునఁ బెట్టునో' అనే మాట వలన తెలుస్తున్నది. ఈ విధంగా ఈ పద్యంలోని ఔచిత్యాన్ని మనం తెలుసుకోవచ్చు.

"వీనులు సంతసిల్లె నరవింద దళేక్షణ తావకీనవా
చానయ మాధురిన్ సకల సమ్మతమయ్యె భవత్ప్రయోజనం
బీనిపుణత్వమీ జగతి నెవ్వరికున్నది మమ్ము మన్మథా
ధీనుల నీసురాసురుల నేలుము పుణ్యకటాక్ష దృష్టులన్" (4–34)

ఈ పద్యంలో మాయామోహిని సౌందర్యానికి మోహితులై దేవదానవులు పలుకుతున్న మాటలు వర్ణించబడ్డాయి. మోహినీ రూపసందర్శనం వలన దేవతలు, రాక్షసులకు కలిగిన మదన పారవశ్యం వారి మాటల్లో వినిపిస్తున్నది. మోహిని రూపసౌందర్యానికి మరులుకొన్న దేవదానవులు, ఆమె మాటలు వినగానే 'వీనులు సంతసిల్లె' అని ప్రకటించడం వారి మోహపారవశ్యానికి నిదర్శనం. మోహిని రూపమే కాకుండా మాటలు కూడా వారికి శృంగారాతిరేకాన్ని కలిగించేలా రచించినందు వలన ఇది మాధుర్యగుణ భరితమవుతున్నదని చెప్పవచ్చు. దేవదానవుల మనోభావానికి తగినట్లు సందర్భోచితంగా రచించిన ఈ పద్యం ఔచితీమంతంగా ఉందని చెప్పవచ్చు.

"కుంఠీభూత దురింద్రియాగ్రహుడు చక్షుఃపీత పుష్పాయుధో
త్కంఠుండు గ్రవిలోచనుండు ఘనయోగధ్యాన చిన్మూర్తిశ్రీ

కంతుండట్టి మహాత్మునిం భ్రమలఁ జిక్కంబెట్టు నెట్లైన వై
కుంతుం డెవ్వరి మోసపుచ్చఁడొకనత్ క్షుద్రైక మాయాగతిన్" (4-108)

ఈ పద్యంలో మోహినిని చూడాలనే పంతంతో వైకుంఠానికి వెళుతున్న శివుడిని చూసి దేవతలు తమలో అనుకుంటున్న మాటలు వర్ణించబడ్డాయి. శివుడు నారదుని మాటల వలన కలిగిన రోషంతోను, విష్ణుమాయకు తాను భ్రమించననే పంతంతోనూ వైకుంఠానికి వెళుతున్నాడు. ఈ మాటలు దేవతలు పలికినవే అయినప్పటికీ, ఇందులో ఉద్దేశించింది మాత్రం శివుడినే. ఆ శివుడు మనస్సులో రోషంతోను, పంతంతోనూ ప్రయాణిస్తున్నాడు. అందువల్లనే 'కుంఠీభూత దురింద్రియా గ్రహుడు' అనే విశేషణం ప్రయోగించబడిందని తెలుస్తుంది. ఈ పద్యంలో ప్రయోగించిన విశేషణాలు, పరుషమైన వర్ణాలు మొదలైనవన్నీ శివుని మనస్థితికి తగినవిధంగా ఓజోగుణయుక్తంగా ఉండటం వలన ఇందులోని ఔచిత్యం మనకు అవగతమవుతున్నది.

ఈ విధంగా ఎల్లన తన కావ్యంలోని అనేకతావుల్లో సందర్భానుసారంగా, పాత్ర మానసిక స్థితిని అనుసరించి చేసిన పద్యరచన ఔచిత్యంతో కూడిఉన్నదని పై నిదర్శనాల వలన తెలుస్తున్నది.

5.5.2. కంకంటిపాపరాజు-ఔచిత్యపోషణ

పాపరాజు యక్షగానంలోని ఔచిత్యపు రచన క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఎటువలె వేగింతు నింక అల్ల
మటుమాయలాడి కౌగిటికిఁ జిక్కకపోయె
పరిపరి వగలచే బంతియాడు
తరిఁ జమరించు నయ్యింతి
మురిపెంపునగుమోము ముద్దాడఁ బోయిన
మెఱుగుటద్దములోన మించు చందురుఁ డాయె" (పుట.43)

ఈ మాటలు శృంగారవనంలో చేతికి చిక్కినంతలోనే మాయమైన మోహినిని గురించి శివుడు పలుకుతున్నవి. మోహిని కంటికి కనిపించి మరులు కలిగించి చేతికి అందేలోగా అదృశ్యమైందని శివుడు నిర్వేదంతో పలుకుతున్న మాటలు అనడానికి ఆధారంగా 'ఎటువలె వేగింతు నింక' అనేది ఇక్కడ విశేషంగా కనిపిస్తున్నది. మోహిని కనిపించలేదనే దిగులు చేత శివుడికి కలిగిన దైన్యతకు అనుగుణంగా ప్రసాదగుణంతో రచించిన పై పద్యం పాపరాజు ఔచిత్యపు రచనకు నిదర్శనం.

"అలివేణి నీ నుదురు వలె వెలయుననికదా
యల బాలచంద్రు శిరసావహించితిని
కలికి నీనడలతోఁ గలహించునని కదా
అలగంధ గజము గండణచి వేసితిని
కలకంఠి నీ చూపు బెళుకు గలదనికదా

అల లేడిc జేపట్టి యాదరించితిని" (పుట. 54)

ఇవి మోహినితో శివుడు పలికిన మధురోక్తులు. మోహిని మీది మోహంతో శృంగార వనంలో తిరుగుతున్న శివుడు ఎదురుగా ఆమె కనిపించగానే పైవిధంగా పలికాడు. మోహిని మీద శివుడికి కలిగిన మోహాతిశయం అతడిని పైవిధంగా పలికించింది. శివుడు అనునయంగా, మధురంగా మాట్లాడుతూ మోహినికి అభిమానపాత్రుడు కావాలనే తహతహ ఈ మాటల్లో వ్యక్తమవుతున్నది. తాను ధరించిన 'బాలచంద్రుడు', 'లేడి' మొదలైన వాటితో మోహిని అంగసౌందర్య వర్ణన చేయడం వలన ఇది మాధుర్యగుణ భరితమవుతున్నది. శివుడి మనస్సులో మోహినిపై గల అనురాగాన్ని మధురంగా వెల్లడించిన ఈ రచన ఔచిత్యంగా ఉన్నదని చెప్పవచ్చు.

"కినుకరదనములు కిటగిట గీటువారు
మొగమెఱ్ఱువార బొమముడి వెట్టువారు
శివుని నిందింపవచ్చితె యనెడివారు
ఇచట నితని ప్రతిష్ఠలేమి యనువారు" (పుట. 22)

ఈ మాటలు నారదుని నిందిస్తున్న ప్రమథుల కోపావేశాన్ని ప్రకటించే సన్నివేశం లోనివి. శివనింద చేసిన నారదునిపై ప్రమథులకు కలిగిన కోపాన్ని తెలుపుతున్న పై వర్ణన ఓజోగుణయుక్తంగా ఉన్నందు వలన ఔచిత్యతను సంతరించుకున్నదని చెప్పవచ్చు. ఈవిధంగా విష్ణుమాయా విలాస యక్షగానంలో పాపరాజు చేసిన ఔచిత్య రచనను గురించి చెప్పుకోవచ్చు.

5.5.3. కంకంటి నారసింహకవి–ఔచిత్యపోషణ

నారసింహకవి కావ్యంలోని ఔచిత్యపు రచన క్రింది విధంగా కనిపిస్తున్నది.

"పరమదైన్యంబునc బలికె నోయింతి
యిరువది యేండ్లయ్యెనే నిన్నుcగూడి
యీవరకును మనమిరువురమేక
భావంబుతోనెబాయ కుండితిమి
చెలియింక విధి యేమి సేయనున్నదియొ
తెలియదు వృద్ధులు దెగిరి గారాబు
కూతురు బోయె నిగ్గురు శోకవహ్ని
చేతc దపింప హెచ్చెనులేమియొకటి" (పుట. 84)

ఇక్కడ పుండరీకుని మాటల్లో కనిపిస్తున్న దైన్యత, దుఃఖం అనేవి ఈ రచనలోని శైథిల్యత వలన ప్రసాద గుణయుక్తమవుతున్నాయి. కరువు కాటకాల వలన పుండరీకునికి కలిగిన శోకం, అతని దీనస్థితి, మానసికస్థితి అనేవన్నీ ఇందులో సందర్భానుకూలంగా రచించినందు వలన ఇందులోని ఔచిత్యం మనకు స్పష్టమవుతున్నది.

"భళిరె లేఁబ్రాయంపు బాపురే చెలువ
మెలనాగయైనచో నిటులుండవలదె
కనుగొను మగల నీగతి భ్రమయించి
మనములఁ గరగించుమగువలు గలరె
సొగసులత్తుక జొత్తు సోకఁజేయుచును
దగెదీని యడుగులు తలిరులఁదెగడి" (పుట. 136)

ఈ మాటలు శివుడు మాయామోహిని సౌందర్యాన్ని వర్ణిస్తున్న సందర్భంలోనివి. మోహిని రూపసౌందర్యానికి మరులుకొన్న శివుడు తన మనస్సులోని శృంగార భావాన్ని వెల్లడించేందుకు అనువుగా రచించిన ఈ పంక్తులలోని ఔచిత్యం మాధుర్యగుణంతో ప్రకాశిస్తున్నదని చెప్పవచ్చు.

"ప్రాకారగోపుర ప్రాసాద మంట
పాకారములు మాసి యటగాసియయ్యెఁ
బర్యంక భూషణాంబర గంధమాల్య
హార్యలంకారంబు లన్నియు నడిగె
సౌవర్ణరత్న ధ్వజచ్ఛత్ర చామ
రావళి బిరుద చిహ్నములుడివోయె
వారణ హయభట వ్రాత రథాని
వారణసైన్య గర్వ జయంబుదీఱె" (పుట. 35)

ఈ వర్ణన మహాలక్ష్మి ఈర్ష్యవలన కలిగిన క్రోధంతో వైకుంఠపుర వైభవాన్ని నశింపజేసిన సందర్భంలోనిది. మహాలక్ష్మి జూదంలో ఓడినందుకు, భూదేవి ముందు అవమానం కలిగినందుకు, విష్ణువు మాయ చేసి భ్రమించినందుకు ఈర్ష్య, అసూయలు క్రోధంగా పరిణమించగా వైకుంఠపురాన్ని క్షణంలో శూన్యమయం చేసింది. ఇక్కడ మహాలక్ష్మికి కలిగిన కోపానికి పర్యవసానంగా పాడుపడిన వైకుంఠపురాన్ని దీర్ఘ సమానాలతో, ఓజోగుణంతో వర్ణించుట చేత ఇది ఔచిత్యాన్ని సంతరించుకుంటున్నదని చెప్పవచ్చు.

ఈవిధంగా కంకంటి నారసింహకవి కావ్యంలో చేసిన ఔచితీమంతమైన రచనను గురించి పై నిదర్శనాల ఆధారంగా తెలుసుకోవచ్చు.

5.5.4. రోసనూరి వేంకటపతి–ఔచిత్యపోషణ

వేంకటపతి కావ్యంలో ఔచిత్యం కలిగిన పద్యరచన క్రింది విధంగా కనిపిస్తున్నది.

"నీవాడ నీదు దాసుడ
భావజ విరహాగ్ని పాలబడకుండగనన్
గావుము తమి నిలుపగ లేఁ
గావున నీకౌగిలిచ్చి గావుమునన్నున్" (3–88)

మదనాంతకుడైన శివుడే మోహిని సౌందర్యానికి మరులుకొని దాసుడైనాడు.

ఆ సందర్భంలోని మోహినితో శివుని వేడుకోలును పై పద్యం వర్ణిస్తున్నది. శివుడు విరహభావంతో దీనుడై మదన తాపాన్ని భరించలేక మోహినితో 'నీవాడ నీదు దాసుడ'నని వేడుకోవడం వలన ప్రసాదగుణ యుక్తమైన ఈ పద్యం ఔచిత్య రచనకు నిదర్శనంగా కనిపిస్తున్నది.

"కన్నుల నిద్రదేరఁ బలు గాటుల మోవి చలింపఁజన్నులన్
గ్రొన్నెలవంక లీననెరి గొప్పున జుట్టిన పూలు వ్రాలగా
నెన్నుదురున్ జెమర్పనెదనీటగు గంధము చిట్లనిట్టులి
క్కన్నియతో రమించు వగగానని వానికి జన్మమేటికిన్" (1-94)

అమృతాన్ని వడ్డిస్తున్న మోహినీ సౌందర్య విలాసాన్ని చూసి దేవదానవుల మనస్సుల్లో కలిగిన కోరికకు రూపమే ఈ పద్యం. అమృత వడ్డనకన్నా మోహిని శృంగార విలాసమే వారి కన్నులకు విందు చేసింది. మోహిని సౌందర్యానికి మోహపరవశులైన వారి మనోభావాల్ని మాధుర్యగుణంతో ప్రకటించడమే ఈ పద్యంలోని ఔచిత్యమని చెప్పవచ్చు.

"గిటగిట పండ్లు గీటుచును గ్రిక్కిరియన్ మునుచుట్టి ముట్టియున్
బెట బెటలైన పల్కులను భీషణ భంగులఁబేలి యుగ్రునిన్
దటవట లాడెనే యెదురు తన్ను నెఱుంగక పోవనీకుడె
ప్పటివలె వేగమే గదిసి పట్టుడు బాసకటారి బాపనిన్" (1-105)

శివుడిని చులకన చేసినందుకు నారదునిపై ప్రమథులకు కలిగిన కోపానికి పర్యవసానమే ఈ పద్యం. శివనింద చేసిన నారదుని చూసి కోపావేశంతో ప్రమథులు దండించేందుకు పూనుకోవడాన్ని ఓజోగుణంతో ప్రకటించడమే ఈ పద్యరచనలోని ఔచిత్యంగా చెప్పవచ్చు.

ఈవిధంగా వేంకటపతి కావ్యంలో ప్రయుక్తమైన పద్యరచనలోని ఔచిత్యాన్ని గురించి చెప్పుకోవచ్చు.

5.5.5. ఎఱగుడిపాటి వేంకటకవి–ఔచిత్య పోషణ

వేంకటకవి విష్ణుమాయావిలాసంలో ఔచిత్యాన్ని ప్రకటించే పద్యరచన క్రింది విధంగా కనిపిస్తున్నది.

"ఏనాడైనను దేవతల్ మనకు మేలింతైనరానిత్తురా
యేనాడైనను దేవతల్ మనము పొత్తెంతేని కావింతుమా
యీనాటన్ బలిచక్రవర్తి కపటం బింతైన చింతింపకి
ట్లానీచుండగు శక్రుమాయలకు లోనై యింతగావింపడే" (2-44)

దేవతలు మాయోపాయంతో అమృతాన్ని పొందారని, తాము మోసపోయామని తెలిపిన సందర్భంలో రాక్షసుల మనస్సులోంచి వెలువడిన ఆవేదనకు ఈ పద్యం నిదర్శనం. పూర్వం నుంచీ దేవదానవుల మధ్య గల జాతివైరాన్ని మరిచి బలిచక్రవర్తి ఇంద్రుని

చేరదీసి, అతడి మాటలు నమ్మినందువల్లనే తాము మోసపోయామని రాక్షసుల భావన. వారి ఆవేదనను ప్రసాదగుణ యుక్తంగా వెల్లడించిన ఈ పద్యం ఔచిత్యపు రచనకు నిదర్శనంగా కనిపిస్తున్నది.

"మంగళ శీతవాతమును మానిని సహించి చీరమున్
గొంగొక కట్టుగట్టి మరికోక కుచంబులనొత్తి పట్టుకే
లంగరు లొయ్యబట్టు రతిలంపట గుబ్బల పచ్చిగోళ్ళుక
న్నుంగవ కెంపు మోవి పలునొక్కులతో బడలిట్లు వెల్వడెన్" (5-129)

ఈ పద్యం చంద్రరేఖ, చంద్రకేతుల సంభోగ శృంగారం తర్వాత చేసిన వర్ణనలోనిది. చంద్రరేఖ సంభోగ చిహ్నాలతో, రతిసుఖ పారవశ్యంతో శోభన గృహం నుంచి వెలువడి వచ్చినప్పుడు చెలికత్తెలు చూసిన ఆమె రూపాన్ని మాధుర్యగుణంతో వర్ణించినందు వలన ఈ పద్యంలోని ఔచిత్యం వెల్లడవుతున్నది.

"మీరల్భూరి తపోమహత్వమున నెమ్మిన్ గోరుచున్నట్టియా
స్వారాజ్యాధిపుడైన శక్రుడు సదా సంప్రీతితో గొల్వగా
ధీరోదాత్తత మూడు లోకములు సందీప్తంబుగా నేలితిన్
మీరాననెన్నెదిరించు వారల హహా మెచ్చుందగు మిమ్ములన్" (2-121)

బలిచక్రవర్తి దేవతలు చేసిన మోసానికి ప్రతిగా యుద్ధానికి సన్నద్ధుడైనాడు. రణరంగంలో ఇంద్రుని పక్షాన పోరాడేందుకు వచ్చిన నరనారాయణులనే మునులను చూసి, ఇంద్రుని మీద గల కోపాన్ని బలిచక్రవర్తి దర్పంతో ప్రకటిస్తున్న ఈ పద్యం ఓజోగుణంతో రచించబడింది. బలిచక్రవర్తి క్రోధాన్ని ప్రకటించేందుకు ఓజోగుణ యుక్తంగా రచించినందు వలన ఈ పద్యంలోని ఔచిత్యం ప్రస్ఫుటమవుతున్నదని చెప్పవచ్చు. ఎఱగుడిపాటి వేంకటకవి కావ్యంలోని ఔచిత్య రచనను గురించి పై నిదర్శనాల ఆధారంగా తెలుసుకోవచ్చు.

ఈ విధంగా విష్ణుమాయావిలాస కావ్యాలలో సందర్భోచితంగా, పాత్రను దృష్టిలో పెట్టుకొని ఔచితీమంతంగా చేసిన పద్య రచనను గురించి చెప్పుకోవచ్చు.

## 5.6. దేశీయత

కవి తన కావ్యంలో సందర్భవశాన ఇతివృత్తానికి వాస్తవికతను కల్పిస్తూ చేసేటువంటి వర్ణనలో దేశీయతను ప్రతిఫలించేటువంటి కొన్ని పలుకుబడులు, నానుడులు కనిపిస్తాయి. కావ్యరచనలో కవి ప్రయోగించేటువంటి జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తులు, నీతులు మొదలైనవన్నీ ఆ కావ్యంలోని దేశీయతకు నిదర్శనాలని చెప్పవచ్చు. విష్ణుమాయావిలాస కావ్యాలలో కనిపించేటువంటి జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తులు, నీతులు మొదలైన వాటి ప్రయోగాలను ఈ నిదర్శనాల ఆధారంగా తెలుసుకోవచ్చు.

5.6.1. చింతలపూడి ఎల్లనార్యుడు–దేశీయత

ఎల్లన తన విష్ణుమాయానాటకంలో కథాసందర్భానికి అనుగుణంగా, పాత్రోచితంగా ప్రయోగించిన జాతీయాలు, సామెతలు క్రింది విధంగా ఉన్నాయి.

5.6.1.1. జాతీయాలు – పలుకుబడులు

తెలుగు భాషకు ప్రత్యేకమై, తెలుగు దేశీయతాముద్రను ప్రకటించేటువంటి జాతీయాలు, పలుకు బడులు విష్ణుమాయానాటకంలో ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| బూమెలవలపులు | (1–195) | ఆకటి చిచ్చు | (3–187) |
| కప్పరపడి చూచు | (1–205) | కుండబడుగులు | (3–187) |
| మేలు చేయయ్యేను | (2–18) | ఆకలినీరుపట్లు | (3–188) |
| జూదరికాని చందములు | (2–25) | సన్నపుబుద్ధి | (3–344) |
| నీళ్ళలోవ్రాత | (2–28) | కొయ్యతనము | (4–9) |
| పొలిదరుగక | (2–58) | కామునకు బొమ్మగట్టి | (4–87) |
| నీఱుగవిసియున్న నిప్పు | (2–100) | కలిమి చూపులు | (4–152) |
| త్రొక్కిచూచు | (2–175) | యెఱుకమాలి | (4–163) |
| గతజలసేతువు | (2–176) | ఉడుకెత్తి | (4–271) |
| నోటిక్రొవ్వన | (3–65) | కడతేఱు | (5–64) |
| పొంపిరి వోవుచూపు | (3–145) | ఆటపట్లు | (5–66) |
| చేతికందిన ఫలమట్లు | (3–150) | పట్టపసలేని | (5–156) |
| వెక్కురు దైవము | (3–157) | మందలించు | (5–158) |
| చేరిక మాటలు | (3–160) | తగవుమాటలు | (5–181) |
| ఎత్తుకెత్తు | (3–179) | నిప్పులుమియు | (5–209) |

మొదలైన విధంగా ఎల్లన కావ్యంలోని జాతీయలు, పలుకుబడులు కనిపిస్తున్నాయి.

5.6.1.2. సామెతలు – లోకోక్తులు – నీతులు

కావ్యంలో ప్రయుక్తమయ్యే సామెతలు, లోకోక్తులు, నీతులు, సూక్తులు మొదలైనవి ఆ కవికున్న జీవితానుభవాన్ని, లోకరీతి పరిశీలనా పటిమనూ వెల్లడిస్తాయి. విష్ణుమాయానాటకంలో ఎల్లన ప్రయోగించిన సామెతలు, లోకోక్తులు, నీతులు, సూక్తులు మొదలైనవి క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

| | |
|---|---|
| ఎక్కిన వానికి ఏనిక గుజ్జంచ | (2–110) |
| ముంతెడు నీళ్ళను మునుగుచు కాఱఱుపులఱుచు మూఢుడు | (3–52) |
| మానిసి మానిసిందిను కఱువు | (3–184) |
| ఎగ్గులు పెట్టునె తండ్రి పుత్రునిపై | (3–344) |
| మనసుపండని సన్యాసి | (3–323) |

చేతికందిన ఫలంబను భవింపనేరక (4-40)
కర్మయుగ్మక మవిద్యం జెందు చందంబునన్ (4-23)
అత్తతలవి చేతులంగడియవి కన్నులనెడు జాడ (4-45)
తోయజనేత్రుల వలపులు మాయలు గాకవియు
నిజమె మహినూహింపన్ (4-48)
భాగ్యహీనుడేల ఫలము నొందు (4-280)
అతివలబలలు ముగ్ధలు (5-24)
అతి పరిచయాదవజ్ఞా (5-28)
రాజాంతే నరకం వ్రజేత్ (5-93)

ఎల్లన తన కావ్యంలో ప్రయోగించిన సామెతలు, లోకోక్తులు, లోకరీతిని తెలిపేటువంటి నీతులు పై విధంగా కనిపిస్తున్నాయి. ఈ విధంగా ఎల్లన కావ్యంలోని జాతీయాలు, సామెతలు అతని దేశీయతాభిమానానికి నిదర్శనంగా ప్రకటితమైనాయని చెప్పవచ్చు.

5.6.2. కంకంటిపాపరాజు-దేశీయత

పాపరాజు యక్షగానంలో ప్రయుక్తమైన జాతీయాలు, సామెతలు క్రింది విధంగా ఉన్నాయి.

5.6.2.1. జాతీయాలు - పలుకుబడులు

| | | | |
|---|---|---|---|
| పులిదండి | (పుట. 8) | పాటియెఱుగక | (పుట. 29) |
| బలిమిసెడి | (పుట. 15) | మాయదారి | (పుట. 28) |
| దంటతనమున | (పుట. 19) | సూడుదీరగ | (పుట. 29) |
| మందెమేలమున | (పుట. 22) | బయలుమెఱసి | (పుట. 30) |
| మిత్తి మదమణంచి | (పుట. 28) | పటికనార్చినపైడిబొమ్మ | (పుట. 44) |

5.6.2.2. సామెతలు - లోకోక్తులు

పెన్నిధాన మెదుటఁ గన్న పేదకరణి (పుట. 42)
చేతనున్న ధనంబుపోయిన చింతనొందు నాతని రీతి (పుట. 43)
కలలో గన్న బంగారాయె (పుట. 44)
ఆకలిగొన్న వాడమృతంబుగన్న చెన్నున (పుట. 54)
తృష్ణాతురుండు చలిపందిరిఁ జెందిన చందంబున (పుట. 54)

మొదలైన రీతిగా కంకంటిపాపరాజు యక్షగానంలో జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తుల ప్రయోగాలు కనిపిస్తున్నాయి.

5.6.3. కంకంటి నారసింహకవి-దేశీయత

నారసింహకవి తనకావ్యంలో ప్రయోగించిన జాతీయాలు, పలుకు బడులు, సామెతలు, లోకోక్తులు ఈ విధంగా కనిపిస్తున్నాయి.

5.6.3.1. జాతీయాలు – పలుకుబడులు

| | | | |
|---|---|---|---|
| మేల్బంతి | (పుట.4) | చేతిపందెము | (పుట.33) |
| తండోపతండములు | (పుట.4) | నీటిలో వ్రాతలు | (పుట.43) |
| చిఱుతమాయలు | (పుట.7) | నెఱమంచుతెరలు | (పుట.43) |
| కరతలామలకము | (పుట.7) | ఒద్దిచెలులు | (పుట.43) |
| ఎదపట్టులేక | (పుట.11) | నివురుగప్పిననిప్పు | (పుట.45) |
| మెదుకొండుమెక్కి | (పుట.11) | కన్నులగానకుండు | (పుట.47) |
| గడుసరి | (పుట.11) | పొడచూపు | (పుట.47) |
| ఉడుకొందకుండ | (పుట.12) | మందెమేలమున | (పుట.49) |
| కైకలుపు | (పుట.13) | తలమోచి | (పుట.54) |
| దండంబువెట్టు | (పుట.14) | తఱిమిమాటాడు | (పుట.54) |
| పోరుపాపము | (పుట.14) | తహతహపడు | (పుట.56) |
| సానదేఱనిమణి | (పుట.15) | వెలవెలనగుచు | (పుట.56) |
| అలవిగాకుండు | (పుట.15) | వేడుకలూఱగ | (పుట.64) |
| వేడుకఁజెంది | (పుట.17) | ఎఱుకమాలి | (పుట.65) |
| చిలుపచెమటలు | (పుట.22) | పరువుళ్ళుద్రొక్కె | (పుట.79) |
| దొడ్డ గర్వము | (పుట.23) | గగ్గులకాడు | (పుట.80) |
| నెఱవాది తనము | (పుట.26) | నీచకాలము | (పుట.84) |
| చిడిముడిపాటు | (పుట.26) | వెలవెలబోయి | (పుట.111) |
| కొరగావు | (పుట.32) | వీనులవిందుగా | (పుట.129) |
| మేలుచెయ్యి | (పుట.33) | | |

5.6.3.2. సామెతలు – లోకోక్తులు

పుడమిలోఁగలిగిన భూరి జంతువుల యదుగులన్నియు
నేనుఁ గడుగులోనివియె (పుట.9)

కంటికి కనురెప్ప కరణిగాచు (పుట.12)

ఎక్కిన వానికి నిభము గుజ్జనుట (పుట.47)

మొఱుకులై పుడిసెట మునిగి కాఱఱపులఱచు మూఢాత్ములు (పుట.65)

స్థానమొక్కటిలేక జనియింపదెద్దియైన (పుట.67)

భాసురచంద్ర బింబము కాంతి డంబుఁగాసిఁ బొందింపదేకందు గాన్పించి (పుట.80)

పనిబూను జడునకు బ్రహ్మభావంబు మొనయునే దుష్కర్మములె దోచుగాక (పుట.97)

పురుషుల తలపులెప్పుడు చంచలములు తరుణుల గూర్చి తత్తరమందుటరుదె (పుట.99)

ఎగ్గుజేసినను కన్నతండ్రి కుమారుఁ గాపాడకున్నె (పుట.105)

విపులార్థమొకటి బలియురు గొనc గుందు బలహీనులట్లు (పుట.113)
బాలుర భ్రమియించు బలుబూమెమాట లాలించి
భ్రమయునే యార్యుడెందైన (పుట.122)
నూతిలో మునుగు మండూకంబు రీతి (పుట.130)
హస్తగతంబైన యర్థంబు సనినc గస్తిc బొందెడు వానిగతి (పుట.139)
మొదలైన విధంగా కంకంటి నారసింహకవి కావ్యంలో జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తులు ప్రయుక్తమైనాయని చెప్పవచ్చు.

5.6.4. రోసనూరి వేంకటపతి–దేశీయత

వేంకటపతి తన విష్ణుమాయా విలాసంలో ప్రయోగించిన జాతీయాలు, పలుకుబడులు, సామెతులు, లోకోక్తులు ఈ క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

5.6.4.1. జాతీయాలు–పలుకుబడులు

| | | | |
|---|---|---|---|
| నెలపువ్వు | (1–5) | కులుకుపలుకు | (2–17) |
| తేట తెల్లము | (1–49) | పండువెన్నెల బువ్వ | (2–17) |
| బుడుతవెన్నెల | (1–65) | బందిలిపెట్టు | (2–84) |
| ఒప్పులకుప్పతనము | (1–72) | చిమ్మచీకటి | (2–109) |
| పసినిమ్మపండ్లు | (1–76) | డోకుసేయగ | (3–15) |
| అమృతంపు బావి | (1–76) | పిలపిలమూగి | (3–36) |
| పెటపెటలైన పల్కులు | (1–105) | తెమ్మెరతేరు | (3–48) |
| ముళ్ళమాటలు | (1–107) | కడగండ్లు | 3–54) |
| నవ్వుబాటు | (1–117) | గుటిజేసి పలికె | (3–119) |
| వెంగలి తనము | (1–130) | | |

5.6.5. ఎఱగుడిపాటి వేంకటకవి–దేశీయత

వేంకటకవి తన కావ్యంలో దేశీయతను ప్రతిబింబించేటు వంటి జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తులను క్రింది విధంగా ప్రయోగించాడు.

5.6.5.1. జాతీయాలు – పలుకుబడులు

| | | | |
|---|---|---|---|
| ఇసుమంత | (1–170) | పాలికివచ్చి | (2–214) |
| తెంపు బెంపు | (1–170) | కన్నులపండువ | (2–230) |
| మల్లడినొందు | (1–170) | కటకటంబడు | (3–14) |
| తల్లడపడజేయు | (1–207) | క్రొవ్వాడి | (3–22) |
| చిరినవ్వుకోపులెత్తు | (2–24) | కొరగాములు | (3–32) |
| చెవులు చిందరవట్టు | (2–92) | ఆరడిబెట్టు | (3–42) |
| నేలయీనినట్లు | (2–95) | పంజుకిందట కొద్దిదీపంబు వోలె | (3–81) |

| | | | |
|---|---|---|---|
| పడుచుబుద్ధిచేసి | (2–122) | కలలోని సంపద మెక్కినట్లు | (3–176) |
| ముంజేతగట్టి | (2–213) | కొండంత బొంకు | (3–178) |

5.6.5.2. సామెతలు – లోకోక్తులు

సర్వం విష్ణుమయం జగత్ (1–139)
మృత్యువాదటం దవ్వుల రామరాజ్యమను (1–195)
పడతికడనున్న పురుషుడు కడుశిఖికడనున్న ఘృతము కరుగకయున్నె (2–192)
కాగల దుష్టకర్మఫల కారణమున్ దొలగింప శక్యమే (3–47)
శ్రీపతి పాదపద్మయుగ చింతన గర్వులకబ్బనేర్చునే (3–50)
చల్లకువచ్చి ముంతమరిచాటున దాచగనేల (3–150)
కడముట్ట దెలియక వేగిరింపరాదు విబుధ జనులు (3–184)
ఏవిధడాంబికుదెలియ రెంతటివారు (3–240)
హేయములకెల్ల నిల్లలౌ యింతులందు బద్ధమతులకు
నిహమును బరము గలదె (3–269)
కోపము రాక మానునటె క్రూర మనస్కులకెందునైన (3–299)
కాలినవాని గొర్వులను గైకొని చూడగ (3–333)
భగవంతుని విడిచి యొరుల ప్రాపది యేలా? (3–351)

ఈవిధంగా వేంకటకవి విష్ణుమాయావిలాసంలో కనిపించేటువంటి జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, లోకోక్తులను గురించి చెప్పుకోవచ్చు.

విష్ణుమాయావిలాస కావ్యాలలో కథాసందర్భాన్ని పురస్కరించుకొని ప్రయుక్తమైన జాతీయాలు, పలుకుబడులు, సామెతలు, నుడికారాలు మొదలైనవన్నీ కూడా ఆయా కవుల యొక్క దేశీయాభిమానానికి నిదర్శనాలుగా కనిపిస్తున్నాయని చెప్పవచ్చు.

ఉపసంహారం

'విష్ణుమాయా విలాస కావ్యములు – కావ్యానుశీలనము' అనే ఈ గ్రంథంలో మొదటి విభాగంలో తెలుగు సాహిత్యంలో ప్రచురించబడిన విష్ణుమాయా విలాస కావ్యాల పరిచయం ఉన్నది. ఇందులో ఎల్లన తన కావ్యాన్ని రచించడానికి గల నేపథ్యం గురించి, దానికి ప్రేరణ కలిగించిన కావ్యాలను గురించిన వివరణ ఉన్నది. ఈ విభాగం వలన హరవిలాసం, ఆముక్తమాల్యదలు ఎల్లన రచనకు కలిగించిన ప్రేరణ, పారిజాతపహరణం వలన కలిగిన కల్పనాచాతుర్యం మొదలైన విషయాలు వెల్లడయినాయి. రెండవ విభాగంలో విష్ణుమాయా విలాస కావ్యాలను రచించిన కవులను పరిచయం చేశాను. ఇందులో ఎల్లన రాయలవారి ఆస్థాన ప్రవేశం గురించి, అతడి నివాస ప్రాంతం గురించి ప్రస్తావించాను. ప్రబంధయుగంలో ఎల్లనస్థానం, విష్ణుమాయా నాటకాన్ని అనుసరించిన పాపరాజు ఎల్లన గురించి పేర్కొనక పోవడం, అదే విధంగా మిగిలిన కవులు కూడా వారు అనుసరించిన కవుల్ని గురించి ప్రస్తావించకపోవడం అనే విషయాలు తెలిశాయి.

మూడవ విభాగంలో విష్ణుమాయా విలాస కావ్యాలలోని ఇతివృత్తం పరిచయం చేశాను. కావ్యంలోని ఇతివృత్తం ఏమిటో తెలియకుండా నేరుగా కథను గురించి చెప్పడం సందిగ్ధతకు అవకాశం కలిగిస్తుంది. అందుచేత ఇతివృత్తం గురించి ప్రత్యేకంగా పేర్కొన్నాను. దీని వలన ఇతివృత్త గ్రహణంలోని సామ్యత, వైవిధ్యాలు వెల్లడయ్యాయి.

నాలుగవ విభాగంలో విష్ణుమాయా ప్రభావాన్ని ప్రకటించడానికి సాధనాలైన విష్ణుమాయా విలాస కథలను గురించి ప్రధానంగా ప్రస్తావించాను. దేనికదే ప్రత్యేకమైన ఈ కథల్లో విష్ణుమాయా మహిమను లోకానికి వెల్లడించడమనే ఏకసూత్రత ప్రధానంగా పాటించబడిందనే విషయం స్పష్టమయింది. అహంకారం ఎన్ని రూపాల్లో కలుగుతుందనే దానికి నిదర్శనాలు ఈ కథల్లో ప్రధానంగా వర్ణితమై నాయనే విషయం వెల్లడయింది. మూలకథను అనుసరిస్తూ కవులు చేసిన కల్పనలు, తద్వారా ఆ కథలకు కలిగిన ప్రయోజనం మొదలైన విషయాలు ప్రకటితమయ్యాయి. విష్ణుమాయా మహత్వాన్ని దాని లీలావిలాసాలను లోకోత్తరంగా ప్రకటించడమే ఈ కథల్లోని ప్రధానాంశమని తెలుస్తున్నది.

ఐదవ విభాగంలో చేసిన కావ్యానుశీలన ద్వారా విష్ణుమాయా విలాస కావ్యాలలోని పాత్ర నిర్మాణం, వాటి స్థాయీ భేదాలు మొదలుకొని, కథలకు పరిపుష్టిని కలిగించిన రస నిర్వహణ, కథోచితమైన వర్ణనా చాతుర్యం, ఆలంకారిక ప్రయోగం, కావ్యరచనలో కవి పాటించిన ఔచిత్యం మొదలైన విశేషయాలు పరిశీలించబడ్డాయి. కథా వస్తువును గ్రహించడంలో ఎల్లనను మిగతా కవులు అనుసరించినప్పటికీ రచనా విధానంలో దేనికది ప్రత్యేకమైనకావ్యం అనే విషయం తెలుస్తున్నది.

పరిశీలన గ్రంథాలు

1. ఎల్లనార్యుడు, చింతలపూడి. 1933, విష్ణుమాయా నాటకము, ప్రాచ్యపరిశోధనాలయము, మద్రాసు.
2. పాపరాజు, కంకంటి. 1955, విష్ణుమాయావిలాసము, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
3. నారసింహకవి, కంకంటి. 1865, విష్ణుమాయా విలాసము, విద్వన్మనోరంజనీ ముద్రాక్షరశాల, చెన్నపురి.
4. వెంకటపతి, రోసనూరి. 1898, శ్రీవిష్ణుమాయా విలాసము, శారదాంబావిలాస ముద్రాక్షరశాల, చెన్నపురి.
5. వేంకటకవి, ఎఱగుడిపాటి. 2007, విష్ణుమాయా విలాసము, రామయోగి మెమోరియల్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, తారనాక, సికింద్రాబాద్.

ఉపయుక్త గ్రంథాలు

6. అప్పకవి. 1934,అప్పకవీయం, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
7. అప్పారావు పి.యస్. 1959, నాట్యశాస్త్రము, పి.వి.ఆర్.కె. రవిప్రసాద్, ప్లాట్ నెం. 6, సత్యనగర్, హైదరాబాదు.
8. ఆరుద్ర. 1991, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, ప్రజాశక్తి బుక్ హౌస్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ.
9. ఎఱ్ఱన. 1968, నృసింహపురాణము, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
10. కాశీవిశ్వేశ్వర శాస్త్రి, కొత్తపల్లి. 1985, రామాభ్యుదయ వైభవము, కె.వి.సీతారామాంజనేయులు, కృష్ణలంక పోస్టాఫీసు రోడ్డు, విజయవాడ.
11. కోటీశ్వరరావు, తుమ్మపూడి. 1971, ఆముక్తమాల్యదా సౌందర్యము, డా. టి. కోటీశ్వరరావు, ఆంధ్రోపన్యాసకుడు, శ్రీవేంకటేశ్వరా విశ్వవిద్యాలయం, తిరుపతి.
12. చంద్రశేఖర్‌రెడ్డి, రాచపాళెం. 1980, శిల్ప ప్రభావతి, శిల్పిప్రచురణలు, కమలానగర్, అనంతపురం.
13. జక్కన. 1968, విక్రమార్క చరిత్రము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవనం, హైదరాబాదు-04.
14. తిక్కన. 2006, శ్రీమదాంధ్ర మహాభారతము, తి.తి.దేవస్థానములు, తిరుపతి.
15. తిమ్మన. 1960, పారిజాతాపహరణము, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్, చెన్నపురి.
16. దండి. 1981, కావ్యాదర్శ, ఆంధ్రప్రదేశ్ సాహత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-04.

17. దుర్గయ్య, పల్లా. 1973, ప్రబంధ వాఙ్మయ వికాసము, డా॥ పల్లా దుర్గయ్య, 3-5-1027, నారాయణగూడ, హైదరాబాదు-29.
18. ధర్మేశ్వరరావు, గాదె. 1989, తెలుగులో చిత్రకవిత్వము, శ్రీమహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్, మ్యూజియం రోడ్, గవర్నరుపేట, విజయవాడ.
19. ధూర్జటి. 1968, శ్రీకాళహస్తి మహాత్మ్యము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవనం, హైదరాబాదు-04.
20. నన్నెచోడుడు. 1978, కుమారసంభవము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవనం, హైదరాబాదు-04.
21. నరసింహం, అంతటి. 1979, ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు, సమతాసాహితి, హైదరాబాదు.
22. నరసింహం, కె.వి.ఆర్. 1965, ఆంధ్ర ప్రబంధములు అవతరణ వికాసములు, ఆంధ్రా యూనివర్సిటీ సిరీస్, విశాఖపట్నం.
23. నాగయ్య, జి. 2004, తెలుగు సాహిత్య సమీక్ష, నవ్యపరిశోధక ప్రచురణలు, 18-6-699, భవానీనగర్, తిరుపతి.
24. నారాయణ రెడ్డి, సి. 2001, ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు: ప్రయోగములు, విశ్వంభరావిజన్ పబ్లికేషన్స్, ప్లాట్ నెం. 84, ఫిల్మ్‌నగర్ కాలనీ, జూబ్లీహిల్స్, హైదరాబాద్-34.
25. నారాయణాచార్యులు, పుట్టపర్తి. 1954, ప్రబంధనాయికలు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
26. నిర్మల, తమ్మారెడ్డి. 1989, నన్నెచోడ దేవకుమార సంభవ పరిశీలనము, సత్యసూర్య ప్రచురణలు, విజయవాడ.
27. నృసింహకవి, సుంకుసాల. 1916, కవికర్ణ రసాయనము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
28. పాండురంగారావు, యం. 1981, ఉత్తర రామాయణ విమర్శ, రచయిత, 5/15 బ్రాడీపేట, గుంటూరు-2.
29. పెద్దన, విన్నకోట. 1972, కావ్యాలంకార చూడామణి, వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్స్ 4, మల్లికేశ్వరస్వామిగుడి సందు, లింగిశెట్టివీధి, మద్రాస్-1.
30. పోతనామాత్యుడు, బమ్మెర. 1994, శ్రీమహాభాగవతము, తెలుగు విశ్వవిద్యాలయం, లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాదు-04.
31. ప్రభాకర శాస్త్రి, వేటూరి. 1918, ప్రబంధ రత్నావళి, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
32. బ్రహ్మయ్య, కాశీభట్ల. 1995, మనువసు ప్రకాశిక, తెలుగు విశ్వవిద్యాలయం, లలిత కళాక్షేత్రం,పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాద్-04.

33. భామహుడు. 1979, కావ్యాలఙ్కారః, కార్యదర్శి, సురభారతీ సమితి, ఓ.యు కాంపస్, హైదరాబాదు-07.

34. రంగాచార్యులు, చెల్లమచర్ల. 2005, ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము, శ్రీనివాస పబ్లికేషన్సు, విద్యావిహార్ అపార్ట్‌మెంట్, విద్యానగరము, హైదరాబాదు-44.

35. రామకృష్ణకవి, తెనాలి. 1995, పాండురంగ మహాత్మ్యము, తెలుగు విశ్వవిద్యాలయం, లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాద్-04.

36. రామకృష్ణమాచార్య, నండూరి. 1991, కావ్యాలోకము, తెలుగు అకాడమీ, హైదరాబాదు.

37. రామకృష్ణయ్య, కోరాడ. 1933, విష్ణుమాయా నాటకము (పీఠిక), ప్రాచ్యపరిశోధనాలయము, మద్రాసు.

38. రామచంద్రరావు, వెన్నేటి. 1995, మనువసుచరిత్ర రచనా విమర్శనము, తెలుగు విశ్వవిద్యాలయం, లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాద్-04.

39. రామభద్రకవి, అయ్యలరాజు. 1967, రామాభ్యుదయము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవనం, హైదరాబాదు-04.

40. రామరాజ భూషణుడు. 1976, కావ్యాలంకార సంగ్రహము, ఎం.శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు.

41. రామరాజభూషణుడు. 1926, వసుచరిత్రము, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

42. లక్ష్మీకాంతం, పింగళి. 2005, తెలుగు సాహిత్యచరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-01.

43. వీరేశలింగం, కందుకూరి. 1917, ఆంధ్రకవుల చరిత్రము, మనోరమా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.

44. వేంకట రమణయ్య, నేలటూరి. 1955, విష్ణుమాయా విలాసము (పీఠిక), వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.

45. వేంకట శేషాచార్యులు, చలమచర్ల. 1989, అమరకోశము, శ్రీజయలక్ష్మి పబ్లిషర్స్, హైదరాబాదు.

46. వేంకట సుబ్రహ్మణ్యశర్మ,వజ్ఝల. 2006, నాచన సోమనాథుడు, 201, ల్యాండ్ మర్క్ అపార్ట్‌మెంట్స్, వెస్ట్ మారేడ్ పల్లి, సికింద్రాబాద్-26.

47. వేంకట సుబ్రహ్మణ్యశర్మ, వజ్ఝల. 1998, విక్రమసింహపురి విద్వత్కవరులు, రాఘవేంద్రనగర్, శివరాంపల్లి, హైదరాబాద్-52

48. సూరన, పింగళి. 1963, కళాపూర్ణోదయము, అద్దేపల్లి అండ్‌కొ, సరస్వతిపవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.

49. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి. 1986, ఆరుయుగాల ఆంధ్రకవిత. ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైదరాబాద్-01.

50. శ్రీకృష్ణదేవ రాయలు. 2001, ఆముక్తమల్యాద, మలయకూట పబ్లికేషన్స్, హైదరాబాద్-57.

51. శ్రీరామరాజు, నడుపల్లి. 1997, అక్షర విశ్వనాథ, వాగ్దేవీ ప్రచురణలు, హైదరాబాదు.

52. శ్రీరామరాజు, నడుపల్లి. 1996, దీపిక (అప్పకవీయ వర్ణపరిచ్ఛేద వివరణ), వాగ్దేవీ ప్రచురణలు, హైదరాబాదు.

53. శ్రీరామరాజు, నడుపల్లి. 1985, సూక్తి వైచిత్రి (ఎఱ్ఱన సాహిత్యలహరి), ఎఱ్ఱన పీఠం, మామిడిపాలెం, ఒంగోలు.

54. Krishna rao, G.V.1999, Studies in Kalaparnodayam, Prabhasa publications, Bose road, Tenali.